

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ సప్తగిరి వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సప్తగిరి వెబ్ సైట్: https://www.scribd.com/search?query=sapthagiri
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## సప్తగిరి వారి వెబ్ సైట్

**https://www.scribd.com/search?query=sapthagiri**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# SAPTHAGIRI

# సప్తగిరి



TIRUMALA TIRUPATI DEVASTHANAMS RELIGIOUS MONTHLY MAGAZINE

FOR ANY ENQUIRIES AND DETAILS MAIL TO THE CHIEF EDITOR

KUMARSAILA@GMAIL.COM

చూడరమ్మ సతులాల సోబానఁ బాడరమ్మ
కూడున్నది పతిఁ జూడికుడనాచారి,

శ్రీమహాలక్ష్మియట సింగారాల కేమరుదు
కాముని తల్లియట చక్కఁదనాల కేమరుదు
సోముని తోఁబుట్టువట సొంపుఁ గళ కేమరుదు
కోమలాంగి యీ చూడికుడుత నాచారి

కలశాబ్ధికూఁతురట గంభీరాల కేమరుదు
తలఁప లోకమాతయట దయ మరి యేమరుదు
జలజనివాసియట చల్లఁదన మేమరుదు
కొలఁదిమీర యీ చూడికుడనాచారి

అమరవందితయట అట్టె మహి మేమరుదు
అమృతము చుట్టమట ఆనందాల కేమరుదు
తమితో శ్రీ వేంకటేశుఁ దానె వచ్చి పెండ్లాడె
కొమెరవయసు చూడికుడుతనాచారి



(26 - 246)



శ్రీ గోదాదేవిని స్తుతిస్తూ, శ్రీమహాలక్ష్మిని వర్ణించిన గీతమిది. ధనుర్మాసంలో రోజుకొక్క పాశురాన్ని ప్రణయభావనతో పాడి స్వామికి అర్పితం చేసి శ్రీరంగనాథుణ్ణి కైవశం చేసుకున్న పుణ్యచరిత ఆండాళ్! తాను ధరించిన మాలల్ని శ్రీరంగనికి అర్పించింది కాబట్టే ఆముక్త మాల్యదయని, చూడ కుడుత్త నాంచారి అని కీర్తించబడుతున్నది.

మధురభక్తికి ప్రతీక అయిన శ్రీగోదాదేవిని లక్ష్మీదేవి అంశంగా భావించి ఆరాధించాడు అన్నమయ్య.

పాఠకులకు, రచయితలకు, ఏజంట్లకు,
శ్రేయోభిలాషులకు, అందరికీ





# 2010

## ఆంగ్ల నూతన సంవత్సర

మరియు

## సంక్రాంతి శుభాకాంక్షలు.

**శ్రీనివాసుని కరుణా కటాక్ష వీక్షణాలు అందరిపై ప్రసరించాలని, అందరికీ ఆ దేవదేవుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించాలని ప్రార్థిస్తూ.........**

**మీ**
**సప్తగిరి**

### అభినందనలు

మేము ప్రతినెలా శ్రీవారి మానస పుత్రిక 'సప్తగిరి' కోసం ఇంటిల్లిపాది వేయి కళ్ళతో ఎదురుచూస్తూ ఉంటాం.

# మీ మాట

సప్తగిరిలో మీరు నెలనెలా ప్రచురిస్తున్న 'సందేహాలు-సమాధానాలు' ధారావాహిక మాకు తెలియని విషయాలను ఎన్నింటినో తెలియజేస్తోంది. పత్రిక యాజమాన్యానికి మా అభినందనలు.

*- జి. పద్మావతీ ఎల్లప్ప, హిందూపురం.*

### విజ్ఞాన బీజాలు

సప్తగిరి మాసపత్రికలో శ్రీవారి త్రివర్ణచిత్రాలు ఆకర్షణీయంగా ఉంటున్నాయి. 'శ్రీ వేంకటేశ్వర లీలలు' శీర్షిక ద్వారా స్వామిలీలలు, వివిధ భక్తుల అభిప్రాయాలు చాలా బాగున్నాయి. 'బాలవాక్కు' శీర్షిక బాలల్లో విజ్ఞాన బీజాలు నాటుతున్నది. మీకు అభినందనలు.

*- పల్లెం సత్యనారాయణమూర్తి, ధర్మవరం.*

### ఉపయుక్తం!

సప్తగిరి మాసపత్రికలో వస్తున్న అన్ని వ్యాసాలు ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ఎంతో ఉపయుక్తంగా ఉన్నాయి. ఇవి మాలో భక్తి భావాన్ని పెంపొందిస్తున్నాయి. సప్తగిరి దినదినాభివృద్ధిని ఆకాంక్షిస్తున్నాను.

*- ఎస్.పి.సుబ్బారెడ్డి, ప్రొద్దుటూరు.*

### ఆశ్చర్యం.....!

దయామయి పద్మావతీ అమ్మవారి ముఖచిత్రంతో వెలువడిన నవంబరు సంచికను వర్ణించడానికి ఒక నాలుక సరిపోదు. ముఖ్యంగా మహాశివుడిమెడను అలంకరించే నాగరాజులను పట్టి సురక్షితంగా అడవులలోకి వదిలిపెట్టే 'సర్పభాస్కరుడి' కథ నన్ను ఆశ్చర్యానికి గురిచేసింది. సర్ప భాస్కరుడు నిజంగా 'సు'భాస్కరుడే!

*- వాస్తు రామచంద్ర, నెల్లూరు.*

### తెలియని ఆనందం.....

సప్తగిరి మాసపత్రిక చదువుతుంటే మాలో తెలియని ఆనందం కలుగుతుంది. 'గృహలక్ష్మి', 'బాలప్రబోధం'లలో మీరు ప్రచురించే ఇతిహాసకథనాలు నూతన ఆలోచనలకుప్రేరణగా ఉంటున్నాయి. సంపాదకీయాలు విజ్ఞానదాయకంగా ఉంటున్నాయి. శ్రీనివాసుని కృపాకటాక్షాలు పత్రిక యాజమాన్యానికి విరివిగా లభించాలని కోరుకుంటున్నాను.

*-టి. పాండురంగ, చెన్నై.*

### మెదడుకు మేత

సప్తగిరి మాసపత్రికలో ధారావాహికంగా మీరు నడుపుతున్న 'శ్రీపదకేళి' శీర్షిక మా మెదడుకు చక్కటి మేత. ప్రతినెలా ఈ పజిల్ పూరణకోసం పూర్వగాథా లహరి, పురాణనామచంద్రిక వంటివి చూడడం జరుగుతోంది. అయితే ప్రశ్నలు మరీ తేలికగా కాక కొంచెం జటిలంగా ఉంటే బాగుంటుంది.

*- బి.గురుకుమార్ రెడ్డి, తిరుపతి.*

### ఎంతో ఇష్టం

ప్రతిమాసం ఆకర్షణీయమైన వ్యాసాలతో, ఉత్కంఠ కలిగించే ధారావాహికలతో, దేవస్థానం కార్యక్రమాలు తెలియజేసే సంపాదకీయాలతో, దేవస్థాన స్వీయ ప్రచురణ వివరాలతో మమ్మల్ని ఆకట్టుకునే సప్తగిరి అంటే మాకు ఎంతో ఇష్టం.

*- కె. చంద్రశేఖర శర్మ, గుంటూరు.*

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.



# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 40 జనవరి, 2010 సంచిక: 08

### ప్రత్యేక వ్యాసాలు



### ధారావాహికలు



### గృహలక్ష్మి



### బాలవాక్కు



### అక్షరామృతం



### బాలప్రబోధం



### శ్రీ వేంకటేశ్వర లీలలు



### మన దేవాలయాలు



**గతం నీ చేతుల్లో లేదు
కాని భవిష్యత్తు నీ గుప్పిట్లోనే ఉంది**



ముఖ చిత్రం :
**ఆయుధధారి శ్రీ వేంకటేశ్వరుడు**

చివరి పుట :
**నారాయణి రూపంలో శ్రీ పద్మావతీ అమ్మవారు**



***వివరాలకు :***

ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083,
ఫోను : 0877-2264543

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**సంపాదకీయం**

# ఆనందనిలయుని 'స్వర్ణ' శోభ

అష్టమంగళ వస్తు జాబితాలో స్వర్ణానికి ప్రముఖస్థానముంది. కల్యాణ వేదికల దగ్గర సువర్ణం, పురోహితుడు, గోవు, ఘృతము, జలము లాంటివి ఉన్నచోట శుభాలు సుఖాలు సంప్రాప్తిస్తాయనేది ఆర్షభావన.

శ్రీమహావిష్ణువు పీతాంబరధారుడని ప్రతీతి. 'లలితాదేవిని పీతవర్ణాతిగర్విత' అంటారు. అంటే సంస్కృతంలో పీతవర్ణం అనే పదానికి బంగారు రంగు అని అర్థం. ఋషుల కాషాయ వస్త్రధారణ కూడా ఈ రంగుకున్న ప్రాముఖ్యతను తెలియజేస్తుంది. ధ్యానస్థితిలో పరాకాష్ఠకు చేరుకున్న యోగికి ఒక స్వర్ణమయ ఉషోదయకాంతులు దర్శనమిస్తాయి. దినేంద్ర చంద్రుల హృదయాల్లో కూడా తొలి సంధ్యలు, మలి సంధ్యలు స్వర్ణపుత్రికల్లా ఆకాశానికి అందాల్ని హత్తుకిస్తాయి. చూపుకు, మనసుకు ఆహ్లాదాన్ని కలిగించే వర్ణంగా మానసిక ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులు అంటుంటారు.

ఆనందనిలయపు సువర్ణకాంతులు ఇదివరకే భక్తుల హృదయకాసారాలలో ప్రతిబింబిస్తూ ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని ప్రేరేపిస్తూ ఉన్నాయి. ఈ నేపథ్యంలో తిరుమల తిరుపతి దేవస్థానం కలియుగ వైకుంఠుని ఆలయ కుడ్యాలను **'అనంత స్వర్ణమయం'** పథకం ద్వారా పూర్తిగా సువర్ణమయం చేయాలని ఇటీవల సంకల్పించింది. పాలకమండలి కూడా ఈ విషయంలో తనవంతు కృషితో, దాతల నుండి సువర్ణాన్ని సంగ్రహిస్తోంది. అయితే, ఆలయ ప్రాచీనతను తెలిపే కుడ్య శాసనాలు, తదితర చారిత్రక ఆధారాలు బంగారు రేకుల తాపడాలతో మరుగునపడే పరిస్థితి ఉత్పన్నమవుతుందనే అభ్యంతరాలు వ్యక్తమయ్యాయి.

ఈ నేపథ్యంలో ఆనందనిలయ ప్రాకారాలపై ఉన్న శాసనాలన్నింటినీ తి.తి.దే. పాలకమండలి జాగ్రత్తగా, యథాతథంగా డిజిటలైజ్ చేసి, అన్ని భాషల్లోకి అనుసృజన చేయించింది. ప్రపంచవ్యాప్తంగా ఎవరైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా చూసుకునే వీలుగా, మేథావులతో పాటు అందరి మనోభావాలు దెబ్బతిన కుండా దేవస్థానం వెబ్‌సైట్‌లో నిక్షిప్తం చేసింది. వీటినే తి.తి.దేవస్థానం పురావస్తు ప్రదర్శనశాలలో భద్ర పరిచింది.

సంపదలకు మూలకారణమైన శ్రీమహాలక్ష్మిని వక్షఃస్థలంలో నిలుపుకున్న శ్రీ వేంకటేశ్వరుడు – ఆపాదమస్తకం అమూల్యమైన వజ్రవైడూర్యాది ఆభరణాలతో నీలిమేఘం నక్షత్రాలతో క్రిక్కిరిసి ఉన్నట్లు భక్తులకు ధగద్ధగాయమానంగా దర్శనమిస్తూ ఉంటాడు. అలాంటి నిత్యకల్యాణచక్రవర్తి నివాసం స్వర్ణ మయంగా కాంతులీనడం సహజం. ఈ దృష్టితో చూసినప్పుడు తన ఆలయాన్ని తనే కనకకాంతులతో నింపుకోవాలనే సంకల్పాన్ని భక్తులలో కల్పించాడనే చెప్పుకోవాలి.

**అతిశయంబైన శేషాచలాగ్రముఁ గంటి, ప్రతిలేని గోపురప్రభలు గంటి,**
**కనకరత్నకవాటకాంతిపుంజము గంటి, సహజనవరత్నకాంచనవేదికలు గంటి**

– అని ఆనాడే అన్నమయ్య ఆనందనిలయాన్ని ఒక స్వర్ణదీధితులతో స్వప్నించాడు. ఆ కల సాకారం అవుతుందని ఆశిద్దాం!

# సంక్రాంతి లక్ష్మి



- సి.వి.నారాయణ, హిందూపురం

మన హైందవ జీవన విధానంలో ప్రధానమైనవి పండుగలు. పండుగల్లో పెద్ద పండుగైన సంక్రాంతి అత్యంత పుణ్యప్రదమైనది. జీవితానికి కొత్త కాంతినిచ్చే ఈ పండుగకి ఎంతో ప్రాశస్త్యముంది. దీన్ని అనాదిగా శ్రమకు ఆరాధ్యస్థానమిచ్చిన పర్వదినంగా పరిగణిస్తారు. దేశమంతటా ఈ పండుగను అందరూ వేడుకగా భక్తితో నిర్వహించుకుంటారు.

సూర్యుని వివిధరాశి చక్రభ్రమణమే సంక్రాంతి. సూర్యుడు ఒక రాశి నుంచి మరొక రాశికి మారటాన్ని సంక్రమణం (సంక్రాంతి) అని అంటారు. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించడమే మకర సంక్రమణం. ఎంతో పుణ్యప్రదమైన ఉత్తరాయణ పుణ్యకాలం సూర్యుని మకరరాశి ప్రవేశంతో ఆరంభమౌతుంది. విశేషమైన ఈ మకర సంక్రాంతి పండుగనే మనం ఘనంగా జరుపుకొంటున్నాం. ఈ సంక్రాంతినే "పొంగల్" అని కూడా అంటారు. ఈ సంక్రాంతి శోభ శ్రమ జీవులైన రైతన్నల ధాన్యలక్ష్మి ఆరాధనతో మొదలౌతుంది.

సంక్రాంతి పండుగ సంబరాల్లో మొదటిరోజు భోగి. గోదాదేవి ధనుర్మాస వ్రతమాచరించి శ్రీరంగనాథుని వివాహమాడిన రోజు. ఆమె సర్వభోగాలు అనుభవించిన రోజుకి "భోగి" అనే పేరు వచ్చింది. అదే మన భోగి పండుగ.

ఈ రోజున ప్రతి ఇల్లూ స్వాగత తోరణాలతో రంగవల్లులతో పండుగ వాతావరణంతో కనువిందు చేస్తుంది. ప్రతి ఇంటిముంగిట కళావైభవం ఉట్టిపడుతున్న వివిధరకాల, రంగురంగుల ముగ్గుల మధ్య గోమయంతో చేసిన గొబ్బెమ్మలు పెట్టి గొబ్బి పాటలు పాడుతారు. వాటికి పసుపు కుంకుమ పెట్టి గౌరీదేవి స్వరూపంగా భావించి గొబ్బెమ్మల చుట్టూ తిరుగుతూ "సంపదలిచ్చే సంక్రాంతిలక్ష్మికి గొబ్బిళ్ళో" అంటూ పాటలు పాడుతూ హారతులు ఇస్తారు. కొన్ని ప్రాంతాల్లో రథసప్తమి రోజున ఈ గొబ్బెమ్మ పిడకలతో పొయ్యి వెలిగించి పొంగలి చేసి సూర్యునికి ఎదురుగా నివేదిస్తారు. ఈ రోజు నుండి మూడు రోజులపాటు "బొమ్మల కొలువు" పెడతారు. పేరంటాళ్ళతో, బంధుమిత్రులతో పండుగ శుభాకాంక్షలు తెల్పుకొంటూ పిండి వంటకాలను అందజేసుకుంటూ ప్రతి ఇల్లూ శోభాయమానంగా పండుగ సందడితో కళకళలాడుతూ ఉంటుంది.

రెండవరోజు సంక్రాంతి పండుగ. ఈ రోజు సూర్యుడు మకరరాశిలో ప్రవేశిస్తాడు. అందువల్ల సూర్యభగవానునికి పూజలు నిర్వహిస్తారు. ఈ పండుగ సమయంలో రైతులకు పంటలు బాగా పండి ధాన్యలక్ష్మి ఇంటికి వచ్చి చేరే శుభ తరుణం. అన్నదాతలైన రైతులకు గాదెలనిండా ధాన్యం పుష్కలంగా ఉండేకాలం. ఈ ధాన్యాన్ని ఇంటిల్లిపాది ధాన్యలక్ష్మిగా



## శ్రీవారి ఆలయం - తిరుమల

# శీఘ్ర దర్శనం

సామాన్య భక్తులకు సర్వదర్శన సమయాలలో వైకుంఠం క్యూ కాంప్లెక్స్ -1 లోని సెల్లారు ప్రవేశం ద్వారా ప్రత్యేక క్యూ లైన్లో శ్రీవారిని దర్శించుకునే సౌకర్యం కల్పించబడింది. ప్రత్యేక టిక్కెట్టు ధర రూ.300/- (ఒక వ్యక్తికి మాత్రమే ప్రవేశం). ఈ టిక్కెట్లు వైకుంఠం క్యూ కాంప్లెక్స్ -1 ఎదురుగా ఏర్పాటు చేయబడిన నాలుగు కౌంటర్లలో నిర్ణీత సమయాలలో పొందవచ్చును.

| | |
|---|---|
| శనివారం, ఆదివారం మరియు సోమవారం | ఉదయం 4.00 గం॥ల నుండి ఉదయం 5.00 గం॥ల వరకు<br>ఉదయం 7.00 గం॥ల నుండి సాయంత్రం 6.00 గం॥ వరకు<br>రాత్రి 9.00 గం॥ నుండి రాత్రి 11.00 గం॥ల వరకు |
| మంగళవారం | ఉదయం 8.30 గం॥ల నుండి సాయంత్రం 6.00 గం॥ల వరకు<br>రాత్రి 9.00 గం॥ల నుండి రాత్రి 11.00 గం॥ల వరకు |
| బుధవారం | ఉదయం 9.30 గం॥ల నుండి సాయంత్రం 6.00 గం॥ల వరకు<br>రాత్రి 9.00 గం॥ల నుండి రాత్రి 11.00 గం॥ల వరకు |
| గురువారం | ఉదయం 9.00 గం॥ల నుండి సాయంత్రం 6.00 గం॥ల వరకు<br>రాత్రి 9.00 గం॥ల నుండి రాత్రి 11.00 గం॥ల వరకు |
| శుక్రవారం | ఉదయం 10.00 గం॥ల నుండి సాయంత్రం 6.00 గం॥ల వరకు<br>రాత్రి 9.00 గం॥ల నుండి రాత్రి 11.00 గం॥ల వరకు |

ఆర్జిత సేవలలో పాల్గొనే గృహస్థులు క్రింద పేర్కొన్న సమయాలకు వైకుంఠం క్యూ కాంప్లెక్స్-1లో హాజరు కావలసి ఉంటుంది.

| రోజు | సేవ/ఉత్సవం పేరు | హాజరు కావాల్సిన సమయం |
|---|---|---|
| సోమవారం | విశేషపూజ | ఉదయం 5.00 గం॥లకు |
| మంగళవారం | అష్టదళ పాదపద్మారాధనం | ఉదయం 5.30 గం॥లకు |
| బుధవారం | సహస్ర కళశాభిషేకం | ఉదయం 5.30 గం॥లకు |
| గురువారం | తిరుప్పావడ | ఉదయం 5.30 గం॥లకు |
| | | |
| నిత్యసేవలు | కల్యాణోత్సవం, డోలోత్సవం/ ఊంజల్‌సేవ | ఉదయం 10.00 గం॥ల నుండి ఉదయం 11.00 గం॥ల వరకు |

ప్రత్యేక ఉత్సవ సందర్భాల్లో పై సమయాల్లో స్వల్ప మార్పులుండవచ్చు

- కార్యనిర్వహణాధికారి

పూజిస్తారు. పూజామందిరంలో ఒక పీఠం పైన శ్రీ మహాలక్ష్మి పాదం ముగ్గువేసి, కొత్త ధాన్యంతో పిండివంటలు చేసి నైవేద్యంగా సమర్పించి పూజలు నిర్వహిస్తారు.

ఈ పండుగ రోజులలో హరిదాసులు అందమైన ప్రత్యేక దుస్తులు ధరించి "హరిలో రంగ హరి"- అంటూ మధురగానంతో ఇంటింటికి వస్తారు. "అయ్య వారికి దండం పెట్టు; అమ్మగారికి దండం పెట్టు" - అంటూ ఎద్దులతో గంగిరెద్దులవారు అందరినీ అలరింపజేస్తారు. తమకున్నంతలో ఎంతో కొంత ఈ రోజున పేదసాదలకు దానం చేస్తారు.

సంక్రాంతి మరుసటి రోజు కనుమ. దీనినే పశువుల పండుగ అని పిలుస్తారు. మానవసేవకు అంకితమైన మూగ జీవాలపై అనురాగానికి చిహ్నంగా ఈ పండుగను జరుపుకుంటారు. ఈ రోజున రైతులు - పవిత్రతకి చిహ్నమైన గోవులను అలంకరించి పూజిస్తారు. వ్యవసాయ పనులలో పాలుపంచుకొని శ్రమించి, పంటలకు సాయమై నిలిచిన బసవన్నలకు గజ్జలు కట్టి పూలమాలలతో ఊరేగించి వేడుక చేసుకుంటారు. రైతన్నలు ఈ పండుగ రోజులలో కోలాహలంగా కోలాటం, చెక్క భజనలు మొదలైన ఆట పాటలలో పాల్గొని తమ కష్టాలన్నీ మరచి విందు వినోదాలతో గడుపుతారు. ముచ్చటైన ఈ మూడు రోజుల పండుగ సంబరాలు అందరినీ అలరించి జీవితానికి కొత్త కాంతిని చేకూరుస్తాయనడంలో అతిశయోక్తి లేదు.

ఆరోగ్య భాగ్యాల పండుగ

# రథసప్తమి

- శ్రీమతి జె. ప్రవీణ, కర్నూలు

రాత్రింబవళ్ళకు కారణభూతుడై కాలగమనానికి ప్రధాన కారకుడైన సూర్యభగవానుడు ప్రత్యక్షంగా దర్శనమిచ్చే భగవంతుడని భారతీయుల విశ్వాసం. అందుచేతనే మేఘావృతమై సూర్యుడు కనపడని రోజును దుర్దినంగా భావిస్తారు. అలాంటి సూర్యనారాయణుడు సమస్త చరాచర ప్రకృతికి చైతన్యాన్ని కలిగిస్తున్నాడని చెప్పటం ఎంతమాత్రం అతిశయోక్తి కాదు. అందువల్లే ప్రతినిత్యం భక్తులు సూర్యారాధనలతో, సూర్య నమస్కారాలతో సూర్యనారాయణుని అర్చిస్తుంటారు. ప్రత్యేకంగా సూర్యుని గురించిన పర్వంగా విశేష ఆరాధనదినంగా 'రథసప్తమి' పర్వదినాన్ని ఘనంగా జరుపుకుంటారు.

ప్రతి సంవత్సరం మాఘమాసంలో శుద్ధసప్తమి నాడు వచ్చే 'రథసప్తమి'ని సూర్యజయంతి అని, సూర్యవ్రతం అని పిలుస్తారు.

**యస్మా న్మన్వంత రాదౌతు**
**రథ మాపు ర్దివాకరాః,**
**మాఘమాసస్య సప్తమ్యాం**
**తస్మా త్సా రథసప్తమీ.**

మాఘమాసంలో "శుద్ధసప్తమి", సూర్యసప్తమి అనీ, రథసప్తమి అనీ, అచలాసప్తమి అనీ, మహాసప్తమి అనీ, సప్త సప్తిసప్తమి అనీ .... ఇలా ఎన్నోపేర్లతో పిలువబడడమేగాక, సూర్యారాధనకు సూర్యవ్రతానికి విశిష్టమైన పర్వదినంగా భాసిస్తున్న రోజు 'రథసప్తమి' దినం.

**సూర్యగ్రహణ తుల్యా సా**
**శుక్లా మాఘస్య సప్తమీ,**
**అరుణోదయ వేళాయాం**
**స్నానం తత్ర మహాఫలమ్.**
**మాఘమాసే సితే పక్షే**
**సప్తమీ కోటి పుణ్యదా,**
**కుర్యాత్, స్నానార్ఘ్యదానాభ్యాం**
**ఆయురారోగ్య సంపదః.**

రథసప్తమికి ముందురోజు అనగా షష్ఠీదినమున ఏకభుక్తముతో సూర్యనారాయణుని పూజించాలి. మరునాడు సప్తమినాటి ప్రాతఃకాలంలోని స్నానాదులవల్ల మహాఫలాదులు సిద్ధిస్తాయనీ, చెప్పబడుతున్నది. స్నానం చేసిన తర్వాత బంగారు, వెండి, రాగి, మట్టి, ప్రమిదలలో దేనిలోనైనా సరే నువ్వులనూనె పోసి దీపారాధన చేయవలెను. ఆ దీపాన్ని తలపై పెట్టుకుని సూర్యనారాయణుని ఈ విధంగా ధ్యానించాలి.

**నమ స్తే రుద్రరూపాయ రసానాం పతయే నమః,**
**వరుణాయ నమస్తేஉ స్తు హరివాస నమోஉ స్తు తే.**
**యావజ్జన్మకృతం పాపం మయా జన్మసు సప్తసు,**
**త న్మే రోగం చ శోకం చ మాకరీ హన్తు సప్తమీ.**
**జననీ సర్వభూతానాం సప్తమీ సప్త సప్తికే,**
**సర్వవ్యాధి హరే దేవి నమస్తే రవి మండలే.**

ఇలాగ సూర్యుని స్తుతించిన పిదప దీపజ్యోతులను నీటిలో వదలాలి. మళ్ళీ స్నానం చేసి పితృదేవతలకు, దేవతలకు తర్పణాదులు వదలాలి. ఆ తర్వాత త్రిమూర్తి స్వరూపుడైన సూర్య భగవానుని పుష్ప చందన తాంబూలాదులతో అర్చించాలి. ఇలా చేస్తే పుణ్యం వృద్ధి చెందుతుంది. ఆయురారోగ్య సంపదలు కలుగుతాయి.

కాని కొన్ని ప్రాంతాల్లో రథసప్తమి ముందునాటి షష్ఠిరోజున పచ్చినువ్వులపిండిని శరీరానికి రుద్దుకుని స్నానం చెయ్యాలనీ, ఆ తర్వాతిరోజు అనగా రథసప్తమినాటి అరుణోదయ వేళలో జిల్లేడు ఆకులు లేదా రేగు ఆకులను తలపైన, భుజాలపైన చేతులపైన పెట్టుకొని స్నానం చెయ్యాలని ప్రసిద్ధంగా చెప్పబడుతున్నది. అందులోను తెల్లజిల్లేడు ఆకులు అయితే మరీ శ్రేష్ఠం. అర్క పత్రాలు శరీరానికి తగిలినందువల్ల ఎన్నో రోగాలు పోతాయని, అందులోను సూర్యునికి ప్రీతికరమైన రథసప్తమి నాడు, సూర్యునికి ఇష్టమైన అర్కపత్రాలతో స్నానం చేసినందువల్ల ఎన్నో రోగాలు పోతాయని, ఆరోగ్యం కలుగుతుందని అంటారు. కొన్ని ప్రాంతాల్లో ధనుర్మాసంలో నెలంతా ఇంటి ముంగిట్లో పెట్టిన ఎండిన గొబ్బెమ్మలను ఇంటి ఆరుబయట వెలిగించి వాటిపై ఆవుపాలను మరిగించి సూర్యకాంతిలో పాయసాన్ని వండి సూర్యభగవానునికి నివేదిస్తారు. ఆ పాయసాన్ని ప్రసా

**జనవరి 22**
**రథసప్తమి సందర్భంగా**
**ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

# శ్రీ సూర్య సుప్రభాతం

**హే ప్రభాకర! ఆదిత్య హే ప్రచండ!**
**తిమిర రాక్షస సంహార! దివ్యతేజ!**
**అష్ట దిక్పాలకుల నుతులందుకొనగ**
**సుప్రభాతమ్ము సేయు మోసూర్య దేవ!**

**దేవ దేవుని నుతులను, దీవెనలను**
**అందుకొంటివి విజయమ్ము నందజేయ**
**గ్రహము లన్నియు నీ అనుగ్రహము గోరి**
**నిన్ను వేడుక చుట్టుచునున్న వవిగో**

**తూరుపమ్మకు నుదుట సింధూరమగుచు**
**చిమ్మ చీకట్ల రాజ్యము చితికిపోవ**
**వెలుగు కత్తిని ఝళిపింప వేగిరాన**
**పరుగు లిడనిమ్ము నీయేడు తురగములను**

**మనిషి జన్మంబు నుదయాస్తమయమటంచు**
**మధ్యకాలంపు పయనంబు మనుగడనుచు**
**సాక్షి వగుదువు ప్రత్యక్ష సాక్షి రూప!**
**కావరావయ్య వేగమే కమలనాథ!**

**– పుత్తూరు వేంకట సుబ్రహ్మణ్యం,**
**జమ్మలమడుగు**

దంగా స్వీకరిస్తారు. వారికి సూర్యభగవానుని అను గ్రహం వల్ల ఆరోగ్యం కలుగుతుంది. సంతానం కావలసిన వారికి సంతానం కూడ కలుగుతుంది.

'ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్' సూర్యభగవా నుని అనుగ్రహం వల్లనే సంపూర్ణారోగ్యం సిద్ధి స్తుంది. ఒక్క ఆరోగ్యమే కాక, సూర్యారాధనవల్ల సర్వశత్రునాశనమవుతుందన్నది కూడా ప్రసిద్ధమే. రామరావణ సంగ్రామ సమయంలో అగస్త్య మహర్షి సాక్షాత్తు శ్రీరామునికి, సూర్యోపాసన చేస్తే, రావణాసురుణ్ణి సంహరించి, యుద్ధంలో విజయం పొందవచ్చనీ చెబుతూ 'ఆదిత్య హృద యం' అనే స్తోత్రాన్ని ఉపదేశిస్తాడు. శ్రీరాముడు ఆ స్తోత్రాన్ని పఠించి విజయం పొందాడు.

సూర్యనారాయణుని ఉపాసనవల్లే మయూరుడు తనకు వచ్చిన కుష్ఠురోగాన్ని పోగొట్టుకొనడమేగాక, 'మయూర శతకం' పేరుతో సూర్యుణ్ణి కీర్తించాడు కూడ. సూర్యుని ఆరాధించి ధర్మరాజు అక్షయపాత్రను పొందిన గాథ కూడ సుప్రసిద్ధం.

ఖగోళశాస్త్రరీత్యా భూగోళ సంచారం వల్ల సూర్యనారాయణునికి దక్షిణాయనమనీ, ఉత్తరాయనమనీ రెండు ప్రయాణ మార్గాలు ఏర్పడ్డాయని విజ్ఞానశాస్త్రం స్పష్టం చేస్తోంది. దక్షిణాయన సంచారం నుండి మకర సంక్రాంతి రోజున సూర్యుడు తన రథాన్ని ఉత్తరం వైపు ప్రయాణం చెయ్యడానికి దిశమారు స్తాడనీ, ఈ రథసప్తమి రోజున తన రథాన్ని పూర్తిగా, స్పష్టంగా తిప్పి, ఉత్తరం దిక్కున ప్రయాణింపజేస్తాడని చెప్పబడుతున్నది.

ఇలాంటి పవిత్రమైన రథసప్తమీ పండుగరోజు దేశమంతటా ఆయా క్షేత్రాల్లో, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లోని అరసవిల్లి, తిరుచానూరు, ఒరిస్సాలోని కోణార్క, తమిళనాడులోని సూర్యకోయిల్ వంటి సూర్యక్షేత్రాల్లో విశేషంగా సూర్యారాధనలు, అర్చనలు జరుగుతాయి. వేలాదిమంది యాత్రికులు ఆ క్షేత్రా లను దర్శించి, నవగ్రహాధిపతి అయిన సూర్యుణ్ణి ఉపాసించి గ్రహబాధలు పోగొట్టుకొంటారు.

**తిరుమల క్షేత్రంలో రథసప్తమి :**

తిరుమల క్షేత్రంలో 'రథసప్తమి' ఘనంగా జరుగుతుంది. ఏడుకొండల వాడు ఆ రోజు తెల్లవారుజామున సూర్యప్రభ వాహనంలో వేంచేసి తిరుమల వీథుల్లో సంచరిస్తూ వాయవ్యమూలకు చేరుకోగానే సూర్యుడు ఉదయిస్తూ తన కిరణాలతో వేంకటాచలపతిని సమర్చిస్తాడు. సూర్యప్రభవాహనంలో వేయి వెలుగుల తిరుమలేశుని సహస్రకిరణుడైన సూర్యనారాయణుడు రథసప్తమి నాటి ఉషోదయాన అర్చించే దృశ్యం చూచి తీరవలసిందే కాని వర్ణించడానికి సాధ్యం కాదు. సూర్యప్రభవాహనంతో ప్రారంభమైన రథసప్తమి రోజున శ్రీనివాస భగవానుడు వరుసగా చిన్నశేష వాహనం, గరుడవాహనం, హనుమ ద్వాహనం తరువాత చక్రస్నానం జరుగుతుంది. పిదప కల్పవృక్ష వాహనం, సర్వభూపాల వాహనం, చంద్రప్రభ వాహనాలు – ఇలా మొత్తం ఏడువాహ నాల్లో ఉరేగింపులు జరుగుతాయి. తిరుమలలో జరిగే రథసప్తమి ఉత్సవాన్ని ఒకనాటి బ్రహ్మోత్సవం అని కూడ చెప్పవచ్చు.

ఆ వేంకటాద్రి మీది నారాయణుడూ ఈ సూర్యనారాయణుడూ ఇద్దరూ ఒకటై అభిన్నులై భాసిస్తూ, దర్శనమిస్తూ భక్తుల్ని అలరిస్తారు.

**సప్తాశ్వ రథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్,**
**శ్వేతపద్మధరం దేవం తం సూర్యం ప్రణమా మ్యహమ్.**

**కల్యాణాద్భుత గాత్రాయ కామితార్థ ప్రదాయినే,**
**శ్రీమద్వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళమ్.**

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.**

'ఎప్పుడు ధర్మం నశించి అధర్మం ప్రబలుతుందో అప్పుడు నేను దుర్మార్గులను శిక్షించి సన్మార్గులను రక్షించి ధర్మాన్ని స్థాపించుటకు ప్రతి యుగంలోను అవతరిస్తాన'ని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో తెలియజేశాడు. ఆ విధంగానే భగవంతుడు ప్రతి యుగంలోనూ అవతరించి దుష్టశిక్షణ, ధర్మరక్షణ చేసి ధర్మాన్ని కాపాడి భక్తులను రక్షిస్తున్నాడు.

# తిరుమలేశుని అవతార విశిష్టత

- పి.ఎన్.హరినాథ బాబు, తిరుపతి

భగవంతుడు భక్తులను పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చాస్వరూపం అని అయిదు స్వరూపాలలో అనుగ్రహిస్తాడని శాస్త్రాలు పేర్కొంటున్నాయి.

పర స్వరూపమనగా వైకుంఠమందు మణిమయ మండపంలో జ్ఞానస్వరూపులైన అనంతుడు, గరుడుడు, విష్వక్సేనుడు మొదలగువారు సేవిస్తుండగా మహామునులు భక్తి ప్రపత్తులతో చేసే స్తోత్రాలను వింటూ, శేషపాన్పుపై పవళించి శ్రీదేవి,భూదేవి సమేతంగావున్న శ్రీమహావిష్ణువు స్వరూపం.

వ్యూహ స్వరూపమనగా భగవంతుని ఉనికికి చిహ్నంగా సృష్టి, స్థితి, లయ కార్యాలను నిర్వహించి ముముక్షువులను, ఇతర ప్రాణికోటిని అనుగ్రహించుటకు వేంచేయు స్వరూపం. ఇవి విష్ణు, పురుషోత్తమ, సత్య, అచ్యుత, అనిరుద్ధ స్వరూపములని అయిదు విధాలుగా ఉన్నాయి.

విభవ స్వరూపమనగా దుష్టులను శిక్షించి, సజ్జనులను పరిరక్షించి ధర్మాన్ని స్థాపించడానికి త్రేతాయుగ, ద్వాపర యుగాలలో అవతరించిన శ్రీమహావిష్ణువు యొక్క రామ, కృష్ణ స్వరూపాలు.

ఇక 'అంతర్యామి' స్వరూపం అనగా మనలోనే పచ్చని కాంతిలో అగ్నిస్వరూపంతో తేజోమయంగా ఉంది. కేవలం జ్ఞానము వల్ల మాత్రమే తెలిసే స్వరూపం.

ఇక అర్చా స్వరూపమనగా ఆశ్రయించిన భక్తులకు వారు కోరిన ద్రవ్యాలందు ఆవిర్భవించి అర్చకుని ఆధీనుడై ఆలయాలందు నెలకొనియున్న స్వరూపం.

అర్చాస్వరూపం మళ్ళా అయిదు విధాలుగా ఉంది. స్వయంగా వ్యక్తమైన అర్చాస్వరూపమును 'స్వయం వ్యక్త'మని, దేవతలచే ప్రతిష్ఠించిన అర్చాస్వరూపమును 'దివ్యమ'ని, యోగ సిద్ధి పొందిన వారిచే ప్రతిష్ఠించబడినవాటిని 'సైద్ధములు' అని, మహర్షులచే ప్రతిష్ఠించిన అర్చారూపాలను 'ఆర్షము'లని మానవులచే ప్రతిష్ఠించిన వాటిని 'మానుషము'లని పేర్కొన్నారు.

వీనిలో స్వయంవ్యక్తమైన వాటికి అనితరమైన శక్తి ఉన్నది. ఆప్రకారం స్వయంగా వ్యక్తమైన అర్చాస్వరూపాలలో అద్వితీయుడై నిరంతరం ప్రకాశించేమూర్తి తిరుమలక్షేత్రంలో వెలసిన శ్రీ వేంకటేశ్వరస్వామి.

కలియుగ మానవుల్ని కాపాడడానికి శ్రీ మహావిష్ణువు వేంకటాద్రియందు కన్యామాసం, శ్రవణానక్షత్రంనందు 'కలౌ వేంకటనాయకః' అను బిరుదుతో స్వయంభువై ఎనిమిది అడుగుల సాలగ్రామ శిలామూర్తిగా ఆవిర్భవించాడు. ఆ స్వామివారి విశిష్ఠతను, దివ్యవైభవాల గురించి వరాహ, పద్మ, గరుడ, బ్రహ్మ, భవిష్యోత్తర పురాణాలు, వేదాలు, శాస్త్రాలు ఎన్నో విధాలుగా వర్ణించాయి.

**అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే,**
**శిరింబిఠస్య సత్వభిస్తేష్యా చాతయామసి.**

- అని ఋగ్వేదం వేంకటాద్రిని, శ్రీ వేంకటేశ్వరుని కీర్తించింది.

అలాగే స్కంద, బ్రహ్మాండ, వామన పురాణాలు

**వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,**
**వేంకటేశ సమో దేవో నభూతో న భవిష్యతి.**

- అని వర్ణించాయి.

శ్రీమన్నారాయణుడు వైకుంఠాన్ని వదలి వేంకటాద్రిపై వెలసిన విషయాన్ని గ్రహించిన బ్రహ్మాది దేవతలు అక్కడికి వేంచేసి పుణ్యతీర్థాల్లో స్నానమాచరించి, స్వామివారిని దర్శించి ఉత్సవాలను జరిపించారు.

'వేం' అనగా సకలపాపాలు, 'కట' అనగా దహింప జేయునది. అలాగే 'వేం' అనగా అమృతము, 'కట' అనగా ఐశ్వర్యము– అమృతైశ్వర్యాలను ప్రసాదిస్తుంది కాబట్టి ఈ కొండ 'వేంకటాద్రి' అని ప్రసిద్ధి చెందినదని వరాహపురాణంలో పేర్కొన్నారు. ఆ వేంకటాద్రికి ప్రభువైనందున స్వామివారికి 'శ్రీవేంకటేశ్వర స్వామి' అనే పేరు వచ్చింది. 'తిరు' అనగా శ్రేష్ఠమైన, 'మల' అనగా 'కొండ'. పవిత్రమైన కొండ కాబట్టి 'తిరుమల' అని వ్యవహరిస్తారు.

తిరుమల కొండ మీద ప్రతిరాయి ఒక సాలగ్రామం. ప్రతి సాలగ్రామమందు శ్రీవారు సాక్షాత్కరిస్తారు. ఇక్కడి ప్రతి చెట్టులోను, పుట్టలోను, తీర్థంలోను, మహర్షులు, దేవతలు, పరమభక్తశిఖామణులు నివాసమేర్పరచుకుని ఉన్నారు. అందువల్ల ఈ క్షేత్రం మనోహరమైన ప్రకృతి సౌందర్యంతో, అద్భుత వృక్ష సంపదతో, రమణీయమైన పుష్పాలతో, సెలయేళ్ళ ప్రవాహాలతో, పుణ్యతీర్థాలతో విరాజిల్లుతూ అత్యంత పవిత్రమైనదిగా ప్రసిద్ధి చెందింది.

స్వామివారి వక్షఃస్థలములో లక్ష్మీదేవి శోభిల్లుతున్నది. అందుకే తిరుమలేశునికి 'లక్ష్మీపతి' అని ప్రశస్తి.

స్వామివారి వక్షఃస్థలం మీద ఉన్న కౌస్తుభమణి అత్యంత విశిష్టమైనది. ఆ దివ్యమంగళస్వరూపుడు మణికిరీట మకర కుండలాలతో, శంఖచక్రాలతో చిరుమందహాసం చిందిస్తూ మనోహరంగా దర్శనమిస్తాడు. స్వామివారి మూలమూర్తి దివ్య పాదాలు బంగారు పద్మపీఠంపై అలరారుతుంటాయి. స్వామివారి వజ్రఖచిత కటి వరదహస్తాలు ఆయనను శరణు వేడిన వారి వెన్నంటే ఉండి సకల శుభాలను కలుగజేయుదనని సూచిస్తూ ఉంటాయి. శంఖచక్రాలు, మెడలో కంఠహారాలు, నొసట కర్పూరనామం, తిలకంతో కళకళలాడుతూ భువన మోహన సుందరుడిగా స్వామి దర్శనమిస్తారు. ఆ దివ్యలీలా మానుష విగ్రహాన్ని ఎన్నిసార్లు, ఎంతసేపు చూసినా తనివి తీరక మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తుంది. అందుకే శ్రీవారిని ఒకసారి దర్శించిన వారు తృప్తిపొందక మరలా వెనుదిరిగి చూస్తూ అంజలి ఘటిస్తూ వెళుతూ ఉంటారు.

స్వామివారికి ఏడాది పొడవునా ఎన్నో విధాల ఉత్సవాలు అత్యంత వైభవంగా నిర్వహిస్తూ ఉంటారు. స్వామివారిని ఎందరో భక్తులు ఎన్నో రకాల పేర్లతో సేవించి తరిస్తుంటారు.

స్వామివారు నెలకొని ఉన్న గర్భాలయాన్ని 'ఆనంద నిలయం' అంటారు. అందుచేత స్వామివారు 'ఆనందనిలయుడని ప్రఖ్యాతి గాంచాడు. వక్షఃస్థలమందున శ్రీమహాలక్ష్మి ఉన్నందున శ్రీనివాసుడనీ, ఏడుకొండలపై వెలసినందున కొండలలో నెలకొన్న కోనేటిరాయుడు, సప్తగిరీశుడు, ఏడుకొండలవాడు అనీ, ఆర్తితో అర్థిస్తే ఆపదలు తొలగించును కాబట్టి ఆపదమొక్కుల వాడనీ, భక్తులు అడుగడుగునా దండాలు పెట్టి తమ కష్టాలు విన్నవించుకొంటారు కాబట్టి అడుగడుగుదండాల వాడనీ, తిరుమలలో నెలకొని ఉన్నందున తిరుమలేశుడు, తిరుమలప్ప అనీ, నిత్యకల్యాణాలు జరుగుటచేత నిత్యకల్యాణచక్రవర్తి అనీ వివిధ నామాలతో వ్యవహరిస్తారు. ఉత్తరాది భక్తులు 'బాలాజీ' అని వ్యవహరిస్తారు.

శ్రీ వేంకటేశ్వర స్వామివారు నైవేద్య ప్రియుడు, భోజన ప్రియుడు. కాబట్టి ఆ స్వామికి నివేదించే ప్రసాదాల గురించి చెప్పనలవికాదు.

'వైకుంఠాన్నయినా విడిచి ఉంటాను గాని నన్ను శరణువేడిన భక్తులను ఒక్క క్షణమైనా విడిచి ఉండలేను' అని పేర్కొన్న వేంకటాద్రిపై వెలసిన శ్రీ వేంకటేశ్వరస్వామికి ఎన్ని సేవలు చేసినా, ఆభరణాలు సమర్పించినా ఆ ఋణం తీర్చుకోలేము.

కాబట్టి, కలియుగ మానవాళి అహంకార, అజ్ఞానాల్ని వదలి ఈర్ష్యాద్వేషాల్ని త్యజించి స్వార్థరహితంగా నడుచుకుంటూ, త్రికరణశుద్ధిగా స్వామివారిపై ఏకాగ్రత కలిగి, ఆయన దివ్య మంగళమూర్తిని మదిలో నిలుపుకొని 'ఓం నమో వేంకటేశాయ', 'ఓం నమో శ్రీనివాసాయ', 'ఓం నమో నారాయణాయ' అను ఈ మూడింటిలో ఏదో ఒక మంత్రాన్ని నిత్యమూ స్మరించి స్వామివారి అనుగ్రహం పొంది ఇహంలో సత్ఫలితాలు సాధించి తరించవచ్చు.

**శ్రీ వేంకటాచలాధీశం శ్రియధ్యాసిత వక్షసమ్,**
**శ్రిత చేతన మందారం శ్రీనివాస మహం భజే.**




**(అభిమన్యుని మరణానికి ప్రధాన కారకుడైన సైంధవుని సూర్యాస్తమయం అయ్యేలోపు వధించకపోతే ప్రాణత్యాగం చేస్తానని అర్జునుడు ప్రతిజ్ఞ చేసి ఆ ప్రతిజ్ఞను నెరవేర్చుకోవడం ఈ సంచికలో చదవవచ్చు)**

కృతవర్మ మళ్ళీ అడ్డువచ్చాడు కాని, ద్రోణాచార్యుల వారు స్వయంగా సాత్యకిని ఎదుర్కొన రాగా ఆయన వెంట నీ కొడుకులు దుస్సహ, వికర్ణ, దుర్ముఖ, దుశ్శాసనాదులు తోడు వచ్చారు. వీరందరికి అండగా దుర్యోధనుడు రావడం చూసి, ఆచార్యుడు తిరిగి సేనాముఖానికి వెళ్ళాడు. అప్పుడు సాగిన యుద్ధంలో దుర్యోధనుని రథధ్వజం, గుర్రాలు నేలకూలాయి. సారథికి కూడా శరీరం తూట్లు పడింది. దగ్గరలో ఉన్న చిత్రసేనుడి రథం ఎక్కి విజృంభించాడు. అప్పటికీ మళ్ళీ అక్కడకు చేరిన కృతవర్మ, సాత్యకి బాణఘాతంతో మూర్ఛబోయాడు.

సాత్యకి సవ్యసాచి కోసం సాగుతూంటే ఆచార్యుడు మళ్ళీ అడ్డుపడి విడిచిన మూడు బాణాలు వాని నుదుట నాటుకున్నాయి. ఆ వీరుడు కూడా యథోచితంగా గురువును వేధిస్తున్నాడు. అంతలో సాత్యకి విల్లు విరిగింది; సారథి మూర్ఛపోయాడు. అయినా తనే సారథ్యం చేసుకుంటూ నడుపుతున్నాడు. కొంతసేపటికి ద్రోణుని రథసారథి వాలిపోగా, గుర్రాలు రణవిముఖమయాయి. సాత్యకి మళ్ళీ అర్జునుని వైపు సాగుతున్నాడు.

దారిలో సుదర్శనుడు అడ్డుపడి నేలకూలాడు. కుపితులై దుర్యోధన, దుశ్శాసన, చిత్రసేన, వివింశతి, శకుని ప్రముఖులు తరుముతూరాగా, వారిని చిరునవ్వుతో రణక్రీడకు ఆహ్వానించాడు. ఆ సమయంలో సుయోధనుడు, శకునితోడుతో సాత్యకిని చీకాకు పరుస్తూ, వాని సారథినీ, గుర్రాలనూ హింసింపగా, ఆ యోధుడు మనవాని సారథిని నేలకూల్చి, శకుని ధనుస్సు గాలిలోకి ఎగురగొట్టాడు.

దుశ్శాసనుడు ఎదురురాగా బాణ వర్షంతో ఊపిరి సలపకుండా ఆడించాడు సాత్యకి. ఉక్కిరిబిక్కిరయి దుశ్శాసనుడు ఒక్క ఊపులో ద్రోణాచార్యుల చాటుకురాగా, ఆయన: నాయనా, కుశలమా! ఏమిటిలా వచ్చావు? ఓహో! సాత్యకి తీసిన దెబ్బకే ఇలా అయితే ఇక భీమార్జునులు ఎదురుపడితే ఏమవుతావు? నాయనా! నిండుసభలో ఆడుదానికి బట్టలు విప్పడమూ, అహింసామూర్తులను అవమానించడమూ అనుకున్నావా యుద్ధమంటే!

సంగ్రామం అంటే అటుకులూ, బెల్లం కలుపుకు తినడం కాదు. వెళ్ళు, వెళ్ళు మీకు సాయం వచ్చిన రాజుల కంఠనాళాలు కోస్తున్నాడు సాత్యకి. వారిని రక్షించు, అని పరిహసించాడు. వినీ విననట్లు తలవంచుకు రథం నడిపించేశాడు, దుశ్శాసనుడు.

ద్రోణుడు విజృంభించి ధృష్టద్యుమ్నుని సోదరుడయిన వీరకేతుని నిలువరించి, నేల కూల్చగా వాని సోదరులందరూ ఆచార్యుని చుట్టుముట్టారు. ధృష్టద్యుమ్నుడు నిశిత శర వర్షం కురిపించగా, ఆచార్యుడు మూర్ఛిల్లాడు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు రథం దూకి, ఆచార్యుని శిరస్సు నరికే సంకల్పంతో కత్తి దూశాడు. అప్పటికే ఆయన తేరుకుని వాడి శరాలతో వానిని హింసించాడు. ఆ క్షణంలో ఆచార్యుడి పరాక్రమం పాండవసేనను అచేతనం చేసింది.

ఇక్కడ దుశ్శాసనుడు సాత్యకితో తలపడ్డాడు. అతనికి తోడుగా త్రిగర్త సేనలు వచ్చాయి. ముందుగా సేనలను తరిమికొట్టి, దుశ్శాసనుని ధనుస్సు విరుగకొట్టి సారథినీ గుర్రాలనూ

మట్టి కరిపించి, వానిని కడతేర్చడానికి కత్తి దూశాడు. కాని, భీముడి ప్రతిజ్ఞ స్మరణకు వచ్చి ఆగాడు.

ఇక్కడ ద్రోణాచార్యుల విజృంభణం చూసి ద్రుపదుడు ఓ మహాయోధులారా! ఈ విప్రుడు మన క్షత్రియయోధులందరినీ ఊచ కోత కోస్తున్నాడు చూశారా! ఆపండి ఈ విజృంభణం అని గర్జించాడు.

ధర్మరాజు భీముని పిలిచి: నాయనా! సవ్యసాచికి సాత్యకి తోడు వెళ్ళాడు. కాని, నా గుండె కేదో భయంగా ఉంది. నువ్వు అక్కడికి వెళ్ళి సింహనాదం చేస్తే నాకు తృప్తి అన్నాడు.

భీముడు ధృష్టద్యుమ్నుని చేరి, మా అగ్రజుల రక్షణ భారం నీ మీద ఉంచి వెడుతున్నానని వ్యూహం మధ్యలోకి రథం సాగించమన్నాడు.

సారథి విశోకుడు ఉత్సాహంతో నడుపుతుండగా ముఖ ద్వారంలో ద్రోణుడు నిలిపి: భీమసేనా! నీ తమ్ముడు సవ్యసాచి నా అనుమతితో వెళ్ళాడు, అంటూండగా భీముడు కన్నులెర్రజేసి పాండవవీరులు దేవసేనను కూడా లక్ష్యం చెయ్యరు. మీరు గురువులు కనుక మర్యాద ఇస్తున్నాం. అయినా శత్రుసేనలో ఉన్న మీకు తలవంచడమా అంటూ గదాదండం విసిరాడు. ద్రోణుడు రథం దిగేశాడు. ఆ గదాఘాతానికి ఆచార్యుని రథం, గుర్రాలతో, సారథితో సహా చూర్ణమయింది. ఆయన మరొకరథం ఎక్కి బాణవర్షం కురిపించాడు. కుంభవృష్టిని లక్ష్యపెట్టని మహావృషభంలా భీముడు వ్యూహ మధ్యంలోకి వెళ్ళే వ్యూహతో తన రథం దిగి ఆచార్యుని రథం ఒకచేత్తో విసిరేలోగా ఆయన రథం దిగేశాడు. అంతలో భీముడు మళ్ళీ రథంఎక్కి వ్యూహం మధ్యలోకి వెళ్ళి అర్జుననీ, సాత్యకినీ చూసి సింహనాదం చేశాడు.

**ధృతరాష్ట్రుడు:**

సంజయా! ఇక మనవారిని రక్షించే యోధుడే లేకపోయాడా! అని ప్రశ్నించగా, మహారాజా! భీమసేనుడికి ఎదురుగా కర్ణుడు నడిచి కొంతసేపు బాధించాడు. అంతలో భీముడు వాని విల్లు విరిచాడు. మరొక ధనుస్సుతో కర్ణుడు తన విద్యను ప్రదర్శించబోగా దానినీ వాని సారథినీ, గుర్రాలనూ నేలకూల్చాడు కౌంతేయుడు, అని సమర వృత్తాంతాన్ని వినిపించ సాగాడు సంజయుడు.

చేసేదిలేక కర్ణుడు వృషసేనుని రథం ఎక్కి వెనుదిరి గాడు. దాన్ని చూసిన దుర్యోధనుడు ఆచార్యుని సమీపించి: చూడండి, అటు అర్జునుడు, ఇటు సాత్యకీ, ఈవంక భీమసేనుడు మహాసాగరంలో తిమింగలాలవలె తిరుగుతున్నారు మన సేనా మధ్యంలో.

మీరు అర్జునుని వదిలేశారూ అంటే అర్థం ఉంది. కాని సాత్యకి కూడా ధనురాచార్యులను ఓడించాడంటే అంతకంటె అవమానం ఉన్నదా? అనడంతో ఆయన – సుయోధనా! సైంధ వుడు పణంగా సాగుతున్న ఈ జూదంలో నువ్వూ అర్జునుడూ మీశక్తి సామర్థ్యాలు ప్రదర్శించాలి. ఇదివరలో శకుని ఆలోచన మీకు విజయం తెచ్చిపెట్టింది. కాని మోసంతో వచ్చిన లక్ష్మి అది. ఇప్పుడు అటువంటి దుర్మాంత్రానికి అవకాశం లేదు. వెళ్ళి జయద్రథ రక్షణలో ఉండు. నేను ముఖద్వారం విడిచానో మూలానికే ముప్పు – అన్నాడు.

దుర్యోధనుడు రథాన్ని అర్జున ముఖంగా నడిపి విల్లు ఎక్కుపెట్టాడు. ఆ సమయంలో సవ్యసాచి బాణఘాతాలకు సుయోధనుని సూతుడూ, గుర్రాలు నేలకూలాయి. దానితో మనవాడు గదాదండం ధరించి శల్యుని రథం ఎక్కాడు. అక్కడ కర్ణుని విరథుని చేసిన భీముడు గాండీవికి తోడుకావడానికి వెడుతూండగా కర్ణుడు చూసి ఒక్కకేక వేశాడు. అది విని భీముడు మరొక్కమారు కర్ణునికి తన ప్రతాపం చూపాడు. మళ్ళీ కర్ణుడు మరొక రథం ఎక్కక తప్పలేదు.

అనంతరం ఆ ఉభయులూ ఆకలిగొన్న పెద్దపులులవలె పోరుతున్నారు. అప్పుడు కూడా పాండవులదే పైచేయి – అని సంజయుడు చెపుతూంటే కురురాజు –

సంజయా! మనవారి దురదృష్టం కాకపోతే దేవకీనంద నుని మాట పెడచెవిని పెడతారా! ఈ రాధేయుని ప్రతాపమూ, మంత్రాంగమూ నమ్మి కదా మనవారు ఇంతకు సాహసించారు, అని అనంతర సంగ్రామ విశేషాలు ఏమిటి అన్నాడు. అంత

సంజయుడు, తిరిగి సమరగాథ కొనసాగించాడు.

ప్రభూ! అప్పుడు మన రాధేయుని విల్లువిరిగి, గుర్రాలు ఒరిగి, శరీరమంతా రక్తధారలు స్రవిస్తున్నాయి. చూశాడు సుయోధనుడు, సోదరుడయిన దుర్జయుని పంపాడు. క్షణాల వ్యవధిలో వీని సారథీ, రథమూ చూర్ణమయాయి. కర్ణుడు చూస్తున్నాడు. చూస్తూండగానే దుర్జయుని శిరస్సు బూడిదలో దొర్లుతున్నది. రాధేయుడు ఆవేశంతో యుద్ధం ఆరంభించాడు. వీనికి తోడుగా నీ కొడుకు దుర్ముఖుడు వచ్చి మరి కొద్ది క్షణాలలో కన్నుమూశాడు.

అదిచూసిన కోపంతో నీ కొడుకులు దుర్మర్షణ, దుర్మద, దుస్సహ, విజయ, విచిత్రులయిదుగురు ఒక్కుమ్మడి వచ్చి క్షణాల వ్యవధిలో వీరస్వర్గం చేరుకున్నారు.

మీ కోసం .... శ్రీనివాసంలో 'సప్తగిరి'

తిరుపతిలోని **శ్రీనివాసం** యాత్రికుల వసతిసముదాయంలో
**సప్తగిరి** చందానమోదు కేంద్రం ప్రారంభించబడింది.
శ్రీవారి దర్శనార్థం వచ్చు భక్తులు
ఈ కేంద్రంలో అన్ని భాషల **సప్తగిరి**కి
**చందాలు చెల్లించవచ్చు / చందాను పునరుద్ధరించుకోవచ్చు.**
వేలాది మంది భక్తులకు, స్థానికులకు
ఇది సౌకర్యంగా ఉంటుంది.

**ఈ సప్తగిరి చందా నమోదు కేంద్రం పనిచేయువేళలు**

**ఉదయం 8.00 గం॥ నుండి 11.00 గం॥ వరకు**
**సాయంత్రం 4.00 గం॥ నుండి 7.00 గం॥ వరకు**

- ప్రధాన సంపాదకుడు

అనంతరం చిత్ర, విచిత్ర, చిత్రాక్ష, చారుచిత్రులూ అదే దారిని వెళ్ళారు. చిత్రధ్వజ, చిత్రాయుధ, చిత్రకర్ములకు కూడా అటే నడవక తప్పలేదు. అనంతరం మరొక ఏడుగురు మన్ను కరిచారు.

కర్ణునికి బాధ ఎక్కువయి మరింత ఆవేశంతో భీమునితో పోరుతూ, ఆ మహాబలుని ఆ ఘాతాలకు ఆగలేక రథపీఠం వెనుక దాగవలసి వచ్చింది. భీముడు ఉత్సాహంతో ఒక్క గర్జన చేశాడు. అది కర్ణుని అభిమానాన్ని రెచ్చగొట్టింది. ఆ వేడిలో విజృంభించి భీమసేనుని విరథునీ నిరాయుధునీ చేశాడు. అలసిన భీముని కర్ణుడు తన వింటికొనతో పొడుస్తూ:

వృకోదరా! పీకలనిండ మెక్కి హాయిగా పడి దొర్లవలసిన వాడికి యుద్ధం దేనికిరా! పో, సుఖంగా అడవుల కడ్డుపడి కందమూల ఫలాలు మెక్కుతూ బతుకు - అని పరిహాసం చేశాడు. అర్జునుడు ఆవేశంలో కర్ణుని కెదురువచ్చి శర వర్షం కురిపిస్తూండగా అశ్వత్థామ కర్ణునికి తోడై సవ్యసాచి ఆటోపానికి ఆనకట్ట వేశాడు.

దుశ్శాసనుడు త్రిగర్త వీరులు తోడురాగా సాత్యకిని ఎదుర్కొన్నాడు. అయిదువందలమంది రథికులు సాత్యకి బాణ ఘాతాలకు మన్ను కరిచారు. దుశ్శాసనుని గుర్రాలు విలవిల తన్నుకుపడ్డాయి. శూరసేన, కళింగసేనలు ఎదురురాగా వారినీ చెల్లాచెదురు చేసి, అర్జున సమీపానికి రాగా వాసుదేవుడు అభినందించాడు.

అర్జునుడు, బావా! సాత్యకి ఇటు రావటంతో ద్రోణాచార్యులు మా అన్నగారిని బంధిస్తారనే భయం కలుగుతున్నది. అదిగో భూరిశ్రవసుడు విక్రమిస్తున్నాడు చూశావా! అంటూండగా, సాత్యకి ఆ మహాయోధునికి ఎదురు నడిచి నిలబెట్టాడు.

ఉభయులూ తీవ్ర పోరాటం సాగించి రథాలు, గుర్రాలూ, సారథులూ ముక్కలు ముక్కలు కాగా నిశిత కరవాలంతో కొంతసేపు రణక్రీడ సాగించి మల్లయుద్ధానికి దిగారు. అది చూసి కృష్ణుడు: బావా! అలసి ఉన్న సాత్యకిని భూరిశ్రవసుడు చిత్రహింస పెడ్తున్నాడు. రథం అటు నడుపుతాను అన్నాడు. అప్పటికే భూరిశ్రవసుడు తన కరవాల మండిత

భుజదండం పైకెత్తి సాత్యకి శిరసు ఖండించబోతున్నాడు. ఆ చెయ్యి కదిలే సమయంలోనే అర్జునుని బాణం వచ్చి చేతిని గాలిలోకి ఎగరకొట్టింది.

అయినా చలించకుండా భూరిశ్రవసుడు: అర్జునా! నీతో యుద్ధం చెయ్యడం లేదే నేను. ఇటువంటి నైచ్యానికి వాసుదేవుడు నిన్ను పురికొలుపుతాడనుకోను, అంటూండగా సవ్యసాచి: మహాయోధుడా! అలసిన సాత్యకి మీద అవలీలగా కలియ బడడం నైచ్యంకాదేం? వయసు నిండని అభిమన్యుని అందరూ కలసి కడతేర్చడం నీచ లక్షణం కాదు పాపం! ఇటువంటి అను చితాలు సవాలక్ష చేసిన మీరు నీచనైచ్యాలను ప్రస్తావించడం హాస్యాస్పదం అంటూండగా భూరిశ్రవసుడు నేలకొరుగుతున్నాడు. మూర్ఛ తేరిన సాత్యకి క్రోధోన్మత్తుడై కరవాలం ఎత్తి భూరి శ్రవసుని మీదికి నడుస్తూంటే:

సాత్యకీ! వద్దు, వద్దు ఆ మహావీరునిమీద కత్తి పెట్టకు అని భీమార్జున కృష్ణులూ, కృప, అశ్వత్థామ, కర్ణులూ అరుస్తున్నా వినకుండా సాత్యకి వాని శిరస్సు ఖండించాడు. మహారాజా! (ఇదంతా సోమదత్తుడికీ సాత్యకి తాతకీ ఒకనాడు జరిగిన సంగ్రామ పరిణామం, అది వేరే కథ).

అంతకు ముందుగానే వాసుదేవుడు పాంచజన్యం పూరించాడు. ఆ సంకేతం గ్రహించి దారుకుడు రథం తీసు కొచ్చాడు. కృష్ణుడు తన రథం మీద సాత్యకిని అధిరోహింప జేశాడు. కర్ణుడు సాత్యకిని నిలబెట్టి సాగించిన సంగర క్రీడ ఉభయబలాలకూ ఆశ్చర్యానందాలు కలిగించింది.

కృష్ణుడు రథాన్ని సైంధవాభిముఖంగా నడుపుతున్నాడు. ఆ సమయానికి భీముడటువచ్చి, రాధేయుడు పలికిన పలుకులు వినిపించగా అర్జునుడు కర్ణా! ఎన్నిసార్లు నువ్వు పలాయనం పఠించలేదు. అయినా నిన్ను పరిహసించి ఒక్కమాట అనలేదే! మా భీముడు. ఒక్కమారు లొంగినంతలో ఎందుకంత నోరు పాడుచేసుకున్నావు. నిన్నటికి నిన్న అక్రమంగా నా కొడుకు ధనుస్సు విరిచావు. దానికి ప్రతీకారంగా నీ సమక్షంలో నీ కొడుకు వృషసేనుడికి శిరచ్ఛేదం జరుపబోతున్నాను గుర్తుంచుకో అని పోరు ప్రారంభించాడు.

సూర్యుడు అస్తాద్రికి చేరుతున్నాడు. సవ్యసాచి కర్ణుని నిరోధించి రథాన్ని సైంధవుని వైపు నడిపిస్తున్నాడు. అది చూసి దుర్యోధనుడు కర్ణా! కృప, శల్య, అశ్వత్థామలతో నేనూ దుశ్శా సనుడూ నీతో వస్తున్నాం. మనమందరం మరొక్క ఘడియ అర్జు నుని ఆపగలిగితే వాడి ప్రతిజ్ఞ పొల్లుపోతుంది అదిగో భీముడూ, సాత్యకి అర్జునునికి తోడు వెడుతున్నారు. రథం నడిపించు అన్నాడు.

ఎదురు వచ్చిన కర్ణునితో తలపడ్డాడు అర్జునుడు. ఆ పోరాటం దేవగణాలకే ఆశ్చర్యం కలిగించింది. కర్ణుని శరీరం తూట్లుపడింది: అయినా పోరు మానలేదు. చూశాడు అశ్వత్థామ. తక్షణం అర్జునుని కెదురువచ్చాడు. శల్య, కృప, వృషసేవలు కూడా అటే చేరారు. ఇందరూ సైంధవ రక్షణలో అప్రమత్తులై ఉన్నారు. సూర్యుడు అస్తాద్రికి చేరుతున్నాడు. అర్జునుడు ఆందో ళనలో పడ్డాడు. కృష్ణుడు మాయను వ్యాపింపజేశాడు. సూర్యుడు అస్తమించినట్టే అనిపించి, కౌరవులు హర్షధ్వానాలు చేస్తున్నారు.

సైంధవుడు పశ్చిమాకాశంలోకి తలయెత్తి చూస్తున్నాడు. అంతే! పావురాన్ని డేగ తన్నినట్టు అర్జునుడు విడిచిన బాణం సైంధవుని తలను ఎగురగొట్టింది.

బావా! ఆ తలను క్రిందపడనివ్వకు. సింధురాజు వృద్ధ క్షత్రుడు తపస్సు చేసి వీణ్ణి పొందినప్పుడు, వీడి తల సంగ్రామంలో తెగిపడుతుందని వినిపించింది అశరీరవాణి. అప్పుడు వృద్ధక్షత్రుడు, వీడి తల ఎవడి చేతుల్లోంచి కిందపడు తుందో, ఆ చేయి కలవాడి తల వెయ్యిముక్కలవాలి అన్నాడు.

ఇప్పుడా వృద్ధక్షత్రుడు శమంత పంచక క్షేత్రంలో ఉన్నాడు. పాశుపతం ప్రయోగించి ఈ తల ఆయన తొడమీద పడగొట్టు అన్నాడు వాసుదేవుడు. ఉత్తర క్షణంలో సైంధవుడి శిరస్సువాని తొడమీద పడింది; అసహ్యంగా వృద్ధక్షత్రుడు ఆ శిరస్సును కిందికి తోయడం తడవుగా ఆయన శిరస్సు ముక్క చెక్కలయింది.

మళ్ళీ సూర్యబింబం ప్రత్యక్షమైంది. ఆ సంజ వెలుగులో సైంధవుడి కళేబరం నేలమీద పొర్లుతున్నది. మహారాజా! మన వారందరూ హాహారవాలు చేస్తుంటే పాండవపక్షం హర్షధ్వానాలు చేసింది. ***(ఇంకా ఉంది)***

# సందేహాలు? సమాధానాలు!!

-'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**'త్రిజట' గురించి వివరించగలరు?**

**- కొలిపర్తి శ్రీరాములు, నరసరావుపేట.**

త్రిజట జీవితవిశేషాలను రామాయణం వర్ణించలేదు. కానీ ఆమె విభీషణుని కుమార్తెగా ప్రసిద్ధి. ఆంజనేయస్వామి సీతాదేవితో సంభాషించి వెడలిన తర్వాత, ఆమెకు కాపున్న రాక్షస స్త్రీలు ఆమెను వికారచేష్టలతో భయదవాక్కులతో భీతిల్లచేస్తున్నారు. ఆ సమయంలో నిద్రలేచిన త్రిజట తాను ఇంతకు ముందు కలగన్నానని చెప్పింది. అది కలగాదు 'నిక్కల'. రామలక్ష్మణులు లంకానగరానికి వచ్చినట్లు, రావణకుంభకర్ణులు గోమయహ్రదంలో పడి నూనె త్రాగుతూ దక్షిణదిక్కుగా పోయినట్లు, ఒక ముండిత శిరస్క నల్లని వస్త్రాలు ధరించి, వారి మెడలకు పాశములు వైచి లాగుకొని పోతున్నట్లు, ఇంద్రజిదాది రాక్షసులు కూడా అదే స్థితిలో ఉన్నట్లు స్పష్టంగా తాను దర్శించినట్లు చెప్పింది. రామలక్ష్మణులు, తెల్లని వస్త్రములు ధరించి, హంసలచే పూన్చ బడిన పుష్పకవిమానంలో సీతాదేవితో అయోధ్యకు వెళ్ళినట్లు కలగాంచినట్లు చెప్పింది. దానివల్ల రావణాది రాక్షస వినాశం, శ్రీరామ విజయం తేటతెల్లమౌతుందని తెలియచేసి, రాక్షస స్త్రీలు సీతాదేవిని బాధించకుండా ఉండునట్లు చేసింది. సీతాదేవిని చాల గౌరవాదర మర్యాదలతో చూచింది.

**తీరని రోగాలకు సూర్యోపాసన తప్పని సరి అంటారు పెద్దలు. అయితే చరిత్రాధారాలను విపులీకరించగలరు?**

**- ఆర్. సత్యనారాయణ, హోసూరు.**

'ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్' అని శాస్త్రవాక్యం. సూర్యుడు గ్రహరాజు వెలుగు, వేడిమి మొదలైన లక్షణాలాయన సొంతం. "సూర్యకిరణ చికిత్స" అనే ఒక ప్రత్యేక చికిత్స ఉన్నది. ప్రకృతి వైద్యచికిత్సలో సూర్యస్నానాలు ప్రత్యేకం. ఒక మంచం మీద అరటి ఆకులు కప్పి కంబళివైచి దానిపై రోగిని పడుకోబెడతారు. పైని నిండుగా గాలి తగులకుండ ఆతనికి రగ్గులను కప్పుతారు. మంచి ఎండలో పడుకోబెడతారు. ఆ రోగి చెమటలతో ఆ అరటిఆకులు నిండుతాయి. తరువాత చాలసేపటికా రోగికి స్నానం చేయిస్తారు.

మరికొన్ని వ్యాధులకు, రోగిశరీరం నిండ ఒండ్రుమట్టిని పట్టించి ఎండలో నిలబెడతారు. ఆ ఒండ్రు బాగా ఎండి బీటలు వారిన తర్వాత స్నానం చేయిస్తారు. ఏ అవయవం రోగానికి గురియైందో ఆ ప్రాంతంలో సూర్యకిరణాలు నిలువుగా పడేటట్లు ఏర్పాటు చేస్తారు. నేటికీ సూర్యనమస్కారాలున్నాయి. ఆసనాలతో సూర్యునుపాసించి ఆరోగ్యం పొందుతున్నారు.

మయూరుడనే మహాకవి వ్యాధిగ్రస్థుడైనాడు. ఆయన సంస్కృతంలో సూర్యశతకం వ్రాసి ఆరోగ్యాన్ని పొందాడు. ఆ సూర్యశతకంలోని ఎన్నో శ్లోకాలను శ్రీనాథుడు కాశీఖండంలో అనువదించాడు.

ఒక చక్రవర్తి భయంకర వ్యాధిగ్రస్థుడైనాడు. ఎన్నో చికిత్సలు చేశారు రాజవైద్యులు. కాని ప్రయోజనం కలుగలేదు. ప్రతి రోజు మిట్టమధ్యాహ్నవేళ సూర్యకిరణాలు ఆయన దేహంమీద అలముకొనేటట్లు చేసి ఆయనను లేత అరటి ఆకులతో చుట్టి ఉంచేవారు. కొంతకాలానికి వ్యాధి పూర్తిగా తగ్గింది. ఆయన 'ఆరోగ్యభాస్కరమ్' అనే గ్రంథం వ్రాయించినట్లు సంస్కృత గ్రంథకవుల చరిత్రలో చెప్పబడింది. ఆ కవిపేరు ఆ రచయిత ఉటంకించలేదుకాని, చాలామంది ఆయుర్వేద శాస్త్రజ్ఞులు వైద్యగ్రంథాలలో 'ఆరోగ్యభాస్కరాన్ని' ప్రామాణిక గ్రంథంగా పేర్కొన్నారట. చినసుబ్రహ్మణ్యకవి 'సూర్యనారాయణా' అనే శతకంతో ఆరోగ్యాన్ని పొందినట్లు చెప్పుకొన్నాడు. జలోదర వ్యాధి సూర్యోపాసనచే తప్ప మరియొకవిధంగా తగ్గదట. నీరుచేరి పొట్ట ఉబ్బి ఉన్న వ్యక్తి సూర్యుని వేడిమిచే ఆరోగ్యం పొందుతాడు.

***యోఽపా మాయతనం వేద - ఆయతనవాన్ భవతి, ఆపోవై తపన్నపా మాయతనం ఆయతనవాన్ భవతి*** – అనే మంత్రపుష్ప మంత్రంలో జలశోషకమగు శక్తి సూర్యునిగా చెప్పబడింది.

**'బహుదా'నది ఇప్పుడున్నదా? ఉంటే ఎక్కడేపేరుతో పిలుస్తున్నారో చెప్పండి?**

**- కుక్కడపు లక్ష్మీ మేఘన, తిరువూరు, కృష్ణాజిల్లా.**

పూర్వం తపోనిధులైన ఇరువురు, మహర్షులుండేవారు. ఒకనాడు తమ్ముడు అన్నగారిని చూడటానికి వచ్చాడు. అన్నగారు తపోవనంలో లేరు. ఎంతసేపటికి రాలేదు. ఆకలి వేస్తున్నది. అన్నగారి తపోవనంలోని ఒక ఫలం కోసికొని తింటున్నాడు. ఇంతలో అన్నవచ్చాడు. తన ఆజ్ఞకానీ అంగీకారంకానీ లేకుండా, తాను లేనప్పుడు ఫలం కోయటం దొంగతనమౌతుందనీ, దానిని రాజుకు చెప్పి శిక్షను పొందవలసినదనీ అన్న తమ్మునికోరాడు. ఇపుడిక్కడ రాజశిక్షపొందకపోతే యమశిక్షపడవలసి వస్తుందనీ, ఒక తప్పుకు రెండుశిక్షలుండవనీ, ఈ రోజు శిక్షిస్తే యముని దండన తప్పుతుందని చెప్పి పంపించినాడు. రాజు తమ్మునికి

చోరులకు విధించినట్లుగా రెండు బాహువులు ఖండించినాడు. తమ్ముడు వచ్చి అన్నకు విషయం చెప్పాడు. వెంటనే సమీపం లోని నదిలో స్నానం చేసి రమ్మనినాడు. వెళ్ళి స్నానం చేస్తుండ గానే తమ్మునికి చేతులు వచ్చాయి.'బాహు'అనగా చేతులను 'ద' ఇచ్చినది అనే అర్థంతో 'బాహుదానది' అనేపేరు వచ్చిందని ఒక పౌరాణికగాథ. 'బహు'అనేక సంపదలను, 'ద' ఇచ్చునది 'బహుదా నది' ఇది ఒరిస్సాలో ఉన్న ఒక వాగు అని తెలియవస్తుంది. ఒకానొక అరణ్యప్రాంతంలో ఇది మహానదిలో కలిసిందట.

**'సృష్టి' ఆరంభంలో జీవులందరూ శుద్ధతత్త్వంతోనే సృష్టింప బడినారు. అటువంటపుడు పూర్వజన్మసంస్కారం లేకుండా జీవులు పాపాత్ములుగా ఎందుకు మారుతున్నారు?**

**- వి.కె.యల్. నరసింహారావు, నరసరావుపేట.**

☛ మీ ప్రశ్న చాలా సముచితం. అంటే సృష్ట్యాదియందు, తొలి సారిగా సృష్టించేటప్పుడు జీవులందరు శుద్ధతత్త్వస్వరూపులే. మరి వారికి పూర్వజన్మలేనపుడు పూర్వజన్మ సంస్కారమెలా ఉంటుంది? అటువంటివేళ కొందరు పుణ్యకర్మలు చేసేవారుగా; కొందరు పాపకర్మలు చేసే వారుగా ఎందుకు మారుతున్నారు? నిజమే. సృష్టికి తొలిదశయందు అందరు శుద్ధతత్త్వస్వరూపులే. భగవం తుడు సృష్టి చేసి, బుద్ధి-మనస్సు మొదలైన లక్షణాలన్నీ జీవులకు ఇచ్చాడు. కానీ జీవులు కావించే కర్మలతో భగవంతునకు సంబం ధంలేదు. ఎవరికర్మకు వారే బాధ్యులు. అవయవాలతో పాటు బుద్ధి, ఆలోచనా జ్ఞానం, మనస్సు మొదలైన వానిని ప్రసాదించి, వారి వారి కర్మలకు వారినే బాధ్యులుగా చేశాడు భగవంతుడు. భగవద్గీతలో కూడ కర్మలతో తనకు సంబంధం లేదని కృష్ణ భగవానుడు చెప్పాడు. 'బుద్ధిః కర్మానుసారిణీ' బుద్ధి కర్మలను అనుసరించి వెళుతుంది. ఒక కత్తిని తయారు చేశాం. దానిని సక్రమంగా వినియోగించుకొని ప్రయోజనమూ పొందవచ్చు; పరులకపకారం కలిగించి ప్రమాదాలూ కొని తెచ్చుకోవచ్చు. రెండింటికి కత్తి కర్త కాదు. ఉపయోగించుకునేవాని బుద్ధి కర్మలే కారణం. గోతిని తీసేవాడు లోపలికిపోతాడు. గోడను కట్టేవాడు పైకి పోతాడు. ఇది వారు చేసే కర్మలపై ఆధారపడి ఉంటుంది. మంచికర్మలు చేసినవారు మంచిఫలితాలు పొందుతారు. చెడ్డ పనులు చేసేవారు చెడుఫలితాలు పొందుతారు. రెండింటికీ భగవంతుడు కారణం కాదు. కనుక తొలి జన్మ సంక్రమించిన తరువాత, ఆయా జీవుల కర్మఫలాన్ననుసరించి పూర్వజన్మ సంస్కారం నిర్ణయింపబడింది.

**భీష్ముడు యుద్ధరంగంలో ఉండగా కర్ణుడు తాను యుద్ధం చేయనని దుర్యోధనునకు చెప్పినా మొదటిరోజు తన సైన్యాన్ని పరిచయం చేస్తూ మీరును భీష్ముడును కర్ణుడు, అశ్వత్థామ - అని కర్ణుని పేరును మరలా చెప్పటంలో దుర్యోధనుని ఉద్దేశ్యం యొక్క ఔచిత్యం ఏమిటి?**

**- సాయిరామానందస్వామి, పొదలకొండ.**

☛ కౌరవుల పక్షాన ఉన్న వీరులను, అతిరథులు, మహారథులు ఇత్యాదిగా విభజిస్తూ భీష్ముడు కర్ణుని గురించి "కర్ణుడర్థరథుడు" అన్నాడు. అందుకాగ్రహించిన కర్ణుడు "నీకు రణరంగంలో నా సహాయం కలుగకుండ ఉండుగాక. నీవు యుద్ధంలో పడిపోవు వరకు నేను యుద్ధానికి రానని" కర్ణుడు ప్రతిజ్ఞ చేశాడు.

యుద్ధం ప్రారంభమైనది. పాండవబలాలను దర్శించి భీతి చెందిన దుర్యోధనుడు ద్రోణుని కడకు వెళ్ళి పాండవులలోని మహావీరులను పేర్కొని, తమ పక్షంలోని వీరులను గురించి –

**భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ.**

అని పేర్కొనినాడు. ఇందు తన పక్షంలోని మహావీరులను గురించి చెప్పాడేగాని కర్ణుడిక్కడ ఉన్నాడని చెప్పలేదు.

పైగా దుర్యోధనుడా సమయంలో మతిస్థిమితం లేకుండినట్లు న్నాడు. లేకపోతే ఆనాడు సకలసైన్యాధ్యక్షుడు భీష్ముడు. ఆయన దగ్గరకు వెళ్ళాలి. లేదు ప్రభువుగా శాసింపదలచుకొంటే ద్రోణుని పిలిపించుకోవాలి. పోనీ గురువుగారని గౌరవంతో వెళితే గురువుకు నమస్కరించాలి. అదీ లేదు – ఆ తరువాత ఇంకొక భయంకరమైన మాట అన్నాడు.

***అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః*** – ఇంకా ఎందరో మహావీరులు నా కొరకు విడువబడిన జీవితములు కలవారై ఉన్నారు. నా కొరకు జీవితములనైన విడుచుటకు సిద్ధంగా ఉన్నారని గదా! అనవలసింది. 'త్యక్తజీవితాః' జీవితాలు విడిచినారు అనగా మరణించినారని భావం. కనుక వ్యాఖ్యాతలా సమయంలో దుర్యోధనుని గూర్చి 'ఇతోభ్రష్టః-తతోభ్రష్టః' అన్నారు. పైగా కర్ణుడు దుర్యోధనునకు బహిఃప్రాణం. ఆతడు అనుకోకపోయినా సహజంగా ఆతనిపేరు నోటవచ్చి తీరు తుంది. అది మైత్రీధర్మం-అలా సహజంగా కర్ణుని పేరు వచ్చి ఉండవచ్చు.

# వెంకన్న సేవలో..... రాయలు

- పి.వి.లక్ష్మీనారాయణ,
పుత్తూరు

15వ శతాబ్దంలో ఆంధ్ర - కర్ణాటక దేశాలను తన పరాక్రమంతో ఉగ్రూతలూగించి, పరిపాలనాదక్షతతో ప్రజల గుండెల్లో గుడికట్టుకుని నిలచిన మనోజ్ఞమూర్తి, విజయనగర చక్రవర్తి - 'శ్రీకృష్ణదేవ రాయలు'. ఈయన ఆంధ్రుల పాలిటేగాక-సమస్త దక్షిణ భారతావనికి ఒక వరప్రసాదంగా జన్మనెత్తి వచ్చాడు! దక్షిణ భారతదేశాన్ని ఒక ముసల్మాను రాజ్యంగా మార్చి వేయాలని ఉవ్విళ్లూరుతున్న బహుమనీ సుల్తాన్ల గుండెల్లో గునపమై గుచ్చుకుని, దక్షిణా పథంలో ఆరిపోతున్న హిందూమత జ్యోతిగుండంలో నెయ్యి దీపమై జ్వాజ్జ్వల్యమాన కిరణపుంజాన్ని వెదజల్లిన కృష్ణరాయడు కారణజన్ముడు.

**తిరుమల శ్రీవారిసేవలో - శ్రీకృష్ణదేవరాయలు**

గొప్ప సాహసీ, ఖడ్గవీరుడైన శ్రీకృష్ణదేవరాయలకు 'తిరుమల వెంకన్న'పై అపారమైన భక్తిశ్రద్ధలు ఉండేవి. ఆయన 7 సార్లు తిరుమల కొండను సకుటుంబంగా, ఒక్కడుగా సందర్శించిన దాఖలాలున్నాయి.

తిరుమల గుడి కాకుండా ఆయన - కంచి, శ్రీకాళహస్తి, శ్రీశైలం, సింహాచలం మొదలైన ఆలయాలకు విమాన గోపురాలు, మండపాలు నిర్మించాడు. ఆయా ఆలయాల నిర్వహణకు భూరి మాన్యాలిచ్చి గౌరవించాడు; బ్రాహ్మణ్యాన్ని కాపాడాడు; మ్లేచ్ఛుల దాడులతో పతనమైపోతున్న భక్తిభావతరంగాలకు కొండంత ఊపిరిపోసి - ఆంధ్రదేశాన అఖండ భక్తి ప్రభంజనాన్ని పర్వులెత్తించాడు!

రవాణా సౌకర్యాలు అంతంత మాత్రమే ఉండిన ఆ రోజుల్లో రాయలవారు ఎంతో వ్యయ ప్రయాసల కోర్చి - దేవేరులతో సహా తిరుమల కొండను దర్శించేవారు. ఆ రోజుల్లో రాయలవారి తిరుమల యాత్రలు జనసామాన్యంలో ఎంతో సందడిని కలిగించేవి. ఆ మహా విజేత వెంట అనేక జన ప్రవాహాలు తిరుమల వేంకటప్రభువును దర్శించుకునేవి.

నిజానికి - కృష్ణదేవరాయల ఈ తిరుమల యాత్రలు ఆనాటి జనసామాన్యంలో భక్తి యెడల గొప్ప కదలిక తీసుకు వచ్చాయనడంలో ఎంతమాత్రమూ అతిశయోక్తి కాదు. "అంతటి మహాప్రభువే తిరుమల రాయని ముందు మోకారిల్లినాడంటే ఆయన మహత్తు ఎంత గొప్పదో కదా!" అని నాటి దేశవాళీ భక్తజనం తలచేవారు. దేవదేవునికి యితోధికమైన కానుకలు సమర్పించి, ఈ శరణాగత రక్షకుణ్ణి ఈ యుగాంతం వరకూ దేదీప్య మానంగా వెలుగొందనివ్వాలన్నది రాయలవారి కృత నిశ్చయం! ఈ మహదాశయాన్ని మనసావాచాకర్మణా అమలు చేసిన మహామనీషి శ్రీకృష్ణదేవరాయలు! అందుకు ప్రతిఫలంగా ఆయన చేసిన ప్రతి దిగ్విజయయాత్ర వెనుకా అఖండమండలాకార రక్షాకవచంగా సాక్షాత్తూ తిరుమలకొండే వెన్నుదన్నుగా నిలబడి, ఆయన్ను ఓటమి ఎరుగని ఒక మహావిజేతగా నిలిపిందని మనం అనుకోక తప్పదు!

స్వయంగా ఖడ్గధారణ చేసి - అప్రమేయబలవిలసితమైన సేనాసమూహసంచాలనం చేసి - శత్రువుగుండెల్లో మృత్యునాదాలు చెలరేగించిన తనకంటే; మనోహరాకృతితో - గండశిలాసదృశ్యమై - బ్రహ్మాండమౌనసముద్రతో జగద్వీక్షణం చేస్తూ నిలబడి ఉన్న శ్రీ వేంకటేశ్వరుడే మహాబలుడని నమ్మిన మహాభక్తుడు! తాను గెలిచిన ప్రతిపర్యాయమూ, తనను గెలిపించిన వేంకటాద్రివేల్పుకు ఆయన సమర్పించిన కట్నకానుకలు అపారం!

శ్రీ వేంకటేశ్వరస్వామిని సేవించిన రాజులు, చక్రవర్తుల లోకెల్లా ముందుగా చెప్పుకోవాల్సినవాడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు. ఆయన తన అజరామర కావ్యం 'ఆముక్తమాల్యద'ను స్వామివారికే అంకితమిచ్చాడు. అమూల్యమైన వజ్రవైడూర్యాలు, బంగారు, వెండి ఆభరణాలు వేలకొలది వరహాలు వివిధ దశల్లో స్వామికి సమర్పించుకున్నారు. ఆభరణాలతో పాటు చంద్రగిరి, ఉదయగిరి, పెనుగొండ ప్రాంతాల్లోని అనేక గ్రామాలు - స్వామివారి వివిధ



# పెద్దల మాట

– డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**ధీరమతి యుక్తిజేసి, విచారింపగ నిక్కువంబు సర్వజనస్వ ।**
**ర్గారోహణసోపానం బారగ ధర్మంబసూవె అతిరమ్యం బై ॥**

**(ఆంధ్రమహాభారతం, ఆరణ్యపర్వం)**

భావం : **బుద్ధిబలంతో చక్కగా ఆలోచిస్తే అందరికీ - స్వర్గాన్ని అధిరోహించడానికి సోపానం ధర్మమే! ఇది పరమసత్యం!**

**వివరణ :** మానవజీవితం ధర్మం, అర్థం, కామం, మోక్షం – అనే నాల్గు పురుషార్థాలతో కొనసాగుతూంది. ఈ నాల్గింటిలో అన్నింటికీ మూలం మొదటిదైన ధర్మమే! ధర్మంలేని అర్థకామాలు నరకద్వారా లవుతాయి. ధర్మం ఉన్నచోటనే నీతి, విజయం, శాంతి, సౌఖ్యం, సంపదలూ ఉంటాయి. ఇహపరసుఖాలకు ధర్మం ముఖ్యసాధనం. వేదశాస్త్ర పురాణాదు లన్నీ ధర్మప్రాముఖ్యాన్ని వేనోళ్ళ నొక్కి వక్కాణించాయి. ధర్మం – ప్రవృత్తిరూప మనీ, నివృత్తిరూప మనీ రెండువిధాలు. ప్రవృత్తిధర్మం ఇహలోకానికీ, నివృత్తిధర్మం పరలోకానికీ, మోక్షానికీ కారణా లవుతాయి.

మహాభారతానికి ధర్మం, ఆధ్యాత్మికం–రెండుకండ్లు. ఈ రెంటినీ కలిపేదీ, గమ్యాన్ని చేర్చేదీ, సత్యం. సత్యధర్మాల్ని నిష్ఠతో ఆచరించి నందుకే శ్రీరాముడూ, ధర్మరాజూ – ఇంకా ఎందరో మహాత్ములు ఆదర్శమూర్తు లయ్యారు. ధర్మ మనే సోపానాన్ని అధిరోహిస్తే ఇటు స్వర్గానికీ, అటు జన్మరాహిత్యమైన మోక్షానికీ మార్గం సుగమం అవుతుంది.

సేవల నిమిత్తం దానం చేశారు. శ్రీ కృష్ణ దేవరాయలుతో పాటు అతని దేవేరులు తిరుమలదేవి, చిన్నాదేవి కూడా అనేక ఆభరణాలు సమర్పించారు. శ్రీకృష్ణదేవ రాయలు వివిధ సందర్భాల్లో (క్రీ.శ. 1512–1523) తిరుమల శ్రీ వేంకటేశ్వ రుని ఏడుసార్లు తన రాణులతో సందర్శిం చారు. వివిధ సందర్భాలలో రాయలవారు శ్రీ వేంకటేశ్వరస్వామికి సమర్పించిన కానుకల విశేషాలన్నీ మూడు భాషల్లో– తెలుగు, తమిళం, కన్నడం – ఉన్న శాస నాల్లో కన్పిస్తాయి.

1513 ఫిబ్రవరి 10న రాయల వారి మొదటి దర్శనం. ఆయన వెంట రాణులు కూడా ఉన్నారు. ఈ సందర్భంగా తొమ్మిదిరకాల వజ్రవైడూర్యాలు పొదిగిన ఒక బంగారు కిరీటం, 25 వెండి హారతి పళ్లాలు స్వామికి సమర్పించారు. ఆతని రాణులు తిరుమలదేవి, చిన్నాదేవి స్వామి వారికి పాలు తాగేందుకు ఒక బంగారు పాత్రను సమర్పించారు. క్రీ.శ.1513 మే 2న రాయలవారు శ్రీ వేంకటేశ్వరస్వామిని రెండోసారి సందర్శించారు. అనేక ఆభర ణాలతోపాటు మూడు చిన్న బంగారు కిరీ టాలు స్వామివారికి సమర్పించారు. ఈ విషయాలు కూడా శాసనాల్లో ఉన్నాయి.

క్రీ.శ.1513 జూన్ 13న రాయల వారు మూడోసారి స్వామివారిని సందర్శిం చారు. తన తండ్రి నరసనాయకుడు, తల్లి నాగులాదేవి జ్ఞాపకార్థం ఐదు గ్రామాలను శ్రీ వేంకటేశ్వరస్వామికి దానం చేశారు. స్వామివారికి నిత్య నైవేద్యం, అనేక ఉత్స వాల ఖర్చుల నిమిత్తం ఈ గ్రామాల్ని దానం చేశారు. కళింగరాజు ప్రతాపరుద్ర గజపతిని, కొండవీడు, ఉదయగిరి కోట లను జయించిన సందర్భంగా కృష్ణదేవ రాయలు నాలుగోసారి 1515వ సంవత్స రంలో తిరుమల వేంకటేశ్వరస్వామిని దర్శించారు. తన దండయాత్రల విజయ సూచికంగా స్వామి వారికి కనకాభిషేకం చేశారు. పచ్చల హారాలు, ముప్పై వేల

బంగారు నాణేలు, కొన్ని ఆభరణాలు సమర్పించారు. ఆయన దేవేరులు కూడా బంగారు కంఠాభరణంతో సహా పలు ఆభరణాల్ని దానం చేశారు. క్రీ.శ.1517వ సంవత్సరంలో రాయలవారు ఐదవసారి తిరుమల వేంకటేశ్వరుణ్ణి సందర్శించారు. ఈ సందర్భంగా ఆలయ గర్భగృహం, గోపురం అలంకరణ కోసం 2000 బంగారు నాణేలు, మరో వెయ్యి వరహాలు స్వామికి సమర్పించారు. మరో 500 వరహాలు సూర్యోదయ సమయంలో సేవల నిమిత్తం దానం చేశారు.

మరుసటి సంవత్సరం అంటే 1518 అక్టోబరు 16న రాయలవారు మరోసారి వేంకటేశ్వరస్వామిని సందర్శించారు. ఇది ఆరో పర్యాయం. ఈ సందర్భంగా కూడా అనేక కానుకలు సమర్పించారు. 1521వ సంవత్సరంలో రాయలవారు ఏడోసారి తిరుమలను సందర్శించారు. ఈ సందర్భంగా పట్టు పీతాంబరాలు, తొమ్మిది రకాల వజ్రాలు, వజ్రవైడూర్యాలు పొదిగిన



తన దేవేరులు తిరుమలదేవి, చిన్నాదేవీలతో శ్రీకృష్ణదేవరాయలు

## రాధిక

**శ్రీకృష్ణుని మధురాధర వంశీ గీతిక**<br>
**కృష్ణ తత్త్వానికి ఆత్మ నివేదన చేసుకున్న భక్తురాలు**<br>
**తల్లిలా నల్లనయ్యను లాలించినా**<br>
**సోదరిలా మందలించి దారిలో పెట్టగల్గినా**<br>
**ప్రేమగా వెన్న మీగడలు తినిపించినా**<br>
**అన్ని విధాలైన అర్హత పొందిన ప్రణయజీవిక**<br>
**కృష్ణ విరహంలో తన కన్నీరే యమునై పొంగినా**<br>
**తన మనోభావాలను సైకత రేణువులతో**<br>
**బృందావన హరిణాలతో వెళ్లబోసుకుని**<br>
**ఊరట చెందిన అమాయిక**<br>
**అష్టవిధ నాయికగా ఆ పరంధాముని**<br>
**పదపద్మారాధనకు తనను తాను**<br>
**అర్పించుకున్న నీహారిక**<br>
**నిర్మలభక్తితత్త్వానికి నిశ్చల ప్రేమసత్త్వానికి**<br>
**అసలు సిసలైన ప్రతీక**

**– కోడూరి సుమనకుమారి, తిరుపతి**

ఒక టోపిని స్వామికి అర్పించారు. ఇంకా తొమ్మిది రకాల వజ్రాలు పొదిగిన రెండు వింజామరలు, పదివేల వరహాలు, ఒక 'పాపిట'చిందు సమర్పించారు. ఆయన దేవేరి తిరుమలదేవి స్వామికి నవరత్నాలు పొదిగిన పతకం సమర్పించారు.

కృష్ణదేవరాయలు తరువాత విజయనగర సామ్రాజ్య పాలకుడైన ఆయన సోదరుడు అచ్యుతదేవరాయలు 1533 జనవరి 31న తిరుమలను సందర్శించి అనేక దానాలు చేశారు. అలాగే 1535లోను, 1537లో కూడా ఆయన శ్రీ వేంకటేశ్వర స్వామిని సందర్శించుకుని అమూల్యమైన కానుకలు ఎన్నో సమర్పించినట్టు శాసనాధారాలు ఉన్నాయి.

# ప్రసన్నాక్షి శ్రీ ఆండాళ్

- వరాటి వేంకట సుబ్బారావు,
విజయవాడ

దక్షిణ భారతదేశంలోని పాండ్యరాజ్యాన్ని మధురై నగరం రాజధానిగా చేసుకుని, 8వ శతాబ్దంలో వల్లభదేవరాయలు ప్రజలను పరిపాలించేవాడు. ఆ కాలంలో విష్ణుభక్తులైన ఆళ్వారులు యావత్ భారతదేశంలోని దివ్య క్షేత్రాలను దర్శించి, అనేక రాగయుక్తమైన పాశురాలు పాడిన దైవాంశసంభూతులు. వారిలో ప్రసన్నాక్షి శ్రీ ఆండాళ్ చరిత్ర పరమపావనమైనది. శ్రీకృష్ణపరమాత్మ తన అనంత విభూతులను అర్జునునకు వివరిస్తూ, "మాసానాం మార్గశీర్షోహం (భ.గీ.10-35-శ్లో) మాసాలలో మార్గశీర్షమాసాన్ని నేను" అని దివ్యోపదేశం చేశాడు. భూదేవి అంశతో అవతరించిన ఆండాళ్‌కి, మృధువైన మార్గశిరమాసానికి అవినాభావ సంబంధముంది.

పెరియాళ్వార్ శ్రీ విల్లిపుత్తూరులో అర్చామూర్తియై ఉన్న వటపత్రశాయికి నిత్యం భక్తితో పుష్పకైంకర్యం చేసేవాడు. ఈయనకు సంతానం లేదు.

భక్త యోగియైన విష్ణుచిత్తుడు ఒకరోజు తులసీవనంలో పాదులు తీస్తుండగా కర్కాటక రాశి పూర్వ ఫల్గుణీనక్షత్ర శుభదినాన భూదేవి అంశతో గాయత్రి ప్రభావంతో ఒక బాలిక దొరికింది. సంతానంలేని ఆయన సంభ్రమాశ్చర్యాలతో ఆ బిడ్డను ఎత్తుకుని భగవంతుడే ప్రసాదించాడని తలచి ఒక మాలికగా పిలుస్తూండగా క్రమంగా 'గోదా'గా ఆమె పేరు సార్థకమయ్యింది.



ఆ బాలికను అల్లారు ముద్దుగా పెంచుతూ బాలకృష్ణుని లీలలను పాడుకుంటూ ప్రతిక్షణం హరిసేవలో గడుపుతూ గోదాను కూడా బాలభక్తురాలుగా శ్రీకృష్ణభక్తితో పెంచాడు. శ్రీకృష్ణలీలలన్నీ, ఇంపుగా వింటున్న గోదా హృదయక్షేత్రంలో సుందరమధురభక్తి బీజాలు నాటుకుని పవిత్రమైన శ్యామ సుందరుని ప్రేమకు, తాను కూడ తగిన సౌందర్య వనితనని, ఆదిపురుషుడైన శ్రీహరిని తలుచుకుంటూ, ఏ లతను కూడా నందగోపకులంలో జన్మించలేదేనని మనసులో చింతిస్తూండేది. యవ్వనవతి అయిన తర్వాత ఆమె శ్రీమన్నారాయణునినే భర్తగా పొందాలని గాఢంగా నిశ్చయించుకున్నది. తన తండ్రి శ్రీ విల్లి పుత్తూరు మూర్తికి భక్తితో సమర్పిస్తున్న సప్తవర్ణ శోభిత పుష్ప మాలలను మురిపెంతో తాను ముందుగా అలంకరించుకుని తన సౌందర్యాన్ని అద్దంలో చూచుకుని ఆత్మానందంతో మురిసి పోతూండేది. ఒకరోజు అది గమనించిన పెరియాళ్వారు, "అమ్మా నిత్యము స్వామి కైంకర్యానికై తీసుకెళ్ళే పుష్పమాలలను నీవు ముందుగా ధరించుట అపచారం కదా! అట్లా చేయ వచ్చునా?" అని మందలించగా ఆమె మౌనముదాల్చి దుఃఖితురాలైనది. ఈ దశలో స్వామికి నిత్యం జరిగే మాలాకైంకర్యం జరగలేదు. దీనికి ఆమె తండ్రి విచారిస్తూ నిద్రించగా, తెల్లవారు జామున స్వామి కలలో కన్పించి, "విష్ణుచిత్తా! ఎందుకు నీవు నాకు పుష్పమాలలను తీసుకు రాలేదు, నీ వద్ద నున్న బాలిక సామాన్య బాలిక కాదు, నాకు చెందింది. ఆ బాలిక అలంకరించుకుని ఇచ్చే పుష్ప మాలలే నాకు ఆనందాన్ని చేకూరుస్తాయి" అని పలికి అదృశ్యుడయ్యాడు. ఈ స్వప్న వృత్తాంతంతో గోదా భగవదనుగ్రహంతో పొందిన

దేవియని, దీంతో "ఆండాళ్" అని పేరు కూడా ఆమెకు వచ్చింది. ఆమె బుద్ధియోగం పొందిన మహా భక్తురాలేగాక, దివ్య కవయిత్రి కూడ. ఆమె తన తండ్రి భక్తిప్రభావంతో 1) తిరుప్పావు- 30 పాశురాలు; 2) నాచ్చియార్ తిరుమొళి- 143 పాశురాలు రచించింది.

వనమాలాంశతో జన్మించిన తొండరడిప్పొడి ఆళ్వార్‌చే "తిరుప్పళ్ళి యెళుచ్చి"లో వర్ణించిన ప్రకృతి సౌందర్యం ప్రాతః కాల సహజ వాతావరణాన్ని వర్ణిస్తూ రచించి మేలుకొలుపు పాశురాలతో కలిపి తిరుప్పావు పఠిస్తూ ఉంటారు. ఆండాళ్ రచించిన తిరుప్పావు ముప్పది పాశురాలు పారాయణ చేయడం దివ్య క్షేత్రాలలో మకుటాయమానం. ఈ మార్గశిర మాసానికి తిరుప్పావు వల్ల ఆధ్యాత్మిక ప్రాముఖ్యత పెరిగింది. అందువల్లే శ్రీమద్రామానుజులు తిరుప్పావు ప్రబంధాన్ని పరమపవిత్రంగా భావించి శ్రీవైష్ణవ భక్తలోకానికి ఈ వ్రత విశిష్టతను ప్రబోధం చేసి, "తిరుప్పావు జియ్యర్"గా ఖ్యాతి పొందారు.

విష్ణుచిత్తుడు ఆండాళ్‌కు వివాహం చేయ సంకల్పించగా ఆండాళ్ శ్రీరంగనాథుడే నా నాథుడని ఇతరులను కన్నెత్తియైన చూడజాలనని సమాధానం చెప్పి, శ్రీరంగనాథునే వివాహ మాడింది.

సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవ రాయలు, "విష్ణుచిత్తీయము" అనే నామాంతరం గల 'ఆముక్త మాల్యద'ను రచించి పదిహేనవ శతాబ్దంలో ఆండాళ్ విగ్రహాన్ని విష్ణ్వాలయంలో ప్రతిష్టించి సాటిలేని కీర్తి గడించాడు. శ్రీ విల్లి పుత్తూరులోనున్న శ్రీ ఆండాళ్‌మందిరం పవిత్రమై ఖ్యాతి పొందింది.

ఆంధ్రప్రదేశ్‌లో అనేక దివ్యక్షేత్రాల్లో ప్రతి సంవత్సరం మార్గశిరమాసంలో శ్రీ ఆండాళ్ తిరుకల్యాణం భక్తితో జరుపుతారు. ఈ శుభసమయంలో ఆమె రచించిన 'నాచ్చియార్ తిరుమొళి' దివ్యప్రబంధంలోని వివాహఘట్టంగల పాశురాలు పారాయణ చేయబడతాయి.

# ఇల వైకుంఠం

రమణీయ ప్రకృతి శోభలతో
కమనీయ పసిడి కాంతులతో
ఎప్పుడు కాంచిన క్రొత్తగ ఉండే
ఇలవైకుంఠం సప్తగిరివాసం!

పగలు, రేయి ఒకటిగ తోచే
జన సందడితో నిండుగ ఉండే
కీర్తన, కోలాట, సుప్రభాతాల
సుమధుర గానాల సుందర స్థలమిదియే!

ఎందరు పొగడిన, ఏమని పొగడిన
గొంతుల అమృతం నింపే నామం
గోవిందా హరి గోవిందాయని
గానం చేసిన తొలగును పాపం!

కట్టు, బొట్టు వేరైనా, వేషభాషల తేడా ఉన్న
తిరుమలలోన నడయాడే
అందరి నోట పలికే మాట
వేంకటేశుని నామామృతమట!

నారాయణ నామపారాయణతో
నరుని కోర్కెలీడేరు
పిల్ల, పాపల ముద్దు ముచ్చటల
తన ఇల్లే స్వర్గధామ మగు!

– పి.యస్.యస్.లక్ష్మి, విజయనగరం

భగవంతుని వివాహమాడి శాశ్వత సౌభాగ్యవతియైన మహాభక్తురాలు ఆండాళ్. దక్షిణదేశంలో గల సంప్రదాయ శ్రీవైష్ణవులు తమ గృహాలందు, ముఖ్యంగా కల్యాణ సమయాల్లో నాచ్చియార్ తిరుమొళి ప్రబంధమునగల 'వారణమాయిరమ్'ను గానం చేస్తుంటారు.




ఏడుకొండలవాడా! వెంకటరమణా! గోవిందా! గోవింద అనే పదాలు తిరుమల గిరులలో మన చెవులలో మారు మోగు తుంటాయి. తిరుపతి పుణ్యక్షేత్రం నుంచి కాలినడకన తిరు మలకు అలిపిరి నుండి బయలుదేరే భక్తులందరూ "గోవిందా, గోవిందా" అనే నామస్మరణ చేస్తూ, మెట్లు ఎక్కుతూ ప్రయాణ బడలికను తీర్చుకుంటూ సునాయాసంగా ఏడు కొండలూ ఎక్కి శ్రీనివాసుని దర్శించుకుని తరిస్తారు. ఈ గోవిందా అనే పేరు శ్రీనివాసునికి ఎలా వచ్చిందంటే –

పూర్వం తిరుపతి నుండి తిరుమలకు ఏడుకొండలు ఎక్కి శ్రీనివాసుని దర్శించుకోవాలంటే మార్గమధ్యమంతా దట్టమైన అడవులు, క్రూరమృగాలు ఉండి; దారీ తెన్నూ ఏమీ తెలీక అగమ్యగోచరంగా ఉండేది. భక్తులు ఈ మార్గంగుండా గుంపులు, గుంపులుగా వెళ్ళేవారు. దారిలోనే కొందరు మృత్యు వాత కూడా పడేవారు. అనారోగ్యం వల్ల మరియు క్రూర మృగాల బారినపడి, చాలా బాధలు పడవలసి వచ్చేది. ఈ బాధలు పడలేక చాలామంది తమ మొక్కులు దిగువ తిరుపతి లోనే తీర్చుకొని వెళ్ళిపోయేవారు. కొంతమంది ప్రయాణాన్ని మానుకొనేవారు. భక్తుల బాధలు చూడలేక భక్తసులభుడైన భగవంతుడు భక్తులను తన వద్దకు రప్పించుకోవడానికి ఆయనే మనకు మార్గాన్ని చూపించారు.

మునుపు తిరుపతిలో ఒక బ్రాహ్మణ కుటుంబ ముండేది. వారు శ్రీనివాసుని భక్తులు. వారి దగ్గర కామధేనువు అనే ఒక గోవు ఉండేది. ఆ గోవు వల్ల వారు సిరిసంపదలతో తులతూగేవారు. ఆ ఇంటికి ఎంతమంది అతిథులు, అభ్యాగ తులు వచ్చినా వారికి సంతర్పణ చేస్తూ ఎవరికి ఏమి కావల్సినా ఇస్తూ; ఆ ఊరిలో మంచి పేరు తెచ్చుకున్నారు. ఆ రోజుల్లో ప్రతిఇంట్లో కూడా ఒక వ్రతం చేసేవారు. అలాగే ఆ బ్రాహ్మణులు కూడా ఆ వ్రతం చేసేవారు.

ప్రతిరోజూలాగే బ్రాహ్మణులు తెల్ల వారుజామునే లేచి, సంధ్యావందనం గావించి. పిండివంటలతో భోజనము తయారుచేసి ఇంటిల్లిపాదీ శుభ్రంగా తయారై; అతిథుల కొరకు ఎదురు చూస్తు న్నారు. ఆ బ్రాహ్మణుడు బయటకు వచ్చి నాలుగు వీధులలో తిరుగుతూ, ఎదురుచూస్తున్నాడు. కానీ, ఆ రోజు అతిథులు ఎవ్వరూ కూడా కనబడలేదు. సమయం మించిపోతోంది. ఆయన ఆదుర్దాతో కలియతిరుగుతున్నాడు. ఎట్టకేలకు దైవాను గ్రహంతో ఒక సిద్ధపురుషుడు తారసిల్లాడు. ఆయన దగ్గరకువెళ్లి ఆ బ్రాహ్మణుడు "అయ్యా! ఈ రోజు మీరు మా అతిథిగా వచ్చి మా గృహాన్ని పావనం చేయవలసిందిగా కోరుతున్నాను" అని ప్రార్థించాడు. దానికి సిద్ధపురుషుడు "మీ ఇంటికి భోజనానికి



**విస్సాప్రగడ సాయి ప్రమోదా భవాని,**
**9వ తరగతి, నలందా పబ్లిక్ స్కూల్,**
**శారదానగర్, 1వ లేన్, బలిఘట్టం, నర్సీపట్నం**
**మండలం - 531 116, విశాఖజిల్లా.**

వస్తాను. కానీ నేను కోరింది ఇవ్వాలి; లేకపోతే నాకు కోపం వచ్చి వెళ్ళిపోతానన్నాడు." అందుకు ఆ బ్రాహ్మణుడు సమ్మ తించాడు.

ఇద్దరూ కలిసి బ్రాహ్మణుని ఇంటికి వెళ్ళారు. ఆ బ్రాహ్మణ కుటుంబీకులు ఆ సిద్ధపురుషునికి అతిథి మర్యాదలు చేసి, కాళ్ళు కడిగి ఆ నీరు తలపై జల్లుకుని అతిథికి శుచిగా నవ కాయ పిండివంటలతో, రుచికరమైన భోజనాన్ని వడ్డించారు. ఆ సిద్ధపురుషుడు భోజనం చేసి విశ్రాంతి తీసుకున్న తరువాత ఆ బ్రాహ్మణుడు, కామధేనువు దయవలన తమకు కలిగిన నవ రత్నాలు, వజ్రవైడూర్యాలు దక్షిణగా, ఆ సిద్ధపురుషునికి ఇవ్వబోగా ఆ సిద్ధపురుషుడు "కామధేనువును" దక్షిణగా ఇమ్మని అడిగాడు. దానికి ఆ బ్రాహ్మణుడు ఆ గోవు లేకపోతే మా జీవనం జరుగదని చెప్పాడు. వెంటనే సిద్ధపురుషుడు కోపంతో వెళ్ళిపోయాడు. అందుకు బ్రాహ్మణుడు ఎంతో బాధపడి ఆ

# తిరుమల కాలిబాటలో సౌకర్యాలు...

★ అలిపిరి నుంచి తిరుమలకు నడచి వస్తామని చాలా మంది యాత్రికులు మొక్కుకుంటారు. అటువంటి యాత్రికులు తిరుపతి ఆర్.టి.సి. బస్టాండు ఎదురుగా ఉన్న శ్రీనివాసం కాంప్లెక్స్‌లోను, రైల్వే స్టేషన్ వద్ద ఉన్న 2వ సత్రంలోను, అలిపిరి బస్టాండు వద్ద ఉన్న భూదేవి కాంప్లెక్స్‌లోను దేవస్థానం ఉచితంగా ఏర్పాటు చేసిన వసతి, స్నానం వగైరా సౌకర్యాలను పొందవచ్చు.

★ తి.తి.దేవస్థానం తిరుపతి బస్టాండు నుంచి అలిపిరి వరకు ఉచిత బస్సులను నడుపుతున్నది.

★ భద్రంగా తాళాలు వేసిన తమ సామానులను అలిపిరి లగేజి సెంటర్లో అప్పజెప్పి, తిరిగి వాటి రశీదును చూపించి తిరుమల లగేజి సెంటర్లో పొందవచ్చు. **సామానులకు రవాణా పూర్తి ఉచితము.**

★ దారి పొడవునా త్రాగు నీటి సౌకర్యం, టాయిలెట్ల సౌకర్యం ఉంది.

★ నడచివెళ్ళే యాత్రికులు గుంపులు గుంపులుగా తెల్లవారు జామున 4 గంటల నుంచి రాత్రి 10 గంటల వరకు మాత్రమే వెళ్లాలని సూచించడమైనది.

## ముందు జాగ్రత్త చర్యలు

బి.పి., ఊపిరితిత్తుల జబ్బులు, గుండె జబ్బులువున్న యాత్రికులు నడచి కొండకు వెళ్లడం మంచిది కాదని సూచన. అలిపిరి నుంచి తిరుమల కొండకు నడక మార్గం సుమారు 9 కి.మీ. దూరం ఉండడమే గాక 3550 మెట్లు ఉన్నాయి.



గోవును తీసుకొని సిద్ధుడిని వెతుక్కుంటూ బయలుదేరగా ఆయన కనుచూపు మేరలో కనిపించగా అందరూ కలిసి "ఓ మహానుభావా! "గోవు, ఇందా" "గోవు ఇందా" అని పెద్దగా కేకలు వేసుకుంటూ ఆయన వెంట బయలు దేరారు. ఆయన అలా అలా ఏడుకొండలు దారిపట్టి ఎక్కుతూ ఉండగా ఆయన వెంటే వారు కూడా "గోవు, ఇందా", "గోవు, ఇందా" అంటూ బయలుదేరారు. వారితో పాటు ఆ ఊరి జనులు కూడా అలాగే పోసాగారు. వారికెవ్వరికీ ఆకలి దప్పికలు, నడక వల్ల బాధలు ఏమీ అనిపించలేదు. "గోవు, ఇందా", "గోవు, ఇందా" అనే అరుపులతో ఏడుకొండలు మారు మ్రోగిపోతున్నాయి. ఆ మహానుభావుడు ఏడుకొండల వరకూ నడుచుకుంటూ ఆఖరి కొండ వరకూ వారందరికీ కనపడి అంతర్ధానమై శ్రీనివాసుడిలో ఐక్యమైపోయాడు. వారందరూ "గోవిందా, గోవిందా" అంటూ ఆ స్వామిని ప్రార్థించారు. అప్పుడు ఆ స్వామి అందరికీ దర్శనము ఇచ్చి. నన్ను ఇక నుండి "గోవిందా, గోవిందా" అని స్మరించినవారికి బాధలు, కష్టాలు అన్నీ తొలగిపోతాయి అని చెప్పాడు.

అప్పటి నుంచీ "గోవిందా, గోవిందా" అనే నామ స్మరణం చేస్తూ అందరూ కూడా ఏడుకొండలు సునాయాసంగా మెట్లు ఎక్కుతూ తిరుమలకు వస్తున్నారు. "గోవిందా" అంటే మనంపడే కష్టాలన్నీ సులువుగా పోతాయి. మన ప్రయాణంలోనే కాకుండా మన జీవితంలో కూడా కష్టాలు బాధలు తొలగిపోతాయి. అందుకే "గోవిందా, గోవిందా" అంటే ఆ స్వామికి ఎంతో ఇష్టం. విష్ణుసహస్రనామములలో అన్ని నామముల కంటే గోవింద నామంపై ఆయనకు మక్కువ ఎక్కువ. ఈ పేరుతో ఆయనను స్మరించిన వారి బాధలు తీర్చి మోక్షమును ప్రసాదిస్తాడు. అందుకే 'గోవింద' నామాన్ని మనము ఎప్పుడూ స్మరిస్తూనే ఉండాలి.

## డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమము - 06-11-2009

## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఇ.ఓ.'*** *కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 06-11-2009న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం)*

**వి.ఐ.పి. భక్తులవల్ల సామాన్య భక్తులకు ఇబ్బందిగా ఉంటోంది. కాబట్టి రూ.300/- లు టిక్కెట్టు ధర పెంచండి.**

*- పరమహంస, హైదరాబాదు*

**కార్యనిర్వహణాధికారి :** ఈ ధర మేము సామాన్యభక్తులకోసం పెట్టిందే. ఏ వి.ఐ.పి. వచ్చినా బ్రేకులో వెళ్ళాల్సిందే.

**శీఘ్రదర్శనం టిక్కెట్లు మా ప్రాంతాలలోనే ఇస్తే బాగుంటుంది.** *- సత్యనారాయణ, కాకినాడ*

**కార్యనిర్వహణాధికారి :** ఇదివరకే సుదర్శనం కౌంటర్లు ఉన్నాయి. ఇంటర్నెట్‌లో శీఘ్రదర్శన సమాచారం అందించడానికి త్వరలో నిర్ణయం తీసుకుంటాం.

**ఎ.ఎ.డి. క్యాన్సల్ చేయడంతో అన్నప్రసాదాలు కూడా క్యాన్సల్ చేశారు.** *- వెంకట్రామిరెడ్డి, నెల్లూరు*

**కార్యనిర్వహణాధికారి :** ఎ.ఎ.డి.కి, అన్నప్రసాదాలకు ఏ విధమైన సంబంధము లేదు.

**ప్రతి పోస్టాఫీసులోను శీఘ్రదర్శనంకోసం దరఖాస్తులు దేవస్థానం వారు ఏర్పాటు చేస్తే భక్తులకు మరింత సౌకర్యవంతంగా ఉంటుంది.** *- గౌరీశంకర్, కందుకూరు*

**కార్యనిర్వహణాధికారి :** చక్కటి ఆలోచన. ఈ విషయంపై ఆలోచిస్తాం.

**శుక్రవారం జరిగే అభిషేక సేవల టిక్కెట్లను కరెంటు బుకింగ్ చేసుకునే సౌకర్యం కల్పించండి.**

*- రామారావు, శ్రీకాకుళం*

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా.

**ప్రత్యేక పర్వదినాలలో కూడా శీఘ్రదర్శనం ఉంటుందా?**

*- మాధవి, హైదరాబాదు*

**కార్యనిర్వహణాధికారి :** సర్వదర్శనంతోబాటు శీఘ్రదర్శనం కూడా ఉంటుంది.

**1. ఒకేచోట రెండు క్యూలు కలిస్తే తొక్కిసలాట ఎక్కువగా ఉంటుంది. అందుకు ఏకవ్యక్తి క్యూను పెడితే బాగుంటుంది.**

**2. ఆలయం లోపల వాలెంటీర్లు శబ్దం చేయకుండా ఉంటే బాగుంటుంది.** *- వెంకటేశమూర్తి, బెంగుళూరు*

**కార్యనిర్వహణాధికారి:** 1. ఆలోచిస్తాం.

2. తప్పకుండా దీనిని నిరోధిస్తాం.

**గదుల్లో హీటరు పనిచేయడం లేదు. పి.ఎ.సి.లో నీళ్లు రావడం లేదు.** *- నరేందర్, వేములవాడ*

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా పరిశీలిస్తాం.

---

### ప్రతినెల మొదటి శుక్రవారం మాత్రమే! ఇ.ఓ.తో మాట్లాడండి !



## డయల్ యువర్ ఇ.ఓ.!

**ఫోన్ నెం:**

**0877 - 2263261**

**సమయం: ఉ॥ 8-30 నుండి 9-30 గం॥ వరకు**

యాత్రికులకు అపూర్వ అవకాశం! ఏ ప్రాంతం నుంచైనా మీరు నేరుగా కార్యనిర్వహణాధికారితో మాట్లాడవచ్చు!

శ్రీవారి దర్శనం, ఆర్జితసేవలు, వసతి సౌకర్యం తదితర విషయాలపై మీ సలహాలు, సూచనలు, సమస్యలు అన్నీ నేరుగా తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో మాట్లాడండి. సలహాలు ఇవ్వండి! సూచనలు చెయ్యండి!!

ఈ అవకాశాన్ని అందరూ ఉపయోగించుకోండి! **వ్యక్తిగత విషయాలు కాకుండ పదిమందికి ఉపయోగపడే ప్రశ్నలే వేయండి.**

**తి.తి.దేవస్థానం యాత్రికులకు మరింత సమర్థవంతంగా సేవలు అందించేందుకు మీ సూచనలివ్వండి.**

# షోడశోపచార విశిష్టత

- డా॥ ఎస్.పూర్ణవల్లి, తిరుపతి

భగవంతునిపట్ల తైలధారలాగా అవిచ్ఛిన్నంగా ప్రవహించే ప్రేమభావనే భక్తి. సాధారణ ప్రేమకాక - ఇది పరమప్రేమరూపంలో ఉంటుంది. భగవంతుణ్ణి నిరంతరాయంగా సేవించడమే, భావించడమే భక్తి. సేవలే ఉపచారాలు. వీటిల్ని అనేకవిధాలుగా ఆయా సంప్రదాయాలవారూ, ఆగమాలవారూ పేర్కొన్నారు. ఉపచార మంటే సమ్మానం, సేవ-అని అర్థాలు. భక్తి ప్రపత్తి గౌరవపూర్వకంగా ఒక పద్ధతిలో భగవంతుణ్ణి సేవించడం ఉపచారం. ఉప=సమీపంలో; చారః= చరించడం. అంటే భగవంతునికి సమీపంలో ఉండి, ఆ దివ్యమూర్తికి చేసే సేవలే ఉపచారాలు. భక్తుడు భగవంతుని అనుగ్రహాన్ని పొందడానికి అవసరమైన సేవలే ఉపచారాలు. మానవ జీవిత లక్ష్యమైన భగవత్ ప్రాప్తికి ఉపచారాలు చక్కగా ఉపకరిస్తాయి. ఉపచారాలు చేసేటప్పుడు నిశ్చలచిత్తం, నిర్మలహృదయం, నిండు భక్తీ ఉండాలి. "**అన్యస్మాత్ సౌలభ్యం**" అని భక్తిసూత్రాలు- భగవత్ప్రాప్తికి భక్తికి మించిన సులభ పరమోపాయం మరొక్కటి లేదన్నాయి. భక్తిశాస్త్రాలూ, మహాభక్తులూ భగవంతుని భక్తి ప్రియత్వాన్నీ, భక్తవశత్వాన్నీ, ప్రశంసించారు. కలికాలంలో భక్తి మార్గమే పరమసులభం! ముక్తికి భక్తి నిరపాయసోపానం.

ఉపచారాలు-పంచోపచారా లనీ, దశోపచారా లనీ, చతుష్షష్టి ఉపచారా లనీ(64), షోడశ(16) ఉపచారా లనీ-ఇలా అనేక విధాలుగా ఉన్నాయి. వీటిల్లో షోడశోపచారపూజా విధానం సుప్రసిద్ధం. దేవత లందరికీ ఈ 16 ఉపచారాలతో చేసే పూజా విధానం సర్వత్ర ఆచరణలో ఉంది. ఏలోటుపాట్లూ లేకుండా భక్తిపూర్ణమైన హృదయంతో భక్తుడు సదా ఉపచార పరుడు కావాలి. ఉపచారాలవల్ల హృదయం భక్తిపూర్ణమై, ముక్తికికూడ సాధనమౌతుంది.

కర్మాతీతస్థితి సిద్ధించడానికి నిష్కామకర్మనిష్ఠ చాలా అవసరం. ఇహపరాల్లో ముక్తుడై ఉండటంకోసమే భక్తుడు నిష్కళంక చిత్తంతో, నిష్కాముడై భగవత్ ప్రీతికొరకై భగవంతుణ్ణి పూజించడమే షోడశోపచారవిశిష్టత. ఎన్నివిధాల ఉపచారాలున్నా- షోడశోపచార పూజావిధానం మాత్రం సర్వత్ర ఆమోద యోగ్యమూ, ఆచరణసాధ్యమూ అయి ఉన్నది. అష్టోత్తరశత సంఖ్యకు (108) ఎంత ప్రాముఖ్యం ఉందో, షోడశ (16) సంఖ్యకూ అంతే ప్రాముఖ్యం ఉంది.

షోడశనామాలూ, షోడశ ఆయుధాలూ, షోడశచంద్ర కళలూ, మొదలగునవి-షోడశసంఖ్యాకాలు మన వాఙ్మయంలో కోకొల్లలు.

భగవంతుని ఉపచారాల్లోకూడ షోడశోపచారాలు విశిష్టస్థానాన్ని ఆక్రమించుకొన్నాయి. అయితే ఇందులో సంప్రదాయ భేదా లున్నాయి. సాలగ్రామాదిస్థిరమూర్తులకు ఆవాహన, విసర్జనాలు ఉండవు. సాలగ్రామాల్లో, స్వయంభూ మూర్తుల్లో భగవంతుడు నిత్యమూ సన్నిహితుడై ఉంటాడు. ఇలా ఆయా సన్నివేశాల్నిబట్టి ఈ ఉపచారాలక్రమంలో భేదాలు వచ్చాయి. ఏవి ఎలా ఉన్నా మొత్తంపై ఉపచారాలు మాత్రం 16 గానే అర్చనల్లో నెలకొన్నాయి.

**"పాద్యం, అర్ఘ్యం, ఆచమనం, స్నానం, వస్త్రం, భూషణాలు, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం-(ఈ నైవేద్య సమయంలోనూ ఆచమనం ఉంటుంది.) తాంబూలం, అర్చనం, స్తోత్రం, తర్పణం, నమస్కారం"-** ఇవి ఒక సంప్రదాయంలో భగవంతునికి చేసే షోడశోపచారాలు.

కొన్ని సంప్రదాయాల్లో-**"ఆవాహనం, ఆసనం,పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, అభిషేకం, వస్త్రం, యజ్ఞోపవీతం, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, ప్రదక్షిణం, నమస్కారం"**-అని ఈ ఉపచారాలు ఉన్నాయి. ఎక్కువగా వాడుకలో ఉన్నవి - ఈ ఉపచారాలే!

అక్షరామృతం [17]

కలియుగప్రత్యక్ష దైవమైన శ్రీవేంకటేశ్వరస్వామికి సంపూర్ణశరణాగతుడై తన యావజ్జీవితాన్ని ధారపోసిన వాగ్గేయ కారుడు తాళ్లపాక అన్నమాచార్యులు–కీర్తించిన **"షోడశకళానిధికి షోడశోపచారములు, జాడతోడ నిచ్చలును సమర్పయామి"** అనే కీర్తన ఈ ఉపచారపూజకు ప్రసిద్ధికాంచింది.

ఈ షోడశోపచారక్రమాన్నీ, తదాచరణవిధానాన్నీ, ఫలాల్నీ సంగ్రహంగా తెలుసుకొందాం.

సూర్యోదయాత్పూర్వం బ్రాహ్మీకాలంలో భగవన్నామ స్మరణతో నిద్రనుండి లేచి, స్నానంచేసి, శుభ్రమైన వస్త్రాలు ధరించి, ముఖానికి వారివారి సంప్రదాయాన్ని అనుసరించి తిరునామం, విభూతి, కుంకుమ ధరించి, ఇష్టదేవతను స్మరిస్తూ, పూజామందిరంలో ప్రవేశించాలి. పూజామందిరాన్ని కడిగి, శుభ్రంగా తుడిచి, మందిరం మధ్యలోనూ, ముంగిటా ముగ్గులు వేయించాలి. దీపస్తంభాలకు పసుపు కుంకుమలు పెట్టి, దీపా రాధనచేసి, పిదప దేవుని పటాలకు పసుపు కుంకుమలు, పూలూ పెట్టి నమస్కరించాలి. చిన్నచాపపై కానీ, పీటపైనకానీ కూర్చొని, పూజ ప్రారంభించాలి.

పూజకొరకై పంచపాత్రలు (ఐదు), ఒక కలశం చెంబూ నీళ్లతో నింపి ఉంచాలి. కలశంలో ఒక ఉద్ధరణి ఉంచాలి. పంచపాత్రలలో మొదటిది అర్ఘ్యానికీ, రెండవది పాద్యానికీ, మూడవది ఆచమనీయానికీ, నాల్గవది స్నానీయానికీ, ఐదవది సర్వార్థతోయానికీ కాగా, మరొకపాత్ర పరిగ్రహణానికి వాడాలి. అర్ఘ్యపాద్యాదులకు స్వామికి చూపించిన నీరు–ఆరవదైన పరి గ్రహణపాత్రలో వేయాలి. ఈ జలాన్ని పూజానంతరం తీర్థంగా స్వీకరించాలి.

**"ఓం అచ్యుతాయనమః, ఓం అనంతాయనమః, ఓం గోవిందాయనమః"** అని స్మరిస్తూ, మూడుమార్లు ఉద్ధరణితో కుడి అరచేతిలోనికి వేసుకొని, పెదవులకు తగులకుండా స్వీకరించాలి. ఇలా చేయడంవల్ల మన శరీరం, నోరూ, మనస్సూ పరిశుద్ధమై, మనం దేవుణ్ణి పూజించడానికి అర్హులం అవుతాము. ఇక పైన పేర్కొన్న ఆయా సంప్రదాయ షోడశ ఉపచారాలతో భగవత్పూజ నిర్వహించాలి.

**ఆసనం:** దేవతా విగ్రహాన్నికానీ, చిత్రపటాన్నికానీ ఒక పీటపై పుష్పాలంకరణంతో నెలకొల్పాలి. (వెండి సింహాసనంకూడా సిద్ధం చేసుకోవచ్చు.)

**ఘంటానాదం:** దుష్టశక్తులు పోవడానికి, దేవతలు రావడానికి ఘంట వాయించాలి. పంచేంద్రియాలలో ఒకటైన చెవికి ఈ శబ్దాన్ని వినడం ఒక విధమైన వ్యాయామంగానూ, చంచల మనస్సును ఏకాగ్రం చేయడానికీ, ఈ ఘంటానాదప్రక్రియ తోడ్పడుతుంది. దుర్భావాలే రాక్షసులు. సద్భావాలే దేవతలు. సద్భావాలతో కూడిన మనస్సుతో చేసే పూజలే సత్ఫలా లిస్తాయి.

శబ్దం–ధ్వని, నాదం అని రెండు విధాలు. ధ్వని– ఒక్క మారు వినిపించి, ఆగిపోతుంది. నాదం–అవిచ్ఛిన్నంగా విన్పించే శబ్దం. నాదంలో న=ప్రాణం; ద=అగ్ని; కాగా ప్రాణాగ్నుల సంయోగమే నాదం. ఈ నాదం ఆహతం, అనాహతం–అని రెండు విధాలు. ఆహతనాదమంటే చెవులకు స్పష్టంగా విని పించేది. ఇది శ్రావ్యమై రసానుభూతినీ, ఆనందాన్నీ కల్గిస్తుంది. అనాహతనాదం నిశ్చలమనస్కులై యోగశక్తి కలవారికి మాత్రమే అనుభవైకవేద్యం. ఇది ముక్తిదాయకం. ఇందువల్లనే దేవతార్చనలో ముందుగా ఘంటానాదప్రక్రియ ఏర్పడింది. మన దేవాలయాలలోనేకాక, క్రైస్తవ, జైన, బౌద్ధ సంప్రదాయంలోనూ, మందిరాలలో, ఘంటానాదప్రక్రియ ఉన్నది.

**స్వాగతం (ఆవాహనం):** భగవంతుణ్ణి ధ్యానించడంద్వారా ఆయనకు స్వాగతం పలికిన ట్లవుతుంది. సాలగ్రామపూజలో భగవంతుని నిత్యసాన్నిధ్యం కారణంగా ఆవాహనస్వాగతాలు ఉండవు.

**అర్ఘ్య, పాద్య, ఆచమనీయాలు:** భగవంతుని హస్తాలకు ఉపయో గించు జలం–అర్ఘ్యం. ఈ జలంలో అష్ట అర్ఘ్యద్రవ్యాలు ఉపయోగించా లని ఆయుర్వేదం పేర్కొనింది. అవి– దర్భలూ, అక్షతలూ, నూగులు, వడ్లు, యవలు, మినుములు, కొఱ్ఱులు, తెల్లఆవాలూ, ఇవన్నీ కలిపిన జలం అర్ఘ్యానికి ఉపయోగించాలి.

దేవుని పాదాలు కడుగుటకు ఉపయోగించు సుగంధి జలం పాద్యం. ఇందులో పద్మం, విష్ణుక్రాంత, నల్లచామలూ, గరిక, అనేవి వేయాలి. నేలఉసిరికకూడ వాడవచ్చు. ఇవి

పాద్యద్రవ్యాలు. దేవునిముఖశుద్ధికై ఉపయోగించే సుగంధి జలం– ఆచమనీయం. ఇందులో ఏలకులూ, లవంగాలూ, వట్టివేరూ, తక్కోలం, (కర్పూరపుబెండ) ఉపయోగించాలి. శ్రీ వేంకటేశ సుప్రభాతంలో **"ఏలా లవంగ ఘనసారసుగంధితీర్థం"** అని ఉన్నది. స్నానీయానికి (అభిషేకానికి) పచ్చకర్పూరం, వట్టివేరూ, తక్కోలం, ఏలకులూ, లవంగాలూ – కలిపిన జలం ఉపయోగించాలి.

స్నానంలో పంచామృతస్నానమూ ఉంది. ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి, తేనె, టెంకాయనీళ్లూ – వాడతారు. కొందరు పాలు, పెరుగు, నెయ్యి, తేనె, చక్కెర మరియు టెంకాయనీళ్లూ వాడతారు. ఇవి సంప్రదాయభేదాలు. పంచామృతాలు దేహానికి తుష్టినీ, పుష్టినీ, అనేక పోషకపదార్థాలనూ సమకూరుస్తాయి. ఏలా లవంగ ఘనసార(పచ్చకర్పూరం) మిశ్రితమైన తీర్థాన్ని స్వీకరించడంవల్ల ఆరోగ్యం, తేజస్సూ, ఓజస్సూ, సకల సంపదలూ, కీర్తిప్రతిష్ఠలూ, లభిస్తాయి. శ్రీవారి పాదతీర్థసేవనం ఇహపరానందదాయకం.

**పంచామృతంలో–పాలు:** సమగ్రమైన పోషకపదార్థాలున్న పదార్థం గోక్షీరం ఒక్కటే! ఆవుపాలలో ఓజస్సునూ,ధారణాశక్తినీ, శుక్రాన్నీ వృద్ధి చేసే గుణం ఉంది. శ్రమనూ, భ్రమనూ, మదాన్నీ, శ్వాసకాసల్నీ, ఆకలిదప్పికలనూ, జ్వరాన్నీ, రక్తపిత్తాన్నీ తగ్గిస్తాయి. ఆయువు పెరుగుతుంది. శిశుమరణాలు తగ్గుతాయి. పాలలో ఉండే కాల్షియం, భాస్వరం, 'ఏ' విటమిన్లవల్ల ఎముకలకు పుష్టికల్గుతుంది. గుండె బలపడుతుంది. క్రమంగా అన్ని అవయవాలకూ పుష్టి చేకూర్తుంది.

**పెరుగు (దధి):** పెరుగు మేధాశక్తినీ, వీర్యాన్నీ, పెంచుతుంది. పైత్యాన్ని తగ్గిస్తుంది. దేహానికి పుష్టి నిస్తుంది. వాతాన్ని హరిస్తుంది.

**నెయ్యి(ఆజ్యం):** ఆరోగ్యాన్నీ, ఆయువునూ పెంచే పదార్థాలలో నెయ్యి నిజంగానే అమృతం. దేవతలకు ఆజ్యమే (నెయ్యి) ఆహారం. వారికి ఆప్యాయనం కల్గించేది–నెయ్యి. నేతిని అన్నం మీద అభిఘరించుకొని, పంచాహుతులు స్వీకరించడంద్వారా ఉదరంలో ప్రకోపించివున్న వాయువు శాంతించి, ఆరోగ్యాన్నీ, జీర్ణశక్తినీ పెంచుతుంది.

**తేనె (మధువు):** తీపి, వగరు కల్గిన తేనె మంచిది. దీని రంగు ఒక ప్రత్యేకమైనది. మంచి రుచికల్గిన పదార్థం. కురుపుల్ని మాన్పడంలో, ఎముకల్ని అతికించడంలో, క్రొవ్వును కరిగించి, హృదయానికి మేలుచేకూర్చడంలో, వాక్‌శక్తిని పెంచడంలో తేనె మేలైన ఆహారపదార్థం. ప్రకృతి ఇచ్చిన మహాశక్తిమంతమైన రసాయనం–తేనె.

**టెంకాయ నీళ్లు:** (నారికేళజలం) రుచిగా, శుచిగా ఉంటాయి. చలవచేస్తాయి. దాహాన్ని తగ్గిస్తాయి. జఠరాగ్నిని పెంచుతాయి. బలాన్ని కల్గిస్తాయి. అనేకరోగాల్ని శాంతింపజేసే మహాగుణాలు టెంకాయ నీళ్లలో ఉన్నాయి.

**శుద్ధోదకం:** పంచామృతస్నానానంతరం దేవునికి శుద్ధోదకస్నానం చేయిస్తారు. దేవుణ్ణి వట్టినీళ్లతో అభిషేకించరు. అందులో తులసీదళాలూ, పచ్చకర్పూరం, వట్టివేరూ, శ్రీగంధం, మొదలయినవి కలిపే ఉపయోగిస్తారు. ఏది లేకున్నా–కనీసం తులసీపత్రాలైనా అభిషేకజలంలో ఉంచాలి. ఇలా సిద్ధంచేసిన, మహత్తర ఓషధీగుణాలు కల్గిన పవిత్రజలాన్ని–దక్షిణావర్త (కుడివైపునకు సుడి తిరిగివున్న) శంఖంతో స్వామివారి అభిషేకానికి ఉపయోగిస్తారు. **'శంఖంలో పోస్తేనే తీర్థం'** అనికదా ప్రసిద్ధి! శంఖం లక్ష్మీస్వరూపం. శ్రీవారికి పూజాభిషేకాలు చేసే అధికారం లక్ష్మికే ఉన్నహక్కు. కనుక లక్ష్మీముఖాంతరంగా మనం స్వామిని శంఖజలంతో అభిషేకించాలి. ఇట్టి దివ్యతీర్థాన్ని భక్తితో స్వీకరించేవారు ఆరోగ్యవంతులై ఉంటా రని పరమపురుషసంహిత పేర్కొనింది.

**గంధం,వస్త్రం,ఆభరణాలు:** అభిషేకానంతరం దేవతామూర్తిని తెల్లని, మెత్తని శుభ్రమైన వస్త్రంతో శుద్ధిచేయాలి. పిదప, వస్త్రద్వయం, యజ్ఞోపవీతం, గంధం, అక్షతలూ సమర్పించాలి. వస్త్రం, యజ్ఞోపవీతం ప్రతిరోజూ ప్రత్యక్షంగా సమర్పించక పోయినా–మంత్రపూర్వకంగా–సమర్పిస్తున్న భావనతో–చేస్తే కూడా స్వామి సంతోషిస్తాడు. గంధాక్షతలుమాత్రం తప్పక ప్రతిరోజూ పూజలో అర్పించాలి. (వ్యవహారంలో 'అక్షింతలు'– అంటుంటారు. ఇది తప్పు. **"అక్షతలు"** అనే చెప్పాలి.)

**ధూపదీపాలు:** ధూపసమర్పణకు సాంబ్రాణి, దశాంగం, గుగ్గిలం, పాల్మడి మొదలైన సుగంధవస్తువులను వాడాలి. వీటి పొగ, వాసన వాతావరణకాలుష్యాన్ని నివారించడమేగాక, అనేక

రోగకారకసూక్ష్మ జీవుల్ని నశింపజేస్తాయి. దీపానికి ఆవునెయ్యి, నువ్వులనూనె శ్రేష్ఠం. ఆవునెయ్యితో వెలిగించిన దీపంపొగ, వాసన శ్వాసకోశవ్యాధుల్ని నివారిస్తుంది. దీనికాంతి కంటికి చాలామంచిది. ఔషధంగా మేలుచేస్తుంది.

**తులసి, బిల్వం పుష్పాలు:** దేవునిపూజకు తులసి, మారేడు (బిల్వం), మంచివాసనగల పూలూ వాడాలి. ఏ రోజు కోసిన పూలూ, పత్రాలూ ఆనాటిపూజకు ఉపయోగించాలి. పూజా సమయంలో అవకాశాన్నిబట్టి, సహస్రనామావళితో కానీ, అష్టోత్తరశతనామావళితో కానీ, చతుర్వింశతి(24) నామావళితో కాని భగవంతుణ్ణి పత్రపుష్పాలతో పూజించాలి. భగవంతుని దివ్యనామాలను సంస్కృతంలో చతుర్థీ విభక్త్యంతాలు గావించి, నామానికి మొదట **"ఓం"** అనే ప్రణవాక్షరాన్నీ, మధ్యలో నామాన్నీ, నామం చివర **"నమః"** అని చేర్చి, చెప్పుతూ భక్తి శ్రద్ధలతో పూజించాలి. నామం చివర **"ఓం"** ను చేర్చి, చెప్ప రాదు. ఇది మహాదోషం. ఉదా॥ **"ఓం కేశవాయనమః"** అని చెప్పాలికాని, **"కేశవాయనమః ఓం, మాధవాయనమః ఓం"** – అని చెప్పరాదు. **"ఓం కేశవాయనమః"** అంటే నిరాకారుడైన ఓంకారరూపపరమాత్మ– భక్తరక్షణకై కేశవు డనే సాకార మూర్తియైనాడు. అట్టి కేశవునికి నమస్కారం అని అర్థం. నిరాకారంలో నుంచి సాకారం వస్తుంది. **'ఓం'** అన్నపుడు శ్వాసను తీసుకొని, నామాన్ని ఉచ్చరించి, **'నమః'** అన్నపుడు శ్వాసను వదలడం శ్రేయస్కరం.

**మంత్రోచ్చారణం:** మనస్సును రక్షించేదీ, మననం చేసేవారిని రక్షించేదీ మంత్రం. మంత్రాధీనులు దేవతలు. కనుక మంత్రాన్ని స్పష్టంగా, జాగ్రత్తగా, దోషాలు లేకుండా, వేదమంత్రాలైతే స్వర దోషంలేకుండా, చెప్పాలి. అపుడే ఆ మంత్రాలు తేజోవంతాలై, శక్తిమంతాలై మనకు సత్ఫలితా లిస్తాయి. వేదమంత్రనాదాన్ని వినడంవల్ల సూక్ష్మాతిసూక్ష్మాలైన మననాడులు ఒక క్రమ పద్ధతిలో స్పందించి, రక్తప్రసరణను సరైనమార్గంలో ఉంచు తాయి. వేదనాదశ్రవణప్రభావం మహామహిమాన్వితం.

**నైవేద్యం(నివేదన) : 'దేవునికి నివేదించకుండా తింటే మహా పాపం'**అని శాస్త్రం! కనుక ఏ పదార్థాన్నైనా మనం స్వీకరించే టప్పుడు మొదట భగవంతునికి నివేదించి (సమర్పించి), పిదప భగవత్ ప్రసాదంగా మనం భుజించాలి. సాత్త్వికాహారాన్ని మాత్రమే భగవంతునికి నివేదన చేయడం మంచిది. పరిశుద్ధమూ, సాత్త్వికమూ అయిన ఆహారంవల్లనే మనోబుద్ధులు సాత్త్వికాలై–సద్భావాలతో, సత్కార్యాచరణతో ప్రవర్తించి, సుఖ శాంతుల్ని కల్గిస్తాయి. వండి జాముకు పైగా అయినదీ, సరిగా పక్వం కానిదీ, రుచిలేనిదీ, పాసిపోయినదీ, ఎంగిలిదీ, అపవిత్ర మైనదీ, అయిన పదార్థాన్ని భగవంతునికి నివేదించరాదు.

**మంగళహారతి:** మంగళహారతి కర్పూరంతోకానీ, నెయ్యిలో తడిపిన వత్తులతో కానీ చేయాలి. హారతి ఇచ్చేటప్పుడు ఘంట వాయించడం ఒక సంప్రదాయం. కర్పూరకాంతిలో భగవంతుణ్ణి దర్శించడం మహాభాగ్యం! కర్పూరహారతి పొగ, వాసన అన్ని రకాల సూక్ష్మక్రిముల్ని నిర్మూలిస్తుంది.

**ప్రదక్షిణ నమస్కారాలు (వందనం):** దేవతార్చన అయిన తర్వాత కడపటిదిగా ప్రదక్షిణ నమస్కారాలు సల్పాలి. భక్తితో నెమ్మదిగా ప్రదక్షిణం (కుడినుండి ఎడమకు తిరగడం)చేసి, నమస్కరించాలి.

పూజాకాలంలోనూ, ప్రదక్షిణనమస్కారాలు చేసే టప్పుడూ, జపహోమాలు నిర్వర్తించేటప్పుడు అంగవస్త్రాన్ని (పై పంచను), నడుముకు చుట్టుకోవాలనేది సంప్రదాయం. పై పంచను కప్పుకొని పూజాదికం నిర్వహించరాదు. పిదప భగవంతుణ్ణి క్షమాపణ కోర్తూ, ప్రార్థించాలి. అపుడు "నేను చేసిన పూజలోని సకలదోషాలను క్షమించు"మని పలుకుతూ, పూలూ, అక్షతలూ భగవంతుని పాదపద్మాలపై భక్తితో సమర్పించాలి.

అష్టోత్తరశతనామావళితో స్వామిని పూజించినట్లే, షోడశోపచారాలతో భగవంతుణ్ణి సేవిస్తాం. ఆరాధిస్తాము. చంద్రుడు షోడశకళలతో నిండివున్నపుడే పరిపూర్ణుడై ఉంటాడు. అట్లే భగవంతుని ఆరాధనకూడా షోడశోపచారాలతో నిర్వహించి నపుడే పరిపూర్ణతను పొందుతుంది.

పంచభూతాలూ, పంచప్రాణాలూ, పంచేంద్రియాలూ, మనస్సూ–కలిసి 16 తత్త్వాలు. ఈ తత్త్వాల సమన్వయసిద్ధియే షోడశోపచారాత్మక పూజావిధానంలోని ఆంతర్యం!

**"ఏ ఉపచారం చేసినా భక్తి లేకపోతే,
అపచారమే అవుతుంది."**

క్రింద పేర్కొన్న తి.తి.దే. గ్రంథాలు లభించే చిరునామా :
పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తి.తి.దేవస్థానం,
తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083.
ఇతర వివరాలకు : 0877 - 2264294

తిరుమల తిరుపతి దేవస్థానముల....

# పుస్తక పరిచయం

[ 7 ]



## తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథాలు

### 1) తిరుప్పావై - సప్తపదులు

అనువాదకులు- శ్రీనివాసగురుడు,
వేటూరి ప్రభాకర శాస్త్రి

సైజు: 1/16 డెమ్మీ; పుటలు: 64;
మూల్యం: రూ.12/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.10/-)

హైందవ సమాజ పునరుద్ధరణకు, వైష్ణవ సిద్ధాంత వ్యాప్తికి అవిరళ కృషి చేసిన వారిలో అగ్రగణ్యులు ఆళ్వారులు. వీరిలో ఒకేఒక మహిళా మణిపూస గోదాదేవి. ఈమె తనకు పెళ్లంటూ జరిగితే అది శ్రీరంగనాథునితోనే అని నిశ్చయించుకుని స్వామి వాల్లభ్యంకోసం పూర్వం గోపికలు ఆచరించిన కాత్యాయనీ వ్రతంలాంటి వ్రతం 'తిరుప్పావై' వ్రతం మార్గశిరమాసంలో అనుష్టించింది. ఈమె రచించిన 30 పాశురాల దివ్య ప్రబంధమే 'తిరుప్పావు'. వీటిని శ్రీనివాస గురుడు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిలు అనువదించారు. 1965లో అచ్చయిన ఈ గ్రంథాన్ని దేవస్థానం పాఠకుల కోసం ఇటీవల పునర్ముద్రించింది.

### 2) సూక్తి వైజయంతి

రచన- డా॥ వానమామలై వరదాచార్యులు
సైజు: 1/8 డెమ్మీ;
పుటలు: 127;
మూల్యం: రూ.35/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.25/-)

డా॥ వానమామలై వరదాచార్యులవారు సరళసుందర పదాలతో దేశీయములైన తేటగీతి, ఆటవెలది, కంద పద్యాలలో చెప్పిన సుభాషితాలే ఈ 'సూక్తి వైజయంతి'. ఇది రెండు విభాగాలతో కూడి ఉంది.

మొదటి విభాగం-త్రివర్గానికి సంబంధించినది అనగా ధర్మార్థ, కామాలకు సంబంధించిన విషయాలు గలది. ఇందులో సూక్తి మహిమ, దైవప్రార్థన, ధర్మమహిమ, విద్యామహిమ తదితర శీర్షికలతో కూడి ఉంది. రెండవ విభాగం-అపవర్గకాండము. ఇది ముక్తి విషయకం. ఈ కాండలో ఈశ్వరుడు, జ్ఞానవైరాగ్యాలు తదితర శీర్షికలతో ఈ విభాగం విలసిల్లుతున్నది.

ఈ గ్రంథాలను పోస్టుద్వారా పొందదలచిన వారు 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారి పేరున డి.డి.ని తీసి పై చిరునామాకు పంపాలి.

గ్రంథసమీక్ష

# పురుషోత్తమనామ సహస్రమ్

**(భగవల్లీలా నామావళి రూప సంక్షిప్త భాగవతము)**

**రచన - మూలం -** శ్రీ మద్వల్లభాచార్య మహాప్రభువులు; **తెలుగు అనువాదం -** శ్రీ బలిజపల్లి వేంకట శ్రీరామచంద్ర మూర్తి; **సైజు**-1/8 డెమ్మీ; **పుటలు**-382; **వెల**-రూ. 150/-; **ప్రతుల ప్రాప్తిస్థానం :** డా॥ బి.వి.ఎస్.ఆర్. మూర్తి, సిద్ధార్థ నగర్, ఇంటినెం. 8-3-169/65, హైదరాబాదు-38, సెల్: 94901 05506.

శ్రీమద్వల్లభాచార్యులవారు తమ శుద్ధాద్వైత సిద్ధాంత నిరూపణకు, పుష్టిమార్గబోధనకు, ప్రస్థానత్రయముతో పాటు భాగవతమును ప్రమాణగ్రంథంగా ఎన్నుకున్నారు. శ్రీమద్భాగవతములోని పన్నెండు స్కంధములలో వర్ణింపబడ్డ భగవల్లీలలను ఏర్చి, కూర్చి 1075 లీలానామముల రూపంలో 256 అనుష్టుప్ ఛందో శ్లోకములలో శ్రీ పురుషోత్తమనామ సహస్ర మనే పేరుతో ఆచార్యులవారు గ్రంథం రచించారు.

ఈ పురుషోత్తమనామ సహస్రమునకు శ్రీ మద్రఘునాథులు వ్రాసిన 'నామచంద్రిక' అనే సంస్కృత వ్యాఖ్యకు శ్రీ బలిజపల్లి వేంకట శ్రీరామచంద్రమూర్తిగారు తెలుగు అనువాదం చేశారు. ఈ అనువాదం చాలా చక్కగానున్నది. భాషలోనూ, భావంలోనూ తెలుగుదనం ఉట్టిపడుచున్నది. అక్షరదోషాలు లేకుండా ముద్రణలో తీసుకొన్న జాగ్రత్తలు బహుధా ప్రశంసనీయము. గ్రంథపరిచయం, శ్రీమద్వల్లభాచార్యులవారి సంక్షిప్త జీవితచరిత్ర, విషయ సూచిక గ్రంథ ఔన్నత్యాన్ని పెంచుతున్నాయి. శ్రీ వల్లభాచార్య కృత 'శ్రీ పురుషోత్తమనామ సహస్రమ్-మూలాన్ని శ్రీ మద్రఘునాథులు వ్రాసిన 'నామచంద్రికా' సంస్కృత వ్యాఖ్యకు తెలుగు అనువాదాన్ని ఈ గ్రంథంలో చదివి దేవదేవుడైన పురుషోత్తముని కృపాకటాక్షాలకు పాత్రులవుతారని భావించవచ్చు.

**- డి. సరళ, తిరుపతి**

# ధర్మజిజ్ఞాస

**(ధార్మిక సందేహాలు - సమాధానాలు)**

**రచన**- పి.భాస్కరయోగి; **పుటలు**-252; **వెల**-రూ. 100/-; **ప్రాప్తిస్థానం:** 1) పి.భాస్కర యోగి, ఇ.నెం. 2-2-70/408, ప్రజయ్ ఎవెన్యూ-1 అంబర్ పేట్, హైదరాబాదు-13, సెల్: 90001 22998. 2) భీంపల్లి శ్రీకాంత్, ఇ.నెం. 8-5-10/2, టీచర్స్ కాలని, పాలమూరు - 509 001, సెల్: 98850 46622.

హిందూమత సంస్కృతి హిందూ మహాసముద్రమంత పెద్దది. చతుర్వేదాలు, అష్టాదశ పురాణాలు, రామాయణ భారతాలు, ఉపనిషత్తులు మొదలగు అనేక గ్రంథాలు మన హిందూ సంస్కృతిని సుసంపన్నం చేశాయి.

పురాణాది గ్రంథాలు చదివినపుడు పండితులతో బాటు, పాఠకులకు, శ్రోతలకు ఎన్నో సందేహాలు పొడసూపుతాయి. వాటిని నివృత్తి చేసుకునే మార్గం కోసం తిరిగి పండితులను ఆశ్రయించాలి. అయితే అన్ని సందేహాలను పండితుల ద్వారా నివృత్తి చేసుకోవడం కూడా చాలా సందర్భాల్లో అసాధ్యమని చెప్పాల్సి ఉంటుంది. ఈ సమస్యను గుర్తించి పి.భాస్కరయోగి ధర్మజిజ్ఞాస పేరుతో 261 ధార్మిక సందేహాలకు పురాణాలాధారంగానే చక్కని సమాధానాలిచ్చారు. ఇవి సందేహాలకు సమాధానాలు మాత్రమే కాదు. గొప్ప ఆధ్యాత్మిక కళాఖండాలు.

ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివితే హిందూమత గ్రంథాలన్నీ చదివినంత పరిజ్ఞానం కలుగుతుంది. చదివిన వారికి చక్కని తార్కిక, తత్త్వ, సవిమర్శక జ్ఞానం కలుగుతుందనుటకు సందేహించాల్సిన అవసరం లేదు. శ్లోకాలు, దానికి చక్కని తెలుగువ్యాఖ్యానం పాఠకులను చదివింపజేస్తుంది. ఆమూలాగ్రం చదివించే విధంగా శైలి ఉంది.

పారిభాషిక పదాలు, సచిత్ర వ్యాఖ్యానాలు ఉండడం ఈ గ్రంథం యొక్క మరో ప్రత్యేకత. ఈ గ్రంథం ప్రతి ఇంట తప్పనిసరిగా ఉండదగింది.

**- డా॥ కె.రెడ్డెప్ప, నెరబైలు**

బాలప్రబోధం



# ఆలోచన ఆచరణకు రాకుంటే...?

- వేదుల శ్యామలాదేవి, పెద్దాపురం

అనగనగా ఓ రాజ్యం. ఆ రాజ్యానికి రాజు ధవుడు. అతను సత్యవ్రతుడు. ధర్మనిరతుడు. న్యాయమూర్తి. గొప్ప వీరుడు. కార్యశూరుడు. చక్కని పరిపాలనాదక్షుడు. అతని రాజ్యంలో ప్రజలు సుఖసౌఖ్యాలతో వర్ధిల్లేవారు.

ఆ మహీపాలుని మదిలో తన రాజప్రాసాదావరణలో మామిడి మొక్కను స్వయంగా నాటి, దడి కట్టి, నీరుపోసి పెంచి, అది పుష్పించి ఫలిస్తే, ఆ మధురఫలాల్ని శ్రీనివాసుడికి నైవేద్యము పెట్టి, భుజించాలన్న బలీయమైన ఆలోచన ఉండేది. కానీ.. ఆ యోచన, అతని ప్రజాసేవలో వాయిదా పడుతూ వచ్చింది. చిత్రం! అంత ముమ్మర సేవాకార్యక్రమాల్లో ఉన్నా అతన్ని ఆ ఆలోచన మాత్రం వీడలేదు. ఆ మొక్క నాటినట్టు, దాని ఫలాలు, ఆ శ్రీమన్నారాయణునికి కైంకర్యం చేసినట్లు కలలు గనేవాడు.

ఓ రోజు ధవుడు భటులను రప్పించి, మొక్క విషయం విశదపర్చాడు. అందుకు తగిన మొక్కను తెమ్మని పొరుగు రాజ్యానికి పంపాడు. రాజాజ్ఞ శిరసావహించి, పొరుగు రాజ్యం పోయి, నాల్గుదినాలు గడవక ముందే ఒట్టి చేతుల్తో తిరిగి వచ్చారు. రాజు విషయం అడిగాడు. “మహాప్రభూ! ఆ మొక్కల అమ్మకాలు మొన్నటి వర్ష ఋతువులోనే ముగిశాయట. వచ్చే ఏడాది ఆ ఋతువులోనే మరలా విక్రయాలట” అని సెల విచ్చారు. ఆ తర్వాత

.ప్రజాహిత కార్యకలాపాల నడుమ ఎన్నో వర్షఋతువులు వెళ్ళిపోయాయి. మొక్కనాటే ఆలోచన మాత్రం ధవుడి హృదయాన్ని కుదుపుతూనే ఉంది. ఆ నడుమ కాలం మరింత ముందుకు దొర్లింది.

క్రమంగా ధవుడికి వయసుపైబడింది. రాజ్యపాలనావధి కూడా ముగిసింది. కాస్త స్వేచ్ఛ కూడా లభించింది. అలా స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ, అతడు మొక్కకై పొరుగురాజ్యం బయలుదేరాడు. అనేక దుర్గాలు, వనాలు, దాటుతూ, దారిన గల మామిడి చెట్లను వాటికి పండిన పండ్లను మైమరపుగా తిలకిస్తూ ఓ ప్రాంతం చేరాడు.

అక్కడ కాసేపు విశ్రమించి, పిదప ప్రయాణం సాగించాడు. ఈసారి మొక్క నాటే తీరాలి అన్న ధృఢ సంకల్పంతో మొక్కల విక్రయశాలకు వెళ్ళాడు. బోలెడు నాణేలు వెచ్చించి, మధురఫలం మొక్క కొనుగోలు చేసి, ద్విగుణీకృత ఉత్సాహంతో తిరుగు ప్రయాణమయ్యాడు. కాస్త అలసి మార్గ మధ్యంలో విడిది చేశాడు. చిత్రం! అక్కడ అతన్ని అకాలమృత్యువు కాటేసింది. కథ ముగిసింది. కానీ.... ధవుడి కథ ముగింపు వెనుక ఎన్నో సూక్ష్మ అంశాలు దాగి ఉన్నాయి. అవి ఏవనగా..

ప్రజాసేవప్రాముఖ్యతలో స్వకార్యయోచన జోడించుకోలేకపోయాడు. దానికి ఇవ్వవలసిన ప్రాముఖ్యతను ఊపుని చేకూర్చుకోలేదు. కాలం ఇంకా ఉందిగా? అన్న ధీమాలో కొట్టుకుపోయాడు. కాలం విలువైందని, అది కరిగితే తిరిగి రాదని, దాని వెంట యోచనలను పరుగెట్టించాలని అనుకోలేదు.

రేపటి పనిని ఇవాళే చెయ్యి. ఇవాల్టిపని ఇప్పుడే చెయ్యి. లేకుంటే క్షణంలో ఏ ప్రళయం వచ్చి నిన్ను లాక్కుపోతుందో! ఎవరికి ఎరుక! అన్న కబీరు సూక్తిని పెడచెవిని పెడితే వచ్చే అనర్థం ఎంత ప్రమాదహేతువో గదా!

**ఒక మంచి ఆలోచన ఆచరణకి రాకుంటే,**
**ఏమౌతుందో ధవుడి కథే ఉదాహరణ కదూ!**

**దుర్జనులతోడి స్నేహం ప్రాతఃకాలపు నీడలాగా**
**మొదట పెద్దదిగా ఉండి క్రమంగా క్షీణిస్తుంది.**
**సజ్జనులతోడి సహవాసం సాయంకాలపు నీడలాగా**
**మొదట చిన్నదిగా ఉన్నా తర్వాత**
**క్రమంగా వృద్ధి పొందుతుంది.**




# భక్త వాత్సల్యం

- శిష్టా వేంకటదుర్గ శివరామకృష్ణ,
హైదరాబాదు

ఇటీవల నేను, నా భార్యాబిడ్డలతో తిరుమల చేరుకోవడం జరిగింది. ఆ రోజు సాయంత్రం జరిగిన స్వామివారి లీల ఇలా ఉంది.

స్థానిక టిఫిన్ సెంటర్‌లో టిఫిన్ చేసిన తరువాత చేతులు కడుక్కుని జేబు రుమాలు తీసి తుడుచుకుంటుండగా అదే జేబులో ఉన్న రూ. 3,000/-లు నగదు, బ్యాంక్‌కార్డు నాకు తెలీకుండానే కిందపడి పోవడం జరిగింది. ఇది గమనించకుండా మేము తిరిగి వసతి గృహానికి వెళ్ళబోతుండగా ఒక బాలుడు నన్ను వెనుక నుండి తట్టి డబ్బులు పారవేసుకున్నారు తీసుకోండి అని అందజేశాడు. ఈ లీల జరిగి ఉండకపోతే చేతిలో చిల్లిగవ్వ లేక ఇంటికి తిరిగి ఎలా పోవాలో తెలీక ఎంత బాధపడేవాళ్ళమో ఊహింప శక్యం కానిది. సదా గోవిందనామ స్మరణ ఈ క్షేత్రంలో చేసిన ఫలితంగానే స్వామివారు మా ధనం మాకు తిరిగి ఇప్పించి ఆ ఆపద నుంచి కాపాడి ఆపదమ్రొక్కులవాడనే నామం సార్థకం చేసుకున్నాడనిపించింది.

మరుసటి రోజు ఉదయం తిరుపతికి బస్సులో వచ్చి; తిరిగి మెట్లమార్గం ద్వారా తిరుమలకు వెళుతున్నప్పుడు మార్గ మధ్యంలో మంచినీరు తాగాలని జేబులోని సెల్‌ఫోన్ ప్రక్కన గట్టుమీద పెట్టి, మంచినీరు తాగిన తరువాత సెల్‌ఫోన్ విషయం మర్చిపోయి సుమారు వందమెట్లు ఎక్కిన తర్వాత జ్ఞప్తికి వచ్చి తిరిగి వెనుకకు వచ్చి చూస్తే ఫోన్ కనబడలేదు. మాకు సంబంధించిన వారి ఫోన్ నంబర్లు అన్నీ కూడా అందులోనే ఉన్నాయి. అదీకాక ఆ రోజు రద్దీ కూడా ఎక్కువగా ఉండటంతో ఎంత మందిని విచారించినా తాము చూడలేదనే చెప్పారు. శ్రీవారి దర్శనార్థమై వస్తూ ఉండగా ఈ విధంగా జరగడం చాలా బాధనిపించి ఆ శ్రీనివాసునిపై భారం వేసి తోటి యాత్రికుల వద్ద ఉన్న ఫోన్ తీసుకుని మా నంబరుకు ఫోన్ చెయ్యగా తీసుకున్న వ్యక్తి వెంటనే తాను చాలాదూరంలో ఉన్నానని కొండకు వచ్చిన తర్వాత తిరిగి ఫోన్ చెయ్యమని చెప్పటం జరిగింది. తోటి యాత్రికులు చాలామంది ఇక ఆ ఫోన్ దొరకదని; తీసుకున్నవారు ఇక తిరిగి ఇవ్వరని ఎంతగానో నిరుత్సాహపరచినా, ఆ ఏడుకొండలవాడు తన భక్తులకు తప్పక సహాయం చేస్తాడని గట్టిగా విశ్వసించి; కొండపైకి వెళ్ళి ఆ వ్యక్తిని కలుసుకుని పోయిన సెల్‌ఫోన్ తిరిగి పొందడం జరిగింది. ఫోన్ అందజేసిన వ్యక్తి తి.తి.దే. ఉద్యోగి కావడం మరింత ఆనందాశ్చర్యాలను కలిగించింది. ఈ విధంగా యాత్ర పొడుగునా ఎన్ని ఇబ్బందులు ఎదురైనప్పటికీ స్వామివారు అడుగడుగునా సహాయం చేస్తూ మాకు ఎలాంటి ఇబ్బందీ రాకుండా యాత్ర సఫలీకృతం అయ్యేలాగా చూసి ఆయన దివ్యదర్శనం కనులారా చేసుకునే భాగ్యం కూడా కలిగించడం జరిగింది. అనుక్షణం మా వెన్నంటి ఉండి సదా మమ్మల్ని కాపాడుతున్న కలియుగ ప్రత్యక్షదైవం ఆ ఏడుకొండలవాడు. నమ్ముకున్నవారిని ఆ ఆపదమొక్కులవాడు అనుక్షణం వెన్నంటి ఉండి కాపాడుతాడని మా విశ్వాసం.



**తిరుమలలో భక్తులందరికీ టోకన్లతో నిమిత్తం లేకుండా అన్నదానం జరుగుతున్నది.**

**అన్నాన్ని శ్రీవారి ప్రసాదంగా స్వీకరించండి!**

**దయచేసి వృథా చేయకండి!!**

# జనవరి, 2010
# రాశి ఫలాలు

- జె. చంద్రశేఖరశర్మ, నిజామాబాద్



## మేషం

ఆదాయం : 08 రాజపూజ్యం : 04
వ్యయం : 14 అవమానం : 03

గురువు ఏప్రిల్ 21 వరకు 11వ ఇంట, తదుపరి 12వ ఇంట శని, రాహువు 9వ ఇంట, కేతువు 3వ ఇంట సంచరిస్తున్నారు. ఈ రాశివారికి ఈ మాసంలో వాహన సమస్యలు ప్రమాదాలు, పలు మానసిక ఒత్తిళ్ళ వల్ల ఆందోళనలు కల్గుతాయి. వృథాప్రయాణం, ధనం విపరీతంగా ఖర్చు అవుతుంది. వృత్తి, వ్యాపారాల్లో ఉన్నతయోగం. నూతన కార్య విజయం. అన్యస్త్రీల వల్ల అపనిందలు. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ఆందోళనలు, మూడోవారం వృథా ప్రయాణం, నాలుగోవారం ధనప్రాప్తి.



## వృషభం

ఆదాయం : 02 రాజపూజ్యం : 07
వ్యయం : 08 అవమానం : 03

గురువు ఏప్రిల్ 21 వరకు 10వ ఇంట, తదుపరి 11వ ఇంట శని, ఈ సంవత్సరం అంతా 5వ ఇంట, కేతువు 2వ ఇంట, గురు శని గ్రహాల పరిపూర్ణ బలం వల్ల లక్ష్యసాధనలో ముందుంటారు. ఈ రాశివారికి ఈ మాసంలో మిత్రుల సహకారం, బంధువుల కలయిక మానసిక ఉత్తేజాన్ని ఇస్తుంది. సినీ, టివి, వర్తమాన గాయనీగాయకులకు, పత్రికావిలేఖరులకు సన్మానాలు, మంచి గుర్తింపు లభిస్తుంది. నూతన వ్యాపారాలు, స్వగృహ నిర్మాణ ప్రయత్నాలు అనుకూలిస్తాయి. చేయు వృత్తి, ఉద్యోగాల్లో ప్రమోషన్లు, స్థానచలనం. రాజకీయ మహిళలకు అదృష్టయోగం. మొదటివారం ఆనందం, రెండోవారం దైవ దర్శనం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం స్థానచలనం.



## మిథునం

ఆదాయం : 05 రాజపూజ్యం : 03
వ్యయం : 05 అవమానం : 06

గురువు ఏప్రిల్ 21 వరకు 9వ ఇంట, తదుపరి 10వ ఇంట శని ఈ సంవత్సరమంతా అర్ధాష్టమందు సంవత్సరాది నుండి 2011 వరకు, రాహువు సప్తమందు, కేతువు జన్మమందు, అర్ధాష్టమ శని, ఉన్ననూ గురువు అనుగ్రహం వల్ల కార్యజయం, ఉమ్మడి వ్యాపారాలకు అనుకూలంగా ఉంటుంది. వివాహాది శుభకార్యాలలో పాల్గొంటారు. వెండి, బంగారు వర్తకులకు గడ్డు కాలం. రాజీలేకుండా మహిళామణులకు మంచి రాజకీయ గుర్తింపు లభిస్తుంది. మొదటివారం ధనప్రాప్తి, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ఆందోళన, నాలుగోవారం శుభవార్త శ్రవణం.



## కర్కాటకం

ఆదాయం : 14 రాజపూజ్యం : 06
వ్యయం : 02 అవమానం : 06

గురువు అష్టమందు తదుపరి 9వ ఇంట, శని 3వ ఇంట, రాహువు 6వ ఇంట, కేతువు 12వ ఇంట సంచరించటం వల్ల అన్నీ శుభపరిణామాలు కల్గుతాయి. ఈ రాశివారు ఈ మాసంలో ఏ పని చేసినా అనుకూలంగా ఉంటుంది. అనవసరపు తగాదాలు, కుటుంబంలో కలతలు, పలు అనారోగ్య సమస్యలు మినహా అంతా హాయిగా ఉంటుంది. అవివాహితులకు వివాహాలు ఆలస్యమౌతాయి. మొదటివారం ప్రయత్న జయం, రెండోవారం ఆనందం, మూడోవారం ఆందోళన, నాలుగోవారం వృథాప్రయాణం.



## సింహం

ఆదాయం : 02 రాజపూజ్యం : 02
వ్యయం : 14 అవమానం : 02

గురువు 7వ ఇంట, తదుపరి అష్టమందు శని 2వ ఇంట, కేతువు 11వ ఇంట, ఏల్నాటి శనిప్రభావం ఈ సంవత్సరం ఇబ్బందులకు గురిచేస్తుంది. ఈ రాశివారికి పెండింగ్‌లో ఉన్న కోర్టు పనులు పరిష్కారమైనా అసంతృప్తి మిగులుతుంది. కొత్త మిత్రుల పరిచయాలు ఆనందాన్ని, ఉత్సాహాన్నిస్తాయి. సంగీత, నృత్య కళాకారులకు సన్మానాలు. అధికారులకు ప్రభుత్వ ఆదేశాలు ఒత్తిడికి గురిచేస్తాయి. పిల్లల అనారోగ్యం పెద్దలకు ఆందోళన కల్గిస్తుంది. మొదటివారం ఆనందం, రెండోవారం స్థానమార్పు, మూడోవారం క్షేత్రదర్శనం, నాలుగోవారం ప్రశంసలు, సత్కారాలు.



## కన్య

ఆదాయం : 05 రాజపూజ్యం : 05
వ్యయం : 05 అవమానం : 02

గురువు 6వ ఇంట, తదుపరి సప్తమందు శని, రాహువు అర్ధాష్టమందు, కేతువు 10వ ఇంట ఈ సంవత్సరం ఏల్నాటి శని ప్రభావం అధికంగా ఉంటుంది. ఈ రాశివారికి ఈ మాసంలో గతంలో చేసిన పొరపాట్లను సరిదిద్దుకొని వ్యవహరించుకోవలసి వస్తుంది. నూతన బంగారు ఆభరణ

ప్రయత్నాలు నెరవేరుతాయి. రైతులకు, మహిళలకు, విద్యార్థు లకు కేంద్ర ప్రభుత్వ ఆదేశాలు ఇబ్బందిపెడతాయి. మొదటి వారం అశాంతి, రెండోవారం నూతన ప్రయత్నాలు, మూడో వారం ధనప్రాప్తి, నాలుగోవారం ఆనందం.

### తుల

**ఆదాయం : 02 రాజపూజ్యం : 01**
**వ్యయం : 08 అవమానం : 05**

గురువు 12వ ఇంట, తదుపరి 6వ ఇంట శని, ఈ ఏడాదంతా 12వ ఇంట, రాహువు 3వ ఇంట, కేతువు 9వ ఇంట ఉన్నారు. ఈ సంవత్సరం ఏల్నాటి శని ప్రభావం అధికంగా ఉంటుంది. ఈ రాశివారు తొందరపాటు పనులతో కష్టనష్టాలు కొనితెచ్చుకుంటారు. రైతుపంటలకు గిట్టుబాటు ధరలేక ఆందోళన చెందుతారు. అవివాహితులకు వివాహ ప్రయత్నాలు చేజారిపోతాయి. మొదటివారం విజయం, రెండోవారం ఆనందం, మూడోవారం నష్టాలు, నాలుగోవారం ప్రయాణాలు.

### వృశ్చికం

**ఆదాయం : 08 రాజపూజ్యం : 04**
**వ్యయం : 14 అవమానం : 05**

గురువు అర్ధాష్టమందు తదుపరి 5వ ఇంట, రాహువు ద్వితీయమందు కేతువు 8వ ఇంట సంచరిస్తున్నారు. ఈ రాశి వాళ్ళకు అనుకూల పరిస్థితులు ఉన్నా అనారోగ్యసమస్యలు వల్ల పలు ఆటంకాలు ఏర్పడతాయి. ఆత్మస్థైర్యంతో చేయు వృత్తి వ్యాపారాల్లో మంచి ఫలితాలు సాధించి ప్రశంసలు పొందుతారు. చిన్నపిల్లల అనారోగ్యం తల్లిదండ్రులకు ఆందోళన కల్గిస్తుంది. మొదటివారం ఆనందం, రెండోవారం ఆత్మస్థైర్యం, మూడోవారం ప్రశంసలు, నాలుగోవారం అనారోగ్యం.

### ధనుస్సు

**ఆదాయం : 11 రాజపూజ్యం : 07**
**వ్యయం : 05 అవమానం : 05**

గురువు 3వ ఇంట, తదుపరి అర్ధాష్టమశని, ఈ ఏడాదంతా 10వ ఇంట, రాహుకేతువులు సప్తమందు సంచరించటం వల్ల పలు హార్థిక; ఆర్థిక సమస్యలు వస్తాయి. ఈ రాశివారికి ఈ మాసంలో నమ్మిన వ్యక్తులు మోసం చేయటం వల్ల ధన నష్టం, కార్యభంగం తదితర అశుభఫలితాలు ఏర్పడుతాయి. సుదూరప్రయాణాలు చేయటం వల్ల పలు అనారోగ్య సమస్యలు. వెండి, బంగారు వర్తకులకు పోలీసు అధికారుల ఒత్తిడి అధికంగా ఉంటుంది. మొదటివారం కార్య జయం, రెండోవారం సంతోషం, మూడోవారం ఆందోళన, నాలుగోవారం ధనలాభం.

### మకరం

**ఆదాయం : 14 రాజపూజ్యం : 03**
**వ్యయం : 14 అవమానం : 01**

గురువు 2వ ఇంట, తదుపరి 3వ ఇంట, శని 9వ ఇంట శని, రాహువు 12వ ఇంట, కేతువు 6వ ఇంట సంచరించడం వల్ల యోగదాయకంగా ఉంటుంది. ఈ రాశివారికి అన్ని నూతన ప్రయత్నాలు కలిసి వస్తాయి. నూతన గృహ నిర్మాణాలు, బంగారు ఆభరణాలు కొనుగోలు చేస్తారు. చేతి వృత్తులవారికి ఆశించిన లాభాలు లేక ఆందోళన చెందుతారు. చిన్నపిల్లల అనారోగ్యాలు, ఇంట్లో ఒకరికి ఆకస్మిక ప్రమాదాలు జరిగే అవకాశాలున్నాయి. మొదటివారం కలహాలు, రెండో వారం ఆందోళన, మూడోవారం ప్రమాదాలు, నాలుగోవారం ధనప్రాప్తి / శుభవార్త.

### కుంభం

**ఆదాయం : 14 రాజపూజ్యం : 06**
**వ్యయం : 14 అవమానం : 01**

గురువు జన్మ నక్షత్రమందు తదుపరి 2వ ఇంట శని, అష్టమమందు రాహువు, 11వ ఇంట, కేతువు 5వ ఇంట ఈ సంవత్సరం అష్టమంలో ఉండటం వల్ల పలు ఇబ్బందులు కలిగే అవకాశం ఉంది. ఈ మాసంలో ఈ రాశివారికి విదేశీ ప్రయత్నాలు ఉన్నత ఉద్యోగాలు; అవివాహితుల వివాహ ప్రయత్నాలు వాయిదాపడే అవకాశం ఉంది. ప్రతి చిన్న విషయానికి కోపంతో బంధుమిత్రులను దూరం చేసుకొంటారు. బంగారం, వెండి, చిట్ ఫండ్ వ్యాపారులకు ఒత్తిళ్ళు. మొదటివారం ధనప్రాప్తి, రెండో వారం శుభకార్యాలు, మూడోవారం అశాంతి, నాలుగోవారం విజయం.

### మీనం

**ఆదాయం : 11 రాజపూజ్యం : 02**
**వ్యయం : 05 అవమానం : 04**

గురువు 12వ ఇంట తదుపరి జన్మనక్షత్రమందు శని, ఈ సంవత్సరమంతా 7వ ఇంట రాహువు, 10వ ఇంట కేతువులు అర్ధాష్టమందు సంచరిస్తారు. ఈ మాసంలో ఈ రాశివారికి వృత్తి ఉద్యోగాల్లో అధిక శ్రమ ఉంటుంది. వివాహ, తీర్థ యాత్రల ప్రయత్నాలు నెరవేరుతాయి. గృహనిర్మాణాలు, కొనుగోలు అమ్మకాలు కలిసివస్తాయి. ఇంట్లో విలువైన వస్తువులు పోయే ఆస్కారం ఉంది. మొదటివారం ఆర్థికలాభం, రెండోవారం నూతన ప్రయత్నాలు, మూడోవారం ఆందోళన, నాలుగోవారం ఉత్సాహం, ఆనందం.

దర్శించండి..! తిరుమల తిరుపతి దేవస్థానములు తరించండి....!!

# శ్రీ వేంకటేశ్వర మ్యూజియం

**తిరుమల - తిరుపతి**

చరిత్రకు మానవ సంస్కృతికి సాక్ష్యంగా నిలిచేవి శిల్పాలు, శాసనాలు, సాహిత్యం, కళలు మొదలైనవి. ఇవన్నీ ఒకే కప్పు క్రింద కనిపించే ప్రదేశం పురావస్తు ప్రదర్శనశాల.

**తిరుమలలోని ప్రధాన మ్యూజియం, 2వ వైకుంఠం క్యూ కాంప్లెక్స్ ఎదురుగా పురావస్తు కళలతో నిర్మితమై భక్తులను ఆకర్షిస్తూ ఉంది.**

**ప్రదర్శన సమయం :** ఉదయం 8 గం॥ నుండి రాత్రి 8 గం॥ వరకు

ఇందులో శ్రీవారి వైభవానికి సంబంధించిన చిత్రాలు, తీర్థాలు, ప్రాచీన కళాకృతులతో, వివిధ శిల్పాలు, కంచుతో తయారు చేసిన విగ్రహాలు, కలంకారి ఆకృతులు, అన్నమాచార్యుల రాగిరేకులు, దారుమూర్తులు, ఆయుధాలు, తంజావూరు వర్ణచిత్రాలు, సంగీత పరికరాలు, మైసూరు మహారాజు సమర్పించిన దంతపు పల్లకి శిల్పనైపుణ్యం కూడ ఇందులో దర్శించవచ్చు.

**తిరుపతిలోని గోవిందరాజస్వామివారి ఆలయానికి ఉత్తరం వైపున ఆలయకళకు సంబంధించిన మరొక మ్యూజియం కూడా యాత్రికులకు సందర్శన యోగ్యంగా ఉంది.**

**ప్రదర్శన సమయం :** ఉదయం 10 గం॥ నుండి సాయంత్రం 6 గం॥ వరకు

వైష్ణవం యొక్క ఆవిర్భావము, అభివృద్ధి, వాస్తు శాస్త్రము, శిల్పశాస్త్రము, ఆళ్వారుల వివరాలు, వైష్ణవ ఆచారాలు, 108 దివ్యక్షేత్రాల ఫోటోలు, శాసనాలు, వాహనములు, భరతనాట్యం భంగిమలు, శ్రీవారి వస్త్రాలు, శ్రీనివాస కల్యాణం బొమ్మల ప్రదర్శన మొదలైన ఎన్నో విశేషాలు యాత్రికుల మనస్సుకు ఆహ్లాదాన్ని వినోదాన్ని విజ్ఞానాన్ని చేకూర్చుతున్నాయి.







ప్రవేశ రుసుము : పెద్దలకు రూ.1-00; పిల్లలకు రూ.0-50 పైసలు

వివరాలకు : తిరుమల మ్యూజియం - 0877 - 2263522; తిరుపతి మ్యూజియం - 0877 - 2264562




**ధారావాహికం - 84**

**(ఆలయ కార్యనిర్వహణ అనేది క్రమశిక్షణతో కూడుకున్నది. అది క్రమేపి పెరిగి నిర్దిష్ట రూపంలో పుచ్చుకునేందుకు కొంతకాలం పడుతుంది. అయితే తిరుమల ఆలయంలో పర్యవేక్షణ,** checks and balances- **పద్ధతులు, ప్రతిబంధకాలు పల్లవ పూర్వకాలంలోనే ఏర్పడి, కట్టుదిట్టంగా ఒక వరవడిలో నడుస్తూ వచ్చాయి అనేది శాసనాధారాలతో స్పష్టమౌతుంది.)**

పల్లవుల పరిపాలనాకాలం 7వ శతాబ్దం ప్రారంభం నుండి, స్థానిక రాజకుటుంబాలకు చెందిన రాకుమారులు, ప్రముఖనాయకులు, పల్లవరాజుల ఆధిపత్యంలో ఉన్న పాళెయ గారులు మొదలైనవారు శ్రీ వేంకటేశ్వర దేవాలయ అభివృద్ధికి తోడ్పడ్డారు. వీరు దేవాలయంలో ఉత్సవాలు, ఊరేగింపులు, యజ్ఞయాగాదులు తదితర కార్యకలాప నిర్వహణార్థం వేంకటే శ్వరస్వామి ప్రతిరూపాలను తయారు చేయించి ప్రతిష్ఠింప జేశారు. దేవాలయంలో నిత్యదీపాలను వెలిగించడానికి, ఆహార నైవేద్యాలు సమర్పించేందుకు మరియు ఈ కార్యాలు నిర్వి ఘ్నంగా కలకాలం జరిపేందుకు తగుఏర్పాటు చేశారు. ఇందు కోసం వీళ్ళు కొంత బంగారాన్ని పెట్టుబడిపెట్టి పంట భూమిని కొన్నారు. ఈ క్షేత్రాలనుండి సమకూరే ఫలసాయ విలువకు లభించే ధనం వినియోగించుకోవడానికి దేవాలయ అధికారు లకు అనుమతినిచ్చారు. ఈ విధంగా దేవాలయంలో జరిగే కార్యక్రమాలు భవిష్యత్తులోకూడ నిర్విఘ్నంగా జరిగే ఏర్పాటు గావించారు. పల్లవుల కాలంలోనే శ్రీ వేంకటేశ్వర స్వామిని పోలిన మూడు ప్రతిమలు ప్రతిష్ఠింపబడినాయి.

ఈ పల్లవరాజుల కాలానికే చెందిన రాణి సామవై వేసిన ప్రఖ్యాత శాసనం గురించి ఇంతకు ముందు అనేక సంద ర్భాల్లో ప్రస్తావించడం జరిగింది. ఈ శిలాశాసనం కొప్పాత్ర మహేంద్ర పన్మార్ యొక్క 14వ పరిపాలనాసంవత్సర కాలంలో ప్రకటించబడింది. ఈ మహేంద్రపన్మార్‌కు అధీనుడై ఉన్న శక్తి విటంకన్ అనే పేరుగల ఒక **కాడవ** పల్లవ ప్రముఖుని భార్య సామవై. రెండు శాసనాలను ఆమే వేయించింది. ఆమె పల్లవ పెర్గడైయార్ కుమార్తె. పెర్గడై అంటే పల్లవ ప్రముఖునివద్ద పనిచేయు ఉన్నతాధికారి లేదా ఉన్నతాధికారంలో ఉన్న ఒక పల్లవ ప్రముఖుడని వ్యాఖ్యానించవచ్చు. ఈమె ఒక ఉత్సవ మూర్తిని స్థాపించినట్టు ఈ రెండుశాసనాల వలన తెలుస్తున్నది. శ్రీ వేంకటేశ్వర మూలమూర్తిని పోలిన సదరు వెండి విగ్రహానికి సంవత్సరానికోమారు ఒకవారం రోజులపాటు రెండు పూటలా ఊరేగింపుతో ప్రత్యేక ఉత్సవం జరిపే ఏర్పాటు చేసింది.

ఈ శాసనంలో ప్రస్తుతించిన కొప్పాత్రమహేంద్ర పన్మార్ అను వ్యక్తి, కోపార్థివేంద్రవర్మ అను ఈ ఇద్దరు అభి న్నులైన ఒకే వ్యక్తి అని చారిత్రక పరిశోధకులు నిర్ణయించారు. ఈ పార్థివేంద్ర వర్మ శాసనాలు ఉత్తరఆర్కాడు, చెంగల్‌పట్టు జిల్లాలలో లభించాయి. ఇతడు తొండమండలంలోని ఈ భూభాగాలకు పరిపాలకుడుగా ఉండిన రెండవ పరాంతక సుందరచోళుని ఆధిపత్యానికి లోబడియున్న మాండలీకుడు. ఈ శాసనం అసలుకు నకలు మాత్రమే. అందువల్ల, దీని తేదీని మూలశాసనంలోని ప్రాచీన లిపి విజ్ఞానశాస్త్ర పరిధిలో నిర్ణయించే వీలులేదు. కానీ ఈ తేదీ పల్లవరాజులలో సుప్రసి ద్ధుడుగా పేరు పొందిన మొదటి మహేంద్రవర్మన్‌కు సంబం ధించినట్టిదిగా ఉంది. ఎందువల్ల అంటే ఈ శాసనంలో మహేంద్రపన్మార్ పేరు ప్రస్తావించబడింది. ఇతని ఆధిపత్యానికి లోబడి శక్తివిటంకన్ అనే పల్లవ ప్రముఖుడు ఉన్నాడు. ఇతని భార్య సామవై కూడ పల్లవ వంశీయురాలైన రాకుమార్తె.

అందుచేత ఈ వివరాలన్నిటినీ పర్యావలోకించి చూడగా ఈ దానకర్త సాధారణ సేనానాయకుడనీ భావించడానికి అవకాశం లేదు. ఇతడు సుప్రసిద్ధ పల్లవ చక్రవర్తియైన మహేంద్రవర్మ అని భావించడమే సముచితం. అలా అయితే ఇది ఇతని 14వ పరిపాలనా సంవత్సరాన్ని సూచిస్తున్నందున ఈ శాసనంలో సూచించిన మహేంద్రవర్మవ్యక్తి మామల్ల నరసింహవర్మయొక్క తండ్రియైన మొదటిమహేంద్రవర్మను గురించే అని నిర్ధారించ వచ్చు. ఎందుకంటే రెండవమహేంద్ర వర్మ అతి తక్కువకాలం మాత్రమే రాజ్యాన్ని పరిపాలించాడు. ఇలా పోలికబట్టి ఫలానా వ్యక్తి అని గుర్తించిన పద్ధతి సక్రమమే అయినట్లయితే ఈ శాసనం మనలను, క్రీ.శ.7వ శతాబ్ది ప్రారంభకాలం అంటే సుమారుగా 614వ సం॥ ప్రాంతాన పల్లవ సామ్రాజ్య చక్రవర్తి యైన మొదటి మహేంద్రవర్మన్ పరిపాలనాకాలానికి తీసుకుని పోగలదు.

### (ఈ) పల్లవులకాలంలో దేవాలయ పరిపాలన :

రాజకీయ వ్యవహారాలను లేదా పాలనాసంబంధిత వ్యవహారాలనూ నిర్వహించడమే కాకుండా దేవాలయంమీద పై విచారణకర్తగా పర్యవేక్షించే అధికారం కలిగిన సభ ఒకటి తిరుచానూరులో ఉండేదని ప్రాచీన మరియు అర్వాచీన శాస నాలు మనదృష్టికి తీసుకువస్తున్నాయి. ప్రధానంగా స్థానికులైన శ్రీవైష్ణవ బ్రాహ్మణులతో కూడి 108 మంది సభ్యులతో ఏర్పడింది ఈ సభ. కొన్ని సందర్భాల్లో ఈ సభ, దేవాలయం తరపున అధికారం పొందిన కార్యకర్తగా వ్యవహరిస్తూ భక్తులు స్వామికి సమర్పించే ధన, కనక, వస్తు రూపాల్లో, ఆధారద్రవ్య దానాలను స్వీకరిస్తూ దానం ముట్టినట్లు రసీదు ఇవ్వడంలోనూ బాధ్యత వహించేది. అంతే కాకుండా దాత ఏ ఉద్దేశంతో దానం ఇచ్చాడో ఆ ఉద్దేశాన్ని నెరవేర్చడం కూడా బాధ్యత వహించి నిర్వహణ కర్తగా నిలిచేది. ఇందుకు ఒక దృష్టాంతం- ఒక సేవాకైంకర్య నిర్వహణార్థం పంటభూమిని సర్వమాన్యంగా చేసి దేవాలయానికి దానం చేసిన సందర్భంలో ఈ క్షేత్రంమీద పన్నువిధించే పరిస్థితి ఏర్పడకుండా గమనించాల్సిన బాధ్యత ఈ సభకు కలదనే విషయాన్ని స్పష్టంగా శాసనం సంఖ్య 18-టి.టి. తెలుపుతోంది.

ఈ అధికారాలు తిరుచానూరు సభకు, 11వ శతాబ్దం మధ్య వరకు ఉండేవని తెలుస్తోంది. తిరుచానూరు నుండి యోగి మల్లవరం విడివడిన తర్వాత ఈ సభ తిరుచానూరు గ్రామ వ్యవహారాలకు మాత్రమే పరిమితమైనదని తెలుస్తోంది. అంతేకాదు, యోగిమల్లవరంలో లభించిన ఒక శాసనం ప్రకారం మూడవ రాజరాజు పరిపాలనా కాలానికి స్థానిక శివా లయం మీద కూడ ఈ సభకు అధికారం లేకుండాపోయినట్లు తెలుస్తోంది.

రాజ్యపరిపాలనకు సంబంధించిన అధికారగణంలోని వారైన దురవ, ఉరాచ్చీ, బయ్యన్, ఊర్ నియోగం, కోయిర్‌కోన్, వల్వక్కోన్ మొదలైన అధికారులు మనదృష్టికి తారసిల్లుతారు. అట్టివారిలో కోయిర్‌కోన్, వల్వక్కోన్ అనువారు దేవాలయ సంబంధిత వ్యవహారాలను చూసే అధికారులు కాబోలు.

శాసనంసంఖ్య 229-జి.టి.లో పేర్కొన్న మూడుదేవతా మూర్తుల్లోని తిరువేంగడత్తు పెరుమానడిగళ్- తిరుమల లేక వెంకటాద్రి మీద ఉన్న దేవాలయంలో నెలకొని ఉన్నది; మిగతా రెండుమూర్తులు- తిరువిళం కోయిల్ పెరుమానడిగళ్, మరొకటి తిరుమంతిరశాలై పెరుమానడిగళ్. వీటిలో ఒకటి ఉత్సవమూర్తి కాగా, మరొకటి తిరుమల శ్రీనివాసుని ఆలయ గర్భగృహంలో నెలకొని ఉన్న మూర్తి.

భక్తులైన మహారాజులు, ఉన్నతాధికారులు స్వామికి బంగారం, ఆభరణాలు సమర్పించుకోవడమే కాక ప్రత్యేక పూజలు, సేవాకైంకర్యాల నిమిత్తమై ఆధారద్రవ్యంగా భూదానం, ధనదానం చేశారు. దానం ఇచ్చిన భూమిపై వచ్చు ఫల సాయంతో ఉత్సవ, పూజాకైంకర్యాలు జరిగేవి. అటువంటి కైంక ర్యాలలో దైవసన్నిధిన అఖండదీపం వెలిగించే కార్యక్రమం, ప్రతి దినం స్వామికి నైవేద్యం జరిపించడం, అ యా కాలాలలో దాతపేరున ఉత్సవాలను నిర్వహించడం జరిగేవి. వీటికితోడు కొంతమంది బ్రాహ్మణులకు మరియు ప్రతిరోజు దైవదర్శనార్థమై వచ్చే భక్తులకు భోజనవసతి ఏర్పరచడం కూడ ఇందులో భాగమే.

తరువాతి కాలంలో ఆలయ కార్యక్రమాలు అధికమ య్యాయి. ఎంతగా ఎక్కువయ్యాయంటే గొప్ప బీద అనే భేదం

లేకుండా భక్తులు ప్రారంభించిన ఉత్సవాలు ప్రతిదినమూ జరిగేవి. వీటి నిరంతర నిర్వహణకోసం భక్తులు తగిన ఏర్పాట్లు చేశారు.

ఈ దేవాలయానికి వ్యవస్థితమైన ఒక అధికార సంస్థ ఉండేది. ఇది దూరప్రాంతాలలోని భక్తులు సైతం దేవాలయానికి ఇచ్చిన దానం సక్రమంగా వినియోగింపబడుతుందన్న నమ్మకాన్ని చూరగొంది. ముందునుంచి నిర్వాహకం (శ్రీకార్యం) కలిగిన గ్రామసభ (తిరుచానూరు) ఒకటి పనిచేస్తున్నది. చేయవలసిన పనులు సక్రమంగా జరిపేందుకు ఈ సభ బాధ్యత వహిస్తుంది. సభ కార్యదర్శి (శ్రీకార్యం) వద్ద దాచిన బంగారాన్ని గురించిన ప్రస్తావన ఇందులో ఉన్నది. ఈ బంగారం దాన వివరం అందరికీ తెలిసేటట్లు ప్రకటించి ఈ నిక్షేపం ఊర్ నియోగంగా అంటే పట్టణ ప్రజల ఆజ్ఞగా సాక్ష్యాధార పుస్తకంలో దాఖలు చేయాలని ఇళంకోయిల్‌లోని దైవం, మంత్రశాలైలో ప్రతిష్ఠింపబడిన దైవం, తిరువేంగడంలోని దైవాల ప్రయోజనార్థం ఈ విధమైన ఏర్పాటు చేయబడిందని శాసనం సంఖ్య నాలుగు తెలుపుతోంది. ఆలయంలో ఇద్దరు బ్రాహ్మణులకు భోజనవసతి ఏర్పాటు చేసినట్లు శాసనం సంఖ్య ఐదు తెలుపుతోంది. ఇక ఏడవ శాసనం, లిఖితపూర్వకంగా నమోదుచేసిన శా.శ.820 (క్రీ.శ.820) సంవత్సరానికి చెందిన గ్రామవార్షిక ఆదాయ వివరాలను తెలుపుతుంది. 1,000 కాడిల గ్రామం యొక్క "పురవు"(కందాయం) మరియు గ్రామప్రభుత్వానికి రావాల్సిన వివిధ బాకీల వివరాలు ప్రస్తావించబడ్డాయి. ఈ నమోదు చేసిన దాఖలా అసమగ్రంగా ఉన్నప్పటికీ ఆనాటి గ్రామీణ వ్యవస్థలోని తీరుతెన్నులు గుర్తించుట తరువాతి దాఖలాలతో పోల్చినపుడు ఎక్కువ మార్పు ఏర్పడలేదని తెలుస్తోంది. 8, 9వ రెండు శాసనాలు కొ పార్థివేంద్రవర్మన్ యొక్క 14వ పరిపాలనా కాలంలో వేసిన శాసనాలు. పార్థివేంద్రవర్మన్ ఆధిపత్యానికి లోబడిఉన్న శక్తి విటంకన్ (తమిళంలో- శక్తివిడంకన్) అని మరో పేరున్న కాడవ(పల్లవ) ప్రముఖుడి భార్య సామవై చేసిన దాన వివరాలు తెలిపే శాసనాలు. **కాడవన్ పెరుందేవి** అనేది ఈమె బిరుదు నామం. వెంగడం మీద నెలకొని ఉన్న దైవప్రతిమూర్తిని వెండితో తయారు చేయించి సర్వాభరణాలంకృతం గావించి సంప్రోక్షణ కార్యక్రమం గావించి ఆలయ అధికారులకు అందజేసింది. ఆవిడ అందజేసిన ఆభరణాల జాబితా ఇచ్చింది. వాటి విలువ 47 కళంజుల బంగారంగా మదింపు వేయబడింది. అంతేకాకుండా అపుడే ఆలయ అధికారులకు కడికైకోల్ అనబడే 16 కంబీల కొలబద్దతో కొలిచి 3000 కుళిల గుంటల భూమిని (3 పట్టిలకు సమానం) దేవాలయానికి దానం చేసింది.

ఈమె ఇచ్చిన భూమంతా ఏకఖండంగా లేదు. వివిధ వ్యక్తుల నుండి క్రయంచేసింది. కొంతభూమి తిరుచానూరు సభకు చెందినది, అలాగే కొంత భూమి ఒక మఠాధ్యక్షుడైన లక్ష్మణనంబి అనునతని వద్దనుండి కొన్నది. తిరువిళం కోయిల్ దేవరకు కొంత సొమ్ము చెల్లించి తాను కొన్న నేలకు పన్ను లేకుండా చేసుకుని సభకు మరికొంత ధనాన్ని చెల్లించింది. సంవత్సరంలో నిర్ణీత సందర్భాలలో సేవాకైంకర్యాలు జరిపేందుకు వలసిన ఆధారద్రవ్యంకోసం దానం చేసింది. ఈ కైంకర్యాల నిర్వహణ బాధ్యత తిరువెంగడంలోని ఆలయనిర్వాహకులు ఇచ్చింది. ఈ భూముల పరిరక్షణ, వినియోగ బాధ్యత సభకు అప్పజెప్పింది. ఈ ఏర్పాటు సూర్యచంద్రాదులున్నంత వరకు అమలుపరచాలని ఆశిస్తూ ఈ విధానకార్యం శ్రీవైష్ణవుల పరం గావించింది.

దీని తర్వాత మరొక శాసనమందలి విషయాలు అన్ని విధాల పై శాసనాన్నే పోలి ఉన్నాయి. ఇందులో 4,176 కుళిల భూమిని పై శాసనంలోని విధంగానే, మఠ కార్యనిర్వాహకుల పరం గావించి, మార్గశిర(మార్గళి)మాసం (డిసెంబర్-జనవరి)లో బహుళ ద్వాదశినాడు జరిపే ఉత్సవ నిర్వహణార్థం తగుఏర్పాటు గావించి ఆ బాధ్యతను వారిపై ఉంచడం జరిగింది. ఈ శాసనం వల్ల తెలిసిన విషయమేమంటే, ఆనాటికే అంటే పల్లవులకాలం నాటికే ఈ దేవాలయం చక్కని పరిపాలనాదక్షత కలిగియుండినది. ఈ దేవాలయం సమర్థవంతమైన కార్యనిర్వహణ యంత్రాంగం కలిగి ఉండడమే కాక, గ్రామ సభలతో కూడియున్న పరిపాలన యంత్రాంగమందలి అన్ని విభాగాలను చక్కని సమన్వయంతో పనిచేయించినట్లు స్ఫురిస్తోంది. భూముల క్రయవిక్రయాలు, పన్నుల మాఫీ వ్యవహారం,

దానం చేసిన భూములపై ధర్మకర్తృత్వం వహించి, దాతల మనోభీష్టం మేరకు అక్కార్యనిర్వహణ పూచీకత్తు వహించుట దీని పనిగా ఉన్నది. దీనినిబట్టి చూస్తే ఈ దేవాలయ పరిపాలనా విధానం ఇంతటి ఉన్నత పరిణతిని పొందేందుకు కొద్ది సంవత్స రాల అనుభవం ఎంత మాత్రం చాలదు. అంటే దేవాలయంలో కార్యనిర్వహణ విధానం, పూజాది కార్యక్రమ విధానం ఒక స్థిర రూపానికి వచ్చి చాలాకాలంగా ఇపుడున్న పద్ధతిలో అమలు జరుపబడుతూ వస్తున్నదని భావించవచ్చు.

**(ఉ) దాఖలాలననుసరించి దేవాలయ ఆర్థికపరిస్థితులు:**

సాధారణంగా దేవాలయ భూములు కౌలుకు ఇవ్వ బడుతాయి. ఈ సందర్భాన శాసనం సంఖ్య 229-జి.టి.లో ఒక విశేషం ఉంది. భూమి కౌలుకు ఇచ్చునపుడు పంటలను పండించుటలో తగినంత కృషిచేయడానికీ, యజమాని వాటాకు రావలసిన ఫలసాయాన్ని సేకరించి అందించేందుకు సదు పాయంగా పంటపొలం ఏ ప్రాంతానికి చెందిందో కౌలు దారుడు కూడ అక్కడే నివాసస్థానం కలిగి ఉండాలని తెలుప బడింది. 80 మారులు జాగ్రత్తగా రోటిలో దంచి ఖచ్చితంగా పరిశుభ్రం చేసిన బియ్యాన్ని స్వామి నైవేద్యానికి వినియోగించ బడుతుంది. సాధారణంగా మూలధనంగా పెట్టుబడి పెట్టేందుకు అపరంజి బంగారాన్ని మాత్రమే తూకం తూచుకుని దేవాలయ అధికారులు స్వీకరిస్తారు. బంగారాన్ని **కళంజు** అనే ప్రమాణ తూకపు బరువుతో తూస్తారు. **కడిక్కైకోల్** అనే దండం నేలను కొలవడానికి ఉపయోగించే ప్రమాణపు కొలత. ఇది 16 మూర్లు పొడవుగల కొలతకు సమానం. దీనితో నేలను కొలిచి ఇన్ని **కుళిల** నేల ఉన్నదని తెలుపుతారు. 1000 కుళిల నేల ఒక పట్టికి సమానం. శాసనం సంఖ్య18-టి.టి.లో వివిధ ఆభరణా లను గురించి ప్రస్తావన ఉన్నది. దైవవిగ్రహాలను అలంకరించ డం కోసం బహూకరించినవి. ఇవన్నీ కూడ అత్యంతవిలువైన ముత్యాలు, పగడాలు, కెంపులు, వజ్రాలు పొదిగిన ఆభరణాలు. ఇవన్నీ ఆనాటి దేశ పారిశ్రామిక అభివృద్ధి, నాగరికతను తెలుపు తాయి. రహదారుల నిర్మాణం జనుల రాకపోకలకు వ్యాపార అభివృద్ధికి దోహదకారి అయ్యింది. ఉత్తరాపథం (వడగువళి) దక్షిణాన తమిళ దేశం ఉత్తరాన తెలుగుదేశమైన వెంగిని కలుపుతూ ఇంకనూ ఉత్తరంగా ముందుకు సాగిపోతున్నది. ఈ ప్రధాన రహదారి తిరుచానూరు మీదుగా పోతుంది. వ్యవ సాయాభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ వహించబడింది. పంటపొలాలకు కావలసిన జలవనరులు సమకూర్చడానికి చెరువులు, పంట కాలువలు త్రవ్వించబడింది. దాఖలాల ప్రకారం చోళుల కాలంలో విధించినంత పన్నులు పల్లవుల కాలంలో లేవని తెలుస్తోంది. తప్పనిసరిగా చెల్లించాల్సిన (కడమై-కుడిమై) పన్నులు మాత్రమే విధించబడినట్లు తెలుస్తున్నది.

**4. (అ)చోళులకాలంలో దేవాలయ స్థితిగతులు-దేశవిభాగాలు:**

పల్లవరాజు కొ విజయదంతి విక్రమవర్మన్ కాలం నుండీ పరిపాలన సౌలభ్యం కోసం చేసిన నేలవిభాగపు పద్ధతే చోళులకాలం వచ్చేసరికి ఎటువంటిమార్పులేకుండా అమలులో ఉన్నట్లు తెలుస్తోంది. కానీ 24 కొట్టాలుగా విభజింపబడిన ప్రాచీన తొండమండలానికి మరిన్ని కొట్టాలు చేరాయి. అలా ఏర్పడిన **పెరుంబాణప్పాడి** జయన్‌కొండ చోళమండలంలోని ఒక ప్రధానవిభాగంగా చేయబడియున్నట్లు రికార్డులవల్ల తెలుస్తోంది. తిరుచానూరు, తిరుముండియంలలో స్థానిక **సభ** సంఘాలు ఉండినట్లు తెలుస్తున్నది. మూడవ రాజరాజు పరిపాలన కాలానికి చెందిన ఒక శాసనం(సంఖ్య126-జి.టి.)ప్రకారం తిరుచానూరుసభ అధికప్రాధాన్యత కలిగియుండినట్లును, న్యాయ పరిపాలనాధికారం ఎక్కువ విశాలమైన ప్రాంతంపై చెల్లుబడి అవుతోందని తెలుస్తోంది. తిరుచానూరు సభకు మతవ్యవహా రాలలో వలనే రాజకీయవ్యవహారాలలో కూడ ప్రాముఖ్యం ఉండడంవల్ల మరియు అతితరచుగా రాజకీయ ప్రముఖుల రాకపోకల కారణం చేతనూ తిరుచానూరు సభ తన కార్య కలాపాలు సక్రమంగా జరిపేందుకు వీలుగా సభా భవనాన్ని ప్రభుత్వమే నిర్మించింది.

తిరుమలలో కుళోత్తుంగచోళుని చారిత్రక పరిచయానికి సంబంధించిన వివరాలుగల శాసనంలో తునుకలుగ పగిలిన **వెట్టిరుందరుళియ కొవి రాజకేసరి పన్మర్** అన్న పదం ఉన్నది. ఇది రాజేంద్రచోళ అనే కుళోత్తుంగచోళునకు సరిపో తుంది. ఇతడు సింహాసనాన్ని అధిష్ఠించి పరిపాలన ప్రారం భించిన తొలినాళ్లలో రెండవ రాజేంద్రునిగా పిలువబడినట్లు

తెలిసినదే! తదుపరి ఇతడు తన నాలుగవ పరిపాలనా సంవత్సర కాలంలో కులోత్తుంగచోళ అన్న బిరుద నామాన్ని వహించాడు. **పుగళ్ సుళ్న్ద పునరి అగళ్ సూళ్న్ద పువియిల్**-అనే వాక్యంతో ప్రారంభించిన పూర్తి చారిత్రక పరిచయంగల శాసనం సంఖ్య 381-జి.టి.(సంఖ్య 265 of 1904 of the Mad. Ep. Coll.) యోగిమల్లవరంనందు లభించింది. ఈ శాసనం కొ రాజకేసరి వర్మన్ అను మరొకపేరుగల చక్రవర్తిగళ్ శ్రీ కులోత్తుంగ చోళదేవ యొక్క 24వ పరిపాలనా సంవత్సరాన ప్రకటించబడింది. మొదటి రాజేంద్ర చోళుడు సింహాసనాన్ని అధిష్టించు వరకు తొండమండలం జయగొండమండలంగా సుప్రసిద్ధమై (సంఖ్య 20-టి.టి.)ఉండింది. కాని మొదటి రాజేంద్రచోళుడు మరియు మొదటి కులోత్తుంగచోళునియొక్క పరిపాలనల మధ్యకాలంలో తొండమండలం పేరును రాజేంద్ర చోళమండలంగా మార్చివేయబడినట్లున్నది. వీరరాజేంద్రదేవ యొక్క 16వ పరిపాలనా సంవత్సరంలో ప్రకటించబడిన సంఖ్య 386-జి.టి. శాసనంలోను, సంఖ్య 381-జి.టి.శాసనంలోను ఈ తొండమండలాన్ని రాజేంద్రచోళమండలంగా పేర్కొనబడి యుండటం గమనార్హం. బహుశా ఈ విధమైన పేరులో మార్పు మొదటి రాజేంద్రచోళుని పరిపాలనాకాలంలో సంభవించి ఉంటుంది. అందువలననే తొండమండలాన్ని వీరరాజేంద్రదేవ మరియు మొదటి కులోత్తుంగరాజు పరిపాలనాకాలం వరకు రాజేంద్రచోళమండలంగా శాసనాలలో పేర్కొనబడడం సంభవించి యుంటుంది. కానీ ఆ తరువాతి కాలంలో అంటే మూడవ రాజరాజు పరిపాలనా కాలంలో ప్రకటించిన శాసనాలలో పూర్వపు పేరైన జయకొండ చోళమండలం అన్న పేరే తిరిగి (శాసన సంఖ్య 380, 384, 389-జి.టి.) ప్రత్యక్షమైంది.

### (ఆ) చోళ శాసనాలలోని వివరాలు :

పరాక్రమవంతులు, వదాన్యులు అని పేరుపొందిన కొందరు చోళరాజులను గురించి తెలిపే ప్రాచీన శాసనాలు కొన్ని లభించాయి. అట్టివాటిలో సంఖ్య 234, 232- జి.టి. శాసనాలు క్రీ.శ.905సం॥ నుండి 953వ సం॥ వరకు పరిపాలించిన మదిరైకొండ కొ పరకేసరి వర్మన్ అని మరొక పేరుగల మొదటిపరాంతకను గురించి తెలుపుతున్నాయి. విరిగి పోయిన తునుకలను కూర్చి సరిచేయబడిన రెండు శిలాశాసనాలు తెలుపుతున్న విధంగా ఈ రాజు తన పరిపాలనాకాలం లోని 20వ సం॥ నందు అఖండదీపాన్ని, మరల 29వ సం॥లో మరొక అఖండదీపాన్ని ఆలయానికి సమర్పించినట్లు తెలుస్తోంది. ఇంకనూ పరిపాలనా సౌలభ్యంకోసం చేసిన దేశ విభాగాలను గురించి తెలుపుతూ తిరుచ్చుకనూర్(తిరుచానూర్)లోని సభను గురించి కూడ ప్రస్తావిస్తున్నాయి. ఈ శాసనాలు తిరుచానూరులో లభించాయి.

మొదటిరాజరాజు తండ్రియైన రెండవ పరాంతక సుందరచోళుని గురించి సూటిగా ప్రస్తావించిన ఆకరం లేదు. కాని శ్రీ వేంకటేశ్వర ఆలయం గర్భగుడి జీర్ణోద్ధరణ కైంకర్య సందర్భంలో వీరనరసింహయాదవరాయల ఆజ్ఞ ప్రకారం తిరిగి చెక్కిన శాసనంలో ఒకటి సంఖ్య 17-టి.టి. ఉన్నది. మొదటి రాజరాజు పరిపాలనాకాలం నందలి 16వ సం॥నందు చేరమాన్ రాజు కూతురు, బంగారు మేడలో నిద్రించే (పొన్‌మాళిగైయిల్ తూంగినాన్) రెండవ పరాంతక సుందర చోళుడి భార్య పరాంతకదేవి అమ్మన్ విలువైన రత్నాలు పొదిగిన ఒక పట్టాన్ని స్వామివారికి సమర్పణ చేసింది. రెండవ పరాంతక సుందర చోళుడు నిద్రించడానికి స్వర్ణమందిరం కలిగియున్నాడనే విషయం తెలిసినదే కదా! శాసనంలో ఈమెకు **దేవి అమ్మన్** అని గౌరవ పూర్వకంగా ఉపయోగించడం చూడగా ఈమె రెండవ పరాంతకుని భార్యలలో జ్యేష్ఠురాలు, పట్టమహిషి అయి ఉంటుంది. కుందవైయార్ మరియు మొదటి రాజరాజుకు తల్లియైనటువంటి వానవన్ మహాదేవి అనే ఆవిడ రెండవ పరాంతకునికి మరో భార్య. భర్త చనిపోగా ఈ వానవన్ మహాదేవి భర్త చితిపైపడి ప్రాణత్యాగం చేసినది. వీరి కుమార్తె కుందవైయార్ తన తల్లిదండ్రుల జ్ఞాపకార్థం తంజావూరు దేవాలయంలో వారి విగ్రహాలను నెలకొల్పింది. పరాంతకదేవిమాత్రం తన భర్త రెండవ పరాంతకుడు మరణించిన తరువాత మొదటి రాజరాజు (క్రీ.శ. 1001 సం॥) పరిపాలనాకాలం నందలి 16వ సం॥ వరకు 31 సంవత్సరాల కాలంవరకు జీవించి ఉన్నది. శేష జీవితం దాన ధర్మాది కార్యక్రమాలు చేస్తూ గడిపింది. **(ఇంకా ఉంది)**

# శ్రీ సౌమ్యనాథస్వామి ఆలయం

## నందలూరు

- పి. కృష్ణమూర్తి, తిరుపతి

మన దేవాలయాలు

కడప జిల్లాలోని ప్రాచీన ఆలయాలలో నందలూరు శ్రీ సౌమ్యనాథస్వామి ఆలయం ఒకటి. ఇది అతి పురాతనమైనదే కాక అతి పెద్దది. ఈ ఆలయం చోళరాజు కాలంలో అత్యంత ఉన్నత స్థితిలో ఉండినట్లు చారిత్రక, శాసనా ధారాలున్నాయి. నందలూరు చెన్నై-కడప రహదారిలో కడప పట్టణానికి 50 కి.మీ. దూరంలో బాహుదానదీ తీరంలో ఉంది. పూర్వం ఒక తెలుగు చోడ ప్రభువు గోహత్యా పాపనివారణ కోసం, బాహుదానదీ తీరం వెంబడి 108 శివాలయాలు నిర్మించాడు. ఈ ఆలయాలలో నంది విగ్రహప్రతిష్ఠాపనకు ప్రాముఖ్యతనిచ్చి నందువల్ల, ఈ నది గట్టున ఉన్న గ్రామానికి నం(ది)దలూరుగా పేరు వచ్చింది. ఈ గ్రామానికి అంతకు పూర్వం తొండమండలం, చొక్కాయపురం, నెలందలూరు, నిరంతపురం, చొక్కనాథపురం అనే పేర్లు ఉన్నట్లు తెలుస్తూంది. కడపచరిత్రకు ముఖ్య ఆధారమైన "మెకంజీకైఫీయత్"లో ఈ ప్రాంతాన్ని ఏలిన రాజు ప్రేయసి 'నలంద' బాహుదానదీ తీరప్రాంతాన్ని దర్శించి, ఆ సుందర ప్రదేశాన్ని చూచి ముగ్ధురాలై, తన పేర ఆ ప్రదేశంలో జ్ఞాపకచిహ్నాన్ని ఏర్పాటు చేయుమని కోరగా, రాజు ప్రేయసి కోరిక మేరకు బాహుదానదీ తీరంలో అంతకు పూర్వమే వరదలవల్ల కొట్టుకుపోయిన నిరంత పురం స్థానంలో ఆమె పేర నెలందలూరు అనే గ్రామాన్ని నిర్మించాడట! కాలక్రమంలో నెలందలూరు నెందలూరుగా మారినదట! నందలూరు గ్రామం ప్రక్కన ప్రవహించే బాహుదా నది ఈ ప్రాంతంలో 'చెయ్యేరు' అనే పేర ప్రసిద్ధమైనది.



శ్రీ సౌమ్యనాథస్వామి

**స్థల పురాణం :**

ఐతిహ్యం ప్రకారం ఒకమారు మహావిష్ణువు, నారద మహర్షి కోరికమేర, భూలోక వింతలను చూస్తూ, చెయ్యేరు ప్రాంతానికి వచ్చి అచ్చటి ప్రశాంత వాతావరణానికి ముగ్ధుడైనా డట! నారదమహర్షి, శ్రీహరి మోములోని ప్రశాంతతను, సంతోషాన్ని గమనించి, తాతగారితో కలియుగమందు అచటి నదీ తీరమందే కొలువై భక్తులను బ్రోవుమని ప్రార్థించగా శ్రీహరి మహర్షి కోరిక తీర్చుటకు, బాహుదానదీ తీరంలో 'సౌమ్యనాథ స్వామి' పేర శిలారూపము దాల్చినాడట! కొందరీ స్వామిని నారదమహర్షే స్వయంగా ప్రతిష్ఠించినాడని కూడా చెబుతారు.

**ఆలయ నిర్మాణం :**

సౌమ్యనాథస్వామి ఆలయం దాదాపు 10 ఎకరాల సువిశాల మైదానంలో నిర్మింపబడింది. ఆలయం చుట్టూ ప్రహరీ, తూర్పువైపున ప్రహరీలోని ఆలయ ప్రవేశద్వారంపైన 5 అంతస్తుల రాజగోపురం ఉంది. అలాగే ఉత్తరదిశలో 3 అంతస్తుల గోపురం, దక్షిణం వైపు ప్రహరీలోని గోపురం శిథిలమై అధిష్ఠానం వరకే నిలిచి ఉంది. రాజగోపురందాటి ఆలయంలోనికి ప్రవే శించగానే, ఎంతో నైపుణ్యంతో చెక్కిన శిలా ద్వీపస్తంభం, దానికి ముందు ధ్వజ స్తంభం, బలిపీఠం, గరుడమండపాలు ఉన్నాయి. గరుడమండపమందలి గరుడా ళ్వార్, తన స్వామిని ముకుళిత హస్తాలతో సేవిస్తూ ఉన్నాడు. ధ్వజస్తంభానికి దక్షిణ దిశలో వాహన మండపం; దాని ముందు నిలువెత్తు వీరాంజనేయస్వామి విగ్రహం ఉంది. వాహన మండపానికి ఎదురుగా,

ఉత్తర దిక్కున ఇటీవలి కాలంలో నిర్మించిన చిన్న కోనేరు కలదు. ఆలయం చుట్టూ ఉన్న ప్రహరి, రాజగోపురం, ఉత్తరద్వార గోపురం ఇటీవలి కాలంలో పునరుద్ధరణ కావించబడినాయి. ప్రధానాలయం 10 ఎకరాల స్థలంలో, ప్రహరీ మధ్యన - నిర్మింపబడింది. ఆలయ ప్రవేశ ద్వారం పైన 3 అంతస్తుల గోపురం ఉంది. ఈ గోపురం ద్వారా ఆలయంలోనికి ప్రవేశించగానే ఉత్తర దిక్కు అధిష్ఠానం గోడ పై భాగాన అతి సుందరమైన ఆశీన గణపతి 'అభయ గణపతి' పేర కొలువైయున్నాడు. ప్రధానాలయం మహామండపం, ఆస్థాన (కొలువు) మండపం, ముఖమండపం, అంతరాళం, గర్భగృహాల సముదాయం. ప్రధానాలయమందు ఆలయం చుట్టూ, తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశలలో 108 స్తంభాల సాయం 4 అ॥ ఎత్తున నిర్మింపబడిన విశాలమైన వసారా కలదు. ఈ వసారా స్తంభాలన్నీ చోళ వాస్తు నిర్మాణ పద్ధతిలో గుండ్రంగా ఉన్నాయి. ప్రధానాలయ నిర్మాణమంతా ఏక కాలమందు కాక అనేక దశల్లో జరిగినట్లు ఇచ్చటి నిర్మాణ పద్ధతులను బట్టి చెప్పవచ్చు. అసలు సౌమ్యనాథస్వామి ఆలయ నిర్మాణమే ఓ విచిత్రంగా ఉంది. ఆలయ ప్రవేశ రాజగోపురం నుండి ప్రధానాలయ గోపురం వరకు భూమి సమతలంగా ఒకే ఎత్తున ఉన్నది. దాని ముంగిట స్తంభాల మండపం, దాని ముంగిట ఉన్న కొలువు మండపం మరికొంత ఎత్తున, దాని ముందున్న ముఖమండపం, మరికొంత ఎత్తున ఆ మండపం ముందున్న అంతరాళం, గర్భగృహం ఇంకొంత ఎత్తున నిర్మింపబడి ఉన్నాయి. ఇటువంటి నిర్మాణ శైలి దక్షిణ భారతదేశంలో మరి ఏ ఇతర ఆలయాల్లోనూ కన్పించదు. ఈ నిర్మాణ పద్ధతిలో కనబరచిన వైవిధ్యం వల్లే రాజగోపురం నుంచి దాదాపు 100 గజాల దూరంలో, గర్భాలయంలోని స్వామిని స్పష్టంగా చూడవచ్చు.

ప్రస్తుతం భక్తులు, మహామండపం నుండి, ఆస్థాన మండపం, దక్షిణదిశలో ఏర్పాటు చేసిన మెట్లమీదుగా, స్వామివారి ముఖమండపం చేరి, అచ్చటనుండి స్వామి వారిని దర్శించి సేవిస్తారు. గర్భాలయమందు దాదాపు 7 అ॥ ఎత్తున శ్రీ మహావిష్ణువు సౌమ్యనాథస్వామి పేరున స్థానక మూర్తిగా పద్మపీఠముపై ఉన్నాడు. స్వామి చతుర్భుజుడు. రెండు చేతుల్లో శంఖ, చక్రాలు; కింది కుడిచేయి అభయ, ఎడమచేయి వరద ముద్రలో ఉన్నాయి. స్వామి కిరీటం, మకర కుండలాలు, యజ్ఞోపవీతము, వక్షఃస్థలమందు లక్ష్మీదేవిని కలిగి ఉన్నాడు. స్వామి వెనుక భాగంలో లోహపు మకర తోరణమున్నది. గర్భాలయమందు స్వామివారి చెంత ఆంజనేయస్వామి, ఉత్సవర్లు కొలువైయున్నారు.

గర్భాలయం పైన ద్రవిడ పద్ధతిలో నిర్మితమైన, ద్వితల విమానము పైన గుండ్రని శిఖరం, ఆ పైన కలశం ఉన్నాయి. విమానం మొత్తం వైష్ణవ శిల్పాలతో అలంకరింపబడి ఉంది. ఈ విమాన నిర్మాణం తిరుమల ఆనందనిలయ విమానాన్ని పోలి ఉండి గర్భాలయం వెలుపలి గోడలందు, శివాలయంలో వలె గూడులు, అందులో మూడింట వినాయక, దుర్గ, విష్ణు దేవతా శిల్పాలు ఉన్నాయి.

సౌమ్యనాథస్వామి ఆలయ విమాన నిర్మాణం ఎంతో సాంకేతిక ఔన్నత్యంతో నిండి ఉంది. ఈ విమానంపైన అన్ని మూలలా ఏర్పాటు చేసిన రాతి పలకలపై సూర్యరశ్మి పడగానే, ఆ కిరణాలు వక్రీకరణ చెంది, గర్భాలయంలోనికి ప్రవేశిస్తాయి. అందుచేత, సూర్యరశ్మి భూమిపై ప్రసరిస్తూన్నంతవరకు గర్భాలయంలోని స్వామి ఎటువంటి దీప కాంతులు లేకుండానే భక్తులకు దేదీప్యమానంగా దర్శనమిస్తాడు. అలాగే వెన్నెల రాత్రులందు కూడా స్వామిని చంద్రకాంతులతో స్పష్టంగా చూడవచ్చు. ఈ నిర్మాణ కౌశలం ఆనాటి శిల్పుల సాంకేతిక పరిజ్ఞానానికి ప్రతీక. గర్భాలయం ముంగిట సన్నటి అంతరాళముంది. దీనికి ముంగిట కొంత దిగువగా విశాలమైన ముఖమండపం ఉంది. ఈ మండపం 20 స్తంభాల సాయంతో ఎంతో విశాలంగా నిర్మింపబడింది. ఈ మండప స్తంభాలన్నీ శిల్పాలతో అలరారుతున్నాయి. ఈ శిల్పాలలో ముఖ్యంగా దశావతార, విష్ణు, ఆంజనేయ, శ్రీరామ, శ్రీకృష్ణ ముఖ్యంగా నరసింహుని పేర్కొనవచ్చు. ఈ మండపం పై కప్పు కూడా ఎంతో రమ్యంగా శిల్పాలతో కూడి ఉంది. ఇచ్చట ఉన్న చేప శిల్పానికి, కలియుగాంతంలో చెయ్యేరుకు వరదలు వచ్చి, ఆలయం మునిగి పోగా, ఈ చేపకు ప్రాణం వచ్చి నీటిలో కలసిపోతుందని, ఆ పైన నూతన యుగం ప్రారంభమౌతుందని, శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారు తన కాలజ్ఞాన తత్త్వాలలో

పేర్కొన్నాడు! ఈ ముఖమండపమందే విచిత్రంగా ఒక వినాయక విగ్రహం ప్రతిష్ఠింపబడి ఉంది. ముఖమండపం కప్పు క్రింద, గోడలకు పైన అపురూపమైన శిల్పాలు ఏర్పాటు చేశారు.

ముఖమండపం, వెలుపలి ద్వారానికిరువైపులా 5 అ॥ ఎత్తున జయ, విజయుల శిల్పాలున్నాయి. ఈ ద్వారానికి ఉత్తరదిశలోని మండపమందు ఆలయ పాలకుడు విష్వక్సేనుల వారు, ఆశీనముద్రలో కొలువై ఉన్నాడు. అతడి పక్కనే శ్రీరామా నుజులవారు ప్రతిష్ఠింపబడినారు. ప్రస్తుతం ఆలయ ప్రవేశద్వారం ముఖమండపం ముందుభాగాన దక్షిణదిశలో ఏర్పాటు చేశారు. ఇచ్చటి మెట్లపైనుండి భక్తులు స్తంభాలమండపం నుండి ముఖమండపం చేరి, అచ్చటినుండి స్వామివారిని అర్చించి, తిరిగి అదే మార్గాన వెనుతిరిగి దక్షిణవైపు నుండి తూర్పుదిశ వరకు ఆలయం చుట్టూ మహాప్రదక్షిణ చేస్తారు.

**ఆస్థాన మండపం :**

నందలూరు సౌమ్యనాథస్వామి ఆలయ సోయగమంతా ముఖమండపం, మహామండపాల మధ్యన నిర్మితమైన ఆస్థాన మండపమందే ఇమిడి ఉంది. ఈ మండపం నాలుగువైపులా 4 స్తంభాలున్నాయి. ఈ స్తంభాలపైన శిల్పాలు, భక్తుల మనస్సు లను రంజింపజేస్తాయి. ముఖ్యంగా దక్షిణదిశలోని ముందువైపు స్తంభముపై, మహావిష్ణువుయొక్క అవతారాలు: ఎంతో అందంగా ఉన్నాయి. మిగతా మూడు స్తంభాలపైన అన్ని అవతారాలలోని ముఖ్య ఘట్టాలను శిల్పీకరించారు. వాటిలో ముఖ్యమైనవి నార సింహమూర్తిని ఆశీనమూర్తిగా, లక్ష్మీనారసింహుడుగా, ప్రసన్న మూర్తిగా, ఉగ్రనారసింహుడుగా, జ్వాలామూర్తిగా చూపడం. మరో స్తంభముపై, వామనమూర్తి, త్రివిక్రమమూర్తి శిల్పాలు, ఇంకో స్తంభంపైన వరాహమూర్తి హిరణ్యాక్షుని సంహరించి నట్లుగా, సముద్రమథన సమయంలో మందర పర్వతానికి క్రింద నిలచినట్లున్న కూర్మావతారుడుగా, ఇంకో శిల్పమందు పరశు రామ శ్రీరాముల భేటి ఎంతో రమ్యంగా ఉన్నాయి.

ఈ అవతార శిల్పాలలో రామ, కృష్ణ, నారసింహ శిల్పాలే ఎక్కువగా ఉన్నాయి.

ఇక శ్రీకృష్ణుని అవతార దృశ్యాలు వర్ణనాతీతం. ఈయనను బాలకృష్ణుడుగా, వెన్నదొంగగా, నలకూబర – మణి గ్రీవుల శాపవిమోచకుడుగా, గోపికా వస్త్రాపహరుడుగా, మురళీ ధరుడుగా, కాళియ మర్దనుడుగా, గోవర్ధన గిరిధారుడుగా, చాణూర ముష్టికుల వధకులుగా చూపించారు. దశావతారాలతో బాటు, ఈ స్తంభాలపైన, అగ్ని, కాళి, నాగ, సూర్య, చంద్ర, నవగ్రహాలూ చెక్కబడి ఉన్నాయి. ఈ మండపంలోని శిల్పాల్ని బట్టి మలి విజయనగర రాజుల నిర్మాణమని శిల్పాల్ని బట్టి చెప్పవచ్చు.

సౌమ్యనాథస్వామి శక్తి సంపన్నుడు. ఈయన భక్తుల కొంగుబంగారం. స్వామివారి ఎదుట నిలబడి, భక్తితో ఏదైనా కోరిక కోరుకుని, దానిని తీర్చమని ఆలయం చుట్టూ 9 మార్లు ప్రదక్షిణలు చేస్తే ఆ కోరికలు తప్పక తీరుతాయట! ఆలయ గోడలపైన, విడి రాతి పలకలపైనా, అనేక తమిళ–తెలుగు శాసనాలను చూడవచ్చు. ఈ శాసనాలు చోళ చక్రవర్తి మొదటి కులోత్తుంగుని కాలం నుండి, మట్ల రాజుల కాలం వరకూ ఉన్నాయి. ఈ శాసనాలను బట్టి చోళ చక్రవర్తి ఈ ఆలయాన్ని 20 ఎకరాల స్థలంలో 180 స్తంభాల సాయంతో నిర్మించి స్వామికి అనేక కానుకల్ని సమర్పించి ఆలయమందు ఉత్సవ ఏర్పాట్లు గావించాడు. ఆ తర్వాత కాకతీయ ప్రతాపరుద్రుడు, సాళువనరసింహుడు, శ్రీకృష్ణదేరాయలు, అచ్యుతరాయలు, సదాశివరాయలు, మట్ల రాజులు ఎన్నో మడులు, మాన్యాలు సమర్పించారు. తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనల్లో కూడా ఈ స్వామి ప్రస్తావన చాలా చోట్ల కన్పిస్తుంది.

ప్రకృతి వైపరీత్యాల వల్ల, మహమ్మదీయుల దండ యాత్రల వల్ల, ఈ ఆలయం తన ఔన్నత్యాన్ని, సంపదను కోల్పోగా, నాటి దత్త మండలాల కలెక్టరు, "థామస్‌మన్రో", ఆలయాన్ని కొంతవరకూ ఉద్ధరించినా, ఆ తర్వాత యథావిధిగా క్షీణదశకు చేరుకుంది. పూర్వం ఆలయానికి వెలుపల ఈశా న్యంలో పెద్ద కోనేరు ఉండేది. అది ప్రస్తుతం శిథిలమై పోగా ప్రధానాలయమందు నూతనంగా నిర్మించిన కోనేటిలోకి ఈ పాత కోనేటి నుంచి గొట్టాల ద్వారా నీటిని సరఫరా చేస్తూ ఉన్నారు. ఈ నీటినే స్వామి అభిషేకానికి ఉపయోగిస్తారు. సౌమ్యనాథస్వామికి ప్రతి ఏటా ఆషాఢమాసంలో పది రోజుల పాటు తిరునాళ్ళు ఎంతో వైభవంగా జరుగుతాయి.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# తిరుమల ఆలయం మొదటి ప్రాకారంలోని ఉత్తర గోడపై ఉన్న శ్రీకృష్ణదేవరాయల శాసనాలు

## శాసన వివరణ - 1

| | | |
|---|---|---|
| ప్రదేశం | : | తిరుమల, చంద్రగిరి తాలుకా, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్. (తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తర గోడపై ఉన్న శాసనం) |
| వంశం | : | విజయనగర (తుళువ) |
| రాజు | : | శ్రీకృష్ణదేవరాయలు |
| కాలం | : | శక సంవత్సరం 1434, ఆంగిరస సంవత్సరం, 1513 ఎ.డి. |
| భాష మరియు లిపి | : | తెలుగు |
| విషయం | : | శ్రీకృష్ణదేవరాయల పట్టపురాణిగారైన తిరుమలదేవి తిరువెంగళనాథుని నైవేద్యాల కొరకు బంగారుగిన్నె మరియు పరిమళాలుపెట్టుటకై బంగారు తట్టను కానుకగా ఇచ్చెను. |
| ఆధారం | : | తి.తి.దే. శాసన సంపుటం-III, నెం.51. |

## శాసన వివరణ - 2

| | | |
|---|---|---|
| ప్రదేశం | : | తిరుమల, చంద్రగిరి తాలుకా, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్. (తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తర గోడపై ఉన్న శాసనం) |
| వంశం | : | విజయనగర (తుళువ) |
| రాజు | : | శ్రీకృష్ణదేవరాయలు |
| కాలం | : | శక సంవత్సరం 1435, శ్రీముఖ సంవత్సరం, 1513 ఎ.డి. |
| భాష మరియు లిపి | : | తెలుగు |
| విషయం | : | శ్రీకృష్ణదేవరాయలు తిరువెంగళనాథుని దర్శించుకొని, అనేక విలువైన రాళ్ల మరియు ముత్యాలు పొదిగిన ఆభరణాలను కానుకగా సమర్పించెను. ఈ ఆభరణాల పేర్లను వాటి సంఖ్యను మరియు వాటి బరువును తెలుపుచున్నది. |
| ఆధారం | : | తి.తి.దే. శాసన సంపుటం-III, నెం.60. |

## శ్రీపదకేళి - 06 (నవంబరు-2009)
## విజేతలు

1) **రెంటాల సుబ్బలక్ష్మి,**
ఇంటి నెం.23-31-13,
కొమ్మువారి వీథి,
సత్యనారాయణ పురం (పోస్ట్),
విజయవాడ - 520 011.

2) **టి.ఆర్. బాలకృష్ణారావు,**
ఇంటి నెం.75-6-20,
ప్రకాశం నగర్,
సౌజన్య హాస్పిటల్ మిద్దెపైన,
రాజమండ్రి - 533 103,
తూర్పుగోదావరి(జిల్లా).

3) **పి.యస్.ఆర్.మూర్తి,**
301, శివదుర్గా రెసిడెన్సి,
4వ లైను,
యస్.వి.యస్.కాలనీ,
గుంటూరు - 522 006.

**సరైన సమాధానాలు రాసినవారు :**

పి.శ్రీనివాసరావు (గుంతకల్లు); ఎ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); కె.కృష్ణమూర్తి (కడప); సజ్జల రామచంద్రయ్య (పీలేరు); వై.వి.రమణరావు (మచిలీపట్టణం); అక్షింతల సంజీవశర్మ (అనంతపురం); జి.వి.భారతి (చోడవరం); జె.సావిత్రిశర్మ (అనంతపురం); ఉమ్మెత్తల శ్రీనివాసరావు (హైదరాబాదు); జె. సామ్రాజ్యలక్ష్మి (తిరుపతి); వారణాశి వెంకటపద్మావతి (ఒంగోలు); కె.తిరుమలాచార్యులు (ఒంగోలు); ఎం.మునిరత్నం (నాయుడుపేట); రేవూరు చైతన్య కృష్ణమూర్తి (నెల్లూరు); వి.సీతాలక్ష్మి (పుంగనూరు); ముక్కామల వేంకటేశ్వరరావు (ఒంగోలు); కె.శివనాగేంద్రమ్మ (ఒంగోలు); గుంటూరి సాంబశివశర్మ (దుళ్ళ); యాతగిరి సత్యశ్రీనివాస్ (కశింకోట); బందా శ్రీనివాసరావు (ఒంగోలు); పి.ఆర్.నాయుడు (తిరుపతి); చదలవాడ కామేశ్వరి (ఒంగోలు).

### నిబంధనలు :

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొనవచ్చు.

### బహుమతి వివరాలు :

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

### పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | ■ | 2 | 3 | | ■ | 4 | 5 |
| | ■ | ■ | ■ | | ■ | ■ | ■ | |
| 6 | | ■ | ■ | | ■ | ■ | 7 | |
| | ■ | ■ | 8 | ■ | 9 | ■ | ■ | |
| ■ | 10 | | | | | | | ■ |
| 11 | ■ | ■ | | ■ | | ■ | ■ | 12 |
| 13 | | ■ | ■ | 14 | ■ | ■ | 15 | |
| | ■ | ■ | ■ | | ■ | ■ | ■ | |
| 16 | | ■ | 17 | | | ■ | 18 | |

# శ్రీపదకేళి - 08

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స, కంకిపాడు**

**1)** పూరించిన వారి పూర్తి చిరునామా :

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

**2)** మీరు సప్తగిరి చందాదారులైతే?

అ) చందా నంబరు : ..................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

## ఆధారాలు

**అడ్డం**

**1)** అనసూయ భర్త. ఆయన సప్తర్షుల్లో ఒకడు (2)

**2)** ఆకాశంలో చరించేవారు (3)

**4)** భరతుని తల్లి (2)

**6)** 'సుమతీ శతకం' పదంలో బుద్ధి? (2)

**7)** విరిపుష్పించింది – అనే పదంలో శత్రువు అనే అర్థం వచ్చే పదం దాగి ఉంది (2)

**10)** జమదగ్ని మహర్షిని చంపిన క్షత్రియుడు (7)

**13)** బలము (2)

**15)** దేవుడి మాహాత్మ్యాన్ని ఇలా అని కూడా అంటారు (2)

**16)** తమిళ సంప్రదాయంలో 'శ్రీ' అంటే (2)

**17)** దమయంతి భర్త (3)

**18)** ఇదికాని వాడు మోక్షగామి కాలేదు (2)

**నిలువు**

**1)** సుభద్రార్జునుల కుమారుడు (4)

**3)** కృతయుగాన దండనీతి ప్రవర్తకుడగు మనువునకు జనించిన ప్రజాని యనువాని పుత్రుడు. ఇక్ష్వాకుని తండ్రి (3)

**5)** విషవైద్యం తెలిసిన బ్రాహ్మణుడు పరీక్షిత్తును రక్షించుదామని వెడుతూండగా తక్షకుడు అడ్డగించి వెనకకు పంపించాడు. అతడు ఎవరు (4)

**8)** భర్త మరియు కొడుకులు లేని స్త్రీని ఇలా అంటారు (3)

**9)** వినాయకచవితి రోజున ఏకవింశతి పత్రాల్లో ఒకటైన గన్నేరును సంస్కృతంలో ఇలా అంటారు (3)

**11)** ప్రహ్లాదుని తల్లి (4)

**12)** మారీచుని కుమారుడు రావణాసురునికి మిత్రుడు. (4)

**14)** తిరుమలలో భక్తులు సమర్పించేవి (3)

***శ్రీపదకేళి-06 (నవంబరు,09) సమాధానాలు***

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఆ | కా | 2 శ | రా | 3 జు | ■ | 4 కృ | ష్ణు | డు |
| నం | ■ | ని | ■ | న్న | ■ | ష్ణ | ■ | ■ |
| 5 ద | శ | ■ | 6 శా | పా | లు | ■ | 7 రా | 8 క |
| ని | ■ | 9 ప్ర | ■ | లు | ■ | 10 ని | ■ | మ |
| 11 ల | వ | ణు | డు | ■ | 12 శ | కుం | త | ల |
| య | ■ | తి | ■ | 13 వి | ■ | జం | ■ | జు |
| 14 ము | ద్దు | ■ | 15 శా | ద్వ | లం | ■ | 16 కా | డు |
| ■ | ■ | 17 వే | ■ | త్మ | ■ | 18 న | ■ | ■ |
| 19 వి | క | ట | క | వి | ■ | 20 గ | ర | ళం |

# తిరుచానూరు శ్రీ పద్మావతీ అమ్మవారి కార్తిక బ్రహ్మోత్సవాలు

తిరుచానూరు శ్రీ పద్మావతీ అమ్మవారి కార్తిక బ్రహ్మోత్సవాలు 12-11-2009 నుండి 21-11-2009 వరకు అంగరంగ వైభవంగా జరిగాయి.

తిరుచానూరు అమ్మవారి కార్తిక బ్రహ్మోత్సవాల్లో భాగంగా 13-11-2009న ధ్వజారోహణ కార్యక్రమం వైభవంగా జరిగింది. అదేరోజు రాత్రి చిన్నశేషవాహనంపై అమ్మవారు కృష్ణుడి అవతారంలో తిరుమాడవీథుల్లో ఊరేగుతూ భక్తులకు కనువిందుచేశారు. రెండోరోజు అమ్మవారికి పెద్దశేష వాహనం, హంసవాహన సేవలు జరిగాయి. మూడోరోజు అమ్మవారు ఉదయం ముత్యపుపందిరి వాహనంలోనూ, అదే రోజు సాయంత్రం సింహవాహనం మీద ఊరేగి భక్తులను ఆశీర్వదించారు.

**కల్పవృక్ష వాహనం :** తిరుచానూరు కార్తికబ్రహ్మోత్సవాల్లో భాగంగా నాలుగో రోజు 16-11-2009 అలమేలుమంగ కల్పవృక్షవాహనంపై చిద్విలాసంగా ఊరేగారు. ఇందులో భాగంగా రాజులకు రాజైన రాజగోపాలుని అవతారంతో అమ్మవారు వజ్ర వైడూర్యాలను ధరించి కల్పవృక్ష వాహనంపై తేజో విరాజమానంగా తిరుమాడ వీథులలో విహరించారు.

**హనుమంత వాహనం :** అదేరోజు సాయంత్రం అమ్మవారు రాముని అవతారంలో హనుమద్వాహనంపై ఊరేగారు. వజ్ర వైడూర్య మాణిక్య ఆభరణాలతో, పట్టుపీతాంబరాలతో విశేషంగా అలంకరించారు. కోదండరాముని అవతారంలో హనుమద్వాహనంపై ఆసీనురాలైన అమ్మవారు తిరుమాడవీథుల్లో భక్తజనానికి దర్శనభాగ్యాన్ని కల్పించారు.

**జగన్మోహినీ అవతారం :** కార్తిక బ్రహ్మోత్సవాల్లో ఐదో రోజు (17-11-2009) ఉదయం పద్మావతీ అమ్మవారు పల్లకిలో జగన్మోహిని అవతారంలో ఊరేగుతూ భక్తులకు దివ్యదర్శనం ప్రసాదించారు. అదేరోజు రాత్రి అమ్మవారు గజవాహనంపై తిరుమాడ వీథులలో ఊరేగి, భక్తుల మొరలను ఆలకించారు.

**సర్వభూపాల వాహనం :** ఆరవ రోజు (18-11-2009) భక్తుల కొంగుబంగారం అయిన అలమేలుమంగ సర్వభూపాల వాహనంపై భక్తులకు కనువిందు చేశారు. సుప్రభాతసేవతో అర్చకులు అమ్మవారిని మేల్కొలిపి నిత్యార్చన, పూజా కార్యక్రమాలు నిర్వహించారు.

**స్వర్ణరథ విహారం :** అదేరోజు సాయంత్రం పద్మావతిదేవి స్వర్ణరథంలో భక్తులను కటాక్షించారు. అర్చకులు సహస్ర నామార్చన, నిత్యార్చన పూజల అనంతరం వాహనమండపానికి అమ్మవారిని తీసుకువచ్చారు.

**గరుడవాహనం :** అదేరోజు రాత్రి గరుడవాహనంపై మహావిష్ణు స్వరూపిణియై విహరించిన పద్మావతీదేవికి భక్తజన కోటి కర్పూర నీరాజనాలర్పించారు. వాహన మండపాన్నుంచి అమ్మవారు బయటకు రాగానే వేదమంత్రోచ్చారణలతో, భక్తులు గోవిందనామ సంకీర్తనలతో స్వాగతం పలికారు.

**సూర్యప్రభ వాహనం:** కార్తిక బ్రహ్మోత్సవాలలో భాగంగా ఏడవ రోజు (19-11-2009) ఉదయం నారాయణుడి అవతారంలో అమ్మవారు తిరుమాడ వీథులలో ఊరేగారు.

**చంద్రప్రభ వాహనం :** అదేరోజు రాత్రి, హాయలొలికించే చిరుగాలుల మధ్య చంద్రప్రభ వాహనంపై అమ్మవారు ఆలయ తిరుమాడ వీథులలో శోభాయమానంగా విహరించారు. వెన్న దొంగిలించే చిన్నికృష్ణుడి అవతారంలో పద్మావతి అమ్మవారు ఊరేగుతూ భక్తులు సమర్పించే మంగళహారతులను స్వీకరించారు.

ఎనిమిదవరోజు 20-11-2009న ఉదయం రథోత్సవం, సాయంకాలం అశ్వవాహనసేవ జరిగాయి. బ్రహ్మోత్సవాలలో భాగంగా తొమ్మిదవరోజు ఉదయం పల్లకి ఉత్సవం జరిగింది. అదేరోజు మధ్యాహ్నం 12.10 ని॥లకు కుంభ లగ్నంలో అమ్మవారికి పంచమీ తీర్థంతో బ్రహ్మోత్సవాలు పరిసమాప్తమయ్యాయి.

కార్తిక బ్రహ్మోత్సవాల సందర్భంగా తిరుచానూరులోని అమ్మవారి ఆస్థానమండపంలో మరియు తిరుపతిలోని మహతి సభామందిరంలో జరిగిన వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు భక్తులను విశేషంగా ఆకట్టుకున్నాయి.

ఈ కూపను కత్తరించండి

## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా : ____________________
   (విడి విడి అక్షరాలలో వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి) ____________________
   ____________________
   ____________________
   (పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐
2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు
3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-
4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :
5. చెల్లించిన మొత్తం :
6. చెల్లించిన విధం :
   డి.డి.నెం. / పే ఆర్డరు : తేది :

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలుస్తున్నది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి ప్రసాదాలకు సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- ☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- ☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**
- ☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- ☛ **మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083".**

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

రాజీవ నేత్రాయ రాఘవాయ నమో
సౌజన్య నిలయాయ జానకీశాయ

దశరథతనూజాయ తాటక దమనాయ
కుశిక సంభవ యజ్ఞగోపనాయ
పశుపతి మహాధనుర్భంజనాయ నమో
విశద భార్గవ రామ విజయకరణాయ



భరితధర్మాయ శూర్పణఖాంగ హరణాయ
ఖరదూషణాది రిపు ఖండనాయ
తరణిసంభవసైన్య దక్షకాయ నమో
నిరుపమ మహావారిధిబంధనాయ

హతరావణాయ సంయమినాథ వరదాయ
అతులిత అయోధ్యా పురాధిపాయ
హితకర శ్రీవేంకటేశ్వరాయ నమో
వితత వావిలిపాటి వీరరామాయ (2 - 273)



తామరసాక్షుడైన రఘురాముని చరిత్రను అన్నమయ్య పై సంకీర్తనలో కీర్తించాడు. రామాయణం మొత్తం ఈ సంకీర్తనలో ఆవిష్కృతమైంది.

వావిలిపాటి (చిత్తూరు జిల్లాలోని వాయల్పాడు) కోదండ రాముని అన్నమయ్య పై గీతంలో పేర్కొన్నాడు. ఇక్కడి రాముని దర్శించి అన్నమయ్య అనేక సంకీర్తనలు రాశాడు.

వావిలిపాటి రామునికి, శ్రీ వేంకటేశ్వరుడికి అభేదం తెల్పుతూ పాడిన గీతమిది.

పాఠకులకు, రచయితలకు,
ఏజంట్లకు, శ్రేయోభిలాషులకు, అందరికీ

## తెలుగు నూతన సంవత్సరాది
## ఉగాది & శ్రీరామనవమి
## శుభాకాంక్షలు



**శ్రీనివాసుని కరుణాకటాక్షవీక్షణాలు
అందరిపై ప్రసరించాలని,
అందరికీ ఆ దేవదేవుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు
ప్రసాదించాలని ప్రార్థిస్తూ......**

సర్వేజనా స్సుఖినో భవంతు

**సప్తగిరి**

మహాశయా!

జనవరి సంచిక 3వ కవరులో వర్ణచిత్రం వేయడం బాగుంది. వ్యాఖ్య అంత తక్కువగా వేయడం బాగాలేదు. పూర్తి పాఠం వేయకపోవడం ఏమీ బాగాలేదు. పాటబట్టేకదా పటం? సంకీర్తన పూర్తిగా వేస్తే దాని సారాంశాన్ని ఎలా ఎంతగా చిత్రకారుడు చిత్రీకరించగలిగాడో తెలుస్తుంది.

మహనీయులు మొవ్వ వృషాద్రిపతిగారు బాహుదానది ఒరిస్సాలో ఒక కొండవాగు, మహానదిలో కలుస్తుందట అని వ్రాయగా (పుట–16), నందలూరు ప్రక్కన చెయ్యేరుగా ప్రసిద్ధమీ బాహుద అని పి.కృష్ణమూర్తి వ్రాశారు(పుట–45). దీనిని సమన్వయ పరచవలసిన బాధ్యత సంపాదకులైన మీది.

అచ్చుతప్పులు ఎక్కువగా ఉంటున్నవి. ఇవి మామూలు విషయాలైతే పఠితలు సర్దుకోగలరు. సాంకేతిక విషయాలైతే తికమక పెట్టిస్తాయి. ఉదాహరణ : 42వ పుట మొదటి కాలం, మొదటి పేరా 16 పంక్తి శా.శ.820(క్రీ.శ.820) అని ఉండటం. మరొక విషయం తమిళంలో 'ఱ్ఱ' ఉంటే తెలుగులో 'ట్ర' అనే వ్రాయాలి. ఒకటవ పేజీ సంకీర్తనలో రెండవ పంక్తిలో తప్పు. చూడికుడుతనాచారి అని ఉండాలి.

*- వి.ఏ.కె.రంగారావు, చెన్నై.*

☛ **సప్తగిరి మాసపత్రిక పట్ల మీకున్న అభిమానానికి, శ్రద్ధకు కృతజ్ఞతలు. వర్ణ చిత్రానికి సంబంధించి సంకీర్తన, తాత్పర్యం పూర్తిగా వేయడానికి స్థలం చాలదు. లేదా చిన్న చిన్న అక్షరాలలో వేయాలి. ఇది పాఠకులకు ఇబ్బంది కల్గిస్తుంది. అయినా ముందు ముందు మీ సూచనలు తప్పక పరిగణనలోకి తీసుకుంటాం.**

**బాహుదానది విషయంలో రెండు అభిప్రాయాలు ఉన్నప్పటికీ మీ సందేహాన్ని మొవ్వ వృషాద్రిపతిగారికి తెలియజేస్తున్నాం. రాబోయే సంచికల్లో అచ్చు తప్పులు లేకుండా కృషి చేస్తాం.**

**- ప్రధాన సంపాదకుడు**

### ఏప్రిల్ పండుగలు

**28 - నాగులాపురం శ్రీ వేదనారాయణ స్వామి బ్రహ్మోత్సవాలు ప్రారంభం**

## మీ మాట

### ఆత్మసంతృప్తి

సప్తగిరి డిసెంబరు సంచిక ఆద్యంతం మమ్మల్ని ఆకట్టుకుంది. ముఖచిత్రం మొదలుకుని వార్తాలహరి వరకు అక్షరం వదలకుండా చదివి సంతోషించాం.

మధ్యపేజీల్లో వేసిన పార్థసారథి ఛాయాచిత్రం దాచుకోదగ్గది. వ్యాసాలు ఆత్మసంతృప్తిని కల్గిస్తున్నాయి.

*- వక్కలగడ్డ సూర్యప్రకాశరావు,
నర్సరావుపేట.*

### ధన్యవాదాలు...!!

ప్రతినెలా సప్తగిరి మాసపత్రికలోని అన్ని వ్యాసాలు బాగుంటున్నాయి. ముఖ్యంగా ఉషశ్రీ భారతం చాలా బాగుంటున్నది. ఇక వర్ణచిత్రాలు హృదయాన్ని హత్తుకునేటట్లు ఉన్నాయి. మున్ముందు సప్తగిరిలో మరిన్ని శీర్షికలు వెలువరించగలరు. ఆకర్షణీయంగా పత్రిక తెస్తున్నందుకు యాజమాన్యానికి ధన్యవాదాలు.

- పల్లా. సుష్మ, హైదరాబాదు

### ఆలోచింపజేస్తోంది

సప్తగిరి సంచికలో ప్రతినెలా వెలువడుతున్న సంపాదకీయాలు మమ్మల్ని ఆలోచింపజేస్తున్నాయి. విశ్లేషణ అర్థవంతంగా, ఔచిత్యవంతంగా ఉంటోంది.

*- జయదేవ్, జగ్గంపేట.*

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 40 మార్చి, 2010 సంచిక : 10





అవివేకితో చెలిమికంటే,
వివేకితో విరోధం మేలు.


గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.

ఉప-సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ

ముద్రాపకుడు :
వి. సాంబశివరావు, డి.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి. :
ప్రధాన సంపాదకుల వారి కార్యాలయం,
తి.తి.దే., తిరుపతి


ముఖ చిత్రం :
**శ్రీ కోదండరామస్వామి** (తిరుమల శ్రీవారి ఆలయం)

చివరి పుట :
**తిరుపతి శ్రీకోదండరామాలయం**




***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083,
ఫోను : 0877-2264543

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ. 500-00

**విదేశాలకు**
సం॥ చందా -- రూ. 850-00

## సంపాదకీయం

# అరుదైన గౌరవం

భారతీయ సంస్కృతికి వేదాలు పట్టుగొమ్మలు. వేదాలు విజ్ఞానసర్వస్వాలు. ఆర్షసంస్కృతి వేద ప్రతిపాదితమైనదే. భారతీయ జీవనవిధానాన్ని మహోన్నతంగా రూపొందించింది వేదం.

ఆధునిక నాగరికతా ప్రభంజనానికి ఈ ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలు అన్నీ రెపరెపలాడుతున్నాయి. ఒక జాతి తనను తాను సంరక్షించుకోడానికి ప్రాణప్రదమైన ప్రాచీన వాఙ్మయాన్ని కాపాడుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వ్యాపారవిద్య పరివ్యాప్తిస్తున్న నేపథ్యంలో సాంకేతిక పరిజ్ఞానంపట్ల పెరుగుతున్న వ్యామోహంతో వేదవిద్యపట్ల ఆదరణతగ్గుతోంది. ఈ పరిస్థితిని దృష్టిలో ఉంచుకుని ధార్మిక సంస్థలలో అగ్రగామిగా నిలచిన తి.తి.దేవస్థానం వేదపరిరక్షణకు కంకణం కట్టుకుంది. శ్రుతులు, అపౌరుషేయాలే అయినా, పురుషప్రయత్నం లేనిదే వాటిని ప్రచారం చేయలేం. వేదపండితులు ఈ ప్రచార ఉద్యమంలో ముఖ్యకార్యకర్తలు. వైద్యనిపుణులు అయినా, వేదపండితులైనా, ఘనాపాఠులైనా, అవతార పురుషులైనా శారీరక ధర్మాలను అధిగమించడం అసంభవం. 'శీర్యతే ఇతి శరీరః' అన్నట్టు శరీరం నశించితీరేదే అయినా వయోవృద్ధులైన వేదపండితులను, వారికి సంక్రమించే వ్యాధులనుండి రక్షించుకోవాల్సిన ధర్మం ధార్మికసంస్థల నైతికబాధ్యత.

ఈ నేపథ్యంలో తి.తి.దే. పాలకమండలి **'సంభావన స్కీము'** పేరుతో 70 సం॥ వయస్సులైన వేదశాస్త్ర పండితులకు సంభావన పథకాన్ని ప్రవేశపెట్టింది. దీని ప్రకారం ఆంధ్రప్రదేశ్‌కు చెందిన వృద్ధులైన ఆగమ పండితులకు ఈ సంభావన స్కీము వర్తిస్తుంది. ఈ వృద్ధాప్య సంభావన కోరే ఆగమ పండితుల నుండి దేవస్థానం ఇదివరకే దరఖాస్తులు స్వీకరించడం ప్రారంభించింది. దీనికి కొన్ని అర్హతలు నిర్ణయించింది. దేవాదాయశాఖ ఆగమ పరీక్ష ఉత్తీర్ణత లేదా 30 సంవత్సరాలు నిరాటంక అర్చక వృత్తి లేదా 20 సంవత్సరాలు యాజ్ఞికవృత్తిలో ఉంటూ కర్షకాది ప్రతిష్ఠానంతం పాల్గొని ఉండుట లేదా 20 సంవత్సరాలుగా ఆగమ విద్యార్థుల బోధన లేదా 20 సంవత్సరాలుగా ఆగమ గ్రంథ పుస్తక రచన లేదా 20 సంవత్సరాలు ఏదైనా 6–ఎ దేవాలయాలలో పనిచేసి ఉంటే సంబంధిత ధృవీకరణ జతపరిస్తే దేవస్థానం వీరికి నెలకు రూ.3,200 సంభావన ఇస్తుంది.

వేదవిద్యలు, శాస్త్రవిద్యలు ఒక్క మాటలో చెప్పాలంటే ప్రాచ్యవిద్యలన్నీ అనాదరణకు గురిఅవుతూ ఏ మాత్రం ఉత్సాహప్రోత్సాహకాలకు నోచుకోని గడ్డుపరిస్థితుల్లో దేవస్థానం ఈ పథకాన్ని ప్రారంభించడం ప్రశంసాపాత్రం. భావితరాలు ఈ విద్యలపట్ల మక్కువను పెంచుకుని ఈ రంగాల్లో తమవంతు కృషిని సల్పడానికి ఇలాంటి అభ్యుదయ పథకాలు ఎంతగానో దోహదపడతాయి. అనంతావై వేదాః – వేదాలు అనంతాలు. వాటిలోని పరిజ్ఞానం అపరిమితం. సామాన్యుడికి సంబంధించిన పరిజ్ఞానంనుండి మహోన్నతమైన విలువలవరకూ వేదం తనలో నిక్షిప్తం చేసుకుంది అనడంలో అతిశయోక్తి లేదు. ఇలాంటి వేదాల పరిరక్షణ మన దేశమౌలిక స్వరూప స్వభావాలను కాపాడుకోవడంలో పలువిధాల సహకరిస్తుంది అనడం సహజోక్తి.

వేదవాఙ్మయం విలసిల్లడానికి వేదపండితులు మూలాధారం. వేదాలను రక్షించినప్పుడే ధర్మం నిలబడు తుంది. ధర్మం నిలబడినప్పుడే దేశసంస్కృతి కూడా నిలబడుతుంది. కాబట్టి సంస్కృతి సంప్రదాయాలకు ఆధార మైన వేదవాఙ్మయాన్ని కాపాడుకునే దిశగా తిరుమల తిరుపతి దేవస్థానం కృషి సల్పుతోంది. ఇందుకు అందరూ సహాయసహకారాలు అందించాలని, అందిస్తారని ఆకాంక్ష.

**వేదవిదే కిల దత్తం దత్తం**

# చైతన్య ప్రవంతి-ఉగాది

- డా॥ పరవస్తు కమల

ఉగాది ఆగమనానికి నాంది. వినూత్న జీవనానికి క్రాంతి. హైందవుల పండుగలకు ఒక విశిష్టత ఉంది. సంస్కృతి, సంప్రదాయం పేరిట మానవాళికి విజ్ఞానాన్ని అందించి వారిలోని చైతన్యాన్ని సంఘటితం చేసి విశ్వశాంతి కోసం అత్యున్నత ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని, సంప్రదాయం పేరుతో వాటిని తరతరాలకూ అందించడం కోసం ఏర్పాటు చేయబడినవే ఈ పండుగలు.

'యుగాది' అనేదే "ఉగాది"గా వ్యవహరించబడు తోంది. సంవత్సరాలు, ఋతువులు, మాసాలు, తిథులు, సృష్ట్యాది నుండి మాత్రమే జరుగుతున్నాయా? అని ఆలోచిస్తే, ఈ కాల మనంతమైంది. మహాప్రళయకాలంలో కూడ కాలం యొక్క లెక్క గలదని చెప్పబడింది. అందువల్లే మన పంచాంగాలలో "సృష్ట్యాదిగతాబ్దాః" అని రాయబడుతోంది.

అనంతమైన కాలగమనంలో కల్పాలు, యుగాలు, మన్వంతరాలు ఈ కాలానికి ప్రధానమైనవి. ఇది వైవస్వత మన్వంతరం.

బ్రహ్మ యొక్క ఆయుర్దాయం దీర్ఘమైనా దానికి కూడ పరిమితి ఉంది. ఈ బ్రహ్మ, ఈ మనువులు, వీరందరిని నియమించేవాడు సర్వేశ్వరుడే.

మనువు, బ్రహ్మ వీరి లెక్కలు మన భారతదేశంలో ప్రధానంగా కాలంలో నిరూపించడంలో ప్రముఖమై ఉన్నాయి. ఆ లెక్కలను జ్యోతిష్కులు నిత్యం గణిస్తున్నారు.

బ్రాహ్మణులు తమ నిత్య నైమిత్తిక కర్మలందు వానిని పేర్కొంటూ ఉన్నారు. ఇప్పుడు జరుగుతోంది. మొదటి బ్రహ్మ కాలం, శ్వేతవరాహకల్పం, వైవస్వత మన్వంతరం, కలియుగం అని చెప్పబడుతోంది.

ఎవరి భయం వల్ల వాయువు వీస్తున్నాడో, ఎవరి భయం వల్ల సూర్యుడుదయిస్తున్నాడో, ఎవరి భయం వల్ల అగ్ని, ఇంద్రాదులు ప్రవర్తిస్తున్నారో అట్టి భగవానునిచే ఏర్పరచబడ్డ కాలమానమే మనది.

మన పూర్వుల ఆలోచన, ఉద్దేశ్యం సమాజంలోని ఏ ఒక్క వర్గానికో కాక అన్ని వర్గాలూ కలిసిన సమాజాన్ని సంఘటితం చేసి, ప్రాచీన సంప్రదాయాల పేరుతో ప్రకృతి సిద్ధమైన చైతన్యతను పెంపొందించి మానవాళికి శ్రేయస్సును చేకూర్చడమే.

"గతం నాస్తి కాదు నేస్తం" అన్న కవి మాటలు నిజంగా అక్షరసత్యాలు. ఆమని మానవునికి ఆనందాన్నీ, నవ్యత్వాన్ని, చైతన్యాన్ని అందించేందుకు చైత్రశుద్ధపాడ్యమి నాడు, ధరించిన స్వరూపమే "ఉగాది" స్వరూపం. సృష్టి ప్రళయానంతరం చిగిర్చి కొత్త సింగారాలు అలంకరించుకున్న ప్రకృతి మాత్రమే మానవునికి తిరిగి మనుగడ కల్పించి ఉండవచ్చు.

హైందవుల చరిత్రలో ఈ ఉగాదికి ఎంతో ప్రాముఖ్య ముంది. ధర్మం నాలుగు పాదాల్లో నడచిన రామరాజ్యం ఈ ఉగాదినాడే ఏర్పడింది. ధర్మానికి ప్రతిరూపమైన ధర్మరాజు ఈ ఉగాదినాడే శకారంభం గావించాడట. ఈ ఉగాది రోజే శాలివాహన శకం ఆరంభమైనది. ఈ ఉగాది వెనుక ఎన్నో విజయగాథలు, ఎంతో చైతన్యశక్తి నిండి, మానవునికి ఆనందాన్ని పంచుతోంది.

భారతీయ కాలగణనం మూడు విధాలుగా చేయ బడింది. 1) సౌరమానం 2) చాంద్రమానం 3)బార్హస్పత్య మానం. సూర్యుని ఉదయాస్తమయ కాలాలను ఆధారంగా చేసుకుని నిర్ణయించేది సౌరమానంకాగా, చంద్రుని ఉదయాస్త మయ కాలాలు, వృద్ధి క్షయాల ఆధారంగా చేసే కాలనిర్ణయం చాంద్రమానమైనది. ఇంక మూడవది గురుగ్రహం. అనగా బృహస్పతి గ్రహం యొక్క చలనం ఆధారంగా చేసే గణనమే

**2010, మార్చి 16 ఉగాది సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

## శ్రీ వేంకటేశ్వర గీతమాలిక

**- 1 -**

కనుగొంటి కనుగొంటినీ
కల్యాణ శ్రీ వేంకటేశ్వరుని కనులార
కనుగొంటి కనుగొంటినీ ॥ కను ॥

ఆ స్వామి నవ్వులే మల్లెలై జాజులై
అలమేలు మంగమ్మ కురులలో జాల్వార ॥ కను ॥

అలమేలు మంగమ్మ అరవంక కనుబొమల
జంకెనల కపట భయనటన చూపే స్వామి ॥ కను ॥

శ్రీ ప్రభానరసింహ చిత్తాబ్జ భ్రమరమై
శేషాచలము మీద సిరులొలుకు ఆ స్వామిని ॥ కను ॥

**- 2 -**

కలువ పువ్వుల్లాంటి కనులు మూతలు వేసి
శయనించు మాఅయ్య శ్రీ శ్రీనివాసా
శయనించు మా అయ్య శ్రీ శ్రీనివాసా ॥ కలువ ॥

పగలంత నిలబడి - భక్తులకు సిరులిడి
అలసి సొలిశావయ్య - అలమేలుమంగపతి ॥ కలువ ॥

నడిరాత్రి పయిబడి - నయనాలు ఎర్రబడె
విశ్రాంతి గొనుమయ్య - విశ్వపతి ఓ స్వామి ॥ కలువ ॥

నీ చిన్నిబొజ్జలో - నిదరోయె లోకాలు
ఆదమరచి ప్రజ - వదిలేసె శోకాలు ॥ కలువ ॥

నింగి నిదరోయింది - నేల నిదరోయింది
శశిరవులు శయనించ - చుక్కలూ కనుమూసె ॥ కలువ ॥

కోనేటి నీటి తుంపురులతో కలగలిసి
కొండమల్లెల తావి గుప్పుమంటున్నాది
దివ్యసురభిళములు - తీయగా వీయగా
శయనించు మా అయ్య శ్రీ శ్రీనివాసా ॥ కలువ ॥

- ఆచార్య పి. నరసింహా రెడ్డి

బార్హస్పత్యమానం. చాంద్రమానం ప్రకారం చైత్రశుద్ధ పాడ్యమి నాడు ఆ సంవత్సరంలో మొదటి దినం.

సృష్టి అనంతం ఒకేసారి నవచైతన్యాన్ని పొంది సరికొత్త సింగారంతో కొంగ్రొత్త ఆశల చిగుర్లతో దర్శనమిస్తూ మానవుని విధిని గుర్తు చేస్తూ, అనుక్షణం అనాదిగా వచ్చే సంప్రదాయాల విలువ చవిచూస్తూనే, నవ్యత్వాన్ని పొంది చైతన్యంలో ముందుకు నడవమంటుంది. ఇదే ఉగాది ఇచ్చే అతి విలువైన సందేశం.

ఈ పండుగ సంప్రదాయం కూడా ఋతు ప్రాధాన్యం, కాలప్రాధాన్యంతో జరుగుతుంది. ప్రకృతి లేనిదే జీవి లేదు. జీవునికి, ప్రకృతికి గల అవినాభావ సంబంధాన్ని మరోమారు ఉగాది గుర్తుచేస్తుంది. సరికొత్త ప్రకృతి అందించే షడ్రుచుల సమ్మేళనంతో తయారు చేసిన ఉగాది పచ్చడి సేవనం ఆరోగ్యానికే కాక జీవితంలోని తీపి చేదులకూ ప్రతీకగా నిలిచి జీవిత సత్యాన్ని బోధిస్తూనే ఆరోగ్యాన్ని చేకూరుస్తుంది.

ప్రకృతి, కాలాన్ని అనుసరించి ఆ సంవత్సరంలోని గ్రహచార ఫలాలలోని మంచి చెడులను విశ్లేషించి తెలుసుకుని, మంచికోసం పాటు పడేందుకుపకరిస్తుంది పంచాంగ శ్రవణం. అంతేగాక నూతన సంవత్సరంలో సమాజంలోని వ్యక్తులంతా శుభాన్ని, ముక్తిని ప్రసాదించే భగవదాలయంలో సామూహికంగా కొలువుదీరి పంచాంగశ్రవణం ద్వారా చెడునుప శమింపచేసుకునే మార్గాలు చర్చించుకుని శుభాకాంక్షలంద జేసుకోవడం ద్వారా వ్యక్తుల మధ్య సన్నిహిత సంబంధాలధికమై సామాజిక శ్రేయస్సు జరుగుతుంది.

"మనకు మిగులును గతం లోపలి మంచి అదియే సంప్రదాయము" అన్న మాట సత్యం. పండుగల పేరుతో తప్పనిసరిగా చేసే "తలంటుస్నానం" శుచిశుభ్రతతో బాటు ఆయువును కూడా పెంచుతుంది.

ఈ నవవత్సరం ఉగాదిని ఘనంగా స్వాగతిద్దాం. పరమాత్మను ప్రార్థిస్తూ "సర్వేజనాః సుఖినో భవంతు, సమస్త సన్మంగళాని భవంతు" అని మనసారా కోరుకుందాం... తదను గుణంగా నడచుకుందాం.

# అన్నమయ్య - శ్రీ వేంకటేశ్వర తత్త్వం

- డా॥ కాసల నాగభూషణం

**వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,**
**వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి -**

అన్నది శ్రీ వైష్ణవుల ప్రగాఢవిశ్వాసం! కాగా పరమ భాగవతోత్తముడు, వాగ్గేయకారుడు అయిన అన్నమయ్య పదాల్లో ఈ వేంకటేశ్వర తత్త్వం ఆద్యంతం ప్రతిఫలిస్తూ భక్తకోటిని తరింపజేస్తున్నది.

తాళ్లపాక అన్నమయ్య జన్మతః స్మార్త బ్రాహ్మణుడు. నందవరీక నియోగి. ఆయన గురువు శ్రీ ఆదిశఠకోప యతీంద్రులు. ఈయన అహోబల నృసింహుణ్ణి ఆశ్రయించిన వాడు. ఈ యతీంద్రుడు అన్నమయ్యకు విశిష్టాద్వైత సిద్ధాంతోపదేశం చేశాడు. అంతకు ముందే శ్రీ వేంకటేశ్వరుని ఆనతి మేరకు విష్ణునామకుడైన ఒకానొక ఆచార్యుడు అన్నమయ్యకు తిరుమల మీదే పంచసంస్కారాలు జరిపించాడట! సరిగా ఆ కాలానికే శ్రీ పాదరాయస్వామి కర్ణాట గేయ రచనలు బహుళ ప్రచారంలో ఉన్నాయి. ఆ పాటల స్ఫూర్తితో అన్నమయ్య కూడా తెలుగులో పదరచనకుపక్రమించాడు. సహజమైన ప్రతిభా సంపత్తికి, భగవద్భక్తి తోడయింది. సర్వం విష్ణుమయంగా సాక్షాత్కరించింది. ఆయన రచించిన అధ్యాత్మ శృంగార భావభరితాలైన సంకీర్తన లన్నింటిలోను శ్రీ వేంకటేశ్వరుని అనంతత్వమే అనేక ముఖా లతో ప్రత్యక్షమౌతుంది. స్థాలీపులాక న్యాయంగా ఇప్పుడు మనం కొన్ని సంకీర్తనల్ని పరిశీలిద్దాం.

**ఇప్పడిటు కలగంటి నెల్లలోకములకు**
**అప్పడగు తిరువేంకటాద్రీశు గంటి**

**అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి**
**ప్రతిలేని గోపుర ప్రభలు గంటి**
**శతకోటి సూర్యతేజములు వెలుగగగంటి**
\- - - - - - - - - - - - - - - - - -
\- - - - - - - - - - - - - - - - - -

**సరిలేని యభయహస్తము గంటిని**
**తిరువేంకటాచలాధిపుని జూడగ గంటి**
**హరి గంటి గురుగంటి నంతట మేల్కంటి**



– భక్తకోటికి ఆ శ్రీ వేంకటేశ్వరుని సందర్శన భాగ్యాన్ని ప్రసాదించే వర్ణనాత్మకమైన సంకీర్తన ఇది.

ఇక 'శ్రవణం' 'కీర్తనం' 'స్మరణం' 'పాదసేవనమ్', 'అర్చకం' 'వందనం' 'దాస్యం' 'సఖ్యమాత్మ నివేదనమ్' అని భాగవతం ప్రతిపాదించిన నవవిధ భక్తి మార్గాలు శ్రీ వైష్ణవులకు అవశ్యం అనుసరణీయాలు.

ఈ నవవిధ భక్తి మార్గాలను ఒకే పదంలో గుదిగుచ్చి చూపాడు అన్నమయ్య.

**నిత్య సుఖానంద మిదె నీ దాస్యము**
**సత్యము లేని సుఖాలు చాలుఁ జాలునయ్య**

**కన్ను చూపుల సుఖము నీ చక్కని రూపె**
**యెన్నగ వీనుల సుఖమిదె నీ పేరు**
**పన్ని నాలుక సుఖము పాదపు నీ తులసి**
**వున్న సుఖముల తెరువొడబడమయ్యా ॥ నిత్య ॥**

**తనువుతోడి సుఖము తగు నీ కైంకర్యము**
**మనసులో సుఖము నీ మంచి ధ్యానము**
**పనివి నీ యూర్పు సుఖము పాదపద్మము వాసన**
**యెనయని పెర సుఖమేమి సేసేనయ్యా**

**పుట్టుగుకెల్ల సుఖము పొల్లులేని నీ భక్తి**
**తొట్టి కాళ్ళ సుఖము పాతురలాడుట**
**జట్టి శ్రీ వేంకటశ మా చనవోలి చెన్నుడవై**
**వొట్టు కొని మమ్మేలితివోహో మేలయ్యా**

అలాగే సర్వవ్యాపి ఐన విష్ణుపారమ్యాన్ని సూచించే విధంగా వైష్ణవం గురించి అన్నమయ్య రచించిన కీర్తన –

**వలెననువారిదె వైష్ణవము యిది**
**వలపుఁదేనెవో వైష్ణవము**

**కోరికలుడుగుచు గుటి నిన్నిటిపై**
**వైరాగ్యమెపో వైష్ణవము**
**సారెకు కోపము చలమును తనలో**
**వారించుటవో వైష్ణవము**

\- - - - - - - - - - - - - - - - -

\- - - - - - - - - - - - - - - - -

**వుదుటున తన సకలోపాయంబులు**
**వదలుటపో నిజవైష్ణవము**
**యెదుటను శ్రీ వేంకటేశ్వరు నామము**
**వదనము చేర్చుట వైష్ణవము**

ఇలా అధ్యాత్మ సంకీర్తనల్లో భక్తి వైరాగ్య వేదాంత భావనల్ని వెలార్చిన అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో లీలా మానుష విగ్రహుడైన ఆ అవతార పురుషుని దివ్యశృంగారాన్ని ఎంతో అందంగా అభివర్ణించాడు. మచ్చుకి ఒక కీర్తన చిత్తగించండి –

**ఏమొకో చిగురుటధరమున యెడనెడ కస్తురి నిండెను**
**భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు గదా!**

**కలికి చకోరాక్షికి కడకన్నులు కెంపైతోచిన**
**చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు**

\- - - - - - - - - - - - - - - - -

\- - - - - - - - - - - - - - - - -

**గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున**
**అద్దిన సురతపుఁ జెమటల అందము కాదు గదా!**

ఇంతమాత్రమే గాక వైకుంఠపురాన్ని వీడివచ్చిన సాక్షాత్ శ్రీమహావిష్ణువే ఈ వేంకటేశ్వర విభుడన్న విషయాన్ని స్థాపించ డానికి అన్నమయ్య ఆదిశేషుణ్ణి, గరుత్మంతుణ్ణి, శంఖ చక్ర గదాది ఆయుధాలను, ఇతర పరివారాన్ని, సనక సనందన నారద తుంబురాది మహర్షులను యథోచిత సన్నివేశాలను కల్పిస్తూ ప్రస్తావిస్తాడు. దశావతార ఘట్టాలను, మహిమలను, సుప్రభాత సేవలను తనివితీరా వర్ణిస్తాడు. పురాణగాథల్ని స్వీకరిస్తాడు. శ్రీ వేంకటేశ్వరుని అర్చామూర్తిని మన ఎదుట సాక్షాత్కరింప జేస్తాడు. అదే సమయంలో

***బ్రహ్మ కడిగిన పాదము, బ్రహ్మము తానీ పాదము*** అని, ***బ్రహ్మ మొక్కటే పర, బ్రహ్మ మొక్కటే*** – అనీ తన ఇష్టదైవమైన ఆ శ్రీ వేంకటపతిని కేవలం నిర్గుణమైన పర బ్రహ్మగా నిరూపిస్తాడు.

సంపూర్ణమైన భక్తిప్రపత్తి, సర్వతోముఖమైన కవితాశక్తి, సానుకూలమైన సంగీతస్థితి–సరిసమంగా సంగమించిన త్రివేణి– అన్నమయ్య పదసాహిత్యం. భక్తులతో పాటు సరస సంగీత సాహిత్యానురక్తులు సైతం అనునిత్యం ఆ ఆనంద రస ప్రవాహంలో ఓలలాడుతున్నారన్న విషయం ప్రత్యక్షర సత్యం.



## తిరుపతి శ్రీ కోదండరామస్వామి వారి బ్రహ్మోత్సవాలు

**2010, మార్చి 13 నుండి 22 వరకు**

| తేదీలు | వారం | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 13-03-10 | శనివారం | --- | అంకురార్పణం |
| 14-03-10 | ఆదివారం | ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 15-03-10 | సోమవారం | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 16-03-10 | మంగళవారం | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 17-03-10 | బుధవారం | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 18-03-10 | గురువారం | మోహినీ అవతారం | గరుడ వాహనం |
| 19-03-10 | శుక్రవారం | హనుమద్వాహనం | గజవాహనం |
| 20-03-10 | శనివారం | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 21-03-10 | ఆదివారం | రథోత్సవం | అశ్వవాహనం |
| 22-03-10 | సోమవారం | చక్రస్నానం | ధ్వజావరోహణం |

# శ్రీ మహాలక్ష్మి ఆవిర్భావం

– డా॥ డి. ఉదయకుమారి

"క్షీరసాగరంలో మందరగిరిని కవ్వంగా, వాసుకి అనే మహాసర్పాన్ని చిలికేతాడుగా చేసి దేవదానవులు అమృత మథన కాంక్షితులై చిలుకుతుంటే, సముద్రగర్భంలోకి మునిగి పోతున్న మందరగిరిని శ్రీమహాకూర్మమై, తన వీపు మీద నిలుపుకుని, ఇక క్షీరసాగర మథనం కొనసాగించమని ఆనతి చ్చాడా ఆర్తత్రాణ పరాయణుడు. నిజానికి ఆ మహాద్భుతశక్తి చూసిన బ్రహ్మాది దేవతలు, సకల చరాచరాలు శ్రీహరి విచిత్రలీలకు విస్మయం పొందారు.

ఇక క్షీరసాగరంలో నుండి ముందస్తుగా వాసుకి ఫణాల నుంచి కక్కిన విషం దావానలమై, హాలాహలంగా మారి ఉద్భవించింది. దాన్ని దేవత లందరి కోరికపై ఈశ్వరుడు మింగి తన కంఠంలో ఓ పక్కగా నిల్పి, నీలకంఠునిగా ప్రసిద్ధి చెందాడు. లోకకల్యాణం కోసం, భర్తను విషం మింగమని చెప్పిన పార్వతి "సర్వమంగళ"గా శాశ్వతకీర్తి పొందింది. ఆ తర్వాత "సురభి" అనే మహాద్భుత రూపంగల "కామధేనువు" పుట్టింది. "అగ్నిహోత్రి" అనే పేరు పెట్టుకుని ఆ కామధేనువును మహర్షులు తీసుకున్నారు అపు రూపంగా. వారి స్వార్థం కోసం కాదు, తమ దగ్గరకు వచ్చే అశేష సాధువులకు, సత్పురుషులకు, మహారాజులకు, వారి స్థాయికి తగ్గ అతిథ్యమిచ్చి, విందు భోజనం ఏర్పాట్లు చేసేందుకు కామధేనువును కోరారాబుషులు.

ఆ తర్వాత "ఉచ్చైశ్శ్రవం" అనే మహాద్భుతమైన "అశ్వం"గా ఉద్భవించింది. పాలకడలిలో నుంచి, ఆ గుర్రం రూపం, తోక అన్నీ సుందరంగా ఉన్నాయి. ఈ గుర్రం తోక రంగు గురించే పన్నగుల తల్లి అయిన కద్రువ, గరుత్మంతుని తల్లి అయిన వినత పందెమేసుకుని, గరుత్మంతుడు అమృత




కలశం, స్వర్గం నుంచి తెచ్చి, తన పినతల్లికిచ్చి, తన తల్లిని చిరదాస్యం నుంచి విడిపించిన కథ ఉత్పన్నమైంది. ఆ తర్వాత అత్యద్భుతమైన శైలేంద్రంలా, "ఐరావతమ"నే ఏనుగు ఉద్భవిం చింది. ఆ తర్వాత పాలకడలిలో, చల్లని చంద్రుడుద్భవించాడు. ఇలా క్షీరసాగర మథనంలో మహాద్భుతాలెన్నో ఉద్భవించాయి. ఆ అద్భుతాలలో ఒకటిగా "శ్రీమహాలక్ష్మి" ఆవిర్భావం జరిగింది!

క్షీరసాగరమథనమంతా ఒక ఎత్తయితే, శ్రీమహాలక్ష్మి ఆవిర్భావఘట్టమొకటి ఒక ఎత్తు. యుగాల పర్యంతం లక్షలాది చిత్రకారుల కుంచెల్లో, కోట్లాది శిల్పుల ఉలుల్లో జీవం పోసుకున్న "గజలక్ష్మి" రూపం, పోతన మహాకవి శిల్పంలో అమ్మవారి భక్తులందరి హృదయల్లో చిరస్థాయిగా నిలిచిపోతుంది.

పాలకడలిలోని మీగడ, శరత్కాల మేఘాల చాటు మెరుపు తీగెల సమూహమూ, చిగురాకులతో నిండిన తమల పాకు తీగెలు, అరటిబోదెలు, బంగారు చంపకాలు ఇలా ఏ అవయవానికా అవయం తీర్చిదిద్దినట్లు బ్రహ్మ సృష్టించినట్లుగా ఉన్న ఆ భువన మోహన రూపం శ్రీమహాలక్ష్మిది. ఆమెకు మంగళస్నానానికిగానూ అనర్ఘరత్నమణిమయ పీఠం ఇంద్రుడు ఇచ్చాడు. దేవతాస్త్రీలు పుణ్యజలకలశాలు తెచ్చారు. భూమి చిగురుటాకులు పరిచింది. పంచగవ్యాలనిచ్చాయి గోవులు. వసంతుడు మధువు తెచ్చాడు. మహర్షులు ఆశీర్వచనాలు పలుకుతుండగా మంగళతూర్య నినాదాలు మిన్నుముట్టగా, గంధర్వ స్త్రీ పురుషులు నృత్యగీత వాద్యాది స్వాగతాలు పలుకగా, "క్షీరసాగరతనయ" ముల్లోకాలనూ తన చల్లని చూపులతో కలయజూస్తూ కూర్చుంది అప్పుడే.

**కం. పండిత సూక్తులతోడుత, దుండంబులు సాచి తీర్థతోయము లెల్లన్**
**గుండముల ముంచి దిగ్వేదండంబులు జలకమార్చె దరుణీ మణికిన్**

అదీ "గజలక్ష్మీదేవి" సాక్షాత్కారం. ఇరువైపులా రెండు పెద్ద పెద్ద ఏనుగు తొండాలతో కలశాల్లోని నీరు గుమ్మరి స్తుండగా, పెద్ద పద్మాకారపు పీఠంలో భాసింపట్టు వేసుకుని కుదురుగా కూర్చుని, తన చల్లని చిరునవ్వులతో ముల్లోకాలనూ

చల్లగా చూస్తూ, ఒక చేతిలో ధనం, మరో చేతిలో పద్మం ధరించి ఉండే "గజలక్ష్మి" అమ్మవారి ఛాయాచిత్రాలు, శిల్పాలు లేని హిందువుల గృహాలు మన భారతదేశంలో అరుదు.

ఇక ఆ తల్లి రూపలావణ్య విశేషాలు ఇలా ఉండగా, ఆమెను చూసిన దేవపురుషులంతా ఈమె ఎవరి ఇల్లాలు అవుతుందోనని కుతూహలంతో చూస్తున్నారు. ఆమె చూపు, ఆలోచన మరోవిధంగా ఉంది. ఆమె తన పాణిగ్రహణ అదృష్టం కోసం అర్రులు చాస్తున్న దేవ యక్ష గంధర్వ సిద్ధచారణ గణాదుల్లోని పురుషులను కలయజూసింది. ఇలా ఆలోచించుకుంది.

**సీ.ఐదువ నై యుండ నలవడ దొక చోట నొకచోట సవతితో నోర్వ రాదు**
**తగ నొకచోట సంతత వైభవంబు గా దొకచోట వేఁడిమి నుండఁ బోల**
**దొకచోటఁ గరుణ లే దొక్కింత వెదకిన నొకచోట డగ్గఱి యుండ బెట్ట**
**నెఱయంగ నొకచోట నిలుకడ చాలదు చర్చింప నొకచోట జడత గలదు.**

**ఆ.కొన్ని చోట్లు కామగుణ గరిష్ఠంబులు, క్రోధ సంయుతములు గొన్ని యెడలు**
**గొన్ని మోహలోభ కుంఠితంబులు గొన్ని, ప్రమద మత్సరానుభావకములు.**

అంటూ లక్ష్మీ ఉండతగని, ఉండడానికి ఇష్టపడిన ప్రదేశాలు వితర్కించుకుంది. ఆమె చూపు శ్రీమహావిష్ణువు మీద పడింది. ఆమె విభ్రాంతి పొందింది.

**సీ. అమరముత్తైదువనై యుండ వచ్చును**
**వరుసకు సవతు లెవ్వరును లేరు?**
**వెలయంగ నశ్రాంత విభవ మీతని యిల్లు,**
**శృంగార చందన శీతలుండు;**
**గలగఁడెన్నడు శుద్ధ కారుణ్యమయమూర్తి,**
**విమలుండు! గదిసి సేవింపవచ్చు!**
**నెఱినాడి తిరుగడు! నిలుకడ గలవాడు**
**సకల కార్యములందు జడత లేదు.**

**ఆ. సాధురక్షకుండు, షడ్వర్గ రహితుండు**
**నాధుడయ్యెనేసి నడప నోపు**
**నితడె భర్త! యనుచు నింతి సరోజాక్షు**
**బుష్పదామకమున, బూజ సేసె! (స్కం.8, సం.282)**

జనాలకు తండ్రి అయిన శ్రీమహావిష్ణువు, సంపదలకు తల్లి అయిన ఆ మహాలక్ష్మిని చేపట్టి, తన హృదయ పీఠం మీద నిలుపుకున్నాడు. సర్వదేవతాగణం, మానవులు, మహర్షులు, సర్వలోకాలు పుష్పవర్షం కురిపించారు. లక్ష్మీనారయణుల వివాహ సందర్భంగా–

**కం. ఆ పాలవెల్లి కూతురు, తీపులజూపులను దోగి తిలకించి ప్రజల్**
**చేపట్టిరి సంపదలను, బ్రాపించెను మేలు, జగము బ్రతికె నరేంద్రా!**

అంటూ క్షీరసాగర మథనకథనూ, క్షీరసాగరంలో ఉద్భవించిన మహాద్భుత వస్తు సముదాయాన్ని శ్రీమహాలక్ష్మి ఆవిర్భావాన్నీ, లక్ష్మీనారాయణుల కల్యాణాన్ని వర్ణించాడు శుక యోగీంద్రుడు, పరీక్షిన్మహారాజుకు. అయితే, సాధారణ మానవుల ఇల్లాళ్లకేగాక, సాక్షాత్తు దేవుళ్ల ఇల్లాళ్ళకు కూడా ఒక్కోసారి ఎలాంటి సంకట పరిస్థితులు, సంశయాలు, భయాలు ఎదురౌతాయనేది శ్రీమహాలక్ష్మి కథ ద్వారా మనం తెలుసుకోవచ్చు.

ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీహరి, భక్తులకు ఏ ఆపద ఏ సమయంలో వచ్చినా పరుగెత్తుకు వెళతాడు. ఆ సమయంలో ఆ రాక్షసులను అంతం చేయడానికి శ్రీమహావిష్ణువు వివిధ అవతారాలు కూడా ధరించాల్సివస్తుంది. ఆ అవతార సమయంలో ఆ రాక్షసుల కర్మ పరిపాకానికి వచ్చే వరకూ కాచుకుని కూడా ఉండాల్సిందే. ఆ సందర్భంలో శ్రీమహాలక్ష్మి అన్నిరోజులూ ఆ రాక్షసులకు సర్వసంపదలు ఇవ్వాల్సిందే! ప్రహ్లాద చరిత్రలో హిరణ్యకశిపుడు నియంతగా మారాక, శ్రీహరి అదృశ్యరూపుడై పోయాడు. వాడియోగబలం, వరబలం, అంతటవి మరి! దేవతా గణాలంతా వాడికి మొక్కాయి విధిలేక! ఆ దేవతా గణాలలో లక్ష్మీదేవికూడా ఉంది! అంచేత ఆ రాక్షసునికి విజయలక్ష్మి, సంపదలక్ష్మి, సార్వభౌమాధికారలక్ష్మి, సర్వం ఒనగూడాయి. ఆమె తన అష్టైశ్వర్యకళలు, వాడికి ధారాదత్తం చేయలేక తప్పలేదు.

ఇక "గజేంద్ర మోక్షం" లో కూడా ఇలాగే జరిగింది. తనతో ఒకమాటైనా చెప్పకుండా గజేంద్రునికోసం పరుగెడుతుంటే లక్ష్మీదేవి కూడా పరుగెత్తింది. తన భర్త ఆర్తత్రాణతను గుర్తు చేసుకుంటూ–

**శా. తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్లబంధంబుతో,**
**శాటీముక్త కుచంబుతో, నదృఢచంచత్కాంచితో, శీర్ణ లా**
**లాటాలేపముతో, మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ,**
**గోటీందుప్రభతో, మరోజభర సంకోచద్విలగ్నంబుతోన్.**

అలా పరుగెడుతోందా ఇల్లాలు. మరి ఇంత గొప్పదేవత అయిన ఆ జగజ్జనని భక్తుల హృదయాల్లో చిరముద్ర వేసుకోదా మరి? శ్రీమహాలక్ష్మి భక్తజనుల పాలిటి కల్పతరువు!




**(అరివీరభయంకరంగా పోరాడిన ద్రోణుడు, పుత్రుడు మరణించాడన్న వార్తవిని నేలకొరిగాడు. దీంతో కర్ణుని సర్వసైన్యాధ్యక్షతన పోరు ప్రారంభమవడం ఈ సంచికలో చదువవచ్చు.)**

## ద్రోణవధ

కొంతసేపు విశ్రాంతిపొంది చంద్రోదయం కాగానే మళ్ళీ యుద్ధానికి ఉపక్రమించారు. అప్పుడు దుర్యోధనుడు "ఆచార్యా! మీరు పాండవుల మీద వాత్సల్యంతో ఉంటున్నారే తప్ప పరాక్రమం ప్రదర్శించడం లేదు" అన్నాడు.

ఆచార్యుడు కుపితుడై: "నాయనా! అర్జునుడు తన శిష్యుడని కదా ఇంద్రుడు ఖాండవ వనం అగ్నికి ఆహుతి చేసుకున్నాడు. ఘోషయాత్రలో చిత్రసేన ప్రముఖ గంధర్వ వీరులు నిన్ను విడవడానికి అదే కారణం. నివాతకవచ కాల కేయులు ప్రాణాలు వదలడానికి శిష్యవాత్సల్యమే హేతువు కదా! అని దెప్పిపొడవడంతో సుయోధనుడు తలత్రిప్పి:

"స్వామీ మీతో వాదన మంచిది కాదు. మీరెవరితో పోరాడగలిగితే వారితోనే పోరు సాగించండి. దుశ్శాసన, శకుని, కర్ణులు తోడురాగా నేనే ఆ గాండీవిని కడతేరుస్తాను" – అని తమ్మునీ, మేనమామనూ అనుంగు మిత్రునీ వెంటబెట్టుకుని అర్జునుని వైపు నడిచాడు.

ద్రోణాచార్యులు తీవ్ర క్రోధంతో సాగుతున్నాడు. తూర్పు దిక్కులో ఉషోరాగాలు రంగపూజ జరిపాయి. బాలభాస్కరుడు సహస్ర కరాలతో రంగప్రవేశానికి సన్నద్ధుడవుతున్నాడు.

భాను సదృశుడుగా ద్రోణాచార్యులు బాణాలే కిరణా లుగా శాత్రవ సేనా తిమిరాన్ని పటాపంచలు చేస్తున్నాడు. పాంచాల, విరాటసేనలు నేలబడి పోతున్నాయి. అదే సమ యంలో అటు విరటుడూ, ఇటు ద్రుపదుడూ ఆచార్యుని బాణాసనానికి బలి అయ్యారు. అంతలో ధృష్టద్యుమ్నుడు ఉద్రేకంతో ఈ రోజు ద్రోణాచార్యుని సంహరించక తీరదు అంటూ సాగాడు.

అటూ భానూదయం అయింది. సేనలన్నీ కొంతసేపు ఉదయకాల విధి నిర్వహణకు విరామం తీసుకున్నాయి. తిరిగి యుద్ధ వాద్యాలు మ్రోగడమూ, చతురంగ బలాలు మహోత్సా హంతో ముందుకు దూకడమూ ఏకకాలంలో జరిగాయి.

ఎవరికి వారు తగ్గ యోధునితో తలపడ్డారు. అప్పుడు సాగిన సంకుల సమరంలో ద్రోణాచార్యునితో సవ్యసాచి శస్త్రాస్త్ర యుద్ధం నడుపుతుంటే సాక్షాత్తు త్రిపురాంతకుడు రెండు రూపాలు ధరించి రణ క్రీడావిలాసంలో ఉన్నట్లనిపించింది. ఆచార్యుడు తీవ్రనిష్ఠతో అభిమంత్రించి బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అదే నియమంతో అర్జునుడు అదే అస్త్రంతో దానిని ఉపసంహ రించాడు. వారుభయులూ లీలాఖేలనం నడుపుతూంటే చూసి, ధర్మారాజు : "అర్జునా! ఏమిటిది! పాంచాల, విరాట సేనలు తమ ప్రభువులతో ఈయన పాలబడ్డా ఇంకా ఉపేక్షిస్తున్నావా!" అనగా వాసుదేవుడు: "ధర్మనందనా! యుద్ధభూమిలో ఈయనను జయించడం దేవ దానవ గణాలకే అసాధ్యం ఇక మనమెంత! అయితే ఉన్నదొక్కదారి, ఆయనకు అత్యంత ప్రియుడైన అశ్వత్థామ నిహతుడయినట్టు ఒక్క వార్త వినిపిస్తే అస్త్ర సన్యాసం చేస్తాడు. అప్పుడింక మనం నిరాఘాటంగా సాగవచ్చు"–అన్నాడు.

అంగీకరించలేదు అర్జునుడు. ధర్మనందనుడు విషాద భర హృదయుడయాడు. ఇంగితం గ్రహించిన భీమసేనుడు తన రథాన్ని అటు నడుపుతూండగా అశ్వత్థామ అనే పేరుగల

భద్రగజం నేలకూలింది. అది ఆధారంగా 'అశ్వత్థామ చచ్చె' అన్నాడు ఆచార్యుని చెవిని బడేలా, విని కూడా ఆయన తన కొడుకు పరాక్రమం ఎరిగినవాడు కనక లక్ష్యపెట్టకుండా పోరు నడుపుతున్నాడు. ఎదురుగా ధృష్టద్యుమ్నుని వేధించి వానితో ఉన్న ఇరవైమంది రథికులను హతమార్చాడు.

అప్పుడు గగన వీథిని విశ్వామిత్ర, భరద్వాజాది ఋషి పుంగవులు వచ్చి: భరద్వాజా! వేద వేదాంగ విదుడవు. విప్రవరుడవు. నీకు సంగ్రామం దేనికయ్యా! అదీకాక నీకు కాలం సమీపించింది. ఇంక విరమించు, అన్నారు.

వారి మాటలూ, భీముని పలుకుల స్మృతీ, మనస్సును వికలం చేశాయి. అశ్వత్థామ నిజంగా నిహతుడయినదీ, లేనిదీ తెలుసుకుందామని ధర్మరాజును సమీపించి అడిగాడు.

అప్పుడు కృష్ణుడు ధర్మనందనా! నువ్వు సత్యవ్రతం పేరుతో ఇప్పుడు కొంపముంచకు. ఆచార్యుడు ఈ ప్రొద్దు నేలకూలకపోతే మనవారందరూ కడతేరక తప్పదు. మమ్మ ల్నందరినీ ఈయన బాణాలకు ఆహుతి చెయ్యకు. ప్రాణరక్షణ కోసం బొంకిన బొంకు బొంకు కాదని శాస్త్రం ఘోషిస్తున్నది, అన్నాడు.

భీముడు కూడా ఆ మాటనే చెప్పాడు, చేసేది లేక ధర్మరాజు రథాన్ని ఆచార్యులవైపు నడిపి, గంభీర స్వరంతో : 'అశ్వత్థామా హతః' అని, నెమ్మదిగా 'కుంజరః' అన్నాడు.



అంతతో ఆయన మనసు విరిగింది. గుండె జారింది. అయినా ధృష్టద్యుమ్నునితో పోరు నడుపుతూనే ఉన్నాడు. ధృష్టద్యుమ్నుడు హింసిస్తూనే ఉన్నాడు.

అప్పుడు ఆచార్యుడు: ఓ సుయోధనా! కర్ణ కృపా చార్యాది యోధులారా! నేను చెయ్యగలిగినదంతా చేశాను. ఇంక నిశ్చింతగా దేహయాత్ర చాలించాలని ఉంది, అంటూ ఆయు ధాలు విడిచి, యోగ నిష్ఠతో రథం మీద కూర్చున్నాడు.

తక్షణం ధృష్టద్యుమ్నుడు కత్తి చేతబూని ద్రోణాచార్యుని మీదికి నడుస్తున్నాడు. అదే సమయంలో ఆచార్యుని శరీరం నుండి ఒక జ్యోతి లేచి, క్రమంగా గగన మార్గానికి సాగింది. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ఆ శవం జుట్టుపట్టి ఖడ్గంతో ఆయన తల నరికేశాడు.

ధర్మరాజు, అర్జునుడు వారిస్తూనే ఉన్నారు. అన్యాయానికి సాహసించకు, సాహసించకు అని. అయినా ధృష్టద్యుమ్నుడు ఉన్మత్త పిశాచిలా వెళ్ళి ఆ అకార్యం చేసే వచ్చాడని కృపా చార్యుడు అశ్వత్థామకు ఈ వార్త అందించాడు.

పాంచాలుని ఘాతుక చర్య గురుపుత్రునికి అసహ్య మయి : సుయోధనా! నావంటి కుమారుని కన్నది శత్రువు చేతికి జుట్టిచ్చి తలకొట్టించడానికా! ఇదిగో ఈ రోజు పాండవు లతో పార్థసారథి కూడా పరలోకం చేరవలసిందే. మా జనకులు నారాయణుని ఉపాసించి సముపార్జించిన నారాయణాస్త్రం ప్రయోగిస్తున్నాను. దానితో సర్వనాశనమే, అని రథం ముందుకు నడిపాడు.

ఆ సమయంలో పాండవులందరూ ధృష్టద్యుమ్నుని పరి పరి విధాల నిందించారు. సాత్యకి మరింత రోషంతో వీరందరూ ఉన్నారని వూరుకున్నాను కాని లేకుంటే నీ తల తరిగేద్దును – అన్నాడు. అంతలో మరింత ఆవేశం వచ్చి రథం దిగి కత్తితో ధృష్టద్యుమ్నుడు ఇంక ప్రేలితివా! నీ తల నీది కాదు అంటూ ఉండగా విన్న కృష్ణుడు భీమసేనుని పంపి, వారిరువురినీ శాంతిం పజెయ్యడానికి ప్రయత్నించాడు. ధర్మరాజు వచ్చి సాత్యకిని శాంత చిత్తుని చేశాడు. తిరిగి పోరు ప్రారంభించారు. కొంతసేపు సాగింది.

అశ్వత్థామ కొద్ది క్షణాలు మనస్సుని ఏకాగ్రం చేసి, మహామంత్రం జపించి నారాయణాస్త్రం ప్రయోగించాడు. అంతటితో వివిధ ఆయుధాలు పాండవసేనను చుట్టుముట్టి బీభత్సం చేస్తుండగా, ధర్మరాజు: ఓ మహావీరులారా! మీరందరూ రణరంగం వీడిపొండి. నేను కారణం కదా ఈ మహావిపత్తుకి అందుచేత ఆ మహాస్త్రానికి నేను ఆహుతి అవుతాను, అన్నాడు.

అది విననట్టు వాసుదేవుడు: ఓ పాండవ సైనికులారా! మీరందరూ ఆయుధాలు విడిచి, వాహనాలు దిగి నిలబడండి. అటువంటి వారిని నారాయణాస్త్రం ఏమీచెయ్యదు. అని ఎలుగెత్తడంతో అందరూ ఆయన మాటలు శిరసావహించారు.

భీమసేనుడు క్రోధంతో ఆ మహాస్త్రాన్ని ఎదుర్కొనడానికే నిశ్చయించుకున్నాడు. అంతతో ఆ అస్త్ర జ్వాలలు భీముని చుట్టుముట్టాయి. దాన్ని వారించడానికి అర్జునుడు వారుణాస్త్రం ప్రయోగించాడు. అశ్వత్థామ తన అస్త్రశక్తిని ఇతోధికం చేశాడు.

గమనించిన వాసుదేవుడు అర్జునునితో కలిసి వెళ్ళి భీముని చేతుల నుండి ఆయుధాలు క్రిందకు లాగి, ఇంకా పట్టుపడుతూంటే రథం మీది నుండి నేలకు పడద్రోశాడు. అంతలో నారాయణాస్త్రం శాంతించింది. పాండవసేన మళ్ళీ విజృంభించగా, దుర్యోధనుడు అశ్వత్థామను సమీపించి: ఆర్యా! మరొక్కమారు ప్రయోగించు నారాయణాస్త్రం – అన్నాడు. సుయోధనా! మళ్ళీ ప్రయోగించే అవకాశం లేదు ఒక్కమారే అది విని యోగపడుతుందని అస్త్ర దాన వేళ చేసిన నియమం – అన్నాడు అశ్వత్థామ.

మరికొంత సేపు యుద్ధం నడిచింది. అశ్వత్థామ దివ్యాస్త్ర ప్రయోగం చేయగా అర్జునుడు సర్వాస్త్రశాంతికై బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అశ్వత్థామ తలదించుకున్నాడు. అప్పుడు వ్యాసుడు విజయం చేసి కృష్ణార్జునులుభయులను గురించి అశ్వత్థామకు విశదం చేసి పరమేశ్వరుని అనుగ్రహం పొందిన వీరుడు పార్థుడు అని చెప్పి వెళ్ళాడు.

అప్పటికే సూర్యభగవానుడు అస్త్రాద్రికి చేరాడు. నాటికి యుద్ధ విరామం ప్రకటించారు. అని వైశంపాయనుడు జనమేజయుడికి ద్రోణపర్వం వినిపించి కర్ణపర్వం ప్రారంభిస్తున్నాడు.

## కర్ణపర్వం ప్రారంభం

### రణరంగం

రణరంగం నుండి వచ్చిన సంజయుడు : ప్రభూ! సర్వ సేనానిగా కర్ణుడు తన ప్రతాపాన్ని ప్రదర్శించి దేవతలకే ఆశ్చర్యం కలిగించి నేలకూలాడు. దుశ్శాసనుని రొమ్ము చీల్చి భీముడు వాని రక్తం త్రాగాడు. ఇంకేం చెప్పను ప్రభూ! దురాశతో మీరింతవరకూ తెచ్చారు. ఎవరు చెప్పినా మీ చెవికెక్కడం లేదు; కర్మఫలం అనుభవించక తప్పదు కదా! అనడంతో విషాద భరహృదయుడయిన ధృతరాష్ట్రునికి దుర్యోధనుడే యుద్ధంలో నేలకూలినాడనిపించి : సంజయా! నీ మాటలు నాకు వినబడడం లేదు; మళ్ళీ చెప్పు. మళ్ళీ చెప్పు – అన్నాడు.

సంజయుడు చెప్పగా విని, కర్ణునివంటి మహాశూరుడు పడిపోయాడని విన్నాక కూడా నా గుండె బద్దలు కాలేదంటే ఇది వజ్రంతో చేసివుంటాడు విధి, అని విలపిస్తూ మూర్ఛ పోయాడు.

అంతఃపుర జనం అందరూ అతి దీనంగా రోదించారు. విదుర, సంజయులు శీతలోపచారాలు చేసి, రాజును మూర్ఛ నుండి తేరుకోజేశాక ఆయన : సంజయా! సింహసమ పరాక్రముడైన కర్ణుడు కూడా మరణించాడంటే నాకు జీవితం మీద ఆశ పోయింది. ఆత్మహత్య చేసుకుంటానన్నాడు. సంజయుడు పరిపరివిధాల ఓదార్చి ఆ ప్రయత్నం నుండి వారించాడు.

కొంతసేపటికి ధృతరాష్ట్రుడు స్వస్థ చిత్తుడై యుద్ధ విశేషాలు చెప్పమన్నాడు. ద్రోణాచార్యులు నేలకూలిన అనంతరం నీ పెద్దకొడుకు అశ్వత్థామాది మహాయోధులందరినీ సమావేశ పరచి అనంతర కర్తవ్యం ఏమిటని అడిగాడు.

అశ్వత్థామ: మహారాజా! మహాబల పరాక్రమ సమన్వితుడైన కర్ణుని సర్వసైన్యాధిపతిని చేసి యుద్ధం సాగిద్దాం– అన్నాడు. అనగానే దుర్యోధనుడు: కర్ణా! కుమారస్వామి దేవ సేనను నడిపినట్లు నువ్వు మనసేనను నడిపి, భీష్మద్రోణులు సాధించలేని విజయం మనకు సంపాదించాలి – అని సర్వ సేనాధిపతిగా అభిషేకించాడు.

కర్ణుడు రథారూఢుడై సేనా ముఖంలో నిలవడం మనవారందరికీ మహోత్సాహం కలిగించింది; మకర వ్యూహం

పన్ని ముఖభాగంలో తానే నిలబడ్డాడు. శకునీ, వాని సుతుడు ఉలూకుడు నేత్రాలుగా, శిరస్థానంలో అశ్వత్థామ, కంఠ భాగంలో నీ కొడుకులూ, ఉదర ప్రాంతాన దుర్యోధనుడూ, ముందు ఎడమ పాదంగా నారాయణ గోపాలురతో కృతవర్మ, కుడిపాదంగా త్రిగర్త సేనలతో కృపాచార్యుడూ, వెనుక కుడిభాగాన శల్యుడూ, ఎడమభాగాన సుషేణుడూ, పుచ్ఛభాగాన చిత్ర, చిత్రసేన ప్రభువులూ, తమ తమ సేనలతో సాగుతున్నారు.

పాండవులు అర్ధచంద్ర వ్యూహంతో ఎదురు వచ్చారు. భీముడు మత్త గజం మీద వచ్చాడు. అతని వీర విహారానికి అడ్డు నిలిచిన వారెవరూ ఆగక పోవడం చూసి కర్ణుడే వానికి ఎదురు వచ్చాడు. అంతలో అశ్వత్థామ భీముని ఎదుర్కొన్నాడు. ధర్మరాజుతో దుర్యోధనుడూ, ధనంజయునితో సంశప్తకులూ, ధృష్టద్యుమ్నునితో కృపాచార్యులూ, శిఖండితో కృతవర్మ, సహదేవునితో దుశ్శాసనుడూ పోరు ప్రారంభించారు.

తనతో యుద్ధానికి వచ్చిన విందానువిందు లిద్దరినీ నేలకూల్చాడు సాత్యకి. ఆ సమయంలో ప్రతివింధ్యుడు (ధర్మజు పుత్రుడు) తన పరాక్రమం ప్రదర్శిస్తూ చిత్రుడనే ప్రభువును నేలకూల్చాడు. అది చూసి మనసేనలు క్రోధంతో విరుచుకు పడ్డాయి.

ఇక్కడ అశ్వత్థామ విడిచిన బాణం భీమసేనుని నుదుట నాటుకుంది. ఆ కోపంతో మూడుబాణాలు విడిచాడు భీముడు. వారి మధ్య సాగిన సంగ్రామం తీవ్రమయింది. రథ కేతనాలు రాలిపోయాయి. సూతులిద్దరూ గాయపడ్డారు. గుర్రాలు నేల కూలాయి. అలానే ఒకరిమీద ఒకరు బాణవర్షం కురిపిస్తూంటే చూడముచ్చటగా ఉంది. కొంతసేపటికి వారుభయులూ అలసి మూర్ఛపోయారు. సారథులు రథాలు మళ్ళించారు.

ఇటు అర్జునుని కొడుకు శ్రుతకీర్తి శల్యునితో పోరాడు తున్నాడు. సహదేవుని ఎదుర్కొన్న దుశ్శాసనుని విల్లు విరిగింది. దానితో కత్తి పట్టాడు. అది కూడా ముక్కలుచేశాడు సహదేవుడు. అనంతరం విడిచిన వాడిబాణం రక్తం చిమ్మకుండా రొమ్ములో నాటుకోవడంతో దుశ్శాసనుడు మూర్ఛపోయాడు. ఆ రథం వెను దిరిగింది.

కర్ణుడు నకులునికి ఎదురు రాగా : "రాధేయా! నీ వల్ల ఇంత జరుగుతోంది. ఇప్పుడే నిన్ను కడతేరుస్తాను, అని శర సంధానం చేయగా, కర్ణుడు: రాజపుత్రుడివి, మహావీరుడివి, ఊరక మాటలు దేనికి! పని కానియ్యి – అని నవ్వుతూ దెబ్బది మూడు వాడిబాణాలతో నకులుని శరీరం కప్పేశాడు. నకులుడు డెబ్బై బాణాలతో వానిని నిలువరించాడు. కర్ణుడు వాని ధనుస్సు విరగగొట్టాడు. ఆ కోపంలో నకులుడు మరొకవిల్లు చేబూని కర్ణుని ధనుస్సు ముక్కలు ముక్కలు చేశాడు. కర్ణుడు సహదేవుని రథ కేతనాన్నీ, సారథినీ, చక్ర రక్షకులనూ నేలకూల్చడంతో నకులుడు పరిఘం చేబూని మీదికి రాగా దానిని ముక్కలు చేసి, వాని మెడకు తన ధనుస్సు తగిలించి : అబ్బాయీ! యుద్ధ భూమిలో పలుకులు కాదు అలుగులు కదలాలి. వెళ్ళు; మీ అన్నయ్య దగ్గరకు వెళ్ళి చెప్పుకో అని వదిలేశాడు కుంతికి చేసిన వాగ్దానం గుర్తుకు వచ్చి.

ఆఖరు ఘడియలో వారి పక్షం చేరిన నీ కొడుకు యుయుత్సుడు మన ఉలూకుని ముప్పతిప్పలు పెట్టాడు. ఉలూ కుడు ఉద్రేకంతో యుయుత్సునికి ఊపిరి సలపకుండా బాణాలు విడవడంతో వాడు వెనుదిరిగి పోయాడు.

ఈనాటి యుద్ధంలో నకులుని కొడుకు శతానీకుడూ, అర్జునుని కొడుకు శ్రుతకీర్తీ, తమ ప్రతాప ప్రకటనంతో వీరులకు ఉత్సాహం కలిగించారు. ధృష్టద్యుమ్నునికీ కృపాచార్యునికీ సాగిన పోరులో పాంచాల పుత్రుని శరీరం రక్త ధారలు కురిసింది. దానితో వాని రథం భీముని చాటుకు పోయింది. కృతవర్మతో శిఖండి యుద్ధం సాగించి ఆయన విడిచే బాణ ధాటికి ఆగలేక మూర్ఛపోగా ఆ రథం కూడా వెనుదిరిగింది. **(ఇంకా ఉంది)**



**శ్రీ పట్టాభిరామస్వామివారి బ్రహ్మోత్సవాలు, వాయల్పాడు**

| తేదీలు | వారం | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 22-3-10 | సోమ | --- | అంకురార్పణం |
| 23-3-10 | మంగళ | ధ్వజారోహణం | --- |
| 31-3-10 | బుధ | చక్రస్నానం | ధ్వజావరోహణోత్సవం |

# సందేహాలు? సమాధానాలు!!

-'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**చింతామణి మంత్రం గురించి వివరించండి? -కె.కీర్తివినాయక్, విశాఖపట్టణం.**

☛ఇది ఒక దివ్యమంత్రం. శ్రీహర్షుడు చింతామణీ మంత్రోపాసకుడు. తెలుగు కవులలో శ్రీనాథుడు కూడా చింతామణి మంత్రాన్ని అనుష్ఠించాడని చెబుతారు. బిల్వమంగళుడనే లీలాశుకుడు 'చింతామణిర్జయతు' అన్నచోట చింతామణిని మంత్రంగానే భావించాడు.

***మంత్రాణి పల్లవోపేతం బీజశక్తి సమన్వితం, యథా తంత్రకృతం జప్త్వా సద్యస్సిద్ధి ప్రదంస్మృతమ్*** – మంత్రాలన్నీ ఆయా కర్మలకు సంబంధించిన పల్లవాలతో కూడి బీజశక్తితో చెప్పబడిన ప్రకారం జపిస్తే వెంటనే సిద్ధిస్తాయి. మంత్రాలలో కొన్ని సాత్త్వికాలు. కొన్ని రాజసాలు. కొన్ని తామసమంత్రాలు. 'చింతామణీ' మంత్రం మణిద్వీపంలో ఉన్న త్రిపురసుందరి అధిష్ఠాన దేవతా మంత్రంగా కొందరు చెబుతున్నారు. ఆమె మంచం నాలుగు కోళ్ళు బ్రహ్మ, రుద్రుడు, విష్ణువు, ఈశ్వరుడు. ఆ మంచంపై పలక సదాశివుడు. దానిపై అమ్మవారు పవ్వళించుతుంది. ఒక్కొక్క బీజాక్షరానికి ఒక్కొక్క దేవత అధిష్ఠాన దేవతగా ఉంటుంది. 'చింతా' మొదటి అక్షరం చకారం.

***చకారమసురఘ్నం చ చాముండీ బీజమేవ చ, చండబీజమితి ఖ్యాత విచ్ఛాసిద్ధిం జయప్రదమ్*** – అని మంత్రశాస్త్రం చెబుతున్నది. 'చ' అనే అక్షరం చండ బీజం. దీని కధిదేవత చండిక. రాక్షస సంహారం తత్ఫలం. అంటే మనలో ఉన్న కామక్రోధలోభమోహ మదమాత్సర్యాలనే రాక్షసులను సంహరిస్తుంది. కోరిన కోరికలన్నీ తీర్చి జయాన్ని ప్రసాదిస్తుంది.

పూర్వం శ్రీహర్షుని తండ్రి ఒక పండితుని చేతిలో ఓడిపోయాడు. ఆ పండితుడాతని మెడలో తన కాలిచెప్పు వేశాడు. ఆతని భార్య గర్భవతి. ఆమెతో తనకు పుట్టబోయే కుమారునితో తననోడించిన పండితుని ఓడింప చేసి మళ్ళీ ఆ చెప్పును, తన చెప్పును కలిపి ఆతని మెడలో వేయించవలసిందని చెప్పి ఆత్మహత్య చేసుకొన్నాడట. శ్రీహర్షుడు పుట్టి పెద్దవాడై చింతామణి మంత్రోపాసన చేస్తున్నాడు. అపుడాతడు మంత్రసిద్ధికోసం శవాల మీద కూర్చుని మంత్ర పునశ్చరణ చేశాడని కొందరు వచిస్తే స్వయంగా తల్లి ఆత్మహత్య చేసికుని తన శవంపై కూర్చుండి ఉపాసన చేయుమని చెప్పిందని వ్రాశారు. అలా చేసి తన తండ్రి నోడించిన పండితుని గెల్చి వాని చెప్పు–తన తండ్రి చెప్పుతో కలిపి ఆతని మెడలో వేశాడట. తర్వాత ఎందరో పండితులను జయించాడని, సాక్షాత్తు ఆదిశంకరులతో వాదించి తన పాండితీబలంతో వేదాలకు అపార్థం చెప్పి శంకరుల నోడించాడనీ, ఆయన తెలిసీ వేదాలకు అపార్థం చెప్పావు కనుక 'నీ నోట్లో పురుగులు పడుగాక అని శపించాడని, శ్రీహర్షుని నోటిలో పురుగులు పడినవని, తరువాత శంకరుని పాదములపై పడగా, ఒక మహాపురుషునిగాథ గానం చేయవలసిందిగా ఆదేశించాడనీ అపుడు నైషధం చెప్పాడనే ఐతిహ్యం ప్రచారంలో ఉంది. కానీ శంకర శ్రీహర్షుల కాలాలలో చాలా భేదం ఉన్నందు వల్ల కథ నమ్మశక్యంకాదు కానీ, ఇంత శక్తి శ్రీహర్షునకు చింతామణీ మంత్రసిద్ధి చేతనే కలిగిందనేది వాస్తవం.

**గజేంద్రుడు ఏ దేవుని వాహనమో విపులంగా తెలుపగలరు?**
**- వెద్యం మోహనరామయ్య, నెల్లూరు.**

☛గజాలలో శ్రేష్ఠమైంది ఐరావతం. దానికి నాలుగు దంతాలు. తెల్లని కాంతితో ప్రకాశిస్తుంది. ఈ గజేంద్రుడు దేవదానవులు క్షీరసముద్రాన్ని చిలికినపుడందుండి ఉద్భవించాడు. పాల సంద్రంలో పుట్టిన ఐరావతాన్ని దేవేంద్రుడు వాహనంగా స్వీకరించాడు.

**సోమరసం శక్తినిచ్చే పానీయం మాత్రమేనా? లేక ఇంకేదైనా గూఢార్థం ఉన్నదా? - పి.ఎ.నాగరాజు, హిందూపురం.**

☛ఋగ్వేదంలో కర్మకాండ చెప్పబడింది. ఆ కర్మకాండకు సోమరసానికి అవినాభావసంబంధం ఉంది. సోమరసం–సోమలత– వీనికి అధిదైవతం సోముడు. ఋగ్వేదంలో ఈతడు విస్తృతంగా వర్ణింపబడినాడు. సోమలత–సోమరసమనే పదార్థాలే దేవతగా రూపొందించబడినవని పాశ్చాత్యులు భావించారు. ఋగ్వేదంలో తొమ్మిదవ మండలం పూర్తిగా ఇతరమండలాలలో ఆరు సూక్తాలు ఈ దేవతను వర్ణిస్తున్నాయి.

ఇతర దేవతల శరీరావయవాల మాదిరిగా ఈ దేవత శరీరావయవాలు వర్ణింపబడలేదు. ఈ దేవత బహునేత్రుడు– సహస్రాక్షుడు అని వర్ణింపబడినాడు. ఇంద్రుడు మహావీరుడు కావటానికి సోమపానం కారణమని చెప్పబడింది. సోమరసంతో

నిండిన ఇంద్రుని పొట్ట పెద్ద సరస్సుగా వర్ణింపబడింది. ఈ సోమలత ఇంద్రుని ఆత్మగా వర్ణింపబడింది. ఈ సోముడు 'సూర్యా' అనే దేవతను వివాహమాడినట్లుంది. వైదికకాలం తరువాత సోముడనేపదం చంద్రునిలో రూఢమైంది. అందు వలననే ఋగ్వేదంలో కూడ సోమదేవత అంటే చంద్రుడే అని కొందరి అభిప్రాయం. ఈయన లతారూపం చెంది ఉండటం చేత 'వనస్పతి', పాలకుడు అని వర్ణింపబడినాడు.

సోమరసం ఔషధం. దీనిని సేవించిన గుడ్డివారికి వెంటనే దృష్టి కలుగుతుంది. అవయవాలు లేని వాళ్లకు అవయవాలు ఏర్పడతాయి. ఈతడు మానవ శరీర రక్షకుడు. సుదీర్ఘమైన ఆయుర్దాయం ప్రసాదిస్తాడు. అసత్యాన్ని రూపుమాపి సత్యాన్ని రక్షిస్తాడు. సోమరసం తాగితే మూగవాడు మాట్లాడతాడు. అందుకే ఈ దేవతకు 'వాచస్పతి' అని పేరు వచ్చింది. ఈయన ప్రజ్ఞకు అధిపతి–ఋక్కులకు జనకుడు–కవులకు నాయకుడు–ఋత్విక్కులకు ఋత్విక్కు–యజ్ఞమున కాత్మ. ఆయనను సేవించిన వారికి ఏదికోరితే దానిని ప్రసాదిస్తాడు. యజ్ఞాలలో ఉపయోగించే సోమరసాన్ని తీసే పద్ధతిని కూడ ఋగ్వేదం వివరిస్తున్నది.

1. ఇక సంహితాపాఠం

**ఓషధయః సంవదన్తే సోమేన సహ రాజ్ఞా**
**యస్మై కృణోతి బ్రాహ్మణస్తం రాజన్పారయామసి**

ఋ.సం.10.97.22

2. పదపాఠం

**ఓషధయః సంవదన్తే సోమేన సహ రాజ్ఞా**
**యస్మై కృణోతి బ్రాహ్మణః తం రాజన్ పారయామసి**

3. క్రమపాఠం

**ఓషధయః సం సంవదంతే వదంతే సోమేన సోమేనసహ**
**సహ రాజ్ఞాః రాజ్ఞేతి రాజ్ఞా**

**'అధిదేవతా', 'ప్రత్యధిదేవతా' మరియు 'అధిష్ఠానదేవతా' అని జపాలలోను వ్రతాలలోనూ అంటుంటారు గదా! వీటి గురించి వివరించండి?** - కె. సత్యనారాయణ, ఖమ్మం.

'అధిదేవత' అంటే భారతీయుల భావన ప్రకారం ప్రకృతి లోని ప్రతి వస్తువుకు ఒక అధిదేవత ఉంటుంది. 'సముద్రం' దానికి అధిదేవత సముద్రుడు. 'భారతదేశం' దీని కధిదేవత భారతమాత. తెలుగుదేశానికి అధిదేవత తెలుగుతల్లి. 'కృష్ణవేణీ నదికి' కృష్ణవేణీమ తల్లి. గోదావరికి గోదావరీమాత. గంగానదికి గంగాదేవి. ఒక అరణ్యానికి వనదేవత అధిదైవం. అంటే భారతీయులు ప్రకృతిలోని ఉత్తమపదార్థాలను దేవతామూర్తులుగా భావించారు. ప్రత్యక్ష భౌతికరూపానికి అప్రత్యక్ష దేవతా స్వరూపాన్ని సృజించుకున్నారు. 'భూమి కన్పించే భౌతికపదార్థం. కాని భూదేవి, భూమి కధిష్ఠానదేవత మన కన్నులకు కన్పించేది కాదు. శ్రీకృష్ణస్వామి భగవద్గీతలో 'మత్తః పరతరం నాఽస్తి–కించిదస్తి ధనంజయ" అర్జునా! ఈ విశ్వంలో నాకన్న ఇతరమైనది కొంచెం కూడా లేదు. అన్నాడు. ఈశావాస్యోపనిషత్తు "ఈశావాస్యమిదం సర్వం" ఈ అనంతవిశ్వం భగవత్స్వరూపమని బోధించింది. "సర్వం విష్ణుమయం జగత్" ఈ ప్రపంచమంతా విష్ణుస్వరూపం. అంటే ప్రకృతి మొత్తం పూజనీయమైంది. ఆరాధింపదగింది. అందుకే వానికి మనం దేవతారోపణ చేసి కొంటాం. అలాగే ప్రతిమంత్రానికి 'అధిదేవత' ఉంటుంది. ఆ మంత్రం ఉచ్చరించేటప్పుడా అధిదేవత అక్కడకు వచ్చి అదృశ్య రూపంగా ఉంటుందని పెద్దలంటారు.

ఇక 'అధిష్ఠానదేవత'. అధిష్ఠాన శబ్దానికి అధితిష్ఠంత్యత్రేతి అధిష్ఠానం. 'ష్ఠాగతినివృత్తౌ' అని వ్యుత్పత్త్యర్థం. దీనియందుంటారు గనుక అధిష్ఠానం. మన ఇంద్రియాలకొక్కొక్క దానికి ఒక అధిష్ఠాన దైవతం ఉంటుంది. రసన యందు వాగ్దేవతలు. నేత్రాలందు చక్షుర్దేవతలు, ఇలా ప్రతీంద్రియానికి ఒక అధిష్ఠాన దేవత ఉంటుంది. అలాగే క్షేత్రాలున్నాయి. ఒక్కొక్క క్షేత్రంలో ఒక అధిష్ఠాన దైవతం ఉంటుంది. విష్ణుకంచిలో వరదరాజ స్వామి అధిష్ఠానదైవం. శివకంచి ఏకామ్రేశ్వరుడు. కంచికి కామాక్షి. కాశీకి విశ్వనాథుడు అధిష్ఠానదేవతలు. వీరు ఆయా స్థానము లందుంటారు గనుక వీరికి అధిష్ఠాన దైవాలనే పేరు వచ్చింది.

'ప్రత్యధిదేవత' అంటే అధిదేవతతో సమానమైన దేవత అని అర్థం. అంటే అధిదేవత కభిన్న రూపం. ప్రతి శబ్దాన్ని ఉపసర్గమ సదృశార్థంలో ఉపయోగిస్తారు. ప్రతి మంత్రానికి, అధిదైవం ఉన్నా, మళ్ళీ అందరు ఒక్కటే, 'ఏకంసత్ విప్రాః బహుధావదంతి" చిత్స్వరూపమొక్కటే. పండితులు భిన్నంగా చెబుతున్నారు. ఇదే భారతీయత తత్త్వంలోని ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం.

# విష్ణుమాయా విలాసం

- డా॥ మొవ్వ లలితకుమారి

**లోకముల కెవ్వడాద్యుడు**
**లోకము లెవ్వాని మాయలో గొనియుండన్**
**లోకారాధ్యుండెవ్వడు**
**లోకంబులు గలిగెనెట్టులున్ ప్రభుమహిమన్ ....**

క థలంటే ఇష్టపడని వారెవరూ ఉండరు. అందులోనూ భక్తిని బోధించే కథలంటే చాలా మందికి మక్కు వెక్కువ. భక్తుల ఆర్తిని తెలుసుకుని ప్రార్థించగానే తన అభయ హస్తాన్ని అందించి కాపాడే దయాహృదయుడైన విష్ణుమూర్తిని కీర్తించే కథలు భక్తులందరూ ఆలకించి తీరాల్సిందే!

విష్ణుమూర్తి ఆర్తావనత్వాన్ని వేదాలు, పురాణాలు గానం చేస్తున్నాయి. ఎవరు ఏ ఆపదలో ఉన్నా ముందు వెనుకలాలో చించకుండా వచ్చి, రక్షించి, వారి ఆర్తిని పోగొట్టి సకలైశ్వర్యాల్నీ కలిగించే అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడి లీలలు, మాహాత్మ్యాలు అన్నీ ఇన్నీ గావు.

శ్రీ మహావిష్ణువుకున్న అవతార వైవిధ్యం వల్ల తత్సబంధ కథలు – మాహాత్మ్యాలు మొదలైనవి వెలువడి అనేక విషయాల్ని తెలియజేసిన విధంగానే, కేవలం శ్రీమహావిష్ణు మాహాత్మ్యాలనే బహువిధాలుగా వ్యాప్తం చేసిన సన్నివేశాలు కూడా అధికమే. ఆ పరంపరలో వెలువడిన వాటిలో 'విష్ణుమాయా విలాస' కథనం ఒకటి. దీన్ని ఎరగుడిపాటి వేంకటాచలం పంతులు మనకందించారు.

శ్రీ విష్ణుమాయా విలాసం కేవలం కల్పితమే. ఆయా కవులు కేవల కల్పనాగాథలు కృత్తిమ రత్నాలుగానే సిద్ధం చేసి సాహిత్యశారదకొక విలువైన కంఠాభరణాన్ని సమర్పించి ధన్యులైనారు.

ఈ కథలో ఎక్కడకూడా దూషణ అనేది లేకుండా శివుని ముఖతః విష్ణుపారమ్యాన్ని 'విష్ణువు సర్వమయుడు, సకల కార్య కుశలుడు' అనే విషయాల్ని గొప్పగా ప్రవచింపచేయడమే విష్ణుమాయావిలాస కృతుల పరమార్థం.

వేంకటాచలం పంతులు ఈ కావ్యాన్ని సుమారు 1750 గద్యపద్యాల్లో పంచాశ్వాస పరిమితిగా రచించి శ్రీ మహా విష్ణువు ధరించే పంచాయుధాల్ని స్ఫురింపజేశారు. ఇది 'విష్ణు మాయ'ను తెలియజేసే గ్రంథం కాబట్టి పంచాయుధ పరిమితి సార్థక మన్పిస్తుంది. ఈ గ్రంథంలో శ్రీమహావిష్ణువు మాయలు రస వత్తరంగా వర్ణించబడ్డాయి. కథాకథన కౌశలం కూడా విశిష్ట మైంది.

సూతమహర్షి కథ చెప్పడంతో ఈ కథ ప్రారంభమౌ తుంది.

అనిన శౌనకాది మహామునులకు రోమహర్షిణి 'సర్వం విష్ణుమయం జగత్' అని చెప్పారు.

రాక్షస రాజైన బలిచక్రవర్తి త్రివిక్రమ అవతారం దాల్చిన విష్ణువు చేత దేశ బహిష్కృతుడై ఇంద్రుని సమీపిస్తాడు. ఇంద్రుడు బలిచక్రవర్తి పాదసేవ చేసి అమృతాన్ని సాధించే ఉపాయాన్ని ఇవ్వాల్సిందిగా అభ్యర్థిస్తాడు. నీవు దీనికి సహకరిస్తే మేము శ్రీహరి సహాయసహకారాలతో పాలకడలిని చిలకడానికి పూనుకుంటాం. మేము అలా లభించిన అమృత సేవనంతో ఆయురారోగ్యాలతో వర్ధిల్లుతాం. ఒకవేళ మన మధ్య కలహం చోటు చేసుకున్నా ఇరుపక్షాలు అమృతసేవనం చేసి ఉండడం వల్ల గెలుపు ఓటములు ఎవరినీ బాధించవు అని అన్నాడు.

అదివిన్న బలిచక్రవర్తి ఇంద్రునితో పాలజలధిని మధించడం శ్రీహరి కృపాకటాక్షాలతోనే జరగాలి తప్ప మనకు సాధ్యం కాదు అని చెప్పాడు. అది విని ఇంద్రుడు శ్రీహరి కరుణకు లోటేంలేదని ఉప్పొంగి దేవదానవ సమూహాలతో మందర పర్వతాన్ని తేవడానికి వెళ్లాడు. ఆ పర్వతాన్ని మోయ డానికి దేవదానవుల శక్తి చాలలేదు. నిస్సహాయంగా ఉన్నవారి మనస్సుల్లోకి విష్ణువు మెదిలాడు. తలచుకోగానే బ్రహ్మదేవునితో పాటు శ్రీమహావిష్ణువు అక్కడకు వచ్చాడు. వారి ప్రార్థన ఆలకించి శ్రీమహావిష్ణువు మందర పర్వతాన్ని పెకలించగా, దేవదానవులు దాన్ని సునాయాసంగా తీసుకువెళ్లారు.

అలా తీసుకువెళ్లిన పర్వతాన్ని పాలకడలి తీరంలో ఉంచి తగిన రజ్జువును (తాడును) సూచించమని శరణువేడారు.

## ఆదర్శమూర్తివయ్యా....!

రఘురామా! జయరామా! నీలమేఘశ్యామా!
ఆదర్శమూర్తివయ్యా, అయోధ్యరామా! ॥ రఘు ॥

జనకరాజ పుత్రిని పరిణయమాడావు
వీరుడిలా పత్నిని చేపట్టమన్నావు
అన్నాదమ్ముల కలసిమెలసి ఉన్నావు
అన్నప్రేమకు నీవు హారతివయ్యావు
మౌని యాగమును నీవు జరిపించినావు
రాజధర్మం తప్పక నెరవేర్చినావు ॥ రఘు ॥

శూర్పణఖ కోరికను వారించినావు
ఏకపత్నీవ్రతము ఘనమైనదన్నావు
విలువ పాటించని వాలిని వధించావు
సమతకై బాణాన్ని సంధించినావు
సీతనపహరించిన దశకంఠుని ద్రుంచావు
పరస్త్రీని కోరితే నాశనమే అన్నావు ॥ రఘు ॥

- దాసరి చంద్రయ్య

ఆయన సర్పరాజైన వాసుకిని చూసి ఈ ఘనకార్యానికి నీవే సమర్థుడవని చెప్పి రాక్షసులకు, దేవతలకు వాసుకిని తాడుగా ఉపయోగించుకోమన్నాడు. వాళ్లు ఆవిధంగా చేయగా, మేరు పర్వతం క్షీరసాగరంలో మునిగిపోజొచ్చింది. ఈ విపత్కర పరిస్థితుల్లో తిరిగీ ఆదుకోవాల్సిందిగా శ్రీహరిని ప్రార్థించారు.

ఆయన కూర్మావతారంతో ఆ పర్వతానికి ఆధారంగా నిలిచాడు. దేవతలు సర్పవాలం వైపు, రాక్షసులు శిరసు వైపు నిలిచి పాలకడలిని మథించారు. వారు మథిస్తున్న తీవ్రతకు తట్టుకోలేక వాసుకి విషాన్ని విరజిమ్మాడు. దాంతో ఆందోళన చెందుతున్న దేవదానవులిద్దరినీ చూచి బ్రహ్మదేవుడు "ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తే మీకు శుభాలు కలుగుతాయి" అని చెప్పాడు. వారు శివుణ్ణి ప్రార్థించగా ఆయన బ్రహ్మ ఎదుట ప్రత్యక్షమయ్యాడు. దేవదానవులు శివుణ్ణి స్తుతించి దండకం చదివారు. భక్తవ శంకరుడైన శంకరుడు ఆ కాలకూట విషాన్ని మింగడానికి సిద్ధపడ్డాడు. మింగి, దాన్ని అలాగే గొంతులో పెట్టుకోవడం వల్లే శివుడు నీలకంఠుడయ్యాడు. క్షీరసాగరంలో అతి విలువైన సంపదలతో పాటు దేవ వైద్యుడైన ధన్వంతరి, ఐరావతం, ఆదిలక్ష్మి, కామధేనువు, కల్పవృక్షం, కౌస్తుభమణి, అప్సరసలు, చంద్రుడు ఉద్భవించారు. ధన్వంతరి రెండు చేతులతో ఒక కలశాన్ని పెట్టుకుని ప్రత్యక్షమయ్యాడు. దాంతో సంతోషాంతరంగితులైన దేవతలు మంధర పర్వతాన్ని యథాస్థానంలో ఉంచి అమృతాన్ని పంచుకోవడంలో నిమగ్నులయ్యారు.

దాంతో ఆగ్రహం చెందిన రాక్షసులు అమృత కలశాన్ని తమకే ఇవ్వాల్సిందిగా దౌర్జన్యంతో లాగారు. అంతట శ్రీ మహావిష్ణువు మోహినీ అవతారం దాల్చి, అందరికీ నేనే సమానంగా పంచుతానని, అమృతాన్ని తన చేతుల్లోకి తీసుకుని రకరకాల హావభావాలతో అసురులను మభ్యపెట్టి అమృతాన్ని దేవతల పరం చేశాడు. ఇది కనిపెట్టిన రాహుకేతువులు మెల్లగా దేవతల రూపాలు దాల్చి దేవతల పంక్తిలోకి వచ్చేశారు. ఇది గమనించిన సూర్యచంద్రులు శ్రీహరికి సైగ చేశారు. ఆయన వారిని తన చక్రాయుధానికి గురిచేశాడు. చక్రంతో శిరస్సులను ఖండించేలోగానే అమృతం వారి నోటి కందింది. దాంతో శిరస్సులకు చిరంజీవత్వ మొచ్చి ఆకాశంలోకి ఎగిశారు. జరిగిన మోసాన్ని గ్రహించి వారితో యుద్ధం చేసిన రాక్షసులు ఏమీ చేయలేకపోయారు. ఎందుకంటే దేవతలు ఇప్పుడు అమృతం సేవించిన వారు కదా!

దేవదానవ యుద్ధంలో ప్రాణాలతో మిగిలిన రాక్షసులు బలిచక్రవర్తి దగ్గరకు వెళ్లి విష్ణువును నమ్మవద్దని హెచ్చరించారు. నీవల్లే ఇదంతా జరిగిందని నిందించారు. బలిచక్రవర్తి ఆగ్రహోదగ్రుడై దేవతలపై యుద్ధభేరిని మోగించాడు. భయపడ్డ ఇంద్రుడు సకల దేవతా గణాలతో బదరికాశ్రమంలోని నరనారాయణులు తపస్సు చేసుకుంటూంటే వారిని శరణుజొచ్చాడు. సురగణాలతో వచ్చిన ఇంద్రునికి మహావిష్ణువు అంశతో పుట్టిన నరనారాయణులు అభయమిచ్చారు.

నరనారాయణుల దోర్భల పరిరక్షితులైనటువంటి దివిజగణం, అసురులను బాహుబలిమితో సంహరించడం ప్రారంభించారు. బలిచక్రవర్తి కూడా వారితో యుద్ధం చేసి

పరాజయం పాలయ్యాడు. ఇప్పుడు ఇంద్రునికి తిరిగి స్వర్గం ప్రాప్తించింది. కాబట్టి విష్ణుమాయను తెలుసుకోవడం ఎవరి తరమూ కాదు. అంటే దాని అంతరార్థం ఏమంటే – శ్రీహరి కృపకు పాత్రులైన వారికి ఎలాంటి కష్టాలు రావు అని.

ఇలా ఈ గ్రంథంలో శ్రీ మహావిష్ణువు మాయలు రసవత్తరంగా వర్ణించబడ్డాయి. కథాకథన కౌశలం కూడా విశిష్టమైనది. ఉదయగిరి రాజుల వైభవం, వారి హరిభక్తి, ముకుంద ప్రార్థన, షష్ఠ్యంతాలు మొదలైనవన్నీ నాలుగాశ్వాసాలలో చోటు చేసుకుంటే, ఐదో ఆశ్వాసంలో చంద్రలేఖా విలాసం, చంద్రకేత చంద్రలేఖ వివాహం, పృథుబహునితో యుద్ధం, చంద్రలేఖ తన నిజస్వరూపంబైన నారదునిగా మారడానికి విప్ర రూపంలో శ్రీ మహావిష్ణువు సాయపడుట మొదలైన విషయాలున్నాయి.

ఇందులో ఎఱగుడిపాటివారు విష్ణుమాయను కథాకథన చాతుర్యంతో వివరించడంతో పాటు, తనకు గల వైష్ణవాభిమానాన్ని అడుగడుగునా ప్రదర్శించాడు. విష్ణు స్తుతులకు, వర్ణనలకు ఇందులో కొదువలేదు.

ఉదాహరణకు కావ్యాంతంలోని –

**భద్రేభార్తి నివారణా సకల భూభారైక సంహారణా**
**చిద్రూపాఖిల కారణా!! బుధలసచిత్తాబ్జసంధారణా**
**రుద్రాత్మీయ విచారణా! ఖగ వరారూఢాను సంచారణా!**
**హృద్రోగాంబుధితారణా! సుజన వాంఛాజాల సంపూరణా!**

కావ్యంలో తెలుగుదనం తేనెవాకలై ప్రవహించింది. అందుకు కావ్యాన్నంతా ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అప్పటి నెల్లూరు, ఆ పరిసర ప్రాంతాలను, వాటి పేర్లను చక్కగా వివరించడం, మాండలికాలను వ్యావహారిక పదాలను కవిత్వంలో శాశ్వతం చేయడం చూస్తే 'ప్రకృతికిన్ భాష్య ప్రణేతల్ కవుల్' అనే గాకుండా, కవీశ్వరునికి స్వస్థాన వేష భాషాభిమతం – మన సంస్కృతీ సంప్రదాయ వైభవాలు ఎంత గొప్పగా ఉన్నాయో ఈ కావ్యం చక్కగా తెల్పుతుంది. అంతెందుకు కవిగారు ఈ కావ్యాన్ని బిట్రగుంట శ్రీ వేంకటేశ్వర స్వామికే అంకితం చేశాడు. శ్రీ వేంకటేశ్వరుని చరణారవిందాలకు అంకితమైన కావ్యాల్లో ఇదొకటి.

ఆశ్వాసాంత గద్యలో కవి కావ్యాన్ని "శ్రీ హనుమత్సీతా భరత లక్ష్మణ శత్రుఘ్న సమేత శ్రీరామచంద్రార్పణమ్" అంటూ ముగించారు. దీనినిబట్టి కుటుంబ విలువల్ని, సామాజిక ధర్మాల్ని పాటించిన చల్లని తండ్రి రామయ్యను తలచుకోవడంలో కూడా కవి బాంధవ్యాలకు ఎంత విలువ ఇస్తాడో తెలుస్తోంది.

ఈ కావ్య ఫలశ్రుతిగా పంచమాశ్వాసాన్ని చెప్పుకోవచ్చు. "ప్రపంచమంతా విష్ణుమాయా శక్తి ప్రకల్పితం. దాన్ని తెలుసుకోక బ్రహ్మాది దేవతలు కూడా అహంకారంతో మాయచేత వంచితులై చివరకు పశ్చాత్తాపాన్ని పొందుతారు. ఆ విష్ణు మాయకు లోబడి ఉంటారు. సత్త్వగుణ ప్రధానులై ఇంద్రియ నిగ్రహం కల్గి జ్ఞాన వైరాగ్యాల్ని సాధించినా అహంత్వాభిభూతులు కాక ప్రసన్నులై ఏకాంత భక్తితో ఆ విష్ణువు నారాధించినవారు గాని, ఆ విష్ణుమాయనతిక్రమించి ప్రపంచతత్త్వాన్ని తెలిసి సంసార చక్రం నుండి విముక్తి పొందలేరని తెల్పడమే ఇందులో కవి సూచించిన పరమార్థం".

ఈ కావ్యంలో విష్ణుమాయలకు, చిద్విలాసాలకు, లీలావిహారాలకు ఎన్ని పద్యాలనైనా ఉదాహరణగా చెప్పుకోవచ్చు. నారదమహర్షి చెప్పే పద్యాలన్నీ ఆ కోవలోనివే –

(1) **సర్వేశ! సర్వకారణ**
**సర్వాత్మక సర్వసాక్షి సర్వాతీతా!**
**సర్వశరణ్య! దయాకర!**
**సర్వోత్తమ సర్వరూప సర్వోద్ధారా!**

(2) **సర్వసముడవయ్యు సర్వంబు రక్షించు**
**సర్వకర్త వీవు జలధిశయన**
**సర్వజీవులకును సాధింపరాని యీ**
**మాయనింతపెంపు సేయనేల!**

విష్ణు కథామృతం ఎంతగ్రోలినా తనివితీరనిది. పూర్వజన్మ సుకృతం ఉంటే గానీ విష్ణుకథా శ్రవణభాగ్యం లభించదు. ఈ విషయాన్నే అన్నమయ్య 'వినరో భాగ్యము విష్ణుకథ' అని ఉద్బోధించాడు. ఈ మహద్భాగ్యం అందరికీ అందేదికాదు. అలనాడు పరీక్షిత్తు మహారాజుకే ఆ భాగ్యం దక్కింది. వైష్ణవ సంప్రదాయ సాహిత్యాన్ని, విష్ణుసంబంధితాంశాల్ని వివరిస్తూ మహిమాన్వితమైన విష్ణుస్వరూపాన్ని ఆవిష్కరించిన భక్తికావ్యం 'విష్ణుమాయా విలాసం'.

# మత్స్యావతార విశిష్టత

– పి. శ్రీవాణి

**యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్.**

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. (గీత 4-7,8)**

ధర్మానికి బాధ ఏర్పడి, అధర్మం ప్రబలుతున్నపుడు, శిష్టరక్షణ, దుష్టశిక్షణ చేసి, ధర్మాన్ని ప్రతిష్ఠించడంకోసం భగవంతుడు మనప్రమేయం, అభ్యర్థన లేకుండానే అవసరమైన చోట, అవసరమైన రూపంలో అవతరిస్తాడు. అవతరించడం అంటే ఒక మెట్టు క్రిందికి దిగడం. భగవంతుని అవతారం మనల్ని రక్షించడంకోసమే! ధర్మాన్ని రక్షించడ మంటే ప్రవృత్తి-నివృత్తి రూపమైన ఉభయధర్మాన్నీ రక్షించడ మని అర్థం. ప్రవృత్తి–భౌతికం. నివృత్తి–ఆధ్యాత్మికం. ఏ విధమైన ధర్మానికి ఎవరివల్ల బాధ ఏర్పడినా భగవంతుడు అవతరించి, ధర్మాన్ని రక్షిస్తాడు. కారణం – ధర్మం భగవంతుని సొమ్ము. తన సొమ్ము సద్వినియోగం కావాలని ఆయన ఆశయం. తన శుభాశయానికి భంగం కల్గితే స్వామి సహించడు. తన సొమ్మును కాపాడే వారిని రక్షించడం, రాపాడేవారిని శిక్షించడం లోకరక్షకుడైన భగవంతుని ధర్మం. ఇందుకే 'త దాత్మానం సృజా మ్యహం','సంభవామి యుగే యుగే' – 'నన్ను నేను సృజించు కొంటాను, ప్రతియుగంలో అవతరిస్తాను" అని హామీ ఇచ్చాడు – భగవంతుడు. ఇచ్చిన హామీ నిలబెట్టుకో వడం కోసం ఎన్ని అవతారాలు ధరించడానికైనా స్వామి సంసిద్ధంగానే ఉంటాడు.

**2010, మార్చి 18**
**మత్స్యజయంతి సందర్భంగా**
**ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

భగవంతుని గుణాలు అసంఖ్యాకాలు అయినట్లే- అవతారాలుకూడా లెక్కలేనన్నే! అయితే మనం అన్నింటినీ గుర్తించి, ఆయా మూర్తుల్ని సేవించలేము కనుక పురాణాలు ప్రసిద్ధంగా పేర్కొన్న వాటిల్ని ఆరాధిస్తున్నాము. ఈ క్రమంలో దశావతారాలు అత్యంతప్రసిద్ధంగా అందరూ కీర్తిస్తుండేవి.

మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశు రామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్క్యవతారాలు – దశావ తారాలు. ఇందులోనూ కాస్త తేడా ఉన్నా – మనకు ప్రస్తుతం ప్రథమావతారమైనది మత్స్యమూర్తి కనుక – ఇందులో ఏ విధమైన తేడాలు లేవు.

అష్టాదశపురాణాలలో మత్స్యపురాణం ప్రత్యేకస్థానాన్ని సంతరించుకొన్నది. శ్రీమహావిష్ణువు మత్స్యరూపాన్ని ధరించి, వేదాలనూ, సమస్త భూమండలాన్నీ రక్షించిన కథ ప్రత్యేకంగా చెప్పినందువల్ల – మత్స్యపురాణం అయింది. మహాప్రళయ కాలంలో వైవస్వతమనువుకూ, సప్తర్షులకూ మత్స్యమూర్తి అయిన శ్రీమన్నారాయణుడు బోధించిన సృష్టి స్థితిలయాత్మకమైన విశ్వ విశేషాలు ఇందులో చోటు చేసుకొన్నాయి.

మహావిష్ణువు ధరించిన అన్ని అవతారాల్లో మత్స్యావ తారం మొదటిది. సృష్టి ప్రారంభ సమయంలో హయగ్రీవు డనే (సోమకు డనే) రాక్షసుడు వేదాదిశాస్త్రాలను దొంగిలించి, పాతా ళంలో దాగి ఉండగా, విష్ణువు మత్స్యరూపాన్ని ధరించి, వేదా లను ఉద్ధరించాడు.

**మత్స్యజయంతి, మత్స్యద్వాదశి :**

పురాణానుసారం చైత్రశుద్ధ తదియనాడు- కృతమాలా నదీజలముల నుండి వెలువడి, మత్స్యరూపియైన శ్రీ మహా విష్ణువు సత్యవ్రతుడు (వైవస్వతుడు) అనే రాజు అర్ఘ్యమిస్తుండగా- అతని దోసిట్లో పడినాడు. కనుక చైత్రశుద్ధ తదియ 'మత్స్య జయంతి' అని శాస్త్రాలూ, పురాణాలూ పేర్కొన్నాయి. అట్లే మార్గశిరశుద్ధ ద్వాదశిని 'మత్స్యద్వాదశి' అని పేర్కొన్నారు. ఈ రెండు తిథుల్లో శాస్త్రో క్తంగా ఉపవాసం ఉండి, భగవద్రూపాన్ని ప్రతిమగా చేసి, షోడశోపచారాలతో, స్వామిని పూజించి, దానధర్మాదులు గావిస్తే సంసార బంధాలనుండి విముక్తులు కాగల రని పురాణాలు వివరించాయి.

**మత్స్యావతారకథ :**

పూర్వం సూర్యునికొడుకు మనువు అనే రాజు ఉండే వాడు. అతడు సంస్కారశీలి. సద్గుణవంతుడు. తన కుమారునికి రాజ్యాన్ని అప్పగించి, మలయపర్వతం మీద గొప్ప తపస్సు చేసినాడు. గొప్పగా యోగసాధనలూ చేసినాడు. ఇలా పదిలక్షల యేండ్లు అయ్యాక బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి, "ఏం వరం కావాలో కోరుకొ"మ్మని మనువుకు సూచించాడు. మనువు "దేవా! అన్నిటికంటే ఉత్తమమైన వరాన్ని అనుగ్రహించుటకై మిమ్ము ప్రార్థిస్తున్నాను. ప్రళయం జరిగినపుడు చరాచరాత్మకమైన జీవుల్ని రక్షించేందుకు నాకు తగిన శక్తి కావాలి" అని కోరాడు. "తథాస్తు" అంటూ బ్రహ్మ నిష్క్రమించాడు.

ఒకనాడు మనువు తన ఆశ్రమంలో అర్ఘ్యం వదులు తుండగా ఒక ఆడుచేప నీళ్లతోకూడ అతనిదోసిట్లో పడింది. రాజు ఆ చిన్నచేపను చూచి, దయగలిగి, దాన్ని రక్షించా లను కొని, ఆ చిన్నచేపను తన కమండలంలో ఉంచాడు. ఆ మత్స్యం ఒక రోజులోనే పండ్రెండు అంగుళాలు పొడవు కలదై మనువును చూచి 'రక్షించు రక్షించు' అని ప్రార్థించింది. మనువు ఆ చేపను అందుండి తీసి, వెడల్పు మూతిగల మట్టికుండలో ఉంచాడు. అక్కడ ఒక రోజులోనే మూడుమూరలంతగా పెరిగి, మరల 'రక్షింపు'మంటూ ప్రార్థించింది. మనువు దాన్ని ఒక బావిలో వదిలాడు. అక్కడకూడా పెరిగి, అందులో ఇమడలేక 'రక్షించండి' అని కోరగా, అతడు ఒక సరోవరంలో వదిలాడు. అక్కడ రెండు ఆమడలంత పెద్దగా పెరిగింది. రాజు దాని ఆక్రందనం విని, దాన్ని గంగలో వదిలాడు. ఆ గంగానది నిండిపోయేంతగా అక్కడా పెరిగింది. పిదప రాజు దాన్ని సముద్రంలో వదిలాడు. అది సముద్ర మంతా వ్యాపించింది. రాజు ఆశ్చర్యపడి, భయ పడి – "నీవు ఎవ్వరవు? రాక్షసరాజువా? లేక వాసుదేవుడవా? కాకపోతే ఇలా ఎలా వృద్ధి అవుతావు? రెండు లక్షల ఆమడ లంత దేహం ఎవరికి ఉంటుంది? నారాయణా! నీవు మత్స్య రూపుడవై నన్ను శ్రమపెట్టున్నావు. స్వామీ! నీకు పునఃపునః నమస్కారాలు" అని ప్రార్థించాడు. అపుడు మత్స్యరూప జనార్దనుడు "పుణ్యాత్మా! నీవు సత్యాన్ని గ్రహించినావు. నీ పేరు సార్థకం. త్వరలోనే ఈ భూమి సమస్త జీవరాసులతో నీళ్ళలో మునుగుతుంది. ఇదిగో! జీవరాసుల్ని రక్షించడానికై ఈ నౌకను దేవతలచే నిర్మింపజేశాను. మహాప్రళయం జరుగుతుంది. అప్పటి ప్రళయవాయువేగానికి సకలమూ కదిలిపోతుంది. ప్రళయకాలం అయిపోయాక చరాచరాత్మకమైన ఈ జగత్తు కంతటికీ నీవు ప్రజాపతివి అవుతావు – అని చెప్పి, మనువును అనుగ్రహించి, స్వామి అంతర్ధాన మయ్యాడు.

మనువు ప్రళయం ఏర్పడే వరకూ యోగమార్గంలో కాలం గడుపుతూ వచ్చాడు. భగవంతుడు ఆజ్ఞాపించినట్లే కొంత కాలానికి ప్రళయం ఏర్పడింది. మహావిష్ణువు కొమ్ముగల మత్స్యరూపంతో, ఆదిశేషుడు త్రాడురూపంతో – మనువు దగ్గరికి వచ్చారు. ధర్మవేది అగు మనువు సర్వభూతాలను లాగి, దగ్గరకు తీసుకొని, 'సర్పత్రాటి'తో నావను చేపకొమ్ముకు కట్టాడు. విష్ణువుకు నమస్కరించి, ఆ చేపకొమ్ముకు సమీపంలో మనువు నిల్చున్నాడు. ప్రళయానంతరం నావలో ఉన్న జీవరాశి నుండియే (అంటే బీజరూపంలో ఉన్న) మరల ప్రపంచాన్నీ, సర్వపదార్థాలను – మనువు నిర్మించాడు.

ఆ సమయంలోనే వేదాలను దొంగిలించి, సముద్రంలో దాగియున్న హయగ్రీవరాక్షసుణ్ణి (సోమకాసురుణ్ణి) మత్స్య రూపుడైన విష్ణువు – సంహరించి, వేదాలను ఉద్ధరించాడు. ఈ కల్పంలో ఈ అవతారం వైవస్వతమనువు కాలంలో జరిగింది.

ఈ మత్స్యావతార కథ పురాణాలు కల్పించింది కాదు. వేదాల్లో ఉన్నదే! శుక్లయజుర్వేదంలో (2-22) "దేవస్యత్వా.... ప్రశ్నామి" అనే మంత్రంలో– "సూర్యోదయంతో కూడిన విశ్వాన్ని సృజించిన మత్స్యరూపుడవైన నీకు నమస్కారం. నీకు నైవేద్యం

**పట్టుదలతో ప్రయత్నించి ఇసుకనుండైనా**
**తైలం తీయవచ్చు.**
**దప్పిగొన్నవాడు ఎండమావులలో నైనా**
**నీళ్ళు త్రాగవచ్చు.**
**తిరిగి తిరిగి కుందేటి కొమ్మునైనా సాధించవచ్చు.**
**కాని మొండిపట్టు పట్టిన**
**మూర్ఖుడి మనస్సును**
**సమాధానపరచడం మాత్రం సాధ్యం కాదు.**

సమర్పిస్తున్నాను" – అనే అర్థ ముంది. శతపథ బ్రాహ్మణంలోని ప్రథమకాండంలో– పై మంత్రవ్యాఖ్యలో మొదటిసారిగా పూర్తిగా మత్స్యావతార కథ చెప్పబడింది.

**మత్స్యగాయత్రి**

గాయత్రీమంత్రం గొప్ప శక్తికల దనీ, ముఖ్యదేవత లందరికీ ఆయా దేవతలపేర్లతో గాయత్రీమంత్రం ఉన్నదనే విషయం సుప్రసిద్ధం. మత్స్యరూపుడైన విష్ణువును అర్చించే గాయత్రీమంత్రం వేదాల్లో ఉంది.

"ఓం ఏకశృంగాయ విద్మహే, మహా (మాయా) మత్స్యాయ ధీమహి, తన్నో విష్ణుః ప్రచోదయాత్" అనేది మత్స్యగాయత్రి. "మేము ఏకశృంగధారియైన మహా(మాయా) మత్స్యంయొక్క రూపం ధరించిన విష్ణువును ధ్యానిస్తున్నాము. ఆయన మా బుద్ధుల్ని సన్మార్గం వైపు మళ్లించుగాక!" అని అర్థం.

మత్స్యరూపుడైన విష్ణువు సంపూర్ణసచ్చిదానంద తత్త్వానికి సంకేతం. సూక్ష్మరూపంతో జలచరత్వం నుండి జీవి సంపూర్ణ క్రమవికాసంతో దైవత్వాన్ని పొందే విధానాన్ని దశావతారాలు సూచిస్తున్నాయి. సృష్టికి ఆధారమైన సకలశక్తులూ ఏకత్ర సమన్వయించి, రూపొందిన తత్త్వం మత్స్యావతారం. మత్స్యావతారమే ప్రతికల్పంలో సృష్టికి కారణమైన సర్వశక్తుల సమ్మేళన రూపం. ఈ అవతారాన్ని స్మరించడంద్వారా, పూజించడం ద్వారా – చెట్టువేరుకు నీరుపోస్తే అది మొత్తం చెట్టుకంతా చేరి, పత్రపుష్పఫలభరితం అవుతున్నట్లు – తర్వాతి అన్ని అవతారాలనూ పూజించినట్లే అవుతుంది. ఇలా మత్స్యావతారం ప్రథమపూజ్యావతారం. మహాశక్తిమంతం. సంపూర్ణ సచ్చిదానందరూపం. ముక్తిదాయకం. మత్స్యయంత్రానికి వాస్తుశాస్త్రంలో విశిష్టస్థానం ఉంది. శంకుస్థాపనలో శంకువు క్రింద మత్స్యయంత్రాన్ని స్థాపిస్తారు. సకల వాస్తుదోషాలూ పోగొట్టి, సకలాభ్యుదయాలూ కల్గిస్తుంది – మత్స్యయంత్రం.

భగవద్గీత తొమ్మిదవ అధ్యాయం 6,7 శ్లోకాలలో "ఆకాశం నుంచీ ఉత్పన్నమై, సర్వత్ర సంచరించే విస్తృతమైన వాయువు సదా ఆకాశంలోనే నిల్చియున్నట్లు – నా సంకల్పం ద్వారా ఉత్పన్నాలైన ప్రాణులు అన్నీ నాయందే నిల్చి ఉంటాయి. కల్పాంతంలో ప్రాణులన్నీ నాలోనే చేర్తాయి. కల్పాదిలో నేనే వాటిని మరల సృజింపజేస్తాను" అని చెప్పిన మాటలు మత్స్యావతార తత్త్వానికి చక్కని సమన్వయాన్ని చేకూరుస్తున్నాయి.

**తి.తి.దేవస్థానాల్లో – మత్స్యనారాయణస్వామి :**

తిరుమల తిరుపతి దేవస్థానాలకు సంబంధించిన నాగలాపురంలో వేదనారాయణు డనే పేరుతో మత్స్యమూర్తి శ్రీమన్నారాయణు డున్నాడు.

నాగలాపురానికి మొదటి పేరు 'అరిగండాపురం'. 'శత్రువులకు గండంగా మారినపురం' అని అర్థం. విష్ణువు మత్స్యావతార మెత్తి సోమకాసురుణ్ణి సంహరించి, వేదాలు రక్షించి, బ్రహ్మకు ఇచ్చిన సందర్భంలో, వేదాలు తెస్తా నన్న విష్ణువు ఎన్నాళ్లకూ వైకుంఠంలో కన్పించనందున – ఆయన్ను వెదకుచూ వచ్చిన బ్రహ్మ, చివరకు ఇప్పటి నాగలాపురంలో దర్శించాడు. అందువల్ల ఇది 'హరిగండాపురం' అంటే విష్ణువు కన్పించిన చోటు.

వేదాలు ఉద్ధరించిన నారాయణుడు – అనగా మత్స్య నారాయణుడు కనుక ఇక్కడ స్వామి వేదనారాయణుడు అయ్యాడు. అమ్మవారు 'వేదవల్లి'. వేదనారాయణుడు మత్స్యావతారంలో ఉన్నాడు. కనుక స్వామివారి మూర్తికి పాదాలు లేవు. శంఖచక్రా లున్నాయి. బంగారు పాదాలు చేయించి ఉంచడం జరిగింది. ఉత్సవమూర్తులు కృష్ణుడు, శ్రీదేవి, నీలాదేవి. అయినా వీరిని వేదవల్లి, వేదనారాయణ స్వాములుగానే పరిగణిస్తున్నారు. ఆలయం పశ్చిమ ముఖం. ప్రతి సంవత్సరం ఏప్రిల్ 26,27,28 తేదీలలో సాయంకాలం నాల్గు లేదా ఐదు గంటల సమయంలో సూర్యకిరణాలు మొదటిరోజు స్వామివారి పాదాలనూ, రెండవ రోజు బొడ్డునూ, మూడవరోజు ముఖాన్నీ తాకి, తమ సేవను అందిస్తాయి.

వేదనారాయణుడుగా మత్స్యమూర్తి నెలకొన్న ఇంత పెద్ద ఆలయం మరెక్కడా లేదు.

కనుక మత్స్యజయంతికీ, తిరుమల తిరుపతి దేవాలయాలకూ ఒక విశిష్ట సంబంధం ఉన్నది.




హిరణ్యాక్షుడనే అసురుడు ఎన్నో అరాచకాలను హద్దుమీరి చేస్తుండేవాడు. అతని వల్ల ఋషులు దేవతలు అష్ట కష్టాలు పడ్డారు. ప్రళయం రుద్రతాండవమాడింది.

ఈ ప్రళయానికి కారణం భూమి అనుకున్న హిరణ్యాక్షుడు భూమిని ఒక చాపలా చుట్టి పాతాళంలో పాతి పెట్టాడు. దీంతో దేవతలు దిక్కుతోచక మహావిష్ణువు పాదాలచెంత చేరి శరణు కోరారు. వారి కోరిక ప్రకారం మహావిష్ణువు వరాహావతారమెత్తాడు. తన పదునైన కొమ్ములతో భూమిని చీల్చుకుంటూ పాతాళానికి చేరుకుని హిరణ్యాక్షుడితో యుద్ధం చేసి భూదేవిని విడిపించాడు. ఆ తర్వాత దేవతల ప్రార్థన మేరకు మహావిష్ణువు యొక్క అంశమైన వరహమూర్తి తిరుమలలో ఆశ్రమం నిర్మించి అక్కడే నివసించాడు.



**ఆర్. నవ్యశ్రీ,**
**D/o ఆర్. హరినాథ రెడ్డి,**
**7వ తరగతి, 'బి' సెక్షన్,**
**శ్రీ చైతన్య టెక్నో స్కూల్, తిరుపతి.**

తర్వాత మహావిష్ణువుపై ఆగ్రహించిన లక్ష్మీదేవి వైకుంఠాన్ని వదలి వెళ్లిపోయింది. ఆమెను వెతుకుతూ బయల్దేరిన విష్ణువు శేషాద్రిపై ఆశ్రమంలో ఉన్న వరాహమూర్తి వద్దకు చేరుకుని అక్కడ ఉండడానికి అనుమతికోరాడు. అందుకు సమ్మతించిన వరాహమూర్తి "శ్రీనివాసా! నువ్వు జీవితాంతం ఇక్కడే నివసించవచ్చు. అయితే ఉచితంగా కాదు బాడుగ ఏదైనా ఇవ్వాలి సుమా!" అన్నాడు. ఇది వినగానే శ్రీనివాసుడి మొహం మాడిపోయింది. "స్వామీ, లక్ష్మీదేవి నన్ను వదిలి వెళ్లినందువల్ల నేను ఇప్పుడు నిరుపేదనయ్యాను. నా చెంత ధనం, ఐశ్వర్యం ఏమీ లేదు. ప్రస్తుతం నేనుండడానికి కొంత చోటివ్వండి. కృతజ్ఞతా పూర్వకంగా నన్ను చూడడానికి వచ్చే నా భక్తులు, ముందు మిమ్మల్ని దర్శించి కానుకలు, నైవేద్యాలు సమర్పించిన తర్వాతే నా వద్దకు వచ్చేట్టు చేస్తాను" అన్నాడు శ్రీనివాసుడు. వరాహమూర్తి అందుకు సమ్మతించాడు.



అలా తిరుమల చేరిన శ్రీనివాసుడు ఆకాశరాజు కుమార్తె పద్మావతిని చూసి ఆమెను పరిణయమాడాడు. వివాహ ఖర్చు కోసం కుబేరుడి దగ్గర అప్పు తీసుకున్నాడు. దానికి వడ్డీగా కలియుగాంతం వరకు తన భక్తులు ఇచ్చే కానుకలను సమర్పించుకుంటానని తెలిపాడు.

వేంకటాచలపతికి వచ్చే కానుకలు లెక్కగట్టి కుబేరుడికి ఆయన సోదరుడు గోవిందరాజ స్వామి ఇస్తూనే ఉన్నాడట. గోవిందరాజస్వామి ఆలయం తిరుపతిలో ఉంది.

పురాణకథ ఇలా ఉండగా చరిత్ర మరోలా తెలుపుతోంది. ప్రపంచంలో ప్రఖ్యాతి గాంచిన చిదంబర నటరాజ స్వామి ఆలయంలో ఉన్న శేషశయన తల్పంపై శయనించే గోవిందరాజస్వామి విగ్రహాన్ని, ఆ సమయంలో శైవ, వైష్ణవుల మధ్య జరుగుతున్న గొడవల కారణంగా 2వ కులోత్తుంగ చోళన్ బంగాళాఖాతంలో వేయగా శ్రీ రామానుజస్వామివారు దాన్ని వెలికి తీయించి, తిరుపతిలో ప్రతిష్ఠ చేయించినట్టు చరిత్ర చెబుతోంది.

తిరుపతి నడిబొడ్డున ఈ గోవిందరాజస్వామి ఆలయం నెలకొంది. మనల్ని మొట్టమొదట ఆకర్షించేది అక్కడి సమీపంలో ఉన్న కోనేరు. ప్రతి ఏటా ఇక్కడ జరిగే తెప్పోత్సవం క్రీ.పూ. 1130లో శ్రీరామానుజుల వారు ప్రారంభించారు.

# డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమము - 01-01-2010

## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఇ.ఓ.'*** *కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 01-01-2010న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం)*

**అలిపిరి నుండి మెట్లదారిలో మైక్ అనౌన్స్‌మెంట్, పాటలు సరిగా వినబడడం లేదు.** – *అప్పారావు, గాజువాక*

**కార్యనిర్వహణాధికారి :** బాగుచేస్తాము.

**అలిపిరి నుండి మెట్లదారిలో ఉన్నంత సెక్యూరిటీ శ్రీవారిమెట్టు దారిలో లేదు. ఒంటరిగా ఈ దారిలో తిరుమలకు రావాలంటే ఇబ్బందికరంగా ఉంది. సెక్యూరిటీ ఏర్పాటు చేయండి.** – *సుబ్రహ్మణ్యం, రాజోలు*

**కార్యనిర్వహణాధికారి :** ఈరోజే (జనవరి 1) బయోమెట్రిక్ కౌంటరును ప్రారంభించాం కాబట్టి సెక్యూరిటీ ఇస్తున్నాం. ఇక ఆ భయం లేదు.

**విదేశీ భక్తులకు (ఎన్.ఆర్.ఐ.) చాలా ఇబ్బందులు కలుగుతున్నాయి. దర్శనం చాలా ఆలస్యమవుతోంది. పాస్‌పోర్టు చూసి తొందరగా అయ్యేటట్లు చూడండి.** – *ప్రతాప రెడ్డి, హైదరాబాదు*

**కార్యనిర్వహణాధికారి :** మీరు పాస్‌పోర్టు చూపితే సుపథం ద్వారం గుండా పంపుతారు.

**ఉచిత లడ్డు ఇక ఇవ్వరా? ఇస్తే తి.తి.దే. కు అదనపు నష్టం ఏమిటి? తరతరాలుగా ఇస్తున్న ఉచిత లడ్డును భక్తులు మహా ప్రసాదంగా భావిస్తున్నప్పుడు దయచేసి ఆపకండి.** – *కృష్ణ, విజయవాడ*

**కార్యనిర్వహణాధికారి :** లడ్డుకు ఏదో ఒక ధర లేకపోతే సంస్థాపరమైన కొన్ని ఇబ్బందులు ఉన్నందువలన ఉచిత లడ్డుకు బదులు ఒక లడ్డు రూ. 10/– లతో రెండు ఇస్తున్నాము.

**గదుల కేటాయింపు బాగుంది. అయితే అక్కడి సిబ్బంది ఎంతో కొంత ఇచ్చి వెళ్ళండి అని చేయి చాపుతున్నారు. ఇతర రాష్ట్రాల భక్తులవద్ద ఇలా అడగడం సంస్థకు చిన్నతనంగా ఉండదా? వీరికి తి.తి.దే. ఇచ్చే జీతాలు చాలవా?** – *శంకర్, చెన్నై*

**కార్యనిర్వహణాధికారి :** ఇలాంటి విషయాలను మా విజిలెన్స్ అధికారులు పర్యవేక్షిస్తున్నారు. అయితే మీరు చెప్పిన విషయం కూడా పరిగణలోకి తీసుకొని చర్యలు చేపడతాం.

**ఉచిత లడ్డు గురించి మరొక్కసారి ఆలోచించండి. భక్తులకు ఉచిత లడ్డు ఇవ్వకపోవడం మంచిది కాదేమో?** – *శర్మ, విజయవాడ*

**కార్యనిర్వహణాధికారి :** ఇప్పుడు చిన్న లడ్డు ఇస్తున్నాం. మీ సలహాలు పరిగణలోకి తీసుకొని పరిశీలిస్తాం.

**ధ్వజస్తంభం వద్ద భక్తులను ఒకేసారి వదిలేస్తున్నారు. దీనివల్ల తోపులాట జరిగి వృద్ధులు, పిల్లలు నలిగిపోయి చాలా ఇబ్బంది పడుతున్నారు?** – *సత్యనారాయణమూర్తి, తణుకు*

**కార్యనిర్వహణాధికారి :** ఈ విషయం మేమూ పరిశీలించాం. మధ్యలో రోప్‌తోకాకుండా బారికేడ్‌లు పెట్టి క్యూలైన్ నడుపుదామని చూస్తున్నాం. త్వరలో ఈ ఇబ్బందిని తొలగిస్తాం.

**శీఘ్రదర్శనం చాలాబాగుంది. ఇది వరకు బ్లాక్‌లో కొనేవాళ్ళం. ఇప్పుడు ఆ బాధతప్పింది. ఇంకో విషయం చెన్నైలో ఉండే మా స్నేహితుడు మధు ఒక అర్చకునివద్ద స్వామికి కానుకగా ఆభరణం ఇచ్చాడు. అవి స్వామికి చేరలేదు.** –*బాలాజి, వైజాగ్*

**కార్యనిర్వహణాధికారి :** స్వామికి ఇచ్చే నగదు, ఆభరణాలను సరైన పద్ధతిలో ఇచ్చి రశీదు పొందాలి గాని అర్చకుల వద్ద ఇవ్వకూడదు. వివరాలు పంపండి. తగు చర్య తీసుకుంటాం.

**భగవంతునికి అందరూ సమానమైనప్పుడు, పేద గొప్ప తేడా లేనపుడు వి.ఐ.పి.దర్శనం అనడం తప్పు కదా. ఈ పదం వాడొచ్చా?** – *దుర్గా ప్రసాద్, బెంగుళూరు*

**కార్యనిర్వహణాధికారి :** దీన్ని గురించి తప్పకుండా పరిశీలిస్తాము.

**గతంలో ఎ.ఎ.డి. ఆర్జిత సేవకు డి.డి. పంపాను. తిరిగి రాలేదు.** – *అనిల్‌కుమార్, పూణె*

**కార్యనిర్వహణాధికారి :** ఎ.ఎ.డి. సేవ ఇప్పుడు లేదు. మీరు ఎ.ఎ.డి. రద్దు చేయకముందే పంపారు కాబట్టి మీ డి.డి. ని చూసి దానికి బదులు శీఘ్రదర్శనం పొందేటట్లు చూస్తాము.

# తెరతీయగరాదా

– డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

ఎందరో వాగ్గేయకారులు తమభక్తిసంగీతంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారిని వేనోళ్ల కీర్తించి, తాము తరించడమే కాక, ఆ కీర్తనల్ని భక్తితో గానం చేసిన వారిని కూడా తరింపజేస్తున్నారు. కలియుగప్రత్యక్షదైవమై, భక్తులపాలిటి కల్పవృక్షంగా ఆపద మ్రొక్కులవాడుగా కీర్తింపబడే శ్రీ వేంకటేశ్వరుణ్ణి సేవించని భక్తు లుండరు.

కర్ణాటక సంగీతచరిత్రలో త్యాగరాజు చిరస్థాయి అయిన కీర్తిప్రతిష్ఠల్ని గడించాడు. “కర్మ భక్తి జ్ఞాన మార్గాలను సంగీతంలో మేళవించి, నిజము నెరిగిన బ్రహ్మవేత్త – త్యాగయ్య” అన్న విస్సా అప్పారావుగారి వాక్యం ప్రత్యక్షరసత్యం.

త్యాగరాజు దేవతాంతరభేదాన్ని పాటించక, అన్ని పుణ్యక్షేత్రాలనూ దర్శించి, ఆయా క్షేత్రాధిదైవతాల్ని నోరార కీర్తించి, సేవించి, వారికృపకు పాత్రుడైన అభేదర్శనసిద్ధుడు.

త్యాగరాజు తన శిష్యుడైన వాలాజాపేట వేంకటరమణ భాగవతులవారికోరికప్రకారం తీర్థయాత్రలకు బయలుదేరి, మొదటగా వాలాజాపేటమీదుగా శ్రీ తిరుపతిక్షేత్రానికీ, ఇట నుండి కోవూరు, కంజీవరం, అటనుండి మధ్యార్జునం, గోవిందపురం, తిరువసినెల్లూరు, నాగపురం, రామేశ్వరం, ధనుష్కోటి, మధుర, శ్రీరంగం – ఇలా సంచారం చేశాడు. అయ్యగారివెంట శిష్యబృందమూ ఉండేది. త్యాగరాజును ‘అయ్యగారు’ అనడం సంప్రదాయం.

అయ్యగారు తిరుమల శ్రీవారిని సేవించడానికి ఆలయానికి వచ్చిన సమయానికి తిరువారాధనకోసమో, ఆరగింపు సేవకోసమో తెరవేసి ఉండినారు. ఆ తెర స్వామికి గాక తనకే వేసినట్లు లోలోపల భావించి, తన దుష్కృతఫలమే ఈ తెర రూపంలో అడ్డగించి, స్వామివారిదర్శనభాగ్యాన్ని దూరం చేసిందని నిర్ణయించి, ఆ పరాత్పరుని దివ్యదర్శనంకై ఆర్తిపరుడై, తన మత్సరాన్ని తొలగించుమంటూ భక్తిప్రపూర్ణహృదయంతో ఇలా ప్రార్థించాడు.

**గౌళిపంతు - ఆది**

**తెర తీయగరాదా లోని**
**తిరుపతి వెంకటరమణ! మచ్చరమను ॥ తె॥**

**పరమపురుష! ధర్మాదిమోక్షముల**
**పారఁదోలుచున్నది నాలోని ॥ తె॥**

**ఇరవొందగ భుజియించు సమయమున**
**ఈగ తగులు రీతి యున్నది**
**హరిధ్యానము సేయు వేళ చిత్తము**
**అంత్యజు వాడకుఁ బోయిన ట్లున్నది ॥ తె॥**

**మత్స్యము ఆకలిఁగొని గాలముచే**
**మగ్నమైన రీతి యున్నది**
**అచ్చమైన దీపసన్నిధి మరు**
**గిడఁ బడి చెఱచిన ట్లున్నది**

**వాగురయని తెలియక మృగగణములు**
**వచ్చి తగులు రీతి యున్నది**
**వేగమె నీ మతము ననుసరించిన**
**త్యాగరాజనుత మదమత్సర మను ॥ తె॥**

అయ్యగారు పరమార్తుడై ఈ విధంగా కీర్తించగానే ఆర్తిహరుడైన శ్రీవారికీ, ఆర్తభక్తుడైన త్యాగయ్యకూ మధ్యనున్న తెర తనంత తానే తొలగిపోయింది. అనంతరం శ్రీవారిని కనులార దర్శించి, మనసారా కీర్తించి, ఆడిపాడి బ్రహ్మానంద పరవశు డయ్యాడు.

శ్రీవారిని దర్శించడానికి తెర అడ్డంగా ఉన్నప్పుడు– భౌతికమైన వస్త్రపుతెరను తొలగించుమంటూ స్వామినీ, అర్చకస్వామినీ అర్థించడంకంటే – తన జన్మాంతరదుష్కృతమో, అరిషడ్వర్గమో ఇందుకు కారణమై ఉంటుం దని నిర్ణయించి, ఆ

అక్షరామృతం [19]

దోషాలను తన మనస్సుకు తెచ్చుకొని, తాను అపరాధాలకు పుట్టినిల్లు అనీ, గతిలేనివాణ్ణి అనీ, సంసారుల దోషాలను కూడా తనయందే ఆరోపించుకొని, వాటిల్నికూడా తన దోషాలుగానే భావించడం అయ్యగారి విశాలదృష్టికీ, అందరిఆర్తినీ తొల గించా లనే ప్రపన్నత్వవిశిష్టతకూ ఈ సన్నివేశం నిదర్శనం. కష్టసుఖాలు రెండూ భగవంతుని కృపాప్రాప్తాలే!

అయ్యగారి ఈ ఆర్తికీర్తన భావసారాంశం."ఓ తిరుపతి వెంకటరమణా! నాలో ఉండే మాత్సర్య మనే తెర – నీ దర్శనా నికి ఆటంకం కల్పిస్తూంది. దీన్ని తొలగించు. ఓ పరమపురుషా! ధర్మ, అర్థ, కామ, మోక్షాలను స్వానుభవానికి రానీకుండా నాలోని ఈ మాత్సర్య మనే తెర – దూరం చేస్తూంది – స్వామీ! స్తిమితంగా భోజనంచేసే సమయంలో నోటిలో ఈగ అడ్డం వచ్చినట్లూ, స్థిరచిత్తంతో శ్రీహరిని ధ్యానించే వేళలో మనస్సు అనాచార, అసభ్య స్థలాలకు వెళ్ళినట్లూ, నీటిలోని చేప ఆకలితో ఆహారం అనుకొని గాలానికి తగులు కొన్నట్లూ, స్వచ్ఛమైన దీప కాంతిలో ఏదో మరుగు ఏర్పడి, కాంతిని చెరచినట్లూ, లేళ్లు తమను పట్టుకోవడానికి వలపన్నిన గోయి అని తెలియక అందులో పడినట్లూ, ఏ జన్మలోనిదో అయిన మదమాత్సర్యాల తెర నీ దర్శనభాగ్యానికి అడ్డుగా నిల్చి ఉంది. దయతో ఈ తెరను తొలగించి, నీ దివ్యదర్శనభాగ్యాన్ని కల్గించవా?" అని.

అనుకొన్న సమయానికి దైవదర్శనం కాలే దంటే – చాలామంది "నాపై స్వామికి దయలేదు. అందుకే నాకు దర్శన భాగ్యం లభించలేదు" – అంటూ నేరం భగవంతునిపై మోపు తారు. కాని త్యాగయ్యవంటి జ్ఞానసంపన్నులు అలా భావించరు. భగవంతు డెప్పుడూ కృపామూర్తియే! వారికృపకు నోచుకునే అర్హత మనలోనే ఎక్కడో లోపించి ఉంటుంది. ఆ లోపం తొలగితే స్వామికృప మనపై తప్పక ప్రసరిస్తుంది. జీవుని హృదయాన్ని కామక్రోధలోభమోహమదమాత్సర్యాలనే శత్రువర్గం ఆవరించి, అతణ్ణి సత్కార్యాలకూ, సద్భావాలకూ దూరం చేస్తుంది. అహంభావానికి మదమాత్సర్యాలే ప్రబల కారణం. 'అహం' తొలగితే అన్ని ఆటంకాలూ తమంత తామే తొలగి పోతాయి. కర్మానుగుణంగా ప్రాప్తించిన ఈ మదమాత్సర్యా లను, కర్మాతీతుడైన వేంకటేశ్వరుడే తొలగించాలి. దైవదర్శనానికి ప్రతిబంధకా లేర్పడితే, ఇతరులు ఎవ్వరూ వాటిల్ని తొలగించ లేరు.

పరమభాగవతులు నిరంతరం భగవద్భావనాచిత్తం కల వారు. తమకు కలిగే అన్ని అనుభవాలనూ భగవంతునియందే సమన్వయించుకొంటారు. అంతేగాని తమప్రారబ్ధాన్ని మరొకరిపై రుద్దరు. త్యాగయ్య పరమభాగవతశిరోమణి!

ఈ కీర్తనలో – కామక్రోధాదులైన అరిషడ్వర్గ ప్రభావం ఎంత బలవత్తరమైనదో అయ్యగారు ఎంతో ఆర్తితో ఉపమాన రూపదృష్టాంతాలతో వ్యక్తం చేశారు. అహంకారమమకారాలే సర్వఅనర్థాలకూ మూలం. మమ (నాది), నిర్మమ (నాదికాదు); అనే ఈ రెండే బంధమోక్షాలకు కారణా లని వేదాంతుల నిర్ణయం. 'అంతా నాదే' అనుకొంటే బంధం. 'ఏదీ నాది కాదు– అంతా ఆ భగవంతునిదే' అని భావించి, శరణాగతుడై ప్రవర్తిస్తే అదే మోక్షకారణం!

"ఇంతటి గొప్పవాణ్ణి నేను వచ్చాను. నాకు దర్శనావ కాశం లేకుండా ఈ తెర అడ్డం పెట్టారు" అని తమకు తోచిన వారి నందరినీ, తోచినరీతిలో నిందించకుండా – త్యాగయ్య తనలో ఏ మూలనో దాగి ఉన్న అహంకారం ఈ తెర రూపంలో అడ్డగించింది. దాన్ని తొలగించుకోవడానికి నేను అశక్తుణ్ణి. పాపపరిహారకుడూ, సర్వశక్తిసమర్థుడూ అయిన వేంకటేశ్వరుడే ఈ అహంరూపమైన తెరను తొలగిస్తాడు' అని ఆ స్వామినే నిండు భక్తితో, ఆర్తితో ప్రార్థించాడు. ప్రపన్నార్తిహరుడుకదా వేంకటేశ్వరుడు! త్యాగయ్య ఆర్తినీ, ప్రపన్నతాగుణాన్నీ గమనించి, తత్క్షణమే ఆ తెరను తొలగించాడు.

కనుక తీర్థయాత్రలకూ, దైవదర్శనాలకూ చిత్తంలో ఏర్పడే ప్రతిబంధకాలు ఇతరులవల్ల వచ్చేవి కావు. అవి స్వయంకృతాలు. కనుక పశ్చాత్తాపంతో, ఆ ప్రతిబంధాలను తొలగించుకోవడానికి సర్వశరణ్యుడైన శ్రీ వేంకటేశ్వరుణ్ణి శరణు పొందాలి. ఆర్తితో, భక్తితో స్వామిని ప్రార్థించాలి.

ఇక్కడ అయ్యగారు "నీ మతము ననుసరించిన" అనే గొప్పమాట అన్నారు. శ్రీవారిమతం – 'తన పాదపద్మాలను ఆశ్రయించి, భవబంధాల నుండి తరించండి' అనేది. అందుకే

**విష్ణోః పదే పరమ ఇ త్యుదిత ప్రశంసౌ**
**యౌ మధ్వ ఉత్స ఇతి భోగ్యతయాऽ ప్యుపాత్తౌ**
**భూయ స్తథేతి తవపాణితలప్రదిష్టౌ**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే**

**పార్థాయ తత్సదృశసారథినా త్వయైవ**
**యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి ।**
**భూయోऽ పి మహ్యమిహ తౌ కరదర్శితౌ తే**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే**

"భక్తులారా! సకలప్రశస్తాలూ, పరమభోగ్యాలూ అనే విషయాన్ని సార్థకం చేస్తూ నేను కుడిచేతితో క్రిందికి చూపు తున్నవీ, అర్జునునికి అన్ని విధాలా తగినసారథినై ఆనాడు నన్ను శరణుపొందు మని చూపించినవీ, అయిన నా చరణాలను శరణు పొంది సకలబాధల నుండి విముక్తులు కండి" అనేదే శ్రీ స్వామివారిమతం.

శరణాగతివల్ల అహంకారమమకారాలు నశిస్తాయి. కామక్రోధాదులు దూరమౌతాయి. వినయవిధేయతలు దగ్గరవు తాయి. అన్ని అనర్థాలకూ కారణం అహంకారం, దాని తోబుట్టు వైన అవినయం. అందుకే ఆదిశంకరులు షట్పదీస్తోత్రంలో "అవినయ మపనయ విష్ణో!"–"స్వామీ! నా యందలి అవినయ గుణాన్ని తొలగించు" అని ప్రార్థించినాడు– శ్రీమన్నారాయణుని.

మదం అంటే గర్వం. ఇది 1) విద్యామదం, 2) ధన మదం, 3) కులమదం అని త్రిమదాలుగా కొందరు చెప్పారు. ఇంక కాస్త లోక స్వభావాన్ని గమనించి మరికొందరు ఎనిమిది విధాల మదా లుంటా యని పేర్కొన్నారు. 1) అన్నమదం 2) అర్థమదం 3) స్త్రీ మదం 4) విద్యామదం 5) కులమదం 6) రూపమదం 7) ఉద్యోగమదం 8) యౌవనమదం – వీటిలో ముందటి విద్యాధనకులమదత్రయమూ ఉన్నాయి. ఇవి కాక మరో అయిదు చేరాయి. వీటిలో ఏ ఒక్కటి ఉన్నా పతనం తప్పదు. ఇక ఎనిమిదీ ఉంటే చెప్పేపనేముంది? కనుక 'మద' భావం చాలా బలీయమైనది. భగవత్కృపవల్ల, భక్తిజ్ఞానవైరాగ్య సాధనవల్ల, సత్సాంగత్యంవల్ల – 'మదం' – గుణం కోల్పోయి, 'దమం'గా మార్తుంది. దమ మంటే బాహ్యేంద్రియనిగ్రహశక్తి.

అయ్యగారు ప్రారంభంలో 'మచ్చరాన్ని' మాత్రం పేర్కొని, చివరలో మదాన్నికూడా చేర్చి "మదమత్సర మను" అంటూ మాత్సర్యానికి మదాన్నీ చేర్చి, బహువచనం చేయక ఏకవచనంగా 'మదమత్సరం' అన్నాడు. మదమత్సరాలు రెండూ ఒక నాణేనికి బొమ్మ బొరుసులాంటివి. అవినాభావ సంబంధం కలవి. మత్సరం అంటే ఈర్ష్య,క్రోధమూ అని అర్థాలు. మదంలో మాత్సర్యం, మాత్సర్యంలో మదం అంతర్లీనమై ఉంటాయి. శబ్దాలూ, అర్థాలూ వేర్వేరుగా కన్పించినా – రెండూ ఏకరూపమే అని అయ్యగారి భావన. కనుకనే చివరి చరణంలో "మద మత్సరమను తెర తీయగరాదా" అన్నాడు. తెరకు రెండు వైపు లుంటాయి. ఒక వైపున మదం, మరో వైపున మత్సరం, నాల్గు అంచుల్లో కామక్రోధలోభమోహాలు అనే తక్కిన నాల్గూ ఉంటాయి. కనుక జీవునికి భగవద్దర్శన ప్రాప్తికి ప్రతిబంధకంగా తనలోని కామక్రోధలోభమోహమదమాత్సర్యా లనే అంతశ్శత్రు రూపమైన 'తెర' అడ్డంగా ఉంటుంది. ఈ అరిషడ్వర్గ మనే తెర తొలగితే – బాహ్యమైన వస్త్రపుతెర తొలగినా – తొలగకున్నా మనోనేత్రంతో భగవంతుణ్ణి దర్శింపవచ్చుననే గొప్ప ఆధ్యాత్మిక విశేషాన్ని ఈ కీర్తనలో అయ్యగారు వివరించారు.

అంతశ్శత్రువినాశకుడు అంతర్యామి అయిన వేంకట రమణుడే! అతడే రాముడు–రాముడే వేంకటరమణుడు. కనుక 'ఓ తిరుపతివేంకటరమణా! నాలోని మదమత్సర మనే తెరను తొలగించి, నీ దర్శనభాగ్యం కల్గించు"మని ప్రార్థించినాడు – త్యాగరాజు.

శరణాగతిశ్లోకాల తాత్పర్యాన్ని అయ్యగారు త్రికరణ శుద్ధిగా విశ్వసించినారు. వేంకటరమణుని ప్రపన్నార్తిహరత్వ గుణాన్ని గ్రహించి, తన యందలి దోషాన్ని తొలగించి, రక్షించ మని వేడుకొన్నాడు. ఏడుకొండలవాడు, తెరను తొలగించి, దివ్య దర్శనభాగ్యం కలిగించాడు. 'వేంకట' శబ్దాన్ని స్వామి సార్థకం చేసుకొన్నాడు. ఈ సన్నివేశం ద్వారా – శ్రీవారి దర్శనం, కృప, సంపూర్ణంగా లభించా లంటే, నిరహంకారం, నిర్మమత్వం, నిశ్చలభక్తి, ప్రపత్తీ కావా లనీ, అంతఃకరణశుద్ధి ఉంటేనే పారమార్థికసుఖశాంతులు సిద్ధిస్తా యనీ – గ్రహించాలి.

**అజ్ఞానినా మయా దోషాన్ అశేషాన్ విహితాన్ హరే!**
**క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైల శిఖామణే !!**

**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే**




## కొంగుబంగారం

**- కుమారి మన్నెముత్తుల మండోదరి**

**మా**దొక సన్నకారు రైతు కుటుంబం. మా బంధువులు హైదరాబాదులో ఉంటున్నారు. వాళ్ళిద్దరూ ఉద్యోగస్థులే. మా మామగారు ఓ పెద్ద ఫార్మసిలో సాంకేతిక నిపుణులు. అత్తయ్య ఓ కంపెనీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. వారి జీవనం సాఫీగా సాగుతున్న దశలో హఠాత్తుగా అత్తమ్మ కంపెనీలో ఒక సంక్షోభం తలెత్తి ఆమె ఉద్యోగంపోయే పరిస్థితి ఏర్పడింది. వారి పరిస్థితులు బాగున్న రోజుల్లో మా ఇంటిల్లిపాదీ హైదరాబాదు వెళ్ళి నెలల తరబడి గడిపేవాళ్లం. రాజధాని నగరసొగసుల్ని తనివి దీరా చూచే వాళ్ళం. కానీ ఇప్పటి అననుకూల పరిస్థితుల్లో వారి గురించి మేము చాలా ఆందోళనపడ్డాం.

ఇదే సమయంలో మా బామ్మ, మా అత్తమ్మకు ఒక సూచన చేసింది. ఆ మేరకు మా అత్తమ్మ కోనేటిరాయనికి ముడుపు కట్టి మొక్కుకుంది. మనసులోనే వడ్డీకాసులవాణ్ణి వేడుకుంది. అందరం ఆశ్చర్యం చెందేరీతిలో అత్తమ్మ ఉద్యోగం పోలేదు. ఆ సంస్థ పేరు మారింది. కానీ మా అత్తమ్మ ఎప్పటిలాగానే సాఫ్ట్‌వేరు ఉద్యోగిగా స్థిరపడింది.

ఈ చక్కని శుభ పరిణామంతో మా చుట్టాలందరిలో ఆనందం ఉప్పొంగింది. వెంటనే మా అత్తమ్మ కుటుంబ సమేతంగా కాలినడకన బయలు దేరి, తిరుమలలో శ్రీనివాసుని శీఘ్రదర్శనం చేసుకుని కట్టిన ముడుపు చెల్లించింది. దీంతో ఆ ఆలుమగలు ఏటా ఏడు కొండలపైకి నడిచి వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. కోరిన వారికి కొంగుబంగారం కదా! శ్రీవారు. మాకే కాదు మా స్నేహితులు, బంధువులు చాలా మందికి కూడా వేంకటేశ్వరస్వామిని మొక్కుకుంటే కానిపనే లేదని చాలా సార్లు ఋజువయ్యింది.

## ఆపదమొక్కులవాడు

**- సవరం చిననారాయణరావు**

**ఏ**డుకొండలవాడి దయ ఉంటే చాలు, ఎంతటి పని అయినా జరుగుతుంది. మాది దూసనపూడి గ్రామం. నేను ఇటీవల శ్రీనివాసుని దయవల్ల గృహ నిర్మాణం ప్రారంభించాను. అది స్లాబు వేసే వరకు వచ్చింది. తీరా స్లాబు వేయాలనే సరికి కుంభవర్షం ప్రారంభమైంది. ఎన్ని రోజులైనా వర్షం తగ్గనే లేదు. అయితే కమ్మి కట్టేశాము (సెంట్రింగ్ పని) కాబట్టి వెంటనే స్లాబు వేసేయాలి. కానీ వాన తగ్గనే లేదు. మేము ఏమీ పాలుపోని స్థితిలో ఆపదమొక్కులవాడిని స్మరించుకుని, ధైర్యం చేసి వర్షంలో స్లాబు వేయాలనే నిర్ణయించుకున్నాం. కానీ, తాపీమేస్త్రిని పిలిపిస్తే ఆయన స్లాబు వేయడం అంత మంచిది కాదు అని హెచ్చరించాడు.

మేము మాత్రం ఏది చేసినా ఏడుకొండల వాడి దయ అని అనుకుని మేస్త్రీకి పని పురమాయించాం. ఈ రాత్రి గడిస్తే ఉదయానికి స్లాబు పని మొదలుపెట్టవచ్చు. కానీ, ఆ రాత్రి అంతా వాన, మాకు కంటి మీద కునుకు లేదు. దేవుని ప్రార్థిస్తూనే ఉన్నాం. ఎవరో ఆజ్ఞాపించినంత గట్టిగా భగవంతుని సంకల్పమో ఏమో! తెల్లవారితే వర్షం ఛాయలు కూడా లేవు. ఒక మబ్బులేదు. ఆకాశం చాలా నిర్మలంగా ఉంది. సెంట్రింగ్ మీద స్లాబు వేయడం ప్రారంభించాం. శ్రీనివాసుడి దయ ఎలాంటిది అంటే మా స్లాబు పూర్తయ్యేదాక వర్షం రానేలేదు. అలా సంతృప్తికరంగా మా గృహనిర్మాణం పూర్తయింది. ఇక్కడ మరో తమాషా ఏమిటంటే మా స్లాబు పూర్తయిన మరుదినమే వర్షం ఎడతెరిపి లేకుండా మళ్లీ ప్రారంభమైంది. అందరు ఇల్లు కూలింగ్ బాగుంది అన్నారు. మేము మాత్రం అంతా ఏడుకొండలవాడి దయ అనుకున్నాం. మంచిరోజు చూసి గృహ ప్రవేశం చేశాం. శ్రీవారి కృపవల్ల హాయిగా ఉన్నాం.

# ధర్మోరక్షతి రక్షితః

**ధర్మాన్ని మనం రక్షిస్తే - ఆ ధర్మం మనల్ని రక్షిస్తుంది**

క్రింద పేర్కొన్న తి.తి.దే. గ్రంథాలు లభించే చిరునామా :
పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తి.తి.దేవస్థానం,
తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083.
ఇతర వివరాలకు : 0877 - 2264294

తిరుమల తిరుపతి దేవస్థానముల....

# పుస్తక పరిచయం

[ 9 ]



## తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథాలు

**1) తిరుమల-తిరుపతి క్షేత్రము - మాహాత్మ్యము**

రచయిత– జి.టి.సూరి
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 137;
మూల్యం: రూ.15/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.15/-)

ప్రపంచంలో ఏ దేవాలయానికి లేని ప్రాశస్త్యం తిరుమల తిరుపతి దేవస్థానానికి ఉందనేది అందరెరిగిన సత్యం. ఉన్నతమైన ఈ దేవాలయ ప్రశస్తిని బహుముఖంగా, సులభగ్రాహ్యంగా జనసామాన్యానికి కరతలామలకం చేయడానికి ఉపకరించే పుస్తకం ఇది.

అనేక పురాణాలు పరిశీలించి, స్వయంగా క్షేత్రతీర్థాటన గావించి జి.టి.సూరి ఈ గ్రంథాన్ని సులభశైలిలో రచించారు.

**2) శ్రీ వేంకటాచల మాహాత్మ్యము**

ఆంధ్రీకరణ– ఆకులమన్నాడు పండిత ఆర్.పార్థసారథి భట్టాచార్యులు
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 396;
మూల్యం: రూ.35/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.24/-)

శ్రీ వేంకటేశ్వరుని వంటి దైవము, తిరుమలను మించిన పుణ్యక్షేత్రము ప్రపంచంలో ఎక్కడా లేదని ప్రశస్తి. ఇంత ప్రసిద్ధి పొందిన పుణ్యక్షేత్రాన్ని వేదవ్యాసుడు అనేక పురాణాల్లో వివరించాడు.

ఇలా వర్ణింపబడిన పురాణాల్లో ఆదిత్య, బ్రహ్మ, బ్రహ్మాండ, పద్మ పురాణాలు చెప్పుకోదగ్గవి. వీటిల్లోని శ్రీనివాసుని దివ్యగాథను శ్రీ పార్థసారథి భట్టాచార్యగారు ఆంధ్రతాత్పర్య సహితంగా అందించగా దీనిని 1962లో దేవస్థానం ప్రచురించింది. మళ్ళీ ఇంతకాలానికి పునఃముద్రణగా మనముందుకు వచ్చింది.

**3) రామచరిత మానస్**

(తులసీరామాయణం)
అనువాదం– ముంగర శంకరరాజు
సైజు: 1/8 డెమ్మీ;
పుటలు: 480;
మూల్యం: రూ.40/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.27/-)

రామాయణాన్ని ఆనాటి ఆదికవి వాల్మీకి మొదలు అనేక భాషల్లో అనేక కాలాల్లో అనేక మంది రకరకాల ప్రక్రియల్లో రచించారు. ఇంకా రచియింపబడవచ్చును కూడా.

మనదేశంలోని వివిధ ప్రాంతీయభాషల్లో వెలసిన రామాయణాల్లో అగ్రగణ్యమైనది గోస్వామి తులసీదాసు రచించిన "రామచరిత మానస్". ఉత్తరభారతదేశంలో ఈ గ్రంథానికి ఉన్నంత ప్రాచుర్యం మరే గ్రంథానికి లేదనడం అతిశయోక్తి కాదు. ఇంతటి ప్రశస్త రచనను సులభశైలిలో సరళంగా ముంగర శంకరరాజు అందించాడు. ఈ గ్రంథాన్ని మొదట 1999లో, ఆ తరువాత 2003లో దేవస్థానం ముద్రించింది. ఇప్పుడు పునః ముద్రణ వచ్చింది.

**ఈ గ్రంథాలను పోస్టుద్వారా పొందదలచిన వారు 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారి పేరున డి.డి.ని తీసి పై చిరునామాకు పంపాలి.**

గ్రంథసమీక్ష

## శ్రీ తిరుమలేశ శతకము

**రచయిత** – డా॥ జనువాడ రామస్వామి; **పుటలు–56**; **వెల**–రూ. 30/–; **ప్రతులకు:** డా॥ జనువాడ రామస్వామి, సి.ఎస్.ఆర్.ఎస్టేట్స్, ఫ్లాట్ నెం.–309, ప్లాట్ నెం.42, హుడ కాంప్లెక్స్, సరూర్ నగర్, హైదరాబాదు.

శతకానికి మకుటమే సొబగు. శతక పద్యానికి అది కిరీటమై భాసిస్తుంది. సమాజంలో భక్తిని, రక్తిని, ముక్తిని ప్రచారం చేయడంలో శతకాలు చురుకైన పాత్రను పోషించాయి. అటు పండితులను, ఇటు పామరులను ఆకట్టుకున్న శతక ప్రక్రియ ప్రశాంత మానవ మనుగడకు దోహద పడే జ్ఞానభిక్షను పెడుతూనే ఉంది. శతకంలోని వంద పద్యాలు వేటికవి స్వతంత్రాలు కాబట్టి శతకానికి “ముక్తకం” అనే పేరు కూడా ఉంది. శతకాలలో ద్విశతులు, త్రిశతులు కూడా ఉన్నాయి.

డా॥ జనువాడ రామస్వామి “శ్రీ తిరుమలేశ శతకము”ను 111 సీసపద్యాలలో రచించారు. సుగుణ సంపత్తిని, దైవవిశ్వాసాన్ని, ధర్మరక్షణను, అరిషడ్వర్గ విజయాన్ని, త్యాగనిరతిని, ముక్తి మార్గాన్ని– ఇలా వివిధ అంశాలను వీరు ఈ సీసాలలో నిబద్ధించారు. “దివ్య కేళీ విలాస! శ్రీ తిరుమలేశ!” అన్న మకుటంతో వీరి శతకం కొనసాగింది. జనరంజకమైన సూక్తులను కూడా వీరు తమ రచనలో పొందుపరచారు. “కండ్లతో కన్నది కాదు నిజము” “చింతలన్నియు బాపు చిత్తశుద్ధి” “కోటి యిచ్చిన ప్రాణమున్ కొనుగగలమే” “మంచిజేసిన నీ వెంట మమత యుండు” – లాంటి రసవత్తర వాక్యాలను తమ పద్యాలలో హృద్యంగా నిక్షిప్తీకరించారు.

వీరి శతకపద్యాలు సరళమైన భాషలో, జీవనసత్యాల్ని ఆవిష్కరిస్తూ, తిరుమలేశుని శరణాగతిని ప్రకటిస్తూ పఠితలను ఆకట్టుకుంటాయి. శ్రీ వేంకటేశ్వరుని ముఖచిత్రంతో ముద్రింపబడిన ఈ చిరుపొత్తం, డా॥జనువాడరామస్వామి గారి ఇతర కృతుల రచనా నైపుణ్యానికి ప్రతిబింబంలా కన్పిస్తోంది. ఆచార్య ఎల్లూరిశివారెడ్డి, డా॥ సి.నారాయణ రెడ్డి, ఆచార్య కసిరెడ్డి, కూరెళ్ల, విఠలాచార్యులవారి ముందు మాటలు ఈ శతక విశేషాలను విశదీకరిస్తున్నాయి.

**– డా॥ కలువగుంట రామమూర్తి**

## పూర్వగాథాలహరి

**రచయిత** – ఎస్వీఎన్; **పుటలు**– 642; **వెల**–రూ. 250/–; **ప్రతులకు:** విక్టరీ పబ్లిషర్స్, ఇ.నెం. 11–16–32(ఎ), కొత్తపేట, విజయవాడ–1, ఫోన్: 6663733. మరియు ఇ.నెం. 29–28–40, దాసరివారి వీథి, సూర్యారావుపేట, విజయవాడ–520 002. ఫోన్:6613734.

తెలుగు భాష, సాహిత్యాలను అవగాహన చేసుకోవడానికి నిఘంటువుల సహాయం ఎంతో అవసరం. నాటి నన్నయ నుండి నేటివరకు తెలుగు సాహిత్యంలో వివిధ ప్రక్రియల్లో రచనలు వెలువడ్డాయి. వేదాది గ్రంథాలను తెలుగులోకి మన కవులు అనువదించారు. అందులోని పురాణపురుషులు, ఇతివృత్తాలు తెలుసుకోవడానికి నిఘంటువుల అవసరం చాలా ఉంది. అట్టి అవసరాన్ని ‘పూర్వగాథాలహరి’ తీరుస్తుందని భావించవచ్చు.

అకారాది క్రమంలో పౌరాణిక వ్యక్తుల వివరాలను సమగ్రంగా పూర్వగాథాలహరి వివరిస్తున్నది. వివిధ గ్రంథాల్లో వివిధరకాలుగా వర్ణించిన విషయాలను ఒకే చోట గుదిగుచ్చినట్లుగా చెప్పడం ఈ గ్రంథం ప్రత్యేకత. మహావిష్ణువు, అంగిరసుడు, అత్రి పురూరవుడు, యదువు, పులస్త్యుడు, పులహుడు, కర్దముడు, స్థాణుడు, దక్షుడు, మరీచి, భృగువు, ఇక్ష్వాకుడు, వశిష్ఠుడు మొదలగువారి వంశవృక్షాలను పట్టిక రూపంలో ఇచ్చారు. ఇవి పాఠకులలో విషయ పరిజ్ఞానాన్ని, అవగాహనను పెంపొందించుటకు విశేషంగా తోడ్పడతాయి. పుస్తకమంతా సరళమైన భాషలో నడిచింది. ముఖ్యంగా ఈ పుస్తకాన్ని పిల్లలు చదవాలి. వారిచేత తల్లిదండ్రులు చదివించాలి. ‘మొక్కై వంగనిది మానై వంగునా’ అన్నట్లు పిల్లలలో బాల్యం నుంచే భక్తిబీజాలు నాటితే వారు నైతిక విలువలతో మంచి పౌరులుగా తీర్చిదిద్దబడతారు. అందుకు ఈ పుస్తకం ఎంతో దోహదం చేస్తుంది. ఈ గ్రంథాన్ని దళసరి కాగితంపై, మంచి బైండింగుతో ఆకర్షణీయంగా ముద్రించారు. వాసిలోను, రాశిలోను, నాణ్యతలోనూ రాజీపడకుండా విక్టరి పబ్లిషర్స్ వారు అందించిన మంచి పుస్తకమిది. ప్రతి తెలుగు వారింట తప్పక ఉండాల్సిన గ్రంథమిది.

**– డి. మల్లీశ్వరి**

## శ్రీపదకేళి - 08 (జనవరి-2010)
## విజేతలు

**1) బందా శ్రీనివాసరావు,**
ఇంటి నెం.08-03-04,
కొండయ్య బంకు వీథి,
కొత్తపేట,
ఒంగోలు - 523 002.

**2) వల్లభజోస్యుల జలజ,**
ఇంటి నెం.2-14-436,
1వ లైను,
శ్యామలా నగర్,
గుంటూరు - 522 006.

**3) జె. సావిత్రీ శర్మ,**
**W/o** ఎ.పి.యన్.శర్మ,
ఇంటి నెం.2-180,
2వ రోడ్డు,
జెడ్ క్రాస్,
అనంతపురం - 515 004.

**సరైన సమాధానాలు రాసినవారు :**

పి.పంకజా ఆనంద్ (చిత్తూరు); యం.మునిరత్నం (రాజ గోపాలపురం); ఏ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); సి.శిరీష (హైదరాబాదు); తిరునగరి కేశవదాసు (గుంటూరు);టి.ఆర్. బాలకృష్ణరావు(రాజమండ్రి);గందూరి బలరామశాస్త్రి (నాచారం); ముక్కామల సుశీల(ఒంగోలు); యస్.వి.యస్.భగవానులు (ఒంగోలు); కె.శివనాగేంద్రమ్మ (ఒంగోలు); వై.వి.రమణరావు (మచిలీపట్నం); అక్షింతల సంజీవశర్మ(అనంతపురం); వై.నాగే శ్వరయ్య(నెల్లూరు); బి.రోశిముని(తిరుపతి); ఎ.భాస్కర్ (కడప); అత్తి కౌషల్‌కుమార్ (చెన్నై); జూపల్లి శేఖర్ (పీలేరు); ఎం.చంద్ర శేఖర్ (గుంతకల్లు); జి.ప్రదీప్ (శ్రీకాళహస్తి); సి.హెచ్.రమేశ్ (నెల్లూరు); బి.రామాంజనేయులు (రాజంపేట); ఎల్.విజయ కృష్ణారెడ్డి(కడప); ఎం.మల్లీశ్వరి (సదుం); జి.గీత(గుంటూరు); శ్రీనివాసన్ (కోలార్); ఎం.ప్రకాశ్(మహబూబ్‌నగర్)



**నిబంధనలు :**

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్త రించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీ కరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందా దారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొన వచ్చు.

**బహుమతి వివరాలు :**

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అంద జేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపు తాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

**పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :**

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి



# శ్రీపదకేళి - 10

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స, కంకిపాడు**

1) పూరించిన వారి పూర్తి చిరునామా :

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

2) మీరు సప్తగిరి చందాదారులైతే?

అ) చందా నంబరు : ..................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..................................

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

## ఆధారాలు

**అడ్డం**

2) గరుత్మంతుని తల్లి (3)

5) ఇది మూలమిదం జగత్ (2)

6) పొట్ట (3)

7) రసమే. వ్యవహారంలో ఇలా అంటాం (2)

10) రాణి భర్త (2)

11) పూర్వఫల్గుణి నక్షత్రాన్ని ఇలా కూడా అంటాం (2)

14) స్వర్గం (2)

15) విష్ణువుని నక్షత్రం. ఈ నక్షత్రం పేరుతోనే శ్రావణమాసం ఏర్పడింది (3)

17) లోభత్వం కల్గినవాడు (2)

18) పెదవి (3)

**నిలువు**

1) వశిష్ఠుని భార్య (4)

3) తూర్పుదిక్కున పుట్టి పడమటి సముద్రంలో కలసిన నది(3)

4) సూర్యుని రథసారథి (4)

8) దశరథుని తండ్రి (3)

9) జనమేజయుని భార్య, కాశీరాజు కూతురు (3)

12) వరుణుని భార్య (4)

13) నాభి నుండి పుట్టినవాడు (4)

16) వసువులు కల్గినది భూమి (3)

### శ్రీపదకేళి–08 (జనవరి, 2010) సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | త్రి | | 2 య | 3 క్షు | లు | | 4 కై | 5 క |
| భి | | | | తు | | | | శ్య |
| 6 మ | తి | | | డు | | | 7 రి | పు |
| న్యు | | | 8 అ | | 9 అ | | | డు |
| | 10 కా | ర్త | వీ | ర్యా | ర్జు | ను | డు | |
| 11 లీ | | | ర | | న | | | 12 కా |
| 13 లా | వు | | | 14 నీ | | | 15 లీ | ల |
| వ | | | | లా | | | | నే |
| 16 తి | రు | | 17 న | లు | డు | | 18 కా | మి |

# మార్చి, 2010
# రాశి ఫలాలు

- జె. చంద్రశేఖరశర్మ



## మేషం

ఆదాయం : 08 రాజపూజ్యం : 04
వ్యయం : 14 అవమానం : 03

గురువు ఏప్రిల్ 21 వరకు 11వ ఇంట, తదుపరి 12లో శని, రాహువు 9వ స్థానంలో, కేతువు 3వ స్థానంలో సంచరించటం వల్ల ఈ సంవత్సరం అన్ని రంగాల్లో అభివృద్ధి జరుగుతుంది. ఈ మాసంలో సుదీర్ఘకాలంగా వాయిదాలో ఉన్న పలు కోర్టు కేసులు, క్రయవిక్రయాలు అనుకూలిస్తాయి. ఇంట్లోని ఒకరి ఆరోగ్యం క్షీణించటం వల్ల ధనవ్యయం అవుతుంది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ధనవ్యయం, మూడో వారం సన్మానం, నాలుగోవారం పని ఒత్తిడి.



## వృషభం

ఆదాయం : 02 రాజపూజ్యం : 07
వ్యయం : 08 అవమానం : 03

గురువు ఏప్రిల్ 21 వరకు 10వ స్థానం శని, రాహువు 8వ స్థానం, కేతువు 2వ స్థానంలో సంచరించటం వల్ల వృత్తి ప్రవృత్తులలో బాగా రాణిస్తారు. ఈ సంవత్సరంలో గురు–శని గ్రహాల సంపూర్ణ అనుగ్రహం వల్ల రాజయోగం, విదేశీప్రయాణం, తదితర శుభపరిణామాలు ఏర్పడుతాయి. మొదటివారం ఆలయ దర్శనం, రెండోవారం ఆనందం, మూడో వారం వృథా ఖర్చు, నాలుగోవారం సన్మానసత్కారాలు.



## మిథునం

ఆదాయం : 05 రాజపూజ్యం : 03
వ్యయం : 05 అవమానం : 06

ఏప్రిల్ 21 వరకు 9వ స్థానంలో గురువు, శని ఈ ఏడాదంతా అర్ధాష్టంలో, రాహువు 7వ స్థానంలో కేతువు జన్మ మందు సంచరిస్తున్నారు. అర్ధాష్టమ శని ఉన్నా; గురువు 9వ స్థానంలో సంచరించటంవల్ల కార్యజయం, ఆరోగ్యలాభాలు కల్గును. ఈ నెలలో వీరికి ప్రతిపనికి ఆటంకాలు ఎదురై తీవ్ర మనస్తాపానికి గురౌతారు. ఆర్థిక, ఆరోగ్యవిషయాలు ఆందోళనకు గురిచేస్తాయి. మొదటివారం ఆందోళన, రెండోవారం భయం, మూడోవారం కార్యజయం, నాలుగోవారం మనస్తాపం.



## కర్కాటకం

ఆదాయం : 14 రాజపూజ్యం : 06
వ్యయం : 02 అవమానం : 06

ఏప్రిల్ 21 వరకు గురువు, 8వస్థానం శని ఈ సంవత్సరమంతా 3వ స్థానం, రాహువు 6వ స్థానం, కేతువు 12వ స్థానంలో సంచరించటం వల్ల ఈ సంవత్సరమంతా అన్ని విధాల మంచియోగం. ప్రతి పనిలోనూ మంచి గుర్తింపు లభిస్తుంది. గత 11 సంవత్సరాల నుండి పడుతున్న బాధలు నివృత్తి అవుతాయి. మొదటివారం పనిఒత్తిడి, రెండోవారం విమర్శలు, మూడోవారం విరోధం, నాలుగోవారం ధనప్రాప్తి.



## సింహం

ఆదాయం : 02 రాజపూజ్యం : 02
వ్యయం : 14 అవమానం : 02

గురువు ఏప్రిల్ 21 వరకు, 7వస్థానం శని ప్రభావం 2వ ఇంట ఈ సంవత్సరమంతా రాహువు 5వ స్థానం, కేతువు 11వ స్థానంలో సంచరించటం వల్ల మిశ్రమఫలాలు ఉంటాయి. ఈ సంవత్సరం ఏలినాటి శని ప్రభావం వల్ల కుటుంబ సమస్యలు, భార్యాభర్తల మధ్య విరోధం తదితర ఫలితాలు కల్గుతాయి. వీలైనంత వరకు మౌనంగా ఉంటే మంచిది. మొదటి వారం కార్యప్రయత్న ఫలం, రెండోవారం వృథాశ్రమ, మూడో వారం ఆటంకాలు, నాలుగోవారం క్షేత్రదర్శనం.



## కన్య

ఆదాయం : 05 రాజపూజ్యం : 05
వ్యయం : 05 అవమానం : 02

ఏప్రిల్ 21 వరకు గురువు 6వ స్థానం తదుపరి 7వ స్థానంలో సంచారం, శని ఈ సంవత్సరమంతా జన్మనక్షత్రం అనగా ఏప్రిల్ 2, 2011 వరకు రాహువు అర్ధాష్టంలో, కేతువు 10వ స్థానం, ఈ సంవత్సరం ఏలినాటి శని ప్రభావం అధికంగా ఉంటుంది. కనుక భార్యాభర్తల వైరం, అధిక శారీరక శ్రమ, అవమానాలు తదితరఫలితాలు ఏర్పడుతాయి. ఈ నెలలో వీరికి బంధుమిత్రుల కలయిక మానసికానందాన్ని ఇస్తుంది. ప్రతిపనికి అధికంగా శ్రమపడాల్సి వస్తుంది. మొదటివారం పట్టుదల, రెండోవారం ఆనందం, మూడోవారం వైరం, నాలుగో వారం అవమానం.



## తుల

ఆదాయం : 02 రాజపూజ్యం : 01
వ్యయం : 08 అవమానం : 05

ఏప్రిల్ 21 వరకు 5వస్థానంలో గురువు, శని ఈ సంవత్సరం అంతా 12వ స్థానంలో, రాహువు 3, కేతువు 9వ స్థానంలో సంచరిస్తున్నారు. ఈ సంవత్సరం ఏలినాటి శని

ప్రభావం వల్ల వృత్తి ఉద్యోగాలు, జీవనం అస్తవ్యస్తంగా మారు తుంది. ఈ మాసంలో అనుకోని విమర్శలు, ఉద్యోగంలో కష్ట నష్టాలు కల్గుతాయి. నమ్మిన వ్యక్తుల మోసంవల్ల ఉద్యోగంలో చిక్కులు అధికమై ఇబ్బందులకు గురి చేస్తాయి. మొదటివారం ఉద్యోగబాధలు, రెండోవారం వృథాఖర్చు, మూడోవారం ప్రమాదం, నాలుగోవారం అపనిందలు.



## వృశ్చికం

**ఆదాయం : 08 రాజపూజ్యం : 04**
**వ్యయం : 14 అవమానం : 05**

గురువు ఏప్రిల్ 21 వరకు అర్ధాష్టమ స్థానంలో శని 11వ స్థానం రాహువు 2, కేతువు 8వ స్థానంలో సంచరించటం వల్ల ఈ సంవత్సరం యోగదాయకంగా ఉంటుంది. స్థిరాస్థి, గృహంలో శుభకార్యాలు; వాహన సౌఖ్యం తదితర ఫలితాలు ఏర్పడుతాయి. ఈ మాసంలో వీరనుకున్న ప్రతిపనిలో విజయం. విదేశీయాన ప్రయత్నాలు, శుభవార్త శ్రవణాలు ఏర్పడుతాయి. మొదటివారం ప్రయత్నజయం, రెండోవారం శుభవార్త శ్రవణం, మూడోవారం విదేశీయానం, నాలుగోవారం పదవీయోగం.



## ధనుస్సు

**ఆదాయం : 11 రాజపూజ్యం : 07**
**వ్యయం : 05 అవమానం : 05**

ఏప్రిల్ 21 వరకు గురువు 3వ స్థానం తదుపరి అర్ధాష్టమం శని 10వ స్థానం, రాహువు జన్మనక్షత్రంన, కేతువు 7వ స్థానంలో సంచరించును. ఈ సంవత్సరం అన్ని రంగాల్లో యోగ కారకంగా ఉంటుంది. స్థిరనివాసం, స్వగృహప్రాప్తి తదితర శుభాలు జరుగును. ఈ మాసంలో ఈ రాశివారికి ఇంటా బయట పలు శారీరక, మానసిక సమస్యలు ఇబ్బంది పెడతాయి. ప్రతి చిన్నవిషయాన్ని పెద్దగా ఊహించుకోవటం, తీర్థయాత్రలు, భూమి, స్థిరాస్థులు, వెండి, బంగారు వస్తువుల క్రయవిక్రయాలు అనుకూలం. మొదటివారం సమస్యలు, రెండో వారం అనారోగ్యం, మూడోవారం క్రయవిక్రయాలు, నాలుగో వారం క్షేత్రదర్శనాలు.



## మకరం

**ఆదాయం : 14 రాజపూజ్యం : 03**
**వ్యయం : 14 అవమానం : 01**

గురువు ఏప్రిల్ నెల చివరి వరకు 2వ స్థానం, శని అర్ధాష్టమ రాహువు 12, కేతువు 6 స్థానంలో సంచరించటం వల్ల పనుల్లో ఆటంకాలు ఏర్పడినా విజయవంతమౌతాయి. బంధుమిత్రుల కలయిక, సంతానసౌఖ్యం, శత్రువులపై విజయం, నూతన పరిచయాలు ఏర్పడుతాయి. ఈ మాసంలో అనారోగ్యం వల్ల ఆర్థికభారం పడుతుంది. సమయానికి డబ్బులేక అను కున్న పనులుకాక ఆందోళన పడతారు. మొదటివారం అనా రోగ్యం, రెండోవారం ఒత్తిడి, మూడోవారం ధనప్రాప్తి, నాలుగో వారం దైవదర్శనం.



## కుంభం

**ఆదాయం : 14 రాజపూజ్యం : 06**
**వ్యయం : 14 అవమానం : 01**

గురువు జన్మ నక్షత్రమందు తదుపరి 2వ స్థానంలో, శని ఈ ఏడాది అర్ధాష్టమం రాహువు 11వస్థానం, కేతువు 5వ స్థానంలో సంచరిస్తున్నారు. ఈ ఏడాది అష్టమశని వల్ల చాలా కష్టనష్టాలు జరుగుతాయి. వృథాధనం, రహస్య జీవనం, వాహన ప్రమాదం తదితర ఫలితాలు కల్గును. ఈ మాసంలో అతికోపం, అతి ఆలోచనలు, అతిగా ధనవ్యయం కల్గటం వల్ల మానసి కాందోళనలు ఏర్పడుతాయి. చిట్స్, వృత్తి, వ్యాపారాల్లో నమ్మిన వ్యక్తులే మోసం చేస్తారు. అగ్ని, శత్రు భయం అధికం. పలు సమస్యల నివారణకు శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనం మంచిది. మొదటివారం వృథాశ్రమ, రెండోవారం చిరాకు, మూడోవారం శత్రుభయం, నాలుగోవారం ధార్మిక కార్యక్రమాలు.



## మీనం

**ఆదాయం : 11 రాజపూజ్యం : 02**
**వ్యయం : 05 అవమానం : 04**

ఏప్రిల్ చివరివారం వరకు గురువు 12వ స్థానంలో శని 7వ స్థానం రాహువు 10, కేతువు అర్ధాష్టంలో సంచరించ టం వల్ల ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు కల్గుతాయి. స్వల్ప వివాదాలు, నూతన వస్తుప్రాప్తి, వాహన సౌఖ్యం, శత్రు మూల కంగా చిక్కులు తదితర ఫలితాలు ఏర్పడుతాయి. ఈ మాసంలో బంధుమిత్రుల వల్ల, సంతానం వల్ల పలు చిక్కులు ఎదుర్కోవలసి వస్తుంది. చేతిలో డబ్బులేక పోవటం వల్ల మానసిక ఒత్తిడులకు గురి కావాల్సి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో ఆటంకాలు ఏర్పడు తాయి. దీర్ఘకాలికంగా వాయిదాలో ఉన్న కోర్టు కేసులు, రుణ బాధలు అసంపూర్తిగా నిలిచిపోతాయి. ప్రతివిషయానికి చిరాకు పడాల్సి వస్తుంది. కుటుంబంలో సఖ్యత కోల్పోతారు. మొదటి వారం వృథాఖర్చులు, రెండోవారం వ్యవహార జయం, మూడో వారం సఖ్యత లేకపోవటం, నాలుగోవారం ఆనందం.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# సామవై శాసనాలు

## శాసన వివరణ - 5

**ప్రదేశం** : ఆంధ్రప్రదేశ్, చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, తిరుమల ఆలయం. ప్రథమ ప్రదక్షిణా పథం. ఉత్తర దిశాభిత్తి - విమాన వేంకటేశ్వరుల క్రింద మధ్యభాగంలో - ఆరుసాలు.

**వంశం** : పల్లవ **రాజు** : పార్థివేంద్రవర్మన్

**కాలం** : 14వ పరిపాలనా సంవత్సరం

**భాష** : తమిళం

**విషయం** : పార్థివేంద్రవర్మ పరిపాలనలోని 14 సంవత్సరం, శక్తి విటంక అనేకాడవుని పెరుందేవి (మహారాణి) అయిన సామవై (ఈమె పల్లవ పెర్గడైయార్ కూతురు) తిరుమలలోని ఇళంకోయిల్‌లో స్థాపన చేసిన రజతమూర్తి మణవాళపెరుమాళ్‌కు బహువిధమైన ఆభరణాలను సమర్పిస్తూ, 3000 కుళి భూమిని ఇతరుల నుండి కొని, దేవుడికి దానమిస్తూ, స్వామికి ఆయన సంక్రాంతి, విష్ణు సంక్రాంతులలో అభిషేకం మరియు పురట్టాసి నెలలో-తొమ్మిది రోజుల ఉత్సవాల నిర్వహణ చేయవలెననీ, నిత్యదీప నైవేద్యాలను జరపాలనీ కట్టడి చేసింది. ఈ శాసనాన్ని వ్రాసినవాడు సొత్తాందై.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-I, సంఖ్య-8.

## శాసన వివరణ - 6

**ప్రదేశం** : ఆంధ్రప్రదేశ్, చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, తిరుమల ఆలయం. ప్రథమ ప్రదక్షిణా పథం. ఉత్తర దిశాభిత్తి - విమాన వేంకటేశ్వరుల క్రింద మధ్యభాగంలో-నాలుగు సాలు.

**వంశం** : పల్లవ **రాజు** : పార్థివేంద్రవర్మన్

**కాలం** : 14వ పరిపాలనా సంవత్సరం

**భాష** : తమిళం

**విషయం** : కాడవుని పెరుందేవి సామవై మార్గళి మాసంలో తిరుద్వాదశి ఏడురోజుల ఉత్సవాల్ని ఏర్పరచి, దాని కోసం 4815 కుళి వ్యవసాయ భూమిని వేరు వేరు స్థలాలలో కొని సర్వబాధా పరిహారం చేసి ఇచ్చినది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-I, సంఖ్య-9.



# తిరుమల ఆలయం

ఆంగ్లమూలం : డా॥ రమేశన్ తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ

**ధారావాహికం - 86**

**(తిరుపతి క్షేత్ర కార్యనిర్వహణ పల్లవ, చోళ, పాండ్యరాజులకాలంలో ఎలా ఉండేదో తెలిపిన తరువాత ఈ సంచికలో యాదవరాయరుల, తెలుగు పల్లవుల కాలంలో ఎలా జరిగిందో వివరించడం జరుగుతున్నది.)**

**భూ**మినిగానీ, గ్రామాన్నిగానీ దేవాలయానికి దానం చేసే విషయంలో అవలంబించే పద్ధతిని గురించి సంఖ్య 165-టి.టి. శాసనం తెలుపుతోంది. దేవాలయ స్థానత్తారు కొంత భూమిని(బహుశః ఇది **అగరపట్టు** లోనిదై ఉంటుంది) దానంగా ఇవ్వమని ప్రార్థిస్తూ రాజుగారికి అర్జీ దఖలు చేశాడు. ఆ అర్జీని కుడవూర్‌నాడు మరియు తొండప్పడి పట్టులయొక్క **నాడవర్** విచారణ చేశారు. తదుపరి ఈ వినతిని పరిశీలించిన వారియం వినాట్టాన్ (ప్రాంతీయాధికారి) తన సమ్మతిని తెలియబరుస్తూ, సంతకం చేసి రాజుగారి సముఖానికి పంపించాడు. రాజు ఆ అర్జీదారుని విన్నపాన్ని మన్నించి తన అంగీకారాన్ని నోటిమాటగా తెలియజేశాడు. నోటిమాటగా తెలియజేసిన రాజాజ్ఞను యాదవ రాయలచే అధికారులకు తెలియజేయబడింది. చోళుల పరిపాలనాకాలంలో, అందునా మూడవ రాజరాజు పరిపాలనలో అవలంబించిన సక్రమ ప్రభుత్వ విధానాన్ని ఇది విశదీకరిస్తుంది.

**1) కాడవ రాయరులు :** సంఖ్య 226 మరియు 227 టి.టి. శాసనాలు కాడవ కొప్పెరుం జింగను సర్వజ్ఞ ఖడ్గమల్ల అని పేర్కొంటున్నాయి.

**2) యాదవరాయరులు :** సంఖ్య 170-టి.టి. శాసనంలో తిరుకాళత్తిదేవ యాదవరాయ ప్రస్తావన ఉంది. ఇందులో ఇతనికి గల వివిధ బిరుదాలు ప్రస్తావించబడ్డాయి. ఈ శాసనం ఈయన పరిపాలన కాలంలోని 19వ సంవత్సరాన ప్రకటించబడింది.



తిరుకాళత్తిదేవుని కుమారుడైన సింగనప్పిళ్ళై అని మరొక పేరున్న వీరరాక్షస యాదవరాయలు, తాను దానం చేసిన తిరుక్కుడవూర్‌నాడులోని సుక్షేత్రంనుండి లభించే ఫలసాయాన్ని వినియోగించి శ్రీనివాసునికి ఒక తిరుమంతిర తిరుబ్బోనకం సమర్పించడానికి తగు ఏర్పాటు (శాసనం సంఖ్య 293-టి.టి. మరియు 362-టి.టి.) గావించాడు.

ఇతని తరువాత వచ్చినవారు వీరనరసింగదేవ యాదవ రాయలు. ఇతనికి సంబంధించిన కొన్ని శాసనాలు, తన పరిపాలనలోని 12వ సంవత్సరం మొదలుకుని 51వ సంవత్సరం వచ్చేవరకుగల మధ్యకాలంలో ప్రకటించబడినవి. ఈయన్ను గురించిన ప్రస్తావన గల అత్యంత వెనుకటి శాసనం సంఖ్య 120 of 1922 సం॥. మూడవ కులోత్తుంగుని పరిపాలనా కాలంలో 31వ సం॥లో ప్రకటించబడింది. మరియు ఈయన ప్రస్తావన గల అత్యంత ఇటీవలి కాలానికి చెందిన శాసనం సంఖ్య164-టి.టి.మొదటి జటావర్మ సుందరపాండ్య (క్రీ.శ. 1262సం॥)ని యొక్క పరిపాలనాకాలం 12వ సం॥నకు చెందిందిగా ఉంది. కనుక, వీరనరసింగయాదవరాయలు

కనీసం 54 సంవత్సరాలు రాజ్యాన్ని పాలించి ఉంటాడనుట సమంజసం. కాబట్టి సంఖ్య 125-జి.టి. శాసనంలో ఇవ్వబడిన పరిపాలనా సంవత్సరం 51 అని నిర్ధారణ అవుతోంది.

ఈయన కూడ తులారోహణ కార్యాన్ని నెరవేర్చి యుండెనని తెలుస్తోంది. అంటే తనను బంగారంతో తూచగా ఆ వచ్చిన దానితో ఆనందనిలయ విమానానికి ఇతర నిర్మాణాలకు బంగారుపూత పూయించేందుకు శ్రీ వేంకటేశ్వర దేవాలయానికి సమర్పించాడు. ఇందువల్ల వేంకటనగం ధవళ కాంతులీనుతూ మేరునగ సదృశమై ప్రకాశించింది. వీరనరసింహదేవ యాదవరాయల కైంకర్యంగా విమానానికి బంగారుపూత పూసే కార్యక్రమం, మొదటి జటావర్మ సుందరపాండ్యుని కైంకర్యంగా విమానం శిఖరాగ్రంలో కనక కలశ స్థాపన-రెండు కార్యక్రమాలు ఏకకాలంలోనే జరిగి ఉండినట్లు (శాసనం సంఖ్య 172-టి.టి.) తెలుస్తోంది. మరొక వీరనరసింగ పెరుమాళ్ (వీర నరసింహ స్వామి)విగ్రహాన్ని తిరుపతిలో ఒకచోట ప్రతిష్ఠించాడనే విషయం శాసనం సంఖ్య 195-టి.టి. తెలుపుతోంది. బహుశః వీరనరసింహదేవరాయరాయలే స్వయంగా ఈ విగ్రహ ప్రతిష్ఠాపనకు ప్రోత్సహించి ఉంటాడు. ఈయన (వీరనరసింగ దేవ మహారాయలు) అనుమతితోనే యాదవరాయల పరిపాలనాకాలం నందలి 40వ సంవత్సరాన ఒకానొక దేశాంతరి అయిన తిరుప్పుళ్ళాణిదాసర్‌చే తిరుమలలో శ్రీ వేంకటేశ్వర దేవాలయంలో గర్భగుడి జీర్ణోద్ధారణ కైంకర్యం జరుపబడింది. మరమ్మతులు పూర్తి అయిన తర్వాత మూల గర్భగృహం గోడలమీద ఏయే తావుల్లో ఏయే శాసనాలు ఉండినవో, ఆయా తావుల్లో వాటిని తిరిగి చెక్కి పునరుద్ధరించాల్సిందిగా రాజు ఆజ్ఞాపించాడు. వీరనరసింగ దేవరాయరాయలు ఆనాడు చేసిన ఆజ్ఞ ఫలితంగా ఈనాడు మనకు గర్భగుడి ఉత్తరగోడమీది పశ్చిమమూలలో తిరిగి చెక్కినట్టి శాసన సంఖ్య 17, 18, 19 మరియు 20-టి.టి నాలుగు చోళ శాసనాలు లభించాయి. ఈ దేశాంతరి బహుశః చేరవన్ మహాదేవి చతుర్వేదిమంగళం లేక శెర్మాదేవి అనే ప్రదేశానికి చెందిన తిరుప్పుళ్ళానిదాసర్ అనే వ్యక్తితో అభిన్నుడై ఉంటాడు. శ్రీ వేంకటేశ్వర దేవాలయంలో గర్భగృహం పునరుద్ధారణ కైంకర్యం వీరనరసింహయాదవరాయల 40వ పరిపాలనా కాలానికి సరియైన క్రీ.శ.1245 సంవత్సర కాలంలో జరిగింది.

| **శ్రీ వేంకటేశ్వరస్వామివారి వసంతోత్సవాలు, తిరుమల** | | | |
|---|---|---|---|
| **27-3-10**<br>**28-3-10**<br>**29-3-10** | శని<br>ఆది<br>సోమ | శ్రీ వేంకటేశ్వరస్వామివారికి<br>శ్రీవారికి -రథోత్సవం<br>శ్రీవారికి,<br>శ్రీ కోదండరాస్వామివారికి,<br>శ్రీ కృష్ణస్వామివారికి | **చైత్ర పూర్ణిమకు జరుగును** |

| **శ్రీ కోదండరామస్వామి వారి (తెప్ప) ప్లవోత్సవాలు, తిరుపతి** | | | |
|---|---|---|---|
| **27-3-10** | శని | శ్రీ సీతాలక్ష్మణ సమేత కోదండరామస్వామివారికి | **చైత్ర పూర్ణిమకు జరుగును** |
| **28-3-10** | ఆది | ,, | |
| **29-3-10** | సోమ | ,, | |

తిరువెంకటనాథ అనే రాజు కూడ యాదవరాయ కుటుంబానికి చెందినటువంటి, తరువాతి కాలం వ్యక్తి. తిరుమల తిరుపతి దేవస్థాన శాసన సంచయంలో, ఇతనికి సంబంధించిన 189-టి.టి., 195-టి.టి. మరియు 11- జి.టి., 40-జి.టి. సంఖ్యలుగల శాసనాలు నాలుగున్నాయి. ఇవి ఈ రాజు యొక్క పరిపాలనాకాలంలోని 8 మరియు 12వ సంవత్సరాలలో ప్రకటించబడినట్లు ఈ శాసనాల ఆధారంగా తెలుస్తోంది. రాజైన తిరువెంకటనాథుడు తన ప్రధానసేనానాయకుడు సింగయ దణ్ణాయకుని మనవిని మన్నించి ఇల్లత్తూరునాడులోని పొంగలూరు గ్రామంలోని సగభాగం సర్వమాన్యంగా చేసి శ్రీ వేంకటేశ్వరునికి దానం చేశాడు. ఈ అర్ధగ్రామం నుండి వచ్చే ఆదాయంతో ఆషాఢ మాసోత్సవం, మహాప్రధాని రాచయదణ్ణాయకుని పేరుమీద ఏర్పాటు చేయబడిన సితకరగండన్ సంధిని (శాసనం సంఖ్య 189-టి.టి.) నిర్వహించేందుకై ఏర్పాటు చేశాడు. ఈ దానం రాజు తన పరిపాలనాకాలంలోని మొదటి

ఎదిరాండులో (అంటే రాజు అధికారాన్ని- రాజ్యాన్ని పునఃసంపాదించిన ఒక సంవత్సరం తరువాత అని అర్థం చెప్పబడింది) 8వ సం॥ ఆషాఢమాసంలో రాజు ఈ దానాన్ని తన 9వ పరిపాలనా సంవత్సరంలో ఆడిమాసం నుండీ అమలులోకి వచ్చే విధంగా (శాసనం సంఖ్య 195-టి.టి.) ఏర్పాటు గావించాడు.

ఇంకనూ తన పూర్వీకుడైన యాదవనారాయణ జ్ఞాపకార్థం ఈ తిరువెంకటనాథయాదవరాయలు ఏర్పాటుచేసిన నారాయణన్‌సంధి సమయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహార్థం ఒక తిరునామత్తుక్కనిగా తిరుపతిగ్రామాన్ని దానం చేశాడు. ఈ యాదవ నారాయణ పేరుమీదనే మూడవ కుళోత్తుంగుని పరిపాలన చివరి కాలంలో రాజమల్లదేవ అనే నామాంతరం గల భుజబల సిద్ధరసన్ అన్నపేరుతో సుప్రసిద్ధుడైన యాదవనారాయణన్ అనునతడు నాగపుడోలి అనే గ్రామంలో ఒక దైవాన్ని ప్రతిష్ఠించాడు. తిరువెంకటనాథ యాదవరాయలే తనదైవానికి దానం చేసిన తిరునామత్తుకని స్వయంగా తన పరిపాలనాకాలమందలి 12వ సం॥లో సర్వమాన్యంగా దానంచేసి, దానవిక్రయాధికారం లేకుండా వంశపారంపర్యంగా అనుభవించడానికిగాను ఇచ్చాడు. అందువల్ల దీనిపైగల అనేకరకాల పన్నుల విధింపు తొలగించబడింది. అటువంటి వాటిలో వళ్ళాలదేవర్ వరి అనే పన్ను(శాసనం సంఖ్య 11-జి.టి.) కూడ ఉంది.

ఈ శాసనాల వల్ల, రాజైన హోబళ యాదవ అనునతడే మనకు తెలియవచ్చిన అత్యంత ఇటీవలి కాలానికి చెందిన యాదవరాయ ప్రముఖుడు. రాజైన ఈ హోబళయాదవునిచే, శ్రీ వేంకటేశ్వరస్వామియొక్క వరదహస్తముద్రలో ఉన్న వైకుంఠ హస్తానికి బంగారు తొడుగు సమర్పించాడన్న విషయం తెలుస్తోంది. సంఖ్య 56-టి.టి.శాసనంలోవున్న ఒక సంస్కృత,తమిళ పద్యంలో తిరుమలను **వడవెంకటం** అనగా **ఉత్తర వెంకటాచలం** అని పేర్కొంటూ ఈ ప్రాంతం అంతా చక్కని సువాసనలీను తరులతాగుల్మాదులతో నిండియున్నదని తెలుపుతోంది.

**ఇ) తెలుగు పల్లవులు :** తిరుమల తిరుపతి దేవస్థాన శాసన సంచయంలో స్థానిక తెలుగుపల్లవ ప్రముఖుడైన విజయగండ గోపాలునికి సంబంధించిన శాసనాలున్నాయి. వీటిల్లో అధిక భాగం పగిలిపోయాయి. ఇవి విజయగండ గోపాలుని పరిపాలనాకాలం నందలి 4వ, 5వ, 9వ సంవత్సరాలకు సంబంధించినవిగా గుర్తించగలం.

ఇతని పరిపాలనాకాలం - జటావర్మ సుందరపాండ్య, కొప్పెరుంజింగ, మధురాంతక పొత్తపిచోళ అల్లున్ తిక్క, మనుమసిద్ధ మరియు కాకతీయ గణపతి వారల పరిపాలనాకాలానికి సమకాలీనమౌతున్నది. వీరిలోని జటావర్మన్ సుందర పాండ్యుడు యుద్ధంలో గండగోపాలుని ఓడించి చంపాడు. కానీ మన శాసన సంచయంలోని సంఖ్య 239 మరియు 241-టి.టి. శాసనాల ప్రకారం ఈ గండగోపాలుడు వీరగండగోపాలుడు గాని విజయ గండగోపాలుడు కాదని తెలుస్తోంది. జటావర్మసుందర పాండ్యుడు వీరగండగోపాలుని జయించియుండటం ఆధారంగా చేసుకుని కొప్పెరుంజింగ వీరగండగోపాలుని మరియు వీరగండ గోపాలుని కూడ యుద్ధంలో జయించానని పలికిన మాటలలో ఏ మాత్రం నిజం లేదని (శాసనం సంఖ్య 226-టి.టి.) తెలుస్తోంది. తమిళ పల్లవులు కూడ, వీరగండగోపాలుని జయించినట్లునూ ఆ గౌరవం తమకే దక్కాలని చెప్పుకుంటారు.

విజయగండగోపాలుని రాణియైన రాకుమారి దేవర శియార్ వెంకటేశ్వర దేవాలయానికి కొన్ని గోవులు దానంచేసి, 3 అఖండ దీపాలు వెలిగించే ఏర్పాటు (శాసన సంఖ్య 73-టి.టి., 431-టి.టి.) చేసింది. విజయగండగోపాలుని రాజప్రాసాద పరిచారకులలో కాశ్యపగోత్రీకుడైన అమ్మైయప్పన్ అని మరోపేరు కలిగిన అణ్ణన్ పెరుమాళ్‌ప్రియన్ అనేవ్యక్తి ఒక దీపాన్ని వెలిగించే ఏర్పాటు చేశాడు. ఇందుకు అవసరమైన ఘృతాన్ని సమకూర్చేందుకుగాను 32 గోవులను, ఒక ఎద్దును ఆలయానికి దానం చేసెనని శాసనం సంఖ్య173-టి.టి. తెలుపుతోంది. ఇట్లే, నారాయణపురం నివాసి వణిజుడు కట్టారి



**తిరుమలలో శ్రీవారి దర్శనానికి ముందు,**
**శ్రీవారి పుష్కరిణి చెంతవున్న**
**శ్రీ వరాహస్వామివారిని దర్శించాలి.**
**ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం.**

కుమారుడు అమరకోన్ అనే వ్యక్తి కూడ తిరుమల దేవాలయంలో దీపం వెలిగించే ఏర్పాటు గావించాడు. మరియు దీప స్తంభం కోసం 3 మాడలు, కర్పూరహారతి కోసం 12 మాడలు మూలధనంగా దానం చేశాడు (శాసనం సంఖ్య111-టి.టి.). కాకతీయ గణపతి మంత్రులలో ఒకరూ మరియు అలప్పూర్‌కు చెందిన దేవశెట్టి కుమారుడైన బ్రహ్మశెట్టి అనునతడు విజయ గండగోపాలుని పరిపాలనాకాలంనందలి 7వ సం॥ నందు కాంజీవరంలోని అరుళాళపెరుమాళ్ దేవాలయానికి గోవులను, వృషభాలను దానం (సంఖ్య.47 of 1893 of the Mad.Ep.coll.,) చేసినట్లు తెలుస్తోంది. ఈ బ్రహ్మశెట్టే తి.తి.దేవస్థానం శాసనం సంఖ్య 296-టి.టి. తెలుపుతున్న ప్రకారం బ్రహ్మనారాయణన్ మరియు స్థానిక వైష్ణవుల సహకారంతో దానధర్మాల కోసం ఆధార ద్రవ్యాన్ని ఏర్పరచాడు. ఇతడు ఉద్యోగరీత్యా (పొక్కన్) కోశాధ్యక్ష పదవిని బహుశః గణపతిదేవుని కొలువులో నిర్వహించి ఉంటాడు.

త్రిపురాంతకదేవ అనే మరొక తెలుగు పల్లవ ప్రముఖుడైన రాజుని సంఖ్య 128-టి.టి. శాసనం మన దృష్టికి తీసుకువస్తోంది. ఇతడే మహామండలేశ్వర త్రిపురాంతకదేవ. ఇతని కుమారుని పేరు మధుసూధనదేవ.

శాసనం సంఖ్య72-టి.టి.నందలి రాజగండగోపాల అనువృక్తి యొక్క ధాతృత్వాన్ని తమిళంలో కీర్తిస్తోంది. కానీ ఇతని వంశాన్ని గురించి కానీ, ఇతడు పలానా దేశం పాలకుడని గానీ తెలుపడం లేదు. ఇతడు విజయగండగోపాలుడికి సంబంధించిన ఒక తెలుగు పల్లవ ప్రముఖుడు అయి ఉంటాడు.

## 6) ఈ కాలంనందలి ఆర్థికపరిస్థితులపై నివేదిక

### అ) ఈ కాలంలో విధించిన పన్నులు :

ఈ కాలంలో తిరుపతి గ్రామం నుండి సంగ్రహింపబడుతున్న సుమారు 40 రకాల పన్నులను శ్రీ వేంకటేశ్వర దేవాలయ ప్రయోజనార్థం ఇవ్వబడుతుండేవి. శాసనం (శాసనం సంఖ్య11-జి.టి.)లోనే ఈ పన్నులన్నీ ఈ క్రింది విధంగా వర్గీకరింపబడ్డాయి. పొన్‌వరి మొదలైన బంగారానికి సంబంధించిన పన్నులు, కడమైఆయం - ధాన్యాదుల మీద పన్నులు, అమంజివగై - స్వచ్ఛంద సేవలకు సంబంధించిన పన్నులు, నాట్టార్ సభచే విధించబడు పన్నులు, రాజు యొక్క న్యాయస్థానంచే పాత, కొత్త పన్నులు, శాసనం సంఖ్య 189-టి.టి. మరియు 11-జి.టి.లలో ఇవ్వబడిన పన్నులు, కొన్ని జంతువుల మీద విధింపబడే సుంకాలు, వివిధ మార్గాల్లో పోయే బండ్లమీద విధింపబడు సుంకం లేదా టోల్‌గేటు సుంకం, వ్యాపారులు, నూనె వర్తకులు, బట్టలు నేసేవారు మొదలైన వారిపై విధించే వృత్తిపన్ను, పూదోటలు నిర్వహించుట, చెరువులలో చేపలు పట్టుట - మొదలైన వారికి అనుజ్ఞాపత్రం ఇచ్చినందుకు గాను విధింపబడే సుంకం; దొంగతనంగా మేసిన గొడ్ల యజమానుల నుండి వసూలు చేసే జరిమానా ఈ పన్నులు పశ్చిమ దేశాలలో మధ్యయుగపు రాజకీయ వ్యవస్థకు చెందిన కౌలుదారీ పద్ధతిని పోలిన వసూళ్ళను తలపిస్తున్నాయి. పూర్వకాలం నుండీ వాడుకగా అనుసరించుచుండిన తిరుమగనార్ కాణిక్కై, తిరుతాయార్ కాణిక్కై - అని మరి రెండుపన్నుల వసూళ్ళు కూడ ఈ పట్టికలో చోటు చేసుకున్నాయి. అంటే ఈ రెండు పన్నుల వసూలు యువరాజు, రాజమాతయొక్క సంక్షేమార్థం వసూలు చేసే పన్నులు. ఈ రెండూకాక మూడవ రకం పన్ను ఒకటి ఉంది. మహారాజు యుద్ధంలో శత్రువుకు చిక్కి బందీగా కొనిపోయేటపుడు అతనిని విడిపించడానికై శత్రురాజుకు చెల్లించే కప్పం కోసం ప్రజలనుండి పన్నుల రూపాన వసూలు చేసే ధనం. తన్ను జయించిన హోయసల మహారాజుకు తాను చెల్లించవలసియున్న కప్పాన్ని సమకూర్చుకోవడానికిగానూ యాదవ రాయలు తన దేశప్రజల నుండి వళ్ళాలదేవర్‌వరి అనే పన్నురూపంలో వసూలు చేయడం ఇటువంటిదే.

ఈ క్రింది పన్నులు వసూలు చేయబడుతుండేవి.

పండివరి, పలవరి, కాణిక్కై, వెండుగోళ్‌వరి, మలైయ మంజి, కుదిరైవరి, కనక్కమొవై, నాట్టువరై, నిలైకాణిక్కై, నాట్టార్ వైట్టి కాణిక్కై, వలినాదై కాణిక్కై, అక్కన్‌కాణిక్కై, కార్తికై కాణిక్కై, పట్టివరి, విరుట్టువగై, పలటలిక్కు మడైయిల్ కొళ్ళుమ్ (వరి), నాట్టార్ మాడైయిల్ వగుక్కుం వరి, వళ్ళాలదేవర్‌వరి, వాసల్ పణం, తలై పణం, నిశ్చయిప్పు, ముకంపార్వై, పడియారిమొవై,

ముకంపార్వైచ్చుమ్మదం, సంబదచ్చుమ్మదం, శెట్టికల్, వణికర్, సెనైయంగాడియార్, శెక్కుకుడిమక్కళ్, కైకోలార్ పెర్ (ఆయం), శుంగవరి – కొళ్ళుమ్ వగై, శుంగ ఎణ్ణై, పిళ్ళైకల్ కాణిక్కై.

తొండమండలానికి స్థానిక పాలకుడైన తిరువేంకటనాథ యాదవరాయలు(1322–1337)స్వామికి ఆహారనైవేద్యాన్ని సమర్పించేందుకు నారాయణన్‌సంధి రూపాన ఏర్పాటు చేశాడు. ఆ సందర్భంలో తిరుపతిగ్రామాన్ని సర్వమాన్యంగా చేసి తిరుమల శ్రీనివాసునికి సమర్పించాడు. ఈ విషయాన్ని ధ్రువీకరిస్తూ రాజాజ్ఞ ప్రకారం వెలువడిన ప్రభుత్వ ప్రకటనే ఈ శాసనం. రాజుగారి ఉత్తర్వు ప్రకారం అన్ని ఏర్పాట్లు చేసిన వైనం తిరుమల స్థానత్తారునకు తెలుపబడింది. ప్రభుత్వానికి చెల్లించాల్సిన స్థానిక పన్నులు వసూలు చేసే కేంద్రం తిరుపతి గ్రామంలోనే ఉన్నదనే విషయం గమనార్హం.

**ఆ) ఈ కాలంలో నీటి సరఫరా :**

తిరువెంకటనాథ యాదవరాయలు తిరుపతి గ్రామాన్ని సర్వమాన్యంగా తిరుమల వేంకటేశ్వరునకు దానం చేశాడు. కానీ తిరుపతిలోని పెరియయేతి (పెద్దచెరువు)కట్ట ఉత్తర తూము (sluice) వద్ద ఉన్నటువంటి కొన్ని భూములు ఎంపెరు మానార్ (రామానుజుల)నిత్యదైనందినపూజా కార్యక్రమాల నిర్వహణార్థం ఆధారద్రవ్యంగా ఇవ్వబడింది. కొంతకాలంగా వీటిపై తగినంత శ్రద్ధపెట్టకపోవడంవల్ల ముండ్లతుప్పలు, పిచ్చి మొక్కలు పెరగడం జరిగింది. శ్రీరంగనాథుని పరిపాలనా కాలంనందలి 3వ సంవత్సరాన ఈ పుట్టై భూములలోని ముండ్ల పొదలను, గడ్డి తుప్పలను తొలగించి సాగుచేయడానికి అనువుగా సౌకర్యాలు చేయడం జరిగాయి. కాని ఇప్పట్టున ఒక సమస్య ఏర్పడింది. గ్రామంతోబాటు పెరియయేతి కూడ శ్రీ వేంకటేశ్వర స్వామికి చెందిన ఆస్తిలో భాగమవడంచేత, శ్రీవారికి తగిన నష్టపరిహారం చెల్లించకుండా ఎంపెరు మానార్‌కు చెందిన భూములను సాగు చేసేందుకు పెరియయేతి నుండి నీటిని వినియోగించడానికి హక్కులేదు. అంచేత ఈ ప్రయోజనార్థం శ్రీ వేంకటేశ్వర స్వామికి 200 పణాలను తిరుమున్‌కాణికైగా బహూకరించబడింది. ఆ తర్వాతనే పెరియయేతి నుండి తిరుపతిలోని ఇతర భూములకు సరఫరా చేస్తున్న పద్ధతి ప్రకారమే ఈ పుట్టై భూములలో కూడ వ్యవసాయం చేసేందుకు వీలుగా నీరు సరఫరా చేయబడింది (శాసనం సంఖ్య 115– జి.టి.).

*(ఇంకా ఉంది)*


Statement about ownership and other particulars about

**SAPTHAGIRI**
**(MONTHLY)**
**FORM IV**

*See Rule 8*

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | TIRUPATI |
| 2. | Periodicity of its Publication | : | Monthly |
| 3. | **Honorary Editor** | : | **I.Y.R.KRISHNA RAO,** I.A.S.<br>Executive Officer, T.T.D, Tirupati. |
| 4. | **Printer's Name**<br>Whether citizen of India<br>Address | :<br>:<br>: | **V. SAMBASIVA RAO**<br>Yes<br>Manager,<br>T.T.D. Press, Tirupati. |
| 5. | **Editor & Publisher's Name**<br>Whether citizen of India<br>Address | :<br>:<br>: | **C. SAILA KUMAR**<br>Yes<br>Cheif Editor, Sapthagiri Journal,<br>T.T.D., Tirupati |
| 6. | Name and address of individuals who own the Newspaper and partners or shareholders holding more than one percent of the Total Capital | : | Board of Trustees represented by the Executive Officer on behalf of T.T.D., Tirupati. |

*I, C.SAILA KUMAR, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

TIRUPATI
Date : 28-2-2010

**(Sd.) C.SAILA KUMAR**
*Signature of the Publisher*

మన దేవాలయాలు

# శ్రీ పార్థసారథి ఆలయం - చెన్నై

- పి. కృష్ణమూర్తి

చెన్నై మహానగరంలో రెండు ఆలయాలు అతి ప్రాచీన మైనవి. వాటిలో మొదటిది పార్థసారథి(విష్ణు)ఆలయం, రెండవది కపాలేశ్వర స్వామి (శివ) ఆలయం.

పార్థసారథి ఆలయం నగరంలో 'ట్రిప్లికేన్' అనే ప్రదేశంలో ఉంది. ఈ ఆలయం, తిరుమల శ్రీనివాసుని దర్శించుకుని పవిత్ర సాగర స్నానాల కోసం రామేశ్వరం వెళ్ళే యాత్రికులకు విడిదిగా ఉండేది. సప్తఋషులు భృగు, శ్రీ పార్థ సారథిస్వామిని, ఆలయంలోని ఇతర దేవతలను అర్చించినట్లు బ్రహ్మాండ పురాణం తెలుపుతోంది. అదే విధంగా వైష్ణవ ఆళ్వార్లు కూడా వైభవాన్ని తమ రచనల్లో కీర్తించారు. వీరు స్వామిని సాక్షాత్తు తిరుమల వేంకటేశ్వరునిగా భావించి, పార్థసారథి స్వామిని "వేంకట కృష్ణుడు" అని, గీతాచార్యుడని, పేర్కొన్నారు.

**ఐతిహ్యం :**

పూర్వం సుమతి అనే రాజు, తిరుమల వేంకటేశ్వరుని, తనకు పార్థసారథి రూపంలో దర్శన మివ్వమన్నాడట! శ్రీని వాసుడు సుమతి కలలో కనబడి "నీవు కోరినట్లే నేను పార్థసారథిగా నీకు దర్శనమిచ్చెదను. నీవు వేదారణ్యంలోని సముద్ర తీరంలో తపస్సు చేసుకో"మని చెప్పాడు. సుమతి స్వామి ఆజ్ఞ మేరకు వేదారణ్యం వెళ్ళి దీక్షతో తపస్సు చేయగా, ఆతడి దీక్షకు మెచ్చి మహావిష్ణువు పార్థసారథి రూపంలో దర్శనమివ్వగా, ఆ దివ్య మంగళకర రూప విగ్రహాన్ని కన్నులార చూచి స్వామిని అదే రూపంలో అచ్చటే కొలువై ఉండమన్నాడు ఆ రాజు. భక్తుని కోర్కె కాదనలేక స్వామి వేదారణ్యంలోనే పార్థ సారథి రూపంలో కొలువైనాడు. మరో కథనం ప్రకారం ఐత్రేయ మహర్షి, వేదవ్యాస మహర్షిని తాను తపస్సు చేసుకోవడానికి పవిత్రమైన ప్రదేశాన్ని సూచించమని కోరగా, వేదవ్యాసుడు, ఐత్రేయుడికి వేదారణ్యంలోని కైరావని పుష్కరిణి గట్టును సూచిం చాడు! అంతేగాక ఆ పుష్కరిణి పూర్తిగా తులసి మొక్కలతో నిండి ఉంటుందని, ఆ ప్రదేశమందే సుమతి అనే రాజు కూడా తపస్సు చేసుకొంటూ ఉన్నాడని తెలిపి, ఐత్రేయ మహర్షికి ఒక లోహపు పార్థసారథిస్వామి విగ్రహాన్ని ప్రసాదించాడు! ఇక్కడి స్వామిని వేదవ్యాసుడే ప్రతిష్ఠించారని కూడా మరో ఐతిహ్యం ఉంది.

ఆలయ రాజగోపురాన్ని తొండమాన్‌చక్రవర్తి నిర్మిం చాడు. ఈతడు తిరుమల ఆలయాన్ని నిర్మించిన తరువాత అదే



శ్రీ పార్థసారథి స్వామి, ట్రిప్లికేన్ (మూలవర్లు)

రీతిలో శ్రీ పార్థసారథిస్వామి ఆలయాన్ని నిర్మించాడు. అయితే ఆలయంలోని ఒక ప్రాచీన శాసనం, ఒక పల్లవరాజు ఈ ఆల యాన్ని పునరుద్ధరించినట్లు తెలుపుతోంది. ఆ తర్వాత పల్లవులు, చోళులు, విజయనగర రాజులు, ఆలయాన్ని అభివృద్ధి చేసి స్వామికి మడులు, మాన్యాలు సమర్పించినట్లు, ఆలయంలోని శాసనాలు పేర్కొంటున్నాయి.

ఆ తర్వాత రోజుల్లో శ్రీపార్థసారథి ఆలయం, పోర్చు గీసు, డచ్, ఫ్రెంచ్, ఈస్టిండియా కంపెనివారి పాలనలో ఉండేది. 1843 సం॥లో బ్రిటీష్ ప్రభుత్వం భారతదేశంలోని మతసంస్థలలో జోక్యము చేసుకోరాదని, స్థానికులకే ఆ సంస్థలను అప్పగించాలని తీర్మానించడంతో శ్రీపార్థసారథి స్వామి ఆలయ పాలనా బాధ్యతను భారతీయులకే అప్పగించడం జరిగింది. ఈ పార్థసారథిస్వామి ఆలయం దేశంలోని 108 దివ్య తిరు పతుల్లో ఒకటిగా పేర్కొనబడినది. ఈ ఆలయ ప్రత్యేకత, ఇందులో శ్రీ మహావిష్ణువు యొక్క 4 అవతారాలైన, వరాహ, నారసింహ, రామ, శ్రీకృష్ణులు పూజింపబడుతూ ఉండడం. ప్రముఖ వైష్ణవ మతాచార్యుడైన శ్రీరామానుజాచార్యుల తల్లి, తండ్రులు తమకు పుత్ర సంతానము ప్రసాదించమని, వేంకట కృష్ణుని (పార్థసారథిని) ప్రార్థించారట! స్వామివారి విన్నపాన్ని మన్నించి వారికి పుత్ర సంతానాన్ని ప్రసాదించాడు. ఆయనే శ్రీ రామానుజాచార్యులు. భక్తులు, రామానుజులు శ్రీపార్థసారథి ప్రతిరూపమని భావించేవారు.

శ్రీ పార్థసారథిస్వామి ఆలయం తూర్పు ముఖాన్ని కలిగి నిర్మింపబడింది. ఆలయం చుట్టూ ఎత్తైన ప్రహరీ కలదు. ఈ ప్రహరీలో తూర్పు, పశ్చిమ దిశల్లో రెండు గోపుర పరివేష్ఠితమైన ద్వారాలున్నాయి. తూర్పు వైపు ఉన్న ద్వారమే ప్రధాన ద్వారం. ఈ ద్వారం పైన 5 అంతస్తుల రాజగోపురం నిర్మితమైంది. ఈ రాజగోపురానికి ముందు భాగంలో 32 స్తంభాల సాయంతో నిర్మితమైన మండపముంది. ఆలయం నిర్మాణంలో ఈ స్తంభాల ప్రతిష్ఠ ఒక అపూర్వ ఘట్టం. ప్రతి స్తంభంపైన అపురూప శిల్పాలున్నాయి. వీటిల్లో ఎక్కువగా దశావతార దృశ్యాలే. అంతే గాక, శ్రీ వేంకటేశ్వరుడు, తన వాలాన్ని ఆసనంగా చేసుకుని కూర్చొని ఉన్న ఆంజనేయుడు, వినాయక, శంఖ, చక్ర, రామా నుజ, మహాభారత దృశ్యాలు కూడా ఉన్నాయి. ఈ మండపాన్ని ఆనుకుని 5 అంతస్తుల రాజగోపురం, శిఖరము పైన 7 కలశాలు ఉన్నాయి. ఈ ప్రధాన గోపురం మొత్తం వైష్ణవ శిల్పాలతో అలంకరించారు. ప్రధాన ద్వారం దాటగానే, ఉత్తర, దక్షిణా లుగా 24 స్తంభాలతో నిర్మించిన సభామండపం ఉంది. ఈ మండపంలోనే ఆలయ ధ్వజస్తంభం, బలిపీఠం, గరుడ మండపా లున్నాయి. ఈ మండపాన్ని ఆనుకుని 3 అ॥ ఎత్తైన అధిష్టానం పైన ప్రధానాలయం ఉంది. ఈ ఆలయం, లోపలి భాగంలో అనేక ఉపమందిరాలున్నాయి.

ఆలయ గర్భగృహం, అత్యంత రమణీయం, ఈ మందిరంలో, శ్రీకృష్ణపరమాత్ముడు పార్థసారథి పేరుతో కొలువై నాడు. స్వామి స్థానక ముద్రలో దాదాపు 10 అ॥ ఎత్తున, తలపై కిరీటం, నుదుట తిరునామం కలిగి దేదీప్య మానంగా వెలిగిపోతున్నాడు. స్వామి వెనుక పంచలోహ మకరతోరణ ముంది. స్వామి మహాభారత యుద్ధంలో పార్థునకు సారథిగా వ్యవహరించినందువల్ల, యుద్ధవీరుడి లక్షణంగా కోరమీసం కలిగియున్నాడు. స్వామి సాధారణంగా శంఖ, చక్రాలను దర్శిస్తాడు. ఇచ్చట స్వామి తన కుడి చేతి యందు శంఖాన్ని మాత్రమే ధరించాడు. మహాభారత యుద్ధానికి ముందు దుర్యోధనునితో, యుద్ధమందు నేను ఆయుధము చేతబట్టను, యుద్ధం చేయను అన్నందువల్ల స్వామి చక్రాయుధాన్ని ధరించ లేదు. ఈతడి ఎడమ చేయి వరద ముద్రలో ఉంది. ఈ చేతిని ఆనుకుని పాదాల కింది వరకు పొడవాటి కత్తి కలదు. ఈ ఖడ్గానికున్న కవచం వజ్రవైడూర్యాలతో అలంకృతమైంది. స్వామి ఎద మీద లక్ష్మీదేవి కొలువై ఉంది.

**కర్మఫలం మీద కోరిక వదలి,**
**సిద్ధి-అసిద్ధి అనే రెంటియందునూ**
**సమత్వాన్ని పొంది, భగవదర్పణ**
**బుద్ధితో కర్మలు ఆచరించాలి.**
**ఇలా అన్నింటా సమత్వభావనతో**
**ఉండడమే 'యోగ'మని**
**గీతాచార్యుని ప్రబోధం.**

స్వామి కుడి పక్కన రుక్మిణీ దేవి నిలబడి ఉంది. పార్థ సారథి స్వామికి ఎడమ వైపున బలరాముడు, సాత్యకి, కుడి వైపు శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు, మనువడు అని రుద్ధులు కొలువై ఉన్నారు. స్వామివార్ల ముందు భాగంలో వారి వారి ఉత్సవర్లు ఉన్నారు. శ్రీకృష్ణుని ఉత్సవ విగ్రహం, ముఖ మంతా గాయాలతో నిండివున్నట్లు రూపొందింపబడి ఉంది. ఈ గాయాల గుర్తులు మహాభారత యుద్ధభూమిలో భీష్ముని చేత ప్రయోగింపబడిన, బాణాల గాయాలట! గర్భాలయంపై ద్రవిడ విమానం, గుండ్రని శిఖరం, పైన కలశం ఉన్నాయి. ఈ విమానంలో కొంత భాగానికి బంగారు తాపడం చేయబడింది. ఈ విమానాన్ని "ఆనంద విమానము" అంటారు.

గర్భాలయం ముంగిట ఉత్తర దిశలో రంగనాథస్వామి మందిరం ఉంది. ఇందులో స్వామి అనంతశయనుడుగా పవ్వళించి ఉండగా, ఆయన వెనుక రంగనాయకి, నాభియందు కలువ పుష్పం, అందులో బ్రహ్మదేవుడు ఉన్నారు. ఈ మందిరం ప్రక్కన, ఆంజనేయస్వామి మందిరం, దాని పక్కన రామ మందిరం ఉన్నాయి. ఈ మందిరాలన్నీ, గర్భాలయం నుండి మహామండపం వరకు ఉన్నాయి.

ముఖమండపం వెలుపలి ద్వారాని కిరువైపులా ద్వార పాలకులున్నారు. ముఖమండపం వెలుపల మహామండపమందే స్వామివారి ఉయ్యాలసేవ, ప్రత్యేక ఉత్సవాలు జరుపుతారు. స్వామివారి గర్భాలయంలోనికి ఈశాన్య దిశ నుండి ప్రవేశించి, స్వామిని దర్శించి, ముఖమండపం, ముంగిట దక్షణదిశలో నుంచి వెలుపలికి వస్తారు. స్వామివారి గర్భాలయం ముంగిట ఎడమవైపు, వరుసగా, ఆళ్వారులు, వైష్ణవాచార్యులు రామానుజా చార్యుల పంచలోహ ప్రతిమలు, వారి ముంగిట, వారి ఉత్సవర్లు ఆశీనులైయున్నారు.

పార్థసారథిస్వామి మందిరానికి వెలుపలి ప్రహరీకి మధ్యన, దక్షిణదిశలో పెరుందేవి ఆలయముంది. ఆలయ మందు గర్భగుడి, అంతరాళం, ముఖమండపాలున్నాయి. గుడి 2అ॥ఎత్తున ఉన్న అధిష్ఠానంపై ఉంది. గర్భాలయమందు దేవి సర్వమంగళ, కిరీటధారి, సర్వాలంకార భూషితయై, నిలుచుని భక్తులకు దర్శనమిస్తోంది.

పెరుందేవి ఆలయం దక్షిణంగా, వరదరాజస్వామి మందిరముంది. ఇది కూడా, నేలకు 3 అడుగుల ఎత్తులో ఉన్న అధిష్ఠానంపై నిర్మితమైనది. మందిరం, గర్భగుడి, అంతరాళం, స్తంభాల మండప సముదాయం గర్భాలయమందలి స్వామి స్థానక ముద్రలో ప్రతిష్ఠింపబడ్డాడు. గర్భాలయంపైన, ఏకతల విమానం, శిఖరంపైన కలశం ఉన్నాయి.

పార్థసారథి స్వామికి వెనుక వైపు పశ్చిమ దిశగా విశాలమైన నారసింహస్వామి ఆలయం నిర్మితమై ఉంది. ఆలయమందు, గర్భగృహం, అంతరాళం, ముఖమండపాలు న్నాయి, గర్భాలయమందు మహావిష్ణువు, నరసింహస్వామి రూపంలో కొలువై పూజింపబడుతున్నాడు. స్వామివారి పక్కన దేవి కొలువై ఉంది. స్వామి ముంగిట అర్చామూర్తులు కొలువై ఉన్నారు. ముఖమండప, మహామండప స్తంభాలన్నీ వైష్ణవ శిల్పాలతో అలంకృతమై ఉన్నాయి. స్వామి ఆలయం ముంగిట ప్రహరీలో ద్వారం, దానిపై 3 అంతస్తుల రాజగోపురం ఉన్నాయి. రాజగోపురానికి మహామండపానికి మధ్యన, ధ్వజ స్తంభం, బలిపీఠం, గరుడమండపాలు ఉన్నాయి. నారసింహ స్వామి ఆలయం పక్కన, విచిత్రంగా, ఆండాల్ మందిరముంది. ఈ మందిరం, తూర్పు దిశగా నిర్మితమైంది. గర్భాలయంలో సుమారు 4 అ॥ ఎత్తున ఉన్న దేవి ప్రసన్న వదనంతో దర్శన మిస్తూ ఉంది.

పార్థసారథి స్వామి ఆలయం ముందు భాగంలో, విశాలమైన పుష్కరిణి ఉంది. దీనిని 'కైరావిని' పుష్కరిణి అంటారు. ఇందులో మధ్యన నీరాళి మండపముంది. కోనేటిలో ఇప్పటి వరకు ఎన్నడూ నీరు ఇంకిపోలేదట! కోనేరు మొత్తం తులసిమొక్కలతో నిండి ఉంటుంది. ప్రతి ఏటా వైశాఖమాసంలో జరిగే బ్రహ్మోత్సవాల్లో ఈ పుష్కరిణిలో స్వామి, దేవేరులను అద్దాల తెప్పపై ఊరేగిస్తారు! ఆలయమందు రామానుజా చార్యులకు ప్రతి ఏటా ప్రత్యేక ఉత్సవాలు నిర్వహిస్తారు. స్వామికి తరతరాలుగా చక్రవర్తులు, రాజులు, భక్తులు, దాతలు ప్రసాదిం చిన, భూ, ధన, కనక, వస్తు, వాహనాలు పుష్కలంగా ఉన్నట్లు ఇక్కడి శాసనాలను బట్టి తెలుస్తోంది.

బాలప్రబోధం



# శ్రీరామకథ

- వై. రెడ్డిరమేష్ బాబు

వాల్మీకి మహర్షి రచించిన శ్రీమద్రామాయణం, సంస్కృత భాషలోనే కాకుండా విశ్వవాఙ్మయం లోనే ఆదికావ్యం. ధర్మస్వరూపుడైన శ్రీరామచంద్రమూర్తి ఆదర్శ చరిత్రనూ, స్త్రీ లోకానికే సిగబంతి అయిన సీతాదేవికథనూ, ఈ కావ్యం అతిలోక సుందరంగా అభివర్ణించింది. దుష్టశిక్షణార్థం మహావిష్ణువు శ్రీరాముడిగా దశరథ మహారాజుకు జన్మించాడు. ఆయన వెంట ఆదిశేషుడు లక్ష్మణుడిగా, శంఖచక్రాలు భరత, శత్రుఘ్నులుగా జన్మించారు.

**సీతాస్వయంవరం :** యాగరక్షణార్థం విశ్వామిత్ర మహర్షి వెంట వెళ్ళిన రామలక్ష్మణులు సీతా స్వయంవరానికి వెళ్లారు. అక్కడ శివ ధనుస్సు విరిచి శ్రీరాముడు సీతాదేవిని వివాహమాడాడు. అప్పుడే లక్ష్మణుడు ఊర్మిళను, భరతుడు మాండవిని, శత్రుఘ్నుడు శ్రుతకీర్తిని వివాహమాడారు. ఆ సందర్భంలోనే అహల్యకు శాపవిమోచనం అయ్యింది.

**అరణ్యవాసం :** శ్రీరాముడి వివాహానంతరం దశరథుడు అతనికి పట్టాభిషేకం చేయాలనుకుంటాడు. కాని, మంథర చెప్పుడు మాటలతో కైకేయి భరతుడికి పట్టాభిషేకం, శ్రీరాముడికి 14 సంవత్సరాలు వనవాసం కోరింది. రాముడు సీతాలక్ష్మణ సమేతంగా అడవికి వెళ్లి పితృవాక్యపరిపాలకుడయ్యాడు. అయోధ్యకు వచ్చి రాజ్యపాలన చేయడానికి కోరిన భరతుని కోరికను సున్నితంగా తిరస్కరించాడు. "లోకానికి సత్యం ప్రభువు. లక్ష్మి సత్యాన్నే ఆశ్రయించి ఉంటుంది. సర్వమూ సత్యం మీదనే ఆధారపడి ఉంది. సత్యం కంటే ఉన్నత స్థానం లేదు" అని జాబాలికి సత్యవిశిష్టతను తెలిపాడు. కాముకురాలై దుష్టతలంపు కలిగిన శూర్పణఖ ముక్కుచెవులను లక్ష్మణుని చేత కోయించాడు. తనతో తలపడిన ఖరదూషణులను సంహరించాడు. సీతాపహరణకు శ్రీరాముడు ఎంతగానో దుఃఖించాడు. రావణుని అడ్డగించి క్షతగాత్ర అయిన జటాయువుకు అంత్యక్రియలు నిర్వహించాడు. సీతాన్వేషణ మార్గమధ్యంలో శబరిని సందర్శించారు.



**2010, మార్చి 24 శ్రీరామనవమి సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

**లంకను చేరుట:** ఋష్యమూక పర్వతంలో సుగ్రీవునితో రామలక్ష్మణులకు మైత్రి కుదిరింది. దీనికి సంధానకర్త హనుమంతుడు. సీత విడిచిన నగల మూటను సుగ్రీవుడు చూపగా, రావణుడే సీతాపహరణకు పూనుకున్నాడని నిర్ధారించుకున్నాడు. సుగ్రీవుని కోరిక మేరకు వాలిని వధించాడు. సుగ్రీవుని వానరరాజ్యానికి పట్టాభిషిక్తుని చేశాడు. వాలి కుమారుడైన అంగదుని యువరాజుగా చేశాడు. సీతాన్వేషణకు బయలుదేరిన హనుమంతునికి తన అంగళీయకాన్ని ఇచ్చి పంపాడు. సీతజాడ తెలుసుకుని శ్రీరాముడు యుద్ధసన్నద్ధుడై లంకకు చేరాడు. శరణుకోరిన విభీషణునికి అభయమిచ్చి ఆశ్రయమిచ్చాడు. యుద్ధంలో రావణుని శక్త్యాయుధం ధాటికి లక్ష్మణుడు మూర్ఛపోయాడు. తమ్ముని స్థితి చూచిన రాముడు చలించిపోయాడు.

"ఏ దేశంలోనైనా భార్యలు దొరుకుతారు. బంధువులు లభిస్తారు. కానీ తోడబుట్టినవాడు మాత్రం దొరికే దేశమేదీలేదు" అని చింతించాడు. హనుమంతుడు తెచ్చిన ఓషధీపర్వతంలోని ఓషధులతో సుషేణుడు లక్ష్మణుని పునరుజ్జీవితుని చేశాడు.



# పెద్దల మాట

– డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

పరోఽపి హితవాన్ బంధుః, బంధుర ప్యహితః పరః ।
అహితో దేహజో వ్యాధిః, హిత మారణ్య మౌషధమ్ ॥

(హితోపదేశం)

భావం : **ఇతరు డయినా సరే - మనకు మేలు చేకూర్చేవాడే బంధువు. మనవాడే ఐనా మనకు బాధ కల్గించేవాడు శత్రువే. వ్యాధి దేహంలో పుట్టిందే అయి, బాధ కల్గిస్తుంటే - ఎక్కడో అరణ్యంలో పుట్టిన ఓషధి బాధను తొలగించి, ఆరోగ్యాన్ని కల్గిస్తుంది కదా!**

**వివరణ :** ఎవడు శత్రువో, ఎవడు మిత్రుడో, వారి స్వభావాలు ఎలా ఉంటాయో, ఖచ్చితంగా నిర్ణయించడం కష్టం. మిత్రరూపశత్రువులూ, శత్రురూప మిత్రులూ ఎందరో ఉంటారు. వీరిని గుర్తించడానికి ఒక విధానం ఈ శ్లోకంలో చెప్పబడింది. మనవాడు కాకపోయినా – పరాయివాడే అయినా మనకు మేలు కల్గించేవాడే నిజమైన బంధువు, ఆత్మీయుడు. మనవాడే – రక్తసంబంధం కలవాడే అయినా మనల్ని పీడించేవాడు నిజంగా శత్రువే అవుతాడు. వ్యాధి శరీరంలో పుట్టుంది. కానీ దాన్ని తొలగించడానికి ఎక్కడో అరణ్యంలో పుట్టిన ఓషధీమూలిక ఉపయోగ పడుతూంది కదా! సొంతంవాడా, పరాయివాడా అని కాదు – చూడా ల్సింది. వాడు మనకు మంచి చేసేవాడా? కీడు కల్గించేవాడా? అనే విషయం గమనించాలి. హితం కల్గించేవాడు ఎవడైనా, ఎక్కడివాడైనా– వాడే దగ్గరి బంధువు, అత్యంత ఆత్మీయుడు. అరణ్య ఓషధి – మన శరీరవ్యాధిని పోగొట్టినట్లు – పరాయివా డయినా మనకు హితం చేకూర్చేవాడు నిజమైన హితుడు, సన్నిహితుడు. ఇతరులకు ఉపకారం చేసే జీవితం అల్పకాలమే అయినా – వానియశస్సు ఆచంద్రార్కం నిలుస్తుంది. తోడివారికి తోడ్పడంలో ఉన్న ఆనందం అమోఘం! మహాపుణ్యం!

కోలుకున్న తమ్ముని చూచి శ్రీరాముడు ఎంతగానో సంతోషించాడు.

**రావణ సంహారం :** మాతలి తెచ్చి ఇచ్చిన ఇంద్రరథాన్ని అధిరోహించి శ్రీరాముడు రావణునిపై విజృంభించాడు. రామరావణ యుద్ధంలో రావణుడు మరణించాడు. అనన్య సాధారణమూ, మనోహరమూ అయిన పూలవాన ఆకాశం నుంచి రాముని రథం మీదికి జలజల కురిసింది. మృతుడై నేలపై పడియున్న సోదరుణ్ణి చూచి విభీషణుడు విలపించాడు. అప్పుడు శ్రీరాముడు విభీషణునితో ఇలా అన్నాడు. "ఓ విభీషణా! మరణంతో వైరాలుపోతాయి. మన ప్రయోజనం నెరవేరింది. ఈతనికి ఉచితమైన సంస్కారం నెరవేర్చు. ఇతడు నీకెట్టివాడో నాకూ అట్టివాడే" అని సమ యోచితంగా పలికాడు.

**అయోధ్యకు పునరాగమనం :** చిరకాలం రాక్షస గృహంలో ఉండి అప్పుడక్కడికి వచ్చిన సీతను చూచి హర్షం, దైన్యం, రోషం అనే మూడు భావాలకు లోనైనాడు. సీతను అగ్నిప్రవేశం చేయమన్నాడు. రామాజ్ఞ ప్రకారం సీత అగ్నిలో దూకింది. అగ్నిహోత్రుడు సగౌరవంగా సీతను తీసుకు వచ్చి "రామచంద్రా! పరమ పుణ్యశీల అయిన సీతను పరిగ్రహించు" అని అప్ప జెప్పాడు. తర్వాత లక్ష్మణ, సుగ్రీవ, హను మాదులతో శ్రీరాముడు సీతాసమేతుడై అయోధ్యకు చేరాడు. రాజ్యాన్ని సుభిక్షంగా పరిపాలిస్తూ అనేక యజ్ఞయాగాలు చేశాడు. రామరాజ్యం సుభిక్షంగా వర్ధి ల్లింది. జగమంతా రామమయంగా భాసిం చింది.

# వార్తాలహరి

## కన్నుల పండుగగా రథసప్తమి

మాఘశుద్ధ సప్తమి సందర్భంగా తిరుమలలో రథ సప్తమి ఉత్సవం 22-01-2010న అత్యంత వైభవంగా జరిగింది. భక్తుల కోలాహలం మధ్య శ్రీ వేంకటేశ్వరస్వామివారు సూర్యోదయం మొదలు రాత్రి వరకు సప్తవాహనాల్లో విహరించారు. ఉత్సవం నేపథ్యంలో శ్రీ మలయప్పస్వామి అరుణోదయం సమయాన ప్రాతఃకాల ఆరాధన పూర్తికాగానే ఆలయం నుంచి వాహన మండపానికి వేంచేశారు. అక్కడ శ్రీవారు వజ్రకవచాది అలంకారభూషితులై సకల పరివారంతో సూర్యప్రభ వాహనంపై ఊరేగుతూ నాలుగు మాడవీథుల్లో వాయువ్యదిశకు వేంచేశారు. అక్కడకు వేంచేసిన తిరుమలేశునిపై సూర్యనారాయణుడు తన కిరణాలతో సమర్చించాడు. ఈ వైభవాన్ని చూసేందుకు వేలాది మంది భక్తజనులు తిరుమాడ వీథుల్లో కిక్కిరిసిపోయారు. అనంతరం స్వామి వాహన మండపానికి చేరుకుని సూర్యప్రభ వాహనాన్ని వీడి శేషవాహనాన్ని అధిష్ఠించి నాలుగు మాడవీథుల్లో ఊరేగుతూ భక్తులకు కనువిందు చేశారు. అనంతరం గరుడ, హనుమంత వాహనాలపై ఊరేగి వాహన మండపానికి విచ్చేశారు. మధ్యాహ్నం శ్రీ మలయప్పస్వామి ఆలయానికి చేరుకున్నారు. ఆ సమయంలో శ్రీ సుదర్శన చక్రత్తాళ్వారు సకల పరివారంతో ఊరేగుతూ వరాహస్వామి ఆలయం ప్రాంగణానికి చేరుకున్నారు. అక్కడ పంచామృతాభిషేకం జరిగాక సుదర్శన భగవానునికి శ్రీవారి పుష్కరిణిలో పవిత్ర స్నానం జరిగింది. ఇదే సమయంలో యాత్రికులు కూడా పుష్కర స్నానం చేసి పునీతులయ్యారు. సుదర్శన భగవానులు శ్రీవారి ఆలయానికి చేరుకున్న అనంతరం మలయప్పస్వామివారికి మధ్యాహ్న ఆరాధన పూర్తి అయిన వెంటనే వాహనమండపానికి వేంచేశారు. అనంతరం శ్రీవారు వరుసగా కల్పవృక్ష, సర్వ భూపాల, రాత్రి చంద్రోదయం సమయాన చంద్రప్రభ వాహనాల్లో ఊరేగి వాహన మండపానికి చేరుకున్నారు. ఈ విధంగా మలయప్ప స్వామి సప్తవాహనాల్లో వైభవంగా ఊరేగారు.

భక్తుల కోలాహలం మధ్య శోభాయమానంగా రథ సప్తమి ఉత్సవం జరిగింది. తిరుమాడ వీథులు భక్తజనంతో పులకించాయి. భక్తులు కనీవినీ ఎరుగని రీతిలో యాత్రికులు అధికసంఖ్యలో ఉత్సవంలో పాల్గొని అడుగడుగునా స్వామివారికి హారతులు పట్టారు. ఉత్సవం ఆద్యంతం బ్రహ్మోత్సవాన్ని తలపించింది.

## వైభవంగా శ్రీవారి పారువేట ఉత్సవం

తిరుమలలో 15-01-2010న శ్రీవారి పారువేట ఉత్సవం అత్యంత వైభవంగా జరిగింది. ప్రతి యేటా మకర సంక్రాంతి మరునాడు కనుమపండుగ రోజున, అధికమాసం రెండవ బ్రహ్మోత్సవం చివరిరోజున ఈ ఉత్సవాన్ని నిర్వహిస్తారు. జగత్ ప్రభువైన శ్రీనివాసచక్రవర్తి శంఖ, చక్ర, గద, ధనుస్సు, ఖడ్గము లనే పంచాయుధాలను ధరించి, వన విహారార్థం వెళ్ళి దుష్ట మృగాలను వేటాడి విజయగర్వంతో తిరిగిరావడమే ఈ ఉత్సవం ప్రత్యేకత. ఇందులో భాగంగా ఆలయంలో వేకువ జామున సుప్రభాతం, తోమాల, కొలువు, అర్చన, గంట నైవేద్య కార్యక్రమాలు శాస్త్రోక్తంగా ముగించారు. శ్రీనివాస ప్రభువైన మలయప్ప స్వామివారికి వేట దుస్తులు తొడిగి, తలపై శిరస్త్రాణం ధరింపచేశారు. సుదర్శన చక్రం, పాంచజన్య శంఖం, నందక ఖడ్గం, కౌమోదకి గద, విల్లు, కత్తి, డాలు, బల్లెం(ఈటె)లాంటి ఆయుధాలతో వెండి పీఠాన్ని అధిరోహించిన శ్రీనివాసుడు శ్రీకృష్ణ స్వామివారితో ప్రదర్శనగా పారువేట మండపంలో వేంచేపు చేశారు. శాస్త్రోక్తంగా ఆగమ కైంకర్యాలు, పూజా కార్యక్రమాలు పూర్తిచేశారు.

## వైభవంగా గోదాదేవి పరిణయోత్సవం

తిరుమల శ్రీవారి ఆలయంలో గోదాదేవి పరిణయోత్సవం 15-01-2010న వైభవంగా జరిగింది. సూర్యగ్రహణం అనంతరం ఆలయం, తెరిచిన తర్వాత శుద్ధి, పుణ్యాహవచనం తదితర కార్యక్రమాలు పూర్తయిన వెంటనే మొదటగా గోదాదేవి పరిణయోత్సవం నిర్వహించారు. ఈ ఉత్సవానికి తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి ఆలయం నుంచి గోదాదేవి అమ్మవారి పవిత్రమాలను తిరుమల ఆలయానికి తీసుకువచ్చారు. పెద్ద జీయర్ నివాసం ఉన్న రాంభగీచా అతిథిగృహం నుంచి మాలను ఊరేగింపుగా శ్రీవారి ఆలయానికి తీసుకెళ్లారు.

## వేడుకగా గోపూజ

గోవధను నిషేధించాలని తి.తి.దే. పాలకమండలి అధ్యక్షుడు శ్రీ డి.కె. ఆదికేశవులు పేర్కొన్నారు. శ్రీ వేంకటేశ్వర గోసంరక్షణశాలలో కనుమ పండుగను పురస్కరించుకుని 15-01-10న గోమహోత్సవం వేడుకగా నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ శ్రీ వేంకటేశ్వర గోసంరక్షణ శాలకు, స్వామి వారికి ఎంతో అనుబంధం ఉందన్నారు. ఇక్కడ నుంచి తెచ్చే పాలతోనే ప్రతి శుక్రవారం తిరుమలలో శ్రీవారికి అభిషేకం చేస్తారని చెప్పారు. వైకుంఠం క్యూ కాంప్లెక్స్‌లోని పిల్లలకు శ్రీ వేంకటేశ్వర డెయిరీ ఫారం నుంచి వచ్చే పాలనే పంపిణీ చేస్తున్నామని తెలిపారు. ఆ శ్రీమన్నారాయణుడే శ్రీకృష్ణుడి అవతారంలో జన్మించారని అందుకే శ్రీకృష్ణుడుకాచే గోవులను అంత పవిత్రంగా చూసుకోవాలని తెలిపారు. అంతకు ముందు తి.తి.దే.కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., తి.తి.దే. అధ్యక్షుడు శ్రీ డి.కె.ఆదికేశవులు కృష్ణుడికి పూజలు చేశారు. అనంతరం గోవుపేడతో చేసిన బొమ్మరిల్లు వద్ద పూజలు చేసి, ఏనుగులకు చెఱుకులు, పశువులకు గడ్డి తినిపించారు. పశ్చిమగోదావరి జిల్లా కడిమద్ద, బాపట్ల, కాకమాను కళాకారులు ప్రదర్శించిన కోలాటాలు, చెక్క భజనలు ఆద్యంతం ఆకట్టుకున్నాయి. ఈ కార్యక్రమంలో స్విమ్స్ డైరెక్టర్ డా॥ వెంగమ్మ, తి.తి.దే. పాలక మండలి సభ్యులు డా॥ చెవిరెడ్డి భాస్కరరెడ్డి, ఎస్వీ గోసంరక్షణశాల డైరెక్టర్ హరినాథరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## ఘనంగా మెట్లోత్సవం

అలిపిరి శ్రీవారి పాదాలమండపం వద్ద మెట్లోత్సవ కార్యక్రమం 09-01-2010న ఘనంగా జరిగింది. తి.తి.దే. దాససాహిత్య ప్రాజెక్టు ఆధ్వర్యంలో మెట్లోత్సవం సాగింది. ఈ సందర్భంగా వివిధ రాష్ట్రాల నుంచి 2 వేలమంది భక్తులు హాజరయ్యారు. స్థానిక శ్రీనివాస కల్యాణమండపాల నుంచి ప్రారంభమైన మెట్లోత్సవం అలిపిరి మార్గంగా కాలినడకన తిరుమలకు సాగిపోయింది. ఇందులో భాగంగా భక్తులు అలిపిరి పాదాలమండపం వద్ద ప్రత్యేక పూజలు నిర్వహించారు. కొబ్బరి కాయలు కొట్టి స్వామిని వేడుకున్నారు. మెట్టు మెట్టుకు పసుపు, కుంకుమ బొట్లు పెడుతూ మెట్లోత్సవం నిర్వహించారు. డప్పులు, వివిధ వాయిద్యాల సందడులు, కోలాటాలు, చెక్కభజనలు, హరి నామ సంకీర్తనలు, భక్తుల గోవిందనామ స్మరణలతో పాదాల మండపం మార్మోగింది. అనన్య భక్తపూరిత వాతావరణం చోటు చేసుకుంది. కార్యక్రమంలో దాససాహిత్య ప్రాజెక్టు ప్రత్యేకాధికారి ఆనంద తీర్థాచార్యులు పాల్గొన్నారు.

## సుదర్శన కౌంటర్ ప్రారంభం

తిరుమల శ్రీవారి దర్శనార్థం శ్రీవారిమెట్టు మార్గాన నడిచి వచ్చే భక్తుల సౌకర్యార్థం సుదర్శన టోకన్ కౌంటర్‌ను 01-01-2010న తి.తి.దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., ప్రారంభించారు. మార్గ మధ్యంలో 1200వ మెట్టు వద్ద ఈ కేంద్రాన్ని ఏర్పాటు చేశారు.

## మంగళంపల్లి కచ్చేరి

ప్రముఖ సంగీతకళాకారులు, తి.తి.దే.ఆస్థాన విద్వాంసులు డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ బృందం చేసిన కచేరి భక్తులను విశేషంగా అలరించింది. ఈ కచేరి 26-01-2010న తిరుమలలో నాద నీరాజనం వేదికపై జరిగింది. తి.తి.దే.ఆస్థాన విద్వాంసులుగా శాశ్వత ప్రాతిపదికన నియమితులైన అనంతరం మొదటిసారిగా మంగళంపల్లి కచేరి చేశారు. ఆయనను తి.తి.దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., ఘనంగా సత్కరించారు.

## ప్రముఖ సాహితీవేత్త 'జొన్నలగడ్డ' అస్తమయం!

ప్రముఖ సాహితీవేత్త, బహుగ్రంథకర్త జొన్నలగడ్డ మృత్యుంజయ రావు(84) రాజమండ్రిలో 09-01-2010న తుదిశ్వాస విడిచారు. తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్యాత్మిక గ్రంథాలకు అందించే ఆర్థిక సహాయపథకంలో వీరు గ్రంథ నిపుణులుగా పనిచేశారు.

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురించిన సవ్యాఖ్యాన కవిత్రయ మహాభారతంలో ఉద్యోగ, సౌప్తిక పర్వాలలో కొన్ని ఆశ్వాసాలకు రమణీయ వాఖ్యానాన్ని అందించారు. భారతం పునఃపరిష్కరణ పండిత పరిషత్తులో కూడా వీరు సభ్యులు. వీరి మరణం ఆధ్యాత్మిక, భక్తి సాహిత్యలోకానికి తీరని లోటు. వారి ఆత్మకు శాంతిచేకూరాలని ఆ దేవదేవుని ప్రార్థిస్తూ......

**సప్తగిరి**

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

   (పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : **చందాదారుని సంతకము**

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలుస్తున్నది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి ప్రసాదాలకు సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
0877 - 2264359
0877 - 2264543

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**
- మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- మా చిరునామా **"ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083".**

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

కలిగె నిదె నాకు కైవల్యము
తొలుత నెవ్వరికి దొరకనిది

జయ పురుషోత్తమ జయ పీతాంబర
జయ జయ కరుణాజలనిధి
దయ యెఱంగ నే ధర్మము నెఱఁగ నా-
క్రియ యిది నీదివ్యకీ ర్తనమే

శరణము గోవింద శరణము కేశవ
శరణు శరణు శ్రీజనార్దన
పరమ మెఱంగను భక్తి యెఱంగను
నిరతము నాగతి నీదాస్యమే

నమో నారాయణ నమో లక్ష్మీపతి
నమో పుండరీకనయనా
అమిత శ్రీవేంకటాధిప యిదె నా
క్రమమెల్లను నీకయింకర్యమే (2 - 466)





పురుషోత్తమా! కృపానిధీ! అని నీ నామములను కీర్తించుట తప్ప దయాధర్మములెట్టివో నాకు తెలియవు. గోవిందా, కేశవా, జనార్దనా అంటూ నీ శరణుజొచ్చి నీకు దాస్యము చేయుట తప్ప భక్తి జ్ఞానము లెట్టివో నాకు తెలియవు.

నారాయణా! లక్ష్మీవల్లభా! వేంకటరమణా! అంటూ నీ నామమును ఉచ్చరించడమే నా కైంకర్యము. ఇదే నాకు మోక్షము.

## మే పండుగలు

18 - తిరుపతి గంగజాతర

26 - శ్రీ నృసింహ జయంతి

27 - అన్నమాచార్య జయంతి,

శ్రీ కూర్మ జయంతి

## మీ మాట

### చాలా బాగుంది

ప్రతినెలా సప్తగిరి మాసపత్రిక లోని అన్ని వ్యాసాలు చాలా బాగుంటున్నాయి. ముఖ్యంగా ఉషశ్రీ భారతం విశేషంగా ఆకట్టుకుంటున్నది. మున్ముందు సప్తగిరిలో మరిన్ని శీర్షికలను వెలువరించగలరు.

*- జయంతి, బెంగుళూరు.*

### చెప్పనలవికాదు

సప్తగిరి పత్రికా పఠనం వల్ల కలిగే ఆనందం చెప్పనలవికానిది. ఫిబ్రవరి సంచిక ముద్రించిన తీరు చాలా చక్కగా ఉన్నది.

*- మునిగోటి కృష్ణమూర్తి, తిరుపతి.*

### మానసపుత్రిక

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని మానసపుత్రిక సప్తగిరి పత్రికను ఎంత వర్ణించినా తనివితీరదు. ఛాయా చిత్రాల మాట సరేసరి.

*- లయన్ కామరాజు పేర్ల, శ్రీకాకుళం.*

### ఆకట్టుకుంటున్నాయి

సప్తగిరి పత్రికలోని అన్ని విశేషాలు మమ్మల్ని ఆకట్టుకుంటున్నాయి. ముఖ్యంగా తిరుమల ఆలయం ధారావాహిక మమ్మల్ని చదివింప చేస్తోంది. శ్రీపదకేళి పిల్లలకు ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంటోంది.

*- పక్కి రాధా గోపాలకృష్ణ, పర్లాకిమిడి.*

### భక్తి తరంగం

తి.తి.దేవస్థానం మాసపత్రిక సప్తగిరి ఒక భక్త తరంగ సాధనం. అన్ని వ్యాసాలు ఆధ్యాత్మిక లోతుల్ని తరచి విశ్లేషిస్తున్నాయి. ఈ వ్యాసాలన్నీ ఎంతో పరిశోధనాత్మకంగా ఉండి, విశ్వవిద్యాలయ పరిశోధకులకు ఉపయోగపడుతున్నాయి.

వృషాద్రిపతిగారి సమాధానాలు ఎన్నో ధార్మిక సందేహాలను తీరుస్తున్నాయి. మీకు మా ధన్యవాదాలు.

*- ఆర్.రఘుభీర్‌సింగ్, ఆర్.సుగుణాబాయి, ఏలూరు.*

### ఉపకరిస్తుంది

సప్తగిరి మాసపత్రికలో బాలల కోసం 'బాలవాక్కు' శీర్షిక నన్ను విశేషంగా ఆకర్షిస్తోంది. ఇది పిల్లలకు ఎంతో ఉపకరిస్తుంది.

*-ఎస్.విశ్వనాథ, రామకుప్పం.*

### మార్గదర్శకం

సప్తగిరి పత్రికలో 'అక్షరామృతం' శీర్షికలో ప్రచురిస్తున్న వ్యాసాలు మాకు తెలీని విషయాలను ఎన్నింటినో తెలుపుతున్నాయి. ఇవి పరిశోధకులకు ఎంతో మార్గదర్శకంగా ఉంటున్నాయి.

*- డా॥ నిమ్మకాయల వేంకటసుబ్బారెడ్డి, ఆదినిమ్మాయపల్లె.*

### ఫలం అధికం

తి.తి.దే. విశేషాలను తెలిపే సప్తగిరి మాసపత్రిక కేవలం ఐదు రూపాయలకే పాఠకులకు లభిస్తోంది. వెల నేటి పత్రికలతో పోలిస్తే తక్కువే అయినా ఈ పత్రిక అందిస్తున్న ఆధ్యాత్మిక విజ్ఞానం చాలా అధికం. ముఖ్యంగా 'బాల వాక్కు', 'అక్షరామృతం' శీర్షికలు మమ్మల్ని బాగా ఆకట్టుకుంటున్నాయి.

*- డా॥ ఎన్.ఫణీష్ కుమార్, పుల్లంపేట.*

### కృతజ్ఞతలు

ప్రతి భక్తుడు భగవంతుడి వల్ల లాభం పొందినవాడే. మమ్మల్ని భగవంతుడు ఆపద సమయాల్లో ఆదుకుంటూనే ఉంటాడు. అయితే ఈ విషయాలను పత్రికల ద్వారా పంచుకునేటట్లు మీరు 'శ్రీ వేంకటేశ్వర లీలలు' శీర్షికద్వారా అవకాశం కల్పిస్తున్నందుకు కృతజ్ఞతలు.

*-బి. గురుకుమార్ రెడ్డి, తిరుపతి.*

### ఆత్మానందం

సప్తగిరి పుస్తకం కొరకు ఎదురు చూస్తూ, రాగానే పేజీలు తిప్పి స్వామి వారిని చూసి తృప్తి చెందుతాను. ఆపై ప్రశాంతంగా ఒక్కొక్క వ్యాసం చదివి ఆనందపడతాను. వయోభారంచేత స్వామి వారి కార్యక్రమాలను తిరుమలకు వచ్చి స్వయంగా చూడలేని మాలాంటి వారికి రంగుల చిత్రాల ద్వార మా ముంగిటకు సప్తగిరిని పంపి మాకు ఆత్మానందాన్ని కలిగిస్తున్నందుకు కృతజ్ఞుణ్ణి.

*- వి. సూర్యప్రకాశరావు, నర్సారావు పేట.*

### తిరుమల లడ్డు

ఫిబ్రవరి నెల సంపాదకీయంలో తిరుమల లడ్డు గురించి మంచి విషయాలు తెలిపారు. ఉషశ్రీ 'భారతం' ఎంతో ఉత్సాహంగా సాగుతోంది.

*- వి.దామోధర్‌రావు, హైదరాబాదు.*

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

# సప్తగిరి


తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 40 ఏప్రిల్, 2010 సంచిక : 11


**ప్రత్యేక వ్యాసాలు**



**ధారావాహికలు**



**బాలవాక్కు**



**అక్షరామృతం**



**శ్రీ వేంకటేశ్వర లీలలు**



**మన దేవాలయాలు**



**గృహలక్ష్మి**



**బాలప్రబోధం**



మాటల్లోని కటువును కాదు చూడవలసింది,
మనసులోని మృదుత్వాన్ని...



ముఖ చిత్రం :
**ఆనందనిలయుడు**

చివరి పుట :
**చతుర్ముఖ బ్రహ్మ** (తిరుమల వేదపాఠశాల)




***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083,
ఫోను : 0877-2264543



విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**విదేశాలకు**
సం॥ చందా -- రూ. 850-00

**సంపాదకీయం**

# ఆత్మహత్య మహాపాపం

ఈ విశ్వంలోని సకల జీవరాశుల్లో మానవుడు ఉత్తమోత్తమ జీవి. ఎంతో పుణ్యఫలం వల్లనే మానవ జన్మ లభిస్తుందని పురాణాలు చెబుతున్నాయి. అలాంటి విశిష్ట మానవ జన్మ లభించినప్పుడు దాన్ని భగవత్సేవకు, సమాజసేవకు, స్వధర్మ నిష్ఠకు, మోక్షసాధనకు అంకితం చేయాలే తప్ప మధ్యలో కసుగాయను తుంచినట్లు జీవితాన్ని తుంచరాదు. ఆత్మహత్య మహాపాపమని వేదశాస్త్రాలు ఘోషించాయి. మహాపాతకాల్లో ఆత్మహత్య ఒకటి. ధర్మసాధనాల్లో శరీరం ప్రధాన సాధనమని చెప్పిన శాస్త్రవాక్యాన్ని ఉల్లంఘించి, భవిష్యత్తుపై ఆలోచన లేకుండా, తాత్కాలిక ఆవేశనిర్ణయాలతో నిండు జీవితాన్ని మధ్యలోనే కోల్పోవడం దురదృష్టకరం.

పుట్టినవారు గిట్టడం తప్పదు గానీ, ఆ గిట్టడం సహజంగా జరగాలి. క్షేత్రాలు, తీర్థాలు దేవతా సాన్నిధ్యాలు తెలిసీ తెలియక చేసిన పాపాలను ప్రక్షాళనం చేసుకునే పవిత్రస్థానాలు. కనుక పుణ్యక్షేత్రాలకు వెళ్ళినప్పుడు అన్ని చీకుచింతల్ని, దురలవాట్లని వదలి ప్రశాంత మనస్సుతో అక్కడి క్షేత్ర, తీర్థదేవతా ప్రభావాల్ని గుర్తించి తను చేసిన తప్పులకు పశ్చాత్తాపం చెంది మారిన మనస్సుతో పరిశుద్ధ, ప్రశాంత జీవనానికి నాంది పలకాలి. అంతేగానీ అకాలమృత్యువును ఆహ్వానించడం అజ్ఞానం.

**అన్యక్షేత్రే కృతం పాపం, పుణ్యక్షేత్రే వినశ్యతి**
**పుణ్యక్షేత్రే కృతపాపం, బ్రహ్మలోకే న నశ్యతి**

ఇతర స్థలాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్రదర్శన నివాసాలతో నశిస్తుంది. కానీ పుణ్యక్షేత్రంలోనే పాపం చేస్తే ఇక దాన్ని తొలగించుకోవడం ఎన్ని జన్మలకైనా సాధ్యం కాదు. అందుకే మరణం పండిన దోసకాయ తొడిమ నుండి తనంతట తానే తొలగినట్లుగా ఉండాలి. మరణం సుఖంగా, సులువుగా, ఆనందంగా రావాలని మహామృత్యుంజయ మంత్రం సూచిస్తున్నది. జీవించి ఉంటేనే సుఖాలు, శుభాలు కలుగుతాయి. ఆత్మహత్యల వల్ల తన కుటుంబం, మిత్రులు, అందరూ దుఃఖాల పాలవుతారు. ఆత్మహత్య వల్ల శరీరాన్ని విడిచిన జీవుడు పుణ్యపాపాది ఏ లోకాలకూ పోలేక గాలిలోనే తిరుగుతుంటాడని పురాణాలు చెబుతున్నాయి. కనుక ఏ విధంగా చూచినా ధర్మసాధనమైన ఈ శరీరాన్ని సహజ మరణం పొందేట్లుగా చూడాల్సిన బాధ్యత వ్యక్తిపైననే ఉంది. సమస్యలకు భయపడి పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్య చేసుకున్నంత మాత్రాన జీవుడు పుణ్యలోకాలకు పోతాడనుకోవడం అవివేకం.

పుణ్యక్షేత్రాలకు వచ్చి ఆత్మహత్య చేసుకుంటే తమకు పుణ్యం లభిస్తుందనే అపోహతో కొందరు పుణ్యస్థలాల్లో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఈ భావన కేవలం భ్రమే కానీ సత్యం కాదు. ఇలాంటి అకృత్యాలు చేయడం వల్ల నిజమైన భక్తుల మనోవిశ్వాసాలను దెబ్బతీయడమే అవుతుంది. పుణ్యక్షేత్రాలపై మానవులకున్న భక్తి విశ్వాసాలకు ఈ దుశ్చర్యలు గొడ్డలిపెట్టు అవుతాయి. జీవనం ఆనందానికి, ధర్మానికి, భక్తిజ్ఞానాలకు నిలయం కావాలి గానీ, ఆత్మవిలయం కాకూడదు.

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

# పురాణాలలో ఏమున్నది?

డా॥ చలసాని సుబ్బారావు

భారతదేశం అతి ప్రాచీనమైన దేశం. ఈ గడ్డపై పుట్టి పెరిగిన వారికి దీర్ఘకాలీన చరిత్ర ఉంది. మనం కళాశాలల్లో చదువుకునే చరిత్ర కందనిదీజాతిగత జీవితం. పాశ్చాత్యులనేక మంది ఈ దేశ ప్రాచీనతను నమ్మలేరు. కారణం భారతీయుల చరిత్రలో చాలాభాగం ఆధునిక దేశాల చరిత్ర ఆరంభమయ్యే నాటికి గడిచిపోయింది. ఆ మహత్తర చరిత్ర, చరిత్రలో రాణించిన సాహిత్య-సంస్కృతులు, జ్ఞానవిజ్ఞానాలు కొంతవరకైనా గ్రహించాలంటే వారి వేదాలు, పురాణాలు, రామాయణ-భారతాలు మొదలైనవాటిని పరిశీలించవలసి ఉంటుంది. ఈ విషయంలో పురాణాల ప్రయోజనం అంతా ఇంతా కాదు. వాటి ప్రాధాన్యం హెచ్చుగా ఉంది. ఈ దేశంలో ఈనాటికి ఎన్నో సంఘర్షణలకులోనై మనుగడను స్థిరపరచుకొనియున్న ఆధ్యాత్మిక సంస్కృతి ఈ పురాణాల ద్వారా లభించిన దోహదం మనమీనాడు అంచనా వేసికొనేందుకు పూర్తిగా వీలుపడదు. రామాయణ-భారత-భాగవతాది ధర్మగ్రంథాలకు సైతం ఈ పౌరాణిక సాహిత్యమే ఆధారశిలగా రాణించింది.

పురాణాలంటే ఏమిటి? పురాణం జాతికి చరిత్ర కాని చరిత్ర; చరిత్రను మించిన చరిత్ర; కావ్యత్వంతో కూడిన చరిత్ర; చారిత్రక ప్రయోజనాలు నింపుకున్న కావ్యం. అది అతి ప్రాచీన కథ కాబట్టే పురాణం అనిపించుకుంది. కనుక పురాణాల్లో జాతియొక్క ప్రాచీనచరిత్ర, సంస్కృతి, సభ్యతలతోపాటు భగవదవతారాల వివరాలు, దేవస్తుతి, సృష్టి రచన, యుగ మన్వంతరాల వివరం, మహర్షుల జీవితం, రాజవంశాల చరిత్ర, దేవ-దానవుల యుద్ధాలు, వారి జీవనసరళి, ధార్మిక మనస్తత్వం, యజ్ఞయాగాదులు, తీర్థస్థాన ప్రశస్తి, గురుకులాలు, శాస్త్రాధ్యయనం, మొదలైన విషయాలెన్నో అతిసామాన్య శైలిలో, సరళ భాషలో, విశదంగా వర్ణించబడి ఉన్నాయి.

నిజంగా వేదాలకు పురాణాలు సిద్ధాంత లక్ష్యాల దృష్ట్యా భిన్నాలుకాదు. వాటికవి పూరకాలు కూడాను. వేదవ్యాసమహర్షి వేదాల లక్ష్యసిద్ధిని మరింత సరళం చేసేందుకు వాటిలో ప్రతిపాదితమైన ఆశయాలకు సరళభాషలో కథాత్మక రూపాన్నిచ్చి జనరంజకమైన పురాణాలు సృజించాడు; సంకలితం చేశాడు. వేదజ్ఞానాన్ని మనం పురాణాలద్వారా సులభంగా అర్థం చేసుకుంటున్నామన్న మాట.

పురాణాలు 18. ఉపపురాణాలు కూడ అన్నే ఉన్నాయి. మొత్తం ఇవి సంఖ్యరీత్యా 36గా మనకున్నాయి. అవన్నీ వ్యాసప్రోక్తాలే. సుమారు 7 లక్షల శ్లోకాలు కలిగిన ఈ పురాణ సాహిత్యం నిజంగా ఈ దేశీయులమైన మనం గర్వించదగింది. ప్రపంచంలో మరేజాతికి ఒకే తరగతికి చెందిన ఇంత విస్తృత సాహిత్య భాండారం లేదంటే అతిశయోక్తి కాదు. పురాణాలలోనే చెప్పబడిన దాన్నిబట్టి అసలు వీటన్నిటిలో శతకోటి శ్లోకాలున్నట్లు వాటి సారాన్ని వ్యాసమహర్షి భూలోకంలో నాలుగు లక్షలకు కుదించి 18 మహాపురాణాలుగా రూపొందించినట్లు తెలుస్తుంది. ఈ పురాణ సాహిత్యం వేదాలకు సమకాలికమనీ, కొన్ని పురాణాలు వేదాలకు ముందునుండి ఉన్నట్లు కూడా మత్స్యపురాణం చెపుతూంది. అయితే ఈ వ్యాసంలో చారిత్రక విలువలధికంగా కలిగియున్న మహాపురాణాలకు మాత్రం, సంక్షిప్తంగా పరిచయమిది.

## 1. బ్రహ్మపురాణం :

ఇది ప్రాచీనమైన మొదటి మహాపురాణంగా పరిగణింపబడుతూంది. ముఖ్యంగా సృష్టికర్తను స్తుతించిన ఈ పురాణంలో సూర్య-చంద్ర వంశపు రాజుల చరిత్ర, వారి వివరాలు; మనకు తెలియని అనేక పుణ్యతీర్థాల వర్ణనలు విస్తారంగా ఉన్నాయి. ఈ పురాణం ధర్మం సాధనే జీవితపరమావధి అని బోధిస్తుంది. చతుర్వర్ణాలు-వాటిధర్మాలు, చతుర్విధ ఆశ్రమాలు-వాటి ధర్మాలు, సాంఖ్య-వేదాంతదర్శనాల ప్రాముఖ్యం, ఈశ్వరుని ప్రస్తావన, పార్వతీదేవి చరిత్ర, పితృశ్రాద్ధాల వివరణ, జన్మ మరణాల చర్చ, మృత్యువు తర్వాత ప్రాణిస్థితి మొదలైన విషయాలెన్నో దీనిలో ఆసక్తిదాయకంగా చెప్పబడ్డాయి. ఇది కాక బ్రహ్మపురాణంలో భక్తికి ప్రత్యేక ప్రాముఖ్యమిచ్చిన కథ

లెన్నో చెప్పబడినాయి. మహాభాగవతంలో వలె దీనిలో శ్రీకృష్ణ లీలలు కూడ విస్తారంగా వర్ణించబడి ఉన్నాయి. ఇది కొంత వరకు సిద్ధాంత నిర్వహణలో అధికంగా మహాభారత గ్రంథ రచనను ప్రభావితం చేసినట్లు కనబడుతుంది.

## 2. పద్మపురాణం :

బ్రహ్మపురాణం వలే ఇది కూడా ముఖ్యంగా బ్రహ్మ దేవున్నే స్తుతించింది. ఇది ఐదు ఖండాలు గల మహాపురాణం. మొదటిదైన సృష్టిఖండంలో చరాచర జగత్తు ఎలా ఆరంభించ బడిందో వివరింపబడింది. ఇది భీష్మునికి పులస్త్యబ్రహ్మ ద్వారా విపులంగా విశదీకరించబడింది. ఆ తర్వాత వరుసగా పుష్కర తీర్థమహాత్మ్యం, బ్రహ్మ నిర్వహించిన యజ్ఞాలు, వాటిలో చేసిన దానాలు, వాటి ఫలితాలు, శివపార్వతుల వివాహం, కుమార స్వామి జననం, తారకాసుర వధ, శ్రీరామచంద్రుని కథ, వృతా సుర వధ మొదలగునవి ప్రముఖంగా వర్ణించబడినాయి.

రెండవది భూమిఖండం. దీనిలో ప్రథమంగా తల్లి దండ్రుల సేవచేసి స్వర్గలాభాన్ని పొందిన బ్రాహ్మణుడు శివ శర్మకథ చెప్పబడింది. ఇదికాక పృథుమహారాజు, చ్యవన మహర్షి, యయాతి చక్రవర్తుల గొప్పతనాన్ని చాటే కథలతో పాటు సుకలాదేవి పాతివ్రత్య విశిష్టత వర్ణింపబడింది.

మూడవది స్వర్గఖండంలో బ్రహ్మాండవర్ణన, శకుంతల కథ, కురుక్షేత్రాది పుణ్యతీర్థాల మహాత్మ్యం, వర్ణధర్మాల ప్రాముఖ్యం, జీవనతత్వాన్ని గురించి వ్యాస జైమినీ మహర్షుల సంవాదం, క్షీరసాగర మథన కథ, వ్రతనిర్వహణవల్ల కలుగు సుఫలితాలు మొదలైనవెన్నో ఆకర్షణీయంగా చెప్పబడి ఉన్నాయి. మరొక విషయం మహాకవి కాళిదాసు రచించిన నాటక-కావ్యా లకు ఈ పురాణంలోని విషయాలే ఆధారమని ప్రతీతి.

నాల్గవది పాతాళఖండం. దీనిలో ప్రధానమైనది పాతాళలోకవర్ణన. పాతాళం మన ప్రాచీనులు చెప్పిన 14 లోకాల్లో ఒకటి. దీనితోపాటు ముఖ్యంగా శ్రీరామచంద్రుని రాజ్యాభిషేకం, అశ్వమేధయజ్ఞం వర్ణింపబడినాయి. మహర్షు లైన పులస్త్యుడు, దధీచి, గౌతముడు మొదలైన వారి కథలు, కృష్ణ లీలలు, ఈ ఖండంలో చోటు చేసికొని ఉన్నాయి.

ఐదవది ఉత్తరఖండంలో భక్తిప్రబోధకాలైన గాథలెన్నో ఉన్నాయి. ముఖ్యంగా దీనిలో వైష్ణవభక్తికి ప్రాముఖ్య మివ్వ బడింది. ఏకాదశీ మహాత్మ్యం, గీతామహిమ, కార్తీకమాఘ మహాత్మ్యం, శ్రీరామకృష్ణావతారాల కథలు, అనేకమంది విష్ణు భక్తుల కథలు ఈ ఖండంలో వర్ణితాలు. రామభక్తుడైన హిందీ మహాకవి గోస్వామి తులసీదాసు తన రామాయణ రచనకు ఈ పురాణంపైన్నే ఎక్కువ ఆధారపడినట్లు చెపుతారు.

## 3. విష్ణుపురాణం :

ఈ మహాపురాణం గ్రంథ విస్తరణ దృష్ట్యా కొంచెం చిన్నదిగానే ఉంటుంది. అయినా జ్ఞాన ప్రతిపాదనరీత్యా, సాహి త్యక విలువల దృష్ట్యా ఉత్కృష్టమైనదిగానే భావించబడుతున్నది. దీనిలో ముఖ్యంగా ఆరుభాగాలు మనకు గోచరిస్తాయి. మొదటి భాగంలో సృష్టివర్ణనతో పాటు ధ్రువుని చరిత్ర,ప్రహ్లాదుని చరిత్ర వర్ణించబడ్డాయి. రెండవభాగంలో భూగోళ విజ్ఞానం చెప్ప బడింది. మూడవభాగంలో బ్రహ్మచర్య-గార్హస్థ్య-వానప్రస్థ- సన్యాసం అను నాల్గు ఆశ్రమధర్మాలను గురించి వివరంగా ప్రబోధింపబడింది. నాల్గవభాగంలో చంద్రవంశపు రాజుల చరిత్ర, ఐదవభాగంలో మరల శ్రీకృష్ణుని లీలలు వర్ణించబడి నాయి. ఇక ఆరవభాగంలో భక్తిని గురించి విపులంగా చర్చింప బడింది. విష్ణుపురాణం విష్ణుభక్తిని ప్రధానంగా ప్రబోధించినట్లు కనబడుతుంది.

## 4. వాయుపురాణం :

దీనినే కొందరు శివపురాణంగా పరిగణిస్తారు. పేర్లు భిన్నమైనా ప్రతిపాదిత విషయం ఈ రెంటిదీ ఒకటే. మొత్తం మీద ఇది శైవులకు ఆరాధ్యపురాణం. దీనిలో శివరాత్రి మహిమ, శివసహస్రనామాలు పరమశివతత్త్వాన్నుండి త్రిదేవ తలు ఆవిర్భవించుట, జ్యోతిర్లింగోత్పత్తి, సతీదేవికథ, పార్వతి జన్మ, శివపార్వతుల వివాహం, త్రిపురాసురవధ, కాశీక్షేత్ర మహా త్మ్యం, ఇంద్రనీలపర్వతంపై శివునికొరకై అర్జునుని తపస్సు మొదలగునవెన్నో గాథలు అతిమనోజ్ఞంగా రచించబడినాయి. ఈ పురాణంలో కొంతభాగం కాలగర్భంలో కలిసిపోయినట్లు పండితులు భావిస్తున్నారు.

## 5. మార్కండేయపురాణం:

మార్కండేయుడు గొప్ప శివభక్తుడు, పురాతన యుగానికి చెందిన మహర్షి, చిరంజీవి. ఇది 9,000 శ్లోకాలు కలిగి ఉన్న బృహత్ గ్రంథం. ఈ పురాణంలో ధర్మజ్ఞులకు, భక్తులకు ఎంతో అభిమానపాత్రమైన రచన 'దుర్గాసప్తశతి', మదాలస చరిత్ర, ఇక్ష్వాకుచరిత్ర, తులసీచరిత్ర, కుశవంశచరిత్ర మొదలైనవి విశదంగా వర్ణింపబడి ఉన్నాయి. దుర్గాస్తవంతో పాటు దీనిలో సృష్టి-రచనాక్రమం, సూర్య-చంద్ర వంశ రాజుల చరిత్ర, శ్రీరామకథ కూడ వర్ణింపబడినాయి. ఇవి కాక పురాణాల రచనా సంబంధిత విశేషాలు, సాంఖ్యదర్శన సిద్ధాంత విశేషాలు విశేషంగా చర్చించబడి ఉన్నాయి. మార్కండేయుని చరిత్ర కూడ ఇందులో వర్ణితమై ఉంది.

## 6. లింగపురాణం :

లింగరూపంలో శివుని పూజావిధానం విస్తారంగా వర్ణించబడి ఉన్నది కాన దీన్ని లింగపురాణ మన్నారు. ఇది పరమశివుని గురించి అనేక వివరాలనందజేస్తూంది. ఈ కారణంగా శైవులకిది ఆరాధ్యగ్రంథం. దీనిలో పరమశివుని 28 అవతారాలు, తీర్థస్థలాలు, ఉపమన్యుని కథ, సనత్కుమారుల కథ, దానధర్మాల ప్రాశస్త్యం, శ్రాద్ధకర్మలు, ఆదిత్య పూజ, మొదలగు విషయాలెన్నో సవిస్తరంగా వర్ణించబడి ఉన్నాయి. రుద్రాక్షమాల యొక్క విశిష్టతను ఇందులో అమోఘంగా వర్ణించి చెప్పారు.

## 7. స్కందపురాణం :

పార్వతీపరమేశ్వరుల పుత్రుడైన స్కందుడు చెప్పాడు కనుక దీనికీపేరు వచ్చింది. ఏడు ఖండాలు గల ఈ పురాణం కొంచెం పెద్దది. దీనిలో శివపార్వతుల లీలలు, ఒరిస్సాలోని జగన్నాథ దేవాలయమందలి ఉపాసనావిధులు, కాశీక్షేత్ర మహత్త్వం, ఉజ్జయినీలోని మహాకాల తీర్థ ప్రాముఖ్యం, ధర్మారణ్య తీర్థప్రశస్తి, నర్మదా-తపతీ నదుల పరిసర క్షేత్ర విశేషాలు, సత్యనారాయణ వ్రతకథ, సౌరాష్ట్రీయ పుణ్యతీర్థాల వివరణ, ద్వారకలోని ప్రభాస క్షేత్రమహిమ, హాటకేశ్వర మహాదేవుని కథ, నాడీజంఘుని కథ, మహిషాసుర వధ, నాగర బ్రాహ్మణ ప్రశంస మొదలైన విషయాలెన్నో మనకీ పురాణంలో విశదంగా లభిస్తున్నాయి.

### క్యూ కాంప్లెక్స్‌లో సౌకర్యాలు

భక్తులు క్యూహాళ్ళలో వేచివుండే సమయాన్ని తగ్గించేందుకు దేవస్థానం సుదర్శన టోకను పద్ధతి ప్రవేశ పెట్టింది. అంతేగాక క్యూహాళ్ళలో భక్తులకు ఈ క్రింది సౌకర్యాలు కూడ లభిస్తాయి.

1) క్యూహాళ్ళు విశాలంగా, పరిశుభ్రంగా, పంకాలతో ఉంటాయి.

2) దేవస్థానం క్యాంటీనుద్వారా ఉచిత ఆహార సదుపాయం.

3) వైద్యసదుపాయం; మరుగుదొడ్ల సౌకర్యం;పాదరక్షలను ఉచితంగా భద్రపరచే సౌకర్యం;ధార్మికకార్యక్రమాల ప్రసారం.

4) వైకుంఠం క్యూ కాంప్లెక్సు వద్ద సామానులు భద్రపరచుకునే గది; క్యూ కాంప్లెక్సులలో క్లోజ్‌డ్ సర్క్యుట్ టి.వి. సౌకర్యం.

5) దళారీలు, ఇతరుల వల్ల భక్తులు మోసపోకుండా ఉండేందుకు ఆలయ మహద్వారం వద్ద ఒక ప్రత్యేక అధికారి నియామకం.

## 8. నారదపురాణం :

ఇది వైష్ణవ భక్తులకు ప్రియమైన పురాణం. చారిత్రక విలువలు అధికంగా కలిగి ఈ పురాణం ముఖ్యంగా విష్ణు భక్తిని ప్రబోధిస్తూంది. ఇది రెండు భాగాలుగా రచించబడింది. మొదటిభాగంలో సృష్టివర్ణన, మోక్షసాధనాల వివరణ, భక్తి కున్న వ్యావహారిక విలువలతోపాటు వ్యాకరణం, జ్యోతిషం, ఛందస్సు, నిరుక్తం మొదలగు శాస్త్రాలను గురించి కూడ విపులంగా చర్చించబడింది.

ఇక రెండవభాగంలో వశిష్ఠ-మాంధాత మహర్షుల సంవాదం, గంగా యమునా నదుల వర్ణన, కాశీ-ప్రయాగ-

కురుక్షేత్రం-హరిద్వారం మొదలగు తీర్థస్థలాల మహత్తు, ఏకాదశీవ్రత మాహాత్మ్యం విపులంగా వర్ణించబడినాయి. మొత్తం మీద ఈ పురాణం నారదమహర్షిచే ప్రవచింపబడి అద్వితీయమైన విష్ణుభక్తిని ప్రతిపాదిస్తూంది.

## 9. శ్రీమద్భాగవతపురాణం :

భక్తితత్త్వానికి సంబంధించినంతవరకు ఈ పురాణమొక రసవత్తర మహాకావ్యం. 12 స్కంధాల్లో చెప్పబడిన ఈ వైష్ణవ పురాణగ్రంథం నిజంగా వేదశాస్త్ర సారమని పండితులకంటే ఈ భాగవత పురాణం అత్యధిక లోకప్రియమైన గ్రంథంగా గౌరవింపబడుతూంది. దీనిలో సృష్ట్యారంభ వర్ణనతో పాటు శ్రీకృష్ణుని చరిత్ర, కృష్ణభక్తుల గాథలు ప్రముఖంగా వర్ణించబడ్డాయి. ఈ వర్ణనలను ఆధారం చేసుకునే అనేకమంది భక్తులు కృష్ణభక్తిని ప్రకటించే మహత్తర కావ్యాలెన్నో రచించారు. హిందీలో ప్రముఖ కృష్ణభక్తుడైన మహాకవి సూరదాసు తన 'సూరసాగర' అను బృహత్కావ్యాన్ని ఈ పురాణం ఆధారంగానే రచించాడు. వాస్తవంగా మహాభాగవత లక్ష్యం జ్ఞాన-భక్తి సమన్వయమే అయినా అనేక కథల ద్వారా భక్తి ప్రాశస్త్యాన్నే ఇది చాటి చెపుతూంది.

## 10. బ్రహ్మవైవర్తపురాణం :

భాగవతపురాణం వలే బ్రహ్మవైవర్త పురాణం కూడ కృష్ణభక్తిని ప్రతిపాదిస్తూంది. దీన్ని వైవర్తపురాణం అని కూడా అంటారు. రాధాకృష్ణుల భక్తిని ప్రబోధించడం దీని పరమోద్దేశ్యం. ఈ పురాణం బ్రహ్మఖండం, ప్రకృతిఖండం, గణేశ ఖండం, కృష్ణజన్మ ఖండం అని నాల్గుఖండాలుగా రచించబడింది. మొదటిదైన బ్రహ్మఖండంలో శ్రీకృష్ణుని మహిమ వర్ణించబడింది. శ్రీకృష్ణుడే సంపూర్ణ బ్రహ్మాండానికి స్రష్టగా, సృష్టికర్తగా స్తుతించబడ్డాడు. రెండవదైన ప్రకృతిఖండంలో రాధకృష్ణుని శక్తిగా వర్ణించబడింది. కృష్ణుని ఆదేశానుసారం రాధాలక్ష్మీ-సరస్వతీ-పార్వతుల రూపాలు ధరించి భగవంతునికి సేవచేసినట్లు చెప్పబడింది. ఈ పురాణం ప్రకారం కృష్ణుడు పరబ్రహ్మ. ఈ ఖండంలో సావిత్రీ-తులసీ దేవిల కథలు కూడ ఉన్నాయి. మూడవదైన గణేశ ఖండంలో శ్రీ విఘ్నేశ్వరుని చరిత్ర, నాల్గవదైన కృష్ణజన్మ ఖండంలో శ్రీకృష్ణుని భవ్య జీవితం వర్ణించబడి ఉన్నాయి.

## 11. మత్స్యపురాణం :

ఇది అవతార గాథకు సంబంధించిన పురాణం. మత్స్యం విష్ణుదేవునకు మొదటి అవతారం. ఈ గాథతోపాటు దీనిలో రాజధర్మం, రాజనీతి, పితృవంశావళి, ఋషివంశావళి, శ్రాద్ధకర్మల స్వరూపం, విగ్రహ లక్షణాలు, శిల్పవిధి, సహస్రార్జునుని కథ, విష్ణువుకు భృగుమహర్షి ఇచ్చిన శాపం, దానధర్మాల ప్రశస్తి, జప-తపాల ప్రాశస్త్యం పరమశివుని చరిత్ర మొదలైనవి ఇందులో విస్తృతంగా వర్ణితమై ఉన్నవి.

## 12. కూర్మపురాణం :

ఇది కూడ విష్ణుమూర్తి అవతారాలకు సంబంధించిన కథ. ఈ కథతోపాటు ఈ పురాణం శివకేశవుల ఏకత్వాన్ని లక్షిస్తూ ఇరువురి గొప్పతనాలను సమస్థితిలో వర్ణించింది. అభేదాత్మక దృష్టిలో ఈ పురాణం దేవతలందరికి సమాన గౌరవాన్ని అందజేసింది. దీనిలో మతపరమైన సంప్రదాయిక దృక్పథం ఏ మాత్రం కన్పించదు. ఇదికాక కాశీక్షేత్ర మహిమ, ప్రయాగ మహాత్మ్యం, ఈశ్వరీగీత, వ్యాసగీత, వ్యాసునిచరిత్ర, వ్యాసనామావళి మొదలైనవి దీనిలో చోటు చేసుకున్నాయి.

## 13. వరాహపురాణం :

విష్ణు భగవంతుని వరాహావతారాన్ని గురించి చెపుతూందీ పురాణం. అయితే ఇది మనకు పూర్తిగా లభించడం లేదు. దాదాపు సగభాగం మాత్రమే వెలుగులో ఉంది. వరాహావతార కథతో పాటు శ్రీకృష్ణుని లీలాభూమి బృందావన గాథ, నచికేతుని కథ, మదురలోని తీర్థ స్థలాల మహాత్మ్యం, వ్రత ధర్మాచరణవిధి, వ్రత ఫలితాలు మొదలగు విషయాలిందులో వర్ణితాలు.

## 14. వామనపురాణం :

ఇది వామనావతార కథ. దీనిలో వామనుని అవతారానికి చారిత్రకంగా కొంత ప్రత్యేకత చూపెట్టబడింది. ఈ అవతార కథకు పూర్వాపరాలు, కార్యకారణాలు ఈ పురాణంలో సవిస్తరంగా చెప్పబడ్డాయి. ఇది కాక దీనిలో శివుడు, వినాయకుడు, కార్తికేయుడు మొదలగు వారి చరిత్రలు, జాబాలి మహర్షి కథ, ప్రహ్లాద-బలిచక్రవర్తుల సంవాదం. కురుక్షేత్ర వర్ణన విశేషంగా కన్పిస్తాయి.

## ఆర్జితసేవా గృహస్థులకు సూచనలు

★ సేవ ఉత్సవంలో పాల్గొనే గృహస్థు తప్పనిసరిగా ధోవతి, ఉత్తరీయం ధరించాలి. వారు వైకుంఠం క్యూ ద్వారా మాత్రమే చాలాముందుగా ప్రవేశించాలి.

★ గృహస్థులు తమకు వచ్చే దధ్యోదనం, పులిహోర మున్నగు అన్న ప్రసాదాలను పరిమితిగా తీసుకోవచ్చు. మిగిలిన ప్రసాదాలు వారి కోరిక మేరకు ఉచితంగా యాత్రికులకు పంచుతారు.

★ ఆణివార ఆస్థానం,పుష్పయాగం,వార్షిక వసంతోత్సవం, వార్షిక బ్రహ్మోత్సవం, ఉగాది ఆస్థానం, మకర సంక్రాంతి మున్నగు విశేష ఉత్సవాలు జరిగే రోజుల్లో కొన్ని సేవలు రద్దు చేస్తారు. ఆయా తేదీలు తి.తి.దేవస్థానం క్యాలెండరు, పంచాంగం ద్వారా తెలుసుకోవచ్చు. ఆ యా ఉత్సవాల రోజుల్లో ఆర్జిత సేవా టిక్కెట్లు అమ్మరు.

★ సేవా టిక్కెట్టులో వివరాలు గృహస్థు క్షుణ్ణంగా చదివి తెలుసుకోవాలి. ఏవైన ఇబ్బందులు ఉంటే **"ఆర్జితం ఆఫీసు లేదా విచారణా కేంద్రం"** సహకారం కోసం సంప్రదించవచ్చు.

★ శ్రీవారి దర్శనంలో గృహస్థులు సంప్రదాయ దుస్తులు ధరించాలి. ఆలయ ఉత్సవాల కోసం వైకుంఠం క్యూలో ప్రవేశించే సమయాలను మారుస్తూ కొన్ని వేళల్లో దేవస్థానం చేస్తున్న ప్రకటనలను గృహస్థులు జాగ్రత్తగా వినాలి.

**ఆర్జితసేవ కౌంటరు** – ఫోన్ : 0877 – 2263277 మరియు 0877 – 2263679

### 15. అగ్నిపురాణం :

అగ్ని పురాణం శాస్త్రీయత, సైద్ధాంతికతరీత్యా విలువైనది. దీనిలో భగవంతుని అవతారాలు, దేవాలయ నిర్మాణ శాస్త్రం, విగ్రహనిర్మాణ శాస్త్రం, విగ్రహారాధన విధి, వేదాంత దర్శనం, యోగశాస్త్రం, గీతాశాస్త్రం, వ్యాకరణ- ఆయుర్వేద- జ్యోతిష-ఛందోలంకార శాస్త్రాలు, రాజనీతిశాస్త్రం, రత్న విజ్ఞానం, గోవిజ్ఞానం మొదలైన శాస్త్రాలు ఈ పురాణంలో అతిసరళ భాషలో బోధింపబడినాయి. ఇన్ని శాస్త్రీయ విషయాలున్న ఈ పురాణం అసలైన శాస్త్ర-జ్ఞాన సంకలన గ్రంథంగా భాసిస్తూంది.

### 16. భవిష్యపురాణం :

ఈ పురాణం భవిష్యత్తు గురించి చెపుతుంది. ఇక ముందు జరుగబోయే అనేక సంఘటనలను గురించి చర్చించింది. అందుకే దీనికి భవిష్యత్ పురాణమని పేరు వచ్చింది. 5 పర్వాలలోనున్న ఈ పురాణం సృష్టిరచన, సర్వయుగాలలో మానవుల ధర్మాలు, సూర్యారాధనా పద్ధతి, పూజాఫలం మొదలగువాటిని గురించి విశదంగా తెలియజేస్తుంది.

### 17. బ్రహ్మాండపురాణం :

దీనిలో విశ్వాన్ని గురించి విపులంగా చెప్పబడింది. సంపూర్ణ విశ్వాన్ని గురించి ఈ పురాణంలో చెప్పబడినన్ని విషయాలు మరే పురాణంలోనూ కానరావు. భూగోళ శాస్త్రజ్ఞులకు, భూగర్భ శాస్త్రజ్ఞులకు, ఖగోళ శాస్త్రజ్ఞులకు ఇదెంతో ప్రయోజనకరమైన గ్రంథం.

### 18. గరుడపురాణం :

ఈ పురాణంలో విష్ణువు నుండి గరుడుడు సృష్టికథ విన్నాడు. అగ్నిపురాణం వలె ఇదికూడ అనేక విద్యలను, శాస్త్రాలను బోధిస్తూంది. రత్నపరీక్ష, రాజనీతిశాస్త్రం, అలంకార ఛందో విజ్ఞానం, సాంఖ్య-యోగశాస్త్రాలు, ఆయుర్వేద వైద్య విజ్ఞానం, గీతాసార సిద్ధాంతం మొదలైనవి ముఖ్యంగా దీనిలోని వర్ణిత విషయాలు.

# శ్రీ వేంకటేశాష్టకమ్

- కొమ్ము సుబ్రహ్మణ్యవరప్రసాద్, ఆకివీడు

జయ జయ! సోమక దానవ సంహర!
మందరధారి! వరాహ! హరే!
జయనరసింహ! త్రివిక్రమ! భార్గవ!
రామ పరాత్పర దాశరథే!
జయ బలదేవహలాయుధ పావన!
బుద్ధ మహాత్మక! కల్కివరా!
జయజయ శ్రీశ హరే వరదాయక!
వేంకటనాయక! పాలయమామ్ ॥ జయ ॥

జయ జయ! వేంకట భూధర మందిర!
మన్మథసుందర! దేవవరా!
జయ జయ! కౌస్తుభ హార! రమావర!
రమ్యగుణాకర! చక్రధరా!
జయ జయ! భక్తశుభంకర! శ్రీకర!
వేదవిహార! భవార్తిహరా! ॥ జయ ॥

జయ జయ! వజ్రకిరీట విరాజిత!
మౌక్తిక రత్నమయా భరణా!
జయ కనకాంబర! నీరద సుందర!
భూరమణీవర! ధీరవరా!
జయ జయ! శంఖ సుదర్శన, శోభిత!
కుండల మండిత గండయుగా! ॥ జయ ॥

జయ జయ! హేకలిదోష! నివారణ!
సాధుజనావన! శ్రీచరణా!
జయ జయ! భక్త విభీషణ పోషణ!
సంకట శోషణ! దివ్యగుణా!
జయ జయ! పన్నగ భూషణ! సద్గుణ!
సంశ్రిత శిష్టజనోద్ధరణా! ॥ జయ ॥

జయ జయ! సర్వ సుపర్వ సుసేవిత!
శాశ్వత! సజ్జన సన్నిహితా!
జయ జయ! శ్రీరమణీ రమణాచ్యుత!
నారదసన్నుత! విశ్వహితా!
జయ జయ! హే సతతాశ్రిత కల్పక!
పాలితగోపక! పార్థసఖా! ॥ జయ ॥

జయ జయ! కాళియ గర్వవిభంజన!
యాదవరంజన! సత్త్వఘనా!
జయ జయ! దుర్దమకంస విమర్దన!
ధర్మవివర్ధన! ధీరగుణా!
జయ! నరకాంతక! గోపరిపాలక!
మోహవిదారక! వేదమయా! ॥ జయ ॥

జయ! సకలాగమమూల! జనార్దన!
ముక్తినిధాన! ప్రధాన గుణా!
జయ జయ! సామజరాజ విమోక్షణ!
మానవతీ పరిరక్షచణా!
జయ జయ! హే భువనత్రయ కారణ!
సంసరణార్తిహరైకగుణా! ॥ జయ ॥

జయ! 'జయదేవ పురందర' వందిత!
నాదవినోద సదాముదితా!
జయ జయ! "వేంగమ", "అన్నమయార్చిత"!
సుందర భవ్యకథోల్లసితా!
జయ జయ! వేణురవామృతమోహిత
సర్వచరాచర! విశ్వమయా! ॥ జయ ॥




**(మద్రదేశాధిపతి అయిన శల్యుని సారథ్యంలో మహావీరుడైన కర్ణుడు పాండవ పక్షంతో పోరాడిన ఘట్టం ఈ సంచికలో చదవవచ్చు)**

ఇటు అర్జునుని కెదురుగా నారాయణ గోపాలురతో శిబి, త్రిగర్త, సాల్వ సేనలు నిలిచి పోరాడుతున్నాయి. ఆ సమయంలో మన పక్షంలోని సత్యసేనుడు విడిచిన బాణం శ్రీకృష్ణుని భుజాన్ని గాయపరచటంతో అర్జునుడు కోపోద్దీపితుడై రథాన్ని అటే సాగించి, విడిచిన బాణాలు వాని శరీరాన్ని ముక్కలు ముక్కలు చేశాయి. అంతతో త్రిగర్త సేనలు ఎదురు నిలువగా వీరులతో వారందరినీ కడతేర్చి ఐంద్రాస్త్రం ప్రయోగించాడు.

అంతతో వాని ఎదుటనున్న రథాలన్నీ ముక్కలుగా విడిపోయాయి. ఏనుగుల అంగ సంధులు చీలిపోయాయి. గుర్రాల తలలు తెగి పడ్డాయి. ఆయుధాలన్నీ తునాతునకలుగా విరిగిపడ్డాయి. నెత్తురు వరదలలో మాంసపు బురద పేరుకుంది. అటు ధర్మరాజు దుర్యోధనుని కెదురు నిలిచాడు. మన రాజు పాండవ జ్యేష్ఠుని తీవ్రంగా వేధించడంతో, ఆ యుధిష్ఠిరుడు కుపితుడై విడిచిన శరాల ధాటికి మనవాని రథం విరిగింది. అది చూసి అశ్వత్థామ, కర్ణుడు, కృపాచార్యులు వానికి రక్షగా వచ్చారు. ఇటు నకుల, సహదేవులు ధర్మరాజుకు అండగా వచ్చారు. వారి మధ్య సాగిన యుద్ధం మహాద్భుతంగా, భయానకంగా ఉంది. అడవిదున్న చిన్న చెరువులో పడి ఈదులాడినట్లుంది, ఆ సంగ్రామం: అంతగా కలగిపోయింది కాల్బలం. ఊపిరి తిప్పుకునే వీలులేదు. కాలు కదిపే అవకాశం లేదు– అని సంజయుడు చెపుతూంటే: ధర్మరాజు చేతిలో నా పెద్ద కొడుకు దెబ్బతిన్నాడన్నావే వాడు మళ్ళీ తేరుకుని మరోరథం మీద ఎదుర్కోలేదా? అని ధృతరాష్ట్రుడడుగగా, సంజయుడు : ప్రభూ! మరోరథం ఎక్కి మీ దుర్యోధనుడు ధర్మరాజుకి ఎదురు నడిచాడు. ధర్మరాజు మరింత ఉత్సాహంతో తన రథాన్ని వాని కెదురు నడిపించాడు. ఆ కోపంలో నీ కొడుకు విడిచిన బాణాలు క్షణాల విరామంలో ధర్మరాజు చేతినుండి మూడు ధనుస్సులను ముక్కలు చేశాయి. ఇద్దరూ కుపిత వృషభాల వలె ఉన్నారు. బాణవర్షం కురిపిస్తున్నారు. మరికొంతసేపు పోరు సాగింది. నీ కొడుకు మూర్ఛపోయాడు. అది చూసి కృతవర్మ ఎదురురాగా భీముడు ఎదుర్కొన్నాడు.

ఇక్కడ యుద్ధం మహోద్ధతం కావడం చూసి అర్జునుడు సింహంలా దూకాడు. ఉదయం నుంచీ తగినంత పనిలేక చేతులు తీటగా ఉన్నాయేమో వస్తూనే ఊపిరి సలపకుండా బాణవర్షం ఆరంభించాడు. అప్పటికి దుర్యోధనుడు మూర్ఛదేరి అర్జునునికి ఎదురు వచ్చాడు. అతని వాడి శరాలకు తన ధనుస్సు విరిగి, రథ కేతనం వొరిగి అశ్వాలతో పాటు సూతుని ప్రాణాలు యమపురి చేరాయి. అది చూసిన అశ్వత్థామ అర్జునుని బాణ ధాటిని నిరోధించబోగా వాని విల్లు విరిచి అడ్డం వచ్చిన కృపాచార్యుని ధనుస్సు ముక్కలు ముక్కలు చేసి ఆ వూపులోనే దుశ్శాసనుని బాణాసనం తునియలు చేసి, తీవ్ర రోషంతో కర్ణుని వైపు రథం నడిపించమన్నాడు. అది చూసిన సాత్యకీ, శిఖండీ, ద్రౌపదీ నందనులూ, ధృష్టద్యుమ్నుడూ, యుయుత్సుడూ మొదలు గాగల వారందరూ అర్జునునికి తోడు వచ్చారు. ప్రచండవాయువు మహారణ్యంలోని వృక్షసమూహాలను ఊగిసలాడించేటట్లు కర్ణుడిందరినీ గజ గజలాడిస్తూంటే చూసిన సవ్యసాచి, తన గాండీవాన్ని చక్రాకారంలో ఉంచి వాడి మొనలు గల బాణ పరంపరతో కర్ణుని నిలువరించి, మన సేనలను చెల్లాచెదురు

చేస్తున్నాడు. రణరంగం అంతా ఆ యుద్ధంలో రేగిన ధూళితో నిండింది. అప్పటికి సూర్యుడు అస్తగిరికి చేరాడు. యుద్ధనీతి ననుసరించి ఆ నాటికి విరామం ప్రకటించారు.

ఆ రాత్రి కురుసేనా శిబిరంలో మంతనాలు సాగాయి. కర్ణుడు తనకు శల్యుని సారథిగా చేస్తే ప్రతిపక్షాన్ని సమూలం కూలుస్తానన్నాడు. దుర్యోధనుడు శల్యుని చేరి, మామా! సారథ్యంలో నువ్వు కృష్ణుడంతటి వాడివి. రేపటి యుద్ధంలో కర్ణునికి సారథ్యం వహించి మనకు జయం కలిగించాలి. పరశు రామదత్తమైన అస్త్రాలతో కర్ణుడు సాగించే పోరులో నీ సారథ్యం అవశ్యం, అనగా శల్యుడు సారథ్యానికి తనను నియోగించి నందుకు కొంచెం కించపడినా యదువంశీయుడైన కృష్ణుని కంటే ఘనంగా నిలబెట్టినందువల్ల సంతోషించి అంగీకరిస్తూ రథం మీద ఉన్నంతసేపూ నేను నా చిత్తం వచ్చినట్లు మాట్లాడు తుంటాను. అక్కడ తప్పుపట్టి నన్ను తూలనాడితే మాత్రం మాట దక్కదు అన్నాడు.

ఆ నియమానికి అంగీకరించాడు, కర్ణుడు. త్రిపురాసుర సంహార కథ చెప్పి ఆ యుద్ధంలో పరమశివునికి చతుర్ముఖుడు సారథ్యం వహించాడనీ రథికుని కంటె సారథి సర్వ విధాలా అధికుడుగా ఉండడం, ఉద్ధత యుద్ధవేళ ధర్మం కనుక శల్యుని ఆధిక్యం గుర్తించే ఈ పని చేశాననీ దుర్యోధనుడు వివరించాడు.

### శల్య సారథ్యం

తెల్లవారింది. రథాన్ని సర్వవిధములైన ఆయుధాలతో నింపి మంగళ పూజలు జరిపి, తెచ్చి ముందుంచగా కర్ణుడు దానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి శల్యుని ముందుగా ఎక్కమని అనంతరం పర్వతం మీదికి సింహం లంఘించినట్లు రథం మీదికి దూకాడు. అప్పుడు దుర్యోధనుడు కర్ణుని అనేక విధాల అభి నందిస్తూ నడిపించాడు. శంఖభేరీ నాదాలు మ్రోగుతున్నాయి. రథం సాగుతోంది.

అప్పుడు కర్ణుడు: మద్రపతీ! ఈ ధనుస్సుకి బాణం తొడిగి నేను విజృంభిస్తుంటే పాండవులందరూ మతులు పోయి తలలు వాలుస్తారు. భీష్మ, ద్రోణులతో సాగించినట్లు మనతో రాలేరు – అని పలుకుతూంటే శల్యుడు: రాధేయా! ఎందుకీ ప్రగల్భాలు. శూర శ్రేష్ఠులు, తేజస్సంపన్నులు, అమరేశ్వరు నయినా నిలబెట్టగలవారు పాండవులు. గాండీవ ధనుష్టంకారం కర్ణభేదనం చేస్తూ, భీమ గదాదండ భ్రమణం మెరుపు కాంతు లతో కనులకు చీకట్లు క్రమ్మించినప్పుడు కాని నీ మాటల పస బయట పడదు. అటు సవ్యసాచి రథబలాన్ని తునాతునకలు చేయగా వృకోదరుడు గజగణాన్ని ముక్కలు ముక్కలు చేస్తూంటే ధర్మరాజు నకుల– సహదేవులతో మన వారందరినీ చీల్చి చెండాడుతుంటే అప్పుడు నువ్వు నోరు విప్పి మాట్లాడగలవేమో చూస్తానుగా – అన్నాడు.

కర్ణుడు వినీ విననట్లు – నా శక్తి చూద్దువుగాని నడుపు రథాన్ని – అన్నాడు. సేనాముఖంలో కర్ణుని రథం కురుసేనకు అమితానందం కలిగించింది. వారంతా సింహనాదాలతో కర్ణుని కీర్తించారు. కర్ణా! ఘోష యాత్రలో అర్జునుడు లేకపోతే మీరంతా ఏమయేవారు! గోగ్రహణ సమయంలో ఒక్క పార్థుడే కదా మీకందరికీ పరాజయ పట్టం గట్టినది. అన్నీ మరచిపోయి ఎందుకీ దూకుడు, అని శల్యుడు దెప్పి పొడుస్తూనే రథం నడుపు తున్నాడు.

మద్రపతీ! ఎందుకీ అనవసర ప్రసంగం. మన రథాన్ని ఆ పాండవ మధ్యముని కెదురు నడుపు అని కర్ణుడు: ఓ మహా యోధులారా! అర్జునుడెక్కడ ఉన్నాడో చూపించిన వారికి కోరిన కానుక లిస్తాను అని గట్టిగా అరిచాడు. దుర్యోధనుడు తన సోదరులతో ముందుకు సాగాడు. అప్పుడు శల్యుడు: రాధేయా! ఎందుకీ డంబాలు. నీ ధనరాసులు సత్కార్యాలకు వినియోగిం చాలి, కాని అసమర్థుల కెందుకు ధారవోయడం. అర్జునుణ్ణి ఎవరో చూపనవసరం లేదు, వాడే మన కెదురువస్తాడు అని అపహాసం చేశాడు. కర్ణుడు విననట్లు ఊరుకున్నాడు. రథం సాగుతోంది. "కర్ణా! ఎప్పుడైనా, ఎక్కడైనా సింహం మీద నక్క విజయం పొందడం విన్నావా! కేసరి కంటబడనంతవరకే నక్క కూతలు కూస్తుంది; కంట బడగానే తోక ముడుస్తుంది:" అని పరిహాసం చేశాడు. అక్కడికీ ఓరిమి వహించి కర్ణుడు: "మద్ర పతీ! మీరెవరూ ఎరుగరు నా అస్త్ర శక్తి. నేటివరకూ అర్చిస్తు న్నాను వారుణాస్త్రాన్ని; అలానే భార్గవ దత్తమైన అస్త్రం ఉంది. ఈ రెండూ కృష్ణార్జునులను మన్ను కరిపిస్తాయి." అనగా శల్యుడు: "ఇంక ఈ ప్రగల్భాలు కట్టిపెట్టు నీ ప్రతాపం నే నెరుగనా!" అని నవ్వాడు.

శల్యా! ఇంక కట్టిపెట్టు నీ దేశ లక్షణం. నీ జాతి గుణం విడవలేక పోతున్నావు. నిరంతరం మద్యపాన ప్రియులైన మీకు మంచిచెడ్డల తారతమ్యం ఎలా తెలుస్తుంది. ఊరక ప్రేలక రథం నడుపు లేదా ఈ గదతో నీ తల అన్నాడు కర్ణుడు, అర్థోక్తిలో ఆపి. శల్యుడు మరింతగా నవ్వి : తల పగులుతుందని భయపడి హితోపదేశం మానుతానా! నీ కొక్క కథ చెప్పాలని ఉంది. చాలాకాలం క్రిందటి కథ. ఒకానొక నగరంలో ధర్మ పరుడైన వైశ్యుడు నిర్విరామంగా సాగించిన యజ్ఞయాగాలలో ఎందరో సంతుష్టి పొందుతున్నారు. ఆ శ్రేష్ఠి కొడుకులు చిన్న తనంలో తాము తినగా మిగిలిన ఎంగిలి మెతుకులు వేసి ఒక కాకిని పెంచారు. అది బాగా బలిసింది ఆ ఎంగిళ్ళు తిని; కొవ్వు పట్టి తనంతటి పక్షి లేదనుకుంది.

ఒకనాడు ఈ శ్రేష్ఠి కొడుకులు సముద్ర తీరానికి విహారం వెళ్ళి అక్కడ గగన వీధిలో హంసలను చూచి: ఓ కాకీ! పక్షులలో నీ అంతటిది లేదు కనుక నువ్వు వాటి పైకి ఎగిరి మాకు సంతోషం కలిగించు; అనడంతో అది ఆ హంసలలో మేలిహంసను పోటీగా పెట్టుకుని ఎగిరి ఎగిరి సముద్రంలో పడిపోతుంటే చూసి ఆ హంసయే దాన్ని రక్షించిందని విన్నాను; అందుచేత ఎందుకు వృథా పరాభవం నీకు, అన్నాడు శల్యుడు.

మద్రవంశీయుడా! ఇక ఆపు. ఎవరెంతటి వారో ఎరగక ప్రేలడం లేదు. పరశురాముడు అనుగ్రహంతో ఇచ్చిన దివ్యాస్త్రాలుండగా నే నెవరికీ జంకను. అయితే శాపాలున్నాయి నన్ను వంచించేవి; అయినా జంకను. రథం త్వరగా నడుపు అన్నాడు కర్ణుడు. అడుగో గాండీవి. ఇటే వస్తున్నాడు. కనిపించిందా కపి ధ్వజం. చూపు నీ ప్రతాపం! అన్నాడు శల్యుడు. పోరు సాగు తున్నది, ప్రారంభంలోనే తీవ్రంగా తన తండ్రిని సంహరించిన ధృష్టద్యుమ్నుని తల నేల పడకపోతే ఈ రోజు కవచం విప్పనన్నాడు, అశ్వత్థామ. దుర్యోధనుడు ధర్మ రాజుతో కత్తి దూశాడు. కర్ణుని కుమారులు సత్యసేన, వృషసేన, చిత్రసేన, సుషేణులు భీమసేనుని కెదురు నిలిచారు.

కర్ణుడు ఎదురుగా వచ్చే శిఖండినీ, సాత్యకినీ చీకాకు పరిచి, ధర్మరాజును పరాభూతుని చేసి, అడ్డు వచ్చే భీమునితో యుద్ధం ఆరంభించబోతూ: మద్రనాథా! చూశావా! పాండవ యోధుడు ఎంత ఆటోపంతో వస్తున్నాడో అభిమన్యుడు పోయినా, ఘటోత్కచుడు పోయినా చలించలేదు. అనవసరంగా ఆవేశమూ తెచ్చుకోలేదు. అటువంటి మహాయోధుడు వస్తున్నాడు, అని నారి సారించాడు. ఉభయుల మధ్య పోరు తీవ్రమైంది. కర్ణుడు భీముని విల్లు విరుగకొట్టాడు. భీముడు మరొక విల్లందుకున్నాడు. అప్పుడు కర్ణుడు విడిచిన బాణపరంపర భీముని శరీరంలోంచి దూసుకుపోయి నేలలో పాతుకుంది. ఆ వేడిలో భీముడు విడిచిన వాడిగల భల్లం తగిలి, రొమ్ము పగిలి కర్ణుడు మూర్ఛ పొందాడు. తీవ్ర క్రోధంతో ఉన్న భీముడు తన రథాన్ని కర్ణుని రథం దగ్గరగా నడిపి చురకత్తితో వాని నాలుక కొయ్యబోతూ: ఈ జిహ్వతో కదా నాడు ద్రుపద రాజనందినినీ, మమ్మూ, అస హ్యపు మాటలతో అవమానించాడు, అంటూండగా శల్యుడు ఆపి : నాయనా! కర్ణుడు మూర్ఛలో ఉన్నాడు; పైగా అర్జునుని శపథం ఉంది. ఇప్పుడు నువ్వు నాలుక కోస్తే ఈ యోధుడు మరణిస్తాడు, అని మందలించడంతో భీముడు వెనుదిరిగాడు.

రాధేయుని అంతగా పరాభవించి భీముని ఎదుర్కోమని సుయోధనుడు తన తమ్ములైన శ్రుతవర్మాదులను పంపాడు. అయిదువందల యాభైమంది వీరులతో వచ్చిన శ్రుతవర్మ, వికటుడు, సముడు, క్రోధుడు, నందుడు, ఉపనందుడు నేలకూలారు. అప్పటికి మూర్ఛనుండి లేచి రాధేయుడు భీముని నిరోధించ డానికి వచ్చాడు. అతనికి తోడు సౌబలుని గజబలం వచ్చింది. కౌంతేయుడు రథం దిగి ఆయుధ ప్రహారం చేస్తున్నాడు. వెచ్చగా కాచిన డప్పులు మ్రోగుతూన్న ధ్వనులు వినబడుతున్నాయి. ఆ వీరుని విజృంభ వేళ. దావానలం సోకి పెట పెట పేలుతూ ధ్వంసమవుతూన్న వెదురు బీడులా ఉంది రణరంగం. రాధేయుడు రథం ధర్మరాజు మీదికి నడిపి సారథిని పడగొట్టాడు, దానితో గుర్రాలు రథాన్ని వెనుకకు తిప్పుకున్నాయి. అయినా కర్ణుడు వెన్నాడుతూ ఉంటే భీముడు వీని వెన్ను దగిలి పోరు సాగించాడు. సూర్యుడు పడమటి కొండ వెనుకకు చేరాడు. సంధ్యారాగాలు తెర ఎత్తుకున్నాయి. మనిషికి మనిషి కనబడటం లేదు. కిరీటాల మీది మణులు, భుజకీర్తులపై వెలిగే రత్నాలూ, కత్తుల తళతళలూ...... రణరంగమే ఆకాశంలా ఉంది. యోధులందరూ తమ గోత్ర నామాలు చెప్పుకుంటూ, పోరు సాగిస్తున్నారు. ఆ సమయంలో సుశర్మ తీవ్రవేగంతో గాండీవిని

ఎదుర్కొన్నాడు, సంశప్తక గణంతో వచ్చి. యోధ సహస్రం చుట్టుముట్టగా, రథం కదిలే దారి లేక, పార్థుడు భుజంగాస్త్రం ప్రయోగించాడు. ఎదురుగా వచ్చిన వీరులందరి పాదాలూ బంధించిందది. సంశప్తకులు దిక్కు తోచక చెల్లాచెదురుకాగా, త్రిగర్తాధిపతి గరుడాస్త్రం ప్రయోగించి వారికి విమోచనం కలిగించాడు.

సంశప్తకులు మరొక్కమారు పార్థుని మీదికి వచ్చారు. సుశర్మ వాడిబాణ పరంపర నడిపాడు. ఆ ఆఘాతాలకు మూర్ఛ పోయాడు పాండునందనుడు. గాండీవి మరణించాడనే అను కున్నారు, కౌరవులు, సింహనాదాలు చేసుకుంటూ. అంతలో కిరీటి గాండీవం సంధించాడు సంశప్తక గణం నేల కూలు తున్నది. ఇక్కడ కృపాచార్యులు ధృష్టద్యుమ్నునితో సమరం నడుపుతూంటే కృతవర్మ తోడువచ్చాడు. కృపాచార్యుని బాణ ఘాతాలకు శిఖండి పలాయనం సాగించగా సుకేతుడు నేల కూలాడు; ధృష్టద్యుమ్నుని బాణపు దెబ్బకు కృతవర్మ మూర్ఛ పోయాడు. కృపాచార్యులు రథం దిగి వెళ్ళిపోయారు.

అశ్వత్థామ తీవ్ర క్రోధంతో సాత్యకి రథ సారథిని నేలకూల్చి, ఎదురు వచ్చిన ధర్మజుని రణ విముఖుని చేశాడు. చూస్తుండగానే పాండవాగ్రజుడు రథం ద్రోణపుత్రుని కెదురు నడిపి : గురునందనా! అస్త్రవిద్యా విదుడవు, విప్రవరుడవు. ఇంద్రియ నిగ్రహంతో తపస్సు సాగించుకోవలసిన నీకు యుద్ధం దేనికయ్యా! అంటూంటే విని నవ్వుతూనే బాణ వర్షం కురి పించాడు అశ్వత్థామ. రాధేయుడు, భీముడూ, సాగించే సంగ్రామంలో అసంఖ్యాక సేన నేల కూలుతున్నది. సుయోధ నుడు, నకుల, సహదేవులతో పోరుతున్నాడు. ధృష్టద్యుమ్నుడు వచ్చి వాని శరీరమంతా తూట్లుకొట్టాడు. నిండుగా పూసిన మోదుగు చెట్టులా ఉంది కురుపతి దేహం. నిశిత బాణ పరం పరతో కౌరవ జ్యేష్ఠుని సారథినీ, అశ్వాలనూ, నేలకూల్చాడు, పాండవ సేనాని; చూసిన సుయోధనుని తమ్ముడు అన్నగారిని తన రథం ఎక్కించుకుని దూరంగా తీసుకువెళ్ళాడు.

ఏనుగుల గుంపులోకి సింహంలా, లేళ్ళ పిండులోకి శార్దూలంలా, కర్ణుడు పాండవసేనా సమూహంలో ప్రవేశించే సరికి శిఖండి, సహదేవ, సాత్యకి, నకులుల వెంట ఉపపాండ వులువాని నెదుర్కొన్నారు. సాగరంలో మందర పర్వతంలా తిరు గుతూ సమర కౌశలం చూపుతున్నాడు రాధేయుడు.

సవ్యసాచి సంశప్తక గణాన్ని ఊచకోత కోస్తున్నాడు. దూరం నుంచి ద్రోణ సుతుడు సవ్యసాచిని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించి కిరీటితో మురారిని కూడా హింసించాడు అశ్వ త్థామ. కటకట పడుతూ కృష్ణుడు: బావా! గాండీవం స్థిరంగా ఉన్నదా! గురుపుత్రుడనే ప్రేమ మనసులోలేదు కదా! అని పరి హసించడంతో గాండీవి విజృంభించాడు. అడ్డువచ్చిన సంశప్త కులను హతమారుస్తూనే అశ్వత్థామను నిరోధించాడు. ద్రుపద నందనుడు తోడుగా వచ్చి ద్రోణ పుత్రునికి ఎదురిచ్చాడు. ఉభయులూ కుపిత సింహాలవలె హింసాకాండ నడుపుతున్నారు. పాండవసేనాపతి తన విల్లు విరగగొట్టాడన్న కోపంతో మరొక విల్లు అందుకొని అశ్వత్థామ వానిని రథహీనుని చేశాడు. ద్రుపద సూతి కత్తి చేబూని విక్రమించగా, కుంభసంభవ పుత్రుడు మరొక కత్తితో దిగాడు. అదిచూసి అర్జునుడు తమ సేనాపతిని రథం మీదికి ఎక్కించి అశ్వత్థామను ఎదిరించాడు.

కర్ణుడు పాంచాలసేనను నాశనం చేస్తున్నాడు. భీముడు విజృంభణానికి కౌరవసేన చెల్లాచెదరవుతున్నది. ఎదురు వచ్చిన యుధిష్ఠిరునితో కర్ణుడు తుముల సమరం నడుపుతూంటే శల్యుడు రాధేయా! మనకు కావలసినది కవ్వడి, వీరందరితో పోరాటం దేనికి– అదిగో! అక్కడ సుయోధనుడు భీముని చేతులలో చిక్కులు పడుతున్నాడు, అనగా రథం అటు నడిపించు అన్నాడు అంగపతి. దారిలో అడ్డుపడిన పాండవాగ్రజుడు పరాభూతుడై పలాయనం సాగించి శిబిరంలో చింతాక్రాంతుడయాడు. తీవ్ర వేగంతో రాధేయుడు పవననందనుని దిక్కుగా సాగుతూంటే దారిలో అర్జునుడు అశ్వత్థామ ధాటికి ఆగలేక ఆవేశంతో బాణాలు నిశితగతిని నడిపి గురుపుత్రుని వేధించాడు.

చూసిన కర్ణుడు ఉద్రిక్త చిత్తంతో భార్గవాస్త్రం ప్రయోగిం చాడు. పాండవ సేన చీకాకు పడుతూంటే పార్థుడు రథం అటే నడపమన్నాడు. కాని వాసుదేవుడు: బావా! మీ అగ్రజుడు రాధేయునిచే పరాభూతుడై శిబిరానికి వెళ్ళాడు. ఆ మహనీయుడు అవమానం భరించలేదు. కనక విషయం తెలుసుకువద్దాం. అని రథం శిబిరాల వైపు నడిపించాడు. ***(ఇంకా ఉంది)***

**క**లి, కాళి, కాలుడు పదాలకు వ్యుత్పత్తిని చెబుతూ, దేవతా కల్యాణోత్సవాలలో చెప్పే 'ప్రవర' అంటే అర్థం తెలుపగలరు.

- బి. అనిల్ కుమార్, కర్నూలు.

☛ 1) *కల్యన్తే బాణా అత్రేతికలిః* – ఇందు బాణములు వేయబడును గనుక దీనికి కలి అని పేరు. కలి అంటే యుద్ధమని అర్థం. 2) *కలన్తే ఉ స్మిన్నితి కలిః* – అనగా కలియుగమని అర్థం. 3) *కాళవర్ణత్వాత్కాళీ* – నల్లని వర్ణము కలది కనుక కాళియని పేరు. 4) *కలయతి ధర్మా ధర్మాణా మాయు షోవా సంఖ్యానం కరోతీతి కాలః*–అనగా ధర్మాధర్మా లను ఆయుర్దాయాన్ని లెక్కించేవాడు కాలుడు. కాలస్వరూపుడు.

మనం కుండ కొనాలంటే దానిని కొట్టిచూస్తాం. దేనికైనా మంచిచెడులు విచారిస్తాం. వివాహం నూరేండ్లపంట. అందుకే యువతీయువకులకు వివాహం నిర్ణయించేటప్పుడు వారి గుణ గణాలతో పాటు వారి వంశం ఎలాంటిదో చూడాలి. ప్రవర అంటే ఈ పెండ్లికొడుకు ముత్తాత ఫలాన, తాత ఫలాన, తండ్రి ఫలాన, అలాగే పెండ్లి కుమార్తె ముత్తాత ఫలాన వారని, వారి వారి వంశౌన్నత్యాన్ని నిర్ణయించి చెప్పేదే ప్రవర. వంశపారం పర్యము యొక్క ఔన్నత్యాన్ని తెల్పేది.

**పీ**ఠములు ఎన్ని రకములు? అందులో అచలపీఠం యొక్క ప్రాశస్త్యత ఏమిటి? - గంథ గోవింద రెడ్డయ్య, ఆర్.కొత్తపల్లి.

☛ 'ప్రాశస్త్యత' అనకూడదు. భావార్థక తద్ధితంలో 'ప్రాశస్త్యము' లేక 'ప్రశస్తత' అని వ్రాయాలి. పీఠాలు, వైష్ణవపీఠాలు, అద్వైత పీఠాలు, ద్వైత పీఠాలు, శక్తి పీఠాలు, వీరశైవ పీఠాలు – ఇలా మతాలలో చాలా మతాలకు పీఠాలున్నాయి. ఆయా పీఠాలు, వారి వారి మతధర్మ సంప్రదాయాలను ప్రచారం చేస్తూ ఉంటాయి. పూర్వం వ్యాసపీఠాలుండేవి. ఆ పీఠానికి ఎవరు అధిపతిగా వచ్చినా వారిని 'వ్యాసుడు' అనే వ్యవహరించేవారు. ఆదిశంకరులు స్థాపించిన పీఠాలలో అధిపతులుగా వచ్చిన వారి నందరినీ శంకరులనే పిలిచేవారు. అలాగే రామానుజపీఠాలలో ఆ సంప్రదాయం కన్పించదు. బిల్వమంగళ పీఠంలో కూడా అధిపతి ఎవరైనా ఆయనను 'బిల్వమంగళుడు' అనే పిలుస్తారు.

'ఇక అచల పరిపూర్ణం' అద్వైతస్థితి ముదిరిన తర్వాత 'అచలం' ఏర్పడుతుంది. ఇందు అమనస్క స్థితి కలగాలి. ఈ

# సందేహాలు? సమాధానాలు!!

–'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

పీఠాలు కూడా అచల పరిపూర్ణ సిద్ధాంతాన్ని ప్రచారం చేశాయి. శ్రీ సీతారామాంజనేయ సంవాదమనే వేదాంత గ్రంథం, అచల సిద్ధాంత వ్యాప్తికెంతో దోహదం చేసింది.

**గ**ర్భగుడిలో కిటికీలు, విద్యుద్దీపాలు గాని ఎందుకుండవు? - అనంత ప్రభాకరదత్తు, విశాఖపట్నం

☛ గర్భగుడి పరమపవిత్రమైంది. కిటికీలుంటే, ఎవరుబడితే వారు అందులోనికి తొంగిచూస్తారు. రజస్వలాదులు కూడ చూచే అవకాశం ఉంది. దుమ్ము ధూళి వచ్చి స్వామినాక్రమిస్తాయి. అందులో నుండి వచ్చిన గాలికి దీపారాధనలు కొండెక్కుతాయి. పవిత్రతనాధారంగా దేవాలయ ఆగమశాస్త్రం కిటికీలు మొదలైన వాటిని నిషేధించింది. విద్యుద్దీపకాంతిలో విగ్రహం యొక్క నిజమైన రూపం గోచరించదు. స్వయం ప్రకాశమానుడైన పర మాత్మను విద్యుత్సహాయంతో చూపిస్తారా? విద్యుత్తునకు కృత్రిమ కాంతిని కల్పించినవాడు పరమాత్మ. ఆయనను విద్యుత్కాంతిలో దర్శించటం దోషంగా చెప్పబడింది.

**స**గరమాంధాత్రాది షట్చక్రవర్తులు అంటారు. మాంధాత ఎవరు? వీరి జీవితవిశేషాలు తెలుపండి?

- ఎం. రంగారావు పట్నాయక్, వేణంపేట.

☛ *'సగరమాంధాత్రాది షట్చక్రవర్తుల – అంకసీమలనిల్చినట్టి సాధ్వి'* అని జాషువా పద్యం రాశారు. అది చాల సుప్రసిద్ధ మైంది. కానీ ఈ విషయంలో మహాకవి ప్రమాదవశు లయ్యారు. "ప్రమాదోధీ మతామపి" బుద్ధిశాలురు కూడ కొన్ని సార్లు ప్రమాదపడవచ్చు. ఇందులో మాంధాత షట్చక్రవర్తులలోని వాడుకాదు. 1)హరిశ్చంద్రుడు 2)నలుడు 3)పురుకుత్సుడు 4) పురూరవుడు 5)సగరుడు 6)కార్తవీర్యుడు. వీరు షట్చక్రవర్తులు. వీరుకాక షోడశ మహారాజులున్నారు. 1)గయుడు 2)అంబరీ షుడు 3)శశిబిందువు 4)అంగుడు 5)పృథువు 6)మరుత్తు 7)సహోత్రుడు 8)పరశురాముడు 9) శ్రీరాముడు 10)భరతుడు 11)దిలీపుడు 12)భృగుడు 13)రంతిదేవుడు 14)యయాతి 15)మాంధాత 16)భగీరథుడు. కనుక మాంధాత షోడశ మహా రాజులలోనివాడు.

యువనాశ్వునకు కుమారులు లేరు. ఆతడు పుత్రకామేష్టిని నిర్వహిస్తున్నాడు. యువనాశ్వుని భార్యలకై భృగుమహర్షి జలం

మంత్రించి ఒక చోట ఉంచాడు. అది మంత్రజలమని తెలీక యువనాశ్వుడాజలం పానం చేశాడు. ఫలితంగా ఆయన గర్భం ధరించాడు. ఆతని గర్భం చీల్చుకుని శిశువు బైటకు వచ్చాడు. ఇంద్రుడు వచ్చి తన బొటనవేలిని ఆ శిశువుకు కుడిపాడు. ఆ శిశువే మాంధాత. ఈతడు శశిబిందు మహారాజు కుమార్తె బిందుమతిని వివాహం చేసికొన్నాడు. ఆతనికి అంబరీషుడు, పురుకుత్సుడు, ముచికుందుడు అనే కుమారులు పుట్టారు. మాంధాత లోకంలోని రాజులనందరినీ జయించాడు. రావణుడు స్వయంగావచ్చి తనతో యుద్ధం చేయుమని కోరాడు. మాంధాత ఆతనిని ఓడించి చెరలో బంధించాడు. బ్రహ్మవచ్చి వారికి సంధిచేసి రావణుని విడిపించాడు. ఇంద్రునిపై దండెత్తినాడు. ఇంద్రుడు ముందు నీవు లవణాసురుని జయింపుమని కోరినాడు. మాంధాత లవణుని చేతిలో పరాజితుడైనాడు.

ఇక మాంధాత చరిత్రం చెప్తాను. సగరుడు సూర్యవంశపు రాజు. ఈయన తండ్రి అసితుడు. ఆతనిని హైహయులు జయించి రాజ్యం నుంచి వెళ్ళగొట్టారు. అసితుని భార్య గర్భవతి. ఆమెకు సవతులు విషం పెట్టారు. ఆ విషం వల్ల కడుపులోని బిడ్డ మరణించకుండ చ్యవనుడు రక్షించాడు. శరీరంలో గరళం ఉండి కూడ జీవించాడు కనుక అతనికి సగరుడనే పేరు వచ్చింది.

వసిష్ఠుని వలన విషయం తెలిసికొని సగరుడు హైహయులను సంహరించి అయోధ్యకు వచ్చాడు. ప్రజలాతనికి బ్రహ్మరథం పట్టి సింహాసన పట్టాభిషిక్తుని చేశారు. ఈతడు విదర్భరాజు కుమార్తె కేశినిని, మరియొక కన్య సుమతిని, వివాహం చేసికొనినాడు. సగరుడు సంతానమునకై ఔర్వమహర్షిని ఆశ్రయించాడు. ఆయన ఆనతి ప్రకారం సగరు డీశ్వరుని గురించి తపస్సు చేశాడు. ఈశ్వరు డొక భార్యయందొక కుమారుడు, మరియొక భార్యయందు అరువదివేలమంది జన్మిస్తారని వరమిచ్చాడు. సుమతి గర్భస్థపిండాన్ని ఔర్వుడరువదివేల భాగాలు చేసి కుంభంలో పెట్టించాడు. వాని నుండి అరువది వేలమంది జన్మించారు. మరియొక భార్య కొకే పుత్రుడు పుట్టాడు.

సగరుడశ్వమేధయాగం నిర్వహిస్తున్నాడు. ఇంద్రుడాతని మీది క్రోధంతో యాగాశ్వాన్ని దొంగిలించి, పాతాళంలో కపిలమహర్షి ఆశ్రమంలో కట్టివేసిపోయాడు. అశ్వమును వెదకి తెమ్మని తన 60,000 మంది కుమారులను ఆజ్ఞాపించాడు. వారు భూమి మీద ఆ గుఱ్ఱాన్ని కానక, భూమిని త్రవ్వుకొంటూ వెళ్ళారు. కపిలాశ్రమంలో గుఱ్ఱాన్ని చూచి, కపిలుడే దొంగ అని ఆయనను బంధించబోయారు. ఆయన ఆగ్రహించి చూచేసరికి వాళ్ళు భగ్గున కాలిపోయారు. అసమంజసుడు పోయి గుఱ్ఱాన్ని తెచ్చాడు. సగరుడు అశ్వమేథం పూర్తి చేశాడు. తరువాత చాల కాలం తరువాత ఆతని వంశంలో పుట్టిన భగీరథుడు గంగను తీసికొని వచ్చి ఆ చితిమంటలపై ప్రవహింపచేశాడు. అపుడు వారికి ఊర్ధ్వలోక ప్రాప్తి కలిగింది. సగరపుత్రులు త్రవ్విన కారణం చేత సముద్రానికి సాగరమనే పేరు వచ్చింది. సార్థకత్వం చెందింది.

**భాగవతంలో ధ్రువుడు విష్ణుదర్శనం తరువాత రాజ్యాన్ని అరవైవేలయేండ్లు పాలించాడన్న పురాణవార్త నేటి విద్యావిధానంలో విద్యార్థులకు ఎలా నిరూపించవచ్చునో క్లుప్తంగా విశదీకరించండి?**

**- ఆర్.సత్యనారాయణ, హోసూరు, తమిళనాడు.**

భాగవతంలో ధ్రువుడు అరవైవేలయేండ్లు పాలించినట్లు లేదు. ఇరువదియారువేల యేండ్లు పాలించినట్లు పోతన భాగవతం చెబుతున్నది. ఇక మీ సందేహం అంత కాలమెలా జీవించగలరు? అని కదా! ఈ కథలో మనం విద్యార్థికి చెప్పవలసిన విషయమదికాదు. పసిపిల్లవాడైనను పట్టుదల ఉండి, దానికి తగినట్లు శ్రమిస్తే ఉన్నతోన్నత స్థానం పొందటానికి అవకాశముంటుంది. ముందు పట్టుదల. తరువాత దానికి తగ్గ కృషి – శ్రమ ఉంటే సాధించలేనిదిలేదు, అనే విషయం ధ్రువుని చరిత్ర నుండి విద్యార్థికి తెలియచేయాలి. ఇక భగవంతుడే ప్రత్యక్షమై వరమిచ్చాడు గనుక, వరప్రభావం వల్ల అన్ని వేలయేండ్లు రాజ్యం పాలించగలిగాడని చెప్పాలి. తరువాత ధ్రువపదమలంకరించాడు కదా! దానినెలా నమ్మాలి? అనే సందేహం కలిగితే దైవానుగ్రహంతో పొందలేనిది ఏదీ లేదు. మంచిబుద్ధితో, సత్త్వగుణంతో, మంచిశీలంతో భగవంతుని ఆరాధిస్తే ఆయన అనుగ్రహానికి పాత్రులమౌతామని వివరించాలి. ఆ సద్గుణాలు విద్యార్థులు అలవరచుకునేటట్లు బోధించాలి.

# విష్ణు భగవానుడు

- ఎం. గంగిరెడ్డి

వేదాలు, వేదాంగాలు, స్మృతులు, పురాణాలు, ఇతిహాసాలు మొదలైనవి హిందూ సంస్కృతికి మూల కందాలు. విష్ణుభగవానుని మాహాత్మ్యం వీటిలో సంపూర్ణంగా వివరించబడింది. వేదాల్లో విష్ణుభగవానుని గురించి విశేషంగా వ్యాఖ్యానాలున్నాయి.

వేదాలలో మనవాళ్ళు విష్ణుభగవానుడు మంగళ కరుడుగా కీర్తించారు.

విష్ణువు అనగా సర్వవ్యాపకుడని అర్థం. శుక్ల యజుర్వేదం 5-19 శ్లోకాలలో ఈ విధంగా ఉంది.

**దివోవా విష్ణు ఉతవా పృథివ్యా**
**మహోవా విష్ణు ఉరోరంతరిక్షాత్**

విష్ణుభగవానుడు భూమి, విస్తృత అంతరిక్షం, ద్యులోకాలకంటే గొప్పవాడు. ఈ కారణం వల్ల విష్ణువు అంతరిక్షం ఆదిగా గల లోకాలలో కూడా వ్యాపితమై ఉన్నాడు.

అథర్వవేదం 7-26-27 సూక్తాల్లో ఈ విధంగా తెలుపబడింది. "తత్ స్రష్టా తదేవానుప్రవిశత్" విష్ణుభగవానుడు స్వయంగా జగత్తును నిర్మాణం గావించి అందులో వ్యాపించి ఉన్నాడు.

"శ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ" అనే మంత్రం విష్ణుభగవానుని తెలియజేస్తుంది.

వేదాలలో ప్రత్యేకమైన శాఖలకు విభిన్నమైన ఉప నిషత్తులు ఉన్నాయి. వీటిలో సీతోపనిషత్ ఒకటి. ఈ ఉపనిషత్తులో శ్రీదేవి, భూదేవి, నీలాదేవి. విష్ణువు పత్నులుగా వర్ణితమై ఉంది.

**విష్ణులోకం -**

ఇది ఆదిత్యమండలంలో ఉంది. శుక్ల యజుర్వేదం 6వ అధ్యాయం 3వ మంత్రం ఈ విధంగా వివరించింది.

**యా తే ధామాన్యుశ్మసి గమ ధ్యై**
**యత్ర గావో భూరిశృంగా అయా సః**
**అత్రాహ తదురు గాయస్య విష్ణోః**
**పరమం పదమవ భాతి భూరి.**

విష్ణుభగవానుడు వసించే లోకాలు సదా ప్రకాశిస్తూ ఉంటాయి. సర్వత్ర, విష్ణుభగవానుని గానం చేసే భక్తులకు అవి పరమపదాలు. అదే ఆదిత్యమండల రూపంగా ప్రకాశింపబడు తోంది.

ఆదిత్యమండలాంతర్గత విష్ణులోకవాసి విష్ణువే. విష్ణుభగవానుని నిష్కామ, సంయమ, త్యాగాలతో ఉపాసకులు వారిని చేరుకునేందుకు జాగ్రత్తగా ఉపాసన చేస్తారు.

పరమపదం, వ్యోమం, బ్రహ్మలోకం, నాకం, అయోధ్య, వైకుంఠం - మొదలైనవి విష్ణుభగవానుని నివాస స్థానాలు.

వైకుంఠనగర విస్తృత వర్ణనము "త్రిపాద్విభూతి నారా యణోపనిషత్తు"లో వర్ణితమై ఉంది. ఈ లోకాన్ని సమీపించా లంటే మధ్యలో విరజానదిని దాటి భక్తవరేణ్యులు వైకుంఠాన్ని చేరుకుంటారు. సగుణోపాసకులు ఈ మార్గాన్నే అనుసరించితరిస్తారు. దేవతలకు రాక్షసులతో జరిగిన యుద్ధమందు దేవతలు విజయాన్ని పొందారు. పరబ్రహ్మమైన పరమాత్మ వారికి సాక్షాత్క రించాడు. ఈయన భగవత్స్వరూపుడు.

**ఓర్పు ఉంటే కవచంతో పనిలేదు.**
**కోప ముంటే శత్రువు లక్కరలేదు.**
**దాయాదివుంటే మరి నిప్పెందుకు?**
**మిత్రుడుంటే ఔషధాలతో అవసరమే మున్నది?**
**దుర్జనులుంటే ఇక సర్పాలక్కరలేదు.**
**అలాగే నిర్దుష్టమైన విద్య స్వాధీనమైతే ధనమెందుకు?**
**సిగ్గుంటే పైగా నగలెందుకు?**
**మంచి కవిత్వ ముంటే రాజ్య మెందుకు!**
**(ఓర్పు మొదలైనవి కవచాదులతో సమానమైనవని తాత్పర్యం)**

# కొండలరాయా!

కోటి కోటి దండాలు
కొండలరాయా !
నీ అండతోటె నా గుండియ
కదులుతోందయా ॥ కోటి ॥

మెట్టు మెట్టు బొట్టు పెట్టి
ఎక్కినామయా!
కొండజేరి గుండుకొట్టి
మొక్కినామయా!
ముద్దులొలుకు నీ రూపమ్మును
చూసినామయా!
ముడుపులన్ని హుండిలోన
వేసినామయా! ॥ కోటి ॥

మెడలో కౌస్తుభ దండను
జూచినామయా!
గొంతునెత్తి గోవిందాయని
వేడినామయా!
అన్నమయ్య పదములన్ని
పాడినామయా! ॥ కోటి ॥

మా మదిలోని మాయతరిమె
నామాలయ్యా!
మా కులదైవము
నీవేనయ్యా!
దిక్కుమొక్కులేని మాకు
దిక్కునీవయా!
చిక్కులన్ని బాప నీకు
మొక్కినామయా! ॥ కోటి ॥

- గొల్లాపిన్ని సుబ్రహ్మణ్య శర్మ

**యజ్ఞోవైవిష్ణుః -**

నిరుక్తమందు కూడా ఈ విషయం ప్రస్తావించబడింది. యజ్ఞం విష్ణు భగవానుని కార్యం. అధర్వవేదం సప్తమ కాండం 25-26 సూక్తం విష్ణు భగవానుని స్తుతించాయి.

అందులో సృష్టికర్తగా విష్ణుభగవానుడు తెలుపబడినాడు.

**యస్యేరుషు త్రిషు విక్రమణే**
**ష్వధిక్షయంతి భువనానివిశ్వాః**

**(శుక్ల యజుర్వేదం -5-20)**

విష్ణుభగవానుడు వామనావతారం ధరించి బలిచక్రవర్తిని మూడడుగులు దానమర్థించి రెండడుగులతో భూమి. ఆకాశాన్ని ఆక్రమించి, మూడవ అడుగుకు స్థానమేదని ప్రశ్నించగా బలి మూడవపాదం తన శిరస్సునందుంచి పవిత్రం చేయమని వేడుకుంటాడు. దృఢప్రతిజ్ఞుడు, సత్యవాది అయిన బలిచక్రవర్తి శిరస్సునందు తన మూడవ పాదాన్ని నిలిపి అతణ్ణి ధన్యుణ్ణి చేశాడు.

ప్రహ్లాద రక్షణార్థం విష్ణువు నరసింహావతారం ధరించాడు. వరాహావతారం ధరించి విష్ణుభగవానుడు భూమిని ఉద్ధరించాడు.

బలరామ; కృష్ణులిద్దరిదీ ఒకే తత్త్వావతారం. జయదేవుడు, రామానుజాచార్యులు ఈ విషయాన్ని సమర్థించారు. బలరాముడు అనంతుడు. వైకుంఠంలో సహస్ర ఫణధారి శేషుని రూపమందు శయ్యాది కార్యాలు చేస్తాడు.

విష్ణుభగవానుడు అన్ని కోరికలను నెరవేర్చుతాడు.

అధర్వవేదంలో 7-18-4. సూక్తంలో-

**త్వష్టా విష్ణుః ప్రజయా సంరరాణో**
**యజమానాయ ద్రవిణం దధాతు**

సిరిసంపదల్ని అభివృద్ధి చేసే విష్ణుభగవానుడు ప్రజలను ప్రసన్నులగా భావిస్తూ వారికి కావలసినంత ధనాన్నిమ్మని ప్రార్థించాడు.

భగవాన్ విష్ణువు తనభక్తులందరినీ సర్వ శుభాలతో రక్షించి, తనపై భక్తి భావముండేటట్లు చేయుగాక!



# అన్నమయ్య పదాలు - తత్త్వప్రబోధకాలు

- డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

అన్నమయ్య పదాల్లో ఆలోచనామృతమైన మంచి కవిత్వం, ఆపాత మధురమైన చక్కని సంగీతం ఉన్నాయి. తేనెలొలికే తెలుగు పలుకుబడి, మన దృష్టి నాకర్షించే మాండలికాల వంపు సొంపులున్నాయి.

అయితే వీటిని సమాజానికి అందివ్వాలన్న ఉద్దేశంతోనా ఆయన అన్ని పదాలు రాశాడు? కాదేమో?

కొంత లోతుగా ఆలోచిస్తే- ఆయన తాను దర్శించిన జీవితతత్త్వాన్ని, భక్తితత్త్వాన్ని, పరమాత్మతత్త్వాన్ని లోకానికి తెలియచెప్పటానికి, మానవాళిని ఉద్ధరించటానికి ఆ పదాలు రాశాడనిపిస్తుంది. విశేషించి-ఏ చదువులులేని జానపదులకు కూడ అర్థం కావాలని, వాళ్ళ హృదయాల మీద స్థిర ముద్ర వెయ్యాలని, సంగీత సాహిత్యభరితంగా, తేట తెలుగులో, మాండలికాలను రంగరించి, మధురాతి మధురంగా ఆ పదాలను రాశాడనిపిస్తుంది. ఆధ్యాత్మిక ప్రబోధమే పరమ లక్ష్యంగా ఆ పదాలను చెప్పాడనిపిస్తుంది.

అన్నమయ్య పేరు వినగానే ఒక రామాయణ శ్లోకం గుర్తు వస్తుంది. అది-అన్నగారిని అడవుల నుండి మళ్ళీ అయోధ్యకు తీసుకు వెళ్ళాలని, ఆయనకే అయోధ్యారాజ్యం అప్పగించాలని, చిత్రకూటం దాకా వచ్చిన తమ్ముడు భరతుణ్ణి తన తొడ మీద కూర్చుండపెట్టుకొని, అనేకానేక ధర్మవిషయాలు, పరిపాలనా విషయాలు, ఆధ్యాత్మిక విషయాలు చాలా సున్నితంగా చెపుతూ శ్రీరామచంద్రుడు చెప్పిన శ్లోకం.

**నన్దన్త్యుదిత ఆదిత్యే నన్దన్త్యస్తమితే రవౌ**
**ఆత్మనో నావబుధ్యన్తే । మనుష్యా జీవితక్షయమ్ ॥**

సూర్యోదయం కాగానే మనుషులు సంతోషిస్తున్నారట. ఎందుకు? అర్థార్జనకు ఇక పూనుకోవచ్చు కదా అని. అలాగే సూర్యాస్తమయం అయినా సంతోషిస్తున్నారట. ఎందుకు? కామోపభోగానికి ఇది తగిన సమయం కదా అని. కాని, ఆ సూర్యోదయ సూర్యాస్తమయాల మధ్య తరిగిపోతున్న తమ జీవితాన్ని గూర్చి- ఎంతో విలువైన మానవ జీవితాన్ని గూర్చి- తెలుసుకోలేకుండా ఉన్నారట.

మానవుడు సూర్యోదయ సూర్యాస్తమయాల మధ్య కేవలం అర్థకామాలను గూర్చి మాత్రమే ఆలోచించకుండ, తరిగిపోతున్న తన జీవితాన్ని గూర్చి విచారణ చేసుకొంటే చాలు, అతనిలో ఆధ్యాత్మిక చింతన ఆరంభమౌతుంది.

అన్నమయ్య కూడ అందరిలాగే కొంతకాలం అర్థ కామాల్లో మునిగి ఉన్నవాడే. అయినా ఆయన ఒక దశలో సూర్యోదయ సూర్యాస్తమయాల మధ్య తరిగిపోతున్న తన జీవితాన్ని గూర్చి ఎంతో లోతుగ ఆలోచించినట్లున్నాడు. అందుకే అంతదాకా ఆయన అంతరంగంలో అంతరగంగలా ఉన్న ఆధ్యాత్మికత ఒక్కసారిగ పైకి పొంగింది. ఆయన జీవితం పెద్ద మలుపు తిరిగింది. ఆ మహానుభావుడు జీవిత సత్యాన్ని స్పష్టంగా దర్శించాడు. తాను దర్శించిన జీవిత సత్యాన్ని తంబురా మీటుకుంటూ, గంతువేసుకొంటూ -

**నానాటి బ్రతుకు నాటకము - కానక కన్నది కైవల్యము**
**పుట్టుటయు నిజము పోవుటయు నిజము**
**నట్ట నడిమి పని నాటకము**
**కట్టకడపటిది కైవల్యము.... నానాటి బ్రతుకు....**

అని మానవాళికి తెలియచెపుతూ తిరిగాడు.

ఈ సత్యాన్ని దర్శించటానికి, ఆ కట్టకడపటి కైవల్యాన్ని పొందటానికి మామూలు మనుషులకున్న అడ్డుగోడలు రెండే రెండు. అవి అహంకార మమకారాలు. అవే 'నేను-నాది' అన్న భావనలు; 'నేను-నా వాళ్ళు' అనే అనుబంధాలు. అవి తొలగి పోవటానికే అన్నమయ్య 'ఓ మనిషీ! నీవెవ్వడివో ఆలోచించుకో' అని జీవుడి తత్త్వాన్ని తెలియచెప్పాడు.

**ఎవ్వరెవ్వరివాడో ఈ జీవుడు**
**ఎవ్వరికి ఏ మౌనో ఈ జీవుడు**
**ఎందరికి కొడుకుగాడు ఈ జీవుడు - వెనక** -అని అన్నాడు

ఇది-భార్యాబిడ్డల మీద అతిగా మమకారం పెంచుకుని, వాళ్ళకోసం అనేక అన్యాయాలు, అక్రమాలు చేసి అవి

నీతికి పాల్పడి, అతిగా ఆర్జించి, పిసినారిగా బతికి, విపరీతంగా కూడబెట్టే అజ్ఞానులందరికి కనువిప్పు కలిగించే పదం. 'ఓ మనిషీ! ఒక్కొక్క జన్మలో నీవే ఒక్కొక్కరివాడివి అవుతుంటే– ఈ జన్మలోనే కదా వీళ్ళు నీకు భార్యాబిడ్డలు. గత జన్మలో? వచ్చేజన్మలో? ఎవరికెవరు ఏమౌతారో కదా! అలాంటప్పుడు వీళ్ళకొరకు నీవు అంతగా ఆరాటపడాలా? అతిగా ఆర్జించాలా? అపరిమితంగా కూడబెట్టాలా? అనేక పాపాలు మూటగట్టు కోవాలా? అని ధ్వనింపచేశాడు. మితిమీరిన మమకారంతో ఇంత చేస్తున్నావే– అసలు నీ బ్రతుకెంతో ఆలోచించుకున్నావా?' అన్నాడు అన్నమయ్య. **'అంతా నీ మాయే కదా దైవమా!'** అని ఆశ్చర్యపడ్డాడు.

**తానెంత బ్రతుకెంత - దైవమా నీ మాయయెంత**
**మానవుల లంపటాలు-మరిచెప్పగలమా**

– అని అంతటితో ఆగకుండ, మనిషి ఆలోచించు కోటానికి వీలుగా చీమ సంగతి చెప్పాడు.

**చెలగి నేల బారేటి చీమ సయితమును**
**కలసి పూరకే పారు గ్రమ్మర నెందోమరలు**
**తలమోచి కాపురము ధ్యాన్యములు గూడబెట్టు**
**యిల సంసారము దన కింకయెంత గలదొ!**

కాలి క్రిందపడితే నలిగిపోతుంది చీమ. అయినా సంసారం మీద దాని కంత మమకారం! కూడబెట్టటం మీద దానికంత కాంక్ష.

**రిజిస్ట్రేషను ఫీజు మినహాయింపు**

***తిరుమల శ్రీవారికి భక్తులు మన రాష్ట్రంలో విరాళంగా సమర్పించే ఆస్తికి గాని / స్థలాలకు గాని రిజిస్ట్రేషన్ ఫీజు మినహాయిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. దాతలు ఈ విషయాన్ని గమనించి మినహాయింపు పొందవలసిందిగా విజ్ఞప్తి.***

చీమ బ్రతుకే కాదు – మనిషి బ్రతుకు మాత్రం ఎంత? అదొక నీటి బుడగ. ఎప్పుడేమౌతుందో ఎవ్వరికీ తెలీదు. గుండె ఆగినా, బండి ఢీ కొట్టినా అది అంతమౌతుంది. అయినా మనిషి కడశ్వాసదాకా ఆర్జనను గూర్చే ఆలోచిస్తాడు. కూడబెట్టిన ధనాన్ని గూర్చే కొడుకులతో గుసగుసలాడుతాడు. అది గమనించే అన్నమయ్య 'తానెంత బ్రతుకెంత–దైవమా!, నీ మాయయెంత; మానవుల లంపటాలు మరి చెప్పగలమా' అని ఆశ్చర్యపడి అన్నాడు.

మానవ జీవితానికి అతిముఖ్యాలు సుఖశాంతులే. అవి లేకుంటే– ఏవి ఉన్నా, ఎంత ఉన్నా, ఎవ్వరున్నా మనిషికి ఏమి ప్రయోజనం? అందుకే అన్నమయ్య –

**కంతలేని గుడిసె - ఒక్క గంపంతైనా చాలు**
**చింతలేని అంబలి - ఒక్క చారెడే చాలు** – అన్నాడు

కంతలంటే ఎండ, వాన నట్టింట పడేటట్లు చేసే ఇంటి పైకప్పు రంధ్రాలేకాదు, కాపురాల్లో, కలతలు. చింతలంటే రకరకాల ఆశలు, ఆలోచనలు, దిగుళ్ళు.

మనిషి తన సుఖశాంతులను ఎంతగానో కోల్పోవటానికి మూలకారణం, 'నేను–నాది' అన్న స్వార్థభావన. 'నీవు–నీది' అన్న భేదభావన. మనిషి ఆధ్యాత్మికంగా ఎదగాలంటే, ఉన్నతోన్నతస్థితిని పొందాలంటే, జీవిత పరమార్థాన్ని సాధించాలంటే రాగద్వేషాలను వదలుకోవాలి. స్వార్థభావనను, భేదభావనను దూరం చేసుకోవాలి. అందరూ ఒక్కటే, అంతా ఒక్కటే అన్న సమభావనను పెంపొందించుకోవాలి. అలా జరగాలంటే అతడు సృష్టిలో ఇమిడి ఉన్న పరమసత్యాన్ని తెలుసుకోవాలి; దర్శించాలి. అందుకే అన్నమయ్య –

**బ్రహ్మ మొక్కటే - పరబ్రహ్మ మొక్కటే**
**అందరికి శ్రీహరే అంతరాత్మ**

అని, ప్రబోధించాడు.

అట్లని ఇది అన్నమయ్య కొత్తగా శోధించి, సాధించి చెప్పిన సత్యం కాదు. ఇది అన్ని వేదాలు చెప్పిన 'ఏకంసత్' అన్న సత్యమే. అయితే సకల వేదసారమైన ఈ సత్యాన్ని ఇంత సరళంగా, ఇంత మధురంగా, ఇంత సులభంగా అందరికీ అర్థమయ్యే విధంగా చెప్పటమే అన్నమయ్య గొప్పతనం.

అన్నమయ్య చెప్పిన పదాలన్నింటికి ఈ పదం మకుటాయమాన మనిపిస్తుంది.

జీవితాన్ని చరితార్థం చేసే ఈ సత్యాన్ని దర్శించటానికి అందరికి అనువైన మార్గం భక్తిమార్గం. అందుకే అన్నమయ్య అందరికి ఆ మార్గాన్నే ప్రబోధించాడు.

భక్తి అంటే మనస్సును అర్థకామాల నుండి మరలించి పరమాత్మ మీద నిలపటం. అహంకార మమకారాలను వదలి ప్రహ్లాదుడన్నట్లు "సర్వము న్నతని దివ్య కళామయమంచు విష్ణు నందుల్లము చేర్చటం".

అన్నమయ్య ఆ స్థాయిని అందుకొన్న భక్తుడు.

కొందరు భక్తులు అహంకారాన్ని త్యజించటానికి భక్తిమార్గాన్ని అవలంబించి, తాము ఇంతగొప్ప భక్తులమని, అంత గొప్ప భక్తులమని, ఆధ్యాత్మికంగా ఇంత సాధించామని, అంత సాధించామని గొప్పలు చెప్పుకొంటుంటారు. అహం కారాన్ని ప్రదర్శిస్తుంటారు.

అన్నమయ్య ఇలాంటి భక్త్యహంకారాన్ని పూర్తిగ త్యజిం చిన భక్తుడు.

**వారధిదాటి మెప్పించ వాయుజుడనే గాను**
**సారె చవుల మెప్పించ శబరిగాను**
**ఘనముగ మోచి మెప్పించ గరుడుడనే గాను**
**నవ్వుచుపాడి మెప్పించ నారదుడగాను**

– అని, శ్రీమన్నారాయణునికి శిరస్సువంచి విన్నవించు కొన్నాడు. పరోక్షంగా భక్త్యహంకారాన్ని దరిచేరనీయకూడదని భక్తులకు తెలియచెప్పాడు.

అంతేకాదు, అన్నమయ్య తన భక్తిని తన ముక్తికి మాత్రమే వినియోగించుకోలేదు. ఏ దేవాలయంలోనో, ఏ ఆశ్రమంలోనో జపమాల తిప్పుకొంటూ కూర్చోలేదు. ఆయన తన భక్తిని మానవోద్ధరణకు వినియోగించాడు. మానవాళిని ఐహిక లంపటాల నుండి కొంతకు కొంతైనా బయటికి లాగి, భక్తిమార్గంలో నడిపించటానికి ప్రయత్నించాడు. తంబురా మీటు కొంటూ ఊరూరా, వాడ వాడా తిరిగి భక్తితత్త్వాన్ని ప్రచారం చేశాడు. మడికట్టుకొని కూర్చోకుండ – ఈ కులం, ఆ కులం, ఈ వర్గం, ఆ వర్గం అన్న తేడా లేకుండ – అన్ని కులాలవారితో, అన్ని వర్గాలవారితో కలిసిమెలసి తిరిగాడు.

అంతేకాదు. తాను వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు అధ్యయనం చేసినా – ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధానికి, భక్తిమార్గ ప్రచారానికి ఆయన శిష్టకవితా మార్గాలను వాడు కోలేదు. శ్లోకాల్లో, పద్యాల్లో ప్రచారం చెయ్యలేదు. ఆయన జాన పదమార్గాన్ని ఎన్నుకొన్నాడు. జానపదుల్లో విశేష ప్రచారంలో ఉండే జోలపాటల, కోలాటం పాటల, గొబ్బిళ్ళ పాటల, తందాన పాటల బాణీలనే తన పదరచనకు స్వీకరించాడు. అన్ని వర్గాల ప్రజల హృదయాల్లో హత్తుకునేలా జీవితతత్త్వాన్ని, భక్తితత్త్వాన్ని, పరమాత్మతత్త్వాన్ని ప్రచారం చేశాడు. పురందర దాసు ప్రతిదేవతామూర్తిలో విఠలుణ్ణి దర్శిస్తే – అన్నమయ్య అందరు దేవతామూర్తుల్లో శ్రీ వేంకటేశ్వరుని దర్శించాడు.

కాని, ఎవరెన్ని చెప్పినా, ఎవరెంతగా ప్రచారం చేసినా– మానవులు అర్థకామాలను త్యజించటం, సంసారాన్ని వదలటం, సర్వం విష్ణుమయంగా భావించటం, భావములోన బాహ్యము నందున గోవింద గోవిందయని కొలువటం, బ్రహ్మ మొక్కటే పరబ్రహ్మమొక్కటే, అందరికీ శ్రీహరే అంతరాత్మ అనే పరమ సత్యాన్ని దర్శించటం అంత సులభం కాదు. అది అందరికి సాధ్యమయ్యే పని కూడ కాదు. అందుకే అన్నమయ్య ఎవ్వరినీ నేల విడిచిన సాము చేయండనలేదు. నేల మీదనే ఉండి సాము చేసి, క్రమక్రమంగా నింగికెగిరి ఆ పరమాత్మను చేరుకొండని అన్నాడు. అందుకే వాస్తవిక దృక్పథంతో చేరుకోండని అన్నాడు. అందుకే వాస్తవిక దృక్పథంతో..

**సంసారమే మేలు సకల జనులకును**
**కంసాంతకుని భక్తి కలిగితే చాలు**

– అని చెప్పాడు, సామాన్య మానవులు సంసారంలో ఉన్నా – సరిఅయిన మార్గంలో పయనిస్తే చాలు–ఎప్పటికో ఒకప్పటికి గమ్యం చేరుకొంటారని ఆయన ఉద్దేశ్యం.

అన్నమయ్య కూడ సంసారిగా ఉండే కదా– విరాగి అయ్యాడు. భోగిగా ఉండేకదా – భక్తుడయ్యాడు. అన్ని లంప టాల్లో ఉండేకదా– ఆధ్యాత్మిక తత్త్వవేత్త అయ్యాడు. "సానబట్టిన భోగి ఈ జ్ఞాన యోగి" అని పేరు పొందాడు.

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## తిరుమలలో యాత్రికులు చేయవలసినవి

- ✓ తిరుమలకు బయలుదేరేముందు మీమీ ఇష్టదేవతలను పూజించండి.
- ✓ శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించే ముందు శ్రీవారి పుష్కరిణిలో స్నానంచేసి, శ్రీవరాహస్వామిని పూజించండి.
- ✓ స్నానం చేసి శుచిగా, శుభ్రమైన వస్త్రాలతో శ్రీవారి ఆలయంలోకి ప్రవేశించండి.
- ✓ ఆలయంలో ఉన్నపుడు స్వామివారిపైనే మీ ధ్యానం ఉంచండి.
- ✓ తిరుమల సమీపంలో ఉన్న ఆకాశగంగ, పాపవినాశనం తీర్థాలలో స్నానం చేయండి.
- ✓ తిరుమలలో ఉన్నపుడు మన ప్రాచీన ఆచార వ్యవహారాలను విధిగా పాటించండి.
- ✓ సాటి యాత్రికులను గౌరవించి వారిలో భక్తి భావాలు పెంపొందించండి.
- ✓ ఆలయంలో పూర్తిగా నిశ్శబ్దాన్ని పాటిస్తూ "ఓం శ్రీ వేంకటేశాయ నమః" అని మీలో మీరు శ్రీవారిని స్మరించండి.
- ✓ మీ కానుకలు శ్రీవారి హుండీలోనే సమర్పించండి.
- ✓ శ్రీవారి ఆలయంలో మీరు జరిపించ దలచిన పూజలకు గాని, మీకు కావలసిన సమాచారం కోసంగాని, తిరుమలలోని లేదా తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఏ సమాచార కేంద్రంలో అయినా అడగండి.
- ✓ తిరుమల పరిసరాలను శుభ్రంగా ఉంచండి. ఆలయంలోకి వెళ్లేముందు సాంకేతిక పరికరాలైన సెల్‌ఫోను, క్యాలుకులేటర్, కెమెరా, పాదరక్షలను మీ కాటేజీలలోగాని లేదా సమీపంలో ఉన్న వి.క్యూ.సిలో ఉంచండి.

## తిరుమలలో యాత్రికులు చేయకూడనివి

- ✖ విలువైన ఆభరణాలు, ఎక్కువ డబ్బు మీ వద్ద ఉంచుకోకండి.
- ✖ ఆలయంలోకి సెలఫోన్, కెమెరా వంటి పరికరాలను తీసుకువెళ్లకండి. ఆయుధాలను తీసుకురాకండి.
- ✖ ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి. పొగత్రాగకండి.
- ✖ వసతి సౌకర్యం కోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- ✖ ఆలయ పరిసరాల్లో పాదరక్షలు ధరించకండి.
- ✖ శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ✖ ఆలయంలో సాష్టాంగ దండ ప్రణామాలు చేయకండి.
- ✖ వీధివర్తకుల నుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- ✖ శ్రీవారి దర్శనం కోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశాలతో తిరమలకు రాకండి.
- ✖ శ్రీవారి దర్శనం కోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చేవరకు ఆగండి.
- ✖ ఆలయ ప్రాంగణంలో ఉమ్మి వేయటం వంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ✖ ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- ✖ తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజకే.
- ✖ భిక్షకులను ప్రోత్సహించకండి. పరిసరాలను అపరిశుభ్రం చేయకండి.
- ✖ అపరిచితులను కాటేజీలలోనికి అనుమతించకండి, గది తాళాలు ఇవ్వకండి.
- ✖ నీరు, కరెంటు వృథా చేయకండి.
- ✖ మాంసాహారాన్ని భుజించకండి.



# బాలవాక్కు!

## వామనుడు

ప్రహ్లాదుని మనుమడైన బలిచక్రవర్తి సమస్త భూమండలాన్ని జయించి చక్రవర్తిగా కీర్తి ప్రతిష్ఠలార్జించినా అతనికి సంతృప్తి కలుగలేదు. దాంతో స్వర్గలోకంపైకి దండెత్తి దేవతలను జయించాడు. ఈ పరిస్థితిలో దేవతలందరూ మహావిష్ణువు వద్దకు వెళ్ళి తమను రక్షించమని, ప్రార్థించారు.

శ్రీమహావిష్ణువు అదితి కశ్యపులకు పుత్రుడై జన్మించాడు. అతను మరుగుజ్జు అయినందువల్ల వామనుడుగా పేరు పొందాడు. వేదవేదాంగాలను అభ్యసించి ప్రఖ్యాతిగాంచాడు.

బలిచక్రవర్తి మహాయజ్ఞము చేస్తున్నాడని తెలిసి వామనుడు ఆతని వద్దకు వెళ్ళి మూడు అడుగుల స్థలం ఇవ్వమని అడిగాడు. బలిచక్రవర్తి అందుకు అంగీకరించాడు.



శుక్రాచార్యుడు వామనుడు శ్రీమహావిష్ణుమూర్తే అని తెలుసుకుని బలిచక్రవర్తికి వామనుడు కోరిన దానం ఇవ్వద్దని పరిపరివిధాల నచ్చచెప్పాడు. కానీ, ఆయన ప్రయత్నం ఫలించ లేదు. అందుకు కారణం బలిచక్రవర్తి ఆడిన మాట తప్పేవాడు కాదు. అందువల్ల శుక్రాచార్యులు చిన్న పురుగు రూపంలో జలపాత్ర కొమ్ముకి అడ్డుగా వచ్చాడు. పాత్రనుండి నీరు బయటకు రాకుండా చేశాడు. అప్పుడు వామనుడు కొమ్మును దర్భతో పొడవమని చెప్పగా బలిచక్రవర్తి దర్భతో పొడిచాడు. శుక్రాచార్యులుకి యధారూపం వచ్చింది కానీ ఆయన కన్నుపోయింది.




**ఎం.జి.అనంత్,**

**6వ తరగతి,**

**దీప్తి ఇంగ్లీషు మీడియం హైస్కూల్,**

**మేలాపురం, హిందూపూర్-515 201.**


ఇచ్చిన మాట ప్రకారం బలి మూడు అడుగుల స్థలం ఇవ్వగానే వామనుడు తన శరీరాన్ని పెంచాడు. ఒక పాదంతో భూమిని, ఇంకో పాదంతో ఆకాశాన్ని ఆక్రమించి త్రివిక్రమ అవతారాన్ని దాల్చాడు. బలిచక్రవర్తి ఆశ్చర్యచకితుడయ్యాడు.

వామనుడు మూడో పాదానికి స్థలమేదని అడిగాడు. అప్పుడు బలిచక్రవర్తి తన శిరస్సు చూపగా, వామనుడు శిరస్సుపై పాదాన్ని ఉంచి ఆతన్ని పాతాళానికి అణగదొక్కాడు.

ఇదంతా తెలుసుకున్న బలిచక్రవర్తి భార్య వింధ్యావళి తన భర్తకి అన్యాయం చేయవద్దని మనస్ఫూర్తిగా వామనుని ప్రార్థించింది. అప్పుడు బలిచక్రవర్తి తపస్సు చేసే మందిరం వాకిలి వద్ద తానే స్వయంగా గదాధరుడై ఉంటానని అభయమిచ్చెను.

## డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమము - 05-02-2010

## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఇ.ఓ.'*** *కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 05-02-2010న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం)*

**మహాఅంగప్రదక్షిణలో ప్రదక్షిణ ఒకసారికి మించి చేసుకోనివ్వడం లేదు.** *- అశోక్, చెన్నై*

**కార్యనిర్వహణాధికారి :** ఇది తప్పు. ప్రదక్షిణ గుడి బయట గాబట్టి ఎన్నిసార్లైనా చేసుకోవచ్చు.

**కల్యాణోత్సవంలో స్వామివారికి కల్యాణచుక్కలు పెట్టడం లేదు.**

*- కె. శైలజ, మచిలీపట్నం*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలించి వెంటనే అమలుచేస్తాం.

**పరకామణి దర్శనం నాకు లభించేటట్లు చూడండి**

*- రామవెంకటశర్మ, విజయనగరం*

**కార్యనిర్వహణాధికారి :** ఆ కోరిక తీరాలంటే మీరు అదృష్టవంతులై ఉండాలి.

**నేను వస్త్రాలంకార సేవకు బుక్ చేసుకున్నాను అది 2022 కు ఇచ్చారు. నేను హృద్రోగిని. కాబట్టి కనికరించండి**

*- సుబ్రహ్మణ్య రెడ్డి, చంద్రగిరి*

**కార్యనిర్వహణాధికారి :** ఇది అసాధ్యం.

**కోయిలాళ్వారు తిరుమంజనంకు గత సంవత్సరంలో డి.డి. పంపాను. టికెట్టు రాలేదు.** *- పద్మజ, బెంగుళూరు*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలించి పంపుతాము.

**ఆర్జితసేవా టిక్కెట్లను మాఊరిలోనే తీసుకోవచ్చా?**

*- ప్రసాద్, నెల్లూరు*

**కార్యనిర్వహణాధికారి :** మీ ఊరిలో ఉన్న తి.తి.దే. ఇన్ఫర్మేషన్ సెంటర్‌లో పొందవచ్చు

**మహాలఘు దర్శనాన్ని నివారించలేరా?**

*- జయప్రకాష్, హైదరాబాదు*

**కార్యనిర్వహణాధికారి :** నివారించలేము.

**ఆర్జితసేవా టిక్కెట్లతోపాటు వసతిని కూడా అప్పుడే బుక్ చేసుకునే అవకాశం కల్పించండి.** *- సి.యస్.రెడ్డి, హైదరాబాదు*

**కార్యనిర్వహణాధికారి :** చాలామంచి ఆలోచన. దీనిలో సాధ్యాసాధ్యాలు పరిశీలిస్తాం.

1. **అఖండనామ సంకీర్తనల్లో గిరిజన అర్చకులకు అవకాశం కల్పించండి.**
2. **గిరిజన ప్రాంతాల్లో, ఏజెన్సీ మండలాల్లో స్వామివారి కల్యాణోత్సవాలు జరిపించండి.**
3. **రైళ్ళల్లో ఇతర మతస్తులు కొండకు వచ్చే భక్తులపై తమ మతాన్ని రుద్దుతున్నారు.**

*- తణుకు వెకటరామయ్య, అడ్డతీగల*

**కార్యనిర్వహణాధికారి :** 1. పరిశీలిస్తాం.

2. చాలామంచి ఆలోచన. దీనిలో సాధ్యాసాధ్యాలు పరిశీలిస్తాం.

3. దీనిని పర్యవేక్షించి ఆ దిశలో చర్యలు తీసుకుంటాం.

**తిరుమలలో కెమరాలు తీసుకురాకుండా చర్యలు తీసుకోవాలి.**

*- దర్శన్‌లాల్, గుంటూరు*

**కార్యనిర్వహణాధికారి :** ఖచ్చితంగా.

**మేము దర్శనానికి వచ్చేటప్పుడు చంటిపిల్లలతో చాలా అవస్థలు పడుతున్నాం. పిల్లలకు పాలు వేడిచేసే వార్మర్ తెచ్చుకుంటే సెక్యూరిటీ వాళ్ళు చాలా అమానుషంగా ప్రవర్తిస్తున్నారు.**

*- లక్ష్మి, చెన్నై*

**కార్యనిర్వహణాధికారి :** అలాంటి వాళ్ళు భగవంతుడి సేవకు పనికిరారు. వాళ్ళపై కఠిన చర్యలు తీసుకుంటాం. అలిపిరి దగ్గర సిబ్బందికి గుర్తింపు కార్డులు మంజూరు చేస్తున్నాము. భక్తులను ఇబ్బందిపెట్టేవారిని మా దృష్టికి మీరు తీసుకురావచ్చు.

**నిత్యాన్నదాన పథకానికి లక్ష రూపాయల విరాళం ఇవ్వాలనుకుంటున్నాను. మా అమ్మాయికి, అబ్బాయికి దర్శనవసతులు కల్పిస్తారా?** *- ప్రసాదరావు, గుంటూరు*

**కార్యనిర్వహణాధికారి :** ఖచ్చితంగా కల్పిస్తాం.

అక్షరామృతం [20]



# అన్నమయ్య - నైచ్యానుసంధానం

- డా|| ఇ.చంద్రమౌళి

అన్ని సమస్యలకీ మూలం అహంకారం. మమకారం. తనకు సంబంధించినవి, తాను చేసినవి, తాను చెప్పేవి అన్నీ గొప్పవి. తాను గుణవంతుడు. తాను ధనవంతుడు. తానే రూపవంతుడు. తనవారు ఉన్నతులు. తనవారు ఉత్తములు అన్నవి అహంకారంవల్ల, మమకారంవల్ల వచ్చేవి. తాను, తన వారు తప్ప మిగిలినవారంతా తక్కువవారు, నీచులు అనుకోవడం వల్లే మనస్తాపాలు, సమస్యలు ఉత్పన్న మౌతాయి.

ఈ రకమైన సమస్యలు నివారింపబడాలంటే మొట్ట మొదట తను ఏమిటి? తన స్థానం ఏమిటి? తన నిజస్వరూపం ఏమిటి? అని తెలుసుకోవాలి. ఇవన్నీ ఎప్పుడు తేటతెల్ల మౌతాయో అప్పుడు ఇతరులలో తప్పులు చూడడం తప్పు అన్న తన తప్పు తెలిసివస్తుంది. అప్పుడు తన మనసులో తనపట్ల తనకే ఒక రకమైన జుగుప్స కలుగుతుంది. ఇది ఎప్పుడు కలుగుతుందో అప్పుడు ఎదుటివారిని నీచంగా చూడడం, కించ పరచడం జరుగవు. ఎదుటివారిని ఉన్నతులుగా, గొప్పవారుగా చెప్పడం ద్వారా తనను తక్కువగా, నీచుడుగా, నికృష్టుడుగా భావించుకోవడానికి వీలౌతుంది. దీనినే శ్రీవైష్ణవసంప్రదాయంలో **నైచ్యానుసంధానం** అంటారు.

శ్రీవైష్ణవసంప్రదాయాన్ని అణువణువు జీర్ణించుకున్న అన్నమాచార్యులు ఆ సంప్రదాయంలోని విషయాలన్నిటినీ తన సంకీర్తనల్లో పొందుపరిచాడు. అలాంటి విషయాల్లో ముఖ్యంగా కనిపించే అంశం నైచ్యానుసంధానం.

అన్నమయ్య సంకీర్తనల్లో ఈ నైచ్యానుసంధానం అనేక విధాలుగా కనిపిస్తుంది. దీన్ని స్వరూపసంబంధి, గుణసంబంధి, క్రియాసంబంధి, బుద్ధిసంబంధి, ఇంద్రియ సంబంధిగా వింగ డించి పరిశీలించవచ్చు.

## స్వరూపసంబంధి

స్వరూప సంబంధమైన నైచ్యానుసంధానం మొట్ట మొదట పేర్కొనదగింది. ఇందులో అన్నమయ్య తన స్వరూపాన్ని రాయితో, కీటకంతో, పసరంతో, పశువుతో, పాముతో, శునకంతో పోల్చుకోవడం కనిపిస్తుంది. జీవుడు జ్ఞానస్వరూపుడు. అలాంటి జీవుణ్ణి అచేతనమైన రాయితో పోల్చడం గుర్తింపదగింది. తాను మహాభక్తుడైనా, చైతన్యరహితమైన, చలన రహితమైన వస్తువునంటున్నాడు. శిలలాగా ఉన్న తనమీద కూడా భగవంతుని దయ ప్రసరిస్తుందని అన్నమయ్య భావన. అందుకే -

**వసుధలో రాయి వంటి వాఁడను దయదలఁచ**
**యెసఁగ నన్నేరీతి నీవేలితివి దైవమా!** (4-23) అన్నాడు.

రాయి మాత్రమే కాకుండా చలనం కలిగి జ్ఞానం లేని కీటకం వంటి ప్రాణులతో తనను పోల్చుకున్నాడు అన్నమయ్య.

**పెక్కు బ్రహ్మాండములు నీ పెను రోమకూపములఁ**
**గిక్కిరిసున్నవందొక కీటమ నేను** (3-42)

**పసరమువంటివాఁడఁ బాలించవె** (4-227)

అని తన స్వరూపాన్ని నైచ్యానుసంధానం చేశాడు.

## గుణసంబంధి

గుణసంబంధి నైచ్యానుసంధానం ప్రధానమైంది. స్తోత్రం, దూషణం గుణాన్ని ఆధారంగా చేసుకునే ఉంటాయి. సుగుణం ఎక్కడ ఉంటే అక్కడ స్తోత్రం చోటుచేసుకుంటుంది. దుర్గుణం ఎక్కడ ఉంటే అక్కడ దూషణం ఉంటుంది. నైచ్యానుసంధానం చేస్తున్న అన్నమాచార్యుడు తన గుణాలను కూడా నీచాతినీచంగా పేర్కొన్నాడు.

**యిన్నిటా నాకంటే హీనుఁడిఁక మరెవ్వఁడూ లేడు** (3-45)

**అపవిత్రుఁడ నేనమంగళుఁడ గడు -**

**నపగత పుణ్యుఁడ నలసుఁడను**

**కపట కలుష పరికర హృదయుఁడనే**

**.................................................**

**అతి దుష్టుఁడ నే నధికదూషితుఁడ**

**హత వివేక మతి నదయుఁడను (1-33)**

అన్నాడు. పరమభక్తుడైన అన్నమయ్య గుణాలకే మకుటం వంటివాడు. అలాంటివాడు తనను నీచంగా అల్పంగా పేర్కోవడంవల్ల ఆయన మనసు ఎంత పరిపక్వత నొందిందో మనకు స్పష్టమౌతోంది.

### క్రియాసంబంధి

బ్రహ్మజ్ఞానులలో కూడా క్రియాశీలురు మహాశ్రేష్ఠులు. అన్నమయ్య భగవంతుని సేవకే నిరంతరం అంకితమైనవాడు. పదకైంకర్యంతో జీవితకాలమంతా వేలాది కీర్తనలతో శ్రీవారిని పూజించిన వాడు. ఆ విధంగా క్రియాశీలుడిగా ఉండి కూడా తనను పాతకుడుగాను, అలసుడుగాను పేర్కొన్నాడు.



**పరమ పాతకుఁడ భవబంధుఁడ (1-33)**

**అతి దుష్టుఁడ నేనలసుఁడను (1-78)**

అంటూ ఎన్నో కీర్తనలలో తనను తాను అపరాధినని, పాపాత్ముడనని అన్నమయ్య ఆరోపించుకున్నాడు.

### ఇంద్రియసంబంధి

ఇంద్రియ సంబంధి నైచ్యానుసంధానం చాలా ముఖ్యమైంది. కఠోపనిషత్తులో ఇంద్రియాలను గుర్రాలతో పోల్చడం ప్రసిద్ధమైన విషయం. ఇంద్రియాలు నిగ్రహింపబడాలి. అన్నమయ్య ఇంద్రియాలను జయించినవాడే. కానీ తనను తాను ఇంద్రియాలకు బానిసగా ఆరోపించుకుని నైచ్యానుసంధానం చేసుకున్నాడు.

**పంచేంద్రియాల ధనవంతుడను నేను (3-48)**

**మహిలో సంసారపు సామ్రాజ్యమేలేవాఁడను (3-48)**

**ఎప్పుడు నేము చూసిన ఇంద్రియ కింకరులము (3-176)**

అంటూ ఇంద్రియాలపరంగా అన్నమయ్య అనేక చోట్ల పేర్కొన్నాడు.

### బుద్ధిసంబంధి

మంచిబుద్ధి ఉంటేనే మంచి రౌతు కాగలడు. మంచి రౌతు అయితేనే ఇంద్రియాలనే గుర్రాలను అదుపు చేయగలడు. అన్నమయ్య జితేంద్రియుడైనాడు. అందువల్లనే సద్భక్తి అలవడింది. ఈ సద్భక్తితో జీవితాంతం భగవన్నామకీర్తన చేశాడు. తరగని సంకీర్తన రాసిని మనకు అందించాడు. అయినా తనను తాను –

**అతి మూఢులలోన అగ్రేసరుఁడ నేను (3-48)**

**సారెకు అజ్ఞాని నేను (2-53)**

**భావించ నేరనైతి పశుబుద్ధి నైతిని (3-20)**

అని బుద్ధిపరంగా కూడా అన్నమయ్య నైచ్యానుసంధానం చేయడాన్ని మనం గమనించవచ్చు.

ఈ విధంగా స్వరూప, గుణ, క్రియా, బుద్ధి, ఇంద్రియ సంబంధి విషయాలలో నైచ్యానుసంధానం చేసుకున్న అన్నమయ్య భాగవతులకు, తనకు మధ్య తారతమ్యాన్ని, భగవంతు

నికీ తనకీ మధ్య తారతమ్యాన్ని చెప్పడంలో కూడా నైచ్యాను సంధానాన్ని పాటించాడు.

భగవంతుని ముందు తనను అల్పుడుగా భావించడం సరి, భాగవతుల ముందుకూడా ఆవిధంగా భావించడం ఎందుకు? అన్న ప్రశ్న కలుగవచ్చు. దీనికి వివరణ

శాండిల్య సంహిత 4. అ.86 శ్లోకంలో ఉంది.

**అనాదృత సుతం గేహీ పురుషం నాఽభినందతి ।**

**తథాఽనర్చిత సద్భక్తం భగవాన్ నాఽభినందతి ॥**

తనబిడ్డను ఆదరించని వానిని తండ్రి ఎలా అభినందించడో, అదేవిధంగా తన సద్భక్తుని అర్చించని వానిని భగవంతుడు కూడా చల్లగా చూడడు అని చెప్పబడింది. అందువల్లే అన్నమయ్య భగవద్భక్తులను కూడా భగవంతునితో సమంగా, కొన్ని సందర్భాల్లో అధికంగా కూడా అర్చించడం కనిపిస్తుంది.

అందుకే,

**నీవే నీదాసులని నినుగంటిఁ**
**నీ దాసుల శిరసులే నీ దివ్య శిరసులు**
**నీ దాసుల పాదములే నీ దివ్యపాదములు**
**నీ దాసుల కన్నులే నీ దివ్య నేత్రములు**
**నీ దాసుల రూపమే నీ విశ్వరూపము**
**నీ కింకరుల గుణాలే నీ దివ్యగుణములు**
**నీ కింకరులున్న చోటే నిత్య వైకుంఠము**
**నీ కింకరుల సేవ నీవు మెచ్చు నిజసేవ**
**నీ కింకరుల కూటమే నీకు సర్వాంగములు (4-98)**

అని అన్నమయ్య హరిదాసులను హరితో సమానంగా చూడడం కనిపిస్తుంది. భగవద్భక్తుల ముందు తనను అల్పునిగా, అణువంతవానిగా చెప్పడం అనేక సందర్భాల్లో చూడగలం.

**అచ్చపు నీ దాసులు అనంతము వారలకు**
**రిచ్చల నేనొక పాదరేణువు నింతే (3-42)**

అని భగవద్భక్తులైన బ్రహ్మాదులు, వసిష్ఠాదులు, నారదాదుల ముందు తన సేవలు, పూజలు అసలు లెక్కలోనివి కావన్నాడు అన్నమయ్య.

భగవద్భక్తులముందు తన స్థానం ఏపాటిదో పేర్కొన్న అన్నమయ్య భగవంతుని ముందు తానెంతో కూడా పేర్కొన్నాడు.

**నీవెంత నేనెంత నీకునాకు నెంతదవ్వు (3-51)**

**నీవు దేవుఁడవు నేనొక జీవుఁడ (3-116)**

**దేవ! నేనొక్క నీచుఁడ దీనరక్షకుఁడవు నీవు (3-286)**

అని భగవంతుని ముందు తనను తక్కువగా భావించి, తన అశక్తతను, అకించనత్వాన్ని, దిక్కులేనితనాన్ని వ్యక్తం చేస్తూ శరణాగతి వైపు మనసును మళ్ళించడం గమనించవచ్చు. ఇక్కడ నైచ్యానుసంధానం శరణాగతికి దారి తీయడం గుర్తించవలసిన విషయం. శ్రీవైష్ణవసంప్రదాయంలో శరణాగతి చాలా ముఖ్యమైన అంశం. వాల్మీకి రామాయణానికి శ్రీవైష్ణవసంప్రదాయంలో శరణాగతి శాస్త్రమనేపేరు. భగవద్రామానుజులు శరణాగతి గద్యను రచించి అనుష్ఠించి చూపాడు. ఆ తరువాతి ఆచార్య పురుషులందరూ అదేమార్గంలో నడిచారు. అన్నమయ్య కూడా అందులో ఒక్కడు. అందుకే ఆయన తన సంకీర్తనల్లో –

**ఎందునూ నీవే కాక యేదిగతి యిఁకను (3-221)**

**ఎవ్వరు దిక్కింక నాకు నేది బుద్ధి (3-80)**

**శరణు వేడెద యజ్ఞసంభవ రామ**
**అరసి రక్షించు మమ్ము నయోధ్యరామా! (3-155)**

అంటూ అనేక సందర్భాల్లో అన్నమయ్య తన అశక్తతను, అకించనత్వాన్ని చాటుతూ శ్రీమన్నారాయణుని శరణు వేడడం మనకు కనిపిస్తుంది.

భగవంతుని ముందు అందరూ అల్పులే. ఇది సత్యం. లేని స్వరూపాన్ని, లేని గుణాన్ని, లేని క్రియని, లేని ఇంద్రియ లోలత్వాన్ని తనకు ఆరోపించుకోవడం నైచ్యానుసంధానం అవుతుంది. 'నీవు దేవుడు నేను జీవుడ'న్నచోట యథార్థం చెప్పబడింది. అదే 'పురుషోత్తముడ నీవు పురుషాధముడనేను' అన్నచోట యథార్థానికి భిన్నంగా ఆరోపించుకోవడం కనిపిస్తుంది.

ఇలా అన్నమయ్య నైచ్యానుసంధానం చేసుకొని, అహంకారాన్ని వదిలిపెట్టి, వినయ సంపన్నుడై భగవంతుని శరణు వేడి, లోకానికి ఆదర్శప్రాయంగా చిరస్థాయిగా నిలిచిపోయాడన్నది అక్షర సత్యం.

# శ్రీవారి సేవలో....!

- పి.పద్మావతి




మేము హైదరాబాదులో ఉంటున్నాము. మా వారు ఆర్.టి.సి.లో ఉద్యోగం చేస్తున్నారు. కనుక ఉచిత పాస్ సౌకర్యం వల్ల గత 30 సంవత్సరాలుగా క్రమంతప్పకుండా తిరుమల వెంకన్న దర్శనం చేసుకుంటున్నాం. ఎప్పుడు వెళ్ళినా హడావిడిగా వెళ్ళి రావడమే జరుగుతోంది. నాకు ఒక వారం తిరుమలలో ఉండాలని ఎంతో కోరిక. కానీ అది తీరలేదు.

2004 సంవత్సరంలో ఉన్నట్లుండి ఎన్నో చికాకులు నన్ను చుట్టుముట్టాయి, అప్పుడు అనిపించింది. అందరిని వదిలేసి తిరుమల వెళ్ళి గుడి ముందర కూర్చుని వీలు కలిగినప్పుడు దైవదర్శనం చేసుకుంటూ కొంతకాలం గడపాలని. కాని మహిళలు ఒంటరిగా చెప్పకుండా వెళితే, నిందలు మోయాల్సి వస్తుందని భయపడి వెళ్ళలేదు.

2008 సంవత్సరం జూన్ నెలలో **"శ్రీవారిసేవ"** క్రైస్కౌట్ వాళ్ళు తిరుమల వెళ్ళవచ్చని తెల్సింది. అలా తీసుకు వెళ్ళే టీం లీడరును కలిశాను. అమె నన్ను తీసుకువెళతానని అన్నారు. పదిరోజుల తర్వాత ఫోన్ చేస్తే ఇప్పుడు తీసుకు వెళ్ళే అవకాశం లేదని, అలాంటి అవకాశం మళ్ళీ వచ్చినప్పుడు తీసుకువెళతానని చెప్పారు. సరే నా దురదృష్టం అనుకున్నాను. అంతలోనే నాకు చాలా జబ్బు చేసింది. ఇక నా అవస్థ చెప్పనలవి కాదు. తట్టుకోలేని శరీరబాధ ఒకవైపు, తిరుమల వెళ్ళలేనేమోననే బాధ ఒకవైపు. 8 నెలలు గడిచాయి. స్వామి దయవలన కోలుకున్నాను. డాక్టర్లు మందులు ఇక వాడవద్దన్నారు.

విచిత్రంగా ఆ రోజే టీం లీడర్ నాకు ఫోన్ చేసి తిరుపతి ప్రయాణం ఉందని నన్ను రమ్మని పిలిచింది. అప్పటివరకు ఆమె తిరుపతి వెళ్ళనే లేదని చెప్పారు. ఇక నా సంతోషానికి అంతు లేదు. నా కోసమే భగవంతుడు ఇన్ని రోజులు ప్రయాణం ఆపుచేశాడు. ఎందుకంటే అంత జబ్బులో నేను ప్రయాణం చెయ్యలేను కదా! నాకు నయం కాగానే ఆ అవకాశం ఇప్పుడు వచ్చింది. సంతోషంగా తిరుమలకు ప్రయాణం అయ్యాను.

వారం రోజులు గుడి ముందర కాకుండా సాక్షాత్తు దేవుని సన్నిధిలో గంటలు, గంటలు శ్రీవారిసేవ నిర్వహిస్తూ ఆ దేవదేవుని దర్శిస్తూ తరించాను. అసలు ఏ నొప్పులు, ఏ బాధలు గుర్తుకురాలేదు. వివిధ రకాలైన శ్రీవారి ప్రసాదాలు లభించాయి. ఈ జన్మకు ఇది చాలనుకున్నాను. అవకాశం వస్తే తప్పక మరలా వెళతాను.

నిజంగా స్వామివారి సేవ చేసుకోవడం, శ్రీ వేంకటేశ్వర స్వామి లీలే తప్ప మరొకటి కాదని, నా విశ్వాసం. అందుకే శ్రీ వేంకటేశ్వరుడు నా ఆరాధ్యదైవం.



ఈ మెట్ల దారినుండి కూడా
**తిరుమలకు చేరుకోవచ్చు**
**తిరుపతి నుండి,**
**శ్రీనివాసమంగాపురం దగ్గరలో ఉన్న**
**శ్రీవారి మెట్టు నుండి,**
**తిరుమలకు త్వరగా చేరచ్చు.**
**తిరుపతి ఆర్.టి.సి. బస్టాండ్ నుండి**
**నిర్ణీతవేళలలో శ్రీవారి మెట్టు వరకు**
**బస్సు సౌకర్యం కలదు.**
**ఇక్కడి నుండి మెట్లు ఎక్కి**
**తిరుమల చేరుకోవచ్చు.**

క్రింద పేర్కొన్న తి.తి.దే. గ్రంథాలు లభించే చిరునామా :
పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తి.తి.దేవస్థానం,
తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083.
ఇతర వివరాలకు : 0877 - 2264294

తిరుమల తిరుపతి దేవస్థానముల....

# పుస్తక పరిచయం



[10]

## తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథాలు

### 1) భాసుని భారత నాటకములు

అనువాదం- చిలకమర్తి లక్ష్మీనరసింహం
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 145;
మూల్యం: రూ.25/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.22/-)

"తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి" అనేది నానుడి. ఇంత విశిష్ట స్థానాన్ని అలంకరించిన మహాభారతంలోని కొన్ని ఘట్టాలను ఆధారంగా చేసుకొని భాసమహాకవి సంస్కృత భాషలో కొన్ని నాటకాలు రచించారు. చిలకమర్తివారు తమ లలిత గ్రాంథికభాషా శైలిలో అనువదించిన భాసుని భారత నాటకములు అనే ఈ గ్రంథాన్ని దేవస్థానం స్వీయ ప్రచురణగా స్వీకరించింది. ధర్మము, నీతి సమాజంలో ఏనాటికైనా విజేతలుగా నిలుస్తాయనేది ఈ రచనల ద్వారా మనకు అందే సందేశం.

### 2) ప్రచ్ఛన్న పాండవము

రచయిత- చిలకమర్తి లక్ష్మీనరసింహం
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 94;
మూల్యం: రూ.15/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.22/-)

మహాభారతంలోని కొన్ని ఘట్టాలను ఆధారంగా చేసుకొని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు ప్రచ్ఛన్నపాండవం అనే పుస్తకాన్ని రచించారు. చిలకమర్తివారు తమ గయోపాఖ్యాన నాటకంతో ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించిన మహనీయులు. వీరు తమ గ్రాంథికభాషా శైలిలో రచించిన నాలుగు ప్రకరణాల ఈ ప్రచ్ఛన్నభారత వచన గ్రంథాన్ని దేవస్థానం స్వీయ ప్రచురణగా స్వీకరించింది. విరాటపర్వంలోని కొన్ని ప్రధాన ఘట్టాలు ఆధారంగా ఈ కథ నడుస్తుంది. ధర్మము, నీతి సమాజంలో ఏనాటికైనా విజేతలుగా నిలుస్తాయనేది ఈ రచన ద్వారా మనకు అందే సందేశం.

### 3) పుష్ప చింతామణి

తెలుగు అనువాదం-
డా॥ ప్రభాకర వర్ధన్
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 72;
మూల్యం: రూ.10/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.21/-)

వైదిక ధర్మంలో ముఖ్యంగా దేవతార్చనలో పుష్పాలు ప్రధాన స్థానాన్ని పొందాయి. పూలులేని పూజ వ్యర్థమని ఆర్యోక్తి. ఒక్కొక్క సుమం ఒక్కొక్క దేవునికి ప్రీతిపాత్రమైనది. కనుక ఆయా దేవతలకు నిర్దేశింపబడిన ఆయా పుష్పాలతోనే పూజ జరపాలని శాస్త్రనిర్దేశం. ఇలాంటి విశేషాలను తెలుసుకుని ఆయా పుష్పాలను ఉపయోగించి, పూజలు నిర్వహించుకోవడానికి అనువుగా ఈ గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురించింది. సంస్కృతంలో ఉన్న పుష్పచింతామణి సంకలన గ్రంథానికి తెలుగు అనువాదమీ గ్రంథం.

**ఈ గ్రంథాలను పోస్టుద్వారా పొందదలచిన వారు 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారి పేరున డి.డి.ని తీసి పై చిరునామాకు పంపాలి.**

గ్రంథసమీక్ష

# మానవతా విలువలు

**(సంపూర్ణ వ్యక్తిత్వ వికాసం)**

**రచన** - భాస్కరపంతులు; **పుటలు** - 460; **వెల** - రూ.150/-; **సైజు**-1/8 డెమ్మీ;**ప్రాప్తిస్థానం:** భాస్కరపంతులు, లింగాలవీధి, మన్నూరు-516 126, రాజంపేట మండలం, కడప జిల్లా. సెల్: 94401 29320, 97054 05915.

నేటి మానవుడు ఆశల సుడిగుండంలో కొట్టుమిట్టాడు తున్నాడు. మానవ సంబంధాలను తెంచేసుకుంటూ, అను బంధాలను తప్పించుకుంటూ సుఖసంతోషాలనూ, ఆరో గ్యాన్ని, సహజమైన బంధాలనూ, అందాలనూ, ఆనందా లనూ కోల్పోతున్నాడు. చివరిలో ఎప్పుడో ఒకప్పుడు తాను కోల్పోయిన, తాను తెంచేసుకొన్న సంబంధాలు, తొక్కిన అడ్డదారులు, చేసిన పాపాలూ, నేరాలు, ఘోరాలు జ్ఞప్తికి వచ్చి దుఃఖిస్తున్నాడు. ఎంత విచారించినా అప్పుడు ఫలితముండదు గదా! పరీక్షలు పూర్తయ్యాక ప్రశ్నలకు జవాబులు తెలుసుకుంటే ప్రయోజనముండ నట్లే ఇదీనూ. వీటినన్నింటిని దృష్టిలో పెట్టుకుని భాస్కర పంతులు 'మానవతా విలువలు' అనే మంచి గ్రంథాన్ని వెలువరించారు.

ఇందులో జీవితం, ఆరోగ్యం, వ్యక్తిత్వం, ధర్మం, అర్థం, కామం, మోక్షం, విశ్వచైతన్యం, మృత్యువిలాసం, మనసు, సంస్కృతి-నాగరికత-సమాజం, కాలం-పని సంస్కృతి అనే శీర్షికల ద్వారా మానవులు నడచుకోవాల్సిన తీరుతెన్నులను చక్కగా వివరించారు. ప్రతి అంశాన్ని కథలతో, సామెతలతో, సూక్తులతో వివరించారు.

స్వామి జ్ఞానదానంద, కె.అరవిందరావు, ఆచార్య చొప్పల రత్నం, ఆచార్య వి.దయాకర రెడ్డిగార్ల అభిప్రాయ మాలిక ఈ గ్రంథానికి అదనపు ఆకర్షణగా చెప్పవచ్చు. మానవ జీవితానికి, మానవతా విలువలకు అవినాభావ సంబంధ మున్నదని రచయిత సమగ్రంగా అన్ని అంశాలను పూస గుచ్చినట్లుగా పొందుపరిచాడు. మంచి కాగితంపై, మంచి ముద్రణలో, అక్షర దోషాలు లేకుండా ఉన్న ఈ గ్రంథం ప్రతి ఇంట ఉండదగింది, ప్రతి ఒక్కరూ చదువదగింది. చదవడం ప్రారంభిస్తే చివరిదాకా చదివించే శైలి ఈ గ్రంథ ప్రత్యేకతగా భావించవచ్చును.

**- ఏ.విశ్వనాథం**

# నా ఆత్మకథ

**(స్వామి వివేకానంద)**

**రచన** - స్వామి వివేకానంద; **అనుసృజన** - స్వామి జ్ఞానదానంద; **పుటలు**-386; **సైజు**-1/8 డెమ్మీ; **వెల**-రూ.40/-; **ప్రాప్తిస్థానం:** రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాదు- 500 029.

హిందూమతాన్ని, దాని ప్రాశస్త్యాన్ని ఖండాంతరాల్లో ప్రాచుర్యం కలిగించిన ఆధ్యాత్మిక తత్త్వవేత్త స్వామి వివేకానంద. ఈయన శ్రీ రామకృష్ణ పరమహంస ప్రియ శిష్యుడు. ఈయన ఆధ్యాత్మిక ప్రసంగాలు ఝరీ ప్రవాహతు ల్యాలు. ఎంతోమంది ఆ ప్రవాహంలో మునిగి తరించారు. ఆయన మహోన్నత వ్యక్తిత్వం గురించి, ఆయన ఆశయాలూ, భారతదేశం గురించి, ఆయన కన్న కలలు గూర్చి ఆయన రాసిన 'ఆత్మకథ'ను శ్రీరామకృష్ణమఠంవారు ప్రచురించారు.

ఇందులో జననం-బాల్యం, శిష్యరికం, నా గురు దేవులు- శ్రీరామకృష్ణులు, బారానగర్ మఠం- పరివ్రాజక జీవితం. దివ్యాదేశం-విశ్వ మత మహాసభలు, సంఘటనల పరంపర, భారతదేశ పునరాగమనం, నా ఉద్యమ ప్రణాళిక, రెండవ పాశ్చాత్య యాత్ర, తదితర చరమాంకం అను అధ్యాయాలున్నాయి. తనను గురించి, తన ఉద్యమకార్యం గురించి స్వామీజీ స్వయంగా వాక్రుచ్చిన పలుకులు, చేసిన వ్యాఖ్యానాలు 'నా ఆత్మకథ' గ్రంథంలో ఉన్నాయి.

ఇలాంటి ఆత్మకథలు భావితరాలకు ముఖ్యంగా నేటి యువతరానికి స్ఫూర్తినిస్తాయి. ఆత్మకథల్లో మహనీయుల జీవితాన్ని ఆదర్శంగా తీసుకుంటే ప్రతి ఒక్కరూ పైకి ఎదగగలరనేది అక్షరసత్యం.

దళసరి కాగితంపై, స్పష్టమైన ముద్రణలో అందంగా ముద్రించబడిన గ్రంథమిది. సరళమైన భాష ఇందులో ప్రయోగించబడింది. విషయం అనల్పం, ధర మాత్రం అల్పం. ఇంత తక్కువ ధరకు స్వామి వివేకానంద ఆత్మ కథను అందిస్తున్న రామకృష్ణ మఠం వారు ఉదార స్వభావు లని చెప్పక తప్పదు.

**- డి సరళ**

## శ్రీపదకేళి - ౦౨ (ఫిబ్రవరి-2010)
## విజేతలు

**1) వై.రామేశ్వరశర్మ,**
ఇంటి నెం.16-420, బ్రాహ్మణ వీధి,
ధర్మవరం - 515 671.

**2) చెమిటిగంటి వేంకటేశ్వరులు,**
ఇంటి నెం.ఎఫ్.ఎఫ్.-2,
లక్ష్మీటవర్స్, 4/7, బ్రాడీపేట,
గుంటూరు - 522 002.

**3) బిళ్ళపాటి వినయ్‌గాంధీ,**
S/o చితంబరం,
ఇంటి నెం.7-8-7, మళ్ళవరపువారి వీధి,
అనకాపల్లి - 531 001.

**సరైన సమాధానాలు రాసినవారు :**

వి.బాలకృష్ణ(చిలకలపూడి);ఆర్.కొండలరావు(విశాఖపట్నం); యం.శివభూషణమ్మ(కుప్పం); బి.గిరిజ(శ్రీకృష్ణపట్నం); కనకవల్లి(కుప్పం); బి.శ్రీహరిరావు(గుంటూరు); జె.శ్రీవాణీజ్యోత్స్న (విజయవాడ);డి.సాహితి(ప్రొద్దుటూరు);కె.చంద్ర(హైదరాబాదు); రామరాజువీరేశ్వరకేదార్(గుంటూరు); జి.వసంత (కడప); పి.సరస్వతి(నెల్లూరు); యం.పార్థసారథిఆచార్యులు (వరంగల్); జి.వేంకటలక్ష్మమ్మ(కడప);ఎం.ఉమామహేశ్వరరెడ్డి(గుంటూరు); ఓ.అనిరుద్‌కృష్ణ(నెల్లూరు); కె.ఆనంద్‌పిళ్ళై(చిత్తూరు); ఇ.అన్నపూర్ణ(శ్రీకాళహస్తి); జె.సామ్రాజ్యలక్ష్మి (తిరుపతి); టి.వి.యం.కె.ప్రసాద్(నెల్లూరు);డి.తిరుమల వెంకట్రామయ్య (హైదరాబాద్); దేవేంద్రనాథ్‌గుప్త (గుంతకల్లు); కె.వి.పార్థసారథి (బాపట్ల); హెచ్.సంతనాథ్ (అనంతపురం); ఎ.టి. శ్రీనివాసన్ (అనంతపూర్); బి.గిరిజి (విజయవాడ); డి.సీత రామారావు (విజయవాడ);యస్.కృష్ణమూర్తి(టెక్కలి); బి.గణేష్‌రెడ్డి(నెల్లూరు); యం.హనుమంతరావు (హైదరాబాద్); ఎన్.సత్తిరాజు (కోరుకొండ); టి.వి.ఎస్.లక్ష్మిశాస్త్రి (విజయవాడ); హెచ్.కృష్ణవేణి (వైజాగ్); జి.వి.ఎస్.దివాకరం (బొబ్బిలి); ఎస్.మల్లీశ్వరి(విజయనగరం); సి.మోహన్‌రావు (శ్రీకాళహస్తి); ఆర్.ఎస్. భాస్కరరావు (కడప);వి.సుందరరామయ్య (చెన్నూరు); టి.రాధాకృష్ణ(విజయవాడ); పి.కనకవల్లి (గుంటూరు); కె.వి.సీతమ్మ(హైదరాబాద్)



### నిబంధనలు :

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొనవచ్చు.

### బహుమతి వివరాలు :

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

### పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ■ | ■ | 2 | 3 | | ■ | ■ | 4 |
| | ■ | ■ | ■ | | ■ | ■ | ■ | |
| 5 | | ■ | 6 | | | ■ | 7 | |
| | ■ | 8 | ■ | | ■ | 9 | ■ | |
| ■ | 10 | | | ■ | | 11 | | ■ |
| 12 | ■ | | ■ | 13 | ■ | | ■ | 14 |
| 15 | | ■ | 16 | | | ■ | 17 | |
| | ■ | ■ | ■ | | ■ | ■ | ■ | |
| | ■ | ■ | 18 | | | ■ | ■ | |

# శ్రీపదకేళి - 11

**నిర్వహణ :** ఆచార్య శ్రీవత్స, కంకిపాడు

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

**2)** మీరు సప్తగిరి చందాదారులైతే?

అ) చందా నంబరు : ....................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ....................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

## ఆధారాలు

**అడ్డం**

**2)** శ్రీకృష్ణుని మేనమామ (3)

**5)** కవిత్వం చెప్పేవాడు (2)

**6)** ఈ నది ఒడ్డున వ్రేపల్లె ఉంది (3)

**7)** లక్ష్మి భర్త (2)

**10)** పురుషసూక్తంలో చెప్పినట్లు విష్ణువు కుడి కన్నులో ఇతడు ఉన్నాడు (3)

**11)** శ్రీకృష్ణుని చేతిలో ఉంది (3)

**15)** ముసలితనం (2)

**16)** గుర్రము (3)

**17)** ధ్వని (2)

**18)** భాస్కరుని గాంచి విరిసే పుష్పం (3)

**నిలువు**

**1)** అడవిలో పుట్టింది. అడవిలో పెరిగింది. మా ఇంటికి వచ్చింది. తైతక్కలాడింది. (4)

**3)** మధురానగరంలో కంసునికి మాలలను కట్టి ఇచ్చే శ్రీకృష్ణుని భక్తుడు (4)

**4)** శ్రీకృష్ణునికి రుక్మిణియందు పుట్టిన సుతుడు (4)

**8)** ఇతని కోరికపై సీతారాములు భద్రాచలంలో వెలిశారు (3)

**9)** కవిత్రయం రచించిన కావ్యం (3)

**12)** విష్ణుమూర్తి మాల (4)

**13)** ద్రోణాచార్యుని సుతుడు (4)

**14)** విష్ణుమూర్తి ఖడ్గం (4)

### —:: *శ్రీపదకేళి-09* (ఫిబ్రవరి,10) సమాధానాలు ::—

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 గా | ■ | ■ | 2 ఖ | 3 గ | ము | ■ | ■ | 4 కు |
| త | ■ | ■ | ■ | యు | ■ | ■ | ■ | చే |
| 5 ము | క్కు | ■ | ■ | డు | ■ | ■ | 6 తే | లు |
| డు | ■ | 7 కో | 8 పం | ■ | 9 ద | ధి | ■ | డు |
| ■ | ■ | ■ | చాం | ■ | స | ■ | ■ | ■ |
| 10 ని | ■ | 11 స | గం | ■ | 12 రా | ధ | ■ | 13 సం |
| 14 కుం | తి | ■ | ■ | 15 క | ■ | ■ | 16 చా | కు |
| భు | ■ | ■ | ■ | లి | ■ | ■ | ■ | రా |
| డు | ■ | ■ | 17 మి | మి | క్రి | ■ | ■ | త్రి |



# ఏప్రిల్, 2010 రాశి ఫలాలు



- జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ మాసంలో ఈ రాశివారికి ఏ పనిచేసినా అనుకూలంగా ఉంటుంది. కానీ మాటలను అదుపు పొదుపుగా మాట్లాడితే మంచిది. విహారయాత్రకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. మొదటివారం స్థానచలనం, రెండోవారం క్షేత్ర దర్శనం, మూడోవారం కార్యజయం, నాలుగోవారం అధికశ్రమ.



## వృషభ రాశి

ఈ రాశివారు ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించాలి. రెవెన్యూ, వైద్య, పత్రిక విలేఖరులకు, ఆకస్మిక ధనలాభం. తీర్థయాత్రలకు అనుకూలం. ఆర్థికంగా బాగా కలిసివస్తుంది. మొదటివారం ఆనందం, రెండోవారం పనిఒత్తిడి, మూడోవారం ధనలాభం, నాలుగోవారం సత్కారం.



## మిథున రాశి

ఈ మాసంలో వీరికి వాయిదాలు, బకాయిలు, స్థిరాస్థి, ఋణప్రయత్నాలు అనుకూలం. విద్యార్థులకు, మహిళలకు ఆందోళనలు, మహిళలకు, రాజకీయ నాయకులకు ఉన్నత పదవీయోగం. సాహితీ రంగంలోని కవులకు, ఉపాధ్యాయులకు మంచి గుర్తింపు లభిస్తుంది. దైవదర్శనాలకు అనుకూలం. మొదటివారం ఆకస్మిక ప్రయాణం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం పదవీయోగం.



## కర్కాటక రాశి

ఈ మాసంలో ఆర్థిక పరిస్థితి కొంత నిరాశపరచినా అవసరాలు తీరుతాయి. కుటుంబ సమస్యలు ఎన్ని ఎదురైనా ఆత్మస్థైర్యంతో ముందుకు సాగుతారు. సంగీత నృత్య కళాకారులకు, రిటైర్డు ఉద్యోగులకు ప్రభుత్వం నుంచి శుభవార్తా శ్రవణం. మొదటివారం వ్యవహార జయం, రెండోవారం వాహనయోగం, మూడోవారం ఆనందం, నాలుగోవారం శుభవార్తా శ్రవణం.

### తిరుమలలో పురోహిత సంఘం

వివాహం, ఉపనయనం, చెవిపోగులు కుట్టడానికి భక్తులు సుదర్శన సత్రంలోని పురోహిత సంఘాన్ని సంప్రదించవచ్చు.

ఫోన్ : 0877 - 2263460



## సింహ రాశి

ఈ మాసంలో ఈ రాశివారికి స్థిరాస్థి వ్యవహారాల్లో విజయం కల్గుతుంది. కొత్త పరిచయాలు ఆనందాన్నిస్తాయి. సినీ, టివీ కళాకారులకు, పత్రికా విలేఖరులకు, సినీ రచయితలకు అదృష్టయోగం. రామ కల్యాణోత్సవంలో పాల్గొనటం వల్ల మానసిక ఆనందం కల్గుతుంది. మొదటివారం ఆనందం, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ధనలాభం, నాలుగోవారం పరీక్షాకాలం.



## కన్యా రాశి

ఈ మాసంలో వీరికి ఆకస్మిక ధనలాభం. నూతన గృహ ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తి విద్యలందు మంచి యోగ్యత. సాహిత్యం, సినీరంగ కళాకారులకు శ్రమకు తగ్గ ఫలితం. అమ్మకాలకు, వ్యాపారులకు ధనాదాయం. పసుపు వ్యాపారులకు, వెండి, బంగారు వర్తకులకు అధికార్ల ఒత్తిడి, అవమానాలు, అపవాదులతో అనారోగ్యం ఏర్పడుతుంది. మొదటివారం సత్కారం, రెండోవారం పని ఒత్తిడి, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం సంతోషం.



## తులా రాశి

ఈ మాసంలో ఊహించిన విధంగానే వ్యవహారాలు పూర్తవుతాయి. స్థిరాస్థి వివాదాలు, కోర్టు పెండింగ్‌లు త్వరితగతిన పూర్తవుతాయి. దీర్ఘ అనారోగ్యాలు తీరి కొంత ప్రశాంతత చేకూరుతుంది. మొదటివారం వృథాప్రయాణం, రెండోవారం కార్యజయం, మూడోవారం ఆందోళన, నాలుగో వారం మానసికానందం.



## వృశ్చిక రాశి

ఈ మాసంలో వీరికి నూతన ఆలోచనలు ఆచరణ లోకి వస్తాయి. మహిళలకు, విద్యార్థులకు మంచి గుర్తింపు, శ్రమకు తగిన ఫలం లభిస్తుంది. విద్యార్థులకు, చిన్న పిల్లలకు, వృద్ధులకు, అనారోగ్య సమస్యలు. అవివాహితులకు వివాహ ప్రయత్నాలు అనుకూలం. నమ్మిన మిత్రుల వల్లే వెన్నుపోటుకు గురౌతారు. మొదటివారం తీర్థయాత్రలు, రెండోవారం గుర్తింపు, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం ప్రయత్నఫలం.



## ధనూ రాశి

ఈ మాసంలో వీరికి సుదీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్న కోర్టు వ్యవహారాలు, స్థిరాస్థికి సంబంధించిన కార్యక్రమాలు ఆచరణలోకి వస్తాయి. వివాహప్రయత్నాలు అనుకూలం. మానసిక ఆనందానికి చేయు ఆధ్యాత్మికసేవ; క్షేత్రదర్శనాలు మంచి ఫలితాన్నిస్తాయి. మొదటి వారం ధనప్రాప్తి, రెండోవారం సంతోషం, మూడోవారం ఆధ్యాత్మికసేవ, నాలుగోవారం క్షేత్ర దర్శనం.



## మకర రాశి

ఈ రాశివాళ్ళకు ఈ మాసంలో బంధుమిత్రుల విరోధం, మానసిక ఆందోళన, కొత్తమిత్రుల పరిచయం సంతృప్తినిచ్చినా భయం పట్టిపీడిస్తుంది. దైవకార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొం టారు. టీచర్లకు, విద్యార్థులకు, మహిళలకు పరీక్షాకాలం. మొదటివారం ధనప్రాప్తి, రెండోవారం భయం, మూడో వారం దైవచింతన, నాలుగోవారం విరోధం.



## కుంభ రాశి

ఈ మాసంలో ఈ రాశివారు స్నేహబంధాలకు, బంధు త్వానికి అధిక ప్రాధాన్యత ఇస్తారు. ఉమ్మడి వ్యాపారాలు అను కూలిస్తాయి. పలు శుభకార్యాల్లో పాల్గొనటానికి ఆసక్తి కనబరు స్తారు. విద్యార్థులకు కష్టపడి చదవాలి. మొదటివారం బంధు త్వం, రెండోవారం ఆసక్తి, మూడోవారం నిరాశ, నాలుగోవారం ప్రయత్న ఫలం, ఆనందం.



## మీన రాశి

ఈ మాసంలో వీరికి అన్నీ ప్రతికూల ఫలితాలే. వృత్తి ఉద్యోగాల్లో అధికారుల ఒత్తిడి అధికం. ఒంటరి ప్రయాణాల వల్ల చిక్కులు. అనవసరమైన, తొందరపాటుతో అపనిందలు, అవమానాలకు లోనుకావాల్సి వస్తుంది. అనారోగ్య సూచనలు. మొదటివారం ఒత్తిడి, రెండోవారం వృథాప్రయాణం, మూడో వారం విజయం, నాలుగోవారం మానసికవేదన.



### నాగులాపురం శ్రీ వేదవల్లీ సమేత శ్రీ వేదనారాయణస్వామి వారి బ్రహ్మోత్సవాలు

**2010, ఏప్రిల్ 27 నుండి మే 6 వరకు**

| తేదీలు | వారం | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 27-04-10 | మంగళవారం | --- | అంకురార్పణ |
| 28-04-10 | బుధవారం | ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 29-04-10 | గురువారం | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 30-04-10 | శుక్రవారం | సింహవాహనం | ముత్యపుపందిరి వాహనం |
| 01-05-10 | శనివారం | కల్పవృక్షవాహనం | సర్వభూపాల వాహనం |
| 02-05-10 | ఆదివారం | మోహినీ అవతారం | గరుడ వాహనం |
| 03-05-10 | సోమవారం | హనుమద్వాహనం | గజవాహనం |
| 04-05-10 | మంగళవారం | సూర్యప్రభవాహనం | చంద్రప్రభ వాహనం |
| 05-05-10 | బుధవారం | రథోత్సవం | అశ్వ వాహనం |
| 06-05-10 | గురువారం | చక్రస్నానం | ధ్వజావరోహణం |

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీకృష్ణదేవరాయల శాసనాలు

## శాసన వివరణ - 7

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలూకా, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.
(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరగోడపై ఉన్న శాసనం)

**వంశం** : విజయనగర (తుళువ) **రాజు** : శ్రీకృష్ణదేవరాయలు

**కాలం** : శక సంవత్సరం 1434, అంగిరస సంవత్సరం, 1513 ఎ.డి.

**భాష** : కన్నడం

**విషయం** : శ్రీకృష్ణదేవరాయల పట్టపురాణి చిన్నాజీ అమ్మవారు తిరువెంగళనాథుని దర్శించుకుని, స్వామి నైవేద్యాలను పెట్టుటకై బంగారుగిన్నెను కానుకగా సమర్పించెను.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-III, సంఖ్య-40.

## శాసన వివరణ - 8

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలుకా, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.
(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరగోడపై ఉన్నశాసనం)

**వంశం** : విజయనగర (తుళువ) **రాజు** : శ్రీకృష్ణదేవరాయలు

**కాలం** : శక సంవత్సరం 1434, అంగిరస సంవత్సరం, 1513 ఎ.డి.

**భాష** : తెలుగు

**విషయం** : శ్రీకృష్ణదేవరాయల పట్టపురాణి చిన్నాజీ అమ్మవారు తిరువెంగళనాథదేవునికి నైవేద్యంను పెట్టుటకై బంగారు గిన్నెను కానుకగా సమర్పించిన గిన్నెబరువును ఈ శాసనం తెలుపు తోంది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు, సంపుటం-III, సంఖ్య-41.




**(ఆలయంలో దాతల సమర్పణలు ఎక్కువైన కొద్దీ వాటి నిర్వహణ వ్యవస్థ పెరుగుతూ వచ్చి, ఆలయ పరిపాలనా విధానాంశం ఏర్పడింది. వంశపారంపర్యమైన ధర్మకర్తలు - స్థానత్తారులు ఏర్పడ్డారు. ఆ వైనాన్ని ఈ అధ్యాయంలో చూడవచ్చు.)**

**ధారావాహికం - 87**

**ఇ) మతం దాతృత్వం :**

ఈ కాలంలో మతసంబంధమైన దానాలు చాలావరకూ దేవాలయంలో దీపదానం రూపంలో చేయడం భక్తజనులలో ప్రచురంగా ఉండేది. ఉత్సవ నిర్వహణకు ఆహార నైవేద్యానికి ఏర్పాటు గావించిన పద్ధతి విజయనగర యుగంలో పెద్దగా కనబడ్డా దాని అంకురదశలో ఈ కాలానికి ముందే సంఖ్య 111, 121, 134, 139, 141, 285-టి.టి. మరియు 285, 127-జి.టి.శాసనాలలో నమోదు చేసిన వివరాలనుబట్టి తెలుస్తోంది. ధాన్యాన్ని కొలవడానికి ఉపయోగించే ప్రామాణిక కొలత **తూంబు**(తూము). **వట్టి** (తెలుగులో **పుట్టి**) అనే కొలత 20 తూంబులకు సమానం. తిరుపతిలోని శ్రీగోవిందరాజస్వామి దేవాలయంలో ఉపయోగంలో ఉండిన ప్రామాణిక కొలతకు **చాళుక్కి** లేక **చాళుక్య నారాయణన్ కల్** అని పేరు(శాసనం సంఖ్య 127-జి.టి.). సామాన్యంగా ఈ కొలతను తిరుమలలో వినియోగంలో ఉండిన ప్రామాణికపు కొలతను **ఉచ్చియిల్‌నిన్టాన్ నాకల్ (మరక్కాల్)** అని పేరు. ఈ కొలతను **మలైకినియ నిన్టాన్‌కల్** అని తర్వాతి కాలపు సాక్ష్యాధారాలు తెలుపు తున్నాయి. ఈ మరక్కాల్ కొలత పెద్దది. చాళుక్కి కొలతకు రెండింతలు. ఆ కాలంలో వ్యవహారంలో ఉండిన నాణాలు వరాహపణం, మాడై. మాడై అనే బంగారునాణెం విజయగండ గోపాలుడు ప్రవేశపెట్టాడు. అందువల్ల ఈ బంగారునాణెం గండ గోపాలన్‌మాడైగా చెలామణి అయ్యింది (సంఖ్య 143-టి.టి.). మరికొంతకాలం తరువాత కొత్తగా ప్రవేశపెట్టిన బంగారునాణెం గండగోపాలన్ పుదుమాడైగా పిలిచేవారు. ఈ రెండింటిలోను **పళం** పులి గుర్తులు గల పాత మాడవిలువ, కొత్తమాడవిలువతో పోల్చినపుడు బహుశః 7.5 వరాహపణాలకు సమానమౌతున్నది. (శాసనం సంఖ్య 126-టి.టి.). ఈ బంగారు నాణెం జయం గొండ చోళమండల మందంతటా వ్యవహారంలో ఉండేది. ఈ నాణెం పరిశుద్ధమైన బంగారు లోహంతో చేయబడినది. (శాసనం సంఖ్య 129-టి.టి.).

**7) సాలియ శ్రీవైష్ణవులు :**

శ్రీవైష్ణవులలో ఒక తెగకు చెందిన వారిని సాలియ వైష్ణవులంటారు. బహుశః వస్త్రాలను నేసేవారై ఉంటారు. సౌరాష్ట్రం నుండి వలస వచ్చిన బ్రాహ్మణులమని చెప్పు కున్నారు. వీరిలో కొందరు విష్ణుగోత్రీకులమని చెప్పు కుంటుండగా (శాసన సంఖ్య 125-టి.టి.), మరికొందరు కాశ్యప గోత్రీకులుగా (శాసన సంఖ్య 129-టి.టి.) ప్రకటించు కున్నారు. ఇంకా కొందరు ఆత్రేయ గోత్రీకులమని (శాసన సంఖ్య 141-టి.టి.) ప్రకటించుకున్నారు. వీరు విక్రమ దేవిపురనివాసులమని తెలుపడం జరిగింది. బహుశః మొదటి రెండు తెగలవారు కూడ ఈ ప్రదేశం నుండే వచ్చి ఉంటారు.

**8 స్థానత్తారుల వ్యవస్థ:**

**అ)స్థానత్తారులు కార్యనిర్వాహకులే కాని ధర్మకర్తలు కారు:**

పూర్వకాలపు శాసనాలలో అతితరచుగా స్థానత్తార్ అనేమాట ప్రయోగింపబడి ఉన్నది. విజయనగరయుగ శాసనాలలో కూడ ప్రయోగంలో ఉన్న ఈ పదానికి ఆలయ స్థానికమండలి అని అర్థం. దేవాలయ కార్యక్రమాలు సక్రమంగా,

సకాలంలో నిర్వహించేటట్లు చూసే మతాతీతమండలి. అయిన ప్పటికి వీరిలో కొందరు సభ్యులు దేవాలయంలోని ధర్మకార్య క్రమాలలో పాల్గొంటుంటారు. శాసనాధారాలను బట్టి ఈ సంఘం సభ్యులు గొప్ప భక్తులుగా, ఉన్నతస్థాయి పొంది స్థానిక పరిపాలకుల తరపున ఆలయ కార్యనిర్వాహకత్వాన్ని నిర్వహించే వారు. ప్రారంభంలో దేవాలయ వ్యవహారాలయందు కార్య నిర్వాహకత్వం వహించే కొన్ని కార్యక్రమాలు మాత్రమే ఉండేవి. కానీ కాలం గడిచే కొద్దీ, అందునా ముఖ్యంగా విజయనగర కాలంనాటికి ఈ స్థానత్తారుల సంఖ్య, నిర్వహించవలసిన కార్య భారం మొదలైన విషయాలలో ఎక్కువ కావడం జరిగింది. దేవాలయ ఆస్తులకు ధర్మకర్తృత్వ బాధ్యతలను చేపట్టి పరిరక్షించ వలసిన స్థితికి చేరింది. వీరి కర్తవ్యం దేవాలయ కార్య నిర్వహణతో ఆగిపోలేదు. విధుల పరిధి కూడ అధికమైంది. ఆలయానికి షరతులతో కూడిన ఆధార ద్రవ్యదానాలను, దేవాలయం తరపున స్వీకరించి ఆ ధనాన్ని సక్రమంగా విని యోగింపబడిందా అని గమనించడం, దాత కోరిన విధంగా సేవాకైంకర్యం సకాలంలో నిర్వహించేటట్లు గమనించడం వీరి బాధ్యత.

మనకు తెలిసినంతవరకు ఈ దేవాలయాని (తిరు మల)కి సంబంధించిన మొట్టమొదటి పరిపాలనా యంత్రాంగం లేక రాజకీయ వ్యవస్థ పల్లవరాణియైన **సామవై** చే ఏర్పడింది. ఈ విషయాన్ని రుజువుచేసే శాసనాధారం ఉన్నది. ఈ రాణి దేవాలయంలో తిరువేంకటనాథుని ఉత్సవమూర్తిని ప్రతిష్ఠించి ఉత్సవాలు సక్రమంగా జరిగేందుకు వలసిన ధనాన్ని సమకూర్చిపెట్టే ఆస్తిని దానం చేసింది. ఈ పరిపాలనా యంత్రాంగాన్ని **మడాపత్యం శైవార్** అని అన్నది. అంటే తిరు వెంకటనాథుని దేవాలయంలో ఎవరైతే **మడపత్యం** చేస్తారో వారు అని అర్థం. కాని ఈ మాటకు అర్థం అస్పష్టంగా ఉంది. ఉత్స వాలు సక్రమంగా జరిపే కార్యనిర్వణ (మేనేజరు) చేసే అధికారిని సూచిస్తోందని భావించవచ్చు.

చోళుల పరిపాలనాకాలంలో కూడ ఇదేవిధమైన అధి కారులు దేవాలయంలో జరిపే సేవాకైంకర్యాలు, తదితర సేవలు అన్నీ **మడపత్యం శైవార్** యథావిధిగా జరిపేటట్లు గమనించ వలసిన బాధ్యతను కలిగియున్నారు. షరతులతో కూడిన ఆధార ద్రవ్యదానాలను దేవాలయ తరపున స్వీకరించి ధర్మకర్తృత్వాన్ని నెరపుట, దాతలు కోరినవిధంగా సేవాకైంకర్యాలు సక్రమంగా జరిపించాల్సిన బాధ్యత ఈ **మడపత్యం శైవార్**కు ఉన్నది. కానీ ఇతనికి పూర్తి అధికారాలు లేవు. రాజు నియమించిన రాజ్యాధి కారికి లోబడి పని చేయడం ఇతని కర్తవ్యం. ఈ విషయం చోళరాజైన రాజరాజచోళుని ఆజ్ఞప్రకారం ప్రకటించిన శాసనం సంఖ్య 126-జి.టి.లో ఇచ్చిన రాజాజ్ఞ విశదీకరిస్తోంది. ఆ శాసనంలోని వివరాలు -

ఇంతకు మునుపు రాజు నోటిమాటగా ఇచ్చిన ఆజ్ఞ ప్రకారం త్రిభువన చక్రవర్తిగళ్ శ్రీరాజరాజదేవర్ పరిపాలనా కాలంనందలి 19వ సంIIలో కార్తికమాసంలో ఒక శుభదినాన తిరుచానూరులో ఉన్న తిరువిళంకోయిల్‌కు చేరియున్న సభా భవనంలో **పెరియనాట్టవర్** అయిన సభ్యులందరు తగినంత సంఖ్యలో సభ్యులు చేరియుండగా సమావేశమై వారి దృష్టికి వచ్చిన ప్రతిపాదనను పరిశీలించారు. శ్రీ శఠకోపదాసర్ పిళ్ళై, కొల్లి కావలిదాసర్ పిళ్ళై, అరువరయ నైయకోయిల్‌పిళ్ళై, కళి కన్టిదాసర్ పిళ్ళై చేరారు. ఇటుక, గారతో నిర్మించిన కట్టడం విష్ణువు పవిత్రస్థానానికి కాణాచియైన శ్రీ గోవిందరాజస్వామి దేవాలయంలో పెరియనాట్టార్ వితరణతో ప్రతిష్ఠించిన తిరు మంగై ఆళ్వార్ విగ్రహానికి అముదుపడి, సాత్తుపడి నైవేద్య సమర్పణకుగాను తగుఏర్పాటు చేయవలసి ఉన్నందున తిరుక్కుడ పూర్‌వారు జలంతో ధారాపూర్వకంగా సస్యక్షేత్రం దానం చేశా రనీ, ఆ సస్యక్షేత్ర వివరాలను తెలిపారు. ఇది తిరుక్కుడవూర్ నాడులోని భాగం మరియు పెద్దరహదారులు కలిసే ప్రదేశా నికి పశ్చిమదిశలోను, మండల కొట్టైకి ఉత్తరంగాను కిరండల యేటికి దక్షిణవైపున, ఈ హద్దులకు లోబడియున్నదియూ అయిన కొత్తకాల్వాయ్ సస్యక్షేత్రమందు చళుక్కి కొలతతో కొలిచి నపుడు పుట్టికి 5 తూంబుల చొప్పున ఫలసాయం లభించ గలదు. దీనిపై లభించే రాబడిని కూడ శ్రీ గోవిందరాజస్వామి ఆదాయంతో చేర్చి శ్రీ వేంకటేశ్వరుని శ్రీభాండాగారంయొక్క పర్యవేక్షకులు వసూలు చేయాలనియూ ఈ దానమందలి షర తులు ఆచంద్ర తారార్కం జరిపించాలని జరిగిన తీర్మానం శాసనంలో తెలుపబడింది.

ఇదితప్పి వ్యవహరించిన వారు, ఇందులకు భిన్నంగా నడచుకున్నవారు నాట్టవర్ వారికి స్వయంగా లొంగిపోవలసింది. లేకపోతే గంగాతీరంలో గంగిగోవును చంపిన మహాపాతకానికి లోను కాగలరని తెలుపబడింది. (ఇట్లు)పెరియనాట్టవర్ ఈ వ్యవహారానికి సాక్షి. ఇది పెరియనాట్టువేలన్ యొక్క సాక్షి సంతకం. స్థానికుల వ్యవస్థ లేక స్థానత్తారులవ్యవస్థ అధికారం గల వ్యవస్థ అతి ప్రాచీనకాలంనుండే ఏర్పడిఉన్నట్లు తెలుస్తోంది. ఇటువంటి వ్యవస్థ ఉనికి తిరుకాళత్తిదేవరాయలు స్పష్టంగా గుర్తించినట్లు శాసనసంఖ్య 107-టి.టి. విశదం చేస్తోంది. ఈ శాసన పాఠం ఈ కింది విధంగా ఉంది-"తిరుమల స్థానత్తారులు చేసిన విన్నపాన్ని మన్నించి తిరుమల దేవాలయానికి సంబంధించి ఇట్టి ఏర్పాటు చేయడానికి అనుమతిని తిరుకాళత్తి దేవ అనబడు నేను ఈ భూమండలానికి ఏకైక రక్షకుడను, విజ్ఞానవనమందు విహరించే రాచిలుకను, శ్రీకాళహస్తీశ్వరస్వామి పాదపద్మ భ్రమరాయమాణుడను, వేంకటగిరి పురాధిపతిని, వేంగికి రారాజును, గోదావరికి ప్రభువును, పిఠరదేవి (పిడరిదేవి) అనుగ్రహపాత్రుడను, విద్యావంతులలో ప్రథమ గణ్యతను పొందినవాడను, శత్రురాజులను ఓడించి పలాయనం చిత్తగించునట్లు చేసినవాడను, చంద్రవంశ కులాభరణుడను, చాళుక్యనారాయణుడను, సకలసద్గుణాభిరాముడను, మహారాజాధిరాజును, యాదవరాజును మరియు శ్రీమద్భుజబల (అయి ఉన్నాను).

"(తిరుకాళత్తిదేవ యాదవరాయ)పరిపాలనాకాలమందలి 19వ సం॥ ప్రారంభంలో జరిగిన అవిలాలి గ్రామసభలో దేవదానభూములు విస్తరింపచేయడానికి, శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయానికి ఇవ్వడానికై నిర్దేశింపబడియున్న భూమి విషయమై చేసిన శాశ్వత ఏర్పాటు ఏమిటంటే-"కుడవూర్ గ్రామానికి నలువైపుల సరిహద్దులకు లోబడి ఉన్నటువంటి పల్లపు భూములు, మెట్టభూములు, వాటిపై విధించేటటువంటి అన్ని పన్నులతో సహా, అందునా ముఖ్యంగా కడమైయం, పడికావల్, వెట్టిచ్చారికై,.....కోల్‌వరి, పట్టంపొన్, పొన్‌వరి(వరి అంటే పన్ను), కాణికైతో కూడ పోర్కళంగల్...... పన్నులు ఇవ్వబడినవి.

"ఆ ప్రకారంగా జరిగేందుకు ధారాజలపూర్వకంగా దానంచేసి, సుదర్శన(విష్ణుచక్రం చెక్కిన) శిలాఫలకాలను నాలుగువైపుల సరిహద్దు వెంబడి నాటించడం జరిగింది."

ఈ శాసనంలోని వాక్యరచనను బట్టి ఈ భూములు స్థానత్తారుల వశం చేయబడియుండలేదను భావం స్పష్టమౌతోంది. ఇటువంటి దానాలన్నీ కూడ దేవాలయ శ్రీభాండారానికి మాత్రమే చెందుతాయని స్పష్టంగా తెలుపుతున్నాయి. లభించే రాబడిని మాత్రమే స్థానత్తారులు వసూలుచేసి దాతలు విధించిన షరతులకు లోబడి దైనందిన ఖర్చులకు వినియోగించడానికి మాత్రమే అధికారం కలిగియున్నారన్న విషయం స్పష్టమౌతోంది. ప్రత్యేకంగా ప్రజోపయోగ పనులకోసం చేసిన దానాలన్నీ తిరుపణి భాండారం అన్న పద్దుకింద జమచేయడం జరుగుతున్నది. కాబట్టి స్థానత్తారులు కార్యనిర్వాహకత్వానికిగాను అధికారాన్ని వినియోగించే ఒక అధికారియేగాని దేవస్థాన ఆస్తులకు ధర్మకర్త కాదు.

### ఆ) దేవదానాలపై పాలకుల పూర్ణాధికారం :

దేవదానాలపై రాజ్యపాలకులకే పూర్తి అధికారమని స్పష్టంగా తెలిపే శాసనాధారాలు ఉన్నాయి. శాసనం సంఖ్య 11-జి.టి. ఈ విధంగా తెలుపుతోంది-

త్రిభువన చక్రవర్తిగళ్ శ్రీ తిరువెంకటనాథ యాదవ రాయర్ పరిపాలనా కాలంనందలి 12వ సంవత్సరం ఫాల్గుణ మాసంలో ఒకానొక శుభదినాన వేసిన ఈ శాసనం ప్రకారం ఇంతకు పూర్వం తిరువిడయాట్టం తిరుమత్తుక్కాణిగా చేసి శ్రీవేంకటేశ్వర స్వామికి దానంచేసిన తిరుపతి గ్రామాన్ని, ఇపుడు సర్వమాన్యంగా సమర్పించిన విషయాన్ని తిరుమల స్థానత్తారులకు తెలియజేయడం జరిగింది.

అందువల్ల తిరుపతి గ్రామం నుండి ఇంతవరకు అలవాటుగా వసూలు చేస్తున్న ఈ కింది పన్నుల వసూళ్ళు, ఈ 12వ సంవత్సరం (శ్రీ తిరువెంకటనాథ యాదవరాయర్ పరిపాలనాకాలంనందలి 12వ సంవత్సరం) చైత్రమాసం నుండి జమ కావడంవల్ల నారాయణన్‌సంధిలో అముదుపడి, సాత్తుపడిలకు కావలసిన వస్తువులకోసం వినియోగించవలసినదిగా ఆజ్ఞ జారీ చేయబడింది. ఆ విధంగా తిరుపతి గ్రామాన్ని సర్వమాన్యంగా చేసి సూర్యచంద్రాదులున్నంతవరకు జరగాలని భావిస్తూ శాసనం వేయడం జరిగింది. తిరువారాధనం ఈనాడు

మొదలుకుని ఏ కొరతా లేకుండా నిరంతరం, అవిచ్ఛిన్నంగా జరుపబడుగాక! ఈ శాసనాన్ని రాగిరేకుల మీద, శిలల మీద చెక్కించి ప్రకటించబడు గాక!

ఈ కింద తెలుపబడిన పన్నులు జమకాబడినవి –

పండివరి, పలవరి, కాణిక్కై, వెండుగోళ్‌వరి, మలై – అమంజి, కుదిరైవరి, కణక్కమొవై, నాట్టువరి, నిలైక్కాణిక్కై, నాట్టార్‌వైత్త కాణిక్కై, వలినదై కాణిక్కై, అక్కన్ కాణిక్కై, కార్తికై కాణిక్కై, పట్టివరి, విరుత్తువగై, పలతలిక్కు మాదయిల్ కొల్లుం (వరి), నాట్టార్ మాడెయిల్ వగుక్కుం వరి, వళ్ళాలదేవర్ వరి, వాసల్ పణం, తలై పణం, నిశ్చయిప్పు, ముక్కంపరవై, పడియరై మోవై, ముకంపరవైచ్చుమ్మదం, సంబదచ్చుమ్మదం, శెట్టికల్, వనికర్, సేనై అంగడియర్, సక్కుకుడిమక్కళ్, కైకోలార్ పర్...., శుంగవరి, కొల్లుంవగై, శుంగ అన్నై, పిళ్ళైకల్ కాణిక్కై.

తిరుపతి గ్రామాన్ని సర్వమాన్యంగా చేయడం, వేంకటేశ్వరస్వామికి నారాయణన్‌సంధి పేరున ఆహారనైవేద్యానికి ఏర్పాటు గావించినట్లు పేర్కొనడంవల్ల ఈ శాసనానికి ఒక ప్రత్యేకత ఉంది. రాజు ఉత్తర్వులో ఇచ్చిన సూచనల ప్రకారం అన్ని కార్యాలు నెరవేర్చడానికి తగు ఏర్పాట్లు గావించినట్లు గ్రామ స్థానత్తారులకు తెలియజేశారు. తిరుపతి గ్రామంలో విధించే స్థానిక పన్నుల వివరాలు కుతూహలాన్ని కలిగించే విషయం. బంగారం మీద పన్నులు, ధాన్యపుగింజలపై పన్నులు, ఉచితసేవలపై పన్ను, జంతువులపై విధించే పన్నులు, టోల్‌గేటు పన్నులు, వ్యాపారులు, నూనెవర్తకులు, సాలెవాండ్రు మొదలైన వృత్తులవారిపై విధించే వృత్తిపన్నులు, పూదోటలను నిర్వహించుట, చేపల చెరువులను నిర్వహించుట మున్నగు వృత్తుల నిర్వహణార్థం అనుమతి పొందేందుకుగాను చెల్లించవలసిన రుసుము, బండెలదొడ్లమీద విధించే రుసుము వగైరా పన్నులు గుర్తింపబడినవి. అత్యంత క్లిష్టతను, వైవిధ్యాన్ని కలిగియున్న ఈ పన్నుల వసూళ్ళ విధానం గమనించినపుడు, ఆనాటి పరిపాలనా యంత్రాంగం ఎంతటి సామర్థ్యవంతమైనదో విశదమౌతున్నది. మరియు పన్నుల వివరాలు స్థానత్తారులకు తెలియజేసిన విధానం గమనించినపుడు, వీరు కేవలం అధికారాన్ని

## పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు మహాపరాధం

**అన్యక్షేత్రే కృతం పాపం**
**పుణ్యక్షేత్రే వినశ్యతి**
**పుణ్యక్షేత్రే కృతపాపం**
**బ్రహ్మలోకే న నశ్యతి**

**ఇతర క్షేత్రాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్రంలో నశిస్తుంది. కానీ పుణ్యక్షేత్రంలో చేసిన పాపం బ్రహ్మలోకానికి వెళ్ళినా నశించదు. కావున, పుణ్యక్షేత్రంలో ఆత్మహత్యాది పాపాలు చేయరాదు.**

**ఆత్మహత్య అనేదే మహాపాపమని మన పురాణాలు చెపుతున్నాయి. అలాంటి ఆత్మహత్యలు పుణ్య క్షేత్రాల్లో చేసుకుంటే ఆ పాపం తమకే కాకుండా తమ వంశానికంతా చుట్టుకుంటుందని ఋషులు ఘోషించారు. కాబట్టి భగవంతుని సన్నిధిలో సత్కార్యాలు చేస్తే వాటి ఫలితం శతాధికంగా ఉన్నట్లే ఆత్మహత్యల్లాంటివి చేసుకుంటే స్వర్గప్రాప్తి సిద్ధించకపోగా, ఆ పాప ఫలం తరతరాలు పట్టి పీడిస్తుంది. కాబట్టి పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు చేసుకోవద్దు. భగవద్దర్శనంతో ఆత్మానందాన్ని, మనోధైర్యాన్ని పొందండి.**

వినియోగించే కార్యనిర్వాహకులే అనీ, దేవాలయాల తరపున ధనాన్ని గ్రహించడం, వినియోగించడానికి మాత్రమే అధికారం ఉన్నదనే విషయం విదితమౌతోంది. ధర్మకర్తయొక్క పూర్తి హోదా వీరికి లేదని తెలుస్తోంది.

### (ఇ) అనుభవజ్ఞులైన గౌరవనీయులు స్థానత్తారులు :

అవసర మేర్పడినపుడు అనేక సందర్భాల్లో స్థానత్తారులను సంప్రదించడమే కాకుండా వీరి సలహాలను పరిగణ

లోనికి తీసుకున్నట్లు శాసనం సంఖ్య 195–టి.టి. రుజువు చేస్తోంది.

శ్రేయోభివృద్ధియగుగాక! ఇది, తిరుమలలోని స్థాన త్తారు సమాలోచన సభకు, శ్రీమాన్ మహాప్రధాని చేసికున్న విన్నపం– ఇమ్మడి రాహుత్తరాయన్ బిరుదాంకితుడైన సింగయ దణ్ణాయకన్ పెట్టుకొన్నటువంటి అభ్యర్థన ప్రకారం ఆడి(ఆషాఢ మాసం) తిరునాళ్ళ నిర్వహణార్థం మరియు పైన తెలిపిన సింగయదణ్ణాయకన్‌చే శ్రీవేంకటేశ్వరునకు మేము ఏర్పాటుచేసిన సితకర గన్దన్ సంధికోసమున్నూ తిరువిడయాట్టంగా ఇల్లత్తూరు నాడులోని సింగనెల్లూరు అని మరో పేరు ఉన్నటువంటి పొంగ లూర్ గ్రామం సమర్పించడం జరిగింది. ఈ పొంగలూరు గ్రామం సర్వమాన్యంగా అన్ని పన్నులతోసహ మా అల్లుడైన తిరువేంకటనాథ యాదవరాయలు సర్వమాన్యంగా మాకు (సింగయ్య దణ్ణాయకునకు) బహూకరించబడింది. ఈ గ్రామా నికి సరిహద్దులలో సుదర్శన చక్రాంకిత శిలలను నాటాల్సి ఉంది. ఈ గ్రామంనుండి లభించే పూర్తి ఫలసాయ ఆదాయాన్ని వినియోగించి (తిరుమలలో) స్వామివారికి ఉత్సవాన్ని (ఆడితిరు నాళ్ళు), సితకరగన్దన్ సంధి (ప్రసాదం) సమర్పించాలి. ప్రతి దినం ఒక తిరుబ్బోనకం తిరుపతిలోని వీరనరసింహస్వామికి, తిరుమంగై ఆళ్వారుకు సమర్పణ చేయాలి. అంతేకాకుండా సితకరగన్దన్ మఠంలో 32 మంది శ్రీవైష్ణవులకు భోజనవసతిని ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. వీటి నిర్వహణకు అవసరమైన ఖర్చులు పోగా మిగులు ధనాన్ని వినియోగించి ఒక పుష్ప వనాన్ని, ఒక చలివేంద్రాన్ని తదితర అవసరమైన వాటికి విని యోగించాల్సింది. ఈ వివరాలన్నిటిని శిల, రాగిపైన శాసనస్థం చేసి, ఈ దానధర్మాలు తిరుమలలో మా (సింగయ దణ్ణాయకన్) పేరు మీద సూర్యచంద్రాదులున్నంతవరకు జరుగవలెను. ఇందు లకు గాను శ్రీవైష్ణవులు సహకారాన్ని అందిస్తారు గాక!

పై శాసనం ప్రకారం రాజు తాను చేసిన ఏర్పాటుకు స్థానత్తారుల అంగీకారాన్ని పొందేందుకు సగౌరవంగా విన యంతో వారిని సంప్రదించిన వైనం విశదమౌతోంది. చేయ దలచిన ఏర్పాట్లకుగాను కాగల అన్నిరకాల ఖర్చులుపోగా ఇంకా మిగిలియున్న ధనాన్ని 32 మంది బ్రాహ్మణులకు భోజనవసతి ఏర్పాటునకూ, పూదోట నిర్వహణకు, చలివేంద్రం మొదలైన ధర్మకార్యాల నిర్వహణకు వినియోగించవలసినదని స్థానత్తారులు చేసిన సూచనను రాజు అంగీకరించాడు.

శాసనంలో ప్రసక్తమైన **స్థానత్తార్ శ్రీపాదత్తేతి** అన్న మాటకు స్థానత్తారు పాదపద్మాల సన్నిధిని అని అర్థం. గొప్ప శక్తి సామర్థ్యాలు ఉన్నటువంటి సింగయ్య ప్రముఖ స్థానిక నాయకుడు స్థానత్తారునకు ఇచ్చిన గౌరవమర్యాదను బట్టి చూడగా, ఆనాడు స్థానత్తారులు అత్యంత గౌరవప్రదమైన ప్రజాసేవక గణంగా పరిగణింపబడుచుండేవారని తెలుస్తోంది.

గౌరవమర్యాదలను పొందుతున్నటువంటి స్థానత్తారులు ఎంతటి బాధ్యతాయుత వ్యవహర్తలుగా ఉన్నప్పటికీ వీరికి దేవాలయ ఆస్తులమీద ధర్మకర్తృత్వం నెరపే అధికారం మాత్రం లేదనే విషయం శాసనం సంఖ్య 237– టి.టి., 273–టి.టి., మరియు 485–టి.టి ద్వారా తెలుస్తోంది. ఈ శాసనాల ప్రకారం, మంగిదేవ మహారాజుగాని లేక వీర కుమార కంపన గాని, ఆఖరికి బుక్కరాయలుగాని తాము చేసిన దానశాసనా లలో దేవాలయ అధికారియైన స్థానత్తారును పేర్కొన్నప్పటికీ, అతని నామధేయాన్ని పేర్కొనకుండుట గమనార్హం. అదేవిధంగా సంఖ్య 61–టి.టి. శాసనం తెలుపుతున్న విధంగా, ఒకానొక అళగప్పిరంద తిరుక్కళి కన్ఱిదాసర్ అనువ్యక్తి స్వామికి ఆహార నైవేద్యానికి 450 పణాలను చెల్లించాడు. ఈ ధనాన్ని శ్రీభండా రానికి చెల్లించాడే కాని స్థానత్తారునకు కాదు. అలాగే ముల్లై తిరువేంకట జీయర్ కొన్ని సేవలకైంకర్యార్థం 100 పణాలను నేరుగా శ్రీభండారంలోనే జమ కట్టాడని సంఖ్య 103–టి.టి. శాసనం తెలుపుతోంది.

ఆ కాలంలో, ఇంకా అప్పటివరకు ఆధారద్రవ్యాల నిమిత్తం చేసిన దానాలన్నీ కూడ నేరుగా శ్రీభాండాగారంలోనే జమ కట్టబడుతూవచ్చింది. బహుశా ఇది దేవాలయానికి చెందిన ఖజానా అయి ఉంటుంది. స్థానత్తారు దాతలు ఇచ్చేటటు వంటి ఆధారద్రవ్యాన్నికానీ ఆస్తినికానీ దాతల తరపున గ్రహించ టానికి అధికారం కానీ, అనుమతిగానీ లేవు అని ఈ శాసనాలు స్పష్టం చేస్తున్నాయి. అందుచేతే ఇంత కాలం దాకా స్థానత్తా రులు ప్రత్యేకంగా కార్యనిర్వహణ సభ్యులుగా గౌరవింపబడి నట్లు తెలుస్తోంది. ***(ఇంకా ఉంది)***

శ్రీదేవి - భూదేవి సమేత

# శ్రీ అళఘనాథస్వామి వారి దేవాలయం

- వేదాంతం రఘునాథ చక్రవర్తి

మన దేవాలయాలు

శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరుజిల్లా, గూడూరు పట్టణంలో వెలసియున్న శ్రీ అళఘనాథస్వామివారి దేవస్థానం సుమారు 800 సంవత్సరాల క్రితం మూడవ కుళోత్తుంగ చోళుడి చేత నిర్మించబడినటు వంటి దేవాలయం. సుమారు 500 అంకణాల ఆలయ ప్రాంగణంతో వెలసిన ఈ దేవస్థానంలో శ్రీ వేణుగోపాల స్వామి, శ్రీమహాలక్ష్మీదేవి, ఆండాళ్ తాయార్ సన్నిధి, విజయాంజనేయస్వామి మరియు ఆళ్వార్ల సన్నిధి ఉన్నాయి.

ప్రతి సంవత్సరం ఫాల్గుణమాస శుద్ధ దశమినుండి బహుళ పంచమి వరకు నవాహ్నిక బ్రహ్మోత్సవాలు అంగరంగ వైభవంగా ఇక్కడ జరుగుతాయి. ఈ దేవస్థానంలో వెలసిన శ్రీదేవి- భూదేవి సమేత శ్రీ అళఘనాథస్వామివారు చేతియందు వెదురు కర్రతో దర్శనమిస్తాడు. దానికి ఒక ఇతిహాసం కలదు.

సుమారు 150 సం॥ల క్రితం ఒక సన్యాసి తీవ్రమైన కడుపు నొప్పితో బాధపడుతూ స్వామి వారిని ఆర్తితో వేడుకుని, కడుపునొప్పి తగ్గిన తర్వాత స్వామివారికి భక్తితో ఆ సన్యాసి తన వద్ద గల వెదురుకర్రను సమర్పించడం జరిగింది. ఆ వెదురుకర్రతో స్వామివారు నేటికి కూడా దర్శనమివ్వడం ఇక్కడి ప్రత్యేకత.



కోరిన కోరికలు తీర్చే కొంగుబంగారమై, భక్తుల పాలిటి కల్పతరువై, దక్షిణముఖంగా వెలసినటువంటి విజయాంజనేయస్వామి వారిని దర్శించి ఎందరో భక్తులు సంతానాన్ని పొంది, సుఖసంపదలను కలిగి ఉన్నారు. విద్యార్థులు ఉన్నత విద్యను అభ్యసించి, మంచి గుర్తింపు పొందడానికి ఆంజనేయునికి మొక్కులు తీర్చినయెడల వారి కోరికలు ఫలించి, వారు ఎంతో ఎత్తుకు ఎదిగే అవకాశాలు కలవని ప్రతీతి.

తమిళనాడు రాష్ట్రంలో మదురై నగరంలో వెలసిన శ్రీ అళఘనాథస్వామివారు దక్షిణ భారతదేశానికి ప్రశస్తి అయితే, ఆ ప్రాంతం నుండి దాదాపు 600 కి.మీ. దూరంలో వెలసిన ఈ అళఘనాథస్వామివారు తప్ప మరే ప్రదేశాలలో శ్రీ అళఘనాథస్వామి దేవస్థానాలు లేవనుటలో అతిశయోక్తి లేదు.

ప్రతి సంవత్సరం ధనుర్మాసం సందర్భంగా రాపత్తు, పగలు పత్తు వేళలలో స్వామివారికి నిత్య కైంకర్యాలు, ఉత్సవాలు నిర్వహించబడుతున్నాయి. వైకుంఠ ఏకాదశి పర్వదినాన స్వామి వారు శ్రీదేవి-భూదేవి సమేతుడై ఆలయ మహాద్వార దర్శనం నొసంగడం, దీనిని పట్టణ ప్రజలందరూ దర్శించి, తమ కోరికలను తీర్చుకోవడం స్వామివారి మహిమాన్విత శక్తికి నిదర్శనం. దేవస్థాన ప్రాంగణంలో వెలసిన శ్రీమహాలక్ష్మి అమ్మవారికి ప్రతి శుక్రవారం సాయంత్రం మహిళలచే సామూహిక కుంకుమార్చన కార్యక్రమం ఘనంగా నిర్వహింపబడును.

దేశం నలుమూలలనుండి గూడూరు పట్టణంలో వెలసిన శ్రీదేవి-భూదేవి సమేత శ్రీ అళఘనాథస్వామి వారిని ఎంతో మంది భక్తులు నిత్యం దర్శించుకోవడం జరుగుచున్నది. ప్రతి ప్రదేశం నుండి ఈ ప్రాంతానికి చేరుకోవడానికి బస్సు సౌకర్యం, రైలు సౌకర్యాలు కలవు.

# అన్నమయ్య - వాత్సల్య కీర్తనలు

- డా॥ వి.పళని

స్త్రీ వాత్సల్య స్వరూపిణి, మాతృస్వరూపిణి. ఆమెకు మాతృత్వం ఒక వరం. ఇది నిజజీవితంలోనే గాక, భగవద్విషయంలో కూడా ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఇది భక్తిలో ఒక భాగం. దీన్నే చైతన్యాదులు వత్సలభక్తి అన్నారు. మాతృభావ పరిపూర్ణత స్త్రీకి ఒక పరవశస్థితి. భగవంతుడే ఆమెకు శిశువుగా జన్మిస్తే ఇక ఆ వాత్సల్యానికి అవధులు లేవు. ఇదే యశోదా కృష్ణుల విషయంలో కూడా జరిగింది. యశోద కృష్ణుడికి కన్న తల్లి కాకున్నా, పెంచిన తల్లిగా వారి అనుబంధం లోకోత్తరం. బహుశా దీన్ని బట్టే 'కన్న ప్రేమకంటే పెంచిన ప్రేమ అధికమన్న' సామెత పుట్టిందేమో!

అన్నమయ్య తన సంకీర్తనల్లో యశోద ద్వారా వాత్సల్య మహితమైన భావ పరంపరను ప్రసరింపజేశాడు. కొన్నిచోట్ల తానే యశోదగా మారాడు. అలా మారి అన్నమయ్య గోప బాలుడిపై వాత్సల్యరసామృతాన్ని చిందించాడు.

ఈ వ్యాసంలో ఉగ్గుపాట, లాలి పాట, ఉయ్యాలపాట, జోలపాట, చందమామ పాట ప్రస్తావనకు వస్తాయి.

**ఉగ్గుపాట :**

కన్నతల్లులు పొద్దున్నే పాల పిల్లలకు ఉగ్గు పెట్టడం ఒక నిత్యక్రియ. తల్లి కూర్చుని, కాళ్లను గుజ్జిగా చాచి బిడ్డను వెల్లకిలా పడుకోబెట్టుకుని వేలితో గిన్నెలోని ఉగ్గును తీసుకుని నోటి చెలమ వెంబడి జారవిడవడం పద్ధతి. ఈ ఉగ్గు ఆధారంగా ఉగ్గు పాటలు వచ్చాయి.

అన్నమయ్య సంకీర్తనల్లో ఉగ్గుపాట చెప్పుకోదగింది. ఈ పాటలో 'ఉగ్గు' అనే మాట పల్లవి మొదట్లోనే ఆవృత్తమైంది. ఉగ్గుపెట్టేముందు, తర్వాత తల్లి బిడ్డకు చేసే క్రియలన్నిటినీ అన్నమయ్య ఆత్మీయతా భావంతో కూడిన పారవశ్యంతో 'చతురస్ర గతి'లో వర్ణించాడు.



**ఉగ్గుపెట్టరో వోయమ్మా చె-**
**య్యొగ్గీనిదె శిశు వోయమ్మా ॥**

**కడుపులోని లోకమ్ములు గదలీ -**
**నొడలూఁ చకురే వోయమ్మా**
**తొడికెడి సరుగన తొలుఁగఁదీయరే**
**వుడికెడి పాలివి వోయమ్మా ॥ 51**

ఇందులో అన్నమయ్య బ్రహ్మాండ భాండోదరుడిగా బాలకృష్ణుణ్ణి భావించాడు, శ్రీ వేంకటేశ్వరుడిగా రూపించాడు.

**ఉయ్యాల పాటలు :**

భక్తులు ఇష్టదైవాలకు ఎన్నో రీతుల్లో సేవలు చేస్తారు. వాటిల్లో ఉయ్యాల సేవ కూడా ఒకటి. ఏడుకొండలవాని అశేష ఉత్సవాల్లో 'డోలోత్సవం' కూడా ఉంది. స్వామికి జరిగే బ్రహ్మోత్సవాల్లో ఊరేగింపుకు పూర్వమే డోలోత్సవం నిర్వహించడం ఒక ఆచారం. ఆ దేవదేవుడి ఏకాంత సేవలో కూడా ఉయ్యాలసేవ రోజూ జరిగే వేడుకే.

అన్నమయ్య ఉయ్యాల పాటలే లాలి పాటలుగా కూడా కన్పిస్తాయి. ప్రతి పాదాంతంలో "ఉయ్యాల" అనే శబ్దం ఊతపదంగా ఆవృత్తి కావడం వల్ల అవి ఉయ్యాల పాటలుగా ప్రచారం పొందాయి.

**అలర చంచలమైన ఆత్మలందుండ నీ**
**అలవాటు సేసె నీ వుయ్యాల**
**పలుమారు నూచ్ఛ్వాస పవనమందుంట నీ-**
**భావంబు దెలిపె నీ ఉయ్యాల ॥**

ఈ కీర్తనలో కమలాదేవిని, భూదేవిని కూడా చేర్చి అన్నమయ్య స్వామిని ఉయ్యాలలో ఉన్నట్లు భావించి కీర్తించాడు.

ఇందులో ఆయన స్థితి కార్యరూపమైన విరాడ్రూపాన్ని, విభవాన్ని కీర్తించాడు. పూర్వ పశ్చిమాద్రులే కంభాలుగా, ఆకాశం అడ్డ దూలంగా, నాలుగు వేదాలు బంగారు గొలుసులుగా దాన్ని ధర్మపీఠంగా భావించాడు.

ఉయ్యాల పాటలే లాలి పాటలుగా చెప్పాలి. "లాలి లాలి" అన్న శబ్దాలు తరచుగా పాదాది, పాదాద్యంతాల్లో రావడం వల్ల వీటికి లాలిపాటలని కూడా పేరే.

**లాలనుచు నూ చేరు లలన లిరుగడల**
**బాలగండర వర గోపాలనినుజాల**

**ఉదటు గుబ్బల సరము ఉయ్యాలలూగ**
**పదిరి కంకణరవము బహుగతులమ్రోగ**
**వొదిగి చెంపల కొప్పు లొక్కింత వీగ**
**ముదురు చెమలటల వళికముల తొప్పదోగ**

బాలగండవర గోపాలుణ్ణికాక ఊయల ఊచే వెలదుల రూప వర్ణన పరమైన ఈ కీర్తన శృంగారాత్మకమైంది. ఇందులో అన్నమయ్య తన కైత సొగసుల్ని రాగమయంగా సంకీర్తన ముఖంగా సాగించాడు.

**జోలపాట :**

అన్నమయ్య జోలపాట పరమ రమణీయమైంది. చాలా ప్రసిద్ధమైంది. వ్యాఖ్యానాలక్కరలేని సంకీర్తన ఇది. ఈ పాట కంటే దీని పల్లవి రాని స్త్రీలు ఆంధ్రదేశంలో కన్పించరేమో!



**జోవచ్యుతానంద జోజో ముకుందా**
**రావె పరమానంద రామ గోవింద ॥**

**నందు నింటను జేరి నయము మీఱంగ**
**చంద్రవదనలు నీకు సేవ చేయంగ**
**నందముగ వారిండ్ల నాడుచుండంగ**
**మందలకు దొంగ మా ముద్దురంగ ॥**

**పాలవారాశిలో పవళించినావు**
**బాలుగా మునుల కభయమిచ్చినావు**
**మేలుగా వసుదేవు కుదయించినావు**
**బాలుడై యుండి గోపాలుడైనావు ॥**

# శ్రీ వేంకటేశ్వర ప్రస్తుతి

**శ్రీ వేంకటాచలధీశా! ఆశ్రిత జనమందార!**
**భువన రక్షకుడవు నీవు!**
**భువన మోహనుడవు నీవు!**
**నెఱనమ్మికొలిచితే కొంగుబంగారు నీవు!**
**కొండల రాయుడవు నీవు!**
**కోనేటి రాయుడవు నీవు!**

**కల్పతరువు నీవు!**
**కామధేనువు నీవు!**
**కరుణించితే కనకధారవు నీవు!**
**కరుణించి కాపాడు కరుణాంతరంగుండవు నీవు!**
**పరమాత్మవు నీవు! పరబ్రహ్మ నీవు!**
**పరంజ్యోతి పరమేశ్వరుడవు నీవు**

**ఆదినారాయణుడవు నీవు!**
**ఆర్తత్రాణ పరాయణుడవు నీవు!**
**ఆదిమధ్యాంత రహితుడవు నీవు!**
**అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడవు నీవు!**
**విశ్వాంతరాత్మవు నీవు! విశ్వ విభుడవు నీవు!**
**విశ్వరూప, విశ్వమోహనుడవు నీవు!**

**- చిత్రపు ఇందిర, తిరుపతి**



# పెద్దల మాట

– డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

**శుచిత్వం, త్యాగితా, శౌర్యం, సామాన్యం సుఖదుఃఖయోః ।**
**దాక్షిణ్యం చానురక్తిశ్చ, సత్యతా చ సుహృద్గుణాః ॥**

**(నీతిసారం)**

భావం : **మంచి మనస్సు, త్యాగగుణం, శౌర్యం, కష్టసుఖాల్లో సమానంగా కలసి మెలసి ఉండటం, మొగమోటం, ప్రేమాభిమానాలు కల్గివుండటం, సత్యనిష్ఠ - ఇవి మంచి స్నేహితుని లక్షణాలు.**

వివరణ : లోకంలో మంచి స్నేహితుడు లభించడం చాలా అరుదు. మంచి స్నేహితుణ్ణి డబ్బులిచ్చి ఐనా కొనాలి. చెడ్డ స్నేహితుణ్ణి డబ్బులిచ్చి ఐనా వదిలించుకోవాలి–అంటారు పెద్దలు. మంచి స్నేహితుడంటే – అతడు మొట్టమొదట మంచి మనస్సు కలవాడై ఉండాలి. సుఖదుఃఖాలకూ, స్వర్గనరకాలకూ మనస్సే కారణం. మనస్సులో కుళ్ళుపెట్టుకుని, మాటలు తీపిగా మాట్లాడే స్నేహితులు నిజంగా విషసర్పాలే! మేలు కోరేవానిమాట కఠినంగా ఉన్నా – వాని మనస్సు నిర్మలంగా ఉంటే చాలు. వాడు హితుడే! ఒక స్నేహితుడు తన స్నేహితుని కోసం ప్రాణాలైనా అర్పించేంతటి త్యాగబుద్ధి కలవాడై ఉండాలి. స్నేహి తుని సుఖదుఃఖాల్లో సమానంగా భాగం పంచుకొని, త్రికరణశుద్ధిగా వాని అభ్యుదయాన్ని కోరుతుండాలి. దయా దాక్షిణ్యాలూ, ప్రేమాను రాగాలూ, సత్యనిష్ఠ కల్గి ఉండాలి. ఇవన్నీ పరస్పరం సమాన స్థాయిలో ఉన్నపుడే ఇద్దరి మధ్య శాశ్వతమైన, ఆత్మీయమైన స్నేహం ఏర్పడు తుంది. 'సుహృత్' అంటే మంచి హృదయం కలవాడు. మిత్రు డంటే స్నేహించేవాడు. ఆపద నుండి కాపాడేవాడూ. స్నేహం అంటే ప్రీతి. ప్రీతి కల్గినవాడు స్నేహితుడు. మాటతప్పకుండటం, సహృదయుడై వర్తించడం, నిర్మల ప్రవర్తన కల్గి ఉండటం – ఇవన్నీ ఉత్తమ స్నేహితుని లక్షణాలు.

**చందమామ పాట :**

తల్లులు పసిబిడ్డలకు, ఏడ్చి మారాం చేసేటప్పుడు, పాలు తాపేటప్పుడు, గోరు ముద్దలు తినిపించేటప్పుడు, చంక నెత్తు కుని తిప్పుతూ వెన్నెల్లో తిరుగుతూ, చంద మామను చూపుతూ పిల్లలకు ఉల్లాసాన్ని కల్పిస్తూ పాడే పాట చందమామ పాట.

అన్నమయ్య తన చందమామ పాటలో, బాలకృష్ణుడి వైష్ణవ విభవాన్ని స్మరిస్తూ శ్రీ వేంకటేశ్వరుడికి అభేదాన్ని పాటిం చాడు. ఈ చందమామ పాట చాలా ప్రసిద్ధమైంది.

**చందమామ రావో జాబిల్లి రావో, మంచి**
**కుందనపు పైడికోర వెన్నపాలు తేవో**

భక్తి రూపమైన సాహితీ నిబం ధనల్లో విశేషణాలకు ప్రాముఖ్యం ఎక్కువ. అవి భగవంతుడి రూప, గుణ, స్వభావా దికాన్ని నిరూపిస్తాయి. ఉత్తాలమైన భక్తి, ఉదాత్తమైన భావం కలిసి ఈ కీర్తనగా అన్నమయ్య తంబుర తీగపై ప్రసరించి దిక్కులకు వ్యాపించింది.

ఇలా అన్నమయ్య ఒక చోట యశోదగా, ఒక చోట దేవకిగా, ఒక చోట కౌసల్యగా శ్రీవారికి బాల్యోపచా రాలు చేసి వాత్సల్యరసాన్ని అవధిలేకుండా తన సంకీర్తనల్లో కురిపించాడు. ఇంకా అన్నమయ్య కీర్తనల్లో దోబూచిపాటలు, మేలుకొలుపు పాటలు వంటివి చాలా కనిపిస్తాయి. స్వామివారిని చిన్నిశిశువుగా, తనను మాతృమూర్తి చేసుకుని అన్నమయ్య తన మాతృభావ హృదయాన్ని వందలాది సంకీర్తనల్లో ఆవిష్కరించాడు.

బాలప్రబోధం



# అల్పబుద్ధికధికారమిస్తే?

- అవసరాల లక్ష్మీపతిరావు

ఒక అరణ్యంలో ఒక ఋషి నిష్ఠతో తపస్సు చేస్తూ జీవిస్తుండేవాడు. అతడు జితేంద్రియుడై అరిషడ్వర్గాలను జయించి తపస్సుకే జీవితం అంకితంచేసి జన్మను సార్థకం చేసుకుంటున్నాడు.

ఒక శునకం ఆ మునీశ్వరుణ్ణి ఆశ్రయించి బ్రతుకు వెళ్ళదీయసాగింది. విశ్వాసంతో ఆతనికి సేవలు చేస్తూ ఋషికి ప్రీతిపాత్రమై మెలగుచుండేది. వారిద్దరి మధ్య అత్యంత ప్రేమ నెలకొన్నది. ఆ ఋషి ఆ శునకాన్ని పుత్రునివలే ప్రేమించేవాడు.

**అల్పబుద్ధివాని కధికారమిచ్చిన**
**దొడ్డవారినెల్ల తొలగగొట్టు**
**చెప్పతినెడి కుక్క చెఱకు తీపెఱుగునా?**
**విశ్వదాభిరామ వినురవేమ.**

ఒకనాడు ముని ఆశ్రమానికి పెద్దపులి వచ్చింది. ఆ పెంపుడు శునకం అత్యంత భయాందోళనలతో ముని దగ్గరకు వచ్చింది. పరిస్థితిని అర్థం చేసుకున్న ఆ ఋషి ఆ కుక్కను బెబ్బులిగా మార్చాడు. ఆ బెబ్బులి ఆ పులిని తరిమికొట్టింది. ఆ శునకం బెబ్బులిగానే జీవితం సాగించింది. అడవిలో జింక, లేడి మొదలైన మృగాలను వేటాడి భక్షించసాగింది.

ఒకసారి ఒక మత్తగజం బెబ్బులి మీదకు వచ్చి విరుచుకపడింది. బెబ్బులి ముని దగ్గరకు వచ్చింది. వెంటనే ఆ మునీశ్వరుడు దాన్ని ఏనుగుగా మార్చాడు. ఈ బలమైన మత్తగజం దానిని తరిమికొట్టింది. కొంతకాలం తర్వాత ఒక సింహం ఏనుగు మీద పడింది. ఏనుగుకు సింహం స్వప్నంలో కనబడినా భరించలేదు. హడలి చస్తుంది. మళ్ళా మునీశ్వరుని దగ్గరకు వచ్చి వేడుకుంది. తన బలహీనతను మునీశ్వరునికి వ్యక్తపరిచింది. ముని హృదయం కరిగింది. వెంటనే దానిని సింహంగా మార్చాడు. అప్పుడు ఈ సింహం ఆ సింహాన్ని పారదోలింది. తన బలానికి తిరుగులేని విధంగా సంచరిస్తూ ఆ ఆడవిలో బీభత్సం సృష్టిస్తుండేది.

ఒకసారి ఆ సింహానికి ఒక ఆలోచన కలిగింది. ఈ మునీశ్వరుడు తపశ్శాలి కదా. తన కంటే బలమైన మరొక సింహాన్ని సృష్టించినప్పుడు తన పనేమవుతుంది. ఇంత మహిమలు గల ఈ మునీశ్వరుణ్ణి భక్షిస్తే సరిపోతుంది కదా? అని మనస్సులో అనుకుని వెంటనే మునిని చంపనిశ్చయించుకుంది. మహర్షి ఇది గ్రహించాడు. వెంటనే మృగరాజాన్ని శునకంగా మార్చేశాడు.

నీచుడికి మహిమ సిద్ధించినా వెనుకటి గుణాన్ని మానడు. అందుకే హీనుణ్ణి అందలం ఎక్కించకూడదని పెద్దలమాట.

# శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల 125 వసంతాల మహోత్సవాలు

**తి**రుమల తిరుపతి దేవస్థానాలు నిర్వహిస్తున్న కళాశాలల్లో అతి ప్రాచీనమైన శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ డిగ్రీ మరియు పి.జి.కళాశాల 125 వసంతాలు పూర్తి చేసుకున్న సందర్భంగా 22-02-2010 నుండి 27-02-2010 వరకు ఉత్సవాలు అతి ఘనంగా జరిగాయి.

ఫిబ్రవరి 22న తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ డి.కె.ఆదికేశవులు జ్యోతిప్రజ్వలనతో ప్రారంభమైన ఈ ఉత్సవాలను తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., గౌరవఅతిథిగా విచ్చేసి తమ సందేశం అందించారు. ఈ సమావేశాలకు ఆత్మీయఅతిథిగా, ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీ అధ్యక్షులు ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ విచ్చేసి, ప్రాచ్య కళాశాలల ప్రాముఖ్యాన్ని వివరించారు. ఈ సందర్భంగా ఆచార్య రాణీసదాశివమూర్తి రూపొందించిన 'ఋతుసందేశం' ఆడియో సీడీని అధ్యక్షులు శ్రీ డి.కె. ఆదికేశవులు ఆవిష్కరించారు.

అదే రోజు మధ్యాహ్నం 3 గం॥లకు సాహితీసదస్సులు ప్రారంభమయ్యాయి. ఈ సదస్సులో ఆచార్య కిరణ్‌క్రాంత్‌చౌదరి, శ్రీ సింగరాజు సచ్చిదానందం, ఆచార్య ఎస్.ఎస్.రామచంద్రమూర్తి, ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్య, డా॥కనుమలూరి వేంకటశివయ్య, ఐ.ఏ.ఎస్., రిటైర్డ్ పాల్గొని వివిధ అంశాలపై ప్రసంగించారు. కళాశాల అధ్యక్షురాలు డా॥ మొవ్వ లలితకుమారి సమన్వయకర్తగా వ్యవహరించారు. అనంతరం జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్లో కుమారి బులుసు అపర్ణచే గంటావధానం, ఆచార్య హెచ్.ఎస్.బ్రహ్మానందచే 'భక్త ప్రహ్లాద' హరికథాగానం అందరినీ ఆకట్టుకున్నాయి

23-02-2010 మంగళవారం జరిగిన సంస్కృత సాహితీ సదస్సులో డా॥ విశ్వనాథ గోపాలకృష్ణమూర్తి, ఆచార్య కె. ప్రతాప్, డా॥కుప్పావేంకటకృష్ణమూర్తి అవధాని, డా॥ సముద్రాల లక్ష్మణయ్య, డా॥పి.ఆర్.రంగరాజన్, ఆచార్య రవ్వాశ్రీహరి, డా॥ఈ.ఏ.సింగరాచార్యులు, ఆచార్య జి.యస్.ఆర్. కృష్ణమూర్తి తదితరులు వివిధ అంశాలపై ప్రసంగించారు.

వార్తాలహరి

24-02-2010 బుధవారం హిందీ భాషా సదస్సు జరిగింది. ఈ సదస్సులో శ్రీ కె.కె.ఆచార్య, ఆచార్య రవిశంకర్ మీనన్, ఆచార్య రమణరావు, డా॥టి.రామ్‌ప్రకాష్, శ్రీమతి ఉష, ఆచార్య జి.పద్మజాదేవి, డా॥ చెరుకూరి రామయ్య, శ్రీ ఎ.మల్లేశ్వరరావు, ఆచార్య ఐ.ఎన్. చంద్రశేఖర్‌రెడ్డి, డా॥ కె.బ్రహ్మాచారి పాల్గొని తన ప్రసంగాలను అందించారు

25-02-2010 గురువారం తెలుగు భాషా సదస్సు జరిగింది. ఈ సదస్సులో డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు, ఆచార్య గార్లపాటి దామోదరనాయుడు, డా॥ సింగమనేని నారాయణ, శ్రీ సి.శైలకుమార్, ఆచార్య కె.సర్వోత్తమరావు, ఆచార్య శలాక రఘునాథశర్మ, డా॥ అద్దేపల్లి రామమోహనరావు తదితరులు ప్రసంగించారు.

అదే రోజు సాయంకాలం డా॥ మేడసాని మోహన్‌చే చతుర్గుణిత అవధానం జరిగింది. డా॥ పమిడికాల్వ చెంచు

## 'సప్తగిరి' సంపాదకుడిగా డా॥ కె.రాధారమణ



సప్తగిరి సంపాదకులుగా **డా॥ కె.రాధారమణ** పదోన్నతిపై 2010, ఫిబ్రవరి 18న పదవీబాధ్యతలు స్వీకరించారు. వీరు గత 16 సం॥లుగా ఉపసంపాదకులుగా **"సప్తగిరి"** కార్యాలయంలో బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

వీరు **"సప్తగిరి"** పత్రిక నిర్వహణే కాకుండా, కవిత్రయ మహాభారతం, భాగవతం, శ్రీనివాస బాలభారతి, తదితర దేవస్థానం ప్రచురణల విషయంలోనూ బాధ్యతలు నిర్వహించారు. **"తెలుగులో వెలువడిన నృసింహ శతకాలు"** మీద పిహెచ్.డి. చేసి గ్రంథాన్ని ప్రచురించారు.

సుబ్బయ్య నిర్వహణలో జరిగిన ఈ కార్యక్రమానికి ఆచార్య కొంపెల్ల రామ సూర్యనారాయణ అధ్యక్షత వహించారు.

26-02-2010న కళాశాల 126వ వార్షికోత్సవం జరిగింది. ఈ సభకు గౌరవ అతిథులుగా శాసనమండలి సభ్యులు శ్రీ విరపు బాలసుబ్రహ్మణ్యం, శాసనసభ మాజీ స్పీకర్ డా॥అగరాల ఈశ్వరరెడ్డి, తి.తి.దే. మాజీ అధ్యక్షులు శ్రీ భూమన కరుణాకర రెడ్డి, శ్రీ పద్మావతి విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య సరోజమ్మ పాల్గొన్నారు. వీరు కళాశాలలో వివిధ విభాగాలలో ప్రతిభ కనబరచిన విద్యార్థినీ విద్యార్థులకు బహుమతులను అందజేశారు.

27-02-2010న కళాశాల క్రీడాదినోత్సవం, శ్రీ వేంకటేశ్వర కమ్యూనిటీ ఎఫ్.యం(90.4) రేడియో తృతీయ వార్షికోత్సవం జరిగాయి.

వారం రోజులు పాటు జరిగిన ఈ కళాశాల ఉత్సవాల్లో విద్యార్థినీ విద్యార్థులు, స్థానిక ప్రజలు అసంఖ్యాకంగా పాల్గొని సభల్ని విజయవంతం చేశారు.

## కన్యాకుమారిలో శ్రీవారి కల్యాణం

తమిళనాడులోని కన్యాకుమారిలో 28-02-2010న తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో శ్రీ వేంకటేశ్వరస్వామి కల్యాణోత్సవం కన్నుల పండువగా జరిగింది. సముద్రతీర సమీపంలోని వివేకానంద కేంద్ర మైదానంలో జరిగిన ఈ కల్యాణోత్సవానికి లక్షలాదిమంది భక్తులు తరలివచ్చారు. సాయంత్రం అయిదు గంటలకు ప్రారంభమైన ఈ ఉత్సవం రాత్రి 9.30 గంటల వరకు జరిగింది. కార్యక్రమంలో తి.తి.దేవస్థానం అధ్యక్షులు శ్రీ డి.కె.ఆదికేశవులు, కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., చెన్నై తి.తి.దే. సమాచార కేంద్రం సలహామండలి అధ్యక్షుడు ఆనందకుమార్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు. శ్రీవారి కల్యాణోత్సవాన్ని తిలకించేందుకు వచ్చిన భక్తులతో కన్యాకుమారి కిటకిటలాడింది.

### పదవీవిరమణ చేసిన డా॥ బి.రోశిమునిి



హిందూ ధర్మప్రచార పరిషత్తులో కో-ఆర్డినేటర్‌గా పనిచేస్తున్న **డా॥బి.రోశిముని** 28-02-2010న పదవీ విరమణ చేశారు. ఈయన 1981 సంవత్సరంలో ఉద్యోగంలో చేరి 29 సంవత్సరాల పాటు స్వామిసేవలో వివిధ హోదాలో పనిచేశారు. ఈయన **'వసుమంగళనాటకం'** పై పిహెచ్.డి. చేశారు.

### ఉత్తమ మహిళా ఉద్యోగిని పురస్కార గ్రహీత శ్రీమతి వి. సుభాషిణి

సప్తగిరి ప్రధాన సంపాదక కార్యాలయంలో దిగువ శ్రేణి గుమాస్తాగా పనిచేస్తున్న శ్రీమతి విరూపాక్షి సుభాషిణికి ఉత్తమ మహిళా ఉద్యోగినిగా పురస్కారం లభించింది. అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకుని తిరుమల తిరుపతి దేవస్థానం ప్రతి సంవత్సరం ఉత్తమ మహిళా ఉద్యోగినులకు పురస్కారాలను అందజేస్తోంది. ఈమెకు 08-03-2010న ఈ పురస్కారం లభించింది. ఈమెకు సప్తగిరి శుభాకాంక్షలు తెలియజేస్తోంది.

- ప్రధాన సంపాదకుడు

## గిరిజన గోవిందం

తూర్పుగోదావరి జిల్లా అడ్డతీగలలో ఇటీవల పవనగిరి గ్రూప్ ఆఫ్ టెంపుల్ వారు గిరిజన గోవిందం కార్యక్రమాన్ని నిర్వహించారు. లోక కల్యాణం కోసం జరిగిన ఈ కార్యక్రమంలో తిరుమల తిరుపతి దేవస్థానంలో గిరిజన అర్చక శిక్షణ పొందిన సుమారు 355 మంది అర్చకులు పాల్గొన్నారు. గిరిజన పూజారుల సేవా సమితి రాష్ట్ర కన్వీనర్ శ్రీ తణుకు వెంకట్రామయ్య పర్యవేక్షణలో ఈ ఉత్సవాలు జరిగాయి. ఈ కార్యక్రమాలకు భక్తుల నుండి మంచి స్పందన లభించింది.

ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా రాజమండ్రి శాసనసభ్యులు శ్రీ రౌతు సూర్యప్రకాశరావు, విశాఖ దక్షిణ ప్రాంత శాసనసభ్యులు శ్రీ ద్రోణంరాజు శ్రీనివాసరావు విచ్చేశారు. ఈ కార్యక్రమంలో హిందూ ధర్మప్రచార పరిషత్తు కార్యదర్శి డా॥రాళ్ళబండి కవితాప్రసాదరాజు, తి.తి.దే. ప్రధాన సంపాదకులు శ్రీ సి.శైలకుమార్, జిల్లాధార్మికమండలి అధ్యక్షులు దొండపాటి శంకరరావు, తదితరులు పాల్గొన్నారు.

ఈ కూపను కత్తరించండి

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
____________________
____________________
____________________
____________________
(పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : **చందాదారుని సంతకము**

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో
కొందరు వ్యక్తులు అనధికారికంగా
**సప్తగిరి మాసపత్రికకు**
చందాల రూపంలో
అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని,
తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని,
నమ్మిస్తున్నారని తెలుస్తున్నది.
అలాంటి వారి మాటలకు మోసపోకండి.
సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి
ప్రసాదాలకు సంబంధం లేదు.
చందా మీరు నేరుగా
"ప్రధాన సంపాదకుడు, సప్తగిరి,
తి.తి.దేవస్థానం, తిరుపతి"
వారికి పంపించాలి. (లేదా)
తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల
వసతి సముదాయంలో
కూడా చందా కట్టవచ్చు.
సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు
దేవస్థానం బయటి వ్యక్తులను
ఎవరినీ నియమించలేదు.
**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.

☛ **మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083".**

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

జయజయ నృసింహ సర్వేశ
భయహర వీర ప్రహ్లాదవరద

మిహిర శశినయన మృగనరవేష
బహిరంతస్థల పరిపూర్ణ
అహినాయక సింహాసన రాజిత
బహళగుణగణ ప్రహ్లాదవరద

చటుల పరాక్రమ సమఘనవిరహిత
నిటలనేత్ర మౌని ప్రణుత
కుటిలదైత్యతతి కుక్షి విదారణ
పటు వజ్రనఖ ప్రహ్లాదవరద

శ్రీవనితాసంశ్రిత వామాంక
భావజకోటి ప్రతిమాన
శ్రీవేంకటగిరిశిఖరనివాస
పావన చరిత ప్రహ్లాదవరద

(2 - 289)





ఇది అన్నమయ్య రచించిన సంస్కృత కీర్తన! ఓ నరసింహా! నీకు జయము! ప్రహ్లాద వరదుడవైన సర్వేశ్వరా! నీకు జయము! సూర్యచంద్రులను కన్నులుగా గల్గి మృగ నర వేషాలతో సింహాసనాధిష్ఠితుడవైన ఓ నరసింహా! నీకు జయము! అని పలువిధాలుగా అన్నమయ్య శ్రీ నరసింహ స్వామిని స్తుతించిన సంకీర్తన ఇది.

**జూన్ నెల పండుగలు**

7 - హనుమజ్జయంతి

## రంగుల్లో....

సప్తగిరి మాసపత్రికను రంగుల్లో చూడాలని మా కోరిక, కల. రంగుల్లో ముద్రించడం వల్ల మీకు పత్రికను ఐదు రూపాయలకు అందించడం సాధ్యం కాదు. అందువల్ల పత్రిక వెల పెంచినా మేము ఆనందంగానే కొంటాం. మేమే కాదు ధార్మిక పత్రికల్ని ఆదరించే ఏ పాఠకుడైనా పత్రిక వెలను పరిగణించడు. వెల ఐదు రూపాయలే అయినా విలువ అమూల్యం అని అందరికీ తెలుసు. మా కలను నెరవేర్చ మనవి.

**- గోపీకృష్ణ, హైదరాబాదు.**

## లేదు... లేదు...

శ్రీ వేంకటేశుని మించిన దైవము, తిరుమలను మించిన పుణ్యక్షేత్రము లేదు. అలాగే 'సప్తగిరి'ని మించిన పత్రికా లేదు.. లేదు..!

**- బి.వసంత, చెన్నై.**

## కృతజ్ఞతలు

మేము గత 30 సం॥లుగా సప్తగిరి పాఠకులం. పత్రిక మాకు అందగానే సాక్షాత్తు ఆ శ్రీనివాసుడే మా ఇంట్లోకి నడచివచ్చినట్లు భావిస్తాం. ఇంత చక్కని పత్రిక అందిస్తున్నందుకు కృతజ్ఞతలు.

**- రాధాకృష్ణ, కడప.**

# మీ మాట

## మణిమకుటం

శ్రీనివాసుడు, భక్తుల పాలిటి కల్పతరువు. స్వామివారి లీలలు పత్రికకే మణిమకుటం. పత్రిక అందగానే మేము ముందుగా చదివేది స్వామివారి లీలలే. మా ఇంటిల్లిపాదికీ స్వామివారి లీలలు చదువుతుంటే ఎనలేని పరవశం కలుగుతుంది.

నిజంగా ఇంత తక్కువ ధరలో ప్రతి భక్తునికి అందుబాటులో ఉండే 'సప్తగిరి' పత్రిక అంటే మాకు ఎనలేని గౌరవం.

**- వి.ఉమారాణి, తిరుపతి.**

## సులభ శైలిలో...

సప్తగిరి మాసపత్రికలో ప్రచురితమౌతున్న ఆధ్యాత్మిక వ్యాసాలన్నీ సులభ శైలిలో ఉండి, మాలాంటి పామరులకు పఠనయోగ్యంగా ఉన్నాయి. రచయితలకు అభినందనలు.

**- మాధవీలత, కుప్పం.**

## విన్నపం

మనకు అష్టాదశ పురాణాలున్నాయి. కాని అవి తెలిసింది ఎందరికి? వాటిని ధార్మికపత్రిక అయిన మీ(మా) సప్తగిరిలో చిన్న చిన్న కథల రూపంలో ధారావాహికంగా ప్రచురించినట్లయితే, మా వలే అన్ని పురాణాలు తెలుసుకోవాలనే ఆశ ఉన్న అందరికీ, అతి సులభంగా లభించే మీ పత్రిక ద్వారా అమూల్య ఆధ్యాత్మిక గ్రంథాలు చదివే అవకాశం కలుగుతుంది. ఆ దిశలో ప్రయత్నాలు సాగించగలరని విన్నపం.

**- మెహర్ బాషా, నెల్లూరు.**

## ప్రత్యక్షంగా వెళ్ళలేకపోయినా...

సప్తగిరి పత్రికలో మీరు ప్రచురిస్తున్న "మన దేవాలయాలు" విశేషాలు చాలా బావుంటున్నాయి. బహుశా ఏ పత్రికా దేవాలయాల గురించి ఇంత వివరంగా తెలియజేయడం లేదనే విషయం నిస్సందేహం.

ఈ వ్యాసాలు చదివి ఎంతోదూరంలో ఉన్న ఆయా దేవాలయాలను దర్శించిన అనుభూతి మాకు కలుగుతోంది.

**- జమునారాణి, బెంగుళూరు.**

# మీరూ రాయండి!

**అడుగడుగున గుడి ఉంది, అందరిలో గుడి ఉంది ....** అన్నాడొక కవి.
పవిత్రమైన ఈ భారతావనిలో ప్రాచీన, అద్భుతమైన కళానైపుణ్యం,
అనంతమైన చరిత్రగల ఆలయాలు ఎన్నో! ఎన్నెన్నో!!
వాటి గురించి తెలుసుకోవాలని అందరికీ ఉంటుంది.

## అందుకే మీరూ రాయండి!

మీ సమీపంలో ఉన్న దేవాలయాల చరిత్ర, విశేషాలు, స్వామివారి మహిమలు మీరూ రాయండి.ప్రచురించిన ప్రతి రచనకు తగిన పారితోషికం ఉంటుంది.

ఆలయానికి సంబంధించిన ఫోటోలు జతచేయడం, కవరు మీద, రచన మీద **'మన దేవాలయాలు'** శీర్షికకు అని రాయటం మరువకండి.

మీ రచనలు పంపాల్సిన చిరునామా

**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి మాసపత్రిక,**
**తి.తి.దేవస్థానములు, తిరుపతి - 517 083, చిత్తూరు జిల్లా.**

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

# సప్తగిరి


తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 40 | మే, 2010 | సంచిక : 12




**మంచితనం కలకాలం నిలిచి ఉంటుంది**
**వంచన నశించి తీరుతుంది**


గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.

సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ

ఉప-సంపాదకురాలు :
డా॥ అల్లాడి సంధ్య

ముద్రాపకుడు :
వి. సాంబశివరావు, డి.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి
కార్యాలయం, తి.తి.దే., తిరుపతి


ముఖ చిత్రం :
**ఉభయ దేవేరులతో శ్రీ గోవిందరాజస్వామి,** తిరుపతి

చివరి పుట :
**శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి,** నారాయణవనం




***వివరాలకు :***

ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083,
ఫోను : 0877-2264543

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ. 500-00

**విదేశాలకు**

సం॥ చందా -- రూ. 850-00

## సంపాదకీయం

# కస్తూరీ తిలకం

భారతీయ సంస్కృతిలో కట్టుబొట్టు ప్రధానమైన అంశాలు. మన హైందవ సంస్కృతికి ఆచార సంప్రదాయాలే ప్రాణప్రదాలు. భారతీయ ఆచార వ్యవహారాల వెనుక శాస్త్రీయ విజ్ఞానం దాగి ఉండడం విశేషం. మన పూర్వీకులు స్త్రీ పురుష వివక్ష లేకుండా సిగను పెంచుకునేవారు, పూలు ముడుచుకునే వారు, కర్ణాభరణాలు ధరించేవారు. తిలకం దిద్దుకునేవారు. వైష్ణవ శైవ శాక్తేయాది సంప్రదాయాలకనుగుణంగా స్వేచ్ఛగా తిలకాలు దిద్దుకునేవారు.

ఆధునిక శాస్త్ర పరిజ్ఞానం ప్రకారం కూడా ఇడ, పింగళ, సుషుమ్న నాడుల త్రివేణీ సంగమం లాంటి ప్రదేశమే భృకుటీ మధ్యం. స్త్రీలు కానీ పురుషులు కానీ నుదుటి మధ్యనే తిలకాన్ని దిద్దుకోవడం పరిపాటి. ఈ తిలకాలు ఆ యా నాడులకు శీతలీకరణాన్ని కల్గించి శరీరానికి ఒక రకమైన స్వస్థతను ఏర్పరుస్తాయి. భ్రూమధ్యంలోనున్న ఆజ్ఞాచక్రం నుండి తేజస్సు వెలికి ప్రసరిస్తూ ఉంటుంది. ఆ తేజోహాని జరగకుండా తిలకం ఒక రక్షక వలయంలాగా ఉపకరిస్తుంది. పూర్వం తిలకాల్ని ధరించని వదన మండలాన్ని చూడడానికి శిష్టులు ఇష్టపడేవారు కాదు. ముత్తైదువులకు ఉన్న ఐదు మంగళకర లక్షణాల్లో తిలకం ప్రధానమైంది. తిలకం అలంకరణకే కాకుండా ఆధ్యాత్మిక భావాల్ని కలిగించడానికి దోహదపడుతుంది. శుచిశుభ్రతలకు సంకేతంగా నిలుస్తుంది. దుర్వ్యసనాలకు లోనౌతున్న సందర్భాల్లో త్రిపుండ్రం కానీ, తిరునామంగానీ ఒక హెచ్చరింపును కల్గించడానికి సహకరిస్తాయి.

తిలక ధారణ మనకు తెలియకనే సమాజంలో ఒక ఐకమత్య భావనను ప్రేరేపిస్తుంది. ఇంత బహుళార్థ ప్రయోజనకారి అయిన ఈ తిలకధారణ ముఖ్యంగా ఆధ్యాత్మిక సంస్థలకు అనుసరణీయం. విష్ణుమూర్తి అలంకారప్రియుడు. అందులోనూ పీతాంబరధారణతో పాటు నుదుటి మీది కస్తూరి తిలకం ఆయనకత్యంత ప్రీతిపాత్రం.

**యద్యదాచరతిశ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥**

దేనినైతే శ్రేష్ఠులనుసరిస్తారో దానిని ఇతర జనులు అనుసరిస్తారు. శ్రీనివాస ప్రభువుకు ప్రీతిపాత్రమైన కట్టుబొట్టును భక్తజనులు అనుకరించడం ఆ దేవుడి కృపకు పాత్రం కావడమే అవుతుంది. కాబట్టి స్వామి సేవకులుగా పనిచేస్తున్న ఉద్యోగులు, స్వామి సందర్శనం కోసం వస్తున్న భక్తులు కూడా తిరునామాన్ని, సంప్రదాయ వస్త్రాల్ని ధరించి, స్వామికి ఆత్మీయ భక్తజన గణంలో సభ్యులుగా మారాల్సిన కర్తవ్యం ఉంది. ఈ విధంగా ఇటు స్వప్రయోజనాన్ని, స్వామి కార్యాన్ని, శారీరక, మానసిక ఉల్లాసాన్ని కలిగించే, ఈ తిలకధారణ ఐహిక ఆముష్మిక సాఫల్యతకు సులభ సాధనం.

తిరుమలను సందర్శించే వారందరూ ఇలా సంప్రదాయబద్ధంగా స్వామివారిని దర్శించుకుంటే అది నిజంగానే కలియుగ వైకుంఠమా అనిపిస్తుందనటంలో సందేహం లేదు.

# అన్నమయ్య - వెంగమాంబ ఆరాధించిన తిరుపతి గంగమ్మ

**- జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

> సోదరుడైన శ్రీ సప్తగిరీశుని వద్ద నుండి 'పసుపు కుంకుమ చీర సారెలను' నేటికీ అందుకొంటూ సత్కరింపబడుతున్న తిరుపతి గంగమ్మను తాళ్లపాక అన్నమయ్య, తరిగొండ వెంగమాంబ వంటి భక్తశిరోమణులు ఆరాధించారు. తమ సాహిత్యాల్లోనూ ప్రస్తుతించారు. **మే 18న జరుగుతున్న "తిరుపతి గంగ జాతర"** సందర్భంగా ప్రత్యేక వ్యాసం మీకోసం! - ప్రధాన సంపాదకుడు

**సర్వమంగళమాంగల్యే శివే సర్వార్థ సాధికే**
**శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తు తే"**

ఆ యా ఉపాసకులను బట్టి ఆ భగవతత్త్వం పురుష రూపంలోనేగాక స్త్రీరూపంలో అనగా దేవీ రూపంలో కూడ అభివ్యక్తమై సనాతన హైందవసంప్రదాయంలో విస్తృత ప్రచారాన్ని పొందింది. అలాగ ఆవిర్భవించిన దేవీ స్వరూపాలు అనంతకోటి! జగన్మాతగా పిలువబడుతూ అర్చింపబడుతున్న ఆ తల్లి త్రిగుణాతీత! ఆమే మహాలక్ష్మిగా, మహాసరస్వతిగా, మహాకాళిగా...ఇలా ఆ యా పేర్లతో పిలువబడినా భిన్నత్వంలో ఏకత్వం అన్నట్లుగా ఆ తల్లి త్రిమూర్తులకు అతీతమైన శక్తిగా భాసిస్తున్నదనీ, ఆమె యొక్క ప్రేరణవల్లే, సంకల్పంవల్లే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనే త్రిమూర్తులు అవతరించి, సృష్టి, స్థితి, లయాది కార్యక్రమాలు నిర్వర్తిస్తున్నారనీ, మళ్ళీ వారి దేవేరులుగా తానే సరస్వతిగా, లక్ష్మిగా, పార్వతిగా అవతరించిందని దేవీభాగతాది పురాణాలు అనేక విధాలుగా వర్ణిస్తున్నాయి. అంతేగాక త్రిగుణాత్మిక అయిన ఆ శక్తి స్వరూపిణి గ్రామగ్రామాల్లో గ్రామదేవతలుగా కూడ అవతరించి, ఆ యా ప్రాంతాల ప్రజలకు బాధలు రోగాలు తొలగించి పాడిపంటలను వృద్ధిపరుస్తుంటుందని కూడా పెద్దలమాట!

కనుకనే భారతదేశంలో సర్వత్రా పల్లెపల్లెలో ఆ జగన్మాత గ్రామ దేవతగా వెలసివుంటూ ఆ ఊరి ప్రజల చేత ఘనంగా పూజలందుకొంటు వారివారి కోరికలను నెరవేరుస్తున్నది. క్షేత్రయాత్ర చెయ్యాలన్నా లేదా తీర్థయాత్రకు బయలు దేరాలన్నా, లేదా ఇంట్లో ఒక శుభకార్యం చెయ్యడానికి పూనుకొన్నా ముందుగా ఆ గ్రామ ప్రజలు తమ గ్రామదేవతను స్మరించాల్సిందే.తప్పక పూజించాల్సిందే. అలా చేస్తేనే వారి వారి కోరికలు, పనులు నెరవేరతాయి. ఇంటిలో శుభకార్యాలు నిర్విఘ్నంగా కొనసాగుతాయి.

మహాశక్తి స్వరూపిణి అయిన ఆ జగన్మాత 'ఎల్లమ్మ' అనీ, పోలేరమ్మ అనీ, 'నూకాలమ్మ' అనీ 'సవారమ్మ' అనీ, 'మారియమ్మ' అనీ 'చెంగాళమ్మ' అనీ, 'బతుకమ్మ' అనీ, ఇంకా 'దుర్గమ్మ' మాంచాలమ్మగా, కనకమహాలక్ష్మిగా ఇలా అనేకానేక పేర్లతో పల్లె పల్లె మొదలుకొని ఆ యా ప్రసిద్ధ క్షేత్రాల్లో అంతటా వెలసి, దర్శనమిస్తున్నది. ప్రధానంగా చిత్తూరు జిల్లాలో 'గంగమ్మతల్లి'గా 'గంగానమ్మ'గా కొలువై భక్తుల చేత ఘనంగా పూజలందు కొంటున్నది. ఆ యా దేవతల ఆరాధనా క్రమంలో 'జాతర్లు' అనీ, 'దేవర్లు' అనీ, 'తిరుణాళ్లు' అనీ ఏడాదికొకమాటో లేదా, 12 ఏండ్ల కొకమాటో ఆ యా దేవతల పేర్లతో వేడుకలు జరగడం ఆనవాయితీగా జరుగుతున్న సంప్రదాయం.

ప్రధానంగా కలియుగ భూలోకవైకుంఠమైన తిరుపతి క్షేత్రంలో గ్రామదేవతగా వెలసిన 'గంగమ్మ' శక్తిస్వరూపిణిగా, భక్తులపాలిటి కల్పవల్లిగా, కరుణామయిగా దర్శనమిస్తున్నది. "తిరుపతి గంగమ్మ జాతర" పేరుతో వారంరోజులపాటు జరిగే ఉత్సవాలు ప్రాచీనకాలంనుండీ దేశమంతా ప్రసిద్ధిని పొందినాయి.

అనూచానంగా ఈ తల్లి శ్రీ వేంకటేశ్వర స్వామివారి సోదరిగా భావింపబడుతూ, ప్రతి సంవత్సరం మే నెలలో జరిగే తిరుపతి గంగమ్మ జాతరలో "చీరసారె పసుపు కుంకుమలు" తిరుమల శ్రీస్వామివారు సారెగా పంపడం ఆనవాయితీగా వస్తున్నది. తిరుపతి పట్టణంలో 'గంగమ్మ' పేరుతో ఇరువురు గ్రామదేవతలు వెలిసివున్నారు. ఒకరు తాతయ్యగుంట గంగమ్మ, మరొకరు తాళ్లపాక గంగమ్మ.

తాళ్లపాక గంగమ్మ ప్రస్తుతం తిరుపతి ఆర్.టి.సి బస్టాండు కూడలి వద్ద చిన్నగుడిలోను, తాతయ్యగుంట గంగమ్మ 'తుడా' కార్యాలయం వద్ద ఆలయంలో కొలువై ఉన్నారు.

వీరిద్దరిలో తాతయ్యగుంట గంగమ్మ ప్రధాన గ్రామదేవతగా పూజలందుకొంటున్నది. 15వ శతాబ్దంలో కడపజిల్లా తాళ్లపాక నుంచి తిరుపతిని చేరుకొన్న అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని భక్తునిగా ఆ స్వామివారి నందక ఖడ్గ అంశతో అవతరించిన కారణ జన్ముడిగా పేరు పొందినాడు. సుమారు 32వేల కీర్తనలను శ్రీనివాసునిపై రచించి గానం చేసిన అన్నమయ్యకు అప్పటి దేవస్థానం వారో లేక అప్పటి తిరుపతి పురప్రముఖులో ఒక పెద్ద చెరువును, దానిప్రక్కనే సాగులో ఉన్న వ్యవసాయ భూమిని విరాళంగా సమర్పించారు. అప్పటినుంచి అది తాళ్లపాక చెరువు అనీ, తాళ్లపాక భూములనీ పేరు ఏర్పడింది. ఆ నాటి నుండి ఆ చెరువు పక్కనే ఎప్పటినుంచో ఉన్న గ్రామదేవత గంగమ్మ 'తాళ్ళపాక గంగమ్మ' అనే పేరుతో స్థిరపడింది. తాళ్లపాక అన్నమయ్య తొలిసారిగా తిరుపతి యాత్రకు వచ్చిన సందర్భంలో ఈ గ్రామదేవత గంగమ్మను దర్శించినాడని "అన్నమయ్య జీవిత చరిత్ర"లో తెలుపబడింది.



.............................................

**యుక్తి వేంకటగిరి యొద్ద నున్నట్టి**
**పల్లెలో గొల్లల పాలింటి శక్తి!**
**యల్లారు నని మును లనిశంబు బొగడ**
**గనుపట్టు నట్టి యా గ్రామంపు శక్తి**
**గనుగొని బహునమస్కారముల్ చేసి**

నాడట! అన్నమయ్య. అప్పటికే, ఆనాటికే గొల్లలు అర్చకులుగా, అనగా యాదవులు అర్చించే ఈ గంగమ్మను మొదట దర్శించిన తర్వాతే యాత్రికులు తిరుమల కొండకు వెళ్ళేవారని తెలుస్తున్నది. నేటికీ తాళ్లపాక గంగమ్మ వద్ద యాదవులే అర్చకత్వం చేస్తున్నారు. తిరుమల శ్రీ స్వామివారిని ప్రతిరోజు తొలిగా దర్శించేది కూడా యాదవుడే అని ఇక్కడ గమనించవలసిఉంది.

ఇక తాతయ్యగుంట గంగమ్మను గూర్చి కూడా ప్రసిద్ధంగా ఒక కథ ప్రచారంలో ఉన్నది. తిరుమలక్షేత్రంలో సాక్షాత్తు శ్రీనివాసుని చేతనే తాతా! తాతా! అని పిలిపించుకొన్న ఒక పరమభక్తుడు ఉండేవాడు. ఆనాటి నుండి ఆ భక్తుడు, అతని వంశంలోని వాళ్ళంతా "తిరుమల తాతాచార్యులు అని పిలువబడేవారు. 16వ శతాబ్దంలో తిరుమలతాతాచార్యులు అని ప్రసిద్ధిపొందిన ఒక వైష్ణవ భక్తుడు దేశసంచారం చేస్తూ కడప జిల్లాలో ఒక గ్రామానికి వెళ్ళి, ఆ రాత్రి అక్కడ విడిది చేశాడట! ఆ పల్లెలో ఆ రోజు ఆ గ్రామదేవత గంగమ్మకు జాతర జరుగుతూ ఉండేది. ఆ దేవత భయంకరంగా ఉగ్రరూపిణియై నరభక్షకురాలై ఆ గ్రామప్రజల్ని వేళపాళ లేకుండా పొట్టన బెట్టు కుంటూ పీడిస్తూ ఉండేది. ఆ బాధ భరించలేక "అమ్మా! తల్లీ! ఇలా మమ్మల్ని భక్షించకు. సంవత్సరానికి ఒకమారు నీకు జాతర చేసి, మేమే నీకు నరబలిని సమర్పిస్తాం. అని అందరూ వేడుకొనగా ఆ ఉగ్రదేవత సరేనన్నదట! సరిగ్గా ఆ రోజు నుంచి ఆ ఊళ్లో గంగమ్మ

జాతర జరుగుతుండింది. ఆ గ్రామ ప్రజలు నరబలికోసం వెదుకుతుండగా వారికి ఆ రోజే ఆ ఊరికి వచ్చిన తాతాచార్యులు కనపడ్డాడు. బాగా బలిష్ఠంగా ద్వాదశ ఊర్ధ్వపుండ్రాలతో ఉన్న ఈ స్వామిని బలి ఇస్తే అమ్మవారు సంతృప్తి పడుతుందని, ఇతనిని బలిఇచ్చి ఇప్పటికి గట్టెక్కవచ్చునని భావించిన ఆ ఊరి ప్రజలు ఆ స్వామిని నిర్బంధించారు. ఇది తెలుసుకొన్న ఆయన శిష్యులు గగ్గోలుపెట్టారు. అయినా ఏమాత్రం బాధపడవద్దని శిష్యులను ఓదార్చి తాతాచార్యులు ఆ ప్రజలవెంట గంగ జాతర దగ్గరకు వెళ్ళాడు. ఆ స్వామి ఇంతలో కొలిమిలో అగ్ని వెలిగించి, శంఖ చక్ర ముద్రలను బాగా ఎర్రగా కాల్చి ఉంచమని శిష్యులను ఆదేశించాడు. బాగా అర్ధరాత్రి అయిన తర్వాత గంగమ్మ ఒకనికి పూనకం వచ్చి "బలి! బలి! నరబలి!" అని అరుస్తూ చిందులేస్తూరాగా వెంటనే తాతాచార్యులు కొలిమి నిప్పుల్లో బాగా ఎర్రగా కాల్చివుంచిన శంఖ చక్రాల ముద్రలను వాని భుజాలపై వాతలు వేశాడు. వెంటనే వానిని ఆవహించిన గంగమ్మ భయపడి పారిపోవడానికి ప్రయత్నించగా తాతాచార్యులు మంత్రశక్తిచేత ఆమెను దిగ్బంధం చేశాడు. అయినా ఆ శంఖ చక్రాలవాతలు భుజాలపై పడకుండా వీపుపై పడ్డాయట! అందువల్లే "తాతాచార్యుల వాతలు భుజం తప్పినా వీపు తప్పవు" అనే సామెత ఏర్పడింది. ఆ గంగమ్మ ఆచార్యులను శరణువేడింది. ఆమెను తన శిష్యురాలిగా చేసుకొని అనుగ్రహించి, తన వెంట తిరుపతికి పిలుచుకొని వచ్చాడు. అప్పటికే తమ అధీనంలో ఉన్న చెరువు పక్కన ఉన్న పొలంలో ఆమెను ప్రతిష్ఠించి, ఇకమీదట, ఆ దేవతను తిరుపతి గ్రామదేవతగా ఉంటూ రక్షించవలసిందని, సాత్త్వికంగా ఉంటూ ఎలాంటి బలులను కోరకుండా కేవలం పొంగళ్లను ఆహారంగా స్వీకరించవలసిందంటూ తాతాచార్యులు కట్టడి చేశాడట! ఆనాటి నుండి ఆ గంగమ్మ 'తిరుపతి తాతయ్యగుంట గంగమ్మ'గా పేరుపొంది ప్రధాన గ్రామదేవతగా మొక్కులందుకుంటున్నది.

తిరుపతిలోని తాతయ్యగుంట గంగమ్మకు సంబంధించిన ఈ వృత్తాంతాన్ని పండిత ప్రభాకరులు అయిన శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు "అన్నమాచార్యుల జీవిత చరిత్ర పీఠిక"లో పేర్కొన్నారు. తిరుపతి తాతయ్యగుంట గంగమ్మ, తాళ్లపాక గంగమ్మలిద్దరు సాహిత్యంలో కూడ చోటు చేసుకొని మహిమాన్వితమైన దేవతలుగా ప్రసిద్ధిని పొందినారు.

18వ శతాబ్దంలో తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆంతరంగిక భక్తురాలిగా, భక్తకవయిత్రిగా పేరుపొందిన మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ కూడ తిరుపతిలోని ఈ గ్రామ దేవతలను ఘనంగా ఆరాధించి, తన రచనల్లో కూడా పేర్కొంది. 'జలక్రీడావిలాసం' అనే యక్షగానంలో–చిలిపికృష్ణుడు

## పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు
# మహాపరాధం

**అన్యక్షేత్రే కృతం పాపం**
**పుణ్యక్షేత్రే వినశ్యతి**
**పుణ్యక్షేత్రే కృతం పాపం**
**బ్రహ్మలోకే న నశ్యతి**

**ఇతర క్షేత్రాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్రంలో నశిస్తుంది.**
**కానీ పుణ్యక్షేత్రంలో చేసిన పాపం**
**బ్రహ్మలోకానికి వెళ్ళినా నశించదు. కావున,**
**పుణ్యక్షేత్రంలో ఆత్మహత్యాది పాపాలు చేయరాదు.**

**ఆత్మహత్య అనేదే మహాపాపమని**
**మన పురాణాలు చెపుతున్నాయి.**
**అలాంటి ఆత్మహత్యలు పుణ్య క్షేత్రాల్లో చేసుకుంటే**
**ఆ పాపం తమకే కాకుండా తమ వంశానికంతా**
**చుట్టుకుంటుందని ఋషులు ఘోషించారు.**
**కాబట్టి భగవంతుని సన్నిధిలో సత్కార్యాలు చేస్తే**
**వాటి ఫలితం శతాధికంగా ఉన్నట్లే**
**ఆత్మహత్యల్లాంటివి చేసుకుంటే**
**స్వర్గప్రాప్తి సిద్ధించకపోగా,**
**ఆ పాప ఫలం తరతరాలు పట్టి పీడిస్తుంది.**
**కాబట్టి పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు చేసుకోవద్దు.**
**భగవద్దర్శనంతో**
**ఆత్మానందాన్ని, మనోధైర్యాన్ని పొందండి.**

తన అల్లరి పనులతో గోపికలను ఆట పట్టిస్తుంటాడు. ఒకప్పుడు అల్లరికన్నయ్య తేళ్లను పట్టుకొని గోపికలకు కుట్టిస్తాడు. అంతే తేళ్లవిషం ఎక్కిన ఆ గోపికలు నొప్పి! నొప్పి! అంటూ చిందు లేస్తుండగా ఆ గోపికల అత్త, కోపంతో అంతా నటన అంటూ అరుస్తుంది. లేదత్తా ఇదంతా అల్లరి కృష్ణుడు చేసిన పని అంటూ తమబాధను అత్తలదగ్గర వ్యక్తం చేస్తారు గోపికలు. వెంటనే అత్త తన చేతిలో విభూతిని పట్టుకొని ఇలా మంత్రిస్తుంది.

"ధూ! మాయలమల్లీ! మళయాళ భగవతీ! నందవర చౌడేశ్వరీ! నారాయణం ఆమ్నాయాక్షీ! పరమేశ్వరీ! శివకంచి ఏకామ్రేశ్వరీ! జంబుకేశ్వరాఖిలేండశ్వరీ!కాళహస్తీశ్వరా జ్ఞానాంబ! భక్తజనావలంబ! సద్గుణ కదంబ! మదంబ! చిదంబరేశ్వర శివశంకరీ! శ్రీశైలభ్రమరాంబ! కాలభైరవ! గణేశ్వరా! కోళా లమ్మా! కోల్లాపురెమ్మా! తాళ్లపాక గంగమ్మా! తాతయ్యగుంట గంగమ్మా! మీకు మ్రొక్కెద. ఈ కులుకులాడి(ల) సళుకు దించుడు. తరిగొండ నరసింహుని తోడే! నాకు జెప్పిన గురు పాదమాన! దిగు, దిగూ!"

అంటూ తేలు విషాన్ని దిగమని మంత్రిస్తూ తేలుకుట్టిన చోట విభూతిని రాస్తుంది గోపికల అత్త! అంతే ! తేలువిషం దిగిపోయేదట! ఈ తేలుమంత్రంలో ప్రసిద్ధమైన క్షేత్రాల్లో వెలసిన దేవతలసరసన తిరుపతి గంగమ్మలను ఇద్దరిని పేర్కొనడంలో వీరు ఎంత మహిమగల దేవతలో స్పష్టమౌతున్నది.

తాతయ్యగుంట గంగమ్మ, తాళ్లపాక గంగమ్మలతో పాటు, తిరుపతి పట్టణంలో ఆయాచోట్ల అంకాళమ్మ, వేషా లమ్మ, ముత్యాలమ్మ, నేరెళ్లమ్మ మున్నగు శక్తి దేవతలున్నారు. అక్కాచెల్లెళ్లుగా వ్యవహరింపబడే వీరందరి పుట్టిల్లు తిరుపతికి సమీపంలోని అవిలాలగ్రామం. తిరుపతి గంగజాతర సందర్భం లోనే వీళ్ళందరికీ జాతర జరుగుతుంది. అవిలాలనుంచే వీరికి పసుపుకుంకుమలు సారెగా సమర్పింపబడతాయి.

తిరుపతి గంగమ్మజాతర ప్రతిఏటా తమిళమాసం చిత్తిరి నెలలో చివరిమంగళవారం నాడు జరుగుతుంది. అంటే తెలుగు వైశాఖమాసంలో (మే నెల) వస్తుంది. ఈ చివరి మంగళవారానికి ఎనిమిదిరోజులు ముందునుంచే జాతర సంరంభం ప్రారంభమౌతుంది. అంటే జాతర జరిగే మంగళ వారానికి ముందు మంగళవారం రాత్రి 'గంగజాతర!' ప్రారంభం అంటూ పురవీథుల్లో చాటింపు వేస్తూ పొలి చల్లుతారు. అంటే మరునాడు బుధవారం నుండి ఏడురోజుల పాటు ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండుపూటల వేషాలు వేసి 'వేషాలమ్మ' గుడినుండి ప్రారంభించి ఊరంతా తిరుగుతూ చివరకు తాతయ్య గుంట గంగమ్మ దగ్గరికెళ్లి మొక్కులు చెల్లించుకొంటారు. గంగమ్మ జాతర ప్రారంభమైన తర్వాత ఈ పురప్రజలు తిరుపతిని, విడిచి వెళ్ళరు. ఒక వేళ తప్పనిసరిగా వెళ్ళినా జాతర లోపలే తిరిగి వచ్చేస్తారు.

1895లో ముద్రింపబడిన మద్రాసు నార్తార్కాటు డిస్ట్రిక్టు మాన్యువల్లో తిరుపతి గంగజాతర విశేషాలు స్పష్టంగా తెలుప బడ్డాయి.

గంగజాతరకు వారంముందు అనగా బుధవారం ఉదయం బైరాగివేషం, ఆ సాయంత్రం 'పాముడేషం' ఇలా ప్రతిరోజు ఉదయం సాయంత్రం వరుసగా బండవేషం, తోట వేషం, వేసేవారట! అయితే ఆదివారం పొద్దునపూట మాత్రం వేసే 'మాతంగివేషం' చాల ప్రధానమైందనీ, ఈ వేషాన్ని ముఖ్యంగా కైకోలన్ అనగా చేనేత కులస్థులు మాత్రమే వేసే వాళ్ళని తెల్పబడింది. ఈ వేషం వేసిన భక్తుడు అమ్మవారి గుడి ముందు వాయిద్యాల కనుగుణంగా నృత్యం చేసేవాడనీ తెల్ప బడింది. ఇలా ఈ మాతంగులు, ప్రసిద్ధులైన బ్రాహ్మణుల ఇండ్లముందు, మఠాల ముందు నృత్యాలుచేస్తూ వారిచేత బహుమతులను, కానుకలను పొందుతూ చివరకు గంగమ్మకు మొక్కులు సమర్పించే వారని తెలుస్తున్నది.

ఇలాంటిదే మరో విచిత్రవేషం సున్నపుకుండవేషం! దీన్ని కూడా ప్రాచీనకాలం నుండీ పద్మసాలె కులస్థులే వేస్తుండడం విశేషం! ఆడవేషం వేసిన వ్యక్తి తలపై దొంతర్లుగా పేర్చిన సున్నపుకుండలతో వాయిద్యాలకు అనుగుణంగా నృత్యంచేస్తూ, పసుపు కుంకుమలను ప్రసాదంగా పంచుతూ గంగమ్మ దగ్గర మొక్కులు చెల్లించడం. ఈ వేషంలో ఈనాటికీ ఎలాంటి మార్పులులేకుండా వస్తున్న సంప్రదాయంగా కనపడుతున్నది.

ఇక గంగజాతర రోజైన మంగళవారం, వారు వీరు అనకుండా పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, వైష్ణవులు,

బ్రాహ్మణులు, ఇలా అన్ని కులాలవారు భక్తి ప్రపత్తులతో గంగమ్మగుడికి వెళ్ళి కాయకర్పూరాలతో మొక్కులు సమర్పిస్తారు. కొందరు, వేపమండలు నడముకు చుట్టుకొని గోపురాకారం కలిగిన సప్రాలతో నృత్యంచేస్తూ చిందులేస్తూ తప్పెట్లు తాళాలతో వెళ్ళి మొక్కులు సమర్పిస్తారు.

గంగజాతరలో చివరగా ప్రధానమైన వేషం పేరంటాలు వేషం! సుమంగళిగా చనిపోయిన స్త్రీకి ప్రతిరూపంగా భావించే ఈ వేషాన్ని పూర్వం ఆడవాళ్లు వేసేవారట! పేరంటాలువేసే స్త్రీ గుర్రంపై స్వారీచేస్తూ తిరుపతి వీథుల్లో పసుపుకుంకుమలు పంచుతూ పూజలందుకొంటూ ఉండేదట! నేడు పురుషులే చీర రవికను ధరించి పేరంటాలు వేషం వేస్తుండడం చూడవచ్చు. ఈ పేరంటాలు రాత్రంతా తిరుపతిలో తిరుగుతూ పసుపు కుంకుమలు ప్రసాదంగా పంచుతూ తెల్లవారు జామువేళకు గంగమ్మ గుడికి చేరుకొంటాడు. సరిగ్గా ఆ సమయానికి బంక మట్టితో తీర్చి సిద్ధం చేసిన సుమారు 5 అడుగుల గంగమ్మకు (ముఖం) పూజలు చేసి, సూర్యోదయానికి ముందుగా ఆ విగ్రహాన్ని భగ్నం చేస్తారు. ఈ మట్టిబొమ్మల పూజా తతంగం అటు తాతయ్య గుంట గంగమ్మవద్ద, ఇటు తాళ్లపాక గంగమ్మవద్ద కూడ జరుగుతుంది. దీంతో తిరుపతి గంగజాతర ముగుస్తుంది.

గంగజాతర్లో పిన్నలు, పెద్దలు, వేయికండ్లకుండల్లో (రంధ్రాల) జ్యోతులు వెలిగించి అమ్మవారికి సమర్పించడం, పొంగళ్లు పెట్టడం, చీరసారె సమర్పించడంవంటి ప్రత్యేకమొక్కులు కనపడుతున్నాయి. జంతుబలులు బాగా తగ్గిపోయాయి.

శ్రీ వేంకటేశ్వరుని చెల్లెలు గంగమ్మ పూర్వం ఒక రాక్షసునితో ఏడురోజులపాటు ఏడు వేషాలతో హోరాహోరి యుద్ధం చేసిందనీ, చివరిరోజు వాణ్ణి సంహరించిందని, అందుకు నిదర్శనమే నేటి గంగజాతర వేషాల వేడుకలనీ పెద్దలమాట! అందుకు పూర్వం రాక్షసుని వేషం వేసిన వాణ్ణి బండిమీద ఊరేగిస్తూ పొలిమేరవరకు తరిమికొట్టి చంపినట్లుగా చేసి వచ్చేవారనీ, పూర్వం గజిట్‌లో తెల్పబడింది. ఇప్పుడీ రాక్షసుని వేషం ప్రచారంలో లేదు.

ఈ వేషాలన్ని గంగమ్మ ధరించిన రూపాలకు ప్రతీకలగా, ఉన్నందువల్ల ప్రతి వేషంలోను స్త్రీత్వమే గోచరిస్తుంది!



మారుతున్న కాలంతో పాటు ఎన్ని ఆచార వ్యవహారాలు మారినా, తిరుపతి ప్రజల్లో మాత్రం నాటికీ నేటికీ గంగమ్మ ఎడల భయమూ, భక్తీ ఏ మాత్రం సడలలేదు. ప్రాచీన వేషాలు ఆడంబరాలు, ఆర్భాటాలు తగ్గినా, మొక్కులు చెల్లించడం, వరపడడం వంటి వాటిల్లో ఏమాత్రం విశ్వాసాలు సడలలేదని చెప్పవచ్చు. శ్రీ వేంకటేశ్వరుని సోదరి అయిన తిరుపతి గంగమ్మ కొలిచినవారి కులదైవం! ఆ అమ్మలగన్న అమ్మ ఆర్తుల పాలిట ఆనందవల్లి! భక్తులపై అమృత జల్లులు కురిపించే దయా స్వరూపిణి తిరుపతి గంగమ్మతల్లి!

**యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా**
**నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః**

# చైతన్యం

**- జి.బిందుప్రసాద్**

సచ్చిదానంద స్వరూపం పరమాత్మ. ఆయనను ఆత్మ బ్రహ్మం చైతన్యం ప్రజ్ఞ అని పలురకాల పేర్లతో అర్థం చేసుకోవటాన్ని ఆధ్యాత్మిక చింతన అంటారు. చింతన అను భవంగా మారినపుడు 'దర్శనం' అంటారు. అంటే ఆత్మ దర్శనం అన్నమాట. దర్శనంలో స్థిరపడినవానిని స్థితప్రజ్ఞుడు, జీవన్ము క్తుడు జ్ఞాని అంటారు. జ్ఞాని భగవంతుడి శక్తులు ప్రకటిం చటం ద్వారా 'విజ్ఞాని' అవుతున్నాడు.

"దైవాన్ని దర్శించటం జ్ఞానం, దైవశక్తులు ప్రకటిం చటం విజ్ఞానం" అన్నారు శ్రీరామకృష్ణ పరమహంస.

భగవంతుడి ప్రథమరూపం సంకల్పం. సంకల్పించ టం ద్వారా విశ్వరూపి ఐనాడు. విశ్వం ముఖ్యంగా మూడు శక్తులుగా విభజించబడింది. జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి. ఇవి మూడు అస్థిరాలు. అస్థిరం అయింది 'జడం' అనబడు తుంది. స్థిరమైంది ఒక్కటే అది చైతన్యం. అదే సత్యం.

విశ్వంలోని జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తులు ఉపాధి గత చైతన్య రూపాలు. చైతన్య స్వభావం అయిన స్థిరతత్త్వం ఉపాధిలో జ్ఞానశక్తిగా ప్రకాశిస్తూ ఉపాధిని (శరీరాన్ని) సుస్థిరం చేయాలన్న భ్రమలో సుస్థిరత కోసం పోరాడుతూ క్రియాశీలమై యింది.

అరటి పిలకను తీసుకోండి. అది చిన్నదిగా ఉన్నపుడు ఖండించండి అది మొలుచుకొస్తుంది, మళ్ళీ ఖండించండి తిరిగి మొలుచుకొస్తుంది. ఎన్నిసార్లు నరికినా అది పెరుగుతూనే ఉంటుంది. చెట్టు పెరిగి గెల వేసిన తరువాత ఆ చెట్టును ఖండించండి. ఇక మొలుచుకరాదు. ఎందువల్ల?

జ్ఞానశక్తి ఉపాధిని గుర్తుంచుకొంటుంది. ఇచ్ఛాశక్తి ఉపాధికార్యాన్ని గుర్తుంచుకొంటుంది, క్రియాశక్తి కార్యాన్ని పూర్తి చేస్తుంది. చెట్టు ఆకారం వికారం జ్ఞానశక్తిగాను కార్యక్రమం ఇచ్ఛాశక్తిగాను పూర్తి చేయటం క్రియాశక్తిగా ఉంటున్నాయి. గెలవేయటం పూర్తి అయిన తర్వాత శక్తులు ఉపశమిస్తున్నాయి. అప్పటి వరకు చెట్టు మళ్ళీ మళ్ళీ మొలుస్తూనే ఉంటుంది.

ఈ మూడు శక్తులు జీవులు నిర్జీవులులో కూడా ఉన్నాయి. కానీ వాటిలో జ్ఞానఇచ్ఛాక్రియాశక్తులు ఒక పరిధికి లోబడి క్రమం తప్పని విధంగా ఉన్నాయి. ఆ శక్తులు పూర్ణంగా వ్యక్తం కావటానికి తగిన విధంగా పరిణమించింది ఒక మానవ శరీరం మాత్రమే. మానవుడిలో అభ్యాసం ద్వారా క్రియాశక్తి మనోనిశ్చలత ద్వారా ఇచ్ఛాశక్తి బలపడుతాయి. సాధన ద్వారా మూడు శక్తులను అధీనంలోకి తెచ్చుకుని వాటిని అతిక్రమించి చైతన్య స్వరూపుడై మానవుడు శక్తులను శాసించగలడు.

ఇక, విశ్వం రెండు రూపాలుగా ఉంది. ఒకటి స్థూలం రెండవది సూక్ష్మం. జీవుడు రెండింటిలో భ్రమిస్తుంటాడు. స్థూలరూపం అందరకూ ఒకే విధంగా తెలుస్తుంది. సూక్ష్మం వారి వారి అనుభవాన్ని బట్టి మారుతుంటుంది. జ్ఞానం సూక్ష్మ వ్యవస్థకు సంబంధించింది. విషయాన్ని గ్రహించి తదను గుణంగా మారుతున్నంత కాలం 'జీవుడు' అనబడుతున్న శక్తులు కార్యకారణం ముగియటంతో తారాస్థాయిలో కేవలజ్ఞానం అయి 'చిత్' అనబడుతున్నాయి. 'చిత్' అంటే పూర్ణజ్ఞానం అదే భగవంతుడు.

సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు అయిన భగవంతుడు దుఃఖించడు, తపించడు. ఆయన నిరంజనుడు. ఆనంద స్వరూపుడు. దుఃఖస్పర్శ ఉపశమించినపుడు ఉండేది ఆనందం. భగవంతుడు నిర్వికారి. వికారం దుఃఖకారణం. కోరికలు వికారాన్ని కలిగిస్తాయి. కోరికలకు కారణం ఆనందా పేక్ష. విషయాలలో ఆనందాన్ని అన్వేషించడం అజ్ఞానం. అజ్ఞానం నశిస్తే మిగిలింది ఆనందం. విషయానందం అనుభవించిన తరువాత మాత్రమే విషయానందాన్ని దుఃఖం అనుసరిస్తుందని తెలుస్తుంది. విషయభోగ విముఖత కలుగు తుంది. అది వైరాగ్యం. వైరాగ్యం దుఃఖరహిత ఆనందానికి బాట వేస్తుంది. అజ్ఞానం నశిస్తుంది. ఇక మిగిలింది 'ఆనందం'. అందువల్ల భగవంతుడు సత్, చిత్, ఆనందం అయినాడు.




**(శల్యసారథ్యంలో అరివీర భయంకరుడు, మహాదాత అయిన కర్ణుడు అర్జునుని చేతిలో మరణించడంతో కర్ణపర్వం పరిసమాప్తమైంది. శల్యపర్వం ఈ సంచికలో ప్రారంభమైంది.)**

**ధర్మరాజు**

వీరిని చూస్తూనే ధర్మరాజు తమ్ముడూ! రణస్థలంలో రాధేయుని కడతేర్చడం అమరాసురులకు వశం కాదు -అన్నాడు. అప్పుడు అర్జునుడు: ధర్మనందనా! ఇప్పుడే వెళ్ళి కర్ణుని కడతేర్చి వస్తాను, అనగా : తమ్ముడూ! ఇదా నువ్వు చేసిన పని! ఇది వీరలక్షణమేనా! మనకింక యుద్ధం దేనికి, అడవికి పోయి ఆకు అలమూ తిందాం కాదంటే కౌరవపతి కొలువులో ఊడిగం చేద్దాం. అభిమన్యుడైనా, ఘటోత్కచుడయినా బ్రతికివుంటే ఈ పరాభవం నాకు జరిగేదేనా! చేతకాక పోతే నువ్వు సూత కృత్యం సాగించి వాసుదేవునికి గాండీవం ఇయ్యి. అంటూండగానే అర్జునుడు కత్తి దూసి అన్నగారి తల నరకబోగా వాసుదేవుడు: గాండీవీ ఏమిటిది? అన్నాడు.

నా ప్రతిజ్ఞ నెరవేరవలసిందే, అని పట్టు పట్టాడు పార్థుడు. ఆర్యులను దూషిస్తే సంహరించినట్లే, అన్నాడు ధర్మ సూక్ష్మం చెపుతూ కృష్ణుడు.

పరిపరి విధాల నిందించి అర్జునుడు ఆ పాప పరిహా రార్థం ఆత్మప్రశంస చేసుకున్నాడు. అంతా అయాక ధర్మరాజు: నా మనసు యుద్ధం మీదికి నడవడం లేదు. అడవికే పోవాలని ఉంది, అన్నాడు. వాసుదేవుడు వారించి ఆ రోజున కర్ణుని వధించి తీరగలనని అర్జునుని చేత ప్రతిన చేయించాడు. అనంతరం అన్నగారి పాదాలకు మొక్కి, ఆవేశంతో రథం అధిరోహించాడు.

కృష్ణ సారథ్యంలో రథం సేనా మధ్యానికి చేరింది. అప్పుడే కర్ణుని కొడుకొకడు నేల కూలడం వల్ల తీవ్ర క్రోధంతో ఉన్నాడు కర్ణుడు. ఆ వంక భీముడు శకునిని మూర్ఛిల్ల జేశాడు. ఎదురు వచ్చిన యోధుడెవడూ నిలువలేక పోతున్నాడు; చూసిన కౌరవాగ్రజుడు తన సేనా నివహాన్ని ఒక్కుమ్మడిగా వాయుసుతుని మీదికి తరలించాడు. ఇందరినీ ఇలా తలాన పడవైచి భీముడు అర్జునునికి సాయం వస్తున్నాడు.

అక్కడ రాధేయునితో శిఖండి, ధృష్టద్యుమ్నాదులు సాత్యకితో కూడి ఎదుర్కొంటున్నారు.

సహదేవుడూ, పాండవ ద్వితీయుడూ వచ్చి కలిశారు. ఇందరినీ నిలబెట్టి వినోదం నడుపుతున్నాడు సూతనందనుడు. పాతికమంది రథికులు పాండవ సేనలో పలచబడ్డారు. అప్పటికి దుర్యోధన, దుశ్శాసన, శకుని, కృప, కృతవర్మ, అశ్వ త్థామ..........ఇందరూ ఏకముఖంగా శత్రుసేనా సాగరాన్ని కల్లోలితం చేస్తున్నారు.

ఇక కర్ణుని కడతేర్చక తప్పదని అర్జునుడు తీవ్ర వేగంతో వస్తూంటే శల్యుడు : రాధేయా! ఇప్పుడు చూపించు నీ పరాక్రమం. అదిగో! పరమశివుని అనుగ్రహంతో పాశుపతం పొందిన పార్థుడు, మన సేనా ప్రవాహాన్ని పాయలు పాయలుగా చీలుస్తూ వస్తున్నాడు. నివాత కవచ, కాలకేయులను ఏకైక వీరుడుగా నిర్జించిన నిర్జర వల్లభ నందనుడు నీ కోసమే వస్తు న్నాడు. భుజంగాన్ని పట్టబోయే గరుడ పక్షిలా. ఏమేమో ప్రగల్భాలు పలికావే? ప్రదర్శించు ప్రతాపం - అన్నాడు.

వచ్చెడి వివ్వచ్చునికి ఎదురు వచ్చిన కౌరవ సోదరులు పదిమంది మన్ను గరిచారు. అర్జునునికి తోడు అటునుంచి

భీముడూ, ఇటునుండి సాత్యకితో ఉపపాండవులూ వచ్చారు. ఇందరికీ ఇన్ని రూపాలలో సాక్షాత్కరిస్తూ, బాణ కౌశలం చూపుతున్నాడు కర్ణుడు.

ఎదురు వచ్చిన కర్ణ సుతుడు సుషేణుడు సాత్యకి చేతులలో నేలకూలాడు. భీమ దుశ్శాసనులుభయులూ ముఖా ముఖీ తలపడ్డారు. ఆ భీకర పోరాటంలో భీముని రథం విరిగింది.

## దుశ్శాసన వధ

అంతలో గదాదండం చేబూని భీముడు విజృంభించగా, దుశ్శాసనుడు తోమరంతో ఎదుర్కొన్నాడు. పటపట పళ్ళు కొరు కుతూ భీమసేనుడు వానిని ఆయుధ హీనుని చేసి రెండు చేతులతో ఆకాశాని కెత్తి పట్టి గిరగిర తిప్పి నేల మీద పడగొట్టి మోకాలితో పొడుస్తూ, ముఖం మీద పిడికిలితో పొడుస్తూ, పీక మీద పాదం పెట్టి నలుపుతూ అట్టహాసం చేసి:

ఓరీ! పదమూడేళ్ళుగా ఉడుకుతున్న క్రోధాగ్నికి నీ నెత్తురు ఆహుతి చేస్తాను, అంటూనే గండ్రగొడ్డలితో రొమ్ము బద్దలు గొట్టి ఎగజిమ్మే నెత్తురు తెగ త్రావి, రక్తంతో నిండిన శరీరంతో తాండవమాడుతూ: ఎంత రుచిగా ఉందిరా నీ రక్తం. అని జబ్బ చరుస్తూ, పక పక నవ్వుతూ మత్తగజ నృత్యం చేస్తూ, వాని కాలు ఎడమ చేత్తో పట్టి గిరగిర తిప్పుతూ, బీభత్సం చేస్తూంటే యోధ గణాలు తెల్లబోయి చూస్తున్నాయి.

కొంతసేపటికి దుశ్శాసన సోదరులు పదిమంది భీముని మీదికి రావడం చూసి అర్జునుడు వారిని మార్గ మధ్యంలోనే యమపురికి పంపాడు.

భీమ విజృంభణం కర్ణుని కూడా నిశ్చేష్టుని జేసింది.

కర్ణ నందనుడు వృషసేనుడు భీకర రూపంతో పాండవ సేనా మధ్యానికి సాగుతూంటే నకులుడు అడ్డుకున్నాడు. వృషసేనుని వాడి బాణాలు నకులుని నానా హింసల పాలు చేయడం చూసి సాత్యకి ధృష్టద్యుమ్నాదులతో ఉపపాండవులు రాగా, వీరిని కృప, శకుని, దుర్యోధన, కృతవర్మలు అడ్డుకున్నారు.

వృషసేనుని వీర విహారాన్ని చూసి అర్జునుడే ఎదురు రాగా, ఆ రాధేయ సుతుడు మహోత్సాహంతో విజృంభించాడు. వీడు వీరాకారుడై విడిచిన బాణాలు వాసుదేవుని గిజాటు పరిచాయి. ఆగ్రహోదగ్రుడై అర్జునుడు నిశిత శరాలు వదిలి వృషసేనుని విల్లు విరిచి ఒక్క భల్లంతో వాని తల గగన తలానికి ఎగుర గొట్టాడు, అటు కర్ణుడూ, ఇటు దుర్యోధనుడూ చూస్తూండ గానే. కుమారుని దుర్మరణం కనులారా చూచిన కర్ణుడు కన్నీరొత్తుకుని విజృంభించాడు.

సవ్యసాచి మహోద్రేకంతో ......... బావా! వాసుదేవ! ఈ రోజు కర్ణునితో శల్యుడు కూడా నేలకూలవలసిందే, అంటూ ధనుష్టంకారం చేశాడు.

రెండు మత్తేభాలు రెండు కుపిత సింహాలు విజృంభించి నట్లు కర్ణార్జునులు తలపడ్డారు.

అర్జునుడు ఆగ్నేయాస్త్రం సంధించాడు. కర్ణుడు వారు ణాస్త్రం విడిచి ఉపశమింపజేశాడు. కౌంతేయుడు మేఘాస్త్రం వదలగా, వాయవ్యాస్త్రంతో ఛిన్నాభిన్నం చేశాడు కర్ణుడు. ఇంద్రా స్త్రం ప్రయోగించాడు ఇంద్రసుతుడు. దానిని పటాపంచలు చేశాడు ఇనతనూభవుడు.

వాడి శర పరంపరతో వాసవ నందనుడు చక్ర రక్షకులను చెల్లాచెదురు చేశాడు. సుయోధనుడు తన యోధ గణాన్ని కర్ణునికి సాయం పంపాడు.

కర్ణుడు అశ్వసేనా ముఖమైన నాగాస్త్రం సంధించగా శల్యుడు – రాధేయా! శరసంధానం కూడా మరిచావా! నీ గురి కంఠ దేశానికి సరిగా లేదు, మరొకమారు చూడు అనగా కర్ణుడు కుపితుడై ఆ అస్త్రాన్ని యథాతథంగా విడిచాడు.

సారథి వాసుదేవుడు రథాన్ని అయిదంగుళాలు కిందికి దింపాడు. ఆ అస్త్రం అర్జునుని కిరీటాన్ని నేలకు పడగొట్టి తిరిగి మీదికి వస్తుంటే అర్జునుడు ఆరు బాణాలతో ముక్కలు చేసి కర్ణుని శరీరం తూట్లు కొట్టాడు.

లెక్క చేయకుండా కర్ణుడు అర్జునుని వేధిస్తున్న వేళ, రథ చక్రం నేలలో దిగిపోయింది. అయినా అంగపతి బ్రహ్మాస్త్రం విడిచిపెట్టగా ఐంద్రాస్త్రంతో ఉపశమింపజేశాడు అర్జునుడు.

పార్థా! రథచక్రం ఎత్తుకునేవరకూ ఆగు అన్నప్పటికీ వినకుండా బాణాలు వదులుతూంటే, ఇది రణ ధర్మం కాదు,

అని నీతులు చెపుతూంటే వాసుదేవుడు : "రాధేయా! నువ్వు ధర్మ బోధ చేస్తున్నావా! లక్కయిల్లు తగులబెట్టిననాడు, కపట ద్యూతం సాగించిననాడు, నిండు సభలో పాండురాజు కోడలిని పరాభవించినప్పుడు, ఘోషయాత్ర పేరిట వీరిని చంప వచ్చి నప్పుడు, యువకుడైన అభిమన్యుని చంపిననాడు....... ఆనాడు నీకు ధర్మదృష్టి లోపించినదా!" అని నవ్వుతుండగా ఆ మహా రథికు లుభయులూ బాణ వర్షం కురిపిస్తూనే ఉన్నారు.

కర్ణుడు రథ చక్రం ఎత్తు ప్రయత్నంలో భూమండలమే క్రక్కదలి పైకి లేచింది. అదే సమయంలో పాండవ మధ్యముడు నిశ్చల చిత్తంతో దివ్యాస్త్రం ప్రయోగించగా, కాంతిచ్ఛటలతో అది కర్ణుని శిరస్సు నేలకూల్చడమూ ఆ శరీరం నుండి దివ్యరోచి మనోవేగంతో సూర్యమండలాభిముఖంగా ప్రయాణించడమూ ఏకకాలంలో జరిగాయి.

కురుసేనా వాహిని కల్లోలితమయి పలాయనం చేసింది. పాండవ బలం హర్షధ్వానాలు చేసింది. సూర్యుడు అస్త గిరి చేరాడు. సేనలు శిబిరాలకు నడిచాయి. దుర్యోధనుడు దుర్భర విషాద చిత్తుడు కాగా శల్యుడు ఓదార్చాడు.

వాసుదేవార్జునులు ధర్మరాజు పాదాలకు నమస్కరించి అభినందన లందుకున్నారు. అని వైశంపాయనుడు కర్ణపర్వం ముగించి శల్యపర్వం అందుకున్నాడు.

## శల్యపర్వం ప్రారంభం

మహారాజా! శల్యుడు కూలాడు – అన్నాడు సంజ యుడు: ధృతరాష్ట్రుడు నిర్విణ్ణుడవుతుండగా, నీ పెద్దకొడుకు సుయోధనుడు తొడలు విరిగి పడ్డాడు, భీముని చేతులలో అని క్షణం ఆగి, మన పక్షంలో కృతవర్మ, కృపాచార్యులు, అశ్వత్థామ మిగిలారు. వారి బలంలో పాండవులయిదుగురూ, కృష్ణుడూ, సాత్యకీ ఉన్నారు, అన్నట్టు మరిచాను. వారి పక్షం చేరిన నీ కొడుకు యుయుత్సుడు కూడా ఉన్నాడు. అన విని మూర్ఛితు డయాడు కురుపతి.

దుర్యోధనుని దుస్థితి విని విదురుని మనసు కూడా వ్యధాభరితమైంది. గాంధారితో సహా కోడళ్ళందరూ మూర్ఛ పోయారు. అప్పటికి సంజయుని దుఃఖం కట్టలు తెంచుకుంది. కొంతసేపటికి విదురుడు స్వస్థ చిత్తుడై, నారీ జనాన్ని అభ్యంతర మందిరాలకు పంపి, మహారాజుకు శీతలోపచారాలు సాగించి తెలివి రప్పించాడు.

సంజయా! నా గుండె వజ్రంతో నిర్మించాడు విధాత. ఇక చెప్పు సంగ్రామ విశేషాలు, అనగా సంజయుడు గుండె దిటవు చేసుకొని ఆరంభించాడు.

ప్రభూ! రాధేయుని మరణంతో మీ కుమారుని ఆశలు పూర్తిగా ఆరిపోయాయి. ఇక నగరంలో అడుగు పెట్టనని విషా దంతో తలదించుకు కూర్చున్నాడు.

అప్పుడు కృపాచార్యులు: నాయనా! క్రోధానికి కూడా హద్దుండాలి. లేకపోతే అది సర్వనాశనం చేస్తుంది. ఇంతవరకూ మనం పితామహునీ, ధనురాచార్యునీ, రాధేయునీ ఆహుతి చేశాం, ఈ సమర సవనంలో ఇప్పుడయినా నువ్వు శాంతించి ధర్మరాజుని పిలిచి వారి అర్థభాగం వారికిస్తే ఉభయ వంశాలూ వర్ధిల్లుతాయి. ఇందుకు వారు తిరస్కరించరు.

అయితే ఈ మాటలన్నీ నేను ప్రాణాల మీది తీపితో, యుద్ధభీతితో చెప్పడం లేదు. స్వామికి హితవు చెప్పడం నా విధి కనుక చెపుతున్నాను అన్నాడు.

అది విని సుయోధనుడు: ఆచార్యా! మీరు హితవు చెప్పారు. నా మీది ఆదరంతో. కాని మొన్నటి వరకూ వారిని అన్ని క్లేశాల పాలుజేసి, ఇప్పుడు యుద్ధంలో ఇన్ని జరిగాక నిన్నటికి నిన్న వృకోదరుడు తన ప్రతిజ్ఞానుసారం నా తమ్ముడి రొమ్ము చీల్చి రక్త పానం చేశాక, ఈనాడు నేను సంధికి సాగితే నా ప్రాణాల మీది తీపితోనే అని అనుకోకుండా ఉంటారా! ఇప్పుడింక ఒకరి ముందు తలవంచే ప్రసక్తిలేదు. అటో ఇటో తేలవలసిందే. మహాయోధులైన భీష్మ, ద్రోణ, కర్ణులతో నేనూ వీరస్వర్గం చేరుతాను, అని క్షణం ఆగి: ఛీ ఏమిటి దౌర్బల్యం.

**ఉప్పుకప్పురంబు నొక్క పోలిక నుండు**
**చూడ జూడ రుచుల జాడ వేరు**
**పురుషులందు పుణ్యపురుషులు వేరయా**
**విశ్వదాభిరామ! వినురవేమ!**

ఈ మిగిలిన బలగంతో పోరు సాగించి శత్రు నిశ్శేషం చేసి నా శక్తి ప్రదర్శిస్తాను" అనడంతో చుట్టూ ఉన్న వీరులందరూ కత్తులు సవరించారు.

రాత్రి బాగా పొద్దు పోయింది. అందరూ శిబిరాల వైపు అడుగులు వేస్తున్నారు. కృపాచార్యులు, కృతవర్మ, అశ్వత్థామ, శకుని, శల్యుడూ బాగా యోచన చేసి ఆ రాత్రి శిబిరాలలో నిద్రించడం వివేకం కాదనీ, కర్ణుని కడతేర్చిన ఉత్సాహంలో పాండవసేన రాత్రికి రాత్రి యుద్ధానికి వచ్చినా రావచ్చుననీ, అనుకుని సమీపంలో ఉన్న సరస్వతీ నదీ తీరానికి చేరారు.

అక్కడ సుయోధనుడు అశ్వత్థామను చేరి, నువ్వు నాకు గురు సముడవు. ఇప్పుడు మన వాహినికి సేనా పతిగా ఎవరిని స్వీకరించాలో చెప్పు, అనగా, మహారాజా! మద్రదేశాధిపతి శల్యుడు సర్వసమర్థుడనడంతో, పవిత్ర నదీ జలాలతో శల్యుని అభిషేకించి జయ జయ ధ్వానాలు చేశారు.

ఈ వార్త చేరగానే పాండవాగ్రజుడు: వాసుదేవా! ఇప్పుడింక మన కర్తవ్యం ఏమిటన్నాడు.

ధర్మనందనా! ముందే అనుకున్నట్టు శల్యుడు నీ వంతు, అని చిరునవ్వు నవ్వాడు. అందరూ శిబిరాలు చేరి సుఖంగా నిద్రించి తెల తెలవారుతుండగా కలకలలాడే ముఖాలతో తళ తళ లాడే కత్తులు దూసి కదిలారు.

శల్యుడు సర్వతోభద్ర వ్యూహం పన్ని సేనను నడిపించాడు. పాండవసేన త్రిముఖ వ్యూహంతో ఎదుర్కొన్నది.

సింహనాద, శంఖధ్వాన భేరీభాంకృతులతో భువన భోంతరాళాలు దద్ధరిల్లుతున్నాయి. పోరుసాగుతూండగా శల్యుడు: సారథీ! అదిగో ఆ తెల్లగుర్రాలతో వస్తున్న రథం ధర్మరాజుది. మనం ముందు ఆయన మీదికి నడవాలి! – అన్నాడు.

ఈ వంక నకులుని కెదురు వచ్చిన కర్ణుని కొడుకులు చిత్రసేన, సత్యసేన, సుశర్మలు నేలకూలారు. అది చూసిన శల్యుడు నకులుని వైపు నడుపుతూంటే పార్థుడు ఎదురు వచ్చాడు.

కృపాచార్యులు ధృష్టద్యుమ్నునితో తలపడ్డారు. అప్పటికే భీముని రథాశ్వాలు శల్యుని బాణ ఘాతంతో నేలకూలగా, ఆ వీరుడు గదా ధారియై విక్రమించి అడ్డువచ్చిన శల్యుని కొడుకును నేలకూల్చగా, ఆ మద్రేశ్వరుడు కుపితుడై వీర విహారం ఆరంభించాడు. అది చూసి భీముడు తన గదా దండంతో ఆ రథాశ్వాలను నేలకూల్చాడు.

కోపంతో శల్యుడు తోమరాయుధం విసరగా అది వాయుసుతుని రొమ్మున నాటుకుంది. దాన్ని లాగి పారేసి, శల్యుని సారథిని నేలకూల్చాడు. దానితో శల్యుడు గదా ధారియై రథం దిగి భీముని వైపు నడిచాడు.

ఉభయులూ మత్తేభాల వలె విజృంభించారు. గదా చాలనంలో మెరుపులు పుట్టాయి. అగ్ని గోళాలు గోచరించాయి; ఒక్కోసారి గదలు మండలాకృతిలో గిరగిర త్రిప్పుతూ వెనుకకు నడిచి అంతలో ఢీకొంటూంటే పిక్క బలిసిన పొట్టేళ్ళు పోట్లాడుతున్న సన్నివేశం తలపునకు వచ్చింది. ఒకరిపై ఒకరు విసరుకున్న గదలు ఇరువురినీ మూర్ఛితులను చేశాయి. తక్షణం కృపాచార్యుడు శల్యుణ్ణి తన రథం మీదకి లాగి దూరంగా వెళ్ళాడు. కొద్ది క్షణాలలో తేరుకున్న భీమసేనుడు ఏడీ శల్యుడు? అంటూ గదతో నిలబడ్డాడు.

చేకితానుడు ధర్మజుని ముందు నిలిచి పోరుతూండగా సుయోధనుడు ప్రాసాయుధం విడిచి వాని తల ఎగురగొట్టాడు. అంతలో పాండవసేన క్రోధోద్రిక్తమై దూకింది. అప్పటికి స్మృతి వచ్చిన శల్యుడు ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధృష్టద్యుమ్నుడు దుర్యోధనునితో పోరుతున్నాడు.

ధర్మనందనునికి తోడు వచ్చిన సాత్యకి, నకుల, సహదేవులను చిత్ర చిత్ర గతుల హింసించి శల్యుడు వీరవిహారం చేస్తున్నాడు. ఊపిరి తిప్పుకోలేక పోయాడు. ధర్మరాజు ఆవల అశ్వత్థామ అపర రుద్రునివలె విజృంభిస్తున్నాడు.

సాత్యకి, నకులు లొకవంక, సహదేవ ధృష్టద్యుమ్ను లొకవంక, వెనుక సవ్యసాచి ముందు భీమసేనుడు తోడు రాగా ధర్మరాజు ఉద్దీపిత క్రోధుడై, శల్యునితో భీకర సంగ్రామానికి తలపడ్డారు. అప్పుడు భీమునితో దుర్యోధనుడూ, కృపాశ్వత్థామలు అర్జునునితో అద్భుత సమరం నడిపారు. ***(ఇంకా ఉంది)***

## సందేహాలు? సమాధానాలు!!

–'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**హిందువులు మూడు రకాలుగా ఎర్రని చుక్కబొట్టు, తిరునామం, విబూదిలను తిలకంగా ధరిస్తారు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడ ఇట్లే వివిధరీతుల తిలక ధారణం ఎందుకు చేస్తున్నారు?**

**- వి. రామనాథ రెడ్డి, తిరుపతి.**

☛ మీకు తిలకధారణం గురించి ముందుగా చెబుతాను. పసి పిల్లలకు దృష్టి దోషనివారణార్థం బొట్టుపెడతారు. "పిశాచాంశ్చ, గ్రహాన్ మాతృగ్రహా నపి బాల గ్రహాన్విశేషణఛింధి మహాన్ భయాన్ త్రాహి త్రాహి హరే నిత్యం త్వద్రక్షా భూషితం శుభం" పిల్లలగు బాలపిశాచాది గ్రహాలు సోకకుండ, రక్షించటం కోసం, "శిరోలలాటాద్యంగేషు రక్షాంకుర్యాద్యథావిధి" ముఖం, తల మొదలైన చోట్ల తిలకధారణ చేస్తారు.

వైష్ణవంలో మూడు సత్యాలు. 1) జీవుడు, 2) ప్రకృతి, 3) ఈశ్వరుడు. ఈ మూడింటినీ తెలియచేస్తూ ఊర్ధ్వ త్రిపుండ్రం వైష్ణవ చిహ్నంగా ఉంచుతారు. స్థూలావస్థలో మూడు తత్త్వాలు కలిసి ఉంటాయనటానికి క్రింద పాదం దగ్గర వానిని కలుపుతారు. మధ్యలోని ఎరుపు జీవసంకేతం. అదే లక్ష్మీ స్వరూపం.

శివుడు పశుపతి. పశువులు తిర్యక్కులు. తిర్యక్కులు భూమికి అడ్డంగా నడుస్తాయి. శైవులు కూడా త్రిసత్యాలంగీకరిస్తారు కనుక అడ్డంగా మూడు రేఖలు పెట్టుకొంటారు.

ఇక శంకరుని బ్రహ్మసత్యం జగన్మిథ్య. ఒకే తత్త్వం. అందువల్ల ఒక్క చుక్క ధరిస్తారు. భారతీయులయొక్క లలాటం శూన్యంగా ఉండకూడదని శాస్త్రవచనం. ఆ బొట్టులోనే అనంత తత్త్వ విషయాన్ని నిక్షేపించారు.

**మాతృగయను గురించి వివరించగలరని ప్రార్థన?**

**- తెడ్ల సత్యనారాయణరావు, ఖమ్మం.**

☛ వాయుపురాణంలో, బ్రహ్మాండపురాణంలో దీనిని గురించిన గాథలున్నాయి. పూర్వం గయాసురుడనే రాక్షసుడుండేవాడు. నూట ఇరువదియైదుయోజనాల పొడవుండేవాడు. ఆతడు విష్ణువును గురించి తపస్సు చేసి ఎన్నో వరాలు పొందాడు. వానివల్ల లోకాలకు బాధ కలుగుతున్నదని దేవతలు బ్రహ్మకు చెప్పుకున్నారు. ఆయన గయాసురుని దగ్గరకు పోయి తానొక యజ్ఞం చేస్తున్నానని, అందుకు, ఆ రాక్షసుని దేహమెంత పవిత్రమో, అంత పవిత్రమైన ప్రదేశాన్ని చూపవలసిందని ఆతన్నే అడిగాడు. బ్రహ్మ స్తుతించినందుకు గయాసురుడు పొంగిపోయి తన శరీరాన్ని గ్రహించి దానిపై యజ్ఞం నిర్వహించుకొమ్మని చెప్పాడు. బ్రహ్మ అంగీకరించి, వాడు కదలకుండ ఉండటం కోసం, దేవరూపంతో ఉన్న శిలను తెచ్చి వాని తలమీదపెట్టాడు. అయినా అతడు కదులుతూనే ఉన్నాడు. బ్రహ్మ, విష్ణువును ప్రార్థించాడు. విష్ణువు వచ్చి గయాసురుని శిరస్సును అధిరోహించాడు. తానటునిటు కదలనని విష్ణువు ఉండవలసిన పనిలేదని చెప్పి బ్రహ్మను యజ్ఞం పూర్తి చేసుకొమ్మన్నాడు. ఆ తరువాత విష్ణువుతో "స్వామీ! ఈ ప్రదేశం నా పేరున ప్రసిద్ధమగునట్లు, ఇక్కడ పితృదేవతలకు పిండ ప్రదానం చేస్తే ఆ పితరులు తరించేటట్లు వరమనుగ్రహింపవలసిందిగా ప్రార్థించాడు. విష్ణువలాగే అనుగ్రహించాడు. దీనినే పితృగయ అంటారు. తండ్రులకు తాతలకు పిండ ప్రదానం చేసేవారిక్కడే చేస్తారు.

ఆ యజ్ఞానంతరం కొద్ది దూరంలో గయాసురుని భార్య విష్ణువును గూర్చి తపస్సు చేసింది. ఆ ప్రాంతం తన పేర ప్రసిద్ధం కావాలని కోరింది. దాన్నే 'మాతృగయ' అంటారు. తల్లులకు పిండ ప్రదానమిక్కడ చేస్తారు. ఇప్పుడా భేదాలేమీ లేవు. గయలో ఎక్కడైనా ఎవరికైనా పిండప్రదానం చేయవచ్చు.

**దేవతావిగ్రహాలు కొన్నింటిలో స్వామి వారి కళ్ళు తెరచుకొన్నట్లు మరికొన్ని విగ్రహాలు కళ్ళు మూసుకొని ఉన్నట్లు ఉంటాయి. అందలి భావం తెలుపగలరు?**

**- అన్నవరం సత్యనారాయణరావు, నెల్లూరు.**

☛ ఏ విగ్రహమైనా ప్రతిష్ఠ సమయంలో, జలాధివాస, ధాన్యాధివాస, క్షీరాధివాసాది కార్యక్రమాలన్నీ అయిపోయిన తర్వాత, ప్రతిష్ఠకు ముందు అర్చకులు వేదమంత్రాలతో ఆ విగ్రహానికి 'నేత్రోన్మీలనం' చేస్తారు. అంటే కన్నులు చక్కగా వికసించేటట్లు చేయటం. కనుక స్వామి కన్నులు తెరచుకునే ఉంటాయి. అందుకే మహాకవులు భగవంతుని నేత్రాలను, వికసించిన తామర పూవులుగా వర్ణిస్తారు. కేవలం తన భార్య నేత్రాలు తప్ప లోకంలో అంతటి అందమైన కన్నులు లేవని భావించిన ధనుర్దాసునకు, రామానుజులు శ్రీ రంగేశ్వరుని వికసిత నేత్ర

పద్మాలను చూపించారు. అంతటితో ధనుర్దాసు మహాభక్తుడై నాడు. స్వామి కరుణాకటాక్షాలు వర్షించాలంటే కనులు తెరచు కొనే ఉండాలి. అగ్నినేత్రం మాత్రం ఎప్పుడూ మూసి ఉంటుంది.

**భారతంలో 'శల్యసారథ్యం' అంటారు. వివరణ తెలియ చేయండి?** **- రాధాచరణ్, సివగాం, శ్రీకాకుళం.**

☛ శల్యుడు మద్రదేశ ప్రభువు. మాద్రికి సోదరుడు. మాద్రే యులు నకుల సహదేవులు. కనుక శల్యుడు పాండవుల పక్షాన యుద్ధం చేయటానికి బయలుదేరాడు. కాని మార్గమధ్యంలో దుర్యోధనుని తంత్రానికి లోనై దుర్యోధనుని పక్షానికి వచ్చాడు. ఈ విషయం తెలిసి, ధర్మరాజు రహస్యంగా శల్యుని కలిశాడు. అప్పుడు ధర్మరాజు "మామా! శ్రీకృష్ణుడర్జునుని రథసారథి. కృష్ణునితో ఇంచుమించు సారథ్యం చేయగలవాడవు లోకంలో నీవే. కనుక కర్ణునకు సారథ్యం వహించవలసిందిగా దుర్యోధ నుడు నిన్ను కోరవచ్చు. అప్పుడు కర్ణుని నిరుత్సాహపరచి, అర్జు నుని రక్షించవలసిందని" అర్థించాడు. శల్యుడంగీకరించాడు.

భీష్మద్రోణుల మరణానంతరం దుర్యోధనుడు కర్ణుని సర్వ సైన్యానికభిషిక్తుని చేశాడు. దుర్యోధనుడు కర్ణునకు సారథ్యం వహించవలసిందిగా శల్యుని కోరి ఒప్పించాడు.

యుద్ధానికి బయలుదేరిన కర్ణుడు శల్యునితో, ఎక్కడ అర్జు నుడున్నాడో అక్కడకు తన రథాన్ని తోలమన్నాడు. అందుకు శల్యుడు, "ఆటలాడుతూ పోవటానికత్తగారిల్లనుకొన్నావా? నీకు సరిపోయిన ముక్కిడి మూకలతో పోరాడక, నీ కర్జునునితో యుద్ధమెందుకు? పూర్వం కొంతమంది వైశ్యకుమారులు, తమ భోజనమందలి ఎంగిలి మెతుకులతో ఒక కాకిని పెంచారు. ఆ ఎంగిలి మెతుకులను తిని కాకి తెగబలిసింది. కన్నుమిన్ను కానక, ఒకనాడు సముద్రంపై ఎగురుతున్న హంసలను చూసింది. వారితో వేగంలో పందెం వేసింది. తాను ముందు వెళుతూ, వెనకకు తిరిగి వచ్చి హంసలను తొందరగా రమ్మని పిలుస్తూ–వాటి నెగతాళి చేస్తూ కొంతదూరం పోయింది. సముద్రం మీద కొంత దూరం పోయిన తర్వాత దానికి రెక్కలు విరిగిపోయి నట్లైంది. సముద్రంలో పడి చావబోతుంటే ఆ హంసలు దయ దలచి, దానిని తీసికొని వచ్చి సముద్రతీరంలో విడిచి వెళ్ళాయి. నీవా కాకివంటి వాడవు. కౌరవుల దయాభిక్షతో బలిసి క్రొవ్వి కండకావరంతో ఉన్నావు. అర్జునుడు, పాండవులు హంసలు వారితో నీకు పోటీ ఎందుకు?"

కర్ణుడర్జునుని కంఠానికి బాణం గురిపెడితే శల్యుడు "కర్ణా! నీ బాణం గురి, అర్జునుని నాభికి తగిలేటట్లుంది. మళ్ళీ చూచి సరిగా గురిపెట్టు" ఇలా, కర్ణుని నిరుత్సాహపరచి, ఆతనికి చేతు లాడకుండ చేశాడు. ఆఖరికి కర్ణుడు కోపంతో శల్యుని తల నరుకుతాననే వరకు వెళ్ళింది వ్యవహారం. మనపక్షంలో ఉన్నట్లు నటిస్తూ పరపక్షానికి హితంగా ప్రవర్తించేవారిని శల్యసారథ్యం చేస్తున్నాడంటారు.

**సప్తమాతృకలెవరు? వివరించండి?**

☛ **- కుక్కడపు గోపాలకృష్ణ, తిరువూరు, కృష్ణాజిల్లా.**

సప్తమాతృకలు వివిధ పురాణాలలో భిన్ననామాలతో ఉన్నాయి. మొత్తం రెండు విధాలైన పేర్లుగా వాటిని విభజించవచ్చు.

ఒక విధంగా – 1) బ్రాహ్మి 2) మాహేశ్వరి 3) కౌమారి 4) వైష్ణవి 5) వారాహి 6) ఇంద్రాణి 7) చాముండ; రెండవ విధంగా – 1) కాళి(కాటి) 2) కౌశిక 3) ఉద్ధత 4) హవిష 5) కారిక 6)ఆర్య 7) వైధాత్రి.

కుమారస్వామి రెల్లులో పుట్టాడు. అపుడు వీరు ఆయనను దర్శించి తమను లోకమాతృకలుగా చేయవలసిందని అభ్యర్థిం చారు. అపుడు కార్తికేయుడు వీరి నేడుగురను బాలగ్రహాలుగా చేశాడు. మానవులకు పదహారేండ్లు వచ్చు లోపల వారిని బాధించేట్లుగా వరమిచ్చాడు. మానవులు సమర్పించే బలుల వల్ల తృప్తి పొందవలసిందని వారిని ఆదేశించాడు. ఇది సప్తమాతృకా విశేషం.

**అధ్యాపకం, అర్చకత్వం పదాలకు తేడా ఏమిటి? వారి విధులేమిటి?** **- ఎస్.బి.వి.ఎల్.ఎన్.చారి, ముంబయి.**

☛ అధ్యాపకమంటే చతుర్వేదాలలో దేనినైనా స్వరసహితంగా చదవటం. అర్చకత్వమంటే, స్వామి విగ్రహానికలంకారా దులు చేసి, పూజలునిర్వర్తించి, నైవేద్యం సమర్పించటం మొదలై నవి. దేవాలయాలలో ఏ సమయంలో ఏ వేదం పఠించాలో, ఆగమశాస్త్రాలు నిర్దేశించాయి. ఆ విధంగా వేదపఠనం చేయటం అధ్యాపకం.

క్రింద పేర్కొన్న తి.తి.దే. గ్రంథాలు లభించే చిరునామా :
పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తి.తి.దేవస్థానం,
తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083.
ఇతర వివరాలకు : 0877 - 2264294

తిరుమల తిరుపతి దేవస్థానముల....

# పుస్తక పరిచయం



[11]

## బాలభారతి పుస్తకాలు

మొత్తం సెట్టు : 23 పుస్తకాలు;
పుస్తకం సైజు : 1/16 డెమ్మీ
సెట్టు మొత్తం వెల : 46/-; పోస్టేజి ఛార్జి : 55/-

నేటి బాలలే రేపటి పౌరులు. అందువల్లే బాలబాలికలను తీర్చిదిద్దాల్సిన బాధ్యత ప్రతి తల్లిదండ్రుల మీద ఎంతో ఉంది. మొక్కై వంగనిది, మానై వంగదన్నట్లు బాల్యంలో సత్ప్రవర్తన, సచ్ఛీలత, సదాచారం వంటి సద్గుణాల వైపు పిల్లల్ని జాగ్రత్తగా నడిపించాలి. అప్పుడే ఆ పిల్లలు పెరిగి పెద్దవారై బాధ్యత కలిగిన పౌరులుగా తీర్చిదిద్దబడతారు. ఆ ఉత్తమ పౌరుల వల్ల దేశఔన్నత్యం ఇనుమడిస్తుంది.

కేవలం పసిపిల్లలను దృష్టిలో ఉంచుకుని, వాళ్లను ఆధ్యాత్మిక పౌరులుగా గుణవంతులుగా తీర్చిదిద్దడం కోసం తిరుమల తిరుపతి దేవస్థానం 'శ్రీనివాస బాలభారతి' శీర్షిక క్రింద చక్కని పుస్తకాలను అందిస్తోంది. ఆదర్శపురుషులు, మహనీయులు, మహాయోగులు, పతివ్రతలు, ధీరులు అయిన మహాత్ముల చరిత్రలను, దివ్యవృత్తాంతాలను పిల్లలందరికీ అర్థమయ్యే తీరులో, సరళశైలిలో అందించడానికి దేవస్థానం అందజేస్తున్న కానుకలీ పుస్తకాలు.

| పుస్తకం పేరు | రచయిత |
|---|---|
| 1. వేమన | డా॥ జి. భానుమూర్తి |
| 2. ప్రహ్లాదుడు | ధనకుధరం వరదాచార్యులు |
| 3. యామునాచార్యులు | డా॥ ఎం. నరసింహాచార్య |
| 4. శ్రీరామచంద్రుడు | టి. నరసింహాచార్యులు |
| 5. వసిష్ఠుడు | డా॥ శలాక రఘునాథశర్మ |
| 6. కుచేలుడు | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య |
| 7. జయదేవుడు | ప్రొ॥ చల్లా రాధాకృష్ణశర్మ |
| 8. ధ్రువుడు | డి. నాగసిద్ధారెడ్డి |
| 9. ద్రోణాచార్యులు | డా॥ కె.యస్. రామమూర్తి |
| 10. నమ్మాళ్వార్ | డా॥ పి. శౌరిరాజన్ |
| 11. సావిత్రి | డా॥ సముద్రాల లక్ష్మణయ్య |
| 12. క్షేత్రయ్య | ఐ. గురునాథరావు |

| పుస్తకం పేరు | రచయిత |
|---|---|
| 13. ఆండాళ్ | కె.టి.ఎల్. నరసింహాచార్యులు |
| 14. ధర్మరాజు | డా॥ కె.జె. కృష్ణమూర్తి |
| 15. భగీరథుడు | కరుణశ్రీ |
| 16. అన్నమాచార్యులు | కామిశెట్టి శ్రీనివాసులు |
| 17. శ్రీకృష్ణుడు | డా॥ నండూరి రామకృష్ణమాచార్య |
| 18. హనుమంతుడు | డా॥ ప్రసాదరాయ కులపతి |
| 19. విదురుడు | జానమద్ది హనుమచ్ఛాస్త్రి |
| 20. నారదుడు | బహుజనపల్లి రంగాచార్య |
| 21. వాల్మీకి | ప్రొ॥ దివాకర్ల వేంకటావధాని |
| 22. ఏకలవ్యుడు | ఎస్.బి.యస్. భట్టాచార్య |
| 23. లక్ష్మణుడు | డా॥ ఐ. కృష్ణమూర్తి |

ఈ గ్రంథాలను పోస్టుద్వారా పొందదలచిన వారు 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారి పేరున డి.డి.ని తీసి పై చిరునామాకు పంపాలి.

## గ్రంథసమీక్ష

# ఆదికావ్యంలో ఆణిముత్యాలు

**రచన** - ఆమంచర్ల గౌతమ; **సైజు** - 1/8 డెమ్మీ; **పుటలు** - 94; వెల-రూ. 45/-; **ప్రాప్తిస్థానం:** ఆమంచర్ల గౌతమ, ఇ.నెం. 2-143, 2వ రోడ్డు, జార్జిపేట, అనంతపురం-515004. ఫోన్: 08554-276921.

ఆదికవి వాల్మీకి రచించిన రామాయణం ఒక రసభరిత కావ్యం. ఇందులో ప్రతి ఘట్టంలోనూ కన్పించే సూక్తులు, నీతులు, హితవచనాలు సార్వకాలిక సత్యాలు. వీటిని తెలుసుకోవాలంటే వాల్మీకి రామాయణం చదవాల్సిందే. చదవాలంటే సంస్కృత భాషా పరిజ్ఞానం ఉండాలి. అది లేనివారు వీటి మాధుర్యాన్ని కోల్పోయే అవకాశముంది. అయితే దాని నుంచి మనల్ని బయటపడేసే ప్రయత్నాన్ని చేశారు ఆమంచర్ల గౌతమగారు. రామాయణంలోని ఆణిముత్యాలన్నీ గుదిగుచ్చి, "ఆదికావ్యంలో ఆణిముత్యాలు" పేరుతో చక్కని గ్రంథాన్ని ప్రచురించారు.

ఇందులో బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండాల్లోని హితోక్తులను, వాటి సందర్భం, తాత్పర్యం, వివరణలను సరళమైన తెలుగులో రచించారు. శ్లోకానికి సంబంధించిన సంఖ్య, కాండ వివరాలు కూడా ఇచ్చారు.

బాలకాండకు సంబంధించి 10, అయోధ్యకాండకు 18, అరణ్యకాండకు 8, కిష్కింధకాండకు 9, సుందరకాండకు 21, యుద్ధకాండకు 27 శ్లోకాలకు సమగ్ర వివరణ ఇచ్చారు. అక్షరదోషాలు ఎక్కువగా ఉన్నాయి. మలిముద్రణలో వీటిని సరిచేస్తే పుస్తకానికి మరింత ఔన్నత్యం పెరుగ గలదు.

మంచి కాగితంపై చక్కగా అచ్చువేయబడి, అక్షరాలు చాలా స్పష్టంగా ఉన్నాయి. సీతారాములు, లక్ష్మణ, భరత, శత్రుఘ్ను, హనుమ, వశిష్ఠులతో కూడిన చిత్రం - ఈ గ్రంథానికి ముఖచిత్రంగా ఉంది. చివరిపుటలో శ్రీమద్రామాయణ మాహాత్మ్యం చక్కగా వివరించబడింది. ప్రతి సాహితీ పిపాసి ఇంట ఉండదగ్గ గ్రంథమిది.

**- జి. వేదముని నాయుడు**

# శ్రీ వేంకటేశ్వర గానసుధ

**రచన -తోట హైమావతి; సైజు -1/8 డెమ్మీ;** **వెల**-అమూల్యం; **ప్రతులకు:** తోట హైమావతి, ఇ.నెం. 13-2-235, మట్వాడ, వరంగల్లు -506 002. ఫోన్: 98660 11665.

తోట హైమావతి వృత్తిరీత్యా హిందీ లెక్చరర్ అయినా వీరికి తెలుగు సాహిత్యంపై మక్కువ ఎక్కువ. వీరు భక్తి టి.వి., ఆకాశవాణి ద్వారా అందరికీ చిరపరిచితులు. వీరి రచనలలో శ్రీ వేంకటేశ్వర గానసుధ ఒకటి.

సినీబాణీలో కూర్చిన భక్తిగీతాల మాల ఇది. పాఠకులు పాడుకోవటానికి వీలుగా వీరు తమ గీతాలను ఏ బాణీలో పాడుకోవచ్చునో సినీ గీతాల పల్లవులను కూడ ఇచ్చారు. ఎందుకో వీరు కూర్చిన పల్లవులతో సినీగీతాల పల్లవులతో అనుసంధానం కుదిరినట్లుగా అనిపించదు. అందువల్ల వీరు ఈ పుస్తకంతో పాటు ఆడియో సి.డి. కూడ జతచేర్చినట్లైతే పాఠకులకు చాలా అనుకూలంగా ఉండేది. అందరు పాడుకోవడానికి సౌకర్యంగానూ ఉండేది. కనీసం ప్రతి గీతం ఏ రాగంలో పాడారో వివరిస్తే ఇంకా బాగుండేది.

భావయుక్తంగా, సాహితీపరంగా ప్రతిగీతంలో భక్తి భావం కలిగేలా రచించారు. స్వామివారిపై తనకు గల అనన్యమైన భక్తిని, ఈ గీతా పుష్పాలతో అర్చించిన శైలి పాఠకులను అలరిస్తుంది. రచనాపరంగా బాగున్న ఈ పాటల పుస్తకం సరైన రీతిలో అందించలేదని అనిపిస్తుంది. సాహిత్యం బాగుంది. భక్తిభావం బాగుంది. రసహృదయం పరవశించేలా సమర్పించిన భక్తిగీతమాలిక అందరి మన్ననలు పొందాలంటే ఇంక కొంచెం మార్పులు అవసరం.

భావం,భాష ఎంత బాగున్నా సమర్పించే విధానం సరిగ్గా లేకపోతే రచయిత ఆశయం నెరవేరదు. వెల అమూల్యం కనుక మరోసారి తగిన మార్పులు, చేర్పులు చేర్చి పాఠకులకు అందిస్తే పాఠకుల మన్ననలు అందుకోవచ్చు.

**- దేసు వేంకట సుబ్బారావు**

# మాతృమూర్తి కుంతి

**– డా॥ డి. ఉదయకుమారి**

మానవుడు ఇంద్రియోన్ముఖుడై ప్రాపంచిక వ్యాపార పారాయణుడుగా ఉన్నంతవరకూ అతనికి ఉద్వేగం తప్పదు. ప్రవృత్తి మార్గంలో ఎంతటి నిగ్రహ సంపన్నునికైనా ఎవరితో విగ్రహం తప్పదు. శాంతి అనేది లౌకిక జీవనంలో ఆకాశ కుసుమం. నిరంతరం అశాంతిమయ జీవనం సాగిస్తూ శాంతి, అశాంతి ఘట్టాల రెండింటి మధ్య సూక్ష్మవిరామాన్ని శాంతిగా భ్రమిస్తాడు. నిజమైన శాంతి మానవునికి ఎక్కడ వెతికినా కన్పించదు. ఈ ప్రవృత్తి మార్గం నుండి విరమించి ఇంద్రియానంద మహోద్వేగానికి హేతువైన ఆశావలయాన్ని ఛేదించి నిత్యం భగవన్నామ సంకీర్తనా సుధాసాగరంలో తేలియాడుతూ జన్మ జన్మాంతర పాపపంకిలాన్ని తుడిచేసి మళ్ళా లౌకిక కర్మ సంగ్రహదశకు రాకుంటేనే శాంతి అనేది సంభవిస్తుంది.

ధర్మగ్లాని జరిగినప్పుడు ధర్మసంస్థాపనకు, అధర్మాభ్యుత్థానానికి యుగయుగంలో అవతరిస్తారని భగవంతుని ప్రతిజ్ఞ. షడ్గుణైశ్వర్య సంపన్నుడైన భగవానుడు మానవాకృతిని ధరించటానికి మహనీయ వంశాన్ని, మహాత్ములైన వ్యక్తుల్ని ఎన్నుకుంటాడు. ద్వాపరయుగంలో యాదవవంశాన్ని, దేవకీ వసుదేవులను తన అవతారానికి పరమాత్మ నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయమే ఆ వంశంయొక్క పవిత్రతను, ఆ వ్యక్తుల మహనీయతను వ్యక్తం చేస్తుంది. అలాంటి పవిత్ర వంశంలో పుట్టిన కుంతి ఎంత పుణ్యచరితో చెప్పాల్సిన పనిలేదు. తాను సాధించాల్సిన అన్ని ఘనతలను స్వయంగా సాధించింది కుంతి. భారత కథకు నాయకులైన పాండవులను కని, పెంచిన పుణ్యమీమెకు దక్కింది. పెంపకానికి వెళ్ళిన కుంతిభోజునికి దుర్వాసముని వల్ల కలిగిన కొండంత భీతిని కొండుకనాడే మహాసమర్థముగా పారదోలింది. దుర్వాసముని కఠోరపరీక్షలకీమె ఎలా ధైర్యంతో నిలబడిందో ఎఱ్ఱాప్రెగడ వర్ణించాడు.

**అతఁడును దద్భావ మరయంగ మదిగోరి**
**రూపించి యిట పోయి రేపవత్తు**
**ననిపోయి నడికిరే యర్థితోఁ జనుదెంచు**
**రేయి వచ్చెదనని రేపు వచ్చు**
**నేప్రొద్దువచ్చిన, నింతి యప్పడ భక్ష్య**
**భోజ్యముల్ గ్రొత్త పొల్పుగ నొనర్చు**
**నెయ్యది గోరిన నిచ్చకు రాఁబెట్టు**
**నలయదు మదినైన నలుగదెపుడు**
**ననుదినంబు భోజుఁడాత్మజఁబిల్చిత**
**ద్వర్తనంబు నడుగ వనజ ముఖియుఁ**
**దానుగొల్చు తెఱఁగుఁ దాపసవరుని చం**
**దమును జెప్పచుండుఁ దండ్రి యలర**




కుంతి పసితనంలో దుర్వాసునకు సేవ చేయడం కోసం తండ్రిచే నియమింపబడి, అతనికి చక్కటి పరిచర్యలు చేసింది. రుద్రాంశ జన్ముడైన దుర్వాసుని పసితనంలోనే మెప్పించిన కుంతి సహనమెంతటిదో చెప్పడానికి మాటలు చాలవు. అది కూడా ఒకటి రెండు రోజులు కాదు, నిండు సంవత్సరం బాల్యంలో ఈమెకు కల్గిన అనుభవం తదనంతరం సర్వజీవితానికి సరిపడిన కష్టసహిష్ణుతను నేర్పింది. ఈమె ఈ లక్షణాన్ని బాగా పరిశీలించే ద్రౌపది ఒకానొక సందర్భంలో –

**మాయత్తఁ బృథ్వీసమానఁ బృథాదేవిఁ**
**గుంతి భోజాత్మజఁ గోమలాంగి** – అని చెప్పింది.

దుర్వాసుని వరప్రభావంతో సూర్యుని వల్ల ఒక పుత్రుని కన్నది మొదలుకుని అడుగడుగునా ఆమె పడని నికృష్టమైన కష్టంలేదు. యౌవనంలో పాండురాజు ధర్మపత్ని కావడం, మాద్రీ రూపంలో సపత్నీ సాహిత్యానికి నోచుకోవడం, చిరసాంసారిక జీవితానంతరం కూడా అనపత్యురాలుగానే ఉండిపోవడం, పొంగి పొర్లే యౌవనోద్వేగంలో దారస్పర్శకు దూరమయ్యే శాపానికి భర్త గురికావడం, అక్కడ నుండి రాజభోగ పరిత్యాగ పూర్వకంగా శతశృంగ పర్వతోపత్యకానివాసాన్ని అంగీకరించడం, భర్త ప్రేరణతో దేవరన్యాయాన్ని పాటించి యమధర్మరాజు, వాయు దేవుడు, ఇంద్రుల ద్వారా ముగ్గురు బిడ్డల్ని కని వాళ్ళ ముద్దు ముచ్చట్లు తీరకముందే వైధవ్యానికి గురికావడం, మాద్రీసహగ

మనానంతరం నకుల సహదేవుల సంరక్షణను స్వీకరించడం..., వంటి వన్నీ కుంతిదేవి పడిన కష్టాలుగానే చెప్పుకోవచ్చు.

చివరికెలాగో హస్తినాపురానికి చేరుకుంది. అది మొదలు మళ్ళీ కష్టాలే. దుర్యోధనాది దుష్టచతుష్టయం చేసే మోసాలకు బలి అవుతూ నిరంతరం అపాయ భయంతో దుర్జీవనం గడిపింది. లాక్షాగృహ దహనం, ఏకచక్రపురంలో భిక్షుక జీవనం, బకాసురవధ, పాంచాలిని కోడలిగా స్వీకరించడం, కపటద్యూతం, వనవాసం,యుద్ధం ఆత్మీయవియోగం. ఈ సమస్త దుర్ఘటనల్లో అనుస్యూతంగా జ్ఞప్తికి వచ్చే కర్ణప్రసక్తి-ఇవన్నీ ఆమెలో సంసారం పట్ల తీవ్రవైముఖ్యానికి ఎన్నడో రాచ బాటలు వేయగా పరమ దురంత సాంసారిక జీవన వ్యథా నిర్వాహణ వ్యాపార సౌఖ్యం ఎప్పుడో సిద్ధించింది. కాబట్టే ఆమె మట్టిలో సంచరించే కుమ్మరి పురుగు వలే, నీటిపై తేలియాడు తామరాకు వలే దేనిని అంటక, ముట్టక నిర్లిప్తంగా ఉండడం నేర్చుకుంది.

| శ్రీ పద్మావతీ శ్రీనివాసుల పరిణయ మహోత్సవం, తిరుమల | | | |
|---|---|---|---|
| 22-5-10 | శని | గజవాహనోత్సవం | వైశాఖ శుద్ధ |
| 23-5-10 | ఆది | అశ్వవాహనోత్సవం | దశమికి |
| 24-5-10 | సోమ | గరుడవాహనోత్సవం | జరుగును |
| **శ్రీ పద్మావతీతాయార్ల వసంతోత్సవాలు, తిరుచానూరు** | | | |
| 25-5-10 | మంగళ | అంకురార్పణ (రాత్రి) | వైశాఖ |
| 26-5-10 | బుధ | వసంతోత్సవారంభం | పూర్ణిమకు |
| 27-5-10 | గురు | స్వర్ణ రథోత్సవము | జరుగును |
| 28-5-10 | శుక్ర | వసంతోత్సవ సమాప్తి | |
| **శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామివారి వసంతోత్సవాలు శ్రీనివాసమంగాపురం** | | | |
| 31-5-10 | సోమ | శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామివారికి | వైశాఖమాస |
| 01-6-10 | మంగళ | శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామివారికి | శ్రవణా నక్షత్రమున |
| 02-6-10 | బుధ | శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి, శ్రీ కోదండరామస్వామి, శ్రీ కృష్ణస్వామివార్లకు | జరుగును |

శ్రీకృష్ణుడు తనకు మేనల్లుడే అయినా తద్బాంధవ జన్యమైన చులకన భావ మామెకే నాడూ లేదు. సరికదా మీదు మిక్కిలి అతడు సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే అని, అతని పాద పంకజాల్ని ఆశ్రయిస్తే మోక్షసిద్ధి కలుగుతుందని భావించింది. ఈ భావనా పారవశ్యంతో ఆమె అలవరచుకున్న అంతరంగశుద్ధి ఆమెకఖండశాంతిని ప్రసాదించడంలో కృతకృత్యమైంది. శ్రీకృష్ణుని భక్తి భావనా వైవశ్యంతో-

**శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!**
**లోక ద్రోహి నరేంద్ర వంశదహనా! లోకేశ్వరా! దేవతా**
**నీక బ్రాహ్మణగోగణార్తి హరణా! నిర్వాణ సంధాయకా!**
**నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!**

**(ఆం.మ.భాగ.1-199)**

అని నిశ్చల ధ్యాన సమాధిలో ప్రార్థించి భవలతలు తుంచమనే కోరుకుంది. కానీ వైయక్తిక సౌఖ్యంగానీ, రాజ్య భోగాది లంపటాలు గానీ, విజయోత్సాహాలు గానీ - ఇలాంటి దుఃఖ మిశ్రిత స్వల్పానంద ఖండాలనెప్పుడూ కోరుకోలేదు. ఇలా కోరుకోకుండా ఉండడానికి కారణం ఆమె మనస్సు ప్రశాంత మవడమే. అలాంటి ప్రశాంత స్థితిలో భగవత్తత్త్వమును చక్కగా అవగాహన చేసుకుని లౌకిక వాంఛల వైపుగా మనసును పరుగెత్తించకూడదని, కఠిన నిర్ణయాన్ని తీసుకుని, తన్ను తాను సమీచీనంగా శిక్షించుకున్నదవడం వల్లే కుంతిది శాంత భక్తియై ప్రకాశించింది. ప్రారబ్ధానుసారంగా జీవితంలో అనుభవించాల్సిన నిమ్నోన్నతాలనెన్నింటినో అనుభవించిన తిక్తానుభూతి ఆమెలో అచంచల భక్తి జ్ఞాన వైరాగ్యచింతనను నిరూఢం గావించింది. అందువల్లే కుంతలాల వంటి కష్టపరంపరలకు గురి అయినా కూడా మనోనిశ్చలతను కోల్పోక చింతా సాగరంలో అతిక్రమించిన కుంతీదేవి ధన్యజీవితయై, సంసారసాగరం నుండీ బయటపడి, పరమేశ్వర చరణారవింద నిరంతరస్మరణ వల్ల పరమపదాన్ని పొందుతారనే సత్యాన్ని కుంతి ప్రపంచానికి చాటి చెప్పింది.

కుంతి సహనం, త్యాగం, పత్యనురక్తి, సంతాన రక్షా తత్పరత, వివేకం, విశ్వాసం, వృద్ధోపసేవ మొదలైన మహాగుణాలకాకరం. ఈమె కూడా ద్రౌపదిలాగే పుట్టినింటిని, మెట్టినింటిని పవిత్రం చేసిన పుణ్యచరిత.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# ఆర్జిత సేవలకు సంబంధించి ఈ క్రింది మార్పులు చేయడం జరిగినది. ఆర్జిత సేవా టిక్కెట్లను అడ్వాన్స్ బుకింగ్, కరెంట్ బుకింగ్, ఇంటర్నెట్ బుకింగ్, ఈ-దర్శన్ బుకింగ్ ద్వారా భక్తులు పొందవచ్చు.

## కరెంట్ బుకింగ్

ప్రస్తుతం వీటిని క్రమబద్ధీకరించి, కొన్ని మార్పులు, చేర్పులు చేయడం జరిగింది. కరెంటు బుకింగ్‌లో సుప్రభాతం, తోమాల, అర్చన, కల్యాణోత్సవం, నిజపాదదర్శనం, ఆర్జితసేవలకు 05-03- 2010 నుండి కరెంటు బుకింగ్ లేదు. మిగిలిన సేవలు అనగా ఆర్జిత బ్రహ్మోత్సవం, ఊంజల్‌సేవ, వసంతోత్సవం, సహస్రదీపాలంకార సేవ, విశేషపూజ, ప్రస్తుతం విధానం లోనే కొనసాగించడం జరుగుతుంది. ఈ సేవల టిక్కెట్లను తిరుమలలో విజయాబాంక్ ద్వారా పొందవచ్చు.

| సేవ/ఉత్సవం పేరు | రుసుం | కోటా | ప్రవేశం | రోజు |
|---|---|---|---|---|
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 1000/- | 15 | 5 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 3000/- | 15 | 10 | ప్రతి రోజు |
| సహస్ర దీపాలంకార సేవ | 1000/- | 50 | 5 | ప్రతి రోజు |
| విశేషపూజ | 3000/- | 25 | 5 | సోమవారం |

## అడ్వాన్స్ బుకింగ్

అడ్వాన్స్ బుకింగ్ మూడు నెలల కాలపరిమితి వరకే స్వీకరించబడుతుంది. డిమాండ్ డ్రాఫ్ట్స్ ఆర్జిత సేవా కార్యాలయానికి 20 రోజులు ముందస్తుగానే చేరాలి. అలా చేరనివి తిరస్కరించబడును.

| సేవ/ఉత్సవం పేరు | రుసుం | కోటా | ప్రవేశం | రోజు |
|---|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 95 | 1 | ప్రతి రోజు |
| కల్యాణోత్సవం | 1000/- | 150 | 2 | ప్రతి రోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 1000/- | 13 | 5 | ప్రతి రోజు |
| ఊంజల్ సేవ | 1000/- | 10 | 5 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 3000/- | 13 | 10 | ప్రతి రోజు |
| సహస్ర దీపాలంకార సేవ | 1000/- | 25 | 5 | ప్రతి రోజు |
| విశేషపూజ | 3000/- | 25 | 5 | సోమవారం |
| నిజపాదదర్శనం | 200/- | 200 | 1 | శుక్రవారం |

వ్యక్తిగతంగా డి.డి.లు స్వీకరించబడవు. పోస్టు/కొరియర్ ద్వారా పంపినవి మాత్రమే స్వీకరించబడతాయి. డి.డి.లు. "కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు" పేరుమీద తిరుమల/ తిరుపతిలలో చెల్లుబాటయ్యే విధంగా తీసి పంపాలి.

పోస్టు/ కొరియర్ సేవల ద్వారా పంపే డి.డిలతో పాటు దరఖాస్తుకు భక్తుల గుర్తింపు వివరాలు తప్పనిసరి. పాన్‌కార్డు, రేషన్ కార్డు, ఓటరు గుర్తింపు కార్డు, పాస్‌పోర్టు, డ్రైవింగ్ లైసెన్స్ తదితరాలలో ఏ ఒక్కదానినైనా జతపరచి అడ్వాన్స్ బుకింగ్ ద్వారా ఆర్జిత సేవా టిక్కెట్లు పొందవచ్చును.

## ఇంటర్నెట్ బుకింగ్

దీనికి సంబంధించిన వివరాలను

www.ttdsevaonline.com

ద్వారా పొందవచ్చు.

ఫోన్ నెంబరు : 0877 - 2263992

| సేవ/ఉత్సవం పేరు | రుసుం | కోటా | ప్రవేశం | రోజు |
|---|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 50 | 1 | ప్రతి రోజు |
| తోమాల | 220/- | 10 | 1 | మంగళ,బుధ,గురు |
| అర్చన | 220/- | 10 | 1 | మంగళ,బుధ,గురు |
| కల్యాణోత్సవం | 1000/- | 150 | 2 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 3000/- | 5 | 10 | ప్రతి రోజు |
| నిజపాదదర్శనం | 200/- | 100 | 1 | శుక్రవారం |
| విశేషపూజ | 3000/- | 25 | 5 | సోమవారం |
| అష్టదళ పాదపద్మారాధన | 2500/- | 10 | 2 | మంగళవారం |

## ఈ-దర్శన్ బుకింగ్ ద్వారా లభ్యమయ్యే ఆర్జితసేవలు, కోటా వివరాలు

| సేవ/ఉత్సవం పేరు | రుసుం | కోటా | ప్రవేశం | రోజు |
|---|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 50 | 1 | ప్రతి రోజు |
| కల్యాణోత్సవం | 1000/- | 150 | 2 | ప్రతి రోజు |
| ఆర్జిత బ్రహోత్సవం | 1000/- | 12 | 5 | ప్రతి రోజు |
| ఊంజల్‌సేవ | 1000/- | 10 | 5 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 3000/- | 12 | 10 | ప్రతి రోజు |
| సహస్ర దీపాలంకారసేవ | 1000/- | 25 | 5 | ప్రతి రోజు |
| నిజపాదదర్శనం | 200/- | 200 | 1 | శుక్రవారం |
| విశేషపూజ | 3000/- | 25 | 5 | సోమవారం |
| అష్టదళ పాదపద్మారాధన | 2500/- | 20 | 2 | మంగళవారం |

- కార్యనిర్వహణాధికారి




శ్రావణుడు ముసలి తల్లిదండ్రులకు భోజనం వడ్డించాడు. వారు తిన్నాక పడక ఏర్పాటు చేసి పడుకోబెట్టాడు. తండ్రి పాదాలు పడుతూ కూర్చొని వారిద్దరూ గుడ్డివారు కాబట్టి రోజూ తను చూచిన, తెలిసిన విశేషాలు చెప్పడం అతనికి అలవాటు. అలా ఓ సారి తీర్థయాత్రల గురించి చెప్పగా ఆ తండ్రి "మాకు కూడా తీర్థయాత్రలకు వెళ్ళాలని ఎంతగానో కోరిక ఉండేది. కానీ భగవంతుడు మమ్మల్ని గుడ్డివాళ్ళని చేసి మాకా అదృష్టం లేకుండా చేశాడు" అంటూ నిట్టూర్చాడు. "భగవంతుని ఎందుకు నిందిస్తావు? కర్మానుసారం ప్రాప్తించిన ఫలం ఇది. ఇంకానయం, మనకి ఇంత మంచి కొడుకున్నాడు. మన కొడుకే మన కళ్ళు. ఆ తోడు కూడా లేనివాళ్ళు ఎంత మందుంటారో తెలుసా?" అన్నది శ్రావణుని తల్లి.




**పీసపాటి లక్ష్మీశ్రావ్య,**
**7వతరగతి,**
**శ్రీదేవి విద్యానికేతన్, కొత్తవలస,**
**విజయనగరం జిల్లా - 535 183.**


శ్రావణుడు తన తల్లిదండ్రుల కోరిక తీర్చాలని నిశ్చయించుకున్నాడు. తల్లిదండ్రులను ఎలాగైనా ఒప్పించి తీర్థయాత్రలకు తీసుకుని వెళ్ళాలని సంకల్పించాడు. కాని ఎలా? మర్నాటి ఉదయం శ్రావణుడు ఆ ఊరి వడ్రంగి వద్దకు వెళ్ళాడు. శ్రావణుడు అంటే ఆయనకు ఎంతో గౌరవం. కారణం తల్లిదండ్రులను భక్తి శ్రద్ధలతో చూచుకునే తీరువల్ల. అందుకే అందరకీ అతనంటే ఇష్టం. "నాకో కావడి చేసిపెట్టగలవా? నా తల్లిదండ్రులను మోసుకుపోయి, వారికి పుణ్యక్షేత్రాల దర్శనం చేయించాలి. కాబట్టి కావడి రెండు వైపులా కూర్చోవడానికి వీలుండాలి" అన్నాడు శ్రావణుడు. వడ్రంగి "సాయంకాలానికి నీకు మంచి కావడి తయారు చేసి ఇస్తాను" అన్నాడు.

శ్రావణుడు ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసి తల్లిదండ్రులను ఒప్పించాడు. కావడిలో తల్లిదండ్రులను కూర్చోబెట్టి భుజాల మీద వేసుకొని బయలుదేరాడు. ఊరు ఊరంతా కదిలి వచ్చింది వారిని సాగనంపటానికి. అందరూ ఆశీర్వదించి తలపెట్టిన కార్యం జయప్రదం కావాలని కోరారు.

అతను వీథుల్లో నడుస్తూ ఉంటే జనమంతా శ్రావణుని చూస్తూ నిలిచిపోయారు ఎక్కడివారక్కడ. ఒక చిన్నవాడు భుజాల మీద తల్లిదండ్రులను మోసుకు వెళ్ళటం చిన్న విషయం కాదు. పగలంతా ప్రయాణం. రాత్రి విశ్రమించటానికి ఆగేవాడు. ప్రయాణం సాగించి, సాగించి కీకారణ్యానికి చేరాడు. జంతువుల అరుపులకు ఏమీ భయపడకుండా ఆ పరిసరాలను చూసి ఆనందించాడు. చీకటి అవటంతో అడవంతా నిశ్శబ్దంగా ఉంది. పక్షులు, జంతువులు ఆవాసాల్లో నిద్రిస్తున్నాయి. శ్రావణుడు ఓ చెట్టు బోదెను ఆధారంగా చేసుకుని నిలబడ్డాడు. అంతలో శ్రావణుని తండ్రి తనకు దాహంగా ఉన్నదని అన్నాడు. నీళ్ల పాత్రలో నీరు లేదు. తెస్తానన్నాడు. కాని తల్లి "వద్దు నాయనా! ఈ చీకట్లో వెళ్ళద్దు!!" అంది. కానీ, పాత్ర తీసుకుని మంచి నీటి కోసం బయలుదేరాడు. అల్లంత దూరంలో సెలయేరు గలగల వినబడింది. ఆ పాత్రను నీటితో నింపాడు. ఆ చీకటి

**తనకు గురువు బృహస్పతి; ఆయుధం వజ్రం**
**(పర్వతాల రెక్కలు నరికిన వజ్రాయుధం);**
**సైనికులు దేవతలు; దుర్గం స్వర్గం;**
**అనుగ్రహం చూపేవాడు విష్ణువు;**
**ఏనుగు ఐరావతం - ఇలా ఆశ్చర్యకరమైన**
**బలసంపద గలవాడైనా ఇంద్రుడు యుద్ధంలో**
**రాక్షసులచేతిలో ఓడిపోయాడు.**
**అందువల్ల ఎవరికైనా దైవమే శరణం కాని కేవలం**
**పౌరుషం ఎందుకూ కొరగాదని స్పష్టమౌతున్నది.**

నిశ్శబ్దంలో పాత్రలో నిండుతున్న నీరు బుడబుడమంటూ చేసిన చప్పుడు గట్టిగా వినిపించింది. అంతలో ఎక్కడ నుంచో బాణం రివ్వున వచ్చి శ్రావణుని గుండెలో గుచ్చుకుంది. అతను బాధతో గిలగిల లాడుతూ పెట్టినకేక ఆ అడవుల్లో ప్రతిధ్వనించింది. ఆ బాణం వేసింది దశరథ మహారాజు. వేటకు వచ్చినప్పుడు చీకటి పడగానే ఆపకుండా శబ్దభేధి విద్యతో వేటాడతాడు రాజు. ఆ నీటి చప్పుడు విని ఏదో ఏనుగు నీరు తాగుతోంది అనుకుని బాణం వేస్తే అది శ్రావణుని చంపింది. అది చూచి దశరథుడు బాధతో కృంగి పోయాడు. బాధతో శ్రావణుడు తల్లిదండ్రులను స్మరించాడు. దశరథుడు బాణాన్ని తీసి "నేను ఘోర పాపం చేశాను నన్ను క్షమించండి" అన్నాడు. అప్పుడు శ్రావణుడు దశరథ మహారాజుతో "నా తల్లిదండ్రులు దాహంతో ఉన్నారు. వారి కోసమే నేను వచ్చాను. కాబట్టి మీరు నా తల్లిదండ్రులకు దాహం తీర్చండి" అని చెప్పి చనిపోయాడు.

దశరథుడు వారి దగ్గరకు వచ్చి, జరిగినదంతా చెప్పి క్షమాభిక్ష వేడుకున్నాడు. అప్పుడు వారు "మా కొడుకు లేని జీవితం వ్యర్థం. నీవు కూడా ఇలాగే పుత్ర శోకాన్ని అనుభవిస్తావు" అని శపించి అక్కడికక్కడే మరణించారు.

తన జీవితాన్ని తల్లిదండ్రుల సేవకు అంకితం చేసిన శ్రావణుడు ధన్యజీవి కదూ! పట్టుదల, కార్యదీక్షా! తల్లిదండ్రుల ఎడల భక్తిశ్రద్ధలూ శ్రావణుని ఆభరణాలు. మనందరికీ శ్రావణుడు మార్గదర్శకుడు.



# పెద్దల మాట

– డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

గురోర్యత్ర పరీవాదో, నిందావాపి ప్రవర్తతే ।
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ, గంతవ్యం వా తతోఽన్యతః ॥

(మనుస్మృతి)

**భావం :** **గౌరవార్హులైన పెద్దల్నిగూర్చి, గురువుల్ని గూర్చి ఎక్కడ అవమానకరంగా, నిందించే మాటలు విన్పిస్తుంటాయో అక్కడ నుంచి దూరంగా వెళ్ళడం గానీ, చెవులు మూసుకుని వినకుండా ఉండటంగానీ తత్‌క్షణ కర్తవ్యం.**

**వివరణ :** గురువులంటే కేవలం చదువు నేర్పించే అధ్యాపకులే కాదు. తల్లిదండ్రులూ, అత్తమామలూ, ఆపదల్లో రక్షించినవారు, అన్నంపెట్టి పోషించిన వారూ – ఇలా మన శ్రేయస్సుకోరే వారందరూ గురువులే! గురువుల విషయంలో గుణాలు ముఖ్యంగానీ–వయస్సు ముఖ్యం కాదు. పూజనీయులైన పెద్దల్ని గూర్చి తాము నిందించరాదు, అవమానించరాదు. ఇంతేకాదు. ఇతరులెవరైనా నిందిస్తున్నా, అవమానకరంగా మాట్లాడుతున్నా – ఆ మాటలు విన్పించనంత దూరంగా వెళ్ళాలి. లేదా చెవులు మూసుకోవాలి. గురునింద మహా పాపం! ఆ నింద చేసినా, విన్నా కూడా పాపమే! తల్లిదండ్రులు జన్మనిస్తే – ఆ జన్మకు సార్థక్యం, యోగ్యత కల్గించేవారు గురువులు. గురువు సాకారమైన త్రిమూర్తి స్వరూపుడు. నిరాకారమైన పరమాత్మ కూడా గురువే! శివుడు కోపిస్తే గురువు రక్షిస్తాడు. కానీ గురువు కోపిస్తే ఎవ్వరూ రక్షింపలేరని గురుగీత పేర్కొన్నది. గురుకృప లేక మహాత్ములూ, జ్ఞాతులూ అయిన వారెవ్వరూ లేరు. విశ్వంలో గురుస్థానం నిజంగానే–గురు=గొప్పదైన, స్థానం=తావు, స్థితి. శిష్యుల చిత్త తాపాన్ని హరించే గురువులు దొరకడం చాలా అరుదు. 'గౌరవం' అనే పదం గురువు నుండి ఏర్పడిందే!

## డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమము - 05-03-2010

## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* **'డయల్ యువర్ ఇ.ఓ.'** *కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 05-03-2010న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం)*

**తిరుమలలో ప్రతి ఉద్యోగి, ప్రతి భక్తుడు ఖచ్చితంగా తిరునామం పెట్టుకునేటట్టు చూడాలి.**

*- సుధాకర రాజు, నెల్లూరు.*

**కార్యనిర్వహణాధికారి :** ఈ సంప్రదాయం ఇదివరకే ఉంది.

**1. తిరుమలలో పూల వ్యాపారాన్ని నిషేధించాలి.**

**2. పుట్టు వెంట్రుకలను తీసేటప్పుడు మొత్తం కుటుంబాన్ని ఒక క్షురకుడి దగ్గరే ఉంచి క్షురకర్మలు నిర్వర్తింపచేయాలి.**

**3. స్నానాల గదుల్లో కొళాయిలను కొంచెం ఎత్తు పెంచితే బావుంటుంది.**

*- రాజారెడ్డి, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :**

1) పూలవ్యాపారాన్ని ఖచ్చితంగా నిరోధిస్తాం;

2) మీ సలహా సమంజసం, ఆచరణలోకి తెస్తాం;

3) ఇందులోని సాధ్యాసాధ్యాలను గమనిస్తాం.

**2009 మే నెలలో నేను 10 చక్రాల కుర్చీలను విరాళంగా సమర్పించాను. కాని 2010 జనవరి 26 న రాంభగీచా దగ్గర చక్రాలకుర్చీ దొరక్క చాలా ఇబ్బంది పడ్డాను.**

*- సుదర్శనరావు, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** మీరు విరాళంగా ఇచ్చిన 10 చక్రాల కుర్చీలు ఏమయ్యాయో వెంటనే కనుక్కొని వెంటనే ఈ అసౌకర్యాన్ని నిరోధిస్తాం.

**ఆన్‌లైన్ ఆర్జితసేవా టిక్కెట్లవల్ల మారుమూల గ్రామాలలో ఇబ్బందులున్నాయి.** *- రాధాకృష్ణ, కోవెలకుంట్ల.*

**కార్యనిర్వహణాధికారి :** డి.డి. పంపే సౌకర్యం కూడా ఉంది.

**ఈ-సేవ వెబ్‌సైట్ పెర్‌ఫార్మెన్స్ సరిగా లేదు.**

*- నాగరాజు, బెంగుళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** అతి త్వరగా పరిష్కరిస్తాం.

**పూర్వం కల్యాణోత్సవం చేయిస్తే నెంబరింగ్ ఇచ్చేవాళ్లు. ఇప్పుడు అలా లేకపోవడం, వెనక వరుసల వారికి టి.వి.లు పెట్టడం అంత మంచిదికాదు.** *- శైలజ, అనకాపల్లి.*

**కార్యనిర్వహణాధికారి :** నెంబరింగ్ ఇవ్వడానికి ప్రయత్నిస్తాం.

**గరుడపురాణాన్ని ప్రచారం చేయండి.**

*- శ్రీ లక్ష్మి, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా!

**ఆన్‌లైన్‌లో టిక్కెట్ రిజర్వేషన్ కుదరటం లేదు. ఎప్పుడు ప్రయత్నించినా అది బుక్ చేసుకోవడం లేదు.**

*- వెంకటేశ్వరరావు, రాజమండ్రి.*

**కార్యనిర్వహణాధికారి :** సత్వర చర్యలు తీసుకుంటాం.

**శీఘ్రదర్శనం, ఆర్జిత సేవా కౌంటర్లు తదితరాల దగ్గర బోర్డులు మరికొన్ని ఎక్కువగా పెట్టండి.**

*- సత్యనారాయణ, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా.

**వృద్ధులను, భార్యాభర్తలిద్దరిని కలిపి మహాద్వార ప్రవేశంలో పంపిస్తే బాగుంటుంది** *- సాంబశివరావు, చిలకలూరిపేట.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**మా భజన బృందాలకు కావాల్సిన వస్తు సముదాయం తి.తి.దే. నుండి అందడం లేదు.**

*- వెంకటేశులు, ధర్మవరం.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**రాములవారి బ్రహ్మోత్సవాల్లో చక్రస్నానాన్ని రామచంద్ర పుష్కరిణిలో నిర్వహించాలి.** *- కోదండపాణి, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

# సుగ్రీవ నరసింహ

మూలం - డా॥ ఆర్. శేషశాస్త్రి
అనువాదం - బి.యన్.శ్రీనివాసన్

పరమ శ్రీవైష్ణవుడైన అన్నమయ్య దక్షిణ భారతంలోని పలు వైష్ణవ క్షేత్రాలను దర్శించి, అక్కడి దేవతల గురించి కీర్తనలను రాశాడు. కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి, చిత్తూరు, నెల్లూరు, గుంటూరు, చంగల్పట్టు, ఆర్కాడు, తంజావూరు, తిరుచిరాపల్లి, శ్రీరంగం మున్నగు క్షేత్రాల్లోని ఆలయాలను సందర్శించి సంకీర్తనా రచన చేశాడు. ఆయన ఏ దేవుడిని చూసినా అతనికి శ్రీ వేంకటేశ్వరుడే కనబడతాడు. ఆ కారణం చేతనే అతని ప్రతి సంకీర్తనా శ్రీ వేంకటేశ, వేంకట నాథ అనే ముద్రాంకితంతోనే అంతమౌతుంది.

సుగ్రీవ నరసింహుడిని గురించి అతను రాసిన సంకీర్తన ఇలా సాగుతుంది -

**సులభుడై వున్నాడు సుగ్రీవ నరసింహుడు**
**నెలకొన్న దాసులకు నిధానము వీడే ॥ సు ॥**

**తుంగభద్రా తటమున తొడపై నిందిర తోడ**
**సింగారించుకొన్న వేల్పు సింహము వీడే**
**సంగతిగా దేవతలు జయవెట్టి కొలవంగా**
**చంగటనే మహిమల చలరేగీ వీడే ॥ సు ॥**

**చలువ బండలమీద చక్కని కొండల దండ**
**అలరీని వీరనరహరి వీడే**
**వెలయు శంఖ చక్రాల వేవేలు హస్తములతో**
**బలవంతుడైవున్నాడు పంతముతో వీడే ॥ సు ॥**

**పువ్వుల తోటలనీడ భువనేశ్వరములోన**
**జవ్వనపు మనుజ కేసరి వీడే**
**ఇవ్వల శ్రీ వేంకటాద్రి నిరవై వరములిచ్చె**
**నవ్వు మోము తోడ భువనము లేలేవాడు ॥ సు ॥**

**(4-512)**

## అక్షరామృతం [21]

ఈ సుగ్రీవ నరసింహుడు సులభ సాధ్యుడు. నిలిచిన భక్తులకు నిధానము - ఆపద్ధనమీతడు. తుంగభద్ర తటిలో, ఇందిరను తొడపై కూర్చుండబెట్టుకుని, సింగారమై ఉండె నరసింహుడు. దేవతలు కొలిచినపుడు వివిధ మహిమల్ని చూపాడు.

అందమైన కొండలదండతో, బండల నడుమ విహరించు వీరనరహరి ఇతడు. మెరిసే శంఖ చక్రాదులతో, వేవేల చేతులతో ఉన్నవాడు ఇతడు.



పూదోటలో నెలకొన్న భువనేశ్వరి లోపల శోభించు వాడు ఈ యవ్వనపు నరహరి. వేంకటాద్రిలో నెలకొని చిరునవ్వుతో వరములనిచ్చువాడు ఇతడు.

ఈ సంకీర్తనలో తుంగాతీరంలో ఈ సుగ్రీవ నరసింహ ఉన్నాడు అని అన్నమయ్య చెప్పినదాన్ని గమనించాలి. మరో సంకీర్తనలో తుంగభద్ర కొండనుండి శ్రీ వేంకటాద్రిని లీలతో ప్రహ్లాదునికేలికైనవాడు (4-275) అని అన్నాడు. కాన ఈ సుగ్రీవ నరసింహుడు తుంగభద్రా తీరంలోని హంపిలో ఉన్నవాడు అని స్పష్టమౌతుంది. ఇందిరను తొడపై కూర్చోబెట్టు కున్నాడు. తోడుకు ఈ ఆలయానికి నేపథ్యంలో కొండలదండ ఉన్నది అనే వర్ణన గమనించతగ్గది. పూదోట నీడలో అనే మాటను సమర్థిస్తూ ఈ ఉగ్ర నరసింహుడి సమీపాన ఒక శాసనం క్రీ.శ.15వ శతాబ్దంలో "శ్రీ హేమకూటం వరద నరసింహ దేవర హూవిన తోట" గురించి చెపుతున్నది. (.....దేవుడి పూదోట) (హంపి శాసనగళు - సంఖ్య 82). అన్నమయ్య తన సంకీర్తనలో చెప్పింది బహుశా ఈ పూదోటను గురించియే అయి ఉండాలి. క్రీ.శ. 1529వ సంవత్సరపు ఒక శాసనంలో (సంఖ్య 81) ఇతడు లక్ష్మీనరసింహ దేవుడు అని పిలువబడ్డాడు. ఇక్కడ అతడిని వరద సంహిదేవ అని పేర్కొనడమైనది. ఇదే దేవుడిని క్రీ.శ.1532లోని ఒక శాసనంలో వరద నరహరి, వరద యోగ నరహరి అని పిలవడం జరిగింది. కృష్ణదేవరాయలు క్రీ.శ.1529లో చెప్పినట్టు ఈ విగ్రహం ప్రతిష్ఠాపన చేసినపుడు లక్ష్మీ నరసింహ అనే పిలవబడ్డా, తరువాతివారు అదే దేవుడిని తమకు తోచిన ఇతర పేర్లతో సంబోధించారు. అన్నమా చార్యులు కూడా ఈ సుగ్రీవ నరసింహుడిని మనుజ కేసరి, వీరనరహరి, వేల్పుసింహ - అని నానావిధమైన పేర్లతో పిలిచాడు. ఐతే ప్రధానంగా ఇతడు సుగ్రీవ - నరసింహ మాత్రమే.

భువనేశ్వరంలోన జవ్వనపు మనుజ కేసరి - అనే వాక్యంతో ఈ నరసింహ దేవుడి విగ్రహానికి పైకప్పు - భువ నేశ్వరి ఉండేదని తెలియవస్తుంది. పులమతి రామరాయల వారు "విజయనగర కళ సాహిత్యం" అనే గ్రంథంలో నర సింహుడి గుడిని గురించి రాస్తూ దీనికి ఒక భువనేశ్వరి ఉండినదనీ, దానికి బంగారపు రేకులను కప్పి శోభాయ మానం చేశారు అనీ చెప్పియున్నారు. (ఈ ఉగ్రనరసింహ అనబడే విగ్రహం ఉండేది. చుట్టూ పటిష్టమైన, దృఢమైన గోడల లోపల అనేది ఇప్పుడూ స్పష్టంగా కనబడుతుంది. ఈ నాలుగు గోడలపైన సుందరంగా భువనేశ్వరి - పైకప్పు - నిర్మించబడ్డది అనియూ దానికి బంగారు తొడుగు ఉండిన దనియూ - ఇప్పుడు తిరుమల ఆలయంలోని తిరుమామణి మంటపం మాదిరిగానే - అని ఊహించడంలో అతిశయం లేదు. - అనువాదకుడు) అన్నమాచార్యుల ఇంకొక సంకీర్తనను ఇప్పుడు గమనించవచ్చు.

**సులభుడీతడిదివో సుగ్రీవ నరసింహుడు**
**చెలగి మొక్కులు మొక్కి సేవించరో** ॥ సు ॥

**నవ్వుల మోమువాడు నానా మహిమలవాడు**
**రవ్వలుగా దేవతల రక్షించేవాడు**
**వువ్విళ్ళూర కంభములోనుదయించినవాడు**
**నివ్వటిల్లు ప్రతాపాన నెగడినవాడు** ॥ సు ॥

**హేమపు చాయలవాడు ఎదుట గొల్వున్నవాడు**
**కోమలి దొడపై నిడుకున్నవాడు**
**కోమలపు మేనివాడు గొప్ప కిరీటమువాడు**
**చేముంచి హిరణ్యదైత్యుణ్ణి చించినవాడు** ॥ సు ॥

**వాలుకగోళ్ళవాడు వాడి కోరలవాడు**
**మేలిమి కరుణ తోడ మించినవాడు**
**వోలి తుంగభద్రకాడనుండి శ్రీ వేంకటాద్రిని**
**లీలతో ప్రహ్లాదునికేలికైనవాడు** ॥ సు ॥

**(4-275)**

ఇదిగో చూడండి. ఇతడు ఈ సుగ్రీవ నరసింహుడు, సులభుడు. ఇతనికి నమస్కారం చేసి ఇతని వశమై, ఇతనిని కొలవండి; ఇతడు నవ్వు ముఖం వాడు. నానావిధ మహిమలు కలవాడు. దేవతలను రక్షించువాడు. కంభంలో పుట్టుకొచ్చిన వాడు. ప్రతాపంతో ప్రసిద్ధుడైనవాడు, బంగారపు రంగులవాడు, ఎదుటే కొలువైనవాడు, తొడపై లక్ష్మిని కూర్చుండబెట్టుకున్నాడు.

కోమలశరీరి. పెద్ద కిరీటం పెట్టుకున్నాడు, వంచిన నఖాలు, చూపైన కోరలు కలవాడు, తుంగభద్రా తీరంలో ఉన్నాడు. ప్రహ్లాదుని ఏలువాడు.

పై కీర్తనలో 'హేమపు చాయలవాడు' అనే మాటకు రెండు అర్థాలు చెప్పవచ్చు. మిసిమివన్నె - బంగారపు రంగు- కలవాడు అనేది ఒకటైతే, మరొకటి హేమకూట పర్వతం పక్కనే ఉన్నాడు కాబట్టి; దాని నీడలో ఉన్నవాడు అనేది. పెద్ద కిరీటం కలవాడు, వంగిన నఖములవాడు, కూరైన కోరలవాడు అనే వర్ణనల ఆధారంతో సుగ్రీవ నరసింహుడు వేరెవ్వరూ కాక హంపిలో ఇపుడున్న ఉగ్రనరసింహుడే అని ఖచ్చితంగా చెప్పవచ్చును.

ఈ సుగ్రీవ నరసింహుడిని వివరించిన మరో కీర్తనను చూడవచ్చు -

**సేవించరో జనులార చిత్తజ గురుడీతండు**
**కేవల దయానిధి సుగ్రీవ నారసింహుడు**

**వేయి చేతులతోడ వెన్నెల నవ్వుతోడ**
**ఛాయలు దేరేటి శంఖ చక్రాలతోడ**
**అయతమై వున్నవాడు అదే సింహాసనముపై**
**శ్రీయుతుడై యెదుట సుగ్రీవ నారసింహుడు**

**కుంకుమగోళ్ళతోడ కోర దౌడల తోడ**
**అంకెల రవిచంద్ర నయనములతో**
**తెంకినసురులగొట్టి దేవతల కందరికి**
**కింకలెల్లా బాపెను సుగ్రీవ నారసింహుడు**

**బిరుదు పెండేలతోడ పీతాంబరము తోడ**
**సరి కిరీటాది భూషణములతో**
**సిరులకెల్లా నెలవై చెలగి శ్రీ వేంకటాద్రి**
**గిరిమీద వెలిసెను సుగ్రీవ నారసింహుడు**

ఓ జనులార! చిత్తజుడి తండ్రీ దయానిధీ అయిన సుగ్రీవ నరసింహుడిని సేవించండి. ఈ సుగ్రీవ నరసింహుడు వేయి చేతులతో, వెన్నెల వంటి నవ్వుతో, శోభగొలిపె శంఖ చక్రాదులతో ఆయతంగా సింహాసనంపైన శ్రీ సమేతుడై ఉన్నాడు.

## అవియే కదా తిరుమల గిరులు

**అదియే కదా సహస్రాక్షుని మండిత**
**తేజోవిరాజిత దీప్తి మయము;**
**అదియే కదా సహస్రాననుని విమల**
**వర్చస్సుల మిసిమి భాతిమయము;**
**అదియే కద విహాయస వీథిలో వెల్గు**
**బంగారు శిఖరాల ప్రస్ఫురమ్ము;**
**అదియే కద విలాసి హరివాస ధామమ్ము**
**ఆనంద నిలయాన అలరుచుండె;**

**అవియె తిరుమల గిరులు రసాన్వితమ్ము**
**అమరులు తిరుగు సానువులై వెలార్చు**
**కాంతి పుంజముల సరసి క్రందుకొనుచు**
**రసఝురులతో విరులతో తెరలమరారు**
**నదియె పన్నగ సార్వభౌమాచలమ్ము!**

**- ఆచార్య శ్రీవత్స**

రక్తపురంగు నఖాలతో, కోరలతో, సూర్యచంద్రులే కన్నులుగా, రాక్షసులను నిగ్రహించి, దేవతలకు నెమ్మదిని తెచ్చి పెట్టిన సుగ్రీవ నరసింహుడు. కాళ్ళలో పెండేరము కట్టుకొని పీతాంబరం ధరించి నేరుగా ఉన్న కిరీటాన్ని ధరించి, అన్ని విధాల సిరులకూ నెలవైన వేంకటాద్రి పై ప్రకాశిస్తున్నాడు.

ఈ కీర్తనను చదివిన తరువాత విగ్రహాన్ని చూస్తే ఆ నరసింహుని ముఖంలోని చిరునవ్వును గుర్తించవచ్చు. ఆ నవ్వు వెన్నెల వలే అన్నమయ్యకు కన్పించింది. భక్తులకు, భావకులకు ఈ నవ్వు కనువిందు చేసే రీతిలో విగ్రహాన్ని మలచిన శిల్పి కౌశల్యాన్ని మనం శ్లాఘించాలి. విగ్రహాన్ని దగ్గరనుండి చూసిన అన్నమయ్యకు నఖములు రక్తవర్ణంతో కనుపించినది. (వెనక కీర్తనలో వంగిఉన్న నఖములు అని అన్నాడు).

ఈ నరసింహుడి నేత్రాలు సూర్యచంద్రుల లాగున్నవి అంటాడు. నరసింహుడి పొడవైన కిరీటాన్ని పదే పదే ప్రస్తావించాడు. ఇక్కడ నరసింహుడి పాదాలలోని పెండేరాన్ని గురించి చెప్పాడు.

అన్నమయ్యకు ఇటువంటి నరసింహ గురించి సరసంగా ముచ్చట్లు చేసేది ఆనంద దాయకమైన సంగతి. ఒక కీర్తనలో నిందాస్తుతి ఇలా సాగుతుంది.

**జూటు ఆందనాలవాడవు సుగ్రీవ నరసింహ**
**పాటించి నిన్న నేము పంగించేవారమా**

**మొగము సింహపు రూపు మొగిమై మానిసి రూపు**
**జిగిదొడ మీదటి శ్రీ మహాలక్ష్మి**
**తగునీకు నిటువంటి తగవులెల్లా చెల్లు**
**మెగసెక్కెలాడ మాకు నేలయ్యా నిన్నును**

**కట్టుకొన్నది పైడికాశ కంబములో ఉనికి**
**నెట్టుకొన్న నవ్వులు నీలోన నీవే**
**మిట్టివెల్లా నీకేమరు ఎన్ని లేవు నీ చేతలు**
**అట్టిట్టని నిన్ను మాకు నడుగుటనేమిటికి**

**అమరులకేలికవు అసురులకు వైరితి**
**రమణ ప్రహ్లాదునకు రక్షకుండవు**
**కొమరై శ్రీ వెంకటాద్రి గొత్తలు నీ గుణములు**
**సముకాన పలుమారు సంతోషించేమింకను**

**(4-164)**

జటాధారియైన సుగ్రీవ నరసింహ – నిన్ను వ్యంగము చేయ మేమెంతవారము! నీ ముఖము సింహపు రూపు, మానవ దేహంగలనీకు తొడపై లక్ష్మి ఉన్నది. ఔనౌను ఇట్టి వైవిధ్యాలన్నీ నీకే జెల్లు. కట్టుకున్నది పీతాంబరం. నీ ఉనికి కంబంలో. నీలో నీవే నవ్వుకుంటున్నావు. అలాగ ఇలాగ అనేదానికి మేమెవ్వరము! అమరులకు రాజు, అసురులకు వైరి, అయితే ప్రహ్లాదునకు రక్షకుడవు! వేంకటాద్రిపై నెలకొన్న నీ గుణములను చూసి సంతోషబడుట మావంతు – అని నిందాస్తుతిలో తను చూసిన నరసింహ చిత్రాన్ని మాటల్లో కట్టి ఇచ్చేందుకు ప్రయత్నం చేశాడు అన్నమయ్య.

ఈ సంకీర్తనలోని 'పైడికాశ' అనే మాట ముఖ్యం. ఈ శిల్పంలో శిల్పి నరసింహడి రెండు కాళ్ళను జోడించి ఒక పట్టికను చెక్కాడు. పలు విద్వాంసులు దీనిని యోగపట్టిక అని అభిప్రాయపడతారు. అయితే ఇది యోగపట్టిక కాదు. నరసింహ కట్టుకున్న సరిగ పంచను గురించింది. ఇదే నరసింహను పోలిన పలు విగ్రహాలను నేను చూసి ఎరుగుదును– వామభాగంలో లక్ష్మి ఉంటుంది. ఇదే విధమైన పట్టిక ఉంటుంది. నీవు ధరించింది పట్టువస్త్రం అయితే నీవు ఉండేది మాత్రం స్తంభంలో – అని వ్యంగ్యం చేస్తున్నాడు. ఇది నిందా స్తుతిలోని ఒక భంగిమ.

ఈ సుగ్రీవ నరసింహుడిని ఎన్ని విధాల్లో స్తుతించినా అన్నమయ్యకు తృప్తిలేదు. నరసింహ మహిమలను వర్ణించే దానికంటె అతని రూపాన్ని వర్ణించడంలోనే అన్నమయ్యకు ఆసక్తి ఎక్కువ అనిపిస్తుంది.

**దొరతనములతోడ తొడపై శ్రీసతి తోడ**
**కెరలీబంతముల సుగ్రీవ నరసింహము**

**నిక్కిన కర్ణములతో నిట్టుసూపులతో**
**మిక్కట్ట పెద్దమీసాల తోడ**
**వెక్కసపు నోరితోడ వెలయు బుగ్గల తోడ**
**క్రిక్కిరిసి నవ్వుల నారసింహము**

**చెల్లు నూరుపులతోడ సంకు చక్రములతోడ**
**మోల్లమైన సహస్ర కరములతోడ**
**తెల్లని మేనితోడ దిండైన పిరుందుతోడ**
**కెల్లురేగీ గరుణ సుగ్రీవ నారసింహము**

**విరుల పాదాలతోడ వెలయు సొమ్ములతోడ**
**తిరమైన కోటి సూర్య తేజము తోడ**
**విరుల దండలతోడ వేడుక శ్రీ వేంకట**
**గిరిమీద వెలిసె సుగ్రీవ నారసింహము**

రాజఠీవితో, అంకముపై లక్ష్మి కూర్చుండగా పరాక్రమంతో వెలసినాడు, సుగ్రీవ నరసింహుడు. దీటైన చెవులతో, తీవ్రతరమైన చూపుల కనుగుడ్లతో, పెద్ద మీసాలతో, పెద్ద నోరు, మెరిసే చెంపలతో, అట్టహాసం చేస్తున్నాడు సుగ్రీవ నారసింహుడు.

శంఖ చక్రాలతో వేయి చేతులవాడుగా, తెల్లని తనువుతో, బలమైన పృష్ఠములతో కరుణామూర్తియైన సుగ్రీవ నారసింహుడున్నాడు.

శుభ్రంగా ఉన్న పాదాలు, మెరిసే ఆభరణాలు, స్థిర మైన కోటిసూర్యకాంతి, వాలుతూ ఉన్న పూలమాలలతో సుగ్రీవ నారసింహుడు శ్రీ వేంకటగిరిపై ఉన్నాడు.

పై జెప్పిన అన్ని సంకీర్తనల్లో అన్నమయ్య హంపిలో తను చూసిన సుగ్రీవ నారసింహ రూపాన్నే వర్ణించినాడు. ఈ సుగ్రీవ నారసింహ అను పేరే తరువాతి కాలంలో – లక్ష్మి విగ్రహం వేరైన తరువాత – ఉగ్రనరసింహ అని వాసికెక్కినది అని ఊహించవచ్చును.

హంపిలో ఈ ఉగ్రనరసింహుడేకాక మరో రెండు నర సింహదేవాలయాలున్నాయి. ఒకటి అహోబిల నరసింహుడైతే మరొకటి ఆనందతీర్థులవారు ప్రతిష్ఠించిన నరసింహదేవుడు. అన్నమయ్య కీర్తనలను బట్టి చూస్తే ఆయన కీర్తించింది ఈ ఉగ్ర నరసింహుడినే తప్ప ఇంకో నరసింహుడిని కాదు అనేది స్పష్టం.

మరొక సూక్ష్మ సమాచారమేమంటే హంపిలో మధ్వ సంప్రదాయానికి చెందిన పలు హరిదాసులున్నా ఏ ఒక్కరూ ఈ సుగ్రీవ నరసింహను కీర్తంచలేదు.

అన్నమాచార్య ఈ ఉగ్రనరసింహ – సుగ్రీవ నార సింహుడిని మాత్రమే స్తుతించలేదు. హంపిలోని ఉద్దగిరి కృష్ణ (ఇది కృష్ణదేవరాయలు నిర్మించిన బాలకృష్ణ దేవాలయం లోనిది) పెద్ద హనుమంతుడు (పెద్ద అంగడివీధిలోని మాధవ దేవాలయంలోని హనుమంతుడు) కళసాపురం హనుమంత (కంప్లి దారిలో ఉన్న నిచ్చుణిక హనుమంతరాయని గుడి) విఠలుడిని, భూపతి చెఱువు వేంకటేశుడు (అచ్యుతరాయ నిర్మిత వేంకటేశ్వరస్వామి ఆలయం) రాముడిని, కోదండరాముడని స్తుతించాడు. ఇక్కడంతా ఆనాడు వాడుకలో ఉన్న స్వామి పేర్లనే వాడాడు. సంకీర్తనలో బాలకృష్ణుని కీర్తించినా, ఆ దేవుడిని 'ఉద్దగిరి కృష్ణ' అన్నాడు. కృష్ణరాయడు ఉదయగిరిని వశపరచు కున్నపుడు అక్కడి బాలకృష్ణ విగ్రహాన్ని తెచ్చి హంపిలో ఆలయం నిర్మించి ప్రతిష్ఠ చేశాడు. ఉదయగిరి కృష్ణుడు – ఉద్దగిరి కృష్ణుడు అయినది. పెద్ద అంగడి వీధిలోని హను మంతుడిని ఆనాడు పెద్ద హనుమంత అనే పిలిచి ఉండే ఆస్కారముంది. అలాగే కళసాపురంలోని ఆంజనేయస్వామి. ఈ నేపథ్యంలో చూస్తే కృష్ణరాయడు ఆనాడు నిర్మించిన లక్ష్మీనరసింహస్వామి విగ్రహాన్ని 'సుగ్రీవ నారసింహ' అని పిలిచి ఉండే సాధ్యతలు ఎక్కువ. ఇదే కాలక్రమేణ ఉగ్ర నరసింహ అయి ఉండాలి.

పై చెప్పబడిన ఏ ఒక్క దైవాన్ని మధ్వ సంప్రదాయం హరిదాసులు కీర్తించలేదు అనేది ఎంత సత్యమో, యంత్రో ద్ధారక హనుమంతుడిని అన్నమయ్య స్తుతించలేదనడం కూడా అంతే సత్యం. (ఇపుడు దొరికిన సంకీర్తనల ఆధారాలతో)

అన్నమయ్య సంకీర్తనలు ఈ ఉగ్రనరసింహుడు భగ్నం అయ్యేందుకు పూర్వం ఎలా ఉండేది అనే చిత్రాన్ని మాటలతో కట్టి ఇస్తుంది కాబట్టి ఈ సంకీర్తనలు ప్రాముఖ్యం చెందు తున్నవి.

1976 లో ఎం.ఎల్.దేశపాండేగారు భారతీయ పురా తత్వ ఇలాఖా సంయుక్త మహానిర్దేశకులుగా ఉన్నపుడు ఈ ఉగ్రనరసింహ విగ్రహాన్ని జీర్ణోద్ధారణం చేసే పనిని పద్మనాభన్ అనే శిల్పశాస్త్రజ్ఞుడికి అప్పజెప్పారు. అక్కడే పడి ఉన్న అదేవిగ్రహం తాలూకా శిలాశకలాలను (350పై చిలుకు) సంగ్రహించి, పద్మనాభన్ పని ప్రారంభించారు.

హంపి పునరుత్థాన సమితి అధ్యక్షులైన డా॥ శివరామ కారంతగారు హంపికి వెళ్ళినప్పుడు ఈ జీర్ణోద్ధరణ కార్యం గురించి విముఖులై, నేరుగా ఇందిరాగాంధికి రాశారు. దీంతో పని మధ్యలోనే ఆగిపోయింది. నా గురువుగారైన బి.వి. వైకుంఠరాజుగారు అప్పట్లో తమ 'వారపత్రిక'లో దీన్ని గురించి దుమారం లేపి జీర్ణోద్ధరణ జరగాలి అని వాదించినా మిత్రుడు కె.జనార్దన కూడ జీర్ణోద్ధారణకై వత్తాసు పలికినా ఫలితం శూన్యమైంది.

శాసనాలలో చెప్పినట్టు ఈ స్వామి లక్ష్మీనారసింహుడే. జనమానసంలోని ఉగ్రనరసింహుడు అనేది ఒక అపప్రథ అనే సత్యం అన్నమయ్య చెప్పిన 'సుగ్రీవ నారసింహుడు' అనే వివరణలో ఖచ్చితమవుతుంది. ఆంధ్ర కర్ణాటక ప్రభుత్వాలు, భారత పురాతత్వ శాఖలు – కృష్ణదేవరాయని పట్టాభిషేకాన్ని ఉత్సాహంతో స్మరించే ఈనాడు – ఈ విగ్రహ జీర్ణోద్ధారణం చేస్తే చరిత్రార్థమైన పని చేసినట్టవుతుంది.

# శ్రీకృష్ణదేవరాయల తిరుమల శాసనాలు

## శాసన వివరణ - 9

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలుకా, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్. (తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరగోడపై ఉన్నశాసనం)

**వంశం** : విజయనగర (తుళువ) **రాజు** : శ్రీకృష్ణదేవరాయలు

**కాలం** : శక సంవత్సరం **1434**, ఆంగిరస సంవత్సరం, **1513** ఎ.డి.

**భాష** : తెలుగు

**విషయం** : శ్రీకృష్ణదేవరాయలు తిరువెంగళనాథదేవుని దర్శించుకొని నవరత్నఖచిత కిరీటమును మరియు అనేక బంగారు ఆభరణాలను కానుకగా సమర్పించెను. ఆభరణాలపేర్లు మరియు వాటి బరువుల వివరాలు పేర్కొనబడినది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-III, సంఖ్య-32.

## శాసన వివరణ -10

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలుకా, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్. (తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని దక్షిణగోడపై ఉన్నశాసనం)

**వంశం** : విజయనగర (తుళువ) **రాజు** : శ్రీకృష్ణదేవరాయలు

**కాలం** : శక సంవత్సరం **1434**, ఆంగిరస సంవత్సరం, **1512** ఎ.డి.

**భాష** : తెలుగు

**విషయం** : శ్రీకృష్ణదేవరాయల అంతఃపుర ద్వార పాలకులైన నరసయ్య, ఇతని తమ్ముడు తిమ్మయ్యలు తిరువెంగళనాథస్వామివారికి ఎల్లవేళల సాష్టాంగప్రణామమాచరించున్నారని మరియు వీరితల్లిగారైన బసవమ్మగారు స్వామివారికి నమస్కారములు తెలుపుతున్న వివరాలను ఈ శాసనం తెలియజేస్తుంది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-III, సంఖ్య-26.

## శ్రీపదకేళి - 10 (మార్చి-2010)
## విజేతలు

**1) విజాపురపు నరసింగరావు,**
ఇంటి నెం.1-18-38, అన్నపూర్ణ నిలయం,
ఎం.ఈ.యస్.కాలనీ,
సికింద్రాబాద్ -500 015.

**2) ప్రతాపురం రామానుజాచారి,**
ఇంటి నెం.6-7-20, బ్రాహ్మణవాడ,
హనుమకొండ - 506 011.

**3) మునిగోటి సత్యనారాయణశర్మ,**
ఇంటి నెం.33-91/1,
మారుతీకాలనీ, సుశీలారోడ్డు
దొడ్డమావళ్లి, బెంగళూరు - 560 004.

### సరైన సమాధానాలు రాసినవారు :

యం.కె.ప్రభావతి(గుంతకల్లు); జి.వెంకటేశ్వరప్రసాద్(విశాఖ పట్నం); జె.సామ్రాజ్యలక్ష్మి(తిరుపతి); కె.తిరుమలాచార్యలు (ఒంగోలు); ఎ.ప్రమథనాథశర్మ(అనంతపురం); వి.నళినీకాంత్ (గుంటూరు); కె.ఆనందపిళ్లై(చిత్తూరు); యం.వి.ప్రసాదరావు (సంతనూతలపాడు); ఎ.టి.శ్రీనివాసన్(అనంతపురం); జి.బల రామానుజాచారి (హన్మకొండ); జి.బలరామశాస్త్రి(నాచారం); జి.భోగీశ్వరం(నెల్లూరు);ఎ.వెంకటకృష్ణమూర్తి(నెల్లూరు);డి.హను మంతరావు(నెల్లూరు); ఎం.హరిదాసు(కరీంనగర్); ఎం.ముని రత్నం(నెల్లూరు);టి.ఆర్.బాలకృష్ణరావు(రాజమండ్రి); జి.రమాదేవి (మార్టూరు); ఇ.శ్రీనివాసరావు(తెనాలి);ఎ.కృష్ణమాచార్య (మహా రాష్ట్ర); బి.విశ్వనాథరావు(హైదరాబాదు);ఎం.కృష్ణమూర్తి (తిరు పతి);పి.నిర్మల(గుంటూరు); వి.యస్.క్రిష్ణ(హైదరాబాదు); కె.మానసమైత్రి (హైదరాబాదు); పి.రామకృష్ణ(పిఠాపురం); ఇ.గృహలక్ష్మి(తెనాలి); పి.భానులక్ష్మీకుమారి(తెనాలి); ఎన్.రామ కృష్ణ(గుంటూరు); కె.శివనాగేంద్రమ్మ(ఒంగోలు); ఎస్.టి.పి.వి. రామానుజాచార్యులు(నూజివీడు); టి.కృష్ణభగవాన్(భీమవరం); వి.వి.పద్మావతి(ఒంగోలు); కె.కృష్ణమూర్తిరావు(హిందూపురం); పి.మల్లిఖార్జునమూర్తి(హైదరాబాదు); ఎం.సత్యనారాయణ (హైదరాబాదు);ఎం.సుబ్బారావు(ఒంగోలు);కె.రామకృష్ణ (రాయ దుర్గం); యం.పార్థసారథి ఆచార్యులు(వరంగల్).




### నిబంధనలు :

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్త రించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీ కరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందా దారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొన వచ్చు.

### బహుమతి వివరాలు :

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అంద జేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపు తాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

### పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| ■ | ■ | 1 | | 2 | | 3 | ■ | ■ |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | ■ | | ■ | | ■ | | ■ | ■ |
| 4 | | ■ | 5 | | | ■ | 6 | 7 |
| | ■ | 8 | ■ | ■ | ■ | 9 | ■ | |
| 10 | | | | | ■ | 11 | | |
| | ■ | | ■ | ■ | ■ | | ■ | |
| 12 | | ■ | 13 | 14 | | ■ | 15 | |
| ■ | ■ | 16 | ■ | | ■ | 17 | ■ | ■ |
| ■ | ■ | 18 | | | | | ■ | ■ |

# శ్రీపదకేళి - 12

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1)** పూరించిన వారి పూర్తి చిరునామా :

..........................................................

..........................................................

..........................................................

..........................................................

.......................................... ☐☐☐☐☐☐

**2)** మీరు సప్తగిరి చందాదారులైతే?

అ) చందా నంబరు : ..................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..................................

..........................................................

..........................................................

..........................................................

..........................................................

.......................................... ☐☐☐☐☐☐

## ఆధారాలు

### అడ్డం

**1)** హైదరాబాదును తెలుగులో ఇలా అంటారు (5)

**4)** పొన్నును వ్యవహారంలో ఇలా అంటారు (2)

**5)** సహజంగా ప్రతివారు ఏదో ఈ భక్తిసాయం చేస్తానంటారు. పైగా ఆ జంతువు వానరులతో పాటు రామునికి సహాయం చేసిందట (3)

**6)** వానరం (2)

**10)** గాయత్రి మంత్రాన్ని సృష్టించిన మహర్షి (5)

**11)** తెలుగు భాగవతాన్ని రచించిన సహజపాండిత్యుడు (3)

**12)** రాజుకు వికృతి అటునుంచి (2)

**13)** ఆకాశాన్ని ఇలా కూడా అంటారు (3)

**15)** ఇతడు కాంచని చోటు కవి కాంచును (2)

**18)** నవగ్రహాలకు చిహ్నంగా ఈ రాళ్ళను పొదిగిన ఉంగరాన్ని ధరిస్తారు. (5)

### నిలువు

**1)** శ్రీరామునికి సీత (2)

**2)** దమయంతి భర్త (3)

**3)** ఒక అప్సరస (2)

**4)** కుబేరుడు (5)

**7)** మురళిని ఇలా అంటారు (5)

**8)** సుమిత్రకొడుకు (2)

**9)** పావురం (3)

**14)** తుమ్మెదకు మరోపేరు (3)

**16)** అడవి (2)

**17)** క్షీరము వ్యవహారంలో (2)

### —:: *శ్రీపదకేళి-10* (మార్చి,10) సమాధానాలు ::—

| 1 అ | ■ | ■ | 2 వి | 3 న | త | ■ | ■ | 4 అ |
|---|---|---|---|---|---|---|---|---|
| రుం | ■ | ■ | ■ | ర్మ | ■ | ■ | ■ | నూ |
| 5 ధ | నం | ■ | 6 ఉ | ద | రం | ■ | 7 చా | రు |
| తి | ■ | 8 అ | ■ | ■ | ■ | 9 వ | ■ | డు |
| ■ | 10 రా | జు | ■ | ■ | ■ | 11 పు | ట్ట | ■ |
| 12 శు | ■ | డు | ■ | ■ | ■ | ష్ట | ■ | 13 నా |
| 14 నా | కం | ■ | 15 శ్ర | 16 వ | ణం | ■ | 17 లో | భి |
| దే | ■ | ■ | ■ | సు | ■ | ■ | ■ | జు |
| వి | ■ | ■ | 18 అ | ధ | రం | ■ | ■ | డు |




– జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ మాసంలో వీరికి వృత్తి, ఉద్యోగ వ్యాపారాల్లో అధిక శ్రమతో పనులు పరిపూర్ణమౌతాయి. వ్యవసాయాభివృద్ధికి, ఫలసాయానికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. సుదీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్న పనులన్నీ ఓ కొలిక్కి వచ్చి పరిష్కారమవుతాయి. వివాహ ప్రయత్నాలు అనుకూలం. మొదటివారం కార్యజయం, రెండోవారం ఆనందం, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం శుభకార్యం.



## వృషభ రాశి

ఈ నెలలో వీరికి నూతన ప్రయత్నాలు, కొనుగోలు, అమ్మకాలు అనుకూలం. దీర్ఘకాలంగా అసంపూర్తిగా ఉన్నా విద్యా, ఉద్యోగ, వివాహప్రయత్నాలు ఫలిస్తాయి. పరీక్షల్లో ఫలితాలు విజయాన్ని చేకూరుస్తాయి. మొదటివారం వస్తు కొనుగోలు, రెండోవారం శుభవార్త, మూడోవారం సత్కారాలు, నాలుగోవారం విజయప్రాప్తి.



## మిథున రాశి

ఈ మాసంలో వీరు నమ్మిన వ్యక్తులే మోసం చేయటం వల్ల చేసే వృత్తి వ్యాపారాల్లో కష్టనష్టాలు. మీ మంచితనం ఎదుటివారికి లోకువగా అన్పించి పలు ఇబ్బందులకు గురిచేస్తారు. వెండి, బంగారు వర్తకులకు అధికారుల ఒత్తిడి. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ఆందోళనలు, మూడోవారం విమర్శలు, నాలుగోవారం జయం.



## కర్కాటక రాశి

అధిక శ్రమ, వృధాప్రయాణం, వృధావ్యయం ఈ మాసంలో ఈ రాశివాళ్ళకు ఉంటుంది. చేయు వృత్తి వ్యాపారాల్లో లాభాలు వస్తాయి. శుభకార్యాల కోసం, ధార్మిక కార్యక్రమాల కోసం ధనం వెచ్చిస్తారు. క్షేత్రదర్శనాలు మేలు చేస్తాయి. వివాహప్రయత్నాలు ఫలిస్తాయి. మొదటివారం ఆనందం, రెండోవారం ధనాదాయం, మూడోవారం క్షేత్ర దర్శనం, నాలుగోవారం అశాంతి.



## సింహ రాశి

ఈ రాశివారికి అన్నీ శుభసూచనలే, ప్రతి పనిలో విజయం వరిస్తుంది. స్థిరాస్తులు, ధనాదాయం కలిసివస్తాయి. ఉద్యోగ, వివాహ, క్షేత్ర దర్శన ప్రయత్నాలు అనుకూలం. ఉద్యోగంలో స్థానచలనం. మొదటివారం స్థిరాస్థి యోగం, రెండోవారం దైవదర్శనం, మూడోవారం వివాహ ప్రయత్న జయం, నాలుగోవారం శుభవార్తాశ్రవణం.



## కన్యా రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో ఏ పనిచేసినా అనుకూలంగా ఉంటుంది. తగాదాలకు దూరంగా ఉంటే మంచిది. విదేశీ ఉద్యోగప్రయత్నాలు అనుకూలం. వృత్తివ్యాపారాలు చేస్తున్న వారికి స్వల్ప ధననష్టం కల్గుతుంది. ఆలయ దర్శనం ఆనందాన్నిస్తుంది. మొదటివారం ప్రయత్నజయం, రెండోవారం ఆందోళన, మూడోవారం ఆనందం, నాలుగోవారం దైవచింతన.



## తులా రాశి

ఈ నెలలో పెండింగ్‌లో ఉన్న వ్యవహారాలు, విద్యా, ఉద్యోగ, వివాహప్రయత్నాలు ఓ కొలిక్కి వచ్చి పరిష్కారమౌతాయి. శుభకార్యాలు జరుగుతాయి. దైవదర్శనాలు మేలు చేస్తాయి. కొబ్బరి, వెండి, బంగారు వర్తకులకు ధనాదాయం, చిన్నపిల్లలకు పలు అనారోగ్య సూచనలు, గతంలోని పొరపాట్లు గ్రహపాట్లుగా మారి పలు ఇబ్బందులకు గురిచేస్తాయి. మొదటివారం కార్యజయం, రెండోవారం శుభకార్యం, మూడోవారం ఆనందం, నాలుగోవారం ధనాదాయం.



## వృశ్చిక రాశి

ఈ మాసంలో వీళ్ళకు అత్యంత శుభప్రదం. వెండి, బంగారం, భూమి క్రయవిక్రయాలు వల్ల ధనాదాయం. వివాహ

ప్రయత్నాలు, మధ్యవర్తుల ఒప్పందాలు, పుణ్యక్షేత్ర దర్శనాలు మేలు చేస్తాయి. రైతులకు, మహిళలకు అధికశ్రమతో పనులు పూర్తవుతాయి. మొదటివారం విజయం, రెండోవారం ఒప్పందాలు, మూడోవారం ధనాదాయం, నాలుగోవారం సంతోషం.



### ధనూ రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో విద్యార్థులకు, క్రీడాకారులకు అశాంతి, ఆందోళనలు, మనోవేదనలు ఏర్పడుతాయి. వివాహప్రయత్నాలు, ఉద్యోగంలో విజయం, పరీక్షల్లో ఉత్తీర్ణత ఆనందాన్ని కల్గిస్తాయి. ప్రభుత్వ ఉద్యోగులకు అధికారుల ఒత్తిడి. వైద్యం, రవాణ, రెవెన్యూ తదితర శాఖల ఉద్యోగులకు స్థానచలనం. పిల్లల విద్యకు అధికంగా డబ్బు ఖర్చు చేయవలసి వస్తుంది. మొదటివారం అపనిందలు, రెండో వారం స్థానచలనం, మూడోవారం ఆందోళనలు, నాలుగోవారం విజయం.



### మకర రాశి

ఈ మాసంలో విదేశీయానం, దూరపు బంధువుల కలయిక అనుకూలిస్తాయి. తొందరపాటు వ్యవహారాల వల్ల కార్యవిఘ్నం. విద్యార్థులు ఆత్మస్థైర్యంతో చేసే ప్రయత్నాల్లో విజయం వరిస్తుంది. తల్లిదండ్రులకు ఆందోళన కల్గిస్తుంది. మొదటివారం బంధుప్రీతి, రెండోవారం విజయం, మూడో వారం శుభకార్యం, నాలుగోవారం ఆనందం.



### కుంభ రాశి

ఈ మాసంలో వృథా శ్రమ వల్ల పలు ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది. ప్రతి విషయంలో అనుమానం వల్ల పలు ఇబ్బందులు కలుగుతాయి. దైవదర్శనాలు, ధార్మిక చింతన వల్ల మానసిక ప్రశాంతత లభిస్తుంది. పిల్లల విద్యకై విపరీతమైన ధనం ఖర్చు చేయవలసి వస్తుంది. మొదటివారం మనోవేదన, రెండోవారం ధార్మిక చింతన, మూడోవారం కలహాలు, నాలుగోవారం ధనప్రాప్తి.



### మీన రాశి

ఈ మాసంలో తొందరపాటు నిర్ణయాలు పెద్దల ఆగ్రహానికి గురిచేస్తాయి. వివాహ ప్రయత్నాలు అనుకూలించినా మనోవేదనల వల్ల కొంత కాలం వాయిదాపడతాయి. ఇంట్లో అశాంతి, ఆందోళనలు ఎక్కువై ఇబ్బంది పెడతాయి. మానసిక ప్రశాంతతకై ధ్యానం, యోగం, ధార్మిక చింతనల వల్ల మనోల్లాసం కల్గుతాయి. మౌనమే అన్ని సమస్యలకు పరిష్కారం అన్న విషయం మరవద్దు. మొదటివారం ఆందోళన, రెండోవారం మనోల్లాసం, మూడోవారం విదేశీయానం, నాలుగోవారం ఆనందం.

## నా పై దయచూపవదేమి!

**తిరుమల స్వామీ! నీ దయను చూపవదేమి!**
**బాల్యమంత బావురుమనె బాలారిష్టాలతోటి**
**ఆటలతో పాటలతో నీ పై ధ్యాసను విడిచితి**
**ధ్రువుడికి నీ పై అంత దృఢభక్తి ఏర్పడింది**
**నీ దయతోటి పసివాడికి మంత్రం సిద్ధించింది**
**నా పై దయచూపవేమి? నీ పదదాసిని నేను స్వామీ!**

**చదువులలో ప్రథమస్థానం అందుకుని తీరాలని**
**ఆధ్యాత్మిక రంగంలో అధమస్థితిని చేరుకుంటి**
**నా బ్రతుకే బడిగాతలచితి నీ పై ధ్యాసే విడిచితి**
**చదువులలో మర్మమంతా ప్రహ్లాదుని కందించావు**
**నా పై దయచూపవేమి? నీ పదదాసిని నేను స్వామీ!**

**సంసారపు కెరటాలలో మునగలేక తేలలేక**
**గట్టుకు లోతట్టుకు లాగబడుతూ ఎగబడుతూ**
**ఆర్తితో ఆరాటపడుతూ నీ కోసం ఎదురుచూస్తూ**
**ఎన్నిజన్మలయ్యాయో ఆసరాను అందివ్వు!**
**నా పై దయచూపవేమి? నీ పదదాసిని నేను స్వామీ!**

– డా॥ వి.కృష్ణవేణి

# ఊహకందని అద్భుతం

- తిరువూరు కమలాకర ప్రసాద్




మా నాన్నగారి ఉద్యోగ రీత్యా మేము రేణిగుంటలో ఉండేవాళ్లం. నలుగురు అబ్బాయిల తర్వాత మాకు ఒక చెల్లెలు పుట్టింది. అందరూ మా చెల్లెల్ని చాల అదృష్టవంతురాలు అన్నారు. కానీ మా చెల్లికి పుట్టుకతోనే మోచేతికి కురుపు ఏర్పడి, నిరంతరం చీము, రక్తం కారుతుం దేది. మా అమ్మ, నాన్నలు మా చెల్లిని ఎన్నో హాస్పిటల్స్‌లో పెద్ద పెద్ద డాక్టర్లకు చూపించారు. అయినా అది నయం కాలేదు. ఒకానొక దశలో మోచేతి వరకూ చేయి తీసేయాలి అని చెప్పారు. చెయ్యి లేకపోతే ఎలా? అందునా ఆడపిల్ల అని మా అమ్మ నిత్యం వేదనపడేది.

నేను, మా అమ్మ మా చెల్లిని రోజూ రేణిగుంటలోని ప్రభుత్వ హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళి కట్టు కట్టించి తీసు కుని వచ్చేవాళ్ళం. అలా ఒకరోజు వెళుతున్నప్పుడు అప్పటి రాష్ట్రపతి వస్తున్నారని మమ్మల్ని రోడ్డు పక్కన ఆపేశారు. అప్పటికే ఆయన్ను చూడటానికి ప్రజలు రోడ్డుకు అటుఇటు బారులు తీరి ఉన్నారు. మేము కూడా ఆయన్ను చూద్దామని నిలబడ్డాం. మా పక్కనున్న ఆవిడ ఎవరో మా చెల్లి చేతి కట్టు చూసి "పాపకు ఏమిటమ్మా?" అని అడిగింది. మా అమ్మ విషయం చెప్పింది. దానికి ఆమె స్పందించి, ఏడుకొండలస్వామికి ముడుపు కట్టు. తప్పక తగ్గుతుంది అని చెప్పింది. నిజంగా ఆ మాటలు ఆ దేవుడే పలికించాడేమో అనిపించింది.

ఆ రోజు ఇంటికి రాగానే, మా అమ్మ శ్రీ వేంకటేశ్వర స్వామికి పూజ చేసి, "మా అమ్మాయికి నయమైతే 'వెండి చెయ్యి' చేయించి హుండీలో వేస్తాం స్వామీ" అని మొక్కుకుంది. ముడుపు కట్టిన అనతికాలంలోనే మోచేతి నుంచి చీము నెత్తురు కారటం క్రమేపి ఆగిపోయింది. చెయ్యి సక్రమంగా అయింది. అనుకున్న ప్రకారం మేమంతా తిరుమల వెళ్ళి వెండిచెయ్యి హుండీలో వేసి మొక్కు తీర్చుకున్నాం. మా చెల్లెలు పద్మావతి ప్రస్తుతం హైదరాబాదులో పిల్లాపాపలతో హాయిగా జీవిస్తోంది.

ఆ దేవదేవుని కృప ఉంటే మానవుల కష్టాలు తొలగి పోతాయని మా నమ్మకం. మొక్కిన వారి మొర ఆలకించే శ్రీ వేంకటేశ్వరుని లీలలు ఊహకందని అద్భుతాలు.



**తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి వారి బ్రహ్మోత్సవాలు**

2010, మే 19 నుండి 28 వరకు

| తేదీలు | వారం | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 19-5-10 | బుధ | -- | అంకురార్పణం |
| 20-5-10 | గురు | ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 21-5-10 | శుక్ర | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 22-5-10 | శని | సింహవాహనం | ముత్యపుపందిరి వాహనం |
| 23-5-10 | ఆది | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 24-5-10 | సోమ | మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 25-5-10 | మంగళ | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 26-5-10 | బుధ | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 27-5-10 | గురు | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| 28-5-10 | శుక్ర | చక్రస్నానం | ధ్వజావరోహణోత్సవం |




ధారావాహికం - 88

**(ఆలయ నిర్వహణలో స్థానత్తారులు కీలకపాత్ర పోషించారు. వారికి సమాజంలో గౌరవస్థానం ఉండేది. స్థానత్తారుల స్థానిక అధికారాలు కాలానుగుణంగా స్థాయి మార్పు చెందుతూ వచ్చాయి. ఇప్పుడు ప్రస్తుతం ఉన్న ధర్మకర్త పదవీమూలాన్ని స్థానకర్తల కర్తవ్య నిర్వహణలో చూడవచ్చును. అలాగే రామానుజులవారి కైంకర్య ప్రాభవాన్ని ఇక్కడ ముచ్చటించడమైనది.)**

**7. ఈ) స్థానత్తారుల అధికారహోదా ధర్మకర్తల అంతస్తునకు ఎదుగుట :**

మొట్టమొదటిసారిగా క్రీ.శ.1387 సంవత్సరంలో కొల్లి కావలిదాసర్ ఏర్పాటు చేసిన ఆధారద్రవ్యం కోసంచేసిన దానాన్ని స్థానత్తారులు అంగీకరించి అందుకోసం ఒక శిలాశాసనాన్ని కూడ ప్రకటించడాన్ని చూడవచ్చు. తిరుపతి శ్రీవైష్ణవులలో ఒకడైన పెరుమాళ్ అని మరోపేరు కలిగిన కొల్లి కావలిదాసర్ వారికి సానుకూలంగా ప్రతిస్పందించి, అమలుపరచటానికి గాను ఇచ్చిన వివరాలుగల ఈ శాసనం శా.శ.1308వ సంవత్సరం క్షయనామ సంవత్సరం మీనమాసం శుక్లపక్ష పంచమితిథి, నాటి కృత్తికానక్షత్రయుక్త ఆదివారంనాడు తిరుమల స్థానత్తారులు ప్రకటించారు. ఇందలి వివరాలు-4-10 : (శాసనంలో 4వ లైను నుండి 10వ లైను వరకు భావం)-- శ్రీభండారానికి 1000 పణాలు ఇచ్చి, ఆ మూలధనం మీద లభించే వడ్డీతో తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామికి ప్రతిదినం ఒక తిరుబ్బోనక సమర్పణకు తన పేరు మీద జరగాలని, ఈ సమర్పణ ఫాల్గుణమాసం నుండి ప్రారంభించి, ప్రతిదినం జరగాలనీ, మరియు సూర్యచంద్రాదులున్నంతవరకు ఈ సమర్పణ జరగాలనీ కోరుకున్నాడు.

ఇందులకు కావలసిన పదార్థాలు-ఒక మరక్కాలు చాలుక్యనారాయణన్ కల్ కొలతతో కొలిచిన బియ్యం, ఒక అళక్కు నెయ్యి, కూరగాయలు, ఉప్పు, మిరియాలు, 10-12 : (శాసనంలో 10వ లైను నుండి 12వ లైను వరకు భావం)- స్వామికి నివేదించిన ప్రసాదంలో నాలుగవ వంతునకు సరియగు 1 నాళి భాగాన్ని దాతకు ఇవ్వాలి. ఈ ప్రకారం వంశ పారంపర్యంగా అతని వంశీయులు సూర్య చంద్రాదులున్నంత వరకు అనుభవింతురు గాక!

12-13: (శాసనంలో 12వ లైను నుండి 13వ లైను వరకు భావం) ఇది తిరుమలదేవాలయ గణంకాధికారియైన తిరునిన్రఊర్ ఉడయార్‌చే శ్రీవైష్ణవుల అనుమతితో రాయబడినది. శ్రీవైష్ణవులు దీనిని కాపాడుదురు గాక!

శాసనసంఖ్య 57-టి.టి., 52-జి.టి. సంఖ్య శాసనాలు మార్గశిరమాసంలో 10 రోజులు దేవాలయంలో తిరుప్పావై పఠన సందర్భంలో ఆహారనైవేద్యం సమకూర్చేందుకు ముల్లై తిరువేంకట జీయరు1200 పణాలను మూలధనంగా ఏర్పాటు చేసినపుడు స్థానత్తారులు ఆ ధనాన్ని గ్రహించిన వైనాన్ని తెలుపుతున్నాయి.

'పుణ్యప్రదమైన శా.శ.1312వ సం॥ ప్రమోదూతనామ సంవత్సరం మార్గశిరమాసంలో 11వ దినం, తిరుమలలోని అరిశనాలయం తిరునందనవనం(పూదోట)కు నిర్వహణాధికారియైన ముల్లై తిరువేంకటజీయర్‌వారి అభిమతానుసారం తిరుమల స్థానత్తారు అయిన మాచే నిర్వహించబడిన శిలాశాసనం ఇది.

మార్గశిరమాసంలో మధ్య పదిరోజులూ తిరుమలలో శ్రీనివాసుడు మరియు నాచ్చియారుల సన్నిధిలో వినికిడి దూరంలో ఉండి జరిపెడి తిరుప్పావై(ఆండాళ్ రచన) ఉత్సవం తిరువోలకం (స్వామి కొలువు) కోసం అవసరమైన వస్తు సంభారాల సమర్పణకు ఏర్పాటు చేయడమైంది.

‘ఈ వస్తుసంభారాలను సమకూర్చు కోవడానికిగాను, వలసిన ధనానికై వడ్డీరూపాన వచ్చేందుకు ఈ రోజు 1,200 పణాలను దేవాలయ శ్రీభండారంలో మూలధనాన్ని మీరు ఏర్పాటు చేశారు.

‘పైన తెలిపిన విధంగా 1200 పణాల మూలధనంపై వడ్డీరూపాన వచ్చే ధనాన్ని వినియోగించి, ముందు తెలిపినట్లు శ్రీభండారంనుండీ ప్రతిసంవత్సరం వలసిన వస్తుసంభారాలు సమకూర్చబడుతుంది. ఈ విధంగా సూర్యచంద్రాదులున్నంత వరకు జరుపబడగలదు.

‘శ్రీవైష్ణవుల అనుమతితో, దేవాలయ గణాంకాధికారి తిరునిన్రవూర్ ఉడయాన్‌చే ఈ శాసనం లిఖించబడింది. శ్రీవైష్ణవులు దీనిని కాపాడుదురుగాక!’

అటు తరువాత ఆధారద్రవ్యం కోసం చేసిన దానాలను, బహూకరించబడిన ధనకనక వస్తువాహనాలను దేవాలయం తరపున స్వీకరించడానికి ఆరంభించిన ఈ స్థానత్తారులు శాసనాలలో ధర్మకర్తలుగా ప్రత్యక్షమయ్యారు. శిలాశాసనాలు రాతి చెక్కడాలకు తిరునిన్రవూర్ ఉడయాన్ అని పిలిచే దేవాలయ గణాంకాధికారి బాధ్యత వహించడం జరిగింది.

**7. ఉ) దేవాలయ గణంకాధికారుల వ్యవస్థ :**

ఈ దేవాలయాల గణంకాధికారుల వ్యవస్థ లేక తిరు నిన్రవూర్ ఉడయాన్ అనే పదం ప్రప్రథమంగా శా.శ.1301 సంవత్సరం నాటి శాసనసంఖ్య 67–టి.టి. పరిచయం చేస్తోంది. ఈ శాసనం ఇలా తెలియజేస్తోంది.

‘తిరుపతి శ్రీవైష్ణవులలో ఒకడైన అలగప్పిరనార్ తిరుక్కళి కన్రిదాసర్ ఈ ఖర్చులకు సరిపోయే ఆదాయాన్ని వడ్డీ రూపాన సమకూర్చగలంతటి మూలధనం 400 పణాలనూ మరియూ అప్పపడికి, తిరుక్కణ్ణామడైకినీ చేర్చి 50 పణాలనూ వెరసి మొత్తంగా 450 పణాలను ఈ దినాన శ్రీభండారానికి చెల్లించాడు.

‘450 పణాలను శ్రీభండారంలో చెల్లించినట్లు ధృవీ కరించబడగానే, పైన తెలిపిన వివరాలప్రకారం అన్ని వస్తు సంభారాలను శ్రీభండారం నుండి సరఫరా చేయబడతాయి. శాశ్వతంగా, సూర్యచంద్రాదులున్నంతవరకు ఇక్కార్యం నెరవేర్చ బడగలదు.

‘ఈ విధంగా శ్రీవైష్ణవుల అనుమతితో ఈ (శాసనాన్ని) దేవాలయ గణంకాధికారి తిరునిన్రవూర్ ఉడయాన్‌చే లిఖించ బడింది. శ్రీవైష్ణవులు దీనిని కాపాడుదురు గాక!’

ఇటు తరువాతికాలం నుండీ దేవాలయ గణంకాధి కారులు తప్పనిసరిగా శాసనాలలో కనిపిస్తారు.

**7. ఊ) దేవాలయ స్థానత్తారుల హోదాలో మార్పునకుగల కారణాలు :**

దేవాలయ కార్యనిర్వాహకులైన స్థానత్తారులు దేవాలయ ధర్మకర్తలుగా రూపుదిద్దుకోనే విషయం గురించి నాటి శాసనాలు వివరాలు తెలుపడం లేదు.

కాని, శాసనాలు ప్రకటింపబడిన కాలాన్ని పరిగణ లోనికి తీసుకొనినపుడు యాదవరాయరుల పతనానంతరం శ్రీరంగనాథయాదవరాయలు తిరుమల మీద తన ఆధిపత్యాన్ని ఇంకనూ నిలువదొక్కుకొని ఉండిన ఆ కొద్దికాలంలో వెలువడిన శాసనాలలో ప్రప్రథమంగా దేవాలయ గణంకాధికారి తిరునిన్ర వూర్ ఉడయాన్‌పేరు చోటుచేసుకున్నది. బహుశః యాదవరాయ రుల పతనానంతరం దేశంలో ఏర్పడిన రాజకీయ అనిశ్చిత కారణాల వలన, దేవాలయానికి సంబంధిత రికార్డుల సంరక్షణ తదితర నిర్వహణకోసం అర్హతకలిగిన గణంకాధికారి అవసరం ఏర్పడి ఉంటుంది. అంతేకాకుండా రాజుకు దేవాలయ వ్యవహా రాలపై రాజు పట్టు తగ్గిపోయినందున దేవాలయ స్థానత్తారునే ధర్మకర్తగా నియమించవలసిన అవసర మేర్పడి ఉంటుంది. ఈ ఏర్పాటే కాలక్రమమున స్థిరపడి ఉంటుంది.

బహుశః ఈ కారణంచేతనే కావచ్చును ఈ దేవాలయ స్థానత్తారులు సుమారుగ క్రీ.శ.1380 సం॥ జనవరికి కొంత ముందుగానే ఒక తిరునిన్రవూర్ ఉడయానును తిరుమలకు తీసుకువచ్చి ఉంటారు. యాదవరాయరులకాలంలో కేవలం రాజకార్య నిర్వాహకులుగ మాత్రమే వ్యవహరించిన ఈ దేవాలయ స్థానత్తారులు క్రీ.శ.1387 సం॥నాటికి (శాసనం సంఖ్య 53–జి.టి) పరిస్థితుల ప్రాబల్యంవలన దేవాలయ ధర్మ

## హృషీకేశ్, నారాయణవనం శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివార్ల బ్రహ్మోత్సవాలు

| తేదీలు | వారం | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 24-5-2010 | సోమ | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 25-5-2010 | మంగళ | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 26-5-2010 | బుధ | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 27-5-2010 | గురు | సింహవాహనం | ముత్యపుపందిరి వాహనం |
| 28-5-2010 | శుక్ర | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 29-5-2010 | శని | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 30-5-2010 | ఆది | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 31-5-2010 | సోమ | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 01-6-2010 | మంగళ | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| 02-6-2010 | బుధ | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం ద్వాదశారాధనం, ఏకాంతోత్సవం |

కర్తలుగ రాణించారు. దేశపరిపాలకులెవరైనప్పటికీ ఆ నాటికి ఉన్నటువంటి రాజకీయ పరిస్థితులలో దేవాలయ వ్యవహారాలను గురించి ఆలోచనచేసే సావకాశం పాలకులకు ఉంటుందని భావించలేం. పాలకులైన యాదవరాయరుల ప్రభావం సుమారుగ క్రీ.శ.1100 సం॥న ఘట్టిదేవునితో ప్రారంభించి క్రీ.శ.1360వ సంవత్సరం వరకు సుమారు రెండున్నర శతాబ్ద కాలం ఉండిందనవచ్చును. తరువాత వచ్చినవారికి భక్తి ప్రపత్తులు కలిగి ఈ దేవాలయంతో ఆత్మీయతను పెంపొందించుకోవలసి ఉన్న మధ్యకాలంలో దేవాలయ స్థానత్తారులు మంచి నడవడి కలిగి ఉన్నత వ్యక్తిత్వం కలిగినవారై శోభిల్లారు. స్వయంగా సింగయదణ్ణాయకుడే ఎంతో వినయ పూర్వకంగా స్థానత్తారును సమీపించాడు కదా! తిరువేంకటనాథయాదవరాయలు సహితం స్థానత్తారులయందు తనకుగల గౌరవాన్ని ప్రకటిస్తూ, తన శాసనాలను వారికి వినిపించి వారి అనుమతిని పొందగోరు వానివలె గోచరిస్తాడు. స్థానత్తారు ధర్మకర్తలుగ వ్యవహరించడానికి అర్హతను సంతరించుకొనియుండిన విషయం సూచించే ఒక శాసనం ఇప్పట్టున గమనార్హం. అది తిరుమలలో పడికావలి గోపురం ఉత్తరగోడ (ఎడమ తట్టు లోవైపున) అడుగున పీఠభాగమందు సంస్కృతంలో (గ్రంథలిపి) రాయబడి ఉన్నది. ఆ శాసనం (సంఖ్య 48-టి.టి.)లో విషయమిట్లున్నది.

........... ఉత్తముడైన రాజు చనిపోయినందున ..... ఈ సక్రమవిధానం అవలంబింపబడింది. ఇది బహుశః కడపటి రాజైన యాదవరాయలు చనిపోగా జరిగిన కార్యవిధానాన్ని గురించి సూచిస్తున్నది.

స్థానత్తారులు ఉపయుక్తమైన దేవస్థాన ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్నప్పటికినీ ప్రభుత్వం ప్రకటించే శాసనాలలో ఈ స్థానత్తారు ప్రసక్తి లేకపోవుట గమనార్హం. ఇందులకు ఉదాహరణగా శ్రీ వీరప్రతాప దేవరాయ మహారాజు ధర్మశాసనాన్ని (శాసనం సంఖ్య188-టి.టి.) పేర్కొనవచ్చును. కన్నడభాషలో రచించిన ఈ శాసనంలో రాజు ఈ దేవాలయాన్ని శా.శ. 1351వ సంవత్సరం సౌమ్యనామ సంవత్సరం శుక్లపక్షదశమి, సోమవారంనాడు (క్రీ.శ.5-12-1429) దైవదర్శనార్థం వచ్చిన సందర్భాన్ని గురించి వివరించే ఈ శాసనం బంగారు వాకిలి

పై నాగవాసంలో చెక్కబడి ఉన్నది. (తిరుమల ఆలయ ప్రధాన ద్వారం వాకిలి తలుపులు మలాము చేసిన రాగిరేకుతో కప్పబడియున్నది.) రెండువేల రెండువందల హొన్నులు (బంగారు) ధనాన్ని రాజభండారంనుండి చంద్రగిరి భండారానికి తరలించబడింది. ఇంతమాత్రమే కాదు, తొమ్మిదిరోజుల పర్యంతం ఉత్సవాన్ని ప్రతి సంవత్సరం జరిపేందుకును, ప్రతి దినం జరిపే కొన్ని సేవాకైంకర్యాల నిర్వహణకోసం అదనంగా 3 గ్రామాలను సర్వమాన్యంగా దానం చేసినట్లు ఈ శాసనం తెలియజేస్తోంది. ఈ ఆస్తులకు ధర్మకర్తలుగా స్థానత్తారులు పేర్కొనలేదు. ఇదేవిధంగా విసన్నదేవరాయల కుమారుడు సిరిగిరేశ్వరుడు రత్నఖచిత బంగారు పట్టాన్ని శ్రీవేంకటేశ్వరునకు (క్రీ.శ.1-7-1430) (శాసనం సంఖ్య 99-టి.టి.) సమర్పించినపుడు సంస్కృతంలో (గ్రంథలిపి) వేసిన శాసనంలో కూడ స్థానత్తారుల ప్రసక్తి రాలేదు.

తెప్పద నాగయనాయకరు (ముద్దయ నాయకుని కుమారుడు) కన్నడంలో వేసిన ధర్మశాసనం (సంఖ్య 100-టి.టి.)లో 3 బంగారుపళ్ళాలను తనపేరిట తయారుచేయించ దానికి 300 హొన్నులను మరియు 100 పొన్నులను ప్రతిదినం స్వామివారికి రెండు పుష్పమాలలను సమర్పించేందుకు, రెండు బరివన మరియు ఎనిమిది ఉపార......దానం చేశాడు. స్థానత్తారులు ఈ దానానికి చెందిన షరతులను పాటింతురుగాక! (12-1-1443).

**7. ఋ) స్థానత్తారుల సభాసంఘ సభ్యులు :**

సమాలోచన సభ్యుల గురించి కాని, స్థానత్తారుల కార్య నిర్వాహక సభ్యుల గురించి కాని స్పష్టంగా, నిర్దుష్టమైన ప్రస్తావన చేసిన వైనం కానరాదు. క్రీ.శ.1360 సంవత్సరం తరువాత ఈ సంఘం సుస్పష్టంగా నిర్దుష్టరూపును సంతరించుకోవడానికి సుమారు 30 సంవత్సరాలకాలం పట్టిఉంటుంది. యాదవరాయరులు దేవాలయంమీద తమ సార్వభౌమాధిపత్యం పోగొట్టుకొనిన తరువాత శ్రీరంగనాథస్వామి శ్రీరంగానికి కొనిపోయిన తదనంతరం ఈ దేవాలయానికి సంబంధించిన జమాఖర్చులవివరాలు, ఆస్తులను గురించిన వ్యవహారాలను చక్కదిద్దాలని గుర్తిండం జరిగింది. తత్ఫలితంగా దేవాలయానికి లెక్కలను వ్రాసే గణంకాధికారులు నియమింపబడ్డారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని 1379-80 సంవత్సరంలో తిరునిన్రఉర్ ఉడైయైన్ దేవాలయ గణంకాధికారిగా రంగం మీదికి వచ్చాడు. పదేండ్ల తరువాత 1390సం॥లో ఈ స్థానత్తారు స్వయం ప్రతిపత్తిగల అధికారసంఘంగా రూపుదిద్దుకొంది. ఈ సభా సంఘసభ్యుల గురించి, ఇంతకు పూర్వమే పరిచయమైన 67-టి.టి. శాసన సంఖ్యను పరిశీలిస్తే తెలుస్తుంది. ఇందులో దానకర్తకి వచ్చేటటువంటి నాలుగవవంతు ప్రసాదం, భక్తులకు పంచిపెట్టడంలో అవలంబించబడిన విధానం తెలుపబడింది. అంతే కాకుండా ప్రసాదభాగం 12 నిర్వాహకుల మధ్య ఈ క్రింది తెలుపబడిన నిష్పత్తిలో పంచి పెట్టబడిందని తెలుస్తోంది.

తిరుపతి శ్రీవైష్ణవులు - 4మంది; తిరుచానూరు సభైయ్యారు- తిరుచానూరు 3 పంచాయితీ సదస్యులు; నంబిమార్-1 అర్చకుడు; కోయిల్ కేళ్కుం జీయర్ - 2 (చిన్నజీయరు, పెద్ద జీయరు); కోయిల్కణక్కు తిరునిన్ర ఉడయార్ - 2 (ఆలయ ఆస్తి గణాంకాధికారి పర్యవేక్షులు). తిరుపతి దేవాలయంలో కూడ ఈ నిష్పత్తిలోనే నిర్వాహకులు ఉండేవారని తెలుస్తోంది.

దీన్నిబట్టి చూస్తే స్థానత్తారులు మొత్తం 12 మంది ఉండేవారని తెలుస్తోంది.

**8) దేవాలయంతో శ్రీరామానుజులవారికి గల సన్నిహితత్వం, ప్రభావం :**

సంప్రదాయికంగా కారణజన్ముడని భావించే శ్రీరామానుజులవారు తిరుమల దేవాలయం నందు అనేక సంస్కరణలు చేపట్టేందుకు కారకుడయ్యాడని చెబుతారు.

11వ శతాబ్దం ద్వితీయార్థం నుండి 12వ శతాబ్దం ప్రథమపాదం వరకుగల ఈ మధ్యకాలంలో వైష్ణవ మత సిద్ధాంతాల ప్రవక్తయు, విశిష్టాద్వైత ప్రతిపాదకుడును అయిన శ్రీరామానుజులవారు తన్మతవ్యాప్తికై పాటుపడ్డారు. ఈ మతం యొక్క మూలసిద్ధాంతం దేవునియెడల, తోటిమానవులయందు భక్తిప్రపత్తులతో ప్రేమను కలిగియుండడం. త్రిమూర్త్యాత్మకమైన శ్రీమహావిష్ణువే పరతత్త్వం. జీవితాంతం సేవాకైంకర్యాలలో

మునిగి ఉండడం, అత్యంతభక్తితో విష్ణువును సేవించడం ముక్తిని పొందేందుకు సులభమార్గమని వీరు ఆచరణ పూర్వ కంగా బోధించారు. వీరి ధార్మికోపన్యాసాలు అనేకమంది ప్రజలను వైష్ణవ మతానుయాయులనుగా చేయగలిగింది. "శ్రీవైష్ణవులుగ పిలువబడు ఈ నూతనసమాజం తన పరిధి లోనికి బ్రాహ్మణులనేకాక అన్ని వర్ణాలవారిని ఇముడ్చుకొన గలిగింది. వర్ణభేదం, కులభేదంకాని స్త్రీ, పురుష భేదంకాని లేకుండా అందరికీ ఈ మతంనందు ఆశ్రయం లభించింది."

అనంతార్యుడు సంకలనం చేసిన శ్రీవేంకటాచల ఇతి హాసమాల గ్రంథంలో తిరుపతిలో రామానుజుడు చేసిన పనుల గురించిన వివరాలున్నాయి. తన తల్లికి అన్నగారు, తనకు మేనమామ అయిన తిరుమలనంబి కారణాన రామానుజుడు తిరుపతిలో తన కార్యకలాపాలకు రంగస్థలంగా చేసుకున్నాడు. తిరుమలనంబి తనకు తాత మరియు గురువు అయిన ఆళవం దారు అభిమతం ప్రకారం తిరుమలకొండమీద వెలసియున్న దైవానికి సేవ చేయడం కోసం అవివాహితులైన తన ఇరువురు సోదరీమణులతో తిరుపతిలో స్థిరపడ్డాడని తెలుస్తోంది. ఇక్కడికి కొద్దిదూరంలోనే ఉన్న శ్రీపెరంబుదూరుకు చెందిన రామానుజుడి తండ్రి తిరుమలనంబి సోదరీమణులలో ఒకరి పాణిగ్రహణం చేశాడు. ఈ దంపతుల తనయుడైన రామానుజుడు తన తల్లితో తిరుపతిలోని తన మేనమామ ఇంటికి వస్తుండడం సంభవించి నది. మొదటిమారు తిరుపతికి విద్యావ్యాసంగ నిమిత్తమై వచ్చాడు. ఆ కాలంలో వైష్ణవ ఆచార్యుడుగా పొందేందుకు కావలసిన విద్యలలో ఒకటియైన రామాయణంలోని నిగూఢరహ స్యార్థ తత్త్వాన్ని గ్రహించేందుకు తిరుపతికి వచ్చి తన మేనమామ యైన తిరుమలనంబి గురుత్వంలో అంతేవాసియై ఒక సంవత్సరం పాటు విద్యావ్యాసంగం గావించాడు. తరువాత రామానుజుడు శ్రీరంగానికి చేరుకున్నాడు.

మరల రెండవమారు తిరుపతికి రావలసిన పరిస్థితి కొంతకాలం తరువాత ఏర్పడింది. ఆదినుండి తిరుపతి(తిరుమల క్షేత్రం)లో వైఖానసఆగమ ప్రకారం పూజావిధానం సాగు తుండేది. కొన్ని శతాబ్దాల కాలానంతరం పూజావిధానంలో అభిలషణీయం కాని పద్ధతులు చోటుచేసుకోవడం జరిగింది. రామానుజులు తిరుపతి దేవాలయమునందు జరిగే నిత్యదైనం దిన పూజా విధానంలోను, ఉత్సవనిర్వహణ వ్యవహారాలలోను సంస్కరణలు ప్రవేశపెట్టి, సక్రమపద్ధతిలో జరిగే ఏర్పాటు చేశాడని వేంకటాచల ఇతిహాసమాల గ్రంథం తెలుపుతోంది. అప్పటికి ఇంకా తిరుమలనంబి బ్రతికి ఉన్నాడు. తిరుపతిలోనే నివసించవలసిందిగా రామానుజాచార్యులవారిచే ఆదేశించ బడిన అనంతార్యులవారు స్వామి సేవాకార్యక్రమాలు దేవాల యంలో సక్రమంగా జరిపించేటట్లు తగు శ్రద్ధవహిస్తూ ఉండే వారు. వయోభారంచే కృంగియున్న తిరుమలనంబి మార్గదర్శ కత్వంలో అనంతార్యులవారు దేవాలయ కార్యక్రమాలను నడి పించేవారు.

రామానుజులవారు మరొకమారు తిరుపతికి వచ్చి యుండినట్లు తెలుస్తోంది. బహుశః ఇదే తిరుపతికి కడపటి తీర్థయాత్ర అయి ఉంటుంది. ఎందుకంటే ఈ సరికి, వయో భారంతో ఉన్నారు. వెనుకటిమారు తానిక్కడికి వచ్చినపుడు చేసిన సంస్కరణల విషయంలో ఈసారి వచ్చినపుడు అభివృద్ధికర మైన మార్పులను చేశాడు. దేవాలయ పరిపాలనా కార్యక్రమ నిర్వహణను నిష్కామకర్మగా ఆచరించే బాధ్యతను ఒక సన్యాసికి అప్పజెప్పియున్నాడు. ఇతని కార్యభారం తగ్గించే ఉద్దేశ్యంతో ఇద్దరు లేక ముగ్గురు అవివాహితులను సహాయకులుగా తీసు కొనేందుకు అనుమతించాడు. వీరు కొన్ని ప్రత్యేక కార్యక్రమా లను నిర్వహించవలసియున్నది. ప్రబంధపఠనం సక్రమంగా గావించే పద్ధతిని ప్రవేశపెట్టారు. ఈ కార్యక్రమాన్ని పర్యవే క్షించేందుకు ప్రత్యేకంగా ఒక వ్యక్తిని నియమించే ఏర్పాటు చేశాడు. తరువాతి కాలంలో ఆధిపత్యం వహించిన ఈ సన్యాసికి శఠకోపయతి అన్న బిరుదనామం వచ్చింది. ఇతనికి నలుగురు అవివాహిత శిష్యులు సహాయకులుగ నియమింపబడిరి. దేవా లయ కార్యక్రమ నిర్వహణ బాధ్యత వీరియందుంచబడింది. వీరందరిపైనను పైవిచారణకర్తగాను, పరిశీలనాధికారిగాను యాదవరాజు నియమితుడయ్యెను. ఇతడు దేవాలయానికి సంబంధించిన అన్ని వ్యవహారాలలోను, అన్ని విషయాల యందునూ 66 సంవత్సరాలు పైబడిన వయస్సుకల అనంతా ర్యుడు ననుసరించి కార్యక్రమాలు నడిపించాలి.

*(ఇంకా ఉంది)*

# దక్షిణకాశి ధర్మపురి

- డా॥ సంగనభట్ల నరసయ్య

కరీంనగర్ జిల్లాలోని సుప్రసిద్ధ నారసింహ క్షేత్రమైన ధర్మపురి అత్యంత ప్రాచీనమైన పుణ్యక్షేత్రం. ఇక్కడ నరసింహునికి పలు దేవాలయాలుండటం విశేషం. అందుకు కారణం ఆలయం దాడుల వల్ల ధ్వంసమైనపుడు అక్కడ తిరిగి మరో ఆలయ నిర్మాణం చేసే ప్రక్రియ కొనసాగింది. అంతేకాక ఈ ప్రదేశం శివారాధక కేంద్రంగా (హరిహర క్షేత్రంగా) 11వ శతాబ్దంనాటికే ప్రసిద్ధం.

ఈ గ్రామానికి తూర్పున ప్రవహించే గోదావరి దక్షిణాభిముఖి. సహజంగా నదులు పడమటి కనుమల్లో పుట్టి తూర్పు వైపు ప్రవహిస్తూ బంగాళాఖాతంలో కలుస్తాయి. కానీ ఇక్కడ మాత్రం గోదావరి వంపు తిరిగి ఉత్తరం నుండి దక్షిణంకు ప్రవహిస్తుంది.

గోదావరి పుట్టిన చోటు నుండి సముద్ర సంగమం వరకు అనేక దిశలు మారుస్తుంది. ఇందులో దక్షిణ ముఖంగా పారిన చోట అత్యంత శ్రేష్ఠమని స్కాందపురాణం తర్వాత సింహస్థ మాహాత్మ్యం అనే గ్రంథంలో ఉంది.

**దక్షిణాముఖీ గంగా, తత్రదానం సుదుర్లభమ్,**
**కాళిందీ పశ్చిమా పుణ్యా, గంగా చోత్తర వాహినీ.**

గంగ (గోదావరి) దక్షిణంగా, కాళింది పశ్చిమంగా, గంగానది ఉత్తరంగా పారితే శ్రేష్ఠమని అక్కడ దానాలు సుదుర్లభమని పై శ్లోకం తెలుపుతుంది. అంతేకాక ధర్మపురి వెయ్యి ఏండ్ల క్రితం నుండే చాలా ప్రసిద్ధి పొందిందని చరిత్ర చెబుతున్నది. తూర్పున గోదావరి ఉండటం వల్ల, పురవాసులు ఉదయమే స్నానాదికాలకు, సంధ్యావందనాదులకు వెళితే ఉదయభానుడు కిరణాల్తో నదీ జలాల్లో మెరుస్తూ స్వాగతిస్తాడు. సూర్యునికి అభిముఖంగా (ఊరు వెన్నుగా) అర్ఘ్యాదులివ్వవచ్చు. ధనాధిపతియైన కుబేరుని ఉత్తర దిశ నుండి సంపదలు (పంటలు) ఇచ్చే జల ప్రవాహంతో గోదావరి వచ్చి, యమ ప్రీతిగా దక్షిణదిశకు పారడం ఈ గ్రామంలో విశేషం.

ఏ క్షేత్రానికీ లేని రెండు స్థలమాహాత్మ్య పురాణ గ్రంథాలు ధర్మపురికి ఉన్నాయి. ఒకటి బ్రహ్మాండ పురాణాంతర్గతం 105 అధ్యాయాలు, 3,500 పై చిలుకు శ్లోకాలు గల్గి శా.శ.850 (క్రీ.శ.928) నాటి రచన. మరొకటి స్కాంద పురాణాంతర్గతం క్రీ.శ.1767లో రాసిన (కాపీ చేయబడిన) తాళ పత్రం. వీటి ప్రకారం ఈ ప్రాచీన పుణ్యక్షేత్రం దత్తాత్రేయ ముని ధర్మపురి గోదావరి తీరంలో మున్యాశ్రమం స్థాపించి, అక్కడ జన నివాసం కల్పించి ఉంటుండగా విదర్భరాజు అక్కడికి వచ్చినట్టు, అతనే ధర్మపురీశుని ప్రార్థించి, ప్రసన్నుని చేసుకుని ఈ గ్రామం నిలిపినట్లు ఇవి తెలియజేస్తున్నాయి. చింతామణి చెరువు (వరాహతీర్థం), శివుని లింగాన్ని శ్రీరాముడు స్థాపించి



శ్రీ లక్ష్మీనరసింహస్వామి, ధర్మపురి

నట్టు, దుర్మార్గులైన వారి పాపహరణం వంటి కథలు, స్థల మాహాత్మ్యాలున్నాయి.

హైహయవంశ అయ్త వర్మరాజు ధర్మపురి బ్రాహ్మణుడైన రేవణయ్యకు భూదానం చేసిన డెక్కలబండ శాసనం (క్రీ.శ.850), జన వల్లభుని కుర్క్యాల శాసనం (క్రీ.శ.945)లో పంప మహాకవికి అరికేసరి వేములవాడ చాళుక్య రాజు ధర్మపురాన్ని దానం చేసిన అతి ప్రాచీనాంశాలతో, ధర్మపురి చరిత్రలో స్థానం సంపాదించినట్లుగా వ్యక్తమౌతున్నది. ఇక్కడ నరసింహాలయం పక్కనే గల ప్రాచీనాలయం రామలింగేశ్వరాలయం పేరుతో శివుని గుడి ఉంది. దీంట్లో బాదామీ చాళుక్యుల నాటి గణేశ విగ్రహం, కళ్యాణి చాళుక్య ఆరవ విక్రమాదిత్యుని శాసనం (క్రీ.శ.1076 ప్రాంతం), అదే బండకు కాకతీయ గణపతి దేవ చక్రవర్తి శాసనం (క్రీ.శ. 1246 పరాభవ కార్తీక త్రయోదశి) ఉన్నాయి. 11వ శ.నాటి సత్యవతి దేవి ఆలయం. క్రీ.శ.1448లో నారసింహాలయం ధ్వంసమైనాక తిరిగి కట్టుకున్న 60 స్తంభాల గుడి నరసింహాలయం, దాని ధ్వంసం తర్వాత కట్టిన 17వ. శ. నాటి యోగ (పాత) నరసింహాలయం (నేటి ప్రధానాలయం), క్రీ.శ.1803లో నిర్మించిన కొత్త (ఉగ్ర) నరసింహాలయం, (నేటి ప్రధానాలయం), క్రీ.శ.18వ శ.నాటి వేణుగోపాలస్వామి ఆలయం ఈ ప్రదేశంలోనే ఉన్నాయి. 15వ శ. నిర్మాణమైన, అక్కపెల్లి రాజేశ్వరాలయం 11వ శ. కళ్యాణి చాళుక్యుల నాటి గౌతమీశ్వరాలయం, (గోదావరితీరంలో) ప్రాచీనాలయాల వరుసలోనివి. దత్తాత్రేయ, రామాలయ, సంతోషి మాత, ఆంజనేయస్వామి ఆలయాలు, ఇంకా అనేకంగా చిన్న చిన్న దేవాలయాలు బ్రాహ్మణులు తమ వీధుల్లో నిర్మంచుకున్న గ్రామ రక్షక గుడులు. నిత్యం భక్త జనులకు కన్నుల పండుగగా, ఆర్తిని పోగొట్టేవిగా ఉండటం వల్ల ధర్మపురి 'ఆలయ నగరంగా' పేరు గాంచింది.

ఇక్కడ ఉన్న మఠం రేగడ నేలలు, నారాయాశ్రమం మధ్య యుగాలనాటి యజ్ఞయాగాది క్రతువులకు సాక్ష్యాలుగా ఉన్నాయి. గంజికోనేరు పేరుతో ఉన్న స్థలం నాటి అన్నదానాలకు సాక్షీభూతంగా నిలిచింది.

రామగిరి దుర్గాధిపతి ముప్పభూపాలుని మంత్రి కందణమాత్యుడు, షితాబుఖాన్ మాళివినుము పల్లి పెద్దనామాత్యుడు, వెలిగందుల రాజు తాండ్ర జగపతిరావు, ఉదయగిరి సేనాని జూపల్లి ధర్మరాయుడు, రేచర్ల వెలమ ప్రభువులు ఇనుగంటివారు, జువ్వాడివారు, తానీషా కొలువులోని అక్కన్న మాదన్నలు, గూడూరి రాజబహద్దర్, చెన్నమనేని జోగా రాయడు వంటి రాజులు, దండనాయకులు, మంత్రులు, సామంతులు, నరసింహుని కొలిచి, అనేక దానాలు అన్నసత్రాలు, దిగుడు బావులు, స్వామి అంగరంగ భోగాలకు దానాలు, భూదానాలు చేశారు.

ధర్మపురి క్షేత్రస్వామి యోగ నరసింహుని మహిమలు, ఆశ్రిత భక్తజన వాత్సల్యం కవుల కలాలకు పని కల్పించడమే గాక పామర జనులు సైతం పాటలుగా పాడుకునేలా రచనలు చేయించింది. కరీంనగర్, ఆదిలాబాద్, నిజమాబాద్, మధ్య ప్రదేశ్, మహారాష్ట్ర, ఛత్తీస్‌గఢ్‌ల నుండి లక్షలాది భక్తుల స్వామి సేవలో పునీతులౌతారు. ఏటా ఫాల్గుణశుద్ధ ద్వాదశినాడు స్వామి కల్యాణోత్సవంతో ప్రారంభమయ్యే బ్రహ్మోత్సవాలలో రథోత్సవం, డోలోత్సవాలు ప్రత్యేక ఆకర్షణ. నారసింహునితో పాటు శివునికి కూడా రథోత్సవం (కలిపే) నిర్వహిస్తారు.

ఈ పుణ్యక్షేత్రంలో అత్యంత ఆకర్షణీయంగా గల బ్రహ్మపుష్కరిణి మధ్య యుగాల నాటికే ప్రసిద్ధం. చక్కని రాతిమెట్లతో వరాహతీర్థ పవిత్ర జలాలు తూములగుండా వచ్చి నిండి, సోపానాలు, ద్వారాలు, మధ్యవేదిక, ఉయ్యాల మండపం గల్గి 16వ శ.లో నిర్మాణమైనవి. (ఇది ముఖ్య దర్శనీయ స్థలం. ఈ కోనేరులోనే స్వామి నౌకా విహారం, డోలోత్సవాలు బ్రహ్మోత్సవాలలో భాగంగా సాగుతాయి.)

తన భర్త నాగుపాము కాగా, దేశంలోని సకల తీర్థాలలో స్నానించి, ఋషుల సలహా మేరకు సత్యవతిదేవి ధర్మపురి గోదావరిలో స్నానం చేయగా స్థల, జల మాహాత్మ్యంతో పాము సుందరాకారుడైన భర్తగా పొందిన గాథ కడు రమణీయం. అందమైన వరుని చూచి లోకులు పరపురుషుడని అనుమానించగా తన పాతివ్రత్యంతో ఇసుకతో స్తంభం నిర్మించి

సత్యనిరూపణ గావించుకొన్నదని గాథ. ఈ ఇసుక స్తంభంతో సత్యదేవి ఆలయం నేటికీ భక్తులకు ప్రత్యేక ఆకర్షణ. ఇది స్థల మాహాత్మ్యంగా సంస్కృత పురాణాల్లో ఉండగా, చాత్తాడ జగ్గయ్య, పూరి నారాయణరాజు, విశ్వనాథ సత్యనారాయణ, మల్లంపల్లి మల్లికార్జున పండితారాధ్యులు దీనిపై జానపదగీతాలు, పాటలు, కావ్యాలు రాశారు.

నరసింహాలయాల్లో స్వామి ఒక ఆలయంలో యోగ ముద్రతో ప్రశాంత వదనంతో ఉండగా, మరో ఆలయంలో (దీన్ని కొత్త గుడి అని పిలుస్తారు) స్వామి ఉగ్రనరసింహుడు. ఈతడు పంచవక్త్ర నారసింహుడు. ఈతని చల్లబరచటానికి చందనం ఒంటినిండా పూసేవారు. చందనం కొరకు పెద్ద సానరాయి కోవెలలో ఇప్పటికీ ఉంది. ఈ ఆలయంలోనే భూత ప్రేత పిశాచాలు ఆవహించిన వారు, మానసిక వికలాంగులు, సంతానార్థులు నిద్రించే ఆచారం ఉంది. నెల రోజులు నిద్రిస్తే కోరిన కోరికలు తీరుతాయి. పిచ్చివారు బాగవుతారని విశ్వసిస్తారు. ధర్మపురిలో అత్యంత సుందరమైన ప్రాచీనాలయం రామలింగేశ్వరాలయం. ఈ ఆలయంలో బాదామి గణపతి విగ్రహం ప్రత్యేకాకర్షణ. బంకుళ్ళు, కల్యాణి చాళుక్యుల నంది స్తంభం, శాసన శిల, వీరగల్లులు, కాకతీయుల కాలం నాటి నందులు చారిత్రకాభిమానులకు కన్నుల పండుగ. ఇక్కడి శివుడు శ్రీరామునిచే ప్రతిష్ఠించబడింది. ఈ ఆలయానికి ప్రత్యేక రథం ఉండి, శివరాత్రి రోజున ఆలయ ప్రాంగణంలో బ్రాహ్మణుల చేత ప్రదక్షిణలు చేయబడుతుంది. బయటగల మరి 3 రథాలు, శివ కేశవ, వేంకటేశ్వరులవి. రథోత్సవంనాడు ఇవి తిరుగు తాయి.

ఎందరో ధర్మపురి నారసింహుని భక్తులు ధర్మపురి నుండి ఇతర ప్రాంతాలకు వలసవెళ్ళి, లేదా ఇతర ప్రాంతాల వారు వృద్ధాప్యంలో దర్శనం సాధ్యం కాక తమ ప్రాంతాల్లో నరసింహుని దేవాలయాలు నిర్మించి, ఆ స్వామిని “ధర్మపురి నరసింహ స్వామి” అనే పేరుతోనే పిలిచారు. వరంగల్ జిల్లాలోని ఇనుగుర్తిలో మాచర్ల ధర్మపురి అనే భక్తుడు క్రీ.శ.1415లో నిర్మించిన “ధర్మపురి నరసింహాలయం”, గమనించాలి. కడప జిల్లాలోని బొమ్మవరంలోని నరసింహుని “ధర్మపురినారసింహు డని” పిలిచేవారని (అంబవరం కైఫియత్తు క్రీ.శ.1548), కృష్ణా జిల్లా పెనుగంచిప్రోలు నరసింహస్వామికి “ధర్మపురి నరసింహు డని” పేరు ప్రఖ్యాతమని తెలిస్తే మధ్యయుగాల్లో యావ దాంధ్రదేశాన స్వామి ప్రశస్తి ఎంతగా ఉండేదో బోధపడు తుంది. ఇక్కడి ఆధ్యాత్మిక వాతావరణం, ధర్మపూర్ణ జీవనం, వేద ప్రశస్తి, నిత్యాన్నదానాలు, సామాన్య జనాన్నే గాక, రాజు లను, పరివ్రాజకులను, సాధుసన్యాసులను ఆకర్షించేవి. రామ భద్రస్వామి నారాయణ మఠాన్ని క్రీ.శ.1448లో నిర్మించాడు. ప్రస్తుతం ఈమఠం గోదావరి తీరాన శృంగేరి జగద్గురువుల ఆశీస్సులతో ఆధ్యాత్మిక కేంద్రంగా విరాజిల్లుతోంది.

ధర్మపురి అన్ని వేదాలకు నిలయం. విద్యారణ్యస్వామి హంపిలో హరిహర బుక్కరాయలతో విజయనగర సామ్రాజ్య నిర్మాణం జరిపించే శుభవేళ నాలుగు వేదాల పండితులను ధర్మపురి నుండి పిలిపించాడు. దీంతో ధర్మపురి వేద నిలయ మన్న సంగతి యావదాంధ్ర కర్ణాటక దేశాలకు తెలిసింది. వేదపాఠశాల గల్గిన ధర్మపురి అనాదిగా వేద పండితులకు నిలయం. ఇక్కడ బ్రాహ్మణులు పడమట పూణే రాజన్యులైన పీష్వాల వద్ద, మధ్య భారతంలో గ్వాలియర్ రాజ్యంలో, దక్షిణాన శృంగేరి, హంపిలలో, తూర్పున గోదావరి జిల్లాలో అఖండంగా రాజసన్మానాలు, గజారోహణలు, గండ పెండేరాలు, రాజాజ్ఞ పత్రాలు పొందారు. ధర్మపురిలో బ్రాహ్మణాన్నసత్రం బాగా సాగేది. వివిధ ప్రాంతాల పండితులు ఇక్కడికి వచ్చి, స్వామి దర్శనం పాండిత్య ప్రదర్శన, ధన సంపాదన చేసుకుని పోయే వారు. అన్నసత్ర యజమాని పణతుల నారాయణ ఏకంగా కొత్త నరసింహుని ఆలయమే కట్టించిన దాత.

ఈ విధంగా ధర్మపురి గ్రామం విశేష దేవాలయాలతో, పవిత్ర గోదావరి తీరాన ఐహికాముష్మిక ఫలదాయినిగా, వేయి సంవత్సరాల నుండి తరుష్కుల దాడిలో పలుమార్లు చిన్నాభిన్న మైనా తిరిగి నిలదొక్కుకుని, ఆర్షధర్మ సంస్కృతీ కేంద్రంగా, హైందవ నాగరికతకు పట్టుగొమ్మగా, పర్యాటక కేంద్రంగా విలసిల్లుతోంది.

బాలప్రబోధం



# కూర్మావతార వైశిష్ట్యం

– బులుసు – జీ –ప్రకాష్

విద్యాధరుడనే గంధర్వుడు ఒక చక్కని పూలమాలను దుర్వాస మునికి సమర్పించుకున్నాడు. ఆ పూల మాలను దుర్వాసుడు ఇంద్రునికిచ్చాడు. ఇంద్రుడు ఆ దండను నిర్లక్ష్యంగా తన వాహనమైన ఐరావతం మీదికి విసిరేస్తే, ఆ ఏనుగు ఆ దండను నేలపై వేసి కాళ్లతో నులిమి చిదిమేసింది. దుర్వాసునికి సుమమాలను సమర్పించుకున్న గంధర్వుని పేరు 'విద్యాధరుడు' అనగా ఆధ్యాత్మిక విద్యను ధరించినవాడు. ఆయన సమర్పించిన హారం ఆధ్యాత్మిక విద్యయే. ఇంద్రియ లాలసత్వం వాంఛించే వారికి ఇంద్రుడు అధిష్ఠాన దేవత. ఇంద్రియలోలుడై అతడు ఆధ్యాత్మిక విద్యను నిరాకరించాడు. అతని వాహనమైన 'మదపుటేనుగు' అహంకారానికి చిహ్నం. ఆ మదపుటేనుగు అహంకారం చేత ఆధ్యాత్మిక విజ్ఞానమనే సుమ మాలను నేలపాలు చేయడమంటే, తుచ్ఛమైన కోరికలకై ఆధ్యా త్మిక విద్యను దుర్వినియోగం చేసినట్లయినది. దాంతో దుర్వాసు నికి ఆగ్రహం వచ్చి, ఇంద్రుని సకల భోగభాగ్యాలు కడలిపాలౌ తాయని శపించాడు. దీంతో ఇంద్రాది సకలదేవతలు తమ శక్తి సామర్థ్యాలను కోల్పోవడంతో, రాక్షసులు వారిని సులభంగా జయించారు. దేవతలు విష్ణువు నాశ్రయించారు. మందర పర్వ తాన్ని కవ్వంగా, వాసుకి సర్పాన్ని తాడుగా చేసుకుని, అసురుల సహకారంతో క్షీరసాగరాన్ని మథిస్తే, దేవతలు కోల్పోయిన పూర్వ వైభవాలు లభ్యమవుతాయని విష్ణువు సూచించాడు. మందరాద్రి మునిగిపోకుండా విష్ణువు కూర్మ రూపియైమోశాడు.

క్షీరం శక్తివంతమైన ఆహారం. క్షీర సాగరం సకల జీవజాలాలకు ప్రధానమైన శక్తి. ఆ శక్తి మహావిష్ణువుచే రక్షింపబడుతూంది. అందుకే విష్ణువు క్షీరసాగరాన్ని నివాసంగా చేసుకున్నాడు. క్షీరసాగరాన్ని మథించడమంటే సకల ప్రాణికోటికి గల ప్రధానశక్తిని చైతన్యవంతం చేయడమే. అలా ప్రధానశక్తిని చేతనంగా చేయడమే ఆధ్యాత్మిక సాధన. 'మందర' అనే అచలం జీవుల్లో చైతన్య రహితమైన తామసానికి చిహ్నం. సర్పరాజమైన వాసుకి, జీవులలో చైతన్యవంతమైన రాజసానికి చిహ్నం. సత్త్వ గుణంతో రాజసాన్ని అదుపులో పెట్టకపోతే ప్రమాదం.

మథనం జరుగుతున్నప్పుడు ప్రథమంగా వచ్చింది కాల కూట విషం. విషం వ్యాపించి విశ్వవినాశం కాకుండా పరమ శివుడు హాలాహలాన్ని పానం చేశాడు.

పిమ్మట కౌస్తుభం, పారిజాతం, ఉత్పలం, కామధేనువు, ఉచ్చైశ్రవసు హయం, ఐరావత గజం, గంధర్వాప్సరసలు, మహా లక్ష్మి, చిట్టచివర అమృతభాండపాణియై ధన్వంతరి బయట పడ్డారు.

మహావిష్ణువు ధరించిన కూర్మరూపం స్థితప్రజ్ఞుడైన యోగికి చిహ్నం. కూర్మం తన అవయవాల్ని, ఏ విధంగా తన కప్పులోకి అవసరమైనప్పుడు లాక్కుంటుందో, ఆ విధంగా తన ఇంద్రియాల్ని శరీరంలోనే అణచుకోగలిగినవాడు స్థిత ప్రజ్ఞుడు.

**యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా**

– అని భగవద్గీతాచార్యుని ఉవాచ.

ఆ రీతిగా ఇంద్రియాల్ని అదుపులో పెడితే సాధకునిలో దైవికశక్తి ఉద్భవిస్తుంది. సకలభోగభాగ్యప్రదాయిని అయిన మహాలక్ష్మి ఆ తర్వాత చివరలో మృత్యుముఖం నుండి తప్పించే పీయూషం ఉద్భవించాయి.

యోగాభ్యాసంలో 'ప్రత్యాహారం' అని చెప్పబడే ఇంద్రియ నిగ్రహాన్ని సత్త్వగుణం ద్వారా సాధించి, రజస్తమో గుణాలను అణచివేయడం కూర్మరూపానికి చిహ్నం. ఆ రీతిగా ఇంద్రియ నిగ్రహం అభ్యసించగా రానురాను సాధకునికి అంతంలో లభించేది అమృతం! అంటే జనన మరణాలను అధిగమించినట్లే కదా!

# రెండు వసంతాల శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ (SVBC)

అంతర్జాతీయ హిందూ ధార్మిక సంస్థ తిరుమల తిరుపతి దేవస్థానం 2008 సంవత్సరం ఏప్రిల్ నెలలో శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్‌ను ఏర్పాటు చేసింది. 2008 జూలై 7వ తేదీన భారత రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభాసింగ్ పాటిల్ ప్రారంభించిన ఈ ఛానల్ 2010 ఏప్రిల్ 20వ తేదీనాటికి రెండు వసంతాల్ని పూర్తి చేసుకుంది. **రాష్ట్రపతి చేతుల మీదుగా ఆవిష్కరించిన ఏకైక, తొలి టీవీ ఛానల్ ఇదే కావడం విశేషం.**

ప్రారంభమైన అతిస్వల్పవ్యవధిలోనే శ్రీవారి బ్రహ్మో త్సవ విశేషాల్ని, తిరుచానూరు క్షేత్రంలో వెలసిన శ్రీ పద్మావతీ అమ్మవారి బ్రహోత్సవాల్ని తెలుగు భాషతో పాటు, వ్యాఖ్యానం (ఆడియో) ద్వారా... తమిళం, కన్నడ, హిందీ భాషా వీక్షకులకు చేరవేయడం ఛానల్ చరిత్రలో మైలురాయిగా చెప్పుకోవచ్చు. దేశవ్యాప్తంగా వివిధ నగరాల్లో, తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించే శ్రీనివాస కల్యాణాల్ని ప్రత్యక్ష ప్రసారాల ద్వారా భక్తులకు అందిస్తుండడంతో ఎస్వీబీసీ భక్త జనరంజకం అయిందనడంలో అతిశయోక్తి లేదు.

శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ ప్రసారాలు వేకువ జామున 2.30గంటల నుండి ప్రారంభమౌతాయి. స్వామి వారికి నిర్వహించే కల్యాణోత్సవం, ఆర్జిత బ్రహ్మోత్సవం, వసంతోత్సవం, సహస్రదీపాలంకార సేవల్ని ప్రత్యక్ష ప్రసారాల ద్వారా అందిస్తోంది. అమ్మవారి శుక్రవారం అభిషేకం, డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమాల్ని, శ్రీవారి నైవేద్య ఘంటా నాదాన్ని ప్రత్యక్ష ప్రసారం చేస్తోంది.

తి.తి.దే. కార్యనిర్వహణాధికారిగా శ్రీ ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., బాధ్యతలు స్వీకరించిన తర్వాత నూత నంగా 'నాద నీరాజనం' కార్యక్రమాన్ని ప్రవేశపెట్టారు. ప్రతిరోజూ సా॥6 గంటలకు తిరుమలలో స్వామివారి ఆలయం ముంగిట నిర్వహించే ఈ కార్యక్రమాన్ని శ్రీ వేంకటే శ్వర భక్తి ఛానల్ ప్రత్యక్ష ప్రసారం చేస్తోంది. అనంతాన్‌పిళ్లై రచన, అనంతశయ అయ్యంగార్ గానం చేసిన 'శ్రీనివాస గద్యం' కార్యక్రమం శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ ద్వారానే ప్రసారమౌతోంది.

ఎస్వీబీసీ ఈ రెండేళ్ళ వ్యవధిలో లక్ష్యసాధన దిశగా ప్రతిరోజూ కనీసం 9 నుంచి 10 లైవ్స్ (ప్రత్యక్ష ప్రసారాల్ని) విజయవంతంగా అందిస్తోంది. జగద్గురువులు శృంగేరీలో చేసే చంద్రమౌళీశ్వర అభిషేకం కార్యక్రమాన్ని ఇంతవరకూ ఏ ఛానల్ కూడా ప్రత్యక్షప్రసారం చేయలేదు. అలాంటి విశేష కార్యక్రమాన్ని ప్రసారం చేసిన ఘనకీర్తిని ఎస్వీబీసీనే మొదటిసారిగా కైవసం చేసుకుంది. ఇంకా గృహవైద్యం-ఆయుర్వేద వైద్య చిట్కాలు, తిరుమల సందర్శనంకు వచ్చే భక్తులకోసం 'అదివో! అల్లదివో!!' క్లుప్త సమాచారం, శ్రీవారి ఆలయంలో జరిగే 'నిత్యపూజలు, ఆళ్వార్ శ్రీసూక్తి' వంటి విన్నూత్న కార్యక్రమాలు, సంక్షిప్త సమాచార వేదికలు (ప్రోమోలు) ఎస్వీబీసీ వీక్షకులకు మాత్రమే ప్రత్యేకం.

నిరంతర ప్రసారాల్ని కార్యక్రమాల్ని వీక్షకుల చెంతకు తీసుకెళ్ళేందుకు వీలుగా శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ తిరుపతి, తిరుమల, హైదరాబాదుల్లో ప్రత్యేకంగా స్టూడియోల్ని, తిరుపతి, హైదరాబాదుల్లో కార్యాలయాల్ని ఏర్పాటు చేసింది.

ఎస్వీబీసీ నిర్మించిన సీరియల్స్‌కు 2008 సం॥ రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డులు అధికస్థాయిలో లభించాయి. "మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ" సీరియల్‌కు బంగారు నంది అవార్డు, "సృష్టి"కి రజత నంది లభించాయి. ఈ ఛానల్‌కి ఈ సంవత్సరానికి గాను 11 నంది అవార్డులు రావడం చారిత్రాత్మకం.

ఎస్వీబీసీ ఏర్పాటుకు, ఆ తర్వాత విజయవంతంగా కొనసాగేందుకు తి.తి.దే. పాలకమండలి అందించిన, అంది స్తున్న సహకారం మరపురానిది. శ్రీ భూమన కరుణాకర రెడ్డి పాలకమండలి అధ్యక్షులుగా ఉండగా ప్రారంభమైన ఈ ఛానల్ ప్రస్తుత పాలకమండలి అధ్యక్షులు శ్రీ డి.కె.ఆదికేశవులు గారి ఆధ్వర్యంలో ఎన్నో వినూత్న కార్యక్రమాలు ప్రసారం చేస్తోంది. గతంలో శ్రీ కె.ఎస్.శర్మ, డా॥ కె.వి.రమణాచారి, శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగార్లు ఛానల్ ప్రధాన కార్యనిర్వహణాధి కార్లుగా (సి.ఇ.ఓ.లుగా) వ్యవహరించారు. ప్రస్తుతం తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి డా॥ఎన్.యువరాజ్ గారు ఈ ఛానెల్‌కు ఓ.ఎస్.డి.గా వ్యవహరిస్తున్నారు.

## వార్తాలహరి

## వైభవంగా శ్రీవారి ఆలయంలో ఉగాది ఆస్థానం

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయంలో ఉగాది ఆస్థానం 16-03-2010న వైభవంగా జరిగింది.

ఏటాసాగే ఆనవాయితీ ప్రకారం శ్రీవారి సుప్రభాతసేవ పూర్తయిన వెంటనే శ్రీదేవి, భూదేవి సమేతంగా మలయప్ప స్వామి, శ్రీవారి సేనాధిపతి విష్వక్సేనులమూర్తికి ఏకాంతంగా తిరుమంజనం నిర్వహించారు. అనంతరం బంగారువాకిలి ముందు తిరుమహామణి మండపంలో సర్వభూపాల వాహనంలో దేవేరులతో పాటు మలయప్ప స్వామివారిని అర్చకులు వేంచేపు చేశారు. పట్టువస్త్రాలు, సర్వాభరణాలతో సుగంధపరిమళ భరితమైన పుష్పమాలికలతో ఉత్సవమూర్తులను శోభాయ మానంగా అలంకరించారు. శ్రీవారి ఉత్సవమూర్తులు, సేనాధిపతికి విశేష మైన పడిప్రసాదాలు, అన్నప్రసాదాలు నివేదించారు. ఆలయ పాలక, అధికార వర్గాల సమక్షంలో వేదపండితులు విశేష నివేదన చేశారు.

చిన్నజీయర్‌వారు ఆరు పెద్దపట్టువస్త్రాలను తీసుకుని అర్చకులకు అందించగా వాటిని శ్రీవారికి అలంకరించారు. తరువాత తెలుగు సంవత్సరాది పండుగను నిర్వహిస్తూ శ్రీవారికి ఆస్థానం జరిగింది. స్వామివారి పాదాల దగ్గర ఉంచిన పంచాంగాన్ని తీసుకుని ఆస్థాన సిద్ధాంతి చదివారు. లాభనష్టాలు, నవగ్రహాల గతులు, సస్యవృద్ధి వంటి విషయాలతో పాటు 27 నక్షత్ర జాతకుల కందాయఫలాలు, రాజపూజ్యత అవమానాలను పంచాంగ శ్రవణం ద్వారా వినిపించారు. జీయంగార్ల గుమాస్తా హుండీ రాబడి, ఆదాయ వ్యయాలు, ఉత్సవ విశేషాలను చదివారు. సాయంత్రం తిరువీథుల్లో శ్రీదేవి, భూదేవి సమేతంగా మలయప్పస్వామి ఊరేగుతూ భక్తులకు తెలుగు సంవత్సర ఆశీస్సులు అందజేశారు. ఆస్థానం నేపథ్యంలో శ్రీవారిఆలయాన్ని శోభాయమానంగా రంగురంగుల పూలతో అలంకరించారు. ఈ ఉగాది ఆస్థానంలో తి.తి.దే. పాలక మండలి అధ్యక్షులు శ్రీ డి.కె. ఆదికేశవులు కార్యనిర్వహణాధి కారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, తిరుమల ప్రత్యేకాధికారి శ్రీ ఎ.వి. ధర్మారెడ్డి, డిప్యూటీ ఈ.ఓ.లు శ్రీ మురళీకృష్ణ, శ్రీ గోపాలకృష్ణ తదితరులు పాల్గొన్నారు.

## తిరుపతి శ్రీ కోదండరాముడి బ్రహ్మోత్సవాలు

శ్రీ కోదండరామస్వామి ఆలయంలో వార్షిక బ్రహ్మో త్సవం 14-3-2010 నుండి 22-3-2010 వరకు వైభవం గా జరిగింది. దీనికి తోడు శ్రీరామనవమి ఉత్సవం, సీతా రామకల్యాణం, శ్రీరామపట్టాభిషేకం ఆ మరుసటి రోజులలో జరిగాయి.

2010, మార్చి 13వ తేదీన సేనాధిపతి విష్వక్సేనుల వారు ఊరేగింపుగా నగర ప్రదక్షిణం చేసి దేవతలను బ్రహ్మోత్సవాలకు ఆహ్వానించి ఉత్సవానికి మృత్సంగ్రహణం చేశారు. ఆ తర్వాత అంకురార్పణ జరిగింది. మరుసటి రోజు మేష శుభలగ్నంలో ఉదయం 8.45లకు వైభవంగా ధ్వజారోహణం జరిగింది. అదే రోజు రాత్రి కోదండరామస్వామి పెద్దశేష వాహ నంలో విహరించి భక్తులకు దర్శనమిచ్చారు. మరుసటిరోజు నుంచి ప్రాతఃసంధ్యలలో వివిధ వాహనాలపై స్వామి వారు ఊరేగి భక్తులను అనుగ్రహించారు. గరుడ, హనుమ వాహన రోజుల్లో అధికసంఖ్యలో భక్తులు మాడవీథులలో నిలచి స్వామి దర్శనం చేసుకున్నారు.

మార్చి, 21వ తేదీన రథోత్సవం భక్తుల గోవిందనామ స్మరణల నడుమ దాదాపు రెండు గంటల పాటు ఉత్సాహంగా సాగింది. 22న చక్రస్నానం కపిలతీర్థంలో జరిగింది. ఈ కార్యక్రమంతో చివరి రోజు ఉత్సవకార్యక్రమాలు ముగిసాయి. ఆ తరువాత రాత్రి 9.45-10.30ల మధ్య ధ్వజావరోహణం కార్యక్రమం జరిగింది. ఉత్సవాల ప్రారంభ సందర్భంగా ధ్వజస్తంభానికి ఆరోహణం చేసిన గరుడపటానికి శాస్త్రోక్తంగా పూజలు నిర్వహించిన అనంతరం అవరోహణం చేశారు. దీంతో కోదండరామస్వామి వార్షిక బ్రహ్మోత్సవాలు ముగి శాయి. మార్చి, 24న శ్రీరామనవమి వేడుకలు ఘనంగా జరిగాయి. 25న శ్రీ సీతారామ కల్యాణం కన్నులపండుగగా జరిగింది. తదనంతరం శ్రీరామపట్టాభిషేకం వైభవోపేతంగా జరిగింది.

## పరమపదించిన తిరుమల శ్రీమాన్ పెద్ద జియ్యంగార్ స్వామి

భగవద్రామానుజుల పరంపరాగతి శిష్యులు అయిన తిరుమల శ్రీశ్రీశ్రీ రంగరామానుజ పెద్ద జియ్యంగార్ స్వామివారు 14-03-2010 తేది ఆదివారం తెల్లవారు జామున పరమపదించారు. 1995 మే 3వ తేదీన సన్యాసం స్వీకరించి తిరుమల చిన్నజీయర్ స్వామిగా తిరుమల, తిరుపతి ఆలయాల్లో అర్చనాదుల్లో ప్రధానపాత్రను వహించారు. తదుపరి 2004 ఫిబ్రవరిలో పెద్ద జియ్యంగారుగా పట్టం స్వీకరించిన నాటి నుంచి భగవద్రామానుజ సంప్రదాయ రక్షకులుగా తిరుమల తిరుపతి ఆలయాలు అన్నింటిలో బ్రహ్మోత్సవాది ఉత్సవాల్లో విశిష్ట సేవలందించారు. కేవలం తిరుమల తిరుపతి ఆలయాల్లోని అర్చనాది కార్యక్రమాల్లోనే కాక, తిరుపతి నుంచి తిరుమల నడచి వెళ్ళేదారిలో "శ్రీవ భాష్యకారుల సన్నిధి" జీర్ణోద్ధారణ, కపిలతీర్థంలోని నమ్మాళ్వార్ల ఆలయం పునర్నిర్మాణంవంటి కార్యక్రమాలను ఈ పెద్దజీయర్ స్వామి పర్యవేక్షించారు. తిరుమల శ్రీవారి ఆలయ కైంకర్యంలో, శాత్తుమొరలో పాల్గొనే వైష్ణవ బ్రాహ్మణులు ద్వాదశ ఊర్ధ్వ పుండ్రధారణ, తిరునామధారణ వంటి వేషధారణలో అత్యంత శ్రద్ధవహించి సనాతన సంప్రదాయ పరిరక్షణకు దోహదం చేశారు.

సుమారు 86 సంవత్సరాల తిరుమల శ్రీరంగరామానుజ పెద్ద జియ్యంగార్‌స్వామి తిరుపతికి అతి సమీపంలోని పేరూరు గ్రామంలో ప్రముఖ శ్రీవైష్ణవ పండితులైన శ్రీమతి శేషమ్మ శ్రీనివాసాచార్యుల దంపతులకు జన్మించారు. వీరి పూర్వాశ్రమనామం కె.సుందరాచార్యులు.

ద్రావిడ దివ్య ప్రబంధం, పాంచరాత్రాగమం, వేదాలను గురువులైన శ్రీయామునాచార్యస్వామి వద్ద అభ్యసించిన శ్రీ పెద్ద జియ్యంగార్ మొట్టమొదటి తిరుమల శ్రీవారి ఆలయంలో అర్చనాదుల్లో వైఖానసార్చకులకు సహాయంగా పరిచర్యాది సేవలందించారు. పిదప తిరుమల తిరుపతి దేవస్థానంలోని వేద పాఠశాలలో దివ్యప్రబంధ అధ్యాపకులగాను, తదుపరి 18 ఏండ్లపాటు వేదపాఠశాల ప్రిన్సిపాలుగా సమర్థవంతంగా పనిచేశారు.

వీరి పార్థివశరీరాన్ని తి.తి.దే.అధ్యక్షులు శ్రీ డి.కె. ఆదికేశవులు, తి.తి.దే.కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్. కృష్ణారావు,ఐ.ఏ.ఎస్., సంయుక్త కార్యనిర్వహణాధికారి డా॥ ఎన్.యువరాజ్,ఐ.ఏ.ఎస్., తిరుమల ప్రత్యేకాధికారి శ్రీ ఏ.వి.ధర్మారెడ్డి తదితరులు దర్శించి తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేశారు.

---

## తీరనిలోటు..!

తిరుమల తిరుపతి దేవస్థానం వైఖానస ఆగమ పండితుడు, ఆగమసలహామండలి సభ్యులు అయిన **ఎన్.ఎ.కె. శ్రీనివాసాచార్యులు,** 13-3-2010 శనివారం తెల్లవారు జామున 5.00 గం॥లకు తిరుపతి ఖాదీ కాలనీలోని తమ స్వగృహంలో కాలధర్మం చెందారు.

ధర్మగిరి శ్రీ వేంకటేశ్వరవేదపాఠశాల, తి.తి.దే.లో ఆగమపండితుడు మరియు ప్రిన్సిపాల్‌గా పనిచేసి 2002లో వీరు పదవీవిరమణ పొందారు. తిరుమల తిరుపతి దేవస్థానం అత్యంత ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించిన అద్భుత శాంతియాగాలు, వరుణ యాగాలు, ఇటీవల సరస్వతీయాగం కూడా వీరి ఆధ్వర్యంలోనే నిర్వహించబడ్డాయి. స్థానిక దేవాలయాల్లో వైఖానస సంప్రదాయం ఉన్నచోట బ్రహ్మోత్సవాలు వంటివన్నీ వీరి చేతుల మీదుగానే జరిగేవి.

వైఖానసఆగమంలో నిష్ణాతులైన వీరు ఎందరో అర్చకులను, విద్యార్థులను తీర్చిదిద్ది విదేశాలకు పంపి వైఖానసఆగమానికి ఎనలేని సేవ చేశారు. ఇక్కడ శ్రీనివాసునికి అనేక కైంకర్యాలు చేసిన పుణ్య ఫలంగా శ్రీనివాసాచార్యులు శ్రీవారిసన్నిధికే శాశ్వతంగా చేరుకున్నారు. వీరి మరణం తి.తి.దేవస్థానానికి తీరనిలోటు. వీరి పవిత్రాత్మకు శాంతి కలగాలని ఆ దేవదేవుని ప్రార్థిస్తూ, వారి కుటుంబసభ్యులకు ప్రగాఢసానుభూతిని తి.తి.దే.ఉన్నతాధికారులు తెలియజేశారు.

ఈ కూపను కత్తరించండి

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

   (పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : **చందాదారుని సంతకము**

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలుస్తున్నది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి ప్రసాదాలకు సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**

**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
0877 - 2264359
0877 - 2264543

☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.

☛ మా చిరునామా "**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083**".

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

ఓ పవనాత్మజ ఓ ఘనుఁడ
బాపు బాపనఁగఁ బరగితిగా



వో హనుమంతుఁడ వుదయాచలని-
ర్వాహక నిజసర్వ ప్రబల
దేహము మోఁచిన తెగువకు నిటువలె
సాహసమిటువలెఁ జాటితిగా

వో రవి గ్రహణ వో దనుజాంతక
మారులేక మతి మలసితిగా
దారుణపు వినతాతనయాదులు
గారవింప నిటు గలిగితిగా

వో దశముఖహర వో వేంకటపతి
పాదసరోరుహపాలకుఁడా
యీదేహముతో నిన్ని లోకములు
నీ దేహమెక్క నిలిచితిగా (4 - 327)



ఓ వాయుపుత్రా! నన్ను రక్షింపు మని శరణు వేడుతున్నాను. నీవు సూర్యభగవానుని నుండి జ్ఞానాన్ని సముపార్జించుకున్నవాడివి. ఓ రాక్షస సంహారా! నీవు వైనతేయుల చేత స్తుతింపబడినవాడవు. రావణసంహరణ కారకుడవైన నీవు అన్ని లోకాలలోనూ కీర్తింపబడిన వాడవు అని అన్నమయ్య పై సంకీర్తనలో పవన తనయుని ప్రస్తుతించాడు.

**జూలై నెల పండుగలు**

17 - ఆణివర ఆస్థానం

# మీ మాట

## జన్మధన్యం !!

ఏప్రిల్‌నెల 'సప్తగిరి'లోని సంపాద కీయం 'ఆత్మహత్య' ఎంతటి హేయ మైందో, పాపభూయిష్ఠమైందో సంక్షి ప్తంగా తెలియజేసింది. పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు చేసుకుంటే పుణ్యలోకాలు లభిస్తాయనే అపోహను తొలగించింది.

డా॥ చలసాని సుబ్బారావుగారి 'పురాణాలలో ఏమున్నది' అనే వ్యాసం మా వంటి జిజ్ఞాసువులకెంతో హాయిని స్తుంది. జీవితకాలంలో ఒక పర్యాయ మైనా ఈ అష్టాదశ పురాణాలు చదివే మానవుని జన్మధన్యం. ఉషశ్రీ 'భార తం' రసవత్తరంగా సాగుతున్నది.'తింటే గారెలే తినాలి,వింటే భారతమే వినాలి' అన్న ఆర్యోక్తిని నిజం చేస్తున్నదీ పంచమ వేద కథనం.

**– ఆర్.ఎం.వి.ఎన్.రమాకాంతరావు, విశాఖపట్నం.**

## ఎంతో ఉపయుక్తం!!

నాకు ఊహ తెలిసినప్పటి నుండీ మేము సప్తగిరికి చందాదారులం. నేను అప్పటినుండి ఇప్పటివరకు పత్రికలను భద్రపరుస్తున్నాను. నా చిన్ననాటినుండి సప్తగిరిని చదవడంవల్ల ఎంతో ఆధ్యా త్మికత పెరిగింది. ఇప్పుడు వాటిని మా పిల్లలుకూడా చదువుతున్నారు. వేసవి సెలవుల్లో పాతపత్రికలు అడిగి మరీ చదివారు. సప్తగిరి నాకే కాక నా పిల్లల్లో కూడా ఆధ్యాత్మిక పెరగడానికి ఎంతో ఉపయుక్తంగా ఉంది. అందుకు సప్తగిరికి ధన్యవాదాలు!!

**– మున్నప్పగారి మునిప్రసాద్ రెడ్డి, తిరుపతి.**

## జోహార్లు

తెలుగులో ఎన్నో దిన,వార,మాస పత్రికలున్నా 'సప్తగిరి' మాస పత్రికను చూడగానే తిరుమల కొండపై కాలు మోపినంత భక్తి సంబరాలు కలుగు తాయి. నాస్తికులను సైతం ఆస్తికులుగా మారుస్తున్న సప్తగిరి పత్రికకు జోహార్లు.

**– శ్రీమతి మన్నెముత్తుల శ్రీదేవమ్మ, విడవలూరు.**

## అమృత భాండం

పదికాలాల పాటు పదిలపరచు కోవాల్సిన సచిత్ర మాసపత్రిక మన 'సప్తగిరి' సమ్రాట్టు. 'శ్రీపదకేళి' శీర్షిక పత్రికకు మరింత వన్నె తెచ్చింది. పాఠకలోకం చిరకాలం మర్చిపోలేని అమృతభాండం (సప్తగిరి మాసపత్రిక) ప్రసాదించిన మీకు నమశ్శతములు.

**– తిన్నవెల్లి రాజశేఖరం, బరేలి, ఉత్తరప్రదేశ్.**

## కన్నుల పండుగ

సప్తగిరి మాసపత్రికలో ప్రచురిత మౌతున్న ప్రతి వ్యాసం, ధారావాహి కలు, అలాగే శ్రీపదకేళి చాలా చక్కగా ఉన్నాయి. శ్రీ పద్మావతీ వల్లభుని రంగుల వర్ణచిత్రాలు కన్నులపండుగగా ఉన్నాయి.

శ్రీనివాసగద్యం సరళంగా తాత్పర్య సహితంగా మన మాసపత్రికలో ప్రచురిస్తే భగవద్భక్తకోటి ఆనందనిలయుని గద్యాన్ని తనివితీరా పాడుకుంటారని ఆశిస్తున్నాం.

**– జె. సతీష్ కుమార్ శర్మ, ధర్మపురి, తమిళనాడు.**

**మీరు సూచించినట్లే శ్రీనివాస గద్యాన్ని ప్రచురించేందుకు ప్రయత్నిస్తాం.**

**– ప్రధాన సంపాదకులు**

## పెద్దల మాట

ఏప్రిల్ సప్తగిరి మాసపత్రికలో ప్రచు రించిన 'ఓర్పు ఉంటే కవచంతో పని లేదు', 'అల్పబుద్ధికధికారమిస్తే........' మొదలైనవి ఎంతో బాగున్నాయి. ఇవి చదివి ఆ ప్రకారం నడచుకుంటే మాన వుడు సుఖమయ జీవితం గడపవచ్చు.

ప్రతినెలా ఇలాంటి నీతులు ఇంకా ఎక్కువగా ప్రచురిస్తే చాలా బాగుం టుంది. ఇంతమంచి వ్యాసాలు, గేయాలు, ఆధ్యాత్మిక కథలు ఎంపిక చేసి ప్రచు రిస్తున్న సప్తగిరి మాసపత్రిక సంపాదక వర్గానికి నా ధన్యవాదాలు.

**– డి.నరసింహులు శెట్టి, పుత్తూరు.**

## కనకంతో సమానం

సప్తగిరి మాసపత్రికలో వస్తున్న 'శ్రీపదకేళి', 'రాశిఫలాలు', 'బాలవాక్కు' మొదలైన శీర్షికలు విశ్రాంత ఉద్యోగులకు మరియు సప్తగిరి పత్రికాభిమానులకు ఔచిత్యంగా, ఆకర్షణీయంగా ఉన్నాయి. 'ఉషశ్రీ'గారి భారతం ధారావాహికం మరియు 'పురాణాల్లో ఏమున్నది?' వంటి వ్యాసాలు ఎంతో ఉపయుక్తంగా ఉండి మనసును ఆధ్యాత్మికమయం చేస్తున్నాయి. నిజంగా ఆ దేవదేవుని మానస పుత్రికైన సప్తగిరి మాసపత్రిక కనకంతో సమానమని నా భావన.

**– విల్లూరు శ్రీరాములు, అనకాపల్లి.**

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 41 జూన్, 2010 సంచిక: 01

## ప్రత్యేక వ్యాసాలు



ఒకరి తప్పు మనమెంచితే
మన తప్పు పదిమంది ఎంచుతారు



ముఖ చిత్రం :
**ఆజ్ఞా పాలక హనుమంతుడు**

చివరి పుట :
**పవనసుత నుత శ్రీరాముడు**



*వివరాలకు :*
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083,
ఫోను : 0877-2264543

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**విదేశాలకు**
సం॥ చందా -- రూ. 850-00

సంపాదకీయం

# సర్వే జనా సుఖినో భవంతు

భగవంతుడు కాలాతీతుడు. మన అనుకూలతకు గణనాతీతమైన కాలాన్ని యుగాలుగా విభజించు కున్నాం. ఏకకోశ జీవి మొదలు సహస్రకోశజీవి మానవుడి వరకూ సృష్టిలోని అసంఖ్యాక జీవరాసులను గుర్తించుకున్నాం. ఇంతవరకు నడచి వచ్చిన దారిని సింహావలోకనం చేసుకుంటూ ముందుకు సాగితే భవిష్యత్తులో మార్గం సుగమమౌతుందనేది ఒక ఆశాభావం.

బ్రహ్మ సృష్టిలో యుగాలు గడిచాయి. అసలు సృష్టి అనేది ప్రణాళికాబద్ధం, హేతుబద్ధం అయినప్పటికీ అనివార్యంగా ఒక్కొక్కప్పుడు దౌష్ట్యం ప్రబలుతోంది. అప్పుడు ఈ సృష్టికంతటికీ కారణభూతుడైన భగవంతుడు ఆ దౌష్ట్యాన్ని అణచడానికి అవతారం ధరించక తప్పదు. ఆయనే గీతలో నుడివినట్లు ధర్మగ్లాని ఏర్పడినప్పుడూ, అధర్మం ప్రబలినప్పుడూ అవతారమెత్తుతాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపనం అనేవి ప్రముఖంగా భగవదవతార ప్రయోజనాలు. దేవుడు ధరించిన అవతారాలు ఎన్నో అయినా వాటి లక్ష్యం లోక శ్రేయస్సే!

కృతయుగంలో నరసింహుడుగా, త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడుగా, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా ఇలా దేవుడు అవతరించాడు. ద్వాపరంలో లీలామానుష వేషధారియైన ఆ శ్రీకృష్ణుడే ఈ కలియుగంలో అర్చామూర్తియై శ్రీ వేంకటేశ్వరుడుగా తిరుమల గిరిపై వెలిశాడు.

యుగాల పరిధిలో ఈ నాలుగు అవతారాలకే ప్రాముఖ్యం. నాలుగు యుగాల దైవతాలను కలుపుతూ తిరుమల తిరుపతి దేవస్థానం చతుర్యుగ బంధం అనే పేరుతో – భక్తి చైతన్య రథయాత్రను 2008లో జరిపించింది. ధర్మజాగృతిని, సర్వసమానత్వాన్ని పెంపొందింపజేయడానికి ఇది ఒక ప్రయత్నమన్నమాట. భారతదేశ చరిత్రలో విజయనగర చక్రవర్తులు – శ్రీకృష్ణదేవరాయలు ఆ నాళ్ళలో ధర్మయాత్రలు సాగించారు. మరల దాదాపు ఐదువందలేండ్ల తరువాత అదే ఇపుడు పునరావృతమైంది. ప్రస్తుతం బయలుదేరిన **లోకకల్యాణ రథాలు** త్రిలింగదేశంలోని మూడు దిక్కులందున్న భక్తులకు శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శించుకొనే భాగ్యాన్ని ప్రసాదిస్తూ పరభక్తిని, పరజ్ఞానాన్ని, పరమభక్తినీ, సర్వమానవతనూ ప్రబోధిస్తూ ముందుకు కదులుతాయి. భక్తులు వారి వారి గ్రామానికి ఈ రథాలు వచ్చినపుడు సాదరంగా మేళతాళాలతో, హరినామసంకీర్తనలతో స్వాగతించి స్వామివారి కృపకు పాత్రులు కావాలని కోరుతున్నాం.

తిరుమలకు ప్రతి రోజు వేలసంఖ్యలో వేంకటేశ్వరస్వామి వారిని సందర్శించి తరించాలనే ఆకాంక్షతో భారతదేశం నలుమూలల నుండే కాకుండా విదేశాల నుండి కూడ భక్తులు వస్తుంటారు. మరి ఆర్థిక పరిస్థితుల కారణంగానో, మరే ఇతర కారణాల వల్లనో తిరుమలకు రాలేని భక్తులు శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని దర్శించుకునే భాగ్యం ఈ లోకకల్యాణ రథయాత్రలతో లభిస్తుంది. రథాలలోని శ్రీనివాసుని సేవించినట్లయితే సాక్షాత్తూ తిరుమలకు వచ్చి స్వామిని దర్శించుకొనినంత పుణ్యమే ప్రాప్తిస్తుంది. ఈ రథాలలో అధివసించిన శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని ఊరూర, వాడవాడలా ప్రజలు స్వాగతించి, దర్శించి, పూజించి పునీతులవ్వాలని కోరుకుంటున్నాం.

**రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే.**

# అర్థపంచక జ్ఞానం

- మొవ్వ వృషాద్రిపతి

మానవుడు ఇహలోకంలో భోగాలను, పరలోకంలో మోక్షాన్ని పొందాలని కోరుతూ ఉంటాడు. భోగ మంటే శారీరక సంబంధమైన సుఖం. మోక్షమంటే జనన మరణ సంసార రూపమైన అవిద్యను పూర్తిగా వదలి, భగవత్సన్నిధాన సుఖం నిరంతరం అనుభవించటం. ఈ రెండింటిని పరిపూర్ణంగా పొందటానికి అర్థపంచక జ్ఞానం అవసరం.

మనుష్యుడు ఉదయం నుండి నిద్రించే వరకు ఏదో ఒక వృత్తిని కొనసాగిస్తాడు. అది ధన సంపాదన కోసం. ధనం ఉదరపోషణ కోసం. ఈ వృత్తులలో ఒక ప్రధాన వృత్తి వ్యవసాయం. వ్యవసాయాన్ని చేయటానికి రైతు, ఎన్నో ఉపకరణాలను సంపాదించు కోవాలి. నాగళ్ళు-బళ్ళు-ఎద్దులు మొదలైనవి ఉపకరణాల్లో కొన్ని మాత్రమే. వాని సాయంతో భూమిని దున్ని-నీరు పెట్టి నాటు వేస్తే పుష్కలంగా ధాన్యం పండుతుంది. ఆ ధాన్యంతో ఇంటిల్లపాదీ సుఖజీవనం కొనసాగిస్తున్నారు.

ఇపుడు 1) రైతు స్వ స్వరూపం 2) నాగలి, బళ్ళు-ఎద్దులు ఇవి ఉపాయ స్వరూపం. 3) ధాన్యం పర స్వరూపం 4) అతివృష్టి - రోధి స్వరూపం 5) అన్నం-త్రాగునీరు మొదలైన జీవితావసర వస్తువులన్నీ పురుషార్థ స్వరూపం. ఇది భౌతిక రూపమైన అర్థ పంచకం.

ఇంతకు అర్థపంచక జ్ఞానమంటే 1) స్వ స్వరూప జ్ఞానం, 2) పర స్వరూప జ్ఞానం, 3) ఉపాయ స్వరూప జ్ఞానం, 4) విరోధి స్వరూప జ్ఞానం, 5) పురుషార్థ స్వరూప జ్ఞానం.

స్వ స్వరూపమంటే జీవ స్వరూపం. జీవులు 1) నిత్యులనీ, 2) ముక్తులనీ, 3) కేవలులనీ, 4) బద్ధులనీ, 5) ముక్షువులనీ ఐదు రకాలు.

నిత్యులంటే భూత భవిష్యద్వర్తమాన కాలాలకు అతీతులు. వారికి జనన మరణాలు లేవు. వారు స్వయంగా ప్రకాశిస్తారు. ఎల్లప్పుడు భగవదారాధనతో కాలంగడుపుతుంటారు. శేషుడు - గరుత్మంతుడు విష్వక్సేనుడు మొదలైన వారు నిత్యులు.

ముక్తులంటే భూలోకంలో పుట్టి సమస్త శాస్త్రాలు పఠించి, గురూపదేశంతో సాధుసజ్జన సాంగత్యంతో భగవంతుని నిరంతరం స్మరిస్తూ ప్రకృతి బంధాల నుండి విడివడి మోక్షాన్ని పొందేవారు.

కేవలులు జ్ఞానయోగాన్ని ఆశ్రయిస్తారు. ఉపాసనాదులందు ఆసక్తులై ఉంటారు. పాపాలను పోగొట్టుకుని, వైకుంఠ పదవికి పోకుండా విరజానదిలో స్నానంచేసి, పరమపదానికి బాహ్య ప్రదేశంలో ఉన్న కైవల్యం పొంది ఆత్మానుభవం పొందుతారు.

అద్వైతంలో కైవల్యమన్నా మోక్షం లేక పరమపదమన్నా ఒకటిగానే భావిస్తారు. కాని విశిష్టాద్వైతం ప్రకారం కైవల్యమనేది వైకుంఠ నగరానికి కొంచెం దూరంలో ఉండే ఒక లోకం. కైవల్యం పొందినవారికి ఆత్మానుభవమే తప్ప భగవత్సాక్షాత్కారానుభవం ఉండదని వైష్ణవుల విశ్వాసం.

బద్ధులంటే ఈ దేహమే ఆత్మగా భ్రమిస్తారు. వీరినే దేహాత్మ వాదులంటారు. వీరికి స్వస్వరూప పరస్వరూపాలజ్ఞానం ఉండదు. వీరు కడుపు నింపుకోవడం, కామసుఖాలు పొందటమే పరమావధిగా భావించి, శంకరులవారు సాయించినట్లు "పునరపి జననం - పునరపిమరణం", అన్నట్లు మాటిమాటికి జన్మించి మరణిస్తూ ఉంటారు.

ఇక ముముక్షువులంటే, ఈ ప్రపంచం విష్ణుమాయ వల్ల జన్మించిందనీ, సంసారాదులు కారాగృహాల వంటివని భావిస్తారు. భగవత్కటాక్షం పొందాలని, సద్గురునాశ్రయిస్తారు. వేదశాస్త్రాదులందు విశ్వాసం గలవారై సంసారంలో తమ ధర్మాలను మాత్రం నిర్వర్తిస్తూ, వాని యందు లోలత్వం లేకుండా

భగవదారాధనాపరులై ప్రవర్తించేవారు. ముముక్షువులంటే ముక్తులు.

పరస్వరూపం - 1.పరత్వం 2.వ్యూహం 3.విభవం 4.అర్చావతారం 5.అంతర్యామిత్వం అని పంచవిధాలు.

పరస్వరూపమంటే, కోటి సూర్యుల కాంతితో ప్రకాశిస్తూ శ్రీభూనీళాభార్యాయుక్తుడై కాంచన చేలుడై, శంఖం, చక్రం, గద, ఖడ్గం, చాపం అనే పంచాయుధాలతో రత్న సువర్ణ హార కిరీట కేయూరహారాదులచే అలంకరింపబడినవాడై గరుత్మంతుడు, శేషుడు, విష్వక్సేనుడు మొదలైన నిత్యసూరులచే ముక్తులచే సదా సేవలనందుకొంటూ, సత్వగుణ స్వరూపుడై ఆనంద స్వరూపంతో జగద్వ్యాపార బాధ్యతలు విష్వక్సేనునకప్పగించి, ఆదిశేషునిపై పవ్వళించియుండు నారాయణుడే పరస్వరూపం.

వాసుదేవవ్యూహం - పూర్వం అర్జునునితో కూడి శ్రీకృష్ణుడు ప్రతిజ్ఞానిర్వహణ కోసం తొమ్మిదిమంది వైదిక బ్రాహ్మణుల పుత్రులను తీసుకువచ్చిన స్థానం. దీన్నే జ్ఞానులు వాసుదేవ వ్యూహమని వ్యవహరిస్తారు.

సంకర్షణవ్యూహమంటే పాతాళలోకంలో నివసిస్తూ బలిచక్రవర్తి పూజలను గ్రహించి, అచ్చటివారిని రక్షించే దైవాన్ని సంకర్షణుడంటారు. అదే సంకర్షణ వ్యూహం.

పాలసముద్రంలో లక్ష్మీసహితుడై నారాయణుడు నివసిస్తున్నాడు. ఇక్కడ నుండియే, మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన రామకృష్ణాద్యవతారాలు వచ్చాయి. దేవతలు, మహర్షులు, శంకరబ్రహ్మలు తమకేదైన ఆపద కల్గినచో, ఇక్కడికే వచ్చి నారాయణునకు విన్నవించుకుని, బాధలనుండి విముక్తులవుతారు. దీన్నే అనిరుద్ధవ్యూహమని పిలుస్తారు.

విభవములంటే మహావిష్ణువు యొక్క రామకృష్ణాద్యవతారాలు. లోకంలో ధర్మ లోపం జరిగినప్పుడు సాధువులను రక్షించి, దుష్టులను సంహరించటానికి తనను తానే సృష్టించుకొంటాడు. ఆ విధంగా భూలోకానికి వచ్చిన అవతారాలలో కొన్ని గౌణావతారాలు, కొన్ని పూర్ణావతారాలు, కొన్ని అంశావతారాలు కొన్ని ఆవేశావతారాలుగా చెబుతారు. పూర్ణ, పరిపూర్ణావతారాలైన రామకృష్ణాద్యవతారాల వలే మిగిలినది సంసేవ్యమానాలు కావని, కొందరు సాయించారు.

అర్చావతారమంటే, బంగారు, వెండి, రాగి, ఇత్తడి మొదలైన లోహాలతో, శిలలతో, కొయ్యతో చేయబడిన విగ్రహ రూపాలను ధరించి, దేవాలయాలలో, భక్తుల గృహాల్లో, ఉపాసకులచే ఆరాధింపబడుట.

అంతర్యామి అంటే ఒక ఇనుప కడ్డి ఎఱ్ఱగా కాలిస్తే ఆ కడ్డిలో అన్ని చోట్ల అగ్ని వ్యాపించి ఉంటుంది. అలాగే సర్వభూతాలలో ఆత్మ స్వరూపుడై ఉండి, సర్వ విశ్వంలో నిండి ఉండుట. భక్తుల హృదయ గుహలలో నిత్యం నివసించి ఆనందం కల్గించే రూపం అంతర్యామి. ఈ అంతర్యామి ప్రాణులలో ప్రవేశింపకపోతే, ఈ ప్రాణులన్నీ జీవచైతన్య రహితంగా గోడలపై నిలబెట్టిన బొమ్మలవలే ఉంటాయి. ప్రత్యణువులోను పరమాత్మ ప్రవేశమే అంత్యమిత్వమని శాస్త్రాలు వచిస్తున్నాయి.

ఇక ఉపాయ స్వరూపం తెలుసుకుందాం. ఇది ఐదు విధాలు. 1.కర్మస్వరూపం 2.జ్ఞానస్వరూపం 3.భక్తిస్వరూపం 4.ప్రపత్తి స్వరూపం 5. ఆచార్యాభిమాన స్వరూపం.

కర్మమంటే వ్రతాలు ఆచరించటం, గోభూస్వర్ణాది దానాలు చేయటం. పౌండరీకము, పుత్రకామేష్టి - హయమేధ-రాజసూయాది యజ్ఞకార్యాలు నిర్వహించటం, జపం, తపస్సు వేదాధ్యయనాదులు, గార్హపత్య వైశ్వదేవం మొదలైన హోమాలు చేయటం, తీర్థయాత్రలకు పుణ్యక్షేత్రాలకు వెళ్ళి సంపాదించిన ఫలం భగవంతునకర్పణం చేస్తే అవన్నీ మోక్ష ప్రాప్తికి కారణాలౌతాయి.

జ్ఞానంతో యోగాన్ని సాధించి, తద్వారా భగవంతుని నిజహృదయ కమలంలో దర్శించి ఉపాసించుట, జ్ఞాన స్వరూపం. ప్రతి వస్తువులోను జ్ఞానులు దైవసాక్షాత్కారాన్ని పొందగలుగుతారు.

ఇక భక్తి అంటే, మానవుడు తాను ఏ స్థితిలో ఉన్నా భగవచ్చింతనను విడువకుండా, తైలధారామాదిరిగా, భగవంతునియందు చిత్తాన్ని లగ్నం చేయటం. భక్తుడు చిత్త చాంచల్యం

లేక, నీరుత్రాగుతున్నా, భోజనం చేస్తున్నా, నడుస్తున్నా కార్య మగ్నుడైయున్నా నిద్రిస్తున్నా భగవచ్చింతన మానక ఉండడం.

ప్రపత్తి కర్మజ్ఞాన వైరాగ్యాదులు పొంద శక్తిలేనివారికి చాలా సులభ మార్గం. తన దేహరక్షణభారం, ఆత్మరక్షణ భారం, భగవంతునిపై ఉంచి, తాను వానిని గురించి విచారింపక, భగవద్గుణానుభవంతో, కైంకర్యాదులతో కాలం పుచ్చటం.

ఆచార్యాభిమానమంటే, జ్ఞానానుష్ఠానపరుడు, సమర్థుడు సదాచారతత్పరుడైన గురుపాదాలు ఆశ్రయించుట. ఆయన సూచించిన ఆధ్యాత్మిక మార్గంలో జీవితాన్ని సార్థకం చేసుకుని, మోక్షానికి మార్గం సుగమం చేసుకోవాలి.

ఇక నాల్గవది విరోధి స్వరూపం. ఇది ఐదు విధాలు.

1) స్వరూప విరోధి

2) పరత్వ విరోధి

3) ఉపాయి విరోధి

4) ప్రాప్తి విరోధి

5) పురుషార్థ విరోధి.

స్వరూప విరోధి అంటే శరీరమే జీవుడు – ఆత్మవేరుగా లేదు, అని భావించి తన దేహం మీద అభిమానాన్ని పెంచుకోవటం. ఒకవేళ భగవంతుడుంటే ఉండునుగాక, అతనితో నాకేం లాభమని ఉపేక్షించే స్వభావం. అలాంటి భావం ముక్తిని పొందటానికి విరోధం.

పరత్వవిరోధి అంటే, సాత్త్వికదైవాలను వదలి తామస పూజలు చేయుట వంటివి మోక్షప్రాప్తికాటంకం కలిగిస్తాయి. పురుషార్థ విరోధి. ధర్మార్థ కామమోక్షాలు నాలుగు పురుషార్థాలుగా చెప్పబడినాయి. ఇవి నాలుగు మానవునకు ఉపాదేయాలే. ఇందులో, ధర్మ–మోక్షాలను వదలి కేవలం కామ మోక్షాలను మాత్రమే ఆరాధించటం. శాస్త్ర ధర్మాలను వదలి తన శారీరక సుఖాలకోసం పలుమార్గాల్లో ప్రవర్తించటం. ఇవి కూడ మోక్షప్రాప్తికి విరోధాలే.

ఉపాయవిరోధినిగూర్చి వివరిస్తాను. భగవత్పూజలు చేస్తాడు. కానీ భగవంతుడొకడున్నాడా? ఉన్నా నేను చేసిన ఈ కొద్ది పూజలనుగ్రహించి మోక్షం ఇస్తాడా? అని సందేహించటం ఉపాయ విరోధి. అంటే భగవంతునియందుగానీ, తాను చేసే పూజలు, కీర్తనలు, వ్రతాదులయందు విశ్వాసం లేక ఉండుట.

ప్రాప్తివిరోధి అంటే మానవుడు చేయరాని పనులు చేస్తూ భగవంతుడు లేడంటూనే ఆయనను దూషిస్తూ భగవద్భక్తులనెగతాళి చేస్తూ విచ్చలవిడిగా వ్యవహరించటం.

## తిరుపతిలో దర్శనీయ ఆలయాలు



### శ్రీ గోవిందరాజస్వామి ఆలయం :

ఇతిహాసం ప్రకారం ఈ క్షేత్రాన్ని శ్రీవైష్ణవాచార్యులయిన శ్రీరామానుజులు ప్రతిష్ఠించారని ప్రతీతి. శ్రీ గోవిందరాజస్వామి ఆదిశేషునిపై శయనించిన భంగిమలో దర్శనమిస్తున్నారు. శ్రీ ఆండాళ్, శ్రీ పార్థసారథి మరియు శ్రీ వేంకటేశ్వరస్వామి గుడులు శ్రీ గోవింద రాజస్వామి ఆలయం ప్రాంగణంలో ఉన్నాయి. విజయ నగర రాజుల శిల్పకళాచాతుర్యానికి ప్రసిద్ధి చెందినది ఈ ఆలయం. **ఫోన్ నెం.:0877-2264592.**

### శ్రీ కోదండరామస్వామి ఆలయం :

తిరుపతి రైల్వేస్టేషన్‌కు ఒక కిలోమీటరు దూరంలో ఉన్న ఈ ఆలయంలో శ్రీ కోదండరామస్వామి వెలసి ఉన్నాడు. రావణ వధానంతరం సీతా లక్ష్మణులతో శ్రీరాముడు ఈ స్థలంలో కొంతసేపు ఉన్నందుకు గుర్తుగా ఈ ఆలయం నిర్మింపబడింది. **ఫోన్ నెం.: 0877-2264584.**

### శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం :

తిరుపతి పట్టణానికి 3 కి.మీ.దూరంలో ప్రసిద్ధశైవక్షేత్రం వెలసి ఉంది. కపిలమహర్షి పూజించిన శివలింగం కనుక కపిలేశ్వరుడని ఇచటి తీర్థం కపిలతీర్థం అని పిలువబడు తున్నది. **ఫోన్ నెం. : 0877-2264587.**

### అలమేలు మంగాపురం (తిరుచానూరు) :

తిరుపతికి 5 కి.మీ. దూరంలో ఉన్న ప్రాచీనమైన క్షేత్రం తిరుచానూరు. దీన్నే అలమేలు మంగాపురం అని కూడా అంటారు. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవేరి శ్రీ పద్మావతి అమ్మవారు ఇచట పూజలందుకొంటున్నది. తిరుమల యాత్రికులు తిరుచానూరు అమ్మవారిని దర్శించినట్లయితే తమ యాత్ర ఫలవంతమవుతుందని ప్రసిద్ధి. అందువల్లే తిరుమల యాత్రికులు, తిరుచానూరుకు వెళ్లి శ్రీ పద్మావతి అమ్మవారిని పూజిస్తారు. తిరుచానూరులో ఉన్న పవిత్ర పుష్కరిణి "పద్మ సరోవరం"లో శ్రీ పద్మావతి అమ్మవారు ఆవిర్భవించినారని పురాణ ప్రసిద్ధ. **ఫోన్ నెం. : 0877-2264586.**

ఇక చివరిది ఐదవది పురుషార్థా స్వరూపం. ఇది మళ్ళీ ఐదు విధాలు. 1.ధర్మం 2.అర్థం 3.కామం 4.కైవల్యం 5.భగవత్ప్రాప్తి.

ధర్మమంటే భగవంతుడు శాస్త్రాల ద్వారా ధర్మం చేయాలని ప్రతిపాదించాడే ఆ ధర్మములందే మనస్సు నిలిపి వానిని పాటించటం. పరులకు కీడుచేయకుండటం. హింసా కార్యాల్లో పాల్గొనకుండా సర్వప్రాణులయందు దయ కలిగి ఉండుట.

అర్థమంటే లోకమంతా ధనమూలం. డబ్బులేనిదే ఏ కార్యం చేయటానికి సమర్థుడు కాడు. కనుక ధర్మబద్ధమైన ఏదో ఒక వృత్తిలో ప్రవేశించి, న్యాయమార్గంలో ధనమార్జిస్తూ కుటుం బాన్ని బంధువులను, అతిథ్యభ్యాగతులను ఆదరిస్తూ పితృదేవత లకు తర్పణాలిస్తూ దేవతలను పూజిస్తూ దేశకాల పాత్రాను సారంగా జీవించటం.

కామమంటే శారీరక సౌఖ్యం. తల్లిదండ్రులతో పుత్రాదు లతో తన సంపదలనుభవిస్తూ స్వభార్యతో శయ్యా సుఖాన్ని పొందుతూ, తగిన విధంగా వస్త్రాభరణాలంకారాదులు కల్గి ధర్మమార్గంలో సుఖించుట.

కైవల్యమంటే జీవోపాసనతో యోగసిద్ధిని పొంది శరీరం విడిచి విరజానదిలో స్నానం చేసి, స్వస్వరూపాన్ని పొందటం. భగవత్సాన్నిధ్యం వీరికి లభింపదు. వైకుంఠానికి కొంచెం దూరంలో ఉండే ప్రాంతమని వైష్ణవుల విశ్వాసం. అద్వైతులు కైవల్య వైకుంఠాలనొకేరీతిగా భావిస్తారు.

ఇక చివరిది పరమపదం. ముముక్షువు సూర్య మండలాన్ని ఛేదించుకుని, అర్చిరాది మార్గంలో పోయి విరజా నదిలో స్నానం చేస్తాడు. ఇరవై నాలుగు తత్త్వాలతో కూడిన సూక్ష్మస్వరూపాన్ని విడిచి విష్ణురూపాన్ని పొందుతాడు. అదే ముముక్షువుకు స్వస్వరూపం. మహావిష్ణు సన్నిధికి చేరి ఆయన 'కస్త్వమ్' నీవెవ్వరు? అని అడుగగా "అహంబ్రహ్మాస్మి" అని చెబుతాడు. భగవంతుడు అతనిని అనుగ్రహించి శాశ్వతానందం కలిగిస్తాడు. అదే పరమపదం.

ఈ అర్థపంచక జ్ఞానం గురువు ద్వారా పొంది, దానినా చరించినవారు శాశ్వత పరమపద వాస ఆనందసిద్ధి పొంద గలరని శాస్త్రాలు చెబుతున్నాయి.

# రామభక్తి సామ్రాజ్యంలో...
# సంగీత సమ్రాట్టులు

- నేమాన వేంకటరమణ

రా మాయణాన్ని 'పాఠ్యేగేయేచమధురం' అని వాల్మీకి మహర్షి స్వయంగా చెప్పాడు. ఆంధ్రదేశానికి చెందిన ముగ్గురు వాగ్గేయ కారులు తమ తమ సంగీత రచనల ద్వారా శ్రీరామతత్త్వాన్ని, శ్రీరాముడి గుణగణాల్ని, శ్రీరామరూప లావణ్యాలను, శ్రీరామచంద్రుని గొప్పతనాన్ని ఎంతో హృద్యంగా, రమణీయంగా గానంచేశారు. వారు భక్తరామదాసు, త్యాగరాజు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, 'శ్రీరామ నీ నామమెంతో రుచిరా' అంటూ రామ నామంలోని మాధుర్యాన్ని తాను గ్రహించి తిరిగి తన జాతి కందించినవాడు భక్తరామదాసు. సర్కారీ ధనంతో శ్రీరామమందిర నిర్మాణం గావించి జైలుకు వెళ్ళిన రామదాసు, అక్కడి అధికారులు పెట్టే బాధలకు తట్టుకోలేక -

**సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము రామచంద్రా!**
**ఆ పతకానికి పట్టె పదివేల వరహాలు రామచంద్రా!**

- అంటూ "ఇవన్నీ మీకోసం చేయించాను. వీటినన్నింటినీ మెళ్ళో వేసుకుని ఎవరబ్బ సొమ్మని కులుకుతూ తిరిగేవు రామచంద్రా!" అని నిందించాడు. అంతలోనే తెప్పరిల్లి -

**అబ్బ తిట్టితినని ఆయాసపడబోకు రామచంద్రా!**
**ఈ దెబ్బలకోర్వక అబ్బా తిట్టితినయ్యా రామచంద్రా!**

అని వాపోయాడు. రోజురోజుకీ శిక్షలు పెరుగుతున్నాయి, శ్రీరామదర్శనం కాలేదు - దాంతో 'మము బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి' అని సీతమ్మ తల్లికీ మొరబెట్టుకున్నాడు. రామదాసుపై కరుణ కలిగి శ్రీరామలక్ష్మణులు మారువేషాల్లో వచ్చి, తానీషాకు సొమ్ము చెల్లించి, రామదాసును విడిపించారు. ఈ కథ ఆంధ్రదేశంలో తెలీనివారు ఉండనట్లే, రామదాసు కీర్తన కూడా తెలీని తెలుగు లోగిలి, రామమందిరం లేని పల్లెలు ఉండవంటే అతిశయోక్తి కాదు.

ఆంధ్రావనిలో సువర్ణముఖీ నదీతీరంలో నివసించిన మునిపల్లె సుబ్రహ్మణ్యకవి మొత్తం అధ్యాత్మరామాయణాన్ని కీర్తనల రూపంలో వెలయించాడు. రామాయణగాథ 6 కాండలను 103 కీర్తనలు, ఒక్క చూర్ణికగా రాసి తరించాడు.

అధ్యాత్మరామాయణ కథను ఈశ్వరుడు పార్వతీదేవికి వివరిస్తున్నట్టుగా కీర్తనలు రచింపబడ్డాయి. శ్రీరామచంద్రుడి మోహనరూపాన్ని, గుణగణాల్ని ఎంతో హృద్యంగా, హృదయంగమంగా సుబ్రహ్మణ్యకవి రాశాడు.

శ్రీరామచంద్రుడి జననాన్ని వర్ణించే ఈ కీర్తనను పరిశీలిద్దాం.

**పరమాన్నము భుజియించిన ముప్పురు తరుణులు**
**గర్భిణులై వెలిగిరి నిరతము సురకాంతలనగ**
**తొమ్మిది నెలలు నిండ కౌసల్యగనె సుతుని**
**పరమచైత్ర శుద్ధనవమిని పునర్వసు నక్షత్రమున**
**సుమనోహర కర్కాటక లగ్నమునను శేషాచలేశుడగు**
**హరి జనించె సానందముగను ॥**

బాలుడైన శ్రీరామచంద్రుడిని రకరకాలుగా వర్ణించుకుని మునిపల్లె సుబ్రహ్మణ్య కవి మురిసిపోయాడు. రామదాసు, మునిపల్లెల రామసంకీర్తనంతో పునీతమైన ఆంధ్రదేశం త్యాగరాజు ఆవిర్భావంతో ధన్యమైనది. శ్రీరామకీర్తనం చేసి, రామసాక్షాత్కారం పొందిన మహావాగ్గేయకారుడు త్యాగయ్య.

'నిధి చాలా సుఖమా..... రాముని సన్నిధిసేవ సుఖమా?' అని మనసును ప్రశ్నించుకొని రాముని సేవకంటే పెన్నిధి ఇంకొకటి లేదని, రాజుపంపిన కానుకల్ని సైతం సున్నితంగా తిరస్కరించాడు త్యాగయ్య. "ఉండేది రాముడొక్కడు ఊరకే చెడిపోకు మనసా!" అన్న త్యాగయ్యకు రాముడే సర్వస్వం. రామనామమే బలం. శ్రీరాముడి పరివారంలో తనుకూడ ఒకడు అనేదే ఆయన తత్త్వం. అందుకే 'సీతమ్మ మాయమ్మ...... శ్రీరాముడు మాకు తండ్రి. వాతాత్మజ, సౌమిత్రి, వైనతేయ రిపు మర్దనధాత భరతాదులు సోదరులు మాకు మనసా! అంటూ వారందరూ తనకు పరమబాంధవులని లోకానికి తెలియజెప్పాడు.

రామభక్తి సామ్రాజ్యంలో మకుటంలేని మహారాజులు భక్తరామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, త్యాగరాజస్వామి - ఇలా తెలుగునేల నలు చెరగులా శ్రీరామభక్తి, శ్రీరామసంకీర్తనం గావించిన ఈ మహావాగ్గేయకారులు సంగీత, సాహిత్య ప్రపంచాలకు చిరస్మరణీయులు.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీనివాసంలో స్థానిక ఆలయాల టిక్కెట్ల కౌంటరు

తిరుపతిలోని శ్రీనివాసం వసతి సముదాయంలో ఆంధ్రబ్యాంకు ప్రతిరోజు ఉ॥ 8.00 నుండి సా॥ 5.00 వరకు సేవా టిక్కెట్ల కౌంటరును నిర్వహిస్తోంది. యాత్రికులు ఈ సదుపాయాన్ని వినియోగించుకోవచ్చు.

తిరుమల తిరుపతి దేవస్థాన స్థానిక ఆలయాలలో ఈ క్రింద కనబరచిన సేవా టిక్కెట్లను నిర్ణీత రుసుమును చెల్లించి మరుసటిరోజు సేవాటిక్కెట్లను ఒక రోజు ముందుగానే పొందవచ్చును.

## శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం, తిరుచానూరు

| సేవ పేరు | వారం | ప్రవేశం | రుసుము |
|---|---|---|---|
| 1) కల్యాణోత్సవం | (ప్రతిరోజు) | 5 | 500.00 |
| 2) అష్టదళపాద పద్మారాధన | (సోమవారం) | 5 | 1500.00 |
| 3) తిరుప్పావడ | (మంగళవారం) | 5 | 3000.00 |
| 4) అభిషేకం | (శుక్రవారం) | 1 | 200.00 |
| 5) లక్ష్మీపూజ | | 10 | 116.00 |
| 6) పుష్పాంజలి | (శనివారం) | 10 | 1500.00 |

## శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం, శ్రీనివాసమంగాపురం

| సేవ పేరు | వారం | ప్రవేశం | రుసుము |
|---|---|---|---|
| 1) కల్యాణోత్సవం | (ప్రతి రోజు) | 2 | 500.00 |
| 2) అభిషేకం | (శుక్రవారం) | 1 | 100.00 |

## శ్రీ గోవిందరాజస్వామి ఆలయం, తిరుపతి

| సేవ పేరు | వారం | ప్రవేశం | రుసుము |
|---|---|---|---|
| 1) ఊంజల సేవ | (శుక్రవారం) | 5 | 116.00 |

## శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం, తిరుపతి

| సేవ పేరు | వారం | ప్రవేశం | రుసుము |
|---|---|---|---|
| 1) రుద్రాభిషేకం | (సోమవారం తప్ప) | 1 | 50.00 |
| 2) ఊంజల సేవ | (సోమవారం) | 2 | 116.00 |
| 3) కల్యాణోత్సవం | (మాస శివరాత్రిరోజు మాత్రమే) | 2 | 250.00 |
| 4) మహాన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకం | (మాస శివరాత్రిరోజు మాత్రమే) | 2 | 300.00 |

\- కార్యనిర్వహణాధికారి




**( శల్యపర్వం ఈ సంచికతో ముగిసింది)**

ధర్మరాజు వదిలిన వాడిబాణాల ధాటికి శల్యుడు మూర్ఛపోగా అశ్వత్థామ వానిని రణరంగానికి దూరంగా తీసుకు వెళ్ళాడు. ధర్మరాజు మహోత్సాహంతో ముందుకు సాగుతు న్నాడు. శల్యునికి స్మృతి వచ్చింది. ఇనుమడించిన క్రోధంతో ధర్మపుత్రుని ఎదుర్కొన్నాడు. కౌంతేయుని రథాశ్వాలు నేల కూలాయి. సారథి ఒరిగాడు. ధర్మరాజు మనసా సర్వేశ్వరుని ప్రార్థించి మరొక రథం మీదికి నడిచాడు. భీమసేనుని బాణ ఘాతానికి శల్యుని విల్లు విరిగింది. గుర్రాలు ఆఖరి శ్వాస విడిచాయి. కవచం విడిపోయింది. రథం దిగి డాలు కత్తులతో వస్తున్న శల్యుని భీముడే ఎదుర్కొని ఆయుధ శూన్యుని చేశాడు.

గదా ధారియై శల్యుడు ధర్మజుని మీదికి నడిచాడు. ధర్మరాజు త్రిపురాంతకుని స్మరించి శక్తి ప్రయోగించగా అది వాని రొమ్ము చీల్చి, వెన్ను విరిచి, భూమిలో దిగబడింది. నవ రంధ్రాల నుంచీ రక్త ధారలు స్రవిస్తుంటే శల్యుడు ఉత్తుంగ పర్వత శిఖరంలా నేలకు వాలాడు. అది చూసి శల్యుని తమ్ముడు వచ్చి పాండవాగ్రజుని ముందు నిలవలేక అన్నతో వీరస్వర్గం చేరాడు. మద్ర యోధులందరూ ఆ పట్టులో మట్టి కరిచారు. అది కురు సేనకు విపరీత వ్యధ కలిగించి పలాయనం శరణ్య మనిపించింది. తన సేనల భయం చూసి సుయోధనుడు వారందరికీ ఉత్సాహం కలిగించి రణోన్ముఖులను చేసుకున్నాడు.

అనంతరం జరిగిన సంగ్రామంలో సాళ్వుడు తన భద్ర గజంతో నేల కూలాడు. సహదేవుని చేతులలో శకుని కొడుకు ఉలూకుడు వాలిపోయాడు. కొడుకు మరణం కలిగించిన విషాదం రోషంగా మారి శకుని సహదేవుని మీదికి రాగా కొంతసేపు ధనుర్విద్య ప్రదర్శించి ముగ్గిన తాటిపండులా శకుని తల నేలకు రాల్చాడు సహదేవుడు.

స్థితి గతులు గమనించి దుర్యోధనుడు గదా ధారియై రణరంగం నుండి పలాయనం పఠించాడు మహారాజా! అని సంజయుడు: ప్రభూ! కృపాశ్వత్థామలతో కృతవర్మ మిగిలాడు. తీవ్ర క్రోధంలో ఉన్న సాత్యకి నన్ను చూసి కత్తి దూశాడు. అంతలోనే ధృష్టద్యుమ్నుడు వచ్చి: సాత్యకీ! ఈ సంజయుడు ఏం చేశాడు. వీణ్ణి విడిచిపెట్టు, అన్నా వినక కత్తి దూస్తూనే ఉండగా వ్యాసుల వారు విజయం చేసి సాత్యకిని వారించారు. తక్షణం నేను రణరంగాన్ని రెండంగలలో విడిచి, సుయోధనుడున్న ప్రాంతానికి చేరి విషయం వివరించాను.

విన్న సుయోధనుడు అక్కడే ఉన్న మడుగులో దాగి ఉండడానికి నిశ్చయించుకున్నాడు. సుయోధనుని శరీరానికి ఒక్క చుక్క కూడా నీరు సోక లేదు. నే నక్కడే నిలబడ్డాను కింకర్తవ్యతామూఢుడనై.

అప్పటికి మన మహారథికులు ముగ్గురూ వచ్చి నా విషయం విని విచారిస్తూండగా పాండవవీరులు వస్తున్న అలికిడి అయింది. ఇక అక్కడ ఉండడం మంచిది కాదనీ, నన్ను కృపాచార్యుల రథం మీద ఎక్కించి నడిపేశారు.

వచ్చిన పాండవ పక్షంలో ఉన్న యుయుత్సుడు కృష్ణా ర్జునులతో సంప్రదించి దుర్యోధనుని అంతఃపుర జనాన్నీ వారి రక్షక జనాన్ని హస్తినాపురం తరలించి విదురుని ఆజ్ఞానుసారం మీకు తెలియనివ్వకుండా ఎవరి మందిరాలకు వారిని పంపాడు.

## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

**సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ కింది నియమాలు పాటించవలసిందిగా మనవి చేస్తున్నాం!!**

- రచనలు కాగితానికి ఒక వైపునే రాయాలి.
- రచన స్పష్టంగా, అర్థమయ్యేలా రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమేననీ, మరే పత్రికకు పంపలేదనీ హామీ పత్రం జతచేయాలి.
- కలంపేరుతో రాసే రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు తెలియ పరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షిక పేరు రచన మీద, కవరు మీద రాయాలి.
- రచనల ఎంపిక, ముద్రణల విషయంలో ప్రధాన సంపాదకునిదే తుది నిర్ణయం. అందుకు సంబంధించి ఎలాంటి ఉత్తరప్రత్యుత్తరాలకు ఆస్కారం లేదు.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు – **తప్పనిసరిగా ఆ దేవాలయ ఫోటోలు జత చేయవలసి ఉంటుంది.** ఈ శీర్షికలో ఫోటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- **సంక్రాంతి, దీపావళి లాంటి పండుగలకు** సంబంధించిన రచనలు పంపే వారు కనీసం **మూడు నెలలకు ముందుగా** వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్హం కాని రచనలు తిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జతచేయవలసి ఉంటుంది.
- ప్రచురించిన ప్రతి రచనకు (**శ్రీ వేంకటేశ్వర లీలలు** శీర్షికకు తప్ప) తగిన పారితోషికం శ్రీవారి ప్రసాదంగా పంపుతాము.

మీ రచనలు పంపాల్సిన చిరునామా

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083, చిత్తూరు జిల్లా.**

పాండవ వీరులు మన జాడ తెలియక వారి శిబిరాలు చేరారు. మేము మళ్ళీ మడుగును సమీపించాం. మన యోధులలో అశ్వత్థామ ఇంకా సంగ్రామం సాగించడానికే సన్నద్ధంగా ఉన్నా సుయోధనుడు ఆ రాత్రికి విశ్రాంతి తీసుకుని మరునాడు ఉదయం ఆలోచిద్దాం అన్నాడు.

ఇలా వీరు మాటాడుతూండగా ధర్మరాజు ఆజ్ఞను అనుసరించి వీరిని వెదుక వచ్చిన బోయలు ఆ కథ అంతా భీముని ద్వారా ధర్మరాజుకి అందించగా వారు రథారూఢులై మడుగు సమీపానికి వచ్చారు.

ఆ ధ్వని విన్న మన యోధులు దూరంగా వెళ్ళారు. ఎక్కడా మనిషి జాడ కనిపించక ఆలోచించి దుర్యోధనుడు మాయా విద్యతో ఎక్కడో దాగి ఉంటాడని భావించి కృష్ణుని సలహా ననుసరించి ఆ హ్రద సమీపానికి చేరి పరి పరి విధాల అవమాన వాక్యాలతో రెచ్చగొట్టి మానధనుడైన నీ కొడుకుకు పౌరుషం రప్పించారు.

ధర్మరాజు ఆడిన మాటలు సహించలేక నీ కొడుకు : పాండవాగ్రజా! ఎందుకింక యుద్ధం! ఎవరికోసం ఏం మిగిలిందని చెయ్యాలి యుద్ధం, కాదు కదనం తప్పుదంటావా! కొంతసేపు విశ్రాంతి తీసుకురండి. ఇప్పుడు నేను ఏకాకిని, వాహనం కూడా లేదు. అయినా మీ అందరినీ సంహరించి మా వీరుల ఋణం తీర్చుకోగలను. కాని నా కా కోరిక లేదు. ఈ రాజ్యం అంతా నీకు ధారవోస్తున్నాను. వెళ్ళి ఏలుకో అనగా

ధర్మనందనుడు నవ్వుతూ: నీ కే దిక్కు లేదే? ఇంక నువ్వా ధారవోసేది, ఈ పొల్లు మాటలు కట్టిపెట్టి వీరుడవై మాలో ఎవరితోనో ఒకరితో యుద్ధం సాగించు. నీకు కావలసిన వాహనం, ఆయుధం తీసుకో – అన్నాడు.

అప్పుడు సుయోధనుడు: ఈ సమయంలో నాకు రథం మీద ఎక్కి ఇన్నాళ్ళూ సాగించిన యుద్ధం నడపాలని లేదు. జిహ్వకు కొత్త రుచులు తృప్తి నిచ్చినట్లు వాహనం లేకుండా గదాధారినై యుద్ధం సాగించాలని ఉంది, అనగానే ధర్మరాజు తనతో గదా యుద్ధం సాగించమన్నాడు. ఆ మాటలతో కొరడా దెబ్బ తిన్న మేలు జాతి గుర్రంలా దూకి తన సువర్ణభూషిత గదా దండంతో ప్రత్యక్షమయేసరికి అందరికీ హడలు పుట్టింది. అంతలోనే వారికి నవ్వూ వచ్చింది.

దానితో రోషం వచ్చి మీలో నాతో రణక్రీడ సాగించ దలచిన వారు రావచ్చు – అనగానే ధర్మరాజు: తమ్ముడూ! అంత తొందర పడకు. యుద్ధానికి దిగినా మన బాంధవ్యాలూ, ప్రేమలూ వదులుకొంటామా! ఇదిగో ఈ కవచం, శిరస్త్రాణం ధరించి రా, అన్నాడు.

ఆ అలంకారాలతో కౌరవాగ్రజుడు స్వర్ణగిరిలా నిలిచి రాదలచిన వారు రండి, చూద్దురు గాని నా గదా ఘాతాల రుచి, అని అట్టహాసం చేశాడు. ధర్మరాజే ముందడుగు వేయ బోగా వాసుదేవుడు వారించి భీముణ్ణి పంపించాడు.

భీమసేనా! గదా ధారివై నిలిచిన నన్ను అమరేంద్రుడు కూడా అడ్డుకోలేడు. నువ్వు యుద్ధ నీతి విడకుండా పోరు సాగించు, అని లంఘించాడు, సుయోధనుడు.

దుర్యోధన – భీమసేనులు గదాయుద్ధం సాగించనున్నా రని విని బలరాముడు తన శిష్యుల క్రీడ చూడాలనే కుతూ హలంతో వచ్చాడు.

ద్వైపాయన హ్రదం నుండి కదలి రణరంగానికి వచ్చి వా రుభయులూ మత్తేభాల వలె తమ గదా శుండాలతో పోరు ప్రారంభించారు.

ఆ గదలు ఒక దాని నొకటి సోకి మంటలు పుట్టాయి; పద ఘాతాలకు పర్వతాలు చలించాయి; వారి కన్నులలో విస్ఫు లింగాలు పుట్టాయి. చిత్రవిచిత్ర గతులలో పరమ రమణీయంగా నడుపుతున్నారు రణక్రీడ.

అప్పుడు వాసుదేవుడు: అర్జునా! చూశావా! ఉభయులూ సమంగానే అభ్యసించినా సాధన చేసి సుయోధనుడు మరింత కౌశలం సాధించాడు. మన వాడికి శరీర బలంవుంది కాని ఆ సాధన లేదు. కనుక దారి తప్పించకపోతే గెలుపు మనది కాదు. అంటూనే వాసుదేవుడు భీమునికి, కనిపించేటట్లు తన తొడలు చూపించాడు.

ఆ సమయంలో పైకెగిరి మీదికి దూకే దుర్యోధనుని తొడలు విరిగేటట్టు గదా దండం విసిరాడు భీమసేనుడు. రక్తం వాన కురిసింది; మాంస ఖండాలు పిడుగుల్లా పడ్డాయి. నీ కొడుకు నేలకూలగా భీముడు అట్టహాసంతో వెళ్ళి:

ఓరీ! పాంచాల రాజపుత్రిని ఏకవస్త్రను నిండు కొలువుకు ఈడ్చించి సాగించిన అత్యాచారానికి ఫలం అనుభ వించు, ఈ ప్రాయశ్చిత్తం చాలా, అని తన ఎడమకాలితో సుయోధనుని తల తన్ని అట్టహాసం చేస్తూంటే బలరాముడు ఊరుభాగానికి కింద గదతో తాడించరాదని భీము డెరుగడా! అని క్రోధంతో వస్తూంటే: వాసుదేవుడు వారించి: అన్నయ్యా! వీడి ప్రతిన ఉంది. పైగా కౌరవాగ్రజుడికి మైత్రేయ మహర్షి శాపం ఉంది. అదీన్నీ కాక నాడు గగన వీధికి ఎగిరి మీదికి దూకుతూంటే ఆత్మ రక్షణ కోసం ఈ యోధుడు చేసిన ప్రయోగం అది. ఇక ధర్మం అంటావా! అధర్మపరులను అక్రమంగా సంహ రించక తప్పదు, అని ఓదార్పు మాటలు చెప్పగా, బలరాముడు వినలేక రథం ఎక్కి నిజనగరం వెళ్ళిపోయాడు.

నేల కూలిన సుయోధనుడు పరిపరివిధాల కృష్ణుని అభిశంసించి ఆయన ఇచ్చిన సమాధానాలు వినలేక తల తిప్పుకున్నాడు. అప్పుడు పాండవులు కృష్ణునీ, సాత్యకినీ వెంట బెట్టుకుని కౌరవ శిబిరాలన్నీ చూచి తిరిగి వచ్చి రాత్రి ఆరుబయట గడపడానికి నిశ్చయించుకున్నారు. అందరూ కదలిన అనంతరం వాసుదేవుడు అర్జునుని రథం దిగమన్నాడు.

అంతే! ఆ రథం భగ్గున మండింది. అర్జునుడు తెల్లబోగా దేవకీ నందనుడు: బావా! ఆచార్యద్రోణులూ, రాధే

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

ఆలయాలను దర్శించండి ! | దివ్యానుభూతిని పొందండి..!!

# ప్యాకేజి టూర్

## 1. స్థానిక ఆలయాలు (ప్రతి దినం):

**టిక్కెట్టు :** పెద్దవారికి - రూ.30/-, చిన్నవారికి- రూ.15/-

**సమయం :** శ్రీనివాసం కాంప్లెక్సు, తిరుపతి నుండి ఉ॥ 6.00, 7.00, 10.00,11.00 గం॥లకు; మ॥ 2.00, 3.00 గం॥లకు; 2వ సత్రం నుండి ఉ॥ 6.00; 10.00; 2.00 గం॥లకు బయలుదేరును;

## 2. సమీప ఆలయాలు (ప్రతి దినం):

**టిక్కెట్టు :** పెద్దవారికి- రూ.80/-, చిన్నవారికి- రూ.40/-

**సమయం :** ఉదయం అలిపిరి నుంచి 8గం॥ శ్రీనివాసం కాంప్లెక్స్ నుండి 8.10 గం॥; 2వసత్రము నుండి 8.30 గం॥ లకు బయలుదేరును. యాత్రికులుపై ప్రదేశము లలో ఎక్కడ నుండైనా బస్సు ఎక్కవచ్చును.

## యాత్రికులు పై ప్రదేశములలో ఎక్కడ నుండైనా బస్సు ఎక్కవచ్చును

చూపబడు ఆలయములు:

**1)తిరుచానూరు, శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం,**

**2)కపిలతీర్థం, శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం,**

**3)శ్రీనివాసమంగాపురం, శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం,**

**4)తొండవాడ, శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయం,**

**5) తిరుపతి, శ్రీ కోదండరామ స్వామి ఆలయం,**

**6) తిరుపతి, శ్రీ గోవింద రాజస్వామి ఆలయం.**

చూపబడు ఆలయములు:

**1. అప్పలాయగుంట, శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం,**

**2. కార్వేటి నగరం, శ్రీవేణుగోపాలస్వామి ఆలయం,**

**3. నారాయణవనం,శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం,**

**4. నగరి, శ్రీ కరియమాణిక్యస్వామి ఆలయం,**

**5. బుగ్గ, శ్రీ అన్నపూర్ణాసమేత కాశీ విశ్వేశ్వరస్వామి ఆలయం,**

**6. నాగులాపురము, శ్రీ వేదనారాయణస్వామి ఆలయం,**

**7. సురుటుపల్లి, శ్రీ పల్లికొండేశ్వర స్వామి ఆలయం.**

**వివరాలకు సంప్రదించండి: సి.ఆర్.ఓ. ఆఫీస్ - తిరుపతి, ఫోన్ నెం : 0877-2264503**

యుడూ విడిచిన బాణాగ్నిని ఇంతవరకు నిరోధించాను. అని నవ్వాడు. ఎప్పటి కవసర మవుతుందో అని రథాన్ని సజ్జితంచేసి ఉంచిన దారుకుడు రథాన్ని తీసుకురాగానే దాన్ని అధిరోహించి ఓఘవతీనదీ తీరాన ఆ రాత్రి గడపడానికి నిశ్చయించాడు వాసుదేవుడు.

ధర్మరాజు – పరమపతివ్రత గాంధారి పుత్రశోకంతో తమను శపించకుండా తగు రీతిని మాట్లాడవలసిందిగా కృష్ణుని పంపాడు.

వాసుదేవుడు హుటాహుటిన హస్తినాపురం ప్రవేశించి గాంధారి ఉన్న చోటికి వెళ్ళి ముఖపాదప్రక్షాళనం చేసి విషయాలన్నీ వివరించి, ఓదార్చి గాంధారిని పరిపరివిధాల ప్రశంసించి తిరిగి వచ్చాడు.

మహారాజా! నేను నీ పెద్దకొడుకు దీన స్థితి చూసి వస్తూంటే, సంజయా! చూశావుగా వీరి కపట ధర్మ వర్తనం. కంఠంలో ఊపిరి ఉండగా వారిని నమ్మకు– అన్నాడు సుయోధనుడు.

అప్పటికి కృతవర్మ, కృపాశ్వత్థామలూ చేరి ఇంతసేపు ఏడ్చారు. అశ్వత్థామ తేరుకుని: రారాజా! నన్ను సర్వసైన్యాధిపతిని చెయ్యి. వాసుదేవ సమక్షంలో శత్రు నిశ్శేషం చేస్తానన్నాడు. దుర్యోధనుడు అక్కడి కక్కడే అశ్వత్థామను సేనాపతిగా అభిషేకించాడు అని శల్యపర్వం ముగించి వైశంపాయనుడు సౌప్తిక పర్వం అందుకుంటున్నాడు.

**--- శల్యపర్వం సమాప్తం ---**

***(ఇంకా ఉంది)***

# సందేహాలు? సమాధానాలు!!

-'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**భక్తికి - ధర్మానికి తేడా ఏమిటి? అవి రెండూ ఒకటేనా? వేరు వేరా? తెలియ జేయండి? -మూర్తిగారి జనార్ధన్,భువనగిరి**

☛ భక్తి వేరు, ధర్మం వేరు. భక్తి అంటే, 'సాతస్మిన్ ప్రేమరూపా' అని నారద భక్తి సూత్రాలు, నిర్వచించింది. భగవంతునియందు, ఎడతెగని అనగా ధారారూపమైన ప్రేమను భక్తి అంటారు. బంధు మిత్రులయందు గల ప్రీతిని ప్రేమ అంటారు. 'భజ్యత ఇతి' అని వ్యుత్పత్తి అర్థం. 'భజసేవాయాం' అనగా భగవద్దయను పొందుటకు ఆశ్రయింప బడునది అని అర్థం.

'ధరతి విశ్వం ధర్మః' ఈ అనంత విశ్వాన్ని రక్షించేది ధర్మం. ఇది భగవద్వాచకంగా వాడబడింది. వ్యాసుడు భగవద్గీతా శాస్త్రాన్ని 'ధర్మక్షేత్రే' అని ధర్మశబ్దంతో ప్రారంభించాడు. దానికి వ్యాఖ్యాతలు, ఈ ధర్మశబ్దం దైవవాచకంగా వాడబడిందని నిర్వ చించారు. ఇది న్యాయమనే అర్థంలో కూడా వాడబడుతుంది. ధర్మం – కృతయుగంలో నాలుగు పాదాలతో, త్రేతాయుగంలో మూడు పాదాలతో, ద్వాపరంలో రెండు పాదాలతో, ఈ కలిలో ఒక పాదంతో సంచరిస్తుందని శాస్త్రాలు-పురాణాలు చెబుతు న్నాయి. 'ధర్మం' నందు భక్తి మోక్షానికి మార్గం. పురుషార్థాలలో ముందు ధర్మాన్ని చెప్పారు. ధర్మ-అర్థ-కామ-మోక్షాలు పురుషా ర్థాలు. ధర్మంతో అర్థం సంపాదించి ధర్మబద్ధమైన కామమనుభ వించి, మోక్షం పొందవలసిందని ఇందు నిర్దేశింపబడింది. 'ధర్మం చర' అని వేదం చెబుతున్నది. ధర్మం- ధర్మివాచకమైతే, భక్తి ధర్మవాచకమౌతుంది.

**ప్రతి సంవత్సరం, ఆశ్వయుజమాసంలో జరిగే బ్రహ్మోత్సవా లలో జరిగే అయిదవనాటి 'గరుడసేవ' ప్రాముఖ్యమేమిటి? ఈ సేవ ఐదవరోజునే ఎందుకు చేస్తారు? గరుడసేవకు అంత మంది రావటానికి కారణం తెల్పండి?**

**- కె. భాగ్యలక్ష్మి, ద్రాక్షాయణి, రమాదేవి, చీరాల**

☛ "వైనతేయశ్చ పక్షిణామ్" అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఉద్ఘాటించాడు. పక్షులలో నేను గరుడుడను అని దాని అర్థం. పూర్వం వాలఖిల్యులను చూచి ఇంద్రుడు పరిహసించాడు. ఆ మహర్షులకు కోపం వచ్చి రెండవ ఇంద్ర సృష్టి చేయటానికి యజ్ఞకార్యక్రమం ప్రారంభించారు. దేవేంద్రుని ప్రార్థనపై కశ్యపప్రజాపతి వాలఖిల్యుల దగ్గరకు వచ్చి ఆ ప్రయత్నం విరమించవలసిందని ప్రార్థిం చాడు. వారు ఆయన ప్రార్థనను అంగీక రించి, పక్షులకింద్రునిగా మహాబలసంప న్నునిగా గరుడని సృజించారు. ఆయన అమృతహరణార్థం స్వర్గం మీద దండ యాత్రకు వెళ్ళి ఇంద్రుని జయించినపుడు విష్ణువు ప్రత్యక్షమై గరుడుని తన వాహనంగా ఏర్పరచుకొన్నాడు. నిత్యసూరులలో విష్వక్సేనుని తరువాత అంతటి స్థానం గరుత్మంతునిదే. బ్రహ్మోత్సవాలలో గరుడపటం ధ్వజంపై ఎగురవేస్తేనే గాని ఉత్సవాలు ప్రారంభంకావు. గరుడపటం ధ్వజ దండని నుండి, అవరోహణచేస్తే, బ్రహ్మోత్సవాలు పూర్తి అవు తాయి. గరుత్మంతున కంతటి ప్రాధాన్యం ఉంది. అందుకే వాహ నాలలో గరుడ వాహనం శ్రేష్ఠం. పిల్లలులేనివారికి ధ్వజం దగ్గర గరుడ పిండాలు తీసికొంటే సంతానం కలుగుతుంది. విష్ణుదేవా లయాలలో విష్ణువిగ్రహం ముందు గరుత్మంతుడుంటాడు. అందు వల్ల ఆ వాహనానికంత ప్రాముఖ్యం. అందువలననే, అంత మంది ప్రజలాఉత్సవాన్ని దర్శించాలనే కుతూహలంతో వస్తారు. ఐదోరోజు నిర్వహించటంలో ప్రత్యేకకారణమున్నట్లు నేను భావిం చను. మొదటి సంవత్సరం బ్రహ్మోత్సవాలేపద్ధతిలో జరిగాయో ప్రతి సంవత్సరంలాగే జరుగుతాయి. కొన్ని దేవాలయాలలో మూడోనాడు, నాల్గవనాడు గరుడోత్సవం జరుగుతుంది.

**దంతవక్త్రుని జన్మవృత్తాంతం ఏమిటి? ఆతడు మహావిష్ణువు చేతిలో ఎలా? ఎందుకు? మరణించాడు?**

**- వి.వి.సుబ్బారావు, మార్కాపురం.**

☛ శ్రీ వైకుంఠంలో జయవిజయులిద్దరు శ్రీ మహావిష్ణువు యొక్క తిరుమామణీ మండపానికి ద్వారపాలకులు. వారికి గర్వం చాలా ఎక్కువ. ఒకసారి సనక-సనందనాది మహర్షులు, వైకుంఠానికి విష్ణు దర్శనంకోసం వచ్చారు. జయవిజయులు గర్వంతో వారి నడ్డగించారు. వారు శాపాయుధులు కనుక క్రోధంతో పరమసత్త్వ స్వరూపమైన ఈ వైకుంఠంలో నివసించటానికి మీరర్హులుకారు. తమోగుణభూయిష్ఠులై భూలోకంలో రాక్షస యోనులలో జన్మించ వలసిందని శపించారు. మహావిష్ణువు దయాపరుడై ఏడు జన్మ లలో తనతో మైత్రితో వర్తింతురా? లేక మూడు జన్మములలో మాకు విరోధులై పుట్టి మాచే చంపబడి

తిరిగి ఇచ్చుటకు వత్తురా? కోరుకొమ్మని జయవిజయుల నడి గాడు. వారు ఏడు జన్మలలో విష్ణువు యొక్క ఎడబాటు సహిం పలేమనియు మూడు జన్మములలో విరోధులుగా జన్మింతు మనిరి. తొలిజన్మమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా – రెండవ జన్మమందు రావణకుంభకర్ణులుగా మూడవ జన్మయందు శిశు పాలదంతవక్త్రులుగా జన్మించారు. దంతవక్త్రుడు శిశుపాలుని తమ్ముడు. తండ్రి వృద్ధశర్ముడు. తల్లి శ్రుతదేవ. ఈతడు కరూశ దేశాన్ని పాలిస్తున్నాడు. సాళ్వుని, పౌండ్రకవాసుదేవుని వధించిన కారణంగా ఆయనయందు వైరం పెంచుకున్నాడు. ఆతడు చని పోయిన తన మిత్రులకు జలతర్పణాదులు విడిచి తిరిగి ఇంటికి వస్తున్నాడు. మార్గమధ్యంలో ఆతనికి శ్రీకృష్ణుడు గోచరించాడు. అపుడు దంతవక్త్రుడు శ్రీకృష్ణుని సంహరించటాని కాయనపైకి పోయాడు. శ్రీకృష్ణుడు సుదర్శనచక్రంతో ఆతని తల ఖండింపగా, ఒక జ్యోతి ఆతని శరీరం నుండి వెలు వడి వచ్చి శ్రీకృష్ణునిలో ఐక్యమైపోయింది.

**అమ్మవారికి రాయు లేపనాలలో పద్మరాగం అంటే ఏమిటి? ఎలా ఉంటుంది? స్వామివారికి కూడా రాస్తారా?**

☛ **- మొవ్వా శ్రీకృష్ణయ్య, శృంగారపురం, గుంటూరు.**

లేపనం అంటే పూయబడునది అని అర్థం. పూర్వం సుగంధ ద్రవ్యాలను ముఖ్యంగా మంచిగంధం. కాశ్మీర కుంకుమాదులను శరీరానికి పూసికొనే ఆచారం ఉన్నది. ఇది శరీరారోగ్యానికి సౌందర్య పోషకానికి ఎంతో ఉపయుక్తం. ముఖ్యంగా రాజుల దగ్గర లేపనాలు తయారు చేసే నిపుణులు ఉండేవారు. మంచి గంధం, కస్తూరి, గోరోజనం, పునుగు, పాలమడ్డి, కుంకుమ పూవు, కాశ్మీర కుంకుమం వంటి సుగంధ ద్రవ్యాలను ఒక దానితో మరొక దానిని కలిపి లేపనాలు తయారు చేస్తారు. ఏ సుగంధ ద్రవ్యంలో, ఏ ఏ సుగంధద్రవ్యాలు ఎంత పాళ్లలో కలుపవచ్చో అలా కలిపితే ఏ విధమైన వర్ణం వస్తుందో, ఏ విధమైన సువాసన కలుగుతుందో, దాని వలన శరీరానికి ఏమి మేలు కలుగుతుందో, ఆ వాసన ఎంతకాలం ఉంటుందో ఆ లేపనాలు తయారు చేసేవాళ్ళకు తెలుసు. అలాంటి వాళ్ళు ముఖ్యంగా రాజుల దగ్గర ఉండేవారు. కంసునకు కుబ్జ లేపనాలు అలాగే తయారు చేసేది. ఆమె ఒక్కొక్క లేపనం తయారు చేస్తే ఒక్క సంవత్సరానికి కూడా ఆ వాసనపోయేది కాదట. లేపనశాస్త్రం ప్రత్యేకంగా ఉంది. దైవాలు అలంకార ప్రియులు కనుక దేవతామూర్తులకు లేపనాలు రాస్తారు. పద్మరాగ లేపనంలో శ్రీగంధం ఎక్కువగా ఉంటుంది. కొంచెం ఎర్రరంగులో ఉంటుంది. పద్మరాగమణి కాంతివంటి కాంతి కలది కనుక దానికా పేరు వచ్చింది. స్వామివారికి కూడా అంగరాగాలు, లేపనాలు పూస్తారు. ఇవి ఇన్ని విధాలని లేదు. ఆ కలపములు తయారు చేసేవారు ఎన్ని విధాలుగా చేయా లంటే అన్ని విధాలుగా చేయగలుగుతారు. వాటి వాసనలు మారతాయి. రంగులు మారతాయి.

**తిరుచానూరులోని పద్మావతీ అమ్మవారికి గజవాహనమంటే అత్యంత ఇష్టమంటారు. కారణమేమి? -రమణబాబు, తిరుపతి.**

☛ అమ్మవారు లక్ష్మీదేవి. లక్ష్మీదేవి సంపత్ప్రదాత్రి. సంపదలలో అంతం గజం. అందుకే ఆశీర్వదించేటప్పుడు గజాంతైశ్వర్య ప్రాప్తిరస్తు అంటారు. అమ్మవారితో పాటు గజం కూడా పాల సముద్రంలో జన్మించింది. అమ్మవారికి ఏనుగులిరువైపుల నిల్చి అభిషేక కార్యక్రమాన్ని నిర్వర్తించాయి. గజం జంతువులలో ఉన్నతం. వాహనాలలో గజవాహనం ఉన్నతం. ఉత్తమం. అందువలన అమ్మవారికి గజవాహనమంటే అత్యంతిష్టం.

**భీమసేనుడు గదాయుద్ధ ప్రవీణుడు కదా! శరసంధానంలో కూడా ప్రావీణ్యముందా? తెలుపండి?**

☛ **- యస్.బాలసుబ్రహ్మణ్యం, రాయవేలూరు.**

వీరులందరు అన్ని ఆయుధాలతో యుద్ధం చేయగలిగిన నేర్పును గడిస్తారు. కాని ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రత్యేక ఆయుధ యుద్ధంలో ప్రావీణ్యం గడిస్తారు. ఒకదానిలో ప్రవీణులైనంత మాత్రాన మిగిలిన ఆయుధాలతో యుద్ధం చేయలేరని కాదు. శ్రీకృష్ణుడు చక్రంతో శత్రుసంహారం చేయటం సహజం. కాని ఆయన అస్త్రవిద్యలో కూడ నిపుణుడే. అలాగే భీముడు గదాయుద్ధంలో ప్రత్యేక నైపుణ్యం కలవాడేకాని, అన్ని ఆయుధా లతో యుద్ధం చేయగలవాడే. మనమిప్పుడు, ఆయనను బలం కలవాడని అంటాం. అంతమాత్రాన ఆయనకు మిగిలిన శాస్త్రా లతో పరిచయం లేదని కాదు. దానిలో ప్రతిభ ఎక్కువ అని మాత్రమే అర్థం చేసికోవాలి.

క్రింద పేర్కొన్న తి.తి.దే. గ్రంథాలు లభించే చిరునామా :
పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తి.తి.దేవస్థానం,
తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083.
ఇతర వివరాలకు : 0877 - 2264294

తిరుమల తిరుపతి దేవస్థానముల....

# పుస్తక పరిచయం

[12]



## తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథాలు

### 1) బ్రహ్మాగాంధర్వం

**రచయిత- ముదివర్తి కొండమాచార్యులు**
**సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 312;**
**మూల్యం: రూ.62/-**
**(పోస్టేజి ఛార్జి అదనం రూ.40/-)**

ముదివర్తి కొండమాచార్యులు 40 కావ్యాలు రాసి వన్నెవాసి గడించిన మహాకవులు. వీరు పదకవితాపితామహుడైన అన్నమాచార్య సంకీర్తనా రాశి నుండి 300 పాటలను ఎన్నుకొని వాటిని సీస పద్యాలుగా మలచి 'బ్రహ్మాగాంధర్వం' అనే పేరుతో పుస్తకంగా రచించారు.

1988లో మొదటిమారుగా వెలువడిన ఈ గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం స్వీయప్రచురణగా స్వీకరించి పాఠకులకు అందుబాటులో ఉంచింది.

---

### 2) అన్నమయ్య విన్నపాలు

**రచయిత- ముదివర్తి కొండమాచార్యులు**
**సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 312;**
**మూల్యం: రూ.65/-**
**(పోస్టేజి ఛార్జి అదనం రూ.40/-)**

పదకవితా పితామహుడైన అన్నమయ్య సంకీర్తనల్లో 300 సంకీర్తనలకు ముదివర్తి కొండమాచార్యులు చేసిన సీసపద్యానుసరణం ఇది. ఆధునిక పద్యకవులలో అగ్రశ్రేణికి చెందిన కొండమాచార్యుల వారు నూతన ప్రయోగమిది. అన్నమయ్య సంకీర్తనలు త్యాగయ్య కృతుల వలె నాద ప్రధానాలు కావు. ఇవి భావప్రధానాలు. పద్యరూపంలో అన్నమయ్య భావసంపదను పాఠకలోకానికి అందజేయడానికి ఆచార్యుల వారు చేసిన కృషి ఎంతో ప్రయోజనకారి.

1988లో మొదటిమారుగా వెలువడిన ఈ గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం స్వీయప్రచురణగా స్వీకరించి పాఠకులకు అందుబాటులో ఉంచింది.

---

### 3) శ్రీనివాసతేజము

**రచయిత- ముదివర్తి కొండమాచార్యులు**
**సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 347;**
**మూల్యం: రూ.65/-**
**(పోస్టేజి ఛార్జి అదనం రూ.40/-)**

1992లో మొదటిమారుగా వెలువడిన ఈ గ్రంథాన్ని తి.తి. దేవస్థానం స్వీయప్రచురణగా స్వీకరించి పాఠకులకు అందుబాటులో ఉంచింది. తాళ్లపాక అన్నమాచార్యులు, పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు రచించిన ఆధ్యాత్మసంకీర్తనలకు సీసపద్యానుసరణం ఈ గ్రంథం. ఇహపరశ్రేయోదాయకమైన తాళ్లపాక కవుల సాహిత్యాన్ని ఈ గ్రంథం విశ్వవ్యాప్తం చేస్తుందనడంలో సందేహం లేదు.

---

**ఈ గ్రంథాలను పోస్టుద్వారా పొందదలచిన వారు 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారి పేరున డి.డి.ని తీసి పై చిరునామాకు పంపాలి.**

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యం

**రచన-** డా॥ డి.భారతి; **పుటలు-**221; **సైజు-**1/8 డెమ్మీ; **మూల్యం-**రూ.150/-; **ప్రతులకు:** బి.సత్య మూర్తి, 18-1-451, భవానీనగర్, తిరుపతి.

కలియుగంలో భూలోక వైకుంఠమని పిలువబడుతున్న వేంకటాచల క్షేత్రంపై కొలువున్న శ్రీనివాస ప్రభువు సాటిలేని మేటి దేవుడు. ఈ పురాణాలు, వేదాలు మొదలుకుని ఆధునిక కవిత్వం వరకూ అనేక సాహితీప్రక్రియలు ఆ శ్రీనివాస ప్రభువునే తమ కావ్యనాయకునిగా చేసుకున్నాయి.

ఇంతటి విశిష్టత కలిగిన శ్రీవారి విలాస కథలను, శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని మేళవించి తెలుగుభాషలో మధురకావ్యసుమాలతో స్వామి నర్చించిన పద్యకవుల్లో శిష్టు కృష్ణమూర్తి ఒకరు. వరాహ పురాణాంతర్గతంగా ఈయన రచించిన 'శ్రీ వేంకటాచల మాహాత్మ్యం' అనే పద్యకావ్యమాధారంగా చేసుకుని డాక్టర్ దిట్టకవి భారతి చేసిన పరిశోధనా గ్రంథమే ఇది. పద్మావతీ - శ్రీనివాస పరిణయ వృత్తాంతంపై ముఖ్యంగా వెలువడిన పై పద్యకావ్యాన్ని చాలా చక్కగా డా॥ డి.భారతి తన గ్రంథాన్ని సంస్కృత మాతృకతో పరిశీలించడం ఈమె తులనాత్మక దృష్టి నిపుణతకు నిదర్శనం.

గ్రంథసమీక్ష




సంప్రదాయ సాహిత్యానికి సంబంధించిన శిష్టు కృష్ణ మూర్తి పద్యకావ్యాన్ని పరిశోధనకు స్వీకరించడమే గాక, శ్రమించి ఆ గ్రంథసారాంశాన్ని పరిశోధనా ప్రణాళికా చట్రంలో బిగించిన డా॥డి.భారతి కృషి ప్రశంసనీయం.

ఈ పరిశోధనను డా॥ డి.భారతి ఐదు అధ్యాయాలుగా విశ్లేషణాసౌలభ్యం కోసం విభజించుకుంది. మొదటి అధ్యాయంలో శిష్టు కృష్ణమూర్తి జీవనరేఖలు, రెండో అధ్యాయంలో శ్రీ వేంకటాచల మాహాత్మ్య కావ్య స్వరూపం, మూడో అధ్యాయంలో శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని సంస్కృత మూలంతో తైపారు చేయడం, నాల్గవ అధ్యాయంలో శ్రీ వేంకటాచల మాహాత్మ్య కావ్య పరిశీలన, ఐదో అధ్యాయంలో ఈ కావ్య పరిష్కరణలో అవలంబించిన విధానం వివరించబడ్డాయి.

వైష్ణవసంప్రదాయంలో ఐదు సంఖ్యకు, చాలా ప్రాముఖ్యత ఉంది. శ్రీ మహావిష్ణువు ఆయుధాలు ఐదు. పంచాయుధ స్తోత్రం హైందవులకు, ప్రత్యేకించి శ్రీ వైష్ణవులకు నిత్య పఠనీయం. అదే విధంగా ఈ పరిశోధనా గ్రంథం అధ్యాయాలు కూడా ఐదు కావడం కాకతాళీయం. పరిశోధనలో విషయ సేకరణ, విషయ వివేచన అనే రెండు ప్రధాన దశలున్నాయి. మొదటిపని చాలామంది చేస్తారు. రెండో పనే ఎక్కువమంది చెయ్యరు. ఎందుకంటే దానికి ప్రతిభ ఉండాలి. శిక్షణ కావాలి. మన పరిశోధనారంగంలో ప్రధాన దోషం ఇక్కడే ఉంది. విషయమంతా చాలా కష్టపడి సేకరించి వెల్లకిలాపడతారు. కానీ ఈ పరిశోధకురాలికి ఆ విశ్లేషణా నైపుణ్యం పుష్కలంగా ఉన్నట్లు ఈ గ్రంథాన్నిబట్టి చెప్పవచ్చు. ఇందుకు ఉదాహరణగా ఈ గ్రంథంలోని నాలుగో అధ్యాయమైన "శ్రీ వేంకటాచల మాహాత్మ్య కావ్య పరిశీలన"ను చెప్పుకోవచ్చు.

వేంకటేశ్వర స్వామిపై ఇదివరకే పుంఖానుపుంఖాలుగా వచ్చిన సాహిత్యాన్నంతా పరిశీలించి, తనకు కావాల్సిన వస్తువును గ్రహించి వివేచించడం డా॥ డి.భారతి పరిశీలనా దృక్పథానికి మచ్చుతునక.

ప్రతిభావంతులైన పరిశోధకుల సంఖ్య క్షీణిస్తున్న ఈ కాలంలో ఈ గ్రంథం, ఒక ఆశాకిరణం. ఈ ఆధ్యాత్మిక గ్రంథం పఠితలందర్నీ అలరిస్తుందని ఆశే కాదు, నమ్మకం కూడా.

**- వి.ఉమారాణి.**

# మహాభారత సందేశం

- డా॥ కంపల్లె రవిచంద్రన్

నీతి, ధర్మం అనేవి రెండూ మానవుణ్ణి సంస్కారవంతుణ్ణి చేసి చక్కని రాజమార్గంలో నడిపించేవి. నీతి అంటే దేశకాల పాత్రానుగుణంగా నడుచుకునే హితరీతి అనీ, ధర్మమంటే త్రికాలాబాధితమైన సత్యహిత స్వరూపమైనదనీ పెద్దలంటారు.

హృదయం, మేధ మానవుడికి జీవాధారాలు, వీటిలో ఏది లోపించినా మానవత్వం పూర్ణంకాదు. ఈ రెంటి సముచిత సమన్వయమే మానవత్వం. ఆ మానవత్వ సముపార్జనకై మానవుడు చేసే ప్రయత్నాల్లో సాహిత్యోపాసన లలిత ప్రక్రియ.

మహాభారతం పంచమవేదం. ఇహపరసాధనం. అది సాటిలేని నీతి దర్పణం, విశ్వజనీనం, అందులోని ప్రతి వాక్యం, ప్రతి సన్నివేశం, ప్రతి కథ, ప్రతి పాత్ర ఒక గొప్ప నీతినీ, ధర్మాన్ని స్ఫురింపజేస్తుంది.

గురువు తండ్రితో సమానం. గురువు సంతానం తోబుట్టువుతో సమానమని చాటి చెప్పే పవిత్ర చరిత్ర కచదేవయాని కథ. ఇదీ భారతంలోనిదే. ధర్మబద్ధమైన కామం తృతీయ పురుషార్థం. ధర్మబద్ధం కాని విషయవాంఛ హేయమైంది. ఒకటి ధార్మిక జీవనం కోసం. రెండోది ఇంద్రియ పరితృప్తికోసం. ధార్మిక జీవనం ఆత్మోద్ధరణ సాధనం. ఈ నీతిని నిరూపిస్తుంది కచదేవయానుల చరిత్ర.

**భూతహితంబుగాఁబలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁద**
**ద్భూత భయాస్పదం బగు ప్రభూతపుసత్యము బొంకు నట్ల, ప్రా**
**ణాతురుఁడైనచో, పరిణయంబునయందును బల్కుబొంకు స**
**త్యాతిశయంబ యండ్రు, మహితాత్మక! యిట్టివి ధర్మసూక్ష్ములు**

**- (3-5-62)**

ఇది ధర్మవ్యాధుని ధర్మోపదేశం. ధర్మవ్యాధుడు, జితేంద్రియుడు, సత్యవాది, కౌశికునంతవానికి నీతి బోధించి పంపిన అతని కథ అందరూ స్మరింపదగింది. ధర్మవ్యాధుడు కౌశికునకు అహింసా లక్షణాది అనేక ధర్మాలు విన్పిస్తూ తల్లిదండ్రుల సేవకంటే మించిన ధర్మం లేదన్నాడు. 'తన కోపమే తనకు శత్రువు' అనే పరమ నీతివాక్యాన్ని బోధించి పంపాడు.

**ఎఱుక గల వారి చరితలు ।**
**గఱచుచు, సజ్జనులగోష్ఠిఁగదలక ధర్మం**
**బెఱుఁగుచు, నెఱిఁగిన దానిని ।**
**మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్** **- (1-3-203)**

ఇది యయాతి పూరునకు బోధించిన నీతులలోనిది. ఇవి నన్నయ నీతులు. వివరణ అవసరం లేని పద్యాలు.

కణ్వమహర్షికి శకుంతల పెంపుడు బిడ్డ. వేటకు వచ్చిన దుష్యంతుడు చాలా అలసిపోయి కణ్వాశ్రమానికి వచ్చాడు. అక్కడ మహర్షి లేడు. శకుంతల అతిథి సత్కారాలు చేసింది. ఆమె జన్మవృత్తాంతం తెలిసికున్నాడు. ఆవిడ రాచకన్య, శాస్త్ర సమ్మతంగా గాంధర్వ వివాహం చేసుకున్నాడు. ఆమెకు పుత్రోదయమైంది. ఆ పుత్రుని దుష్యంతుని దగ్గరకు తీసుకుని పోయింది. బయలుదేరే సమయంలో మానవ సహజమైన అనుమానం ఆమెను పీడిస్తోంది. పెద్దల అనుజ్ఞ లేక చేసిన కార్యం మహాపరాధంగా భావనకు తెచ్చుకుంది.

**ఎఱుఁగఁడొకో! నన్నుఁ నెఱిఁగియు**
**నెఱుఁగని యట్లుండు నొక్కొ! యెడ దవ్వగుడున్**
**మఱచెనొకో! ముగ్ధ లధిపులు**
**మఱవరె బహుకార్యభారమగ్నులు కారే!** **- (1-4-69)**

దుష్యంతుడు ప్రజాభిప్రాయానికి జంకి ఆమెవరో తనకు తెలీదన్నాడు. శకుంతల తెల్లబోయింది. ముఖం చిన్నబుచ్చుకుంది. నిశ్చేష్టయైంది. కోపారుణిత నయనాల్లో బాష్పకణాలు రాల్తున్నాయి.

ఎన్నో ధర్మసూక్తులు వల్లించింది. కడపట–

**మ. విపరీత ప్రతిభాషలేమిటికి నుర్వీనాథ! యీ పుత్రగా-**
**త్రపరిష్వంగసుఖంబు సేకొనుము ముక్తాహార కర్పూర సాం**
**ద్రపరాగ ప్రసరంబుఁ జందనముఁజంద్రజ్యోత్స్నయుం బుత్రగా**
**త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే?"**

**- (1-4-91)**

## భ్రమపడకు



**నటనల భ్రమయకు నా మనసా ।**
**ఘటియించు హరియే కలవాడు ॥**

*ఓ మనసా! శాశ్వతమైనవాటిని అశాశ్వతంగానూ, అశాశ్వతమైనవి శాశ్వతమైనవిగా భ్రమగొల్పే ఈ జగత్తు మీద ఆశ పెంచుకోవద్దు. ఈ జగత్తుకంతా మూలమై శాశ్వతంగా ప్రకాశించే శ్రీహరిని మాత్రమే విశ్వసించు.*

*- తాళ్లపాక అన్నమాచార్యులు*

అని కొడుకును కౌగిలించుకొమ్మన్నది. ఆ కౌగిలిలో సుఖమెట్లుంటుంది? ముత్యాలహారం ధరించినట్లు, పచ్చ కర్పూరపుదట్టమైన పొడి మేన చల్లుకొన్నట్లు, మంచి గంధం శరీరానికి అలదుకొన్నట్లు, వెన్నెలలో విహరించినట్లు ఉంటుంది. కాదు, కాదు, వాటన్నిటికంటే పుత్రగాత్ర పరిష్వంగం మరీ చల్లగా ఉంటుందన్నది. పున్నామనరకం నుండి రక్షింపగలవాడు ఈ పుత్రుడే అని సానునయంగా పల్కింది.

**చ॥ నుతజలపూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత**
**వ్రత! యొక బావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్క స**
**త్క్రతువది మేలు! తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు, త**
**త్సుత శతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడఁగన్**

– అని సత్యవాక్య ప్రభావాన్ని వినిపించింది. ఇలా చెప్పిన ప్రతి మాట ఒక నీతి, ఒక ధర్మం మనకు బోధిస్తున్నట్లుంటుంది.

నలుడు దమయంతిని అడవిలో వదలి వెళ్ళాడు. కలి ప్రభావంతోనే గానీ బుద్ధిపూర్వకంగా కాదు. దమయంతి నిద్ర మేల్కొని భర్తను కానక దుఃఖిస్తూ –

**సీ॥ హా! మహారాజ! మహామహీ రక్షణ ।**
**దక్ష దక్షిణ బాహుదండ! దండి**
**తారాతి నిషధరాజాగ్రణి! నన్నిట్లు ।**
**వీతదయుండవై విడచి చనఁగఁ**
**దగునె? నీవెన్నఁడు ధర్మువు దప్పని ।**
**వాడవు, సూనృతవ్రతరతుండ;**
**వోడకు మని నన్ను నూఱడఁబలికిన ।**
**పలు కిట్లు మఱవంగఁబాడి యగునె?**

**పొదలలోని డాఁగి పొడసూపకిట్లేల**
**యున్నవాఁడ?విట్టి యుగ్రభావ**
**మేల నీకు వలసె, నెట వోదు? నింకెట్లు**
**గాంతు? నిన్ను నుగ్రకాననమున? (అరణ్య1-82)**

సాధారణ అనాగరక స్త్రీలైతే ఈ సందర్భంలో వారి వెనుకటి సంగతులన్నీ ఏకరువు పెట్టి ఏడ్చేవారు. లేదా తూల నాడేవారు. అష్టదిక్పాలకులను కాదని నలుణ్ణి ప్రేమించి వరించింది. ఇక్కడ ఆమె దుఃఖం కట్టలు తెంచుకుని పారుతుంది. పై పద్యంలోని సంబోధనలు చెప్పరానంత దుఃఖాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

వేదవేదాంతాలు అధ్యయనం చేసినప్పుడు వచ్చే పుణ్యం కంటే ఒక్క సత్యవాక్యం వలన వచ్చే పుణ్యం అధికం. సాంగోపాంగంగా వేదాధ్యయనం చేసి ఎంతో పుణ్యం సంపాదించిన నలుడు, "దమయంతిని వదలిపెట్ట"నని పల్కి కూడా విడిచి వెళ్ళాడు. ఇప్పుడు ఈ సత్యప్రతిపాలన భంగం వల్ల ఆ పుణ్యమంతా వ్యర్థమైందే అని వాపోయింది. ఇందులో స్వార్థం లేదు. పతిహితం కోరి తన సంకటాలకు వగవకుండా, భర్త కడగండ్లను ఊహించుకుని వగచింది. మహాగౌరవం ప్రకటించింది దమయంతి. ఇది పరమోపదేశం.

సావిత్రి పాతివ్రత్యంపై విశ్వాసంతో అల్పాయుష్కుడని తెలిసి కూడా సత్యవంతుని వివాహమాడింది. చివరకు వనంలో సత్యవంతుడు హఠాత్తుగా అసువులు బాశాడు. భర్తగా ప్రాణాలు తీసుకుపోతున్న యముని వెంబడించింది. తన పాతివ్రత్య మహిమతో –

**ఎడపక వాఙ్మనః క్రియల నేరికి హింసయొనర్పఁబూనరె**
**య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవఁగ జూతురిచ్చచోఁ**
**గడమ వడంగ నీకెదిరి కాంక్షితముల్ తుదిముట్టఁదీర్తు రె**
**క్కుడు మదిఁగూర్తు రాశ్రితులకున్ విను మిన్నియు నార్యధర్మముల్**
**- (3-7-228)**

త్రికరణశుద్ధితో ఎవ్వరికి ఏ బాధా కలిగింపరు. దీనుల కరుణతో రక్షిస్తారు. అశ్రితుల సంపూర్ణంగా కాపాడుతారు.

ఎవరు? యముని వంటి ధర్మజ్ఞులు - అని చెప్పక చెప్పిన ప్రాజ్ఞురాలు సావిత్రి. అందుకే సావిత్రి ఆదర్శమహిళ. మామకు నేత్రలాభం, రాజ్యలాభం, తండ్రికి పుత్రలాభం, భర్తకు ప్రాణ దానం- నాల్గువరాలతో అటు పుట్టినింటికి, ఇటు మెట్టి నింటికి శ్రేయస్సు కూర్చింది. తనకు ప్రాణపతినీ, అఖండకీర్తిని సంపా దించుకున్నది. అనగా స్త్రీలు పతివ్రతలై ఉభయకుల ఉద్ధారకులై మెలగాలి. ఇది సావిత్రి చరిత్ర నేర్పే నీతి. 'సఖ్యం సాప్తపదీనమ్' అనే ఆర్యోక్తితో యముడంతవానికి నోరు మెదపకుండా కాళ్లు కదపకుండా చేసింది మహాసాధ్వి సావిత్రి.

**అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁగాఁగ! నెఱింగి యిచ్చుటె**
**క్కుడు ఫలమిచ్చు, దానవిధికోవిద! వేఁడుట సావు, వేఁడగాఁ**
**బడుటది పెద్ద సావు, దగు ప్రార్థన పూర్ణము సేయునాతఁడా**
**యడిగిన వానిఁ దన్నును దయారతిఁగావఁగఁజాలు వాఁడగున్**

**- (13-2-343)**

యాచన మృత్యువుతో సమానమని ఇందులోని నీతి. తన అభిమాన హృదయంతో ఇతరుల హృదయాభిమానాన్ని తెలుసుకోవాలి. 'ఆత్మవత్సర్వభూతాని' అనే సూక్తికి ఈ పద్యం దర్పణం.

అరణ్యపర్వం ప్రారంభంలో శౌనకుడు ధర్మరాజుకు చెప్పిన నీతులు సకల మానవ లోకానికి ఇచ్చిన శాశ్వత సందేశాలు.

**క. అర్థమ యనర్థమూలం**
**బర్థమ మాయావి మోహనావహము; నరుం**
**డర్థార్జన దుఃఖమున న**
**పార్థీకృత జన్ముఁడుగుట పరమార్థమిలన్**

**- (3-1-28)**

మృత్యువు ప్రాణులకు ఎంత భయంకరమో అట్లే ధన వంతులకు రాజచోర స్వజన జలానలంబుల వల్ల ఎప్పుడూ భయం తప్పదు. కావున అర్థం సర్వం అనర్థాలకు మూలం.

## శ్రీ వేణుగోపాలస్వామివారి బ్రహ్మోత్సవాలు, కార్వేటినగరం

**2010, జూన్ 03 నుండి 12 వరకు**

| తేదీలు | వారము | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 03-6-2010 | గురు | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| 04-6-2010 | శుక్ర | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 05-6-2010 | శని | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 06-6-2010 | ఆది | సింహవాహనం | ముత్యపుపందిరి వాహనం |
| 07-6-2010 | సోమ | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 08-6-2010 | మంగళ | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| 09-6-2010 | బుధ | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| 10-6-2010 | గురు | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| 11-6-2010 | శుక్ర | రథోత్సవం | అశ్వ వాహనం |
| 12-6-2010 | శని | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |

## సప్తగిరి సక్రమంగా చేరుతోందా?

☛ మీరు చెల్లించిన చందాలకు పత్రిక అసలు చేరక పోతే మా కార్యాలయానికి మీ చెల్లింపు వివరాలను తెలియచేయండి.

☛ సక్రమంగా ప్రతి నెలా పత్రిక రాకపోతే ఒకసారి మీ చిరునామా సరిచూసుకోండి. మీ పోస్ట్‌మ్యాన్‌ను అడగండి. ఒక్కసారి మీ చందా నెంబరు కంప్యూటర్ లో నమోదైతే ఆ చందాగడువు పూర్తి అయ్యే వరకు పత్రిక మీరు తెలిపిన చిరునామాకు తప్పక పంపుతాము.

☛ మీచందాలను పునరుద్ధరించుకొనుటకు ఒక మాసం ముందుగా చందా మొత్తం చెల్లించండి.

☛ మీ చిరునామా మారితే మాకు ఉత్తరం వ్రాయండి (లేదా) ఈ ఫోనులో **0877 - 2264359** సంప్రదించండి.

**- ప్రధాన సంపాదకుడు**

మాయమోహాన్ని కలిగిస్తుంది. దర్పం, కార్పణ్యం, భయం, అన్నీ ధన దురాశ వల్లే ఆవిర్భవిస్తాయి. కావున అర్థోపార్జన చింత చేయకూడదనీ, రూపయౌవన ధనవిభవ ప్రియ సంవాసముల నిత్యాలనీ నీతిసారం.

సత్యాద్రౌపదీ సంవాదం ఒక గొప్ప నీతిశాస్త్ర పర మార్థం. మహిళాలోకానికే ఆదర్శప్రాయం.

**నీ ప్రియ భర్తల నిర్మల చరితులఁ**
**బ్రకట తేజుల లోకపాలనిభుల**
**బార్థుల నీవొకభంగిన వదలక**
**చెలువ యెబ్బంగి భజింతు! దగిలి**
**యొక్కరొక్కని కంటె నువిద! నీకేవురు**
**ననురక్తు లగుట యత్యద్భుతంబు**
**నగుమొగంబుల కాని నలినాక్షి! నీదెసఁ**
**బతులకుఁగింకిరి పాటులేదు (3-5-291)**



**శ్రీ పద్మావతీ అమ్మవారి (తెప్ప) ప్లవోత్సవాలు, తిరుచానూరు**

| | | | |
|---|---|---|---|
| **22-6-10** | మంగళ | శ్రీ కృష్ణస్వామివారికి | జ్యేష్ఠ పూర్ణిమకు జరుగును |
| **23-6-10** | బుధ | శ్రీ సుందరరాజస్వామివారికి | |
| **24-6-10** | గురు | శ్రీ పద్మావతీ అమ్మవార్లకు | |
| **25-6-10** | శుక్ర | ” | |
| **26-6-10** | శని | ” | |

దీనికి కారణం నీ వ్రత విశేషమా! మంత్రౌషధ ప్రయోగమా! నీ చాతుర్య విభ్రమోల్లసమా! నీ భర్తలను నీ వశం చేసికొన్న విధం తెల్పుమని సత్యభామ ద్రౌపదిని అర్థిస్తూ తన అజ్ఞానాన్ని వెలువరించింది. ఆ సమయంలో ద్రౌపది వ్యక్తీకరించిన భావాలు మహిళాలోకానికి ప్రత్యేకించి హైందవ స్త్రీలకు శిరోధార్యాలు.

**విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని**
**శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః (గీత, 5-18)**

చండాలుని మొదలుకుని బ్రాహ్మణుని వరకు సమ దృష్టితో చూడగలిగినవారే నిజమైన పండితులు. సామాన్యంగా పండితులంటే – పాండిత్య ప్రకర్ష, వేదవేదాంగ పురాణేతిహాసాలలో మంచి ప్రవేశం కలవారని రూఢి. ఇది గీత అంగీకరించడం లేదు. సమస్త చరాచర కోటిని సమదృష్టితో చూడగల్గినవాడే పండితుడు. అన్నిటా దేవతారూపాన్ని చూడగల్గడం భారతీయ సంస్కృతి.

ఉచ్చనీచ భేదాలు లేక జగత్తులోని సకల వస్తువులను, జంతువులను సమదృష్టితో ప్రేమించి, గౌరవించగల భారత ధర్మ పద్ధతి విశిష్టమైంది. సర్వమానవ సౌభ్రాతృత్వంతోనే తృప్తి చెందరాదనీ సర్వాత్మ దృష్టిని అలవరుచుకోవాలని భారత నీతి.

**వాసుదేవః సర్వమ్**
**మత్తః పరతరం నాన్యత్కించిదస్తి**

భారత అంతర్గతమైన ఈ గీతావాక్యాలే సకల భారత నీతిసారం.




కల్యాణకటకమనే పట్టణంలో భైరవుడు అనే ఒక వేటగాడు ఉన్నాడు. అతడు ఒక రోజు వేటకై అడవికి బయలుదేరాడు. తనతో పాటుగా వల, ఉరులు. ధనుర్బాణాలను వెంట తీసుకు వెళ్ళాడు. అడవిలో ఒక చోట చూడ ముచ్చటగా ఉన్న జింకను వేటాడడానికి మచ్చుపెట్టి, చెట్టు చాటున ఉండి చూస్తున్నాడు. కొంతసేపటికి అక్కడికి ఆ జింక వచ్చింది. భైరవుడు దాన్ని చూసి సంతోషించి, విల్లును ఎక్కుపెట్టి బాణంతో గురిచూసికొట్టాడు. అది గిలగిలలాడుతూ తన్నుకొని చనిపోయింది. అతడు దానిని తన భుజానికి ఎత్తుకుని బయలుదేరాడు.

భైరవుడికి దారిలో నడిచివచ్చే కొండలా, ఒక బలిసిన సూకరం ఎదురుపడింది. ఆహా! ఏమి నా భాగ్యం. మరొక మంచి ఆహారం దొరికింది. లేచిన వేళావిశేషం ఇదేనేమో అని అతడు సంతోషించాడు. భుజాన ఉన్న లేడిని కింద పెట్టి వింటినారిని సారించి, గురి చూసి బాణంతో ఆ వరాహాన్ని కొట్టాడు. అది ఆ దెబ్బకు తాళలేక అరుస్తూ వేగంగా ముందుకు




**బి. హెచ్. అనూష,**
**7వతరగతి,**
**విద్యావిహార్ పాఠశాల,**
**గ్రీమ్స్‌పేట్, చిత్తూరు.**


దుమికి, భైరవుని గుండెలపై కోరలతో పొడిచి, గాయపరచింది. అతడు ఆ దెబ్బకు తట్టుకోలేక బాధపడుతూ మొదలు నరికిన చెట్టులా నేలకూలి మరణించాడు. కొంతసేపటికి పంది కూడా చనిపోయింది. వేటగానికీ, పందికీ మధ్య జరిగిన కుమ్ములాటలో పందికాళ్ళ కింద పడి ఒక పాము చనిపోయింది. ఈ విధంగా అక్కడ లేడి, వేటగాడు, పంది, పాము మరణించి పడి ఉన్నాయి.

ఆ అడవిలోనే దీర్ఘరావమనే పేరుగల జిత్తులమారి నక్క ఉంది. అది అన్నీ తనకే కావాలనే పేరాశ కలది. అది చిన్న జంతువు, అందువల్ల దానికి వేటాడే సామర్థ్యం లేదు. ఏ సింహమో, పులో వేటాడి తినగా మిగిలిన మాంసాన్ని సేకరిస్తుంటుంది.

అటువంటి దురాశ గల నక్క ఆ దారిన వచ్చింది. అది అక్కడ ఉన్న లేడి, వేటగాడు, పంది, పాముల మృతకళేబరాలను చూసి మిక్కిలి ఆనందించింది. దాని సంతోషానికి హద్దులు లేవు. పుష్కలంగా ఆహారం లభించినందుకు సంతోషంతో గంతేసింది. "నాకు మూడు నెలలకు సరిపడే గ్రాసం లభించింది. వేటగాని మాంసంతో ఒక మాసం; హరిణం, వరాహాల మాంసంతో రెండు మాసాలు గడపవచ్చు" అని ఆ నక్క అనుకుంది. 'ఒక రోజుకు పాము చాలు, ముందుగా ఆకలిని ఈ వింటి నారి నరంతో తీర్చుకొంటాను' అని అత్యాశ గల ఆ నక్క అనుకుంది.

అలా అనుకుని విల్లుకు బిగించి కట్టిన నారిని ఒక వైపు కొరికింది. అంతే ఇక ఏముంది! వంగి ఉన్న వింటి బద్ద నక్క రొమ్ములో గుచ్చుకొంది. వెంటనే నక్క తట్టుకోలేక బాధతో రోదిస్తూ, విలవిల తన్నుకుంటూ అక్కడే కింద పడి మరణించింది. పుష్కలంగా ఆహారం లభ్యమైనా తినకుండా దురాశ పడడం చేత నక్క తన చావుకి తనే కారణం అయింది. దురాశ మరణానికి కూడా దారితీస్తుంది కాబట్టి, దొరికిన దానితో తృప్తిపడి, దురాశకు లోనవకుండా ఉండడమే ఉత్తముల లక్షణం.

**తిరుమలలో శ్రీవారి దర్శనానికి ముందు,**
**శ్రీవారి పుష్కరిణి చెంతవున్న**
**శ్రీ వరాహస్వామివారిని దర్శించాలి.**
**ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం.**



## డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమము - 02-04-2010

## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఇ.ఓ.'*** *కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 02-04-2010న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం)*

**1. గుడి లోపలకు ప్రవేశించేటప్పుడు తోపులాట జరిగి రాపిడితో చిన్నపిల్లలు, వృద్ధులు నలిగిపోయి ఇబ్బందికి గురవుతున్నారు.**

**2. తిరుమలలోని హోటళ్ళు పరిశుభ్రంగా లేవు. వారు వ్యర్థ పదార్థాలను రోడ్డుపక్కనే పడేస్తున్నారు.**

*– శ్రీనివాస్, వరంగల్లు*

**కార్యనిర్వహణాధికారి:** 1.దీనిని నివారించాం. ప్రస్తుతం బాగుంది.

**కార్యనిర్వహణాధికారి :** 2. దీనిని గురించి సంబంధిత అధికారులతో చర్చించి తగు చర్యలు తీసుకుంటాం.

**భారతదేశంలోని అమర్‌నాథ్ వంటిచోట్ల సిబ్బంది భక్తులపట్ల మర్యాదగా ప్రవర్తిస్తారు. తిరుమలలో మాత్రం తప్పుగా మాట్లాడడం, కసరడం, విసుక్కోవడంచేస్తున్నారు.**

*– శివకుమార్, హైదరాబాదు*

**కార్యనిర్వహణాధికారి :** మిగతా చోట్లకంటే తిరుమలకు వచ్చే భక్తుల సంఖ్య భారీగా ఉండడం ఒక కారణం. భక్తులపట్ల సౌమ్యంగానడుచుకునేందుకు ఉద్యోగులకు శ్వేతలో మరికొన్ని శిక్షణా తరగతులు ఇప్పిస్తాం. అలా జరగకుండా చూస్తాం.

**గత నెల్లో నేను మా తండ్రి (93 వయస్సు) గారిని తీసుకుని దర్శనానికి వస్తే నన్ను సహాయకుడుగా పంపకపోగా, వారు కూడా తీసుకెళ్ళక మా నాన్నగారిని వృద్ధుడని కూడా చూడ కుండా బయటకు నెట్టేశారు.** – బాపూరావు, సిద్ధిపేట

**కార్యనిర్వహణాధికారి:** ఇకమీదట అలా జరగకుండా చూస్తాం.

**వికలాంగుల 'క్యూ' లైన్లో ముసలివారిని, చంటిబిడ్డల తల్లులను కలిపి పంపుతున్నారు. దీనివలన వికలాంగులకు ఇబ్బంది కలుగుతోంది. విడివిడిగా పంపితే బాగుంటుంది.**

*– ప్రభాకర్, మదనపల్లె*

**కార్యనిర్వహణాధికారి :** మేము కూడా వికలాంగులను ప్రత్యేకలైనుగా పంపాలనే ఆలోచనతో పరిశీలిస్తున్నాం.

**కల్యాణం తరువాత దర్శనానికి వెళ్ళేవారిని మామూలు భక్తులతో కలిపేశారు. జనం తక్కువగా ఉన్నప్పుడు కూడా ఇలా కలపకుండా రెండు లైన్లుగా పంపితే బాగుంటుంది.**

– రామకృష్ణ, విశాఖపట్నం

**కార్యనిర్వహణాధికారి :** వెండివాకిలి దాటాక మీరు కోరినట్లు రెండు వరుసలుగా పంపడానికి వీలుపడదు.

**పాతకట్టడమైన నారాయణ అతిథిగృహాల్లో గదులు బాగున్నాయి. ఇప్పుడు కట్టిన శ్రీ వరాహస్వామి, తిరుపతిలోని శ్రీనివాసం అతిథి గృహాల్లో తలుపులు సరిగా లేవు. నీరు రాదు, కొన్నిచోట్ల నీరు వృథాగా పోతోంది, శుభ్రత లేదు.**

– శాస్త్రి, కాకినాడ.

**కార్యనిర్వహణాధికారి:** పరిశీలించి తగినచర్యలు తీసుకుంటాం.

**సేవలకోసం నెట్ బుకింగ్ ఆపివేశారు. మళ్లీ ఎప్పుడు ప్రారంభిస్తారు.** – హేమంత్ కుమార్, చెన్నై.

**కార్యనిర్వహణాధికారి :** సాఫ్ట్‌వేర్ ప్రాబ్లమ్ ఉండి నిలిపివేశాం. ఏప్రిల్ 6వ తేది నుండి ప్రారంభిస్తున్నాం గమనించండి

**ప్రతియేడు 2 సార్లు తిరుమలకు వస్తాము. టి.బి.సి. గదుల్లో మంచాలపై ఉన్న పరుపులు పాడై ఉన్నాయి. వేడినీరు రావడం లేదు. చాలా ఇబ్బంది పడ్డాం.** –తులసీరామ్,విశాఖపట్నం

**కార్యనిర్వహణాధికారి :** మీరు చెప్పేదాన్నిబట్టి చూస్తే అవుట్‌సోర్సింగ్ పద్ధతి బాగాలేదని తెలుస్తోంది. పరిశీలించి తగు చర్యలు తీసుకుంటాం.

**మార్చిలో దర్శనానికి వచ్చాం. గుడిలోపలకు ప్రవేశించాక అక్కడున్న సిబ్బంది మాస్‌గా తోసేస్తున్నారు. అవసరం ఉన్నా లేకున్నా అలా తోసేస్తే దేవుడిపై ఆ కాసేపు కూడా మనసు లగ్నం కావడం లేదు. దీన్ని అరికట్టలేరా?**

*–వెంకటేశ్వర రావు, నిజామాబాదు; భరద్వాజ, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి:** పరిశీలించి అలా జరగకుండా చూస్తాం.



# తిరుమలేశుని మహిమ

- పి. ఆర్. రంగరాజన్

శ్రీ మహావిష్ణువు కలియుగంలో శ్రీ వేంకటేశ్వర స్వామిగా అవతరించినట్టు పురాణాలు ఉద్ఘోషిస్తున్నాయి. శ్రీ వేంకటేశ్వరుని స్తోత్రం చేయడానికి ముందుగా, ఆ స్వామి నివసించే పవిత్రమైన తిరుమలను స్తోత్రం చేసిన మహానుభావులు ఎందరో ఉన్నారు. శ్రీవేదాంత దేశికులు తమ 'దయాశతకం'లో తిరుమలను స్తుతించారు.

**ప్రపద్యే తం గిరిం ప్రాయః**
**శ్రీనివాసాఽనుకంపయా**
**ఇక్షుసార స్రవన్త్యేవ**
**యన్మూర్త్యా శర్కరాయితమ్**

శ్రీ వేంకటేశ్వరుని యొక్క దయా అనే చెఱకు రసం ఘనీభూతమై కలకండవలే మారిన కొండగా తిరుమలను చెబుతూ, అటువంటి తిరుమలను సేవిస్తాను అని అన్నారు. అచేతనమైన కొండను సేవించడం యుక్తమా? అని ఒక సందేహం కలగవచ్చు. ఈ తిరుమలను సాధారణ కొండగా భావించరాదు. "మలయే తిరు ఉడమ్బు" అన్నారు ఆళ్వారులు. అనగా ఈ పవిత్రమైన పర్వతం ఆ పురుషోత్తముని దివ్య శరీరం అన్నమాట. ఈ పర్వతాన్ని వైష్ణవ ఆచార్యులు "వేదవెర్పు" అని పొగుడుతున్నారు. అనగా ఈ తిరుమల వేదపర్వతం అన్నమాట.

ఈ తిరుమలలో ఉండే వృక్షాల్లో, రాళ్ళలో జలపాతాలలో యక్ష కిన్నర కింపురుష గంధర్వాది దేవతలు కంటికి కనపడకుండా ఉన్నట్టు "భవిష్యోత్తర పురాణం" పేర్కొంటుంది. ఇటువంటి పవిత్రమైన కొండలో తమ పాదాన్ని మోపరాదనే అభిప్రాయంతో భగవద్రామానుజాచార్యులు మోకాళ్ళతోనే తిరుమలకు వెళ్ళినట్టు చెబుతారు.

కులశేఖరాళ్వారు కూడా "వేంకటేశ్వరస్వామి బంగారు కొండపైన ఏదో ఒక జన్మను పొందుతాను" అని అన్నారు. ఇలాంటి మహిమతో కూడిన ఈ తిరుమల కొండపై శ్రీ వేంకటేశ్వరస్వామి జ్యోతిలాగా ప్రకాశిస్తున్నారు. శ్రీనమ్మాళ్వార్ ఇలా అంటారు. "వేంగడత్ ఎలిల్ కొల్ సోడి" అనగా వేంకట పర్వతంలో ప్రకాశిస్తున్న అందమైన జ్యోతి భగవంతుడు శ్రీవైకుంఠంలో పరవాసుదేవుడు అనే పేరుతో ఉంటున్నాడు. ఆ దేవుని ఆళ్వారులు "వానార్ సోది" అంటారు. శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించుటకు దేవతలుకూడా వస్తూ వెళ్ళుతూ ఉంటున్నారట. దీన్నే కులశేఖరాళ్వార్ "పిన్నిట్ట సదయానుం పిరమనుం ఇందిరనుం" అనే పాశురంలో పేర్కొన్నాడు.

వేంకటేశ్వరస్వామి యొక్క మహిమను గుర్తించి ఎందరో మహానుభావులు అతనికి కైంకర్యం చేస్తూ తమ జన్మను సార్థకం చేసుకున్నారు. రామానుజాచార్యుల మేనమామ తిరమలైనంబి (శ్రీశైలపూర్ణుడు) వేంకటేశ్వరస్వామికి తీర్థకైంకర్యం చేశారు. అదే విధంగా రామానుజాచార్య శిష్యులైన అనంతాళ్వార్ అనే స్వామి శ్రీవారికి పుష్ప కైంకర్యం చేశారు. ఇతని చరిత్రలో ఒక విషయం తిరుమల ప్రభావాన్ని వర్ణించే విధంగా ఉన్నది. అనంతాళ్వార్ ఒకప్పుడు తిరుమల నుండి బయలుదేరి పడమటి దిక్కులో ఉండే ఒక గ్రామానికి తమ భార్యతో ప్రయాణమైనాడు. మధ్యలో



ఉభయదేవేరులతో శ్రీవారు

## అక్షరామృతం [22]

# జయ జయ హనుమా!

**అంజనతనయా! వీరాంజనేయా!**
**అమోఘ, అమేయ ప్రజ్ఞామయా!**
**అందుకొనుము మా అంజలులివియే**
**ఆదుకొనుము మా దీనజనాళిని**

**రామదూతగా లంకాపురముకు**
**రయమునబోయి జానకి మాతకు**
**భయమునుబాపి, ప్రియమును గూర్చి**
**జయముగ తిరిగి విజయము చేసి**
**ప్రభుదుఃఖమును బాపినాడవు**
**భళి! భళి! భళీ! జై భజరంగ భళీ!**

**లంకిణి ద్రుంచి, లంకను కాల్చి,**
**రావణబ్రహ్మ గర్వమునణచి,**
**రణమున రాక్షస సంహారము జేసి,**
**రామకార్యమును నెరవేర్చితివి.**

**సంజీవి పర్వతము అవలీలగఁ దెచ్చి,**
**లక్ష్మణమూర్ఛను పోగొట్టితివి,**
**నీకు సాధ్యము కాని పని యీ,**
**నిఖిలలోకముల నేదియు లేదు.**

**శరణు గోరిన యయాతిని బ్రోచి,**
**పరమభక్తితో స్వామిని గెల్చిన,**
**భక్తి శ్రద్ధలకు - శక్తి యుక్తులకు,**
**సాటిలేని మహా ఆదర్శమూర్తివి.**

**రోమరోమమున రామనామమే,**
**నేమము తప్పక రామస్మరణమే,**
**రామ నామ స్మరణ నిరతిలో,**
**పండిపోయిన భక్త శిఖామణీ!**
**భక్తిలోన ఎంతశక్తియున్నదో**
**జగములన్నిటికి చాటి తెలుపగా**
**పవనసుతుడవై అవతరించిన**
**నీకు సాటిగా నిలిచే వీరులు**
**నిఖిలలోకములనెవ్వరుగలరు?**

- "దుర్గాచరణ్" ఎస్. శివరామరెడ్డి

భోజనం చేయడానికి చిత్రాన్నాన్ని మూటకట్టుకుని బయలు దేరారు. మధ్యలో భోజనం చేయడానికి నీటి వసతితో కూడిన ఒక స్థలంలో కూర్చొని మూటను విప్పారు. అందులో చీమలను చూశాడు. వెంటనే ఆ అన్నాన్ని తినకుండా తిరిగి మూట కట్టేసి తమ గ్రామానికి వెళ్ళకుండా తిరిగి తిరుమల చేరారు. ఆయన భార్య ఎందుకు ఈ విధంగా చేస్తున్నారని అడుగగా, అనంతాళ్వార్ ఇలా అన్నాడు. "తిరుమల వాసమును ఎంతోమంది కోరుతున్నారు. నోరులేని ఈ చీమలకు తిరుమల వాసం పోతుంది కదా అని, తిరిగి తిరుమల చేరాము" అని అన్నారు. జీవరాసులన్నీ తరించాలని విశాలమైన మనస్తత్త్వం అనంతాళ్వార్ వారికి ఉండింది. ఈ విధంగా అద్భుతమైన ఎన్నో వృత్తాంతాలు ఉన్నాయి. శ్రీ వేంకటేశ్వర స్వామికి ఏనుగు చేసే పూజా విధానాన్ని భూదత్తాళ్వార్ వర్ణిస్తున్నారు.

**పుగుమదత్తాల్ వాయ్ పూసి ఇల్**
**కిల్ తాళిద్ అరువి ఉగుమదత్తాళ్**
**కాల్ కలేవిక్కయ్యాల్ మిగుమదల్తేన్**
**విండమలర్ కొండు విరళ్ వేంకట**
**వనయే కండువనంగుం కళిరు**

తిరుమలలో ఉండే ఏనుగు కూడా స్వామి పూజ చేస్తుంది. మస్తకం నుంచి స్రవించిన మదజలాన్ని నోటిలో తెచ్చుకుని పుక్కిలించి ఆచమనం చేసి ఆ నీటితోనే తన పాదాలు కడుక్కుని తేనెతో కూడిన పుష్పములను తొండాలతో కోసి శ్రీ వేంకటేశ్వరస్వామికి సమర్పించి స్తుతిస్తున్నది.

అలాంటి పవిత్రమైన తిరుమలలో దేవతలు, మనుష్యులు ఇద్దరికి అనుగ్రహం చేసే విధంగా శ్రీ వేంకటేశ్వర స్వామి ఉన్నారు. దీన్నే ప్రబంధ వ్యాఖ్యానకారులు ఇలా అంటారు. "కవల పిల్లలను కన్నటువంటి తల్లి ఇద్దరు బిడ్డలను సమానంగా చూసినట్లు శ్రీ వేంకటేశ్వరస్వామి అటు ప్రజలను ఇటు దేవతలను కన్నబిడ్డల వలే చూసుకుంటున్నాడని" అంటున్నారు. వైష్ణవ ఆచార్యులు వేదాంతదేశికులు వేంకటేశ్వరస్వామి దయను గురించి 'దయాశతకం' పాడారు. ప్రతివాది భయంకరం అన్నన్ స్వామి సుప్రభాతం రచించారు. 'అరాయికాణే వికటే గిరిం గచ్ఛ' అని ఋగ్వేదం స్తోత్రించే స్వామిని దర్శించి మనం కూడా శ్రీవారి అనుగ్రహాన్ని పొందుదాం.




– కాకుమాను భూలక్ష్మి

'అనంతుడు' అనగా అంతం లేనివాడు. నాశనం లేని వాణ్ణి అనంతుడని భావించవచ్చు. సృష్టి స్థితి లయ కారకులుగా మన పురాణాలు త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులను వక్కాణిస్తున్నాయి. ఈ ముగ్గురిలో అసలు అనంతుడెవరు? వీరిలో ఎవరి జన్మకు ఎవరు కారకులనే విషయాన్ని భాగవత పురాణం స్పష్టం చేస్తుంది.

సృష్టికర్త అయిన బ్రహ్మ విష్ణువు గూర్చి –

**నమోఽ స్త్వనన్తాయ సహస్రమూర్తయే**
**సహస్ర పాదాక్షి శిరోరు బాహవే ।**
**సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే**
**సహస్రకోటీ యుగ ధారిణే నమః ॥**

శాశ్వతమైన పురుషునకు నమస్కరిస్తూ అనంత శబ్ద పదప్రయోగం చేశాడు.

**అనన్త రూపోఽ నన్తశ్రీః జితమన్యుర్భయాపహః ।**
**చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥**

**– విష్ణు సహస్రనామము, శ్లో 100**

బ్రహ్మ నుడివిన పై అనంతతత్త్వం భాగవత పురాణంలో స్పష్టం చేయబడింది.

సర్వము నీవే, సర్వము నీలోనే, నీవు అన్నిటిలోను ఉన్నావనే విషయాన్ని బ్రహ్మ ఈ విధంగా తెలియచేశాడు.

**వినుమా ఈశ్వర! వెల్వలన్ వెలుగు నీ విశ్వంబు నీ మాయగా**
**క నిజంబైన యశోద యెట్లు గనియెం? గన్నార నీకుక్షిలోఁ**
**గనె, బోక్రమ్మఱ, గాంచెనే? భవదపాంగశ్రీ, బ్రపంచంబు చ**
**క్కన లోనౌ, వెలియౌను, లోను వెలియుంగాదే, దదన్యంబగున్.**

**(–ద.స్కం.పూ.భా.ప. 561)**

లయ కారకుడైన శివుడు బాణాసుర రక్షణ విషయంలో శ్రీకృష్ణుడే అనంతుడనే విషయాన్ని–

**తే. అవ్యయుండ వనంతుండ వచ్యుతుండ**
**వాది మధ్యాంత శూన్యుండ వఖిలధృతివి**
**నిఖిలమందెల్ల వర్తింతు నీవుదగిలి**
**నిఖిలమెల్లను నీయంద నెగడు గృష్ణ.**

**(– ద.స్కం.ప. 442)**

అని ధ్రువీకరించాడు.

దీన్ని పరిశీలిస్తే ప్రకృతి నశించేది. ఈ నశించే ప్రకృతిని సృష్టించటానికి, నశింప చేసి నూతన సృష్టి చేయటానికి వేరొక శక్తి శాలియే కారణమని విదితమౌతుంది.

ఆ శక్తిశాలికే అనంతుడు, అవ్యక్తుడు, వ్యక్తుడని సహస్ర మూర్తియని అనేక పేర్లతో పండితులు చెప్తున్నారు. మనం సృష్టి కర్తగా భావించే 'బ్రహ్మ' ఈ సృష్టి సమస్తం నీవే అని శ్రీకృష్ణుని స్తుతించటంలో శ్రీకృష్ణుడే అనంతుడని స్పష్టమౌతుంది.

జీవులలో తర తమ భేదాలని పాటించక ముక్తినిచ్చుటే అనంతుని అనంత తత్త్వానికి తార్కాణంగా దృగ్గోచరమౌతుంది. భక్తుల భవసాగరాల్ని దాటించడమే భగవంతుని లక్ష్యం. ఆ లక్ష్యాన్ని అన్ని అవతారాలలో అనంతుడు నెరవేరుస్తున్నాడు.

అంతే కాక శ్రీకృష్ణావతారంలో శ్రీకృష్ణుడు ఈ లోకంలో గృహస్థ ధర్మాన్ని స్వీకరించి ధర్మార్థ కామాదులనే పురుషార్థాలను సాధిస్తూ, ఉత్తములకు తానే దిక్కుగా ఉంటూ, లోకం తనను అనుసరించటానికి, తానూ ఒక సంసార జీవితాన్ని అనుసరిస్తూ సత్పురుషులకందరికీ దిక్కుగా నిలిచాడు.

**వసుదేవసుతం దేవం కంస చాణూర మర్దనమ్ ।**
**దేవకీ పరమానన్దం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**



## శ్రీవారి జ్యేష్ఠాభిషేక మహోత్సవాలు, తిరుమల

| | | | |
|---|---|---|---|
| 23-6-10 | బుధ | వజ్రకవచ సమర్పణ | జ్యేష్ఠ మాసమున జ్యేష్ఠా నక్షత్రమున జరుగును |
| 24-6-10 | గురు | ముత్తంగికవచ సమర్పణ | |
| 25-6-10 | శుక్ర | సువర్ణకవచ సమర్పణ | |

# శ్రీ తులసీ మహిమ

– డా॥ చతుర్వేదుల వెంకట శ్రీ శివసుబ్రహ్మణ్యశర్మ

సనాతన భారతీయ సంస్కృతిలో విగ్రహారాధనతో పాటు వృక్షాల ఆరాధన కూడా అంతే ప్రాధాన్యతను కలిగి ఉంది. రాగి, మోదుగ, వేప, బిల్వ వృక్షాలకంటే తులసి చాలా గొప్పది. తులసి ఆరోగ్య ప్రదాయినీ కూడ, శ్లేష్మమునకు, వ్రణాలకు తులసిని వాడే ఆచారం కూడా ఆయుర్వేదంలో కలదు. తులసీ దళాలు విష్ణువుకు ప్రీతికరం. తులసిమాలతో జపం చేస్తే ఎన్నోరెట్లు తపస్సు చేసిన పుణ్యఫలం వస్తుందని పురాణాలు చెప్తూతున్నాయి.

తులసీ దళాలను కోసేటప్పుడు శుచిగా, నిర్మల మనస్సుతో, శ్రీమన్నారాయణుని ధ్యానిస్తూ కోయాలి. "హే! తులసీమాత! నీవు గోవిందునికి హృదయానందకారిణివి! శ్రీమన్నారాయణుని పూజకోసమే నీ దళాలను కోయుచున్నాను" అనే భావన రావాలి. తులసీ వృక్షం యొక్క మూలంలో సర్వ పుణ్యతీర్థాలు, కాండంలో సర్వదేవతలు, తులసీ వృక్షము యొక్క అగ్రభాగాన షడంగాలతో కూడిన నాలుగు వేదాలు కలవు. మానవులకు సూక్ష్మమార్గంలో మోక్షాన్ని ఇప్పించడానికై అమృతం నుండి నీవు ఉదయించినదానవు.

**శ్లో॥ ధ్యాయేత్తులసీం దేవీం చ శ్యామాం కమలలోచనాం,**
**ప్రసన్నాం పద్మవదనాం వరాభయ చతుర్భుజాం ।**

**కిరీటహారకేయూర కుండలాది విభూషణాం,**
**ధవళాంకుశ సంయుక్తాం పద్మాసననిషేవితాం ॥**

**ప్రియాంచ సర్వదా విష్ణోః సర్వదేవ నమస్కృతాం ।**
**ప్రసీద మమ దేవేశి ప్రసీద హరివల్లభే ॥**

అని పురాణాల్లో తులసీ మాహాత్మ్యాన్ని చెప్పినవి. తులసీవనం ఎక్కడ ఉంటుందో అక్కడ శ్రీహరి ప్రసన్నుడై ఉంటాడు. కావున తులసీ ఆరాధనకు ముందు ఇలా భావించాలి. "మమ సమస్త పాప నివృత్యర్థం, సర్వదురితక్షయ ద్వారా



పుణ్యఫలప్రాప్త్యర్థం, ఆత్మశుద్ధ్యర్థం, అస్మాకం వంశే జాతానాం సర్వేషాం జనానాం శ్రీహరేః అనుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థం, అస్మాకం సర్వేషాంబుద్ధేః ధర్మకార్యే నిమజ్జనార్థం, భక్తి జ్ఞానవైరాగ్య యోగ్య తాసిద్ధ్యర్థం, ప్రతిబంధరహిత శ్రీమన్నా రాయణస్యదర్శన సిద్ధ్యర్థం శ్రీ తులసీపూజాం కరిష్యే అని సంకల్పించాలి.

భారతీయ మహిళకు తులసీ కల్పవృక్షంలాంటిది. దీని సేవతో త్వరగా తరించగలరు. ఇది స్త్రీలకు సమస్తసౌభాగ్యాలను, అచంచలమైన భక్తిని, ఆదర్శదాంపత్యాన్ని, పాతివ్రత్యాన్ని ఇస్తుంది. శ్రీమన్నారాయణుని అనుగ్రహం కారణంగా తులసీ వృక్షం కల్పవృక్షానికంటే అమూల్యమైంది. అయితే కల్పవృక్షం దేవలోకంలోనే ఉంది. కానీ తులసీవృక్షం ప్రతి గృహంలో పూజలందుకుంటుంది.

**శ్లో॥ తులసీకాననం చైవ గృహే యస్యావతిష్ఠతే ।**
**తద్గృహం తీర్థ భూతం హి నాయాంతి యమకింకరాః ॥**

ఉదయాన్నే లేచి తులసిని చూచి నమస్కరిస్తే సమస్త పుణ్యతీర్థాలను సందర్శించిన పుణ్యం లభిస్తుంది.

**యే స్మరంతి సకృద్దేవీం తులసీం విష్ణువల్లభాం ।**
**అహోరాత్రం కృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి ॥**

**తులసీ సన్నిధౌ ప్రాణాన్ యే త్యజంతి మునీశ్వర ।**
**న తేషాం నరకక్లేశః ప్రయాంతి పరమం పదం ॥**

తులసీపూజను అందరూ చేయవచ్చు. తులసీ ఆరాధన వల్ల సౌభాగ్యం, మంచి సంతానం, ధనం, ధాన్యం, ఆరోగ్యం, శోకశమనం, అభీష్ట ఫలసిద్ధి, భర్తకు, సంతానానికి ఆయురారోగ్యాలను ఇస్తుంది. అందువల్ల అందరు తులసీ మాతను

ఆరాధించినట్లైతే సుఖసంతోషాలను పొందుతారనడంలో సందేహంలేదు.

శివపురాణంలో తులసిని గురించి ఇలా ఉంది. శివుడు మన్మథుని తన మూడో కంటితో భస్మం చేయగా ఆ భస్మం కొంత సముద్రంలో పడింది. ఆ శబ్దం ప్రళయధ్వని సృష్టించగా దేవతలు అదేమిటని బ్రహ్మనడిగారు. బ్రహ్మ తక్కిన దేవతలు సముద్రుణ్ణి వివరణ కోరగా అతడు తన కుమారుడని చెప్పగా బ్రహ్మ ఇతనికి జలంధరుడని నామకరణం చేశాడు. ఇతనికి శివుని వల్ల తప్ప మరొకరితో భయం లేదని చెప్పెను. జలంధరుడు రాక్షస గురువైన శుక్రుని వల్ల జలసంపద అంతా దేవతల వశమైందని విని మహావిష్ణువుపై దండెత్తుతాడు. విష్ణువే స్వయంగా యుద్ధం చేసినా గెలవలేక జలంధరుణ్ణి వరం కోరుకొమ్మంటాడు. నారదుని వల్ల పార్వతి అత్యంత సౌందర్య వతి అని విని పార్వతిని పంపమని శివుణ్ణి కోరగా శివుడు ఇతనితో యుద్ధం చేస్తాడు. జలంధరుడు ఎంతకూ ఓడిపోక పోవడం వల్ల పార్వతి శ్రీమహావిష్ణువును ప్రార్థించగా జలం ధరుని భార్య బృంద పాతివ్రత్యం చెడితేగాని జలంధరుడు మరణించడని చెప్తుంది. శ్రీమహావిష్ణువు మాయా జలం ధరుడుగా బృందను వంచించగా శివుని చేతిలో జలంధరుడు మరణించాడు.

దేవీభాగవతంలో తులసి గురించి ఈ విధంగా ఉంది. లక్ష్మి, సరస్వతి, గంగ అతని చెంత కూర్చుని ఉండగా గంగ కన్నార్పక విష్ణువును చూస్తుండగా సరస్వతి కోపంతో గంగ జుట్టుపట్టుకుని కొడు తుండగా లక్ష్మీదేవి దాన్ని ఆప దానికి ప్రయత్నించింది. అది భరించలేని సరస్వతి లక్ష్మిని భూలోకంలో ఓ మొక్కగా జన్మించమని శపిస్తుంది. గంగ సరస్వతిని నదిగా కమ్మని శపించగా తిరిగి సరస్వతి గంగనూ నది కమ్మని శపిస్తుంది. శ్రీమహావిష్ణువు అన్యాయంగా లక్ష్మి శపించబడటాన్ని చూసి "విచారించకు, నీవు భూలోకంలో పూజనీయమౌతావు. నా శక్తిలో భాగమైన శంఖమునుడు నిన్ను వివాహమాడిన తర్వాత నీవు తిరిగి నన్ను చేరగలవు. ఆ మొక్కగా నిన్ను భూమిమీది ప్రజలు పూజిస్తారని" తులసీ మాహాత్మ్యాన్ని తెలిపాడు.

తులసీ వృక్షాన్ని నాటినా, నీరు పోసి పెంచినా, భక్తితో ప్రదక్షిణను చేసినా ధర్మార్థకామమోక్షాలు లభిస్తాయి. తులసి వనం ఉన్నచోట యమకింకరులు రారు. జీవుడు మరణించే ముందు అతని నోటిలో తులసీతీర్థాన్ని త్రాగిస్తే అతనికి మోక్షం లభిస్తుంది.

**ప్రదక్షిణం భ్రమిత్వా యే నమస్కుర్వంతి నిత్యశః ।**
**సప్తద్వీపవతీం పృథ్వీం సరత్నాకరమేఖలాం ॥**

తులసీ వృక్షమునకు ప్రదక్షిణము చేసి త్రికరణ శుద్ధిగా నమస్కరించినచో ఏడు ద్వీపాలతో కూడిన సాగరాన్ని ప్రదక్షిణం చేసిన ఫలం లభిస్తుంది.





# శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలు, అప్పలాయిగుంట

2010, జూన్ 20 నుండి 29 వరకు

| తేదీలు | వారము | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| **20-6-2010** | శుక్ర | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| **21-6-2010** | శని | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| **22-6-2010** | ఆది | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| **23-6-2010** | సోమ | సింహవాహనం | ముత్యపుపందిరి వాహనం |
| **24-6-2010** | మంగళ | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| **25-6-2010** | బుధ | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| **26-6-2010** | గురు | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| **27-6-2010** | శుక్ర | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| **28-6-2010** | శని | రథోత్సవం | అశ్వ వాహనం |
| **29-6-2010** | ఆది | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం ద్వాదశారాధనము, ఏకాంత ఉత్సవం |

**భవభంజన మే తత్తే సర్వాభీష్టం ప్రయచ్ఛతి ।**
**నాతః పరతరం కిచిత్పావనం భువి విద్యతే ॥**

తులసీ మాహాత్మ్యము అనిర్వచనీయమైనది. సర్వాభీష్టాలను నెరవేర్చునది. దీనికి మించిన పావనమైనది భూమండలంలోనే లేదు. వాడిన తులసి కట్టెతో గంధాన్ని తీసి సాలగ్రామాలకు అలంకరించిన చాలా శ్రేష్ఠం. భక్తితో తులసీ దళాలతో శ్రీహరిని అర్చించినచో మరోజన్మ లేదు.

**యః కుర్యాత్ తులసీ కాష్ఠే రక్షామాలాం సురూపిణీం ।**
**కంఠమాలాం చ యత్నేన కృతం పాపక్షయం భవేత్ ॥**

తులసి పూసలను దండగాచేసి కంఠంలో ఎవరు ధరిస్తారో వారి పాపాలన్నీ క్షయమై అక్షయ ఫలలోకాలకు చేరుతారు.

**దేవి త్రైలోక్య జనని సర్వలోకైక పావని ।**
**సర్వదేవమయే దేవి సర్వదా విష్ణు వల్లభే ॥**

**క్షీరోద మథనోద్భూతే చంద్రలక్ష్మీ సహోదరే**
**అమృతార్ణవ సంభూతే భక్త వాంఛిత దాయికే ॥**

**పద్మనాభప్రియే నిత్యం పద్మోద్భవ సమర్పితే ।**
**పద్మ పత్రవిశాలాక్షి వరదా భవ శోభనే ॥**

**విష్ణుప్రియ కరే దేవి తులసీ సుఖదాయికే ।**
**పదే పదే చ సౌభాగ్యం మమ దేహి వరాననే ॥**

**నమస్తే దేవి కళ్యాణి నమస్తులసి సర్వగే ।**
**నమో వేదమయే దేవి నమస్తే హరివల్లభే ॥**

**యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతాః ।**
**యదగ్రే సర్వవేదాశ్చ తులసీ త్వాం నమామ్యహమ్ ॥**

అంటూ తులసిని ప్రతినిత్యం ఆరాధించినట్లైతే సమస్త కోరికలు నెరవేరుతాయి. స్త్రీలు తులసిని లక్ష్మీదేవి స్వరూపంగా భావించి ప్రతి నిత్యం గృహంలో పూజిస్తారు.

## శ్రీపదకేళి - 11 (ఏప్రిల్ - 2010)
## విజేతలు

1) **డి.రామస్వామి,**
శిమ్మపేట గ్రామం,
సానివాడ (బి.ఓ.),
అరసవల్లి (వయా)
శ్రీకాకుళం జిల్లా.

2) **ఆరవేటి రామకృష్ణయ్య,**
రిటైర్డ్ వి.డి.ఓ.,
ఇంటి నెం.4/919,
శ్రీకృష్ణ గీతాశ్రమము వీథి,
ప్రొద్దుటూరు - 516 360.

3) **సి.మోహనరావు,**
ఇంటి నెం.3/568,
పురంవారి సందు,
శ్రీకాళహస్తి - 517 644
చిత్తూరు జిల్లా.

**సరైన సమాధానాలు రాసినవారు :**

ఎ.ప్రమథనాథశర్మ (అనంతపురం); యం.కృష్ణమూర్తి(తిరుపతి); యం.వేంకటచంద్రశేఖర్‌శాస్త్రి (గుంటూరు); ఎ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); కె.తిరుమలాచార్యులు(ఒంగోలు); వి.వి.పద్మా వతి(ఒంగోలు); ఆర్.కొండలరావు (విశాఖపట్నం); పి.రంగనాథ నాయుడు(తిరుపతి);ఓ.ఎం.వి.ప్రసాద్(ఒంగోలు);యం.శ్రీనివాస్ (హనుమకొండ); పి.నరేంద్రకుమార్(రొంపిచర్ల); ఎస్.రాజా రాం(వాల్మీకిపురం); ఆర్.విష్ణుప్రసాద్(తిరుపతి); వై.రాజశేఖర్ నాయుడు(నాయుడుపేట); ఎస్.రుక్మిణమ్మ(రంగారెడ్డి); ఎస్.సరో జినీదేవి (హైదరాబాదు); యస్.రంగనాయక్(ఒరిస్సా); యం. మున్నయ్య(చంద్రగిరి);యస్.వి.సుబ్బారెడ్డి(కలకడ);డి.శ్రీనివాస రావు(నిజామాబాద్); పి.రామనాథశర్మ(ఖమ్మం); ఆర్.వి.రామా నుజాచార్య(చెన్నై);అమ్మినేని వేణు(బెంగళూరు);ఎన్.యశోదమ్మ (నరసింగాపురం); జె.విఘ్నేశ్వరనాయుడు(గండి); యు.రామ లింగేశ్వరరావు(కుప్పం); పూతలపట్టు జగన్మోహనరెడ్డి (హైదరా బాదు); ఎం.దివ్యతేజ(బెంగళూరు); పాదరి దివాకరరెడ్డి (పెరు మాళ్ళపల్లి); జె.జానకి(కడప)




**నిబంధనలు :**

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందా దారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొనవచ్చు.

**బహుమతి వివరాలు :**

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అంద జేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

**పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :**

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

| 1 |  | ■ | 2 |  |  | ■ | 3 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
|  | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ |  |
| 5 |  | ■ | 6 | 7 |  | ■ | 8 |  |
|  | ■ | 9 | ■ |  | ■ | 10 | ■ |  |
| ■ | 11 |  |  | ■ | 12 |  |  | ■ |
| 13 | ■ |  | ■ | 14 | ■ |  | ■ | 15 |
| 16 |  | ■ | 17 |  |  | ■ | 18 |  |
|  | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ |  |
| 19 |  | ■ | 20 |  |  | ■ | 21 |  |

ఈ కూపను కత్తరించండి

# శ్రీపదకేళి - 13

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

**2) మీరు సప్తగిరి చందాదారులైతే?**

**అ) చందా నంబరు :** ..............................

**ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా :** ..............................

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

## ఆధారాలు

### అడ్డం

**1)** మానవ శరీరానికి అవసరమైన ఎర్రని ద్రవం (2)

**2)** ......హస్తభూషణం (3)

**3)** అక్కమొగుడు (2)

**5)** తల్లి సంస్కృతంలో (2)

**6)** తిరుమలలో స్వామి దర్శనానికి వెళ్ళేముందు ఈ కాంప్లెక్సులో కూర్చుంటారు (3)

**8)** 'సారథి' - ఈ పదంలో రథాన్ని అధిరోహించి యుద్ధం చేసేవాడు (2)

**11)** భూమి (2)

**12)** శకుంతల తల్లి (3)

**16)** స్వర్గం (2)

**17)** ఋతురాజు (3)

**18)** అంగద - ఈ పదంలో భీముని ఆయుధం ఉంది (2)

**19)** విశ్వామిత్రుడు 10వేల సంవత్సరాలు శిలవైయుండుమని శపించిన అప్సరస (2)

**20)** ధృతరాష్ట్రుని తల్లి (3)

**21)** 'మహాప్రస్థానం' - అదే పదంలో "చోటు" అనే అర్థం వచ్చే పదం దాగియుంది. (2)

### నిలువు

**1)** ఈమె బలిచక్రవర్తి కుమార్తె. మరుజన్మలో పూతన అయ్యింది (4)

**4)** సేన. 'వ'కారంలో మొదలయ్యేపదం (4)

**7)** పాండురాజు పట్టమహిషి (2)

**9)** యోజనగంధి కుమారుడు (3)

**10)** తండ్రికున్న అక్కాచెల్లెళ్ళను ఇలా అంటారు (3)

**13)** శిశుపాలుడు పాలించిన దేశం (4)

**14)** నవ్వు (2)

**15)** విష్ణుమూర్తి చేతిలో ఉన్న చక్రం (4)

### —:: *శ్రీపదకేళి-11* (ఏప్రిల్, 2010) సమాధానాలు ::—

| 1 చ | ■ | ■ | 2 కం | 3 సు | డు | ■ | ■ | 4 సు |
|---|---|---|---|---|---|---|---|---|
| ల్ల | ■ | ■ | ■ | దా | ■ | ■ | ■ | ధే |
| 5 క | వి | ■ | 6 య | ము | న | ■ | 7 వి | ష్ణు |
| వ్వం | ■ | 8 భ | ■ | డు | ■ | 9 భా | ■ | డు |
| ■ | 10 చం | ద్రు | డు | ■ | ము | 11 ర | ళి | ■ |
| 12 వై | ■ | డు | ■ | అ | ■ | తం | ■ | 13 నం |
| 14 జ | ర | ■ | 15 అ | 16 శ్వ | ము | ■ | 17 రో | ద |
| యం | ■ | ■ | ■ | త్థా | ■ | ■ | ■ | క |
| తి | ■ | ■ | 18 క | మ | లం | ■ | ■ | ము |



# జూన్, 2010 రాశి ఫలాలు



– జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ మాసం ఆరంభం నుండి మాసాంతం వరకు మనసుకు చికాకు, అశాంతి తప్పదు. ఉద్యోగస్థులకు ఇంటా బయట ఇబ్బందులు, ధనవ్యయం, కలహాలు, తదితర అశుభ ఫలాలు కల్గుతాయి. మొదటివారం అనారోగ్యం, రెండోవారం తగాదాలు, మూడోవారం ధనవ్యయం, నాలుగోవారం సంతృప్తి.



## వృషభ రాశి

ఈ నెలలో వ్యవసాయదారులకు, పత్రిక రంగం ఉద్యోగులకు, శుభవార్తలు. పెండింగ్‌లో ఉన్న పనులు అనుకూలంగా అవుతాయి. ఉద్యోగంలో బదిలీలు. దేవత దర్శనాలు మేలు చేస్తాయి. మొదటివారం క్షేత్రదర్శనం, రెండోవారం ధనాదాయం, మూడోవారం శుభవార్తలు, నాలుగోవారం ఆనందం.



## మిథున రాశి

ఈ మాసంలో వీరు నిరీక్షిస్తున్న పనులన్నీ ఒక కొలిక్కి వచ్చి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తాయి. చేయు వృత్తి వ్యాపారాల్లో తరచూ పలు ఆటంకాలు, ఏర్పడినా ఫలితం మీకు దగ్గరగా ఉంటుంది. మొదటివారం ధనప్రాప్తి, రెండోవారం విజయం, మూడోవారం ప్రశాంతత, నాలుగోవారం స్వల్ప అనారోగ్యం.



## కర్కాటక రాశి

ఈ రాశివారికి ఈ నెలలో భూమి, స్థిరాస్థుల అమ్మకం వల్ల విశేషలాభం వస్తుంది. ఈ మాసం బంధుమిత్ర విరోధాల వల్ల ఆందోళన కల్గుతుంది. అవివాహితులు పెళ్ళి ప్రయత్నాలు ఆరంభిస్తే మంచి ఫలితాలు వస్తాయి. మొదటివారం లాభం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం బంధువిరోధం, నాలుగోవారం కార్యజయం.



## సింహ రాశి

ఈ మాసంలో ఈ రాశివారు ప్రయాణాలకు, విందు, వినోదాలకు విపరీతంగా ధనం ఖర్చు చేస్తారు. చిన్నమిత్రుల కలయిక మానసికానందాన్ని కల్గిస్తోంది. ఉద్యోగ, విద్య, వివాహ ప్రయత్నాలలో విజయం సాధిస్తారు. ఇంట్లో ఒకరి ఆరోగ్యం పలు ఇబ్బందులకు గురిచేస్తుంది. ప్రశాంతత జీవనం కోసం దానధర్మాలు చేస్తే మంచిది. రైతన్నలకు పరిస్థితులు అనుకూలం. మొదటివారం మానసిక ప్రశాంతత, రెండోవారం ఆనందం, మూడోవారం ఉద్యోగ విజయం, నాలుగోవారం ప్రయత్నఫలం.



## కన్యా రాశి

ఈ రాశివారు ఈ మాసంలో చేసే వృత్తి వ్యాపారాల్లో మంచిఫలితాలు సాధిస్తారు. ఇంట్లో బయట అందరిచేత ప్రశంసలు పొందుతారు. ఆరోగ్య విషయాల్లో జాగ్రత్తలు అవసరం. ఉద్యోగప్రయత్నం ఉన్నత చదువు ప్రయత్నాలు అనుకూలం. మొదటివారం ఆనందం, రెండోవారం ప్రయత్నజయం, మూడోవారం స్వల్పఅనారోగ్యం, నాలుగోవారం ధనయోగం.



## తులా రాశి

ఈ రాశివారికి ఈ నెలలో అంతా సవ్యంగా ఉంది అనుకునే తరుణంలో గతంలో జరిగిన తప్పులు గ్రహపాటుగా పట్టిపీడిస్తూ మానసికాందోళనకు దారితీస్తాయి. ఆలోచనలు కోటలు దాటుతాయి. ఆచరణ సరిగ్గాలేక అవమానాలు ఎదుర్కోవలసి వస్తుంది. చెప్పుడు మాటలు వినకుండా లక్ష్యసాధనలో దృష్టిపెడితే మంచిది. ఆలయ దర్శనం ఆనందాన్నిస్తుంది. మొదటివారం భయాందోళనలు, రెండోవారం ధనవ్యయం, మూడోవారం అవమానాలు, నాలుగోవారం విజయం.



## వృశ్చిక రాశి

ఈ మాసంలో వీళ్ళకు విద్యా, ఉద్యోగవకాశాలు అంది వస్తాయి. మానవ ప్రయత్నం అవసరం. కుటుంబంలో శుభ కార్యాలు జరగటం వల్ల ఆనందం వెల్లువిరుస్తుంది. విలువైన వస్తువుపోయే అవకాశం ఉంది. జాగ్రత్త వహించగలరు. ధార్మిక సేవ మానసిక ఉల్లాసాన్ని ఇస్తుంది. మొదటివారం ప్రయత్న

జయం, రెండోవారం ఆనందం, మూడోవారం ఆధ్యాత్మిక చింతన, నాలుగోవారం అనారోగ్యం.

### ధనూ రాశి

ఈ రాశివారికి ఈ నెలలో వృత్తివ్యాపారాల్లో నమ్మిన వ్యక్తుల మోసం వల్ల కష్టనష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది. ప్రతి పనిలో పలు ఆటంకాలు ఎదురౌతుంటాయి. అయినా లక్ష్యంతో విజయం సాధిస్తారు. విద్యార్థులు చదువులలో రాణించి మంచి ఫలితాలు సాధిస్తారు. మొత్తం మీద గతంకంటే ఆనందంగా ఉంటారు. మొదటివారం మిత్రుల కలయిక, రెండోవారం కార్య జయం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం నష్టం.

### మకర రాశి

ఈ నెలలో ఈ రాశివారికి ఆశించిన ఫలితాలు లభిస్తాయి. ఒప్పుకున్న పనులు, అనుకున్న సమయానికి పూర్తి చేస్తారు. బంధుమిత్రుల సహాయ సహకారాలు పూర్తిగా వినియోగించు కుంటారు. ఊహించని విధంగా ధనం చేతికి అందుతుంది. విద్యార్థులకు అన్ని విధాలా అనుకూలం. మొదటివారం ధన ప్రాప్తి, రెండోవారం శుభవార్త, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం ఆనందం.

### కుంభ రాశి

ఈ నెలలో వీరికి శత్రుబాధలు అధికంగా ఉంటాయి. అనారోగ్యం ఏర్పడుతుంది. అనుకున్న పనులు చేతిదాక వచ్చినట్లే వచ్చి చేజారిపోతాయి. అనుకోని సుదూర ప్రయాణాలు ఆందో ళన కల్గిస్తాయి. వైద్యం, బ్యాంకు, రెవెన్యూ, ఉపాధ్యాయ, రైల్వే తదితర ఉద్యోగులకు బదిలీలు అయ్యే అవకాశం ఉంది. మొదటివారం ఆందోళన, రెండోవారం అనారోగ్యం, మూడో వారం ప్రయాణ ప్రమాదాలు, నాలుగోవారం కార్యజయం.

### మీన రాశి

ఈ మాసంలో వీరికి చేసే పనులలో ఆటంకాలు, మిత్రులతో అభిప్రాయ భేదాలు రావచ్చు. వాహన ప్రమాదం దృష్ట్యా ఒంటరి ప్రయాణం వద్దు. సంతానం వల్ల ఆనందం. ఉద్యోగస్థులకు అధికార్ల ఒత్తిడి ఉంటుంది. మొదటివారం ఆనందం, రెండోవారం శత్రుజయం, మూడోవారం అశాంతి, నాలుగోవారం ప్రమాదం.

# సమర్పించేది భక్తి మాత్రమే!!

– శ్రీమతి శంకరమంచి సరోజ




శ్రీ వేంకటేశ్వరస్వామి నమ్మిన వారిని వమ్ము చేయని కలియుగ ప్రత్యక్షదైవం. నేను, మావారు, మా ఇద్దరు పిల్లలతో తిరుమలకు వెళ్ళాము. మేము తిరుమలలో మూడురోజులుండి స్వామివారిని పలుమార్లు దర్శించుకుని అనంతపురానికి తిరుగు ప్రయాణమైనాము. వస్తూ వస్తూ దారిలో గాజులు తీసుకుందామని, గాజుల షాపు దగ్గర ఆగి గాజులు తీసుకుని తిరిగి చూస్తే నా వెంట వచ్చిన మా చిన్నబాబు కన్పించలేదు. ఆ చుట్టుపక్కలంతా వెదికినా కనిపించలేదు. పరిగెత్తి వాళ్ళ నాన్నదగ్గరికి వెళ్ళాడేమోనని మా వారి దగ్గరకు వెళ్ళి విచారించాను. అక్కడ కూడా లేదు. పైగా మావారు నన్ను తిట్టి, కొట్టినంత పని చేశారు. మూడు గంటలసేపు ఆ ప్రాంతమంతా వెదికినా ఎక్కడా కనిపించలేదు.

బాబు దొరక్క అందరూ ఏడుస్తున్నాం. అదే సమయంలో ఎవరిదో ఒక కారు ఆ వైపుగా వేగంగా వెళ్ళింది. అందులో నుంచి నాన్న, నాన్న అని మా బాబు పిలిచినట్లుగానే అనిపించింది. కానీ ఆ కారు వేగంగా వెళ్ళిపోయింది.

మావారు వాడిని ఎవరో ఎత్తుకెళ్ళిపోయారు, ఇక మనకు వాడు దొరకడు అని ఏడుస్తూ, గట్టిగా దేవునితో మాట్లాడినట్లు "స్వామీ..! నీ దర్శనానికి వస్తే ఇలా చేశావేమయ్యా? దేవుడుంటే ఇలా ఎందుకు జరుగుతుందని" బిగ్గరగా ఏడుస్తున్నారు. అంతలో ఇద్దరు వృద్ధ దంపతులు మా దగ్గరకు వచ్చి "మీరు బాబుకోసం వెదుకుతున్నారా! అదిగో మీ బాబు" అని చూపించారు. వెనుతిరిగి చూస్తే మా బాబు ఉన్నాడు. ఆనందం పట్టలేక ఇంతసేపు ఎక్కడకు వెళ్ళావని వానితో మాట్లాడి వెనుతిరిగి చూస్తే ఆ వృద్ధ దంపతులు లేరు. ఆ తేజోమయ స్వరూపులు మా మనస్సులో నిండిపోయారు. అలమేలు మంగమ్మ, శ్రీనివాసుడే ఆ వృద్ధ దంపతుల రూపంలో మాకు కన్పించారు. ఇది మా జీవితంలో జరిగిన అద్భుతం. ఇది కల్పితం కాదు.

మేము మొదటినుంచి... మా అత్తా మామల కాలం నుంచి ప్రతి సంవత్సరం తిరుమలకు వెళ్ళి వైకుంఠ ఏకాదశి నాడు స్వామి దర్శనం చేసుకోవడం ఆనవాయితీ. మా అమ్మ వాళ్ళింట్లో నరసింహస్వామి ఇంటి దేవుడు. నాకు పెళ్ళయిన తర్వాత మొదటిసారిగా తిరుమలకు వెళ్ళాం. అప్పుడు నేను నాలుగు నెలల గర్భవతిని. స్వామిని స్మరించుకుంటూ వెళ్ళి అపస్మారకంలో స్వామితో మాట్లాడాను. నాకు బాబు పుట్టినపుడు పొడుగాటి తిరునామంతో పుట్టాడు. ఆ నామం వాడి నుదుటిపై సుమారు 5 సంవత్సరాల వరకూ బాగా కనబడేది. మాకు ఇప్పటికీ అన్నింటా వెన్నంటి స్వామి ఉంటున్నాడు. మేము కోరినవన్నీ తీరుస్తూ మా పిల్లలను చల్లగా కాపాడుతున్నాడు. ఆయనకు మేము ఇచ్చే కానుక ఒక 'భక్తి' మాత్రమే.




**ధారావాహికం - 89**

**(భగవద్రామానుజాచార్యుల ప్రభావం తిరుమల ఆలయంలో బహుపాలు కనబడుతుంది. నేడు జరుపుతున్న పూజా పద్ధతి, ఆగమ అనుసరణ అంతా ఆ నాడు వారు పరిశీలించి ప్రాచుర్యంలో తెచ్చి పెట్టినదే అని శ్రీ వేంకటాచల ఇతిహాసమాల చెపితే, ఇక్కడ దొరికే శాసనాలు దానికి పూరక సాక్ష్యాధారాలను సమకూరుస్తాయి.)**

రామానుజులు, తర్వాత వీరి శిష్యులైన అనంతార్యులు తిరుమల దేవాలయ వ్యవహారాలు సక్రమంగా జరిపేందుకు పాటుపడిన సేవలను శ్రీ వేంకటాచల ఇతిహాసమాల ఏడు అధ్యాయాలలో విశదీకరించినది. తరువాతి శతాబ్దంనందలి శాసనాలు తెలుపుతున్న ప్రకారం రామానుజులు మరియు అనంతార్యుల పేర్లమీద పుష్పవనాలు మున్నగు సంస్థలు వెలసి యుండినట్లు తెలుపుతున్నాయి. ఇవి రామానుజుల మరియు అనంతార్యుల వ్యవహారదక్షత చారిత్రక సత్యమనే విషయాన్ని రుజువుపరుస్తున్నాయి. తిరుపతి దేవాలయంనందలి సంఖ్య 171 మరియు 173 శాసనాలు నిస్సందేహంగా ఆనందాళ్వాన్‌ను గురించీ, సంఖ్య 175 శాసనం రామానుజుని తిరునందనవనం గురించి ప్రస్తావిస్తున్నాయి. ఈ దేవాలయం నిస్సందేహంగా వైష్ణవ ఆలయమే అనీ, అందుచేత యాదవరాయలు ఇచ్చిన తీర్పును ప్రాచుర్యంలో తీసుకు వచ్చి దైనందిన పూజాది కార్యక్రమాలు వైఖానస ఆగమశాస్త్రోక్తంగా జరపాలనీ వ్యవస్థ చేయడమే రామానుజాచార్య చేసిన ప్రథమ కైంకర్యమైంది. తర్వాత రామానుజుడు ఆగమశాస్త్రోక్తంగా శ్రీవారి ఆలయవిమానానికి అవసరమైన మరమ్మత్తులు చేయించాడు. పద్మావతి ప్రతిమా ముద్రాంచితమగు సువర్ణ మాడలహారాన్ని తయారుచేయించి స్వామి మెడను అలంకరింపజేసి పద్మావతీ విగ్రహాన్ని యథా స్థానాన ఉంచాడు. ఇది వేంకటాచల ఇతిహాసమాలలోని ప్రథమ భాగం.అటుతరువాత రామానుజులు ప్రతివారం స్వామికి జరిపే అభిషేక కార్యక్రమంపై దృష్టిసారించాడు. ప్రతి గురువారం నాడును స్వామి విగ్రహం మీది ఆభరణాద్యలంకారాలను, ఉడుపులను తీసివేసి, పూర్తిగా పూలమాలలతో అలంకరించాలి. ఈ కార్యక్రమం జరుపునపుడు నాచ్చియార్ తిరుమొళి పాశురాలను గానం చేసేందుకు తగు ఏర్పాటు గావించాడు. దేవాలయంలో పూజాకార్యక్రమం సక్రమంగా వైఖానసఆగమ శాస్త్రోక్త విధానాన జరిపేందులకుగాను వెనుకటి వైఖానస పురోహితుని వంశీయులను ఎన్నుకొని, వారికి శ్రీవైష్ణవ దీక్షను జరిపించి, తర్వాత వారిచే పూజాకార్యక్రమాలు జరిపింపజేశాడు. ఆళ్వారుల విగ్రహాలను తిరుమల దేవాలయంలో ప్రతిష్ఠించేందుకు ప్రయత్నించాడు. కాని వాళ్ళలోనే చాలా మంది కొండపైకి కాళ్ళతో ఆరోహణం అపవిత్రం అనే భావనను తమ పాశురాలలో చెప్పారు కాబట్టి ఆ కార్యాన్ని విరమించి, కొండ కింద తిరుపతిలో తరువాతి కాలంలో నిర్మించిన గోవిందరాజస్వామి ఆలయంలో వారి విగ్రహాలను ప్రతిష్ఠింపజేసాడు.

రామానుజుని ఆదేశాన్ని శిరసావహించి తిరుమలలో నివాసస్థానాన్ని ఏర్పరచుకొనిన అనంతసూరి(ఆనందాళ్వాన్) తన గురువుగారి అభిమతానుసారం తిరుమలలో పూదోటలను పెంచ సాగాడు. అనంతసూరి తాను పెంచుతున్న నందనవనానికి తన గురువుగారి పేరునుపెట్టుకున్నాడు. ప్రతిదినం పుష్పాలను సేకరించి వేంకటేశ్వర స్వామికి సమర్పించుకుంటు ఉండేవాడు. తరువాతి కాలంలో అనేకమంది ఏకాంగులు, జీయరులు అనంత సూరిని అనుసరించి తమ జీవితాలను సేవాకార్యక్రమానికి అంకితం గావించుకుని పుష్పవనాలను పెంచి స్వామికి పుష్పా

లను సమర్పించుకోవడం కోసం ముందుకు వచ్చారు. ఒకరిద్దరు శ్రీవైష్ణవులు కూడ ఈ విధానాన్నే అను సరించి పూదోటలను పెంచసాగారు. అటువంటివారిలో ఉడయవర్ కోయిల్ అణ్ణన్ అని మరోపేరుగల అనుసంధానం తిరువెంకట దాసర్ (శాసనం సంఖ్య 247-టి.టి.) మరియు హస్తిగిరి దాసర్ (శాసనం సంఖ్య 341-టి.టి.) ముఖ్యంగా ఎన్నదగినవారు.

(ఇక్కడ ఉడైయవర్ కోయిల్ అంటే రామానుజుల కోయిల్ అనే అర్థం. దానికి అణ్ణ-పెద్దవాడు అయిన అనుసంధా నం తిరువేంకటదాసు అని పేరుపొందిన ఇతడు తిరుమలలో దైవనాయకన్ పుష్పవనాన్ని చూసేవాడు - అనువాదకుడు)

రామానుజులు, తన శిష్యుల మానసములలో ఆళ్వా రులు దైవసమానులనీ, వారిని పూజించడంచేత దైవాన్ని పూజిం చిన ఫలమొస్తుందనే భావాన్ని ప్రోదిచేసి, వారిచే ఆళ్వారులకు గుడులు కట్టించి విగ్రహాలను ప్రతిష్ఠింపజేసి నిత్యపూజాది కైంకర్యాలు జీయరుల పర్యవేక్షణలో జరిపేందుకు తగు ఏర్పాట్లు చేసేటట్లు ప్రోత్సహించాడు. తమ గురువైన రామానుజుల వారిని అవతారపురుషులుగా భావించి వారి తదనంతరం వారివిగ్రహాన్ని ప్రతిష్ఠించి పూజించాలనే భావాన్ని శిష్యుల మనస్సులో బలంగా నాటుకునేట్లు చేయగలగినంతటి ప్రతిభాపాటవాలు కలిగిన వాడు రామానుజులు. ఉదాహరణానికి శా.శ.1397 సంవత్సరం తిరుపతిలోని శ్రీరామానుజులగుడి నిర్వహణ యతిరాజజీయరు అనే విషయం శాసనం (సంఖ్య 145-జి.టి.) వలన తెలుస్తోంది. అదే విధంగా తిరుపతి నమ్మాళ్వారుగుడి నిర్వహణ శా.శ. 1436వ సంవత్సరం మరొక యతిరాజజీయరు నిర్వహించినట్లు (సంఖ్య203-జి.టి.)శాసనం వలన తెలుస్తోంది. అలాగే తిరుమంగై ఆళ్వారు దేవళం ఒకానొక ఏకాకి శ్రీవైష్ణవుల నిర్వా హకత్వంలో రాణించినట్లు (సంఖ్య333-టి.టి.) శాసనం తెలుపు తోంది. ఈనాడునూ శ్రీ వేంకటేశ్వరస్వామి గుడి, శ్రీరామాలయా లలో ఉన్నటువంటి ఉడయవరుల (రామానుజులు) గుడులు, అలిపిరి(కొండ పాదతలం) వద్ద జీర్ణదశలో ఉన్న పెరియాళ్వారు గుడి (ప్రస్తుతం లక్ష్మీనారాయణుని ఆలయం), కపిలతీర్థం వద్ద నున్న నమ్మాళ్వారు గుడి, ఇంకనూ గోవిందరాజస్వామి దేవా లయంలో ఉన్న ఇతర ఆళ్వారుల గుడులు రామానుజాచార్యుల శక్తిసామర్థ్యాలకు, ప్రతిభా పాటవాలకు నిదర్శనంగా నిలిచి ఉన్నది.

తిరుమల దేవాలయంలో రామానుజుల వారి పలుకు బడిని గురించి దిగ్దర్శనంగా ఈ క్రింది విధంగా చెప్పవచ్చు.

ప్రథమంగా పూదోటలు, నందనవనాలు పెంచేటట్లు ప్రోత్సహించి తద్వారా స్వామిని అర్చించేందుకు దేవాలయానికి కావలసిన పుష్పాలను సమకూర్చబడే ఏర్పాటు గావించాడు. ఈ నందనవనాలను సంరక్షించు కార్యాన్ని ఏకాంగులకు అప్ప జెప్పబడింది.

రెండవది - దేవాలయంలో, తిరుమళిశైవంటి ఆళ్వా రుల విగ్రహాలనూ, ప్రతిష్ఠించేటట్లు ప్రోత్సహించాడు. (ఇతని అనుసరించి ఇతనినే భగవంతుడు అని కొలుస్తూ భగవత్ శబ్దాన్ని రామానుజ పేరుకు జోడించి పలుకసాగారు. అలా రామానుజుల విగ్రహాలు కూడ పూజకు పాత్రమైనవి. - అను వాదకుడు)

మూడవది- అక్కడక్కడ శ్రీవైష్ణవుల మఠాలు వెలవడం చూస్తే ఈ ప్రాంతాలలో రామానుజ మతం వేళ్ళూనుకొని

## త్యాగరాజ స్తోత్ర రత్నం

సీ॥ నిధిచాల సుఖమొ సన్నిధిసేవ సుఖమౌనొ
అనుచు తర్కించు తత్త్వార్థదృష్టి
సీతమ్మ మాయమ్మ శ్రీరాముడే మాకు
తండ్రియౌననెడు బాంధవ్యదృష్టి
ఎంతవారలుగాని కాంతదాసులెయన్న
లోకజ్ఞతను తెల్పు లోకదృష్టి
శాంతము లేకున్న సౌఖ్యము లేదను
సత్యవాక్యము తెల్పుజ్ఞానదృష్టి

తే॥గీ॥ ఇట్టి దృష్టుల మర్మములెల్ల తెలిసి
రామ సేవయే మదిలోని కామితముగ
ఉంఛవృత్తి చేపట్టిన యోగివర్య!
త్యాగధనుడవు కాకర్ల త్యాగరాజ!

- వేదుల బాలకృష్ణమూర్తి

## పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు
# మహాపరాధం

**అన్యక్షేత్రే కృతం పాపం**
**పుణ్యక్షేత్రే వినశ్యతి**
**పుణ్యక్షేత్రే కృతం పాపం**
**బ్రహ్మలోకే న నశ్యతి**

**ఇతర క్షేత్రాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్రంలో నశిస్తుంది. కానీ పుణ్యక్షేత్రంలో చేసిన పాపం బ్రహ్మలోకానికి వెళ్ళినా నశించదు. కావున, పుణ్యక్షేత్రంలో ఆత్మహత్యాది పాపాలు చేయరాదు.**

**ఆత్మహత్య అనేదే మహాపాపమని మన పురాణాలు చెపుతున్నాయి. అలాంటి ఆత్మహత్యలు పుణ్య క్షేత్రాల్లో చేసుకుంటే ఆ పాపం తమకే కాకుండా తమ వంశానికంతా చుట్టుకుంటుందని ఋషులు ఘోషించారు. కాబట్టి భగవంతుని సన్నిధిలో సత్కార్యాలు చేస్తే వాటి ఫలితం శతాధికంగా ఉన్నట్లే ఆత్మహత్యల్లాంటివి చేసుకుంటే స్వర్గప్రాప్తి సిద్ధించకపోగా, ఆ పాప ఫలం తరతరాలు పట్టి పీడిస్తుంది. కాబట్టి పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు చేసుకోవద్దు. భగవద్దర్శనంతో ఆత్మానందాన్ని, మనోధైర్యాన్ని పొందండి.**

ఉండిన వైనం తెలుస్తోంది. తిరుమలలోని తిరుమళిశైప్పిరం మఠం(శాసనం సంఖ్య 335-టి.టి.), వణ్‌శఠగోపన్ మఠం (శాసనం సంఖ్య 276-టి.టి.), పేరరుళాళన్ మఠం మొదలైనవి ఈ కోవకు చెందినవి. వైష్ణవమతప్రబోధానికి, వైష్ణవసాహిత్య వాప్తి ఈ మఠాల ద్వారా వ్యాప్తి చేయడానికి కేంద్రబిందువుగా ఉండేవి.

నాల్గవది- రామానుజుని శిష్యులు ఆయనను అవతార పురుషునిగా భావించారు. అందువలన వీరి సంతతివారు ఉత్తేజితులై, అత్యుత్సాహులై తాము చేసే ధర్మకార్యాల ముందు రామానుజులపేరు గౌరవార్థంగా తగిలిస్తూ వచ్చారు. ఒక విధంగా వీరు రామానుజులయందు తమకు గల గౌరవభావాన్ని ఈ విధంగా ప్రకటిస్తూ వచ్చారన వచ్చును. సాళువ నరసింహుడు మొట్టమొదట స్థాపించిన ఉచితాన్న సత్రాలకు **రామానుజకూట**మని పేరు పెట్టారు. (శాసనం సంఖ్య 8- జి.టి.). అంతే కాకుండా రామానాయకర్ కూడ ఇలాగే రామానుజుని పేరు పెట్టాడు. (శాసనం సంఖ్య 306-టి.టి.). మొట్టమొదటిసారిగా అనంతసూరి (ఆనందాళ్వాన్) తాను పెంచిన పూదోటకు రామానుజునిపేరు పెట్టుకుని తన గురుభక్తిని ప్రకటించుకున్నాడు. తటాకానికి **రామానుజన్ ఏఱి** లేక **రామానుజన్ పుట్టేఱి** అనీ (శాసనంసంఖ్య 311- టి.టి. మరియు 340-టి.టి.), వీధికి **రామానుజన్ తిరువీధి** అనీ (శాసనం సంఖ్య 314-టి.టి.) పేర్లు పెట్టడం చూస్తే రామానుజులవారి ప్రభావం శిష్యులో ఎంతటి గాఢమైన ముద్ర వేసిందో తెలుస్తోంది. తరువాతి తరాల వారికి కూడ ఈ ప్రభావం పరంపరగా వచ్చింది.

ఐదవది- ఉత్సవాదులలో స్వామి ఎదుట శ్రీవైష్ణవులైన సాత్తినవరులు, సాత్తాదవరులు, ఏకాంగులు ఇంకనూ తదితరులు (శాసనం సంఖ్య 200-టి.టి.) తిరువాయ్‌మొళి (శాసనం సంఖ్య 333-టి.టి.), ఇయల్‌పా (శాసనం సంఖ్య 211-టి.టి.), నూత్రందాది(రామానుజుల దివ్యత్వాన్ని వివరించే స్తుతిమాల)ని కూడ పాశురాల స్థాయికి చేర్చి భక్తితో అనుసంధానం చేయ నారంభించారు. (శాసనం సంఖ్య 58-టి.టి.), మొదలైన ప్రబంధాలలోని భాగాలను పఠించే పద్ధతి ప్రవేశపెట్టబడింది. తరువాతి కాలంలో ఈ విధానం వాడుకగా పరిణమించింది. ఇందులకు ప్రధాన కారణం రామానుజులవారే! రామానుజుల వారికి ప్రబంధసాహిత్య నిర్మాతలు, తనకంటే ముందుగా శ్రీవైష్ణవమతానికి జీవగర్రగా ఉండిన ఆళ్వారులు గురించి ఆధ్యాత్మిక గురుభక్తి, అత్యంత భక్తిప్రపత్తులు ఉన్నాయి. అట్టి రామానుజులవారు సోదాహరణ పూర్వకంగా శిష్యబృందానికి ఉపదేశించడం వలననే ఇంతటి పలుకుబడిని పొంది మహోన్నతస్థితికి రాగలిగారు.

***(ఇంకా ఉంది)***

# అన్నం
## పరబ్రహ్మ స్వరూపం

**- చక్రవర్తుల సుబ్బారావు**

"అన్నాద్భవంతి భూతాని, పర్జన్యాదన్నసంభవ---" అని శ్రీకృష్ణభగవానుడు గీతలో అన్నం యొక్క విశేషతను తెలియపరుస్తూ, అన్నం శుక్ల శోణితాలుగా ఏర్పడి, దాని వల్ల ప్రాణికోటి ఏర్పడుతున్నట్లు వివరించారు. అన్నరసం వల్లే మానవ శరీరంలోని ఏడు ధాతువులు పోషింపబడుచున్నవి. మనం భుజించిన అన్నరసం ప్రాణంగా మారుతుంది. ఆ ప్రాణం, శక్తిగా రూపాంతరం చెంది మాట్లాడటానికి, కదలడానికి, ఆలోచించడానికి మూలకారణం అవుతున్నది. మన కళ్ళల్లో ఉండే కాంతికి, అనుక్షణం మనలో జరిగే ఉచ్ఛ్వాసనిశ్వాస క్రియలకు అన్నమే కారణం. ఈ భూమి మీద ఉన్న సమస్త జీవరాసులకు అన్నమే ప్రాణాధారం. లోకయాత్ర అన్నం వల్లే జరుగుతున్నది. దైవసంబంధమైన ఈ అన్న స్వరూపం సర్వేసర్వత్ర వ్యాపించి ఉంది. అన్నంలోంచి భూత రాసులు ఉద్భవించి అన్నం చేతే వర్ధిల్లి, మరణానంతరం అన్నంలోనే లయమై, మరొక ప్రాణికి అన్నంగా మారుతున్నాయి.

ఆత్మలో నుండి ఆకాశం, అందులోంచి వాయువు, దాని నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటి నుండి పృథివి, ఆ భూమి నుండి ఓషధులు, వాటి నుండి అన్నం, ఈ అన్నం నుండి ప్రాణికోటి అవిర్భావానికి కారణమైన ఇంద్రియం, వీర్యం, బీజం ఉద్భవిస్తాయని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఇట్టి మహిమాన్వితమైన అన్నాన్ని మాననీయ పదార్థంగా గుర్తించి, ఉపాసించి ఎందరో మహానుభావులైనారు. దీన్నే అన్న ప్రాశస్త్య విద్య అని పిలుస్తారు. ఇది అతి ముఖ్యమైన లౌకిక విద్య, తైత్తరీయ ఉపనిషత్తులో విపులంగా ఉన్న దీన్నే అన్నమంత్రంగా పఠిస్తూ ఉంటారు.

అన్నం విషయంలో మానవాళి ఎంత జాగ్రత్తగా మెలగవలసియున్నదో, అన్నప్రాశస్త్య విద్యలో పొందుపరచబడిన నియమావళిని పరిశీలిస్తే అన్నాన్ని నిందించకూడదని, వృథా చేయరాదని, సమృద్ధిగా పండించడానికి కృషి చేయాలని చెబుతూ అందుకు భిన్నంగా ప్రవర్తిస్తే "అన్నమో రామచంద్రా!" అని అలమటించవలసి వస్తుందని నర్మగర్భంగా హెచ్చరిక కూడా చేసింది. అన్నం సమృద్ధిగా ఉన్న చోట దుర్భిక్షానికి తావు లేదు. కొందరు అన్నాన్ని స్వీకరించడం ఆత్మయజ్ఞంగా భావిస్తారు. అన్నాన్ని వండేటప్పుడు, వడ్డించేటప్పుడు, స్వీకరించేటపుడు కొన్ని ఆచారవ్యవహారాలు పాటించే గృహస్థులు ఇప్పటికీ ఉన్నారు. వైద్యశాస్త్రం పగలు తృప్తిగా భుజించాలని, రాత్రి లఘువుగా తినాలని, నూరు పనులున్నా సకాలంలో భుజించాలని చెబుతున్నది. భోజనానికి ముందు కాళ్ళు, చేతులు, నోరు కడిగి శుభ్రమైన, తేలికైన వస్త్రాలు ధరించి సుఖాసనంపై ప్రశాంత చిత్తంతో కూర్చుని శాంతంగా, సంతుష్టిగా స్వీకరించిన ఆహారం ద్వారా శరీరంలోని సమస్త ధాతువులు వృద్ధి చెంది సంపూర్ణ ఆరోగ్యం సిద్ధిస్తుంది.

భోజనానికి ముందు వడ్డించిన పదార్థాలపై నీటిని చల్లి, "అమృతమస్తు" అని అనుకుని, అన్నపూర్ణాదేవి స్తోత్రం

**తిరుమలలో భక్తులందరికీ టోకన్లతో నిమిత్తం లేకుండా అన్నదానం జరుగుతున్నది.**

**అన్నాన్ని శ్రీవారి ప్రసాదంగా స్వీకరించండి!**
**దయచేసి వృథా చేయకండి!!**



# తిరుపతి చుట్టు ప్రక్కల దర్శనీయ ఆలయాలు

**శ్రీనివాస మంగాపురం :** తిరుపతికి పశ్చిమ దిక్కున 12 కి.మీ. దూరంలో వెలసిన చిన్న గ్రామం శ్రీనివాస మంగాపురం. ఈ గ్రామానికి ఆగ్నేయ మూలలో శ్రీ కల్యాణ వేంకటేశ్వర స్వామి ఆలయం నెలకొని ఉంది. వివాహానంతరం శ్రీ వేంకటేశ్వర స్వామి, శ్రీ పద్మావతితో కూడి తిరుమలకు వెళుతూ కొంతకాలం ఇక్కడ ఉన్నాడని పురాణ ప్రసిద్ధి.

**నారాయణవనం :** నారాయణవనం తిరుపతికి ఆగ్నేయ మూలలో 22 కి.మీ. దూరంలో నెలకొని ఉన్న చిన్న పట్టణం. ఇక్కడ శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి వారి ఆలయం ఉంది. శ్రీ వేంకటేశ్వర స్వామి శ్రీ పద్మావతి దేవిని వివాహమాడిన దివ్య క్షేత్రం ఇదేననీ, అందుకు గుర్తుగా ఆకాశరాజు ఒక ఆలయాన్ని నిర్మించాడని పురాణాలు, ఇతిహాసాలు స్పష్టం చేస్తున్నాయి.

**నాగలాపురం :** శ్రీ వేదనారాయణస్వామివారి ప్రసిద్ధ క్షేత్రం ఇది. తిరుపతికి 65 కి.మీ. దురంలో ఆగ్నేయ దిక్కున నాగులా పురం ఉంది. విజయనగరం శైలీ విన్యాసానికి ఈ ఆలయం ప్రసిద్ధి తార్కాణం. ఇచ్చట గర్భాలయంలో శ్రీ మహావిష్ణువు మత్స్యావతారంలో వెలసి ఇరుప్రక్కల శ్రీదేవి భూదేవులతో విరాజిల్లుతున్నాడు.

'సూర్యపూజ' ఈ ఆలయంలో ప్రత్యేకతను సంతరించుకుంది. ప్రతి సంవత్సరం మార్చి నెలలో మూడు రోజులపాటు ప్రధాన గోపురం ద్వారా ప్రవేశించిన సూర్య కిరణాలు గర్భాలయంలోని మూలమూర్తిని స్పృశించడం విశేషం. విజయనగర చక్రవర్తి శ్రీ కృష్ణదేవరాయలు తన తల్లి నాగులాంబకు స్మృతి చిహ్నంగా ఈ గ్రామాన్ని నిర్మించాడని చెప్పబడుతున్నది.

**అప్పలాయగుంట :** తిరుపతికి 15 కిలోమీటర్ల దూరంలో శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామివారు వెలసి ఉన్న అప్పలాయగుంట గ్రామం నెలకొని ఉంది. శ్రీ పద్మావతి దేవి, శ్రీ ఆండాళ్ అమ్మ వారల విగ్రహాలు కూడా ఈ ప్రాచీన ఆలయంలో దర్శించవచ్చు. కార్వేటినగర రాజులచే నిర్మింపబడిన ఈ ఆలయానికి ఎదురుగా శ్రీ ఆంజనేయస్వామివారి సన్నిధి కూడా ఉంది. ఈ ఆంజనేయుడు భక్తులను రోగాల నుండి రక్షిస్తాడని ప్రసిద్ధి.

**కార్వేటినగరం :** తిరుపతికి 58 కి.మీ. దూరంలో పుత్తూరుకి దగ్గరలో కార్వేటినగరం ఉంది. ఇచ్చట శ్రీ రుక్మిణీ సమేత శ్రీ వేణుగోపాల స్వామి వారి ఆలయం ఉంది. ప్రాచీన కాలంలో నారాయణవనం రాజులు ఈ ఆలయాన్ని నిర్వహించేవారు. ఈ ఆలయం శ్రీ సీతా రామ లక్ష్మణ ఆంజనేయస్వామి వారల ఏకశిలా విగ్రహానికి కూడా ప్రసిద్ధి.

**వాయల్పాడు :** తిరుపతికి 100 కి.మీ దూరంలో ఉన్న వాయల్పాడులో ప్రాచీనమైన శ్రీ రామాలయం నెలకొని ఉంది.

---

చేసి భుజించడం శ్రేయస్కరం. తూర్పుముఖంగా కూర్చుని భుజించడం వల్ల ఆయుష్షు వృద్ధి, దక్షిణముఖ భోజనం వల్ల సత్కీర్తి, పశ్చిమాభిముఖ భోజనం వల్ల లక్ష్మీకటాక్షం కలుగుతా యని శాస్త్రవచనం. ఉత్తర దిక్కుగా ఉండి ఎటువంటి ఆహారం తీసుకోరాదు. భోజనం పూర్తయిన తర్వాత చేతులు, కాళ్ళు, నోరు పరిశుభ్రమైన నీటితో పూర్తిగా శుభ్రపరచుకుని ఈ కింది శ్లోకం పఠించి తిన్న ఆహారం బాగా జీర్ణమై, పరిపూర్ణమైన ఆరోగ్య వంతులు అవుతారని పెద్దలు తెలుపుతున్నారు.

**అగస్త్యం కుంభకర్ణంచ । శమ్యంచ బడబానలం ।**
**ఆహార పరిణామార్థం । స్మరామిచ వృకోదరం ॥**

దానాలన్నిటిలో, అన్నదానానికి విశేష ఫలితం ఉంది. అన్నదానం చేస్తే సమస్తం ఇచ్చినట్లే. అన్నదాన రహితమైన యజ్ఞం నిరర్థకం. మన ఇళ్ళలో జరిగే విశేష కార్యక్రమాలకు బంధుమిత్రులను ఆహ్వానించి భోజనాలు పెట్టడం అనాదిగా వస్తున్న సంప్రదాయం. పరమాత్ముని దర్శించుకోవడానికి వచ్చే భక్తులకు అన్నప్రసాదం అందిస్తూ నేడు ఎన్నో దేవాలయాలు నిత్యాన్నదాన పథకాలకు విశేష ప్రాముఖ్యత కలిగించడం చాలా హర్షించదగ్గ విషయం. కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటే శ్వరుని సన్నిధిలో నిత్యం జరిగే నిత్యాన్నదానంలో వేలాది మంది భక్తులు ఆత్మయజ్ఞంతో సంతృప్తులు కావడం అత్యంత ఆనంద దాయకమైన శుభపరిణామమని చెప్పవచ్చు.

# చీకటి మల్లన్న

- నాగార్జునకొండ పిచ్చయ్య

మన దేవాలయాలు

ఈ ఆలయం గుంటూరు జిల్లా, పిడుగురాళ్ళ మండలంలో గల గుత్తికొండ గ్రామం నర్సరావు పేట-మాచర్ల రహదారి ప్రక్కనుంది. కారంపుడికి పది కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ ప్రాంతంలో ఉన్న కొండలను "నాగాద్రి" అనే పేరుతో పిలుస్తారు.

ఈ కొండల సమీపంలో బిలద్వారం చెంత శ్రీ బాల మల్లేశ్వరాలయం, శ్రీ రాజేశ్వరీదేవి ఆలయం, శ్రీ ఆంజనేయ స్వామి ఆలయం ఉన్నాయి. ఈ ఆలయాల్లోని ఆయా దేవీ దేవతలను దర్శించుకొన్న భక్తులు ఇక్కడి బిల ద్వారం గుండా లోపలికి ప్రవేశించినపుడు లోపల విశాలమైన చీకటి ప్రాంగణంలో వెలసిన శ్రీమల్లికార్జున స్వామివారు చీకటి మల్లన్నగా భక్తులచే కొన్ని శతాబ్దాల నుండి పూజలందుకుంటున్నారు. బిలమార్గానికి కొంచెం ముందుకు వెళ్తే ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన కోనేరు ఉంది. ఇందలి నీరు మిక్కిలి స్వచ్ఛమైనది. నీటిలో రూపాయి నాణెం వేస్తే కనిపించేంత స్వచ్ఛంగా ఆ నీరు ఉంటుంది. భక్తులు ముందుగా కోనేటిలో స్నానం చేసి తర్వాత మల్లన్నకు పూజలు చేస్తారు.

ప్రధాన బిలమార్గం నుండి వివిధ దిశలకు అనేక బిలమార్గాలున్నాయి. రేణుకాబిలం, అహోబిలం, కృష్ణాబిలం, కత్తుల బిలం అని వివిధ పేర్లతో నూటొక్క బిలమార్గాలున్నట్లు ప్రతీతి. ఈ మార్గాల గుండా ప్రయాణిస్తే చేజర్ల, అమరావతి, కోటప్ప కొండ, ఎత్తిపోతల, శ్రీశైలం, తిరుమల, కాశివంటి పుణ్యక్షేత్రాలను చేరవచ్చని అనేకమంది అభిప్రాయం. కృష్ణాబిలం గుండా ప్రయాణిస్తే, ఋషులు తపస్సు చేసుకునే తపోభూమిని చూడవచ్చుట.

ఈ బిలాలు నాగాద్రిలో ఉండుటచే నాగాద్రి బిలాలని, గుత్తికొండ గ్రామం చెంత నుండుటచే 'గుత్తి కొండ బిలం' అని పిలువబడుతున్నాయి. పల్నాటి యుద్ధానంతరం బ్రహ్మనాయుడు ఈ బిలంలోకే వెళ్ళి తపస్సు చేసినట్లుగా తెలుస్తున్నది.

### స్థలపురాణం

పూర్వం కోసల దేశాన్ని ఇక్ష్వాకు చక్రవర్తి మాంధాత పరిపాలించుచుండెను. అతనికి ముచికుందుడనే ఒక కుమారుడు కలడు. ఇతడు మేటి పరాక్రమ శాలి దేవదానవులకు జరిగిన ఘోరయుద్ధంలో దానవుల ధాటికి దేవతలు తాళలేక పోయారు. దేవేంద్రుని వినతిపై ముచికుందుడు దేవతల పక్షాన



గుత్తికొండ బిలం ముఖద్వారం

రాక్షసులతో పోరాడగా కొంతకాలానికి దేవతలను విజయలక్ష్మి వరించింది. దేవేంద్రుడు ముచికుందుని దేవసభకు ఆహ్వానించి తన కృతజ్ఞతలు తెలియజేసి, ఏదైనా వరం కోరుకోమన్నాడు. అందుకు ముచికుందుడు ఇంద్రునితో "దేవరాజా! నేను ఇంటి నుండి వచ్చి చాలా కాలమైనది. నా వాళ్ళను చూడవలె ననే కోరిక బలంగా ఉంది. కనుక నన్ను వెంటనే మావారి చెంతకు చేర్చు" అని అన్నాడు. అందుకు ఇంద్రుడు "మహాత్మా! దేవకాల మానానికి మానవకాల మానానికి వ్యత్యాసం గలదు. ఇప్పటికి మానవలోకంలో యుగాలే మారిపోయాయి. ఇపుడు భూలోకంలో నీ ఆత్మీయు లెవరూ లేరు. అందరూ గతించి పోయారు. కాలచక్రాన్ని మరల్చుట ఎవరికినీ సాధ్యంగాదు గనుక నన్ను మన్నించి మరేదైనా వరం కోరుకో!" ఇస్తానన్నాడు. హతాశుడైన ముచికుందుడు ఇంద్రునితో, "దేవా! చాలాకాలంగా యుద్ధం చేసినందున బడలిక చెందియున్నాను. నా శరీరం దీర్ఘకాలపు విశ్రాంతిని కోరుచున్నది. కనుక నిద్రాభంగం కలుగ కుండ నాకు దీర్ఘకాలపు నిద్రను ప్రసాదించు" అని కోరెను. అందుకు సంతసించిన దేవేంద్రుడు 'నరోత్తమా! మీరు కోరినట్లే మీకు దీర్ఘకాలపు నిద్రను వరంగా ఇస్తున్నాను. మీకెవరైనా నిద్రాభంగం కలిగించిన వారు, మీ దృష్టి సోకినంతనే ఆ ఖలుడు కాలి బూడిదయైపో గలడు" అని వరమిచ్చి, నిర్జన ప్రాంతమైన ఈ నాగాద్రి బిలంలోకి ముచికుందుని చేర్చాడు.

కాలం గడచి పోవుచూ ద్వాపరయుగ చివరి పాదంలో మధురను పాలించుచున్న కంసుని శ్రీకృష్ణుడు సంహరించాడు. కంసునికి పిల్లనిచ్చిన మామ జరాసంధుడు అల్లుని వధించిన కోపంతో శ్రీకృష్ణునిపై దండయాత్రలు చేసి విఫల మనోరథు డయ్యాడు.

గర్గ మహర్షికి శివుని అనుగ్రహంచే కాలయవనుడనే కుమారుడు కలిగాడు. శివుని వరప్రభావంచే ఎట్టి ఆయుధాల చేతను వాడికి మరణం వాటిల్లదు. అందుచే గర్వితుడై సంచ రించసాగాడు. ఈ విషయం తెలిసిన జరాసంధుడు కాలయవ నుని రెచ్చగొట్టి, వాడు శ్రీకృష్ణునిపై దండయాత్రకు వెళ్ళునట్లు చేసి తృప్తిపడ్డాడు.

కాలయవనుడు పెద్ద సైన్యంతో వచ్చి మధురను ముట్ట డించాడు. శ్రీకృష్ణుడు ఒంటరిగనే వెళ్ళి కాలయవనుని గలిసి, "కాలయవనా! నీకు పగనాపైనే కదా! అంతమాత్రానికి ఇంత మంది అమాయకులు యుద్ధం జేసి అసువులు కోల్పోవడం ఎందుకు? మనమిరువురమూ ద్వంద్వయుద్ధం చేసినచో మన బలాబలాలు తేలి పోవును కదా! ద్వంద్వయుద్ధం నీకు సమ్మత మేనా? లేక ఓటమి భయం పీడిస్తున్నదా?" అన్నాడు. వరగర్వితు డైన కాలయవనుడు ద్వంద్వయుద్ధానికి అంగీకారాన్ని తెలుపగా మన పోరునకు తగిన రణస్థలాన్ని చూపిస్తాను రమ్మని శ్రీకృష్ణుడు ముందు బయలుదేరగా కాలయవనుడు అనుసరించాడు. కొంత దూరం పోగాపోగా, శ్రీకృష్ణుడు భయపడి పారిపోవు వాని వలె పరుగెత్తాడు. కాలయవనుడు పరుగెత్తుతూ శ్రీకృష్ణుని అందుకునే ప్రయత్నంతో ముందుకుసాగాడు. అలావారు పరుగెత్తీ, పరుగెత్తీ చివరకు నాగాద్రి చేరారు. శ్రీకృష్ణుడు కాలయవనుడు చూస్తుండగా బిలంలోనికి ప్రవేశించాడు. అక్కడ నిద్రిస్తున్న ముచికుందునిపై తన ఉత్తరీయాన్ని గప్పి వేరొక బిలమార్గాన తను దాగి చూస్తున్నాడు. ఇంతలో కాలయవ నుడు గుహలో ప్రవేశించి ముచికుందుడున్న చోటికి వచ్చాడు. ముచికుందునిపై గల శ్రీకృష్ణుని ఉత్తరీయాన్ని చూసి, శ్రీకృష్ణుడిగా భ్రమపడి కాలుతో తన్నాడు. నిద్రాభంగమైన ముచికుం దుడు కన్నులు తెరచి ఎదురుగానున్న కాలయవనుని చూశాడు. ఆయన దృష్టి కాలయవనుడుపై ప్రసరించగానే కాలి బూడి దయ్యాడు.

శ్రీకృష్ణుడు ముచికుందుని చెంతకు వచ్చి తన విశ్వ రూపాన్ని చూపి, ముక్తిని ప్రసాదించాడు. కాలి బూడిదయైన కాలయవనునకు ఉత్తమ గతులు ప్రాప్తించుటకై గుహలోనే జల వనరులు సృజింపబడి, వాని బూడిద అందులో నిమజ్జనం చేయబడింది.

ప్రతియేటా తొలిఏకాదశి, మహాశివరాత్రి పర్వదినా లలో చీకటి మల్లన్నకు ఉత్సవాలు జరుగుతాయి. ఆ ఉత్సవాలకు జిల్లా నలుమూలల నుండేగాక పొరుగుజిల్లాల నుండి కూడా వేలాదిగా భక్త జనం వచ్చి స్వామివారిని సేవించుకొంటారు. దసరాకు శ్రీ రాజేశ్వరిమాతకు ఉత్సవాలు జరుగుతాయి. కేవలం పర్వదినాల్లోనేగాక ప్రతినిత్యం సందర్శకులు, ఈ నాగాద్రి బిలాలను దర్శిస్తూ ఉంటారు.

బాలప్రబోధం




# పొరపాటు

– మెల్ల వంశి సాయి వెంకట్

నృగమహా రాజు మహాదానశీలే గాక నిత్యం జప, తప, హోమ, యజ్ఞ పుణ్యకర్మలను ఆచరించేవాడు, ప్రజాపాలనలో కూడా ఎంతో దక్షతతో వ్యవహరించి ప్రజల్ని కాపాడేవాడు.

కాని తనకు తెలియకుండానే ఒకరు దానమిచ్చిన ఆవును వేరొకరకు దానమిచ్చిన ఫలితంగా అతనికి మహాపాతకం కలిగింది. తెలిసో తెలియకో ఒక పొరపాటు జరిగినప్పుడు, పశ్చాత్తాపపడినా దాని ఫలితం అనుభవించక తప్పదు.

ఒకనాడు ఒక పండితుడు రాజు వద్దకు వచ్చి గోదానాన్ని అర్థించాడు, రాజు సంతోషంతో వేలాది ఆవులను దానం చేశాడు, ఆ మందలో ఇంపైన పుష్టికరమైన గోవొకటి ఉంది. అది ఆ మంద నుండి తప్పిపోయింది, ఈ విషయం ఆ పండితునకు కూడా తెలీదు. కానీ ఆరోగ్యంగా ఉన్న ఆ ఆవును గుర్తుపట్టగలడు.

వేరొకసారి, మరొక పండితుడు, నృగమహారాజు వద్ద నుండి గోదానాన్ని స్వీకరించాడు. తప్పిపోయిన ఆ గోవు దానమిచ్చిన ఈ మందలో కలిసిపోయింది. పుచ్చుకున్న ఆ బ్రాహ్మణుడు గోవులను తోలుకుపోతున్నాడు. పండితుడు, మరో పండితునికి ఇచ్చిన ఆవులలో తన ఆవును చూచి గుర్తించాడు. విప్రుని వద్దకు ఆ పండితుడు వెళ్ళి, “ఆర్యా ఈ ఆవు నాది నీకెలా వచ్చినది?” అని అడిగాడు. “తనకు ఆ గోవులను నృగమహారాజు దానమిచ్చాడని” చెప్పాడు, దానితో పండితుడు కోపోద్దీపుడై, ఆ బ్రాహ్మణుని తీసికొని రాజు వద్దకు వెళ్ళాడు. తనకు దానమిచ్చిన గోవును వేరొకరికి దానమివ్వడం అన్యాయమన్నాడు.

వివరాలు తెలుసుకుని రాజు చాలా విచారించాడు. పొరపాటు జరిగిన దానికి చింతించి, “అయ్యా! తెలియక అపచారం జరిగింది. మన్నించమని అర్థించి, వేరే గోవును ఇస్తాన”న్నాడు. పండితుడు తన పట్టు వీడలేదు. వేరే గోవును స్వీకరించడానికి అంగీకరించలేదు. మొదట తనకు, ఇచ్చిన గోవునే ఇమ్మన్నాడు. రాజు బ్రహ్మణునితో ఆ గోవును పండితునకు ఇచ్చినది. నేను వేరొకగోవును మీకు ఇస్తాను. ఈ గోవును పండితునకు ఇమ్మని అర్థించాడు. దానికి బ్రాహ్మణుడు, దానం పుచ్చుకున్నది మళ్ళా మీకిచ్చుట తగని పని, మీకు ఇవ్వకూడదు. మీరే పండితునకు సర్ది చెప్పమని వేడుకొన్నాడు. దానికి పండితుడు అంగీకరించలేదు. ఈ సమస్యకు పరిష్కారం ఎలా చెయ్యాలో రాజుకు బోధపడలేదు. కానీ కాలగమనంలో ఆ కథ అక్కడితో అయ్యింది. తరువాత ఆ రాజు కూడా స్వర్గస్థుడయ్యాడు.



# పెద్దల మాట

– డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

జ్ఞానం ప్రధానం న తు కర్మహీనం, కర్మప్రధానం న తు బుద్ధిహీనమ్ ।
తస్మా దుభాభ్యాం తు భవేత్ ప్రసిద్ధిః, న హ్యేకపక్షో విహగః ప్రయాతి ॥

(పులస్త్యస్మృతి)

భావం : **జ్ఞానం ప్రధానమైనదే కాని కర్మనిష్ఠ లేని జ్ఞానం నిష్ప్రయోజనం. కర్మ ప్రధానమే కాని జ్ఞానంలేని కర్మ కూడా నిరుపయోగమే! జీవితం ప్రశాంతంగా నడవడానికి జ్ఞానం, కర్మ - రెండూ అవసరమైనవే! జ్ఞాన కర్మల సమన్వయంవల్లనే జన్మ సార్థకమై, సంసారసాగరం నుండి తరిస్తుంది. ఒక్కరెక్కతో పక్షి ఎగురడం సాధ్యం కాదు కదా!**

వివరణ : జీవిత మనే పక్షికి జ్ఞానం, కర్మ – రెండు రెక్కలు. భక్తి శిరస్సు. ఈ మూడూ సమన్వయంతో పని చేస్తుంటేనే జీవితవిహంగం గమ్యం చేర్తుంది. కేవల జ్ఞానం కానీ, కేవల కర్మనిష్ఠకానీ సంసార తరణోపాయం కాజాలదు. జ్ఞానంతో కూడిన కర్మ, కర్మతో కూడిన జ్ఞానం అన్యోన్యాశ్రయంతో ఉండాలి. శుద్ధ జ్ఞానం– శూన్యంలో పెట్టిన అగ్ని అవుతుంది. శుద్ధకర్మ–అగ్నిలేని కట్టె లవుతుంది. కట్టెలు, అగ్ని రెండూ కలిస్తేనే మంట ఏర్పడుతుంది. వంట చేసుకోవచ్చు. భగవద్గీత కర్మయోగ ప్రారంభంలో వేదోక్తాలైన కర్మలను ప్రారంభించనిదే జ్ఞాననిష్ఠ కుదుర దనీ, ఒక వేళ ప్రారంభించినా వాటిల్ని పూర్తి చేయక విడిచి పెట్టాడు కనుక జ్ఞాన నిష్ఠ పొందలే దనీ, గుణాత్మకవిశ్వంలో ఉన్నంత కాలం ప్రతిజీవీ ఏదో ఒక కర్మ చేయాల్సిందే నని భగవానుడు పేర్కొన్నాడు. జనకుడు మొదలైన మహాత్ము లందరూ జ్ఞానకర్మయోగాలను సమన్వయించుకొని, రెంటినీ సమంగా భావించి, ఆచరించి, అనుభవించి, జీవన్ముక్తు లయ్యారు. జ్ఞానాన్నీ, కర్మనూ కలిపేది భక్తి. ఇది రెంటికీ ప్రాణంలాంటిది. ఒక్కరెక్కతో పక్షి ఎగురలేనట్లే కేవలం జ్ఞానంతో కానీ, కేవలం కర్మతో కానీ మానవుడు గమ్యాన్ని చేరలేడు. రెంటిల్నీ భక్తితో మేళవించి, మేలైన జీవనం సాగించడం ఉత్తమం!

అంతటి దానధర్మాలు ఆచరించి, నియమ నిష్ఠలతో ఎన్నో ధర్మకార్యాలను ఆచరించిన నృగమహారాజు స్వర్గానికి వెళ్ళక యమధర్మరాజు వద్దకు వెళ్ళాడు. "ఒకరికి దానం చేసిన దాన్ని తిరిగి తీసుకొనుట గానీ, లేక వేరొకరికి దానినే దానం కింద ఇచ్చుట నేరం అవుతుంది. నీవు చేసింది చాలా పెద్ద తప్పు. ఈ నేరం కింద నిన్ను శిక్షించక తప్పదు, తెలిసి చేసినా తెలియక చేసినా తప్పు తప్పే, నీవు పుణ్యం అనుభవించి శిక్షకు వస్తావా, లేక శిక్ష అనుభవించి పుణ్యానికి వెళతావా, ఏ విషయం చెప్పమని" యముడు అడిగాడు. దానికి రాజు "పాపం అనుభవించి పుణ్యానికి వెళ్ళుట చాలా మంచిది. ముందు కష్టపడి తర్వాత సుఖం అనుభవించుట శ్రేయస్కరమని" అన్నాడు. ముందు పాప ఫలం అనుభవిస్తాను అని అన్నాడు.

ఆ పాప ఫలితంగా నృగమహారాజు తొండగా మారి యమలోకం నుండి తలకిందులుగా భూమి మీదకు పడుతుండగా యమధర్మరాజు, రాజుతో అనతి కాలంలోనే శ్రీకృష్ణుడు నీవు ఉండే పరిసరాలకు వస్తాడు, ఆయన దర్శనంతో, కరస్పర్శతో పునీతుడవై, పుణ్యలోకాలకు చేరుతావు అని చెప్పాడు. నృగుడు తొండ రూపంతో భూమి మీదపడ్డాడు. తర్వాత కొద్ది కాలంలోనే శ్రీకృష్ణపరమాత్మ ఆ ప్రాంతానికి రావడం ఆయన కరస్పర్శతో తొండ కాస్త, నృగమహారాజుగా మారి, దివ్యవిమానంలో ఊర్ధ్వలోకాలకు వెళ్ళడం జరిగింది.

## శాసన వివరణ - 11

# తిరుమలలోని విజయనగర శాసనం

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలుకా, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరపు గోడపై ఉన్న శాసనం)

**వంశం** : విజయనగర **రాజు** : శ్రీకృష్ణదేవరాయలు

**కాలం** : శక సంవత్సరం **1368 - 1446** ఎ.డి.

**భాష** : తమిళం

**విషయం** : తిరుమల ధర్మాధికారికి మహారాజు ఎర్రకంపయదేవ కుమారుడు మహారాజు పెరియ మల్లయ్యదేవలకు జరిగిన ఒప్పందం ప్రకారం దేవాలయ భాండాగారంలో జమ చేసిన **1000** పణాలపై వచ్చు వడ్డీతో తిరువేంకట ఉడైయాన్‌కు నైవేద్యాల కొరకు ఉపయోగించ వలయును. ఆలయంలో సేవలు జరిగేటప్పుడు **4** నాళీలు ప్రసాదాన్ని పంచవలెను.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-I, సంఖ్య-**210.**

## శాసన వివరణ -12

# అచ్యుత రాయల తిరుమల శాసనం

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలూకా, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని పద్మపట్టిపై ఉన్న శాసనం)

**వంశం** : విజయనగర (తుళువ) **రాజు** : అచ్యుతరాయలు

**కాలం** : శక సంవత్సరం **1454,** నందన **1532** ఎ.డి.

**భాష** : తమిళం

**విషయం** : తిరుమల దేవాలయాధికారులు నెడుంగుణ్ణం గ్రామానికి చెందిన పిల్లైపాఱుత్తర్ పేరుతో వేయించిన ఈ శాసనంలో పిల్లైపాఱుత్తర తన జన్మదిన నక్షత్ర సమయంలో మలైకినియనన్ర పెరుమాళ్‌కు సమర్పించు నైవేద్యాల కొరకు **5000** నర్‌పణాలను దేవాలయ భండాగారంలో జమ చేసినాడు. ప్రసాదమును దానం చేసినవారికి మిగిలిన భాగమును భక్తులకు పంచవలసినదిగా కోరటమైనది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-**IV,** సంఖ్య-**15**

## పురాతన ఆధునిక దేవాలయాల

# చీమకుర్తి

- ఎం.వి.శంకరరావు

ప్రకాశం జిల్లాలోని ఒంగోలుకు పశ్చిమదిశలో ఉన్న చీమకుర్తి గ్రామం పురాతన మరియు ఆధునిక దేవాలయాలతో కూడి ఉంది. అందులో భాగంగా చీమకుర్తిలోని వైశ్యకుటుంబీకులు ప్రముఖ వ్యాపారస్తులుగా పేరొందిన "శిద్ధా కుటుంబీకులు" వారి తల్లిదండ్రులు పేర "శిద్ధా వేంకటేశ్వర్లు", "వెంకట సుబ్బమ్మ ట్రస్ట్" ఏర్పరచి చీమకుర్తికి తూర్పుదిశలో సుమారు ఒక ఎకరం స్థలంలో శ్రీశ్రీశ్రీ స్వరూపానందేంద్ర సరస్వతి అను మహాస్వాముల పర్యవేక్షణలో మంగళవాయిద్యాలు, వేద మంత్రాలతో "హరిహర క్షేత్ర" స్థాపన 13-04-2006న జరిగింది. శ్రీ హరిహర క్షేత్రంలో శ్రీ గణపతి, శ్రీ నాగరాజు, శ్రీ మాలికాపు రత్నమాంబ, శ్రీ అయ్యప్ప ద్వార, జయవిజయ, గరుడ, శ్రీ వాసవీ కన్యక పరమేశ్వరి, శ్రీ నగరేశ్వర, పార్వతి, గణపతి, సుబ్రహ్మణ్య, నంది, చండీశ్వర, కాలభైరవ, శ్రీ ప్రసన్నాంజనేయ స్వామివార్ల విగ్రహ శిఖర ధ్వజ ప్రతిష్ట మహోత్సవాలు బ్రహ్మశ్రీ కేశవ అవధాని సంస్కృత గ్రామం మత్తూర, కర్నాటకవారి ఆధ్వర్యంలో 80 మంది ప్రముఖ వేదపండితుల మంత్రోచ్చారణతో మంగళవాయిద్యాల మధ్య నిర్వహించబడింది. దేవాలయాల నిర్మాణం గమనించినట్లైతే గాలిగోపురాల మీద మహామండపాల మీద మరియు గర్భగుడిపై నిర్మింపబడిన విమానగోపురం మీద అధునాతనమైన దేవతామూర్తుల శిల్పాలు ఆవిష్కరింపబడ్డాయి.



చీమకుర్తి గ్రామంలో ఇంకా పురాతనమైన దేవాలయాలు ఎన్నో ఉన్నాయి. ఇక్కడ ఎండోమెంట్‌వారి ఆధ్వర్యంలో స్వామివారి కార్యక్రమాలు జరుపుతున్నారు. శ్రీ వీరభద్రస్వామి, వీరబ్రహ్మేంద్రస్వాములవారు, మరియు హనుమాన్ దేవాలయాలు కలవు. అందులో భాగంగా చీమకుర్తి గ్రామంలో పురాతనమైన శ్రీశ్రీశ్రీ విరాట్ వీరబ్రహ్మేంద్రస్వామివారి మఠం ఉంది. ఈ మఠాన్ని ధర్మకర్తల ఆధ్వర్యంలో కార్యక్రమాలు జరుపుతున్నారు. ఈ పరిధి కందిమల్లయ్య పల్లిలోని శ్రీ విరాట్ వీరబ్రహ్మేంద్ర స్వామివారి సంతతివారు మాత్రమే సంబంధించిన వారని వ్యవహరిస్తున్నారు. ఈ మఠంలోని విగ్రహాలు స్వాములవారు తయారు చేసుకుని ప్రతిష్ఠించినట్లు చెప్పుకుంటారు. వైశాఖ శుద్ధ దశమి రోజున బ్రహ్మంగారి ఆరాధన ఘనంగా జరుగుతుంది. ఆ సమయంలో భక్తులకు భోజన ఏర్పాట్లు చేస్తారు. ముఖ్యంగా శ్రీ విరాట్ వీరబ్రహ్మేంద్ర స్వామివారు రాసిన కాలజ్ఞానంలోని చీమకుర్తి 12 ఆమడల పట్టణంగా చెప్పబడింది.

చీమకుర్తి సమీపంలో రామతీర్థం పేరుతో పుణ్యక్షేత్రం ఉంది. ఇక్కడ సంవత్సరంలో రెండుసార్లు తిరునాళ్ళు జరుగుతాయి. అందులో ముఖ్యమైన రోజు అనగా చైత్రమాసం పౌర్ణమి రోజున గంగమ్మ తిరునాళ్ళు నిర్వహిస్తారు. ఈ తిరునాళ్ళుకు చుట్టుప్రక్కల గ్రామాల నుండి ప్రభలు, కుంకుమ బండ్లు పెద్ద ఎత్తున ఉత్సవాలు జరుగుతాయి. ఇక్కడ అతి పురాతనమైన రామలింగేశ్వర ఆలయం ఉంది. మహాశివరాత్రి రోజున ఆలయాల్లోని 101 లింగాలకు భక్తులు అభిషేకాలు చేస్తారు. అప్పుడు యాత్రికులకు భోజన వసతి కూడ ఏర్పాట్లు చేస్తారు. ఈ విధంగా చీమకుర్తి పురాతన, అధునాతన దేవాలయాలకు, పుణ్యక్షేత్రాలకు ప్రసిద్ధి గాంచింది.

# వార్తాలహరి

## విశాఖపట్నంలో వైభవంగా శ్రీనివాస కల్యాణం

తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో 3-4-2010న శ్రీనివాస కల్యాణ మహోత్సవం అంగరంగ వైభవంగా జరిగింది. శ్రీనివాసుని వివాహమహోత్సవాన్ని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥కె.రోశయ్య దంపతులు నిర్వహించారు. కల్యాణానికి తిరుమల నుండి తీసుకువచ్చిన ఉత్సవమూర్తులను వేదికపై అలంకరించి తి.తి.దేవస్థానం వేదమంత్రాల మధ్య అత్యంత వైభవంగా జరిపింది. ఈ ఉత్సవానికి కేంద్ర సహాయ మంత్రి శ్రీమతి దగ్గుపాటి పురందరేశ్వరి, రాష్ట్రమంత్రి శ్రీ బొత్స సత్యనారాయణ, తి.తి.దే పాలకమండలి అధ్యక్షులు శ్రీ డి.కె. ఆదికేశవులు తదితరులు పాల్గొన్నారు.

## ప్రారంభమైన శ్రీవారి రథయాత్ర

తి.తి.దే.హిందూ ధర్మప్రచార పరిషత్తు ఆధ్వర్యంలో రాష్ట్రంలో తూర్పు గోదావరి జిల్లాలో లోక కల్యాణ రథయాత్రను ఏప్రిల్ 16వ తేది 2010న ప్రారంభించారు. ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన కల్యాణ మండపంలో ఉంచిన కల్యాణరథంలో శ్రీదేవి, భూదేవి సమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఉత్సవవిగ్రహాలకు సుప్రభాత, తోమాలసేవలతో చాలా వైభవంగా స్నపన తిరుమంజనం నిర్వహించారు.

## కన్నులపండువగా శ్రీనివాస కల్యాణం

తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో గిరిజన ప్రాంతాల్లో నిర్వహిస్తున్న గోవింద కల్యాణోత్సవం 15-04-2010న తూర్పు గోదావరిజిల్లా వై.రామవరంలో కన్నుల పండువగా నిర్వహించారు. గిరిజన అర్చకులకు కల్యాణంలో భాగస్వాములను చేయడం గోవిందకల్యాణం లక్ష్యమని తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు,ఐ.ఏ.ఎస్., తెలియజేశారు. ఈ ఉత్సవానికి తి.తి.దే. పాలకమండలి సభ్యుడు శ్రీ సూర్యప్రకాశరావు, అన్నమయ్య ప్రాజెక్టు డైరెక్టరు డా॥ మేడసాని మోహన్, పౌరసంబంధాధికారి శ్రీ టి.రవి తదితరులు పాల్గొన్నారు.

## శ్రీవారి శిలాశాసనాల సీ.డీ.ల ఆవిష్కరణ

ఇటీవల వచ్చిన తమిళ నూతన సంవత్సరాదిని పురస్కరించుకుని శ్రీ కృష్ణదేవరాయల తిరుమల శాసనం సీ.డీ.లను డిజిటలైజ్ చేసి విడుదల చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం శ్రీవారి ఆలయ శిలాశాసనాల సీ.డీలను తి.తి.దే. అధ్యక్షుడు శ్రీ డి.కె.ఆదికేశవులు, కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., తిరుమలలో 2010, ఏప్రిల్ 14న సంయుక్తంగా ఆవిష్కరించారు. తిరుమల ఆలయ ప్రాకారాలపై ఉన్న శిలాశాసనాలను తెలుగు, హిందీ, ఆంగ్లం, తమిళం, కన్నడ భాషల్లోకి అనువదించారు. ఈ శాసనాలలో దాతల విరాళాలకు సంబంధించిన వివరాలు ఉన్నాయి.

## ఘనంగా జరిగిన అన్నదానం రజతోత్సవం

1985లో ప్రారంభించబడిన తి.తి.దే.అన్నదాన పథకం పాతికేళ్ళు నిండిన సందర్భంగా రజతోత్సవం ఘనంగా జరుపుకుంది. 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అన్న స్ఫూర్తితో ప్రపంచంలో ఇంతటి స్థాయిలో అన్నదాన కార్యక్రమం ఎక్కడా జరగలేదనడంలో అతిశయోక్తి లేదు. ప్రతిరోజూ సుమారు 50 వేల మందికి నిత్యాన్నదానం నిర్వహిస్తున్నారు. ఈ సందర్భంగా విరాళాలు అందించిన దాతలను తిరుమల తిరుపతి దేవస్థానం పాలకమండలి సత్కరించి అభినందనలు తెలియజేసింది. ఈ రజతోత్సవాన్ని పురస్కరించుకొని సాంస్కృతిక కార్యక్రమాలు జరిపారు. ఈ సందర్భంగా శ్రీకృష్ణదేవరాయల 500 సంవత్సరాల పట్టాభిషేకోత్సవాల సావనీర్‌ను తి.తి.దే.అధ్యక్షులు శ్రీ డి.కె.ఆదికేశవులు, తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు,ఐ.ఏ.ఎస్., ఆవిష్కరించారు.

## తిరుమల ఆలయ పెద్దజీయరు, చిన్నజీయర్లకు పట్టాభిషేకం

భగవద్రామానుజ పరంపర సంప్రదాయాల్లో ప్రాధాన్యం ఉన్న జీయరు వ్యవస్థకు 44వ జీయరుగా శ్రీ శఠకోప రామానుజ పెద్దజీయర్ 1-4-2010న పదవీ బాధ్యతలు స్వీకరించారు. శ్రీవారి ఆలయ పూజా కైంకర్యాలు సంప్రదాయ బద్ధంగా నిర్వహిస్తామని పెద్దజీయరుగారు ఈ సందర్భంగా తెలిపారు. 21-04-2010న తిరుమల చిన్నజీయరుగా శ్రీ గోవింద రామానుజస్వామి పట్టాభిషేకం జరిగింది. తి.తి. దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., వీరికి స్వాగతం పలికారు.

ఈ కూపను కత్తిరించండి

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా : ______________________
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
   ______________________
   ______________________
   ______________________
   (పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐
2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు
3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-
4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :
5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలుస్తున్నది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి ప్రసాదాలకు సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**
- మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- **మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083".**

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

చాటెద నిదియే సత్యము సుండో
చేటు లేదీతని సేవించినను

హరినొల్లనివా రసురలు సుండో
సుర లీతని దాసులు సుండో
పరమాత్ముఁ డితఁడె ప్రాణము సుండో
మరుగక మఱచిన మతి లేదిఁకను

వేదరక్షకుడు విష్ణుఁడు సుండో
సోదించె శుకుఁ డచ్చుగ సుండో
ఆదిబ్రహ్మగన్నాతఁడు సుండో
యేదెస వెదకిన నితఁడే ఘనుఁడు

యిహపర మొసఁగను యీతఁడె సుండో
వహి నుతించెఁ బార్వతి సుండో
రహస్య మిదివో రహి శ్రీవేంకట-
మహీధరంబున మనికై నిలిచె

(2 - 164)





శ్రీ వేంకటేశ్వరుని సేవిస్తే ఎవరికీ చేటుకలుగదు. హరి లేడనే వారే రాక్షసులు, హరి ఉన్నాడని, అతనికి దాసులైన వారే దేవతలు సుమా! వేదాలనుద్ధరించినవాడు, సర్వవ్యాపకుడు శ్రీమహావిష్ణువే. ఎక్కడ చూచినా వ్యాపించి ఉండేవాడు ఈ ఘనుడే అని విష్ణుతత్త్వాన్ని అన్నమయ్య పై సంకీర్తనలో తెలియజేశాడు.

## మీ మాట

### ఆగష్టు నెల పండుగలు

- 15 - భారత స్వాతంత్ర్య దినోత్సవం
- 17 - మంగళ గౌరీవ్రతం
- 20 - వరలక్ష్మీ వ్రతం
- 24 - శ్రీ హయగ్రీవ జయంతి
- 25 - గాయత్రీజపం

### విశేష సమాచారం

సప్తగిరి సంచిక రాగానే తిరుపతి–తిరుమల స్వామివార్ల, అమ్మవార్ల ఆర్జిత సేవలు విశేషసేవలు, ఉత్సవాలకు సంబంధించిన అమూల్యమైన సమాచారాలు మాకు లభిస్తున్నాయి. అయిదు రూపాయలతో అనంతమైన ఆధ్యాత్మిక, భక్తి వ్యాసాలు, సూక్తులు మాకు అందించి ఆనందాన్ని కలిగిస్తున్నారు. స్వామివార్ల, అమ్మవార్ల రంగుల వర్ణ చిత్రాలు ఇంకో రెండు పేజీలు పెంచ ప్రార్థన. పత్రిక సకాలంలో అంది స్తున్నందుకు ధన్యవాదాలు.

**– కె.సోమేశ్వరశర్మ, కోటిపల్లి.**

### శ్రీవారి లీలలు

సప్తగిరి మాసపత్రికలో ప్రతి నెలా శ్రీ వేంకటేశ్వర లీలలు శీర్షిక చదువుతుంటే కలియుగ వైకుంఠ దైవ మైన ఆ వేంకటేశ్వరుడు భక్తులను ఎన్ని విధాలుగా ఆదుకుంటున్నాడో, ఆదరి స్తున్నాడో, అనుగ్రహిస్తున్నాడో తెలు స్తోంది. ఇలా ఆ స్వామివారి ఆశీస్సు లతో ఎంతో మంది భక్తులు, ఎన్నో విధాలుగా అనుగ్రహింపబడివుంటారు. కాబట్టి, ఇంతమంచి శీర్షికను ప్రతి సంచికలో ఒక లీలతో పాటు మరొక లీల ప్రచురిస్తే పాఠకులందరూ చదివి ఆ అనుభూతిని పంచుకుంటారు.

**– ఎన్.ఇందిర, కరీంనగర్.**

### కన్నుల పండుగ

గోవిందరాజస్వామి ఉభయదేవేరు లతో వెలసిన ముఖచిత్రం కన్నుల పండుగగా ఉంది. స్వామివారి బ్రహ్మో త్సవ వర్ణచిత్రాలు, చెలికాని మురళీ కృష్ణారావు చిత్రం బాగున్నాయి. అన్న మయ్య–వెంగమాంబలు ఆరాధించిన తిరుపతి గంగమ్మ చరిత వ్యాసం బాగున్నది.

ఇంద్రియ నిగ్రహాన్ని సత్వగుణం ద్వారా సాధించి రజస్తమో గుణాలను అణచి వేయడము కూర్మరూప చిహ్నం అనడం సత్యం. ఈ విషయాన్ని బులుసు–జీ–ప్రకాష్ తన వ్యాసం ద్వారా చాలా చక్కగా చెప్పారు.

**– వాస్తు రామచంద్ర, నెల్లూరు.**

### ఆశ్చర్యం కలిగింది!!

మే నెల సప్తగిరి మాసపత్రికలో ప్రచురించిన 'తిరుపతి గంగమ్మ' వ్యాసం చదివాక మా తిరుపతికి గంగమ్మ తల్లి ఎలా వచ్చింది? ఎలా వెలిసింది? ఈ తల్లిచరిత్ర ఏమిటి? అనే విషయాలతో పాటు ఈమెను అన్న మయ్య, వెంగమాంబలు కూడా ఆరా ధించారంటే ఆశ్చర్యం కలిగింది. గంగమ్మ తల్లి గురించి, గ్రామ దేవతల గురించి మరెన్నో విషయాలు ఈ వ్యాసం ద్వారా తెలుసుకున్నాను. ఇంత మంచివ్యాసాన్ని ప్రచురించినందుకు సప్తగిరి యాజమాన్యానికి నమస్సులు.

**– మబ్బు స్వర్ణలత, తిరుపతి.**

### కృతజ్ఞతలు

సప్తగిరి సచిత్ర మాసపత్రికలో ప్రతి పేజి కింది వరుసలో మంచి సూక్తులు, తిరుమలలో దొరికే వసతులు, ఉచిత సేవలు, అంబులెన్సు సౌకర్యం తదితర విషయాలు సప్తగిరి ద్వారా తెలుపడం వల్ల భక్తులకు చాలా ఉపయుక్తంగా ఉంది కృతజ్ఞతలు.

**– వక్కలగడ్డ సూర్యప్రకాశరావు, నరసారావుపేట.**

### వెల తక్కువ - విలువ ఎక్కువ

ఈ రోజుల్లో ఆధ్యాత్మిక పత్రికలు ప్రచురించటమే చాలా అరుదు. కానీ, సప్తగిరి మాసపత్రిక ఆర్థిక సాధకబాధ కాలు భరిస్తూ రంగు రంగుల ముఖచిత్రా లతో, ఆణిముత్యాల్లాంటి అక్షరాలతో ఆధ్యాత్మిక వ్యాసాలను అందిస్తూ మాకు మనోరంజకాన్ని, ఆనందాన్ని కలిగిస్తోంది. వర్ణచిత్రాలను చూస్తుంటే స్వామిని దర్శించుకున్న అనుభూతి కలుగుతోంది.

ఈ రోజుల్లో కూడా ఐదు రూపా యలకే సప్తగిరి పత్రిక వస్తోందంటే మా అదృష్టం, ఆ దేవదేవుని కృప.

**–అనంత ప్రభాకరదత్తు, విశాఖపట్నం.**

### మంచి శీర్షికలు

సప్తగిరి మాసపత్రికలో మీరు ప్రచు రించిన పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు మహా పరాధం, జి.బిందుప్రసాద్ రాసిన 'చైత న్యం' వ్యాసం, శ్రీపదకేళి శీర్షిక, మొవ్వ వృషాద్రిపతి అందించే సందేహాలకు – సమాధానాలు మొదలగు శీర్షికలు పత్రి కకే తలమానికం. ఈ శీర్షికల ద్వారా ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు తెలుసుకునే అవకాశం కలుగుతోంది. ధన్యవాదాలు!!

**– చింతకాయల రఘు, పాపానాయుడుగుంట, పల్లమాల.**

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 41 జూలై, 2010 సంచిక: 02



భగవంతుడే సర్వోన్నతుడు!
మిగిలినవన్నీ ఆతని అధీనములు !!




గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.

సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ

ఉప-సంపాదకురాలు :
డా॥ అల్లాడి సంధ్య

ముద్రాపకుడు :
వి. సాంబశివరావు, డి.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి
కార్యాలయం, తి.తి.దే., తిరుపతి


ముఖ చిత్రం :
విశ్వకల్యాణ చక్రవర్తి

చివరి పుట :
శ్రీవారి ఆణివార ఆస్థానం, తిరుమల




*వివరాలకు :*

ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

విదేశాలకు
సం॥ చందా -- రూ. 850-00

## సంపాదకీయం

# విశ్వకల్యాణ చక్రవర్తి

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుడు నిత్య కళ్యాణ చక్రవర్తి. తిరుమల లోగిలి నిత్యకళ్యాణా లతో, పచ్చతోరణాలతో కళకళలాడుతూ ఉంటుంది. శ్రీనివాసుని పేరు ప్రఖ్యాతులు ప్రపంచమంతా పరివ్యాప్తి చెందాయి. దేశాతీతంగా, మతాతీతంగా, కాలాతీతంగా భక్తులు శ్రీవారి దర్శనంకోసం వస్తూనే ఉంటారు. వసుధైక కుటుంబం అనడానికి వివిధ దేశాల నుండి వచ్చే యాత్రికులే మనకు ప్రత్యక్ష నిదర్శనం.

**'సర్వం విష్ణుమయం జగత్'** – అంటూ ఉపనిషత్తులు శ్రీవారి విశ్వవ్యాపకత్వాన్ని చాటి చెబుతున్నాయి. స్వామివారు దూరాభారం నుండి తనను సందర్శించడానికి రాలేని భక్తులకు కారుణ్యంతో తన కమనీయ రూపంతో కనువిందు చేయడానికి స్వయంగా తానే తరలి వెళ్ళడం దేవస్థానం నిర్వహించే కళ్యాణోత్సవాల్లోని ప్రత్యేకత. దీనిలో లోకకళ్యాణంతో పాటు హైందవ సంస్కృతీసంప్రదాయాల్ని విశ్వవ్యాప్తం చేయడం కూడా అంతర్భాగం.

వాల్మీకి తన రామాయణ కావ్యంలో చివర **'బలం విష్ణోః ప్రవర్ధతామ్'** అంటాడు. అంటే విశ్వంలో ఉన్నటు వంటి విష్ణువు శక్తి ప్రవర్ధిల్లుగాక అని అర్థం. దేవస్థానం స్వామివారి కల్యాణోత్సవాల్ని వివిధ దేశాల్లో నిర్వ హించడం ఆ మంగళ దృశ్యాన్ని ప్రపంచ ప్రజలందరూ ప్రసార మాధ్యమాల ద్వారా తిలకించడం ప్రతి ఒక్కరి నట్టింటా జరిగే శుభకార్యంలా, కళ్యాణంలా రూపుదిద్దుకుంటోంది.

స్వామివారి ఆంతరంగిక భక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వరుని కళ్యాణం ఊరూరా రంగరంగ వైభవంగా జరిపించిన మహనీయుడు. ఆ సంప్రదాయాన్నే ప్రస్తుత పాలకమండలి కూడా కొన సాగించడం హర్షణీయం. ఆ అనంతుడు ఆనందనిలయానికే పరిమితమైపోకుండా, ఖండాంతరాలన్నింటినీ ఆనందమయం చేయడానికి తానే ఒక్క అడుగు ముందుకు వేశాడు. **"భక్తులెందు జనిన పరతెంతు వెనువెంట, గోవు వెంట తగులు కోడె భంగి"** అని పోతన శ్రీవారి తత్త్వాన్ని తన్మయత్వంతో వర్ణించినట్లు తరలివెళుతున్నాడు.

యాంత్రికతతో కాలానికి సమాంతరంగా పరుగులు తీసే పాశ్చాత్యదేశాలను స్వామివారు తన కల్యాణో త్సవాలతో ముహూర్త కాలం నిలకడగా ఉంచి ఆత్మానుభూతిని, మానసిక ఉల్లాసాన్ని వారికి కల్పించడం ఇందు లోని శుభపరిణామం. భక్తి భావమనేది ఈనాటి మానసిక రుగ్మతలకన్నింటికీ ఒక పరమౌషధంగా పరిఢవిల్లు తోంది. ఈ కళ్యాణోత్సవాలు విశ్వమానవ హృదయవేదికల మీద వారి దివ్యత్వాన్ని ప్రతిష్ఠిస్తాయనడంలో సందేహం లేదు. కళ్యాణ చక్రవర్తి దివ్యమంగళ రూపం భక్తులకు నయనోత్సవాన్ని కలిగిస్తూంది. శ్రీవారి ఈ విశ్వకళ్యాణాలు భక్తికి ముక్తికి సులభసాధ్యమైన ఆధ్యాత్మిక సోపానాలు అవుతున్నాయి.

**మానవుని కళ్యాణం ఆ వ్యక్తికి, ఆ కుటుంబానికీ శుభాన్ని కల్గిస్తుంది.**
**ఆ మాధవుని కళ్యాణం లోకాలకన్నింటికీ కళ్యాణకారకమౌతూంది.**

**విశ్వమంతా తానె,**
**తానె ఈ విశ్వమ్ము,**
**తానె వేంకటపతి,**
**కలిగించు సద్గతి.**

# ఆంజనేయుడు రామునికి దాసుడా?

– డా॥ మైలవరపు శ్రీనివాసరావు

ఎక్కడైనా ఓ యజమాని తనకు చెప్పిన పనుల్ని యజమాని ఇష్టానికనుగుణంగా చేసేవాణ్ణి కదా 'దాసు' డంటారు. మరి ఈ దృష్టితో ఒక్కసారి ఆలోచించి చూస్తే రాముడు ఆంజనేయుణ్ణి పిలిచి ఇచ్చిన ఆజ్ఞలు రెండే రెండు.

**'రావణస్య నివాసం స్థానం - '**

**'సీతా జీవతి వా న వా?-'**

రావణుడు ఉండే చోటెక్కడ? ఇదొకటి. సీతమ్మ జీవించే ఉందా? అనేది రెండవది.

ఆంజనేయస్వామి లంకకు ఎగరడానికి ఎంతో ముందుగానే 'సంపాతి' అనే పక్షి చెప్పనే చెప్పాడు – 'ఇహస్థో అహం ప్రపశ్యామి జానకీ రావణేన తు...' జానకిని రావణుడనే దుర్మార్గుడు లంకాధినేత తీసుకువెళ్లాడు – సీతమ్మ సుఖంగానే అక్కడ ఉంది' అని.

ఏ ప్రశ్నలకి సమాధానం కావాలని రాముడు ఎదురు చూస్తున్నాడో ఆ రెంటికీ సమాధానం ఆంజనేయునికి, లంకకు ఎగరకముందే తెలిసిపోయింది. ఆ సందర్భంలో ఆంజనేయుడు రామునితో అనేయవచ్చు. 'ఇవిగో నీ ప్రశ్నలకి సమాధానా'లని. కాని, ఆంజనేయుడు అలా అనలేదు.

పోనీ! యజమాని అయిన రాముని మీది గౌరవంతోనూ– సంపాతి మాటలు ఎంతవరకు నమ్మదగినవో అనే అనుమానంతోనూ ఆంజనేయుడు ఈ రెండు ప్రశ్నలకీ సమాధానాన్ని రాముడికి చెప్పి ఉండలేదని కాసేపు అనుకుందాం! మంచిదే!

మరి ఇంతటి రామభక్తే రామునియందు ఆంజనేయుడికి ఉన్నట్లైతే రాముడు చెప్పని లంకాదహనం, రాక్షసవధ, విశేషించి రావణుడితో సంభాషణ, అలాగే రామునికి నచ్చని స్త్రీవధ (లంకిణిని చావుతో సమానమైన దెబ్బని కొట్టడం) పర స్త్రీలని నఖశిఖపర్యంతం చూడడం (కారాగారంలో ఉన్న స్త్రీలలోనూ, రావణ శయన మందిరంలోని స్త్రీలలోనూ సీత ఉందేమోనని చూడడం) వంటి అకృత్యాలను చేసిన ఆంజనేయుడు రామ'దాసు'డెలా ఔతాడని మనకి అన్పించకమానదు.

లోకంలో రెండు రకాల వ్యక్తులుంటారు. ఆస్తిక జనంలో ఇలాంటి చిక్కు సందర్భం వచ్చినప్పుడు 'తప్పే' అని మనసుకు అన్పిస్తున్నా అది దేవుడికి సంబంధించింది గాబట్టి అలా ఆలోచించ కూడనే కూడదంటూ వాదిస్తూ నోరు నొక్కేవాళ్ళు ఒక జాతి. 'ఎందుకిలా అయ్యుండి ఉంటుంది? అనే బుద్ధితో ఆలోచించి యథార్థాన్ని తెలుసుకుని లోకమంతటికీ సమాధానాన్ని చెప్పేవాళ్ళు రెండోజాతి. ఈ ఇద్దరిలో రెండవ జాతి వారి వల్లే పురాణేతిహాసాలు లోకంలో ఎక్కువకాలం నిలుస్తాయని గమనించాలి.

దాసుడు అంటే 'యజమాని చెప్పిన పనుల్ని చెప్పినట్లు చేసేవా'డని కదా మనమనుకున్నది! అది నిజమే కావచ్చు. అయితే రాముడు ఆంజనేయుణ్ణి ఎంత జీతభత్యాలనిచ్చి



దాసునిగా చేసుకున్నాడట? ఏమీ లేదు. కేవలం లక్ష్మణ స్వామి లాగా ఆంజనేయుడు కూడా – 'గుణై ర్దాస్య ముపాగతః'– రామునికున్న లోకోత్తర గుణాలను చూచి ముగ్ధుడై తనకు తానుగా రామునికి దాసుడయ్యాడు తప్ప, రామునికీ ఆంజనే యునికీ ఏ విధమైన నెలజీతపు ఒప్పందంగానీ మరో ఒప్పందం కానీ లేనేలేదు. కాబట్టి ధర్మశాస్త్ర పరంగా ఆలోచిస్తే, న్యాయ శాస్త్రరీత్యా పరిశీలిస్తే కూడా రాముణ్ణి యజమానిగా భావిస్తూ ఆంజనేయుడు, 'తనకి తాను దాసునిగా రామునికి పని చేయా ల్సిన అవసరం ఏ కొంచెమూ లేదు.' ఇది మొదటి మాట. అయితే హనుమ రామదాసుడు కాడా? ఔను. ఇదెలాగ?

ఆంజనేయుడే తనకి తానుగా 'దాసోఽహం కోస లేంద్రస్య...' నేను కోసల ప్రభువు రామునికి సంబంధించిన దాసుణ్ణి అన్నాడు కాబట్టి రామదాసునిగా బాధ్యతను స్వీక రించాడన్నమాటే. ఈ కారణంగా ఆయన రామదాసుడు తప్ప యజమాని నియమించగా అయిన దాసుడు కాదన్న మాట. ఇది రెండవ మాట. పోనీ! ఏదో ఓ తీరుగా రామదాసుడై నప్పుడు రాముడు చెప్పని – రామునికి నచ్చని పనుల్ని చేయ వచ్చా? అనేది చక్కని ప్రశ్నే మరి! ఇప్పుడు తగిన సమాధా నాలని అనుకుందాం.

లోకంలో ఓ యజమాని దాసుణ్ణి తన పనికి కుదుర్చు కుంటున్నప్పుడు ఎలా చేయవలసిన పనుల్ని చెప్తాడో, అలా తనకి తానుగానే దాసునిగా కుదిరిన ఆంజనేయుడు కూడ తానేం చేయబోతున్నాడో ముందుగా చెప్పనే చెప్పాడు.

> **రాజగోపురం – ప్రథమ గోపురం**
>
> **ఇది అలిపిరి నుండి కొండను ఎక్కేందుకు వెళ్ళు సోపాన మార్గంలో పాదాల మండపం వెనక ఉంది. దీన్ని క్రీ.శ.1378 నుండి 1411 వరకు పరిపాలించిన సాళువ నరసింహరాయలు నిర్మించాడు. ఆ తర్వాత పిడుగుపడి ఇది ధ్వంసమైనది.**
>
> **దీన్ని 1982లో తిరుమల తిరుపతి దేవస్థానం వారు జీర్ణోద్ధారణ గావించారు.**

**యథా రాఘవనిర్ముక్తః శర శ్శ్వసన విక్రమః ।**

**గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణ పాలితామ్ ॥....**

**సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహ సీతయా !.....**

ఒక యోగ్యుడైన మేటి విలుకాడున్నాడనుకుందాం! అతడు ఓ బాణాన్ని విడిస్తే, ఆ బాణం వెళ్ళి కొందరిని వధించి తిరిగి మళ్ళీ ప్రయోగించినవాని అమ్ములపొదిలోకే భద్రంగా వచ్చి చేరితే, ఆ శక్తి మొత్తం బాణం విడిచినవానిదే తప్ప ధనుస్సుదీ కాదు. బాణానిదీ కాదు.

అదే తీరుగా రాముడనే వానికి బాణంగా ఉన్న నేను వేగంగా లంకకు వెళ్ళినా, వెళ్ళినప్పటి ఆ పరిస్థితిని బట్టి ఏమేం చేసినా, సుశీఘ్రంగా విజయంతో తిరిగొచ్చినా ఆ శక్తి మొత్తం నన్ను విడిచిన రామునిదే తప్ప, నాది కా'దన్నాడు పై శ్లోకంలో ఆంజనేయుడు.

'ఇలాగ అన్నాను కాబట్టి, ఒక వేళ విజయం నాకు కరతలామలకం కాక పరాజయమే సంభవిస్తే ఆ బాధ్యతా, అపకీర్తి రామునిదే సుమా!' అని చేతులు కడుక్కుని తప్పుని రాముని మీదికి నెట్టివేయదలచనూ లేదు ఆంజనేయుడు.

లోకంలో దాసునికి పనితో సంబంధం చెప్పింది చేసే వరకే. తప్పొప్పులూ లాభాలాభాలూ కీర్త్యపకీర్తులూ యజ మానివే. అయితే అలాంటి దాస్యం కాదు ఆంజనేయునిది. అంతా రామమయమైన పరమ రామభావ భావన పూర్వకమైన దాస్యం. అంటే, తానేం చేసినా అదంతా రాముణ్ణి తలుచుకునే– పనిని చేయబోతున్నాడు కాబట్టే, శ్రీమద్రామాయణ కథకి నాయకుడైన శ్రీ రామచంద్రమూర్తి సుందరకాండలో కనపడనే కనపడడు. అంటే రాముడే ఆంజనేయ భావనలన్నింటిలోనూ ఉండి పరోక్ష నాయక రూపాన్ని ధరించాడన్న మాట. ఇలా ఉండడం కూడ 'సుందరకాండ' అని పేరు పెట్టడంలో ఉన్న సౌందర్యాల్లో ఒక్కటి.

ఇలాంటి ప్రతిజ్ఞ చేసిన ఆంజనేయుడు ఏం చేసినా అది రామభావ భావనతోనే చేసిన కారణంగా రాముడు చెప్పిన పనినే చేసినట్టూ, రామదాసుడైనట్టూ మనం గ్రహించాల్సిందే.

ఇంతకీ రామభావ భావనను చేసిన రెండు మూడు ఘట్టాలని అను కుందాం.

ఆంజనేయుడు సముద్రం మీద ఎగురుతున్నప్పుడు బంగారు రెక్కలున్న మైనాకుడనే పర్వతం సముద్రమధ్యంలో నిల బడి క్షణకాలం తన మీద విశ్రాంతి తీసు కుని వెళ్ళాల్సిందిగా హనుమని ప్రార్థిం చాడు. అప్పుడు ఆంజనేయుడు ఆలోచిం చాడు. 'అతిథిగా రావలసిందని నిర్వ్యాజం గానూ నిస్స్వార్థంగానూ పిలిస్తే వెళ్ళకపోవ డం తప్పు. అలాగని మైనాకుని ప్రార్థన ప్రకారం మైనాకుని మీద విశ్రమించడ మున్నదే అదీ తప్పేమరి. ఇలాంటి ధర్మ సంకట స్థితిలో రాముడైతే ఏం చేస్తాడని ఆలోచించాడు మారుతి. టక్కున సమా ధానం దొరికింది.

అలనాడు అయోధ్యలో రామ పట్టాభిషేకం ఆగిపోయింది. రాముడు అరణ్యాలకు వెళ్ళాలనే విషయం నిశ్చయ మైంది. 'అమ్మకి చెప్పి వచ్చేంత సమయాన్ని ఈయవలసింది'గా కైకమ్మను ప్రార్థించాడు రాముడు. ఆమె ఇచ్చింది.



రాముడు తానన్నట్టుగా అమ్మకి చెప్పి తిరిగొచ్చాడు. దశరథునికి స్పృహ వచ్చింది. దుఃఖం కట్టలు తెంచుకుంది. కైకమీద రోషం ద్వేషం హద్దులు దాటాయి. 'అయోధ్యాయా స్త్వమేవాద్య భవ రాజా నిగృహ్య మామ్' "రాముడా! ఈ వరాలూ ఇయ్యడాలూ... అంతటినీ మర్చిపో! అయోధ్యకు నిన్నే రాజుగా 'నేను' ప్రకటిస్తున్నాను. ఇక్కడే ఉండిపో!" అన్నాడు దశరథుడు. తండ్రి చేసిన మొదటి ఆజ్ఞ ప్రకారం అరణ్యాలకి వెళ్ళకపోవడం తప్పు. ఇప్పటి ఆజ్ఞప్రకారం అరణ్యాలకి వెళ్ళడం తప్పు. ఈ ధర్మసంకటస్థితిలో రాముడున్నాడు. 'ప్రతిజ్ఞా చ మయా దత్తా....' కేవలం అమ్మకు చెప్పి రావడం వరకూ సమయాన్నడిగాను తప్ప మరేమీ కాదు. ఇదొకటి. ఇక రెండ వది– 'అరణ్యాలకు వెళ్ళి తీరుతా'నని ఇంతకు ముందు ప్రతిజ్ఞ చేసేశాను. ఇప్పుడు ఆగే ఆలోచన ఉండనే ఉండదన్నాడు.

ఈ గుర్తొచ్చిన అంశాన్ని దృష్టిలో పెట్టుకునే హనుమ కూడా మైనాకుని ప్రార్థనకి సమాధానమిచ్చాడు. "మైనాకా! అతిథిగా పిలిస్తే రానని అనడం తప్పే. అయితే ముఖ్యమైన కార్యం మీద వెళ్తూ, ఈ సముద్రం ఇటుపక్క ఒడ్డున ఉన్న వానరాలన్నింటికీ ఓ ప్రతిజ్ఞ చేసి చెప్పాను. మధ్యలో ఆగనే ఆగనని. ఆగితే ప్రతిజ్ఞా భంగమౌతుంది కాబట్టి ఆగన"న్నాడు హనుమ. ఈ సమాధానం కేవల రామభావ భావనతో అన్నదే.

ఇదే తీరుగా లంకను కాపలాకాస్తున్న లంకిణి తనని గట్టిగా ఒక గుద్దును గుద్దినప్పుడు తిరిగి దాని కంటే మించిన గుద్దులతో ఆంజనేయుడు సమాధానాన్ని ఈయగలిగిన వాడే

అయినా ఒక్క క్షణం రామభావ భావనతో ఆలోచించాడు. టక్కున గుర్తొచ్చింది ఆంజనేయునికి.

రాముని మీదికి తాటకి దూసుకొస్తూ దుమ్మునీ రక్త మాంసాలనీ విశ్వామిత్రుని యాగ గుండంకి వేస్తూంటే విశ్వామిత్రుడు 'తాటకిని చంపి వేయవలసిం'దన్నాడు రామునితో (ఆతతాయిన మాయాంతం హన్యాదేవా విచారయన్). రాముడు ధర్మసంకటస్థితిలో పడ్డాడు. 'చంపకుంటే గురువాక్య ధిక్కారం - చంపుదామా అంటే స్త్రీ వధ'. ఏం చేయాలనేది, అక్కడి సంశయం. 'కావాలని ఆయుధాలతో మీదికి నిష్కారణంగా దండెత్తుతోంది కాబట్టీ - అధర్మంతో నిండినప్పుడు స్త్రీనైనా చంపవలసిందే అని ధర్మ శాస్త్రమూ రాజనీతి శాస్త్రమూ చెప్తున్నాయి కాబట్టి చంపుతున్నా' నని రాముడు బాణాన్ని వేసి చంపాడు. ఆంజనేయుడు ఈ సంఘటననే స్మరించి నిష్కారణంగా నన్ను గుద్దింది కాబట్టి చంపకుండా చావుతో సమానమన్పించేంత చఱపుని ఇయ్యాలని భావించి అదే పనిని చేశాడు. ఈ తీరు ప్రవర్తనం కేవల రామభావభావనతో చేసిందే.

ఇక ఆంజనేయుణ్ణి గట్టిగా తప్పు పట్టదగిన అంశం లంకాదహన ఘట్టం కదా! అసలు, లంకలోకి ప్రవేశించే వేళకి లంక తగలబెడదామనే ఆలోచన ఆంజనేయుడికి లేనేలేదు. అయితే హనుమ చెట్టుమీద కూచున్న సందర్భంలో 'త్రిజట' అనే రాక్షసి తనకొచ్చిన కలను గురించి వివరంగా రాక్షస స్త్రీలం దరికీ చెప్పింది. వాళ్ళంతగా కలని నమ్మలేదు. అప్పుడు త్రిజట అంది ఒక వానరం లంకకొచ్చి లంకని తగులబెడుతున్నట్లుగా, లంక తగులబడుతున్నట్టుగా కూడా కల వచ్చింది. ఎక్కడైనా వానరం చెట్ల ఆకుల్నీ కాయల్నీ పళ్ళనీ తింటుంది లేదా పాడు చేస్తుంది గానీ తగులబెడుతుందా? ఇలా ఊహించని-ఊహ కందని విషయం కూడా కల్లో వచ్చింది కాబట్టైనా నమ్మండి" అని.

అప్పటిదాకా తన బుద్ధిలో లేని బుద్ధికి తట్టని 'లంకా దహన'మనే కార్యక్రమాన్ని రాముడే ఈ స్వప్న వృత్తాంతం ద్వారా



తనకి అందించాడని గ్రహించాడు మారుతి. సరిగ్గా దానికి అనుగుణంగానే రావణుడు కూడ తోకకే నిప్పంటించాడు. కథ 'రామ భావభావన'తోనే సాగుతోందని హనుమ ఆనంద పడినా 'ఈ పద్ధతి సీతమ్మకి ఇష్టమే ఔతుందా?' అని భయపడ్డాడు మారుతి.

'శీతో భవ హనూమతః...' అంటూ అగ్నిహోత్రుణ్ణి చల్లారి ఉండవలసిందిగా ఆజ్ఞాపించే సరికి హనుమకి తోక చల్లగా ఉంది. దాంతో అర్థమైంది హనుమకి - తాను చేసిన లంకాదహన కృత్యమే రామభావనకి అనుగుణమైనది.

ఇదే తీరుగా హనుమ రావణునికిచ్చిన ఉపదేశం... ఇలా సుందరకాండలో అంటే రామ పరోక్షంలో హనుమంతుడు ఏం చేసినా అదంతా రామభావభావనతోనే అని స్పష్టంగా తెలుస్తుంది.

ఈ ఆలోచనంతా నిజం కాబట్టే తాను చెప్పని ఇన్నింటినీ చేసి వచ్చిన హనుమని రాముడు కౌగిలించుకుని ప్రశంసించాడే తప్ప 'చెప్పనిదే ఎందుకిలా చేశా?'వని నిగ్గదీయలేదు.

సీతారాములు తన హృదయంలో ఉన్నట్టుగా ఆంజనేయుడు చూపించడమంటే తన ఆలోచనలన్నింటా సీతారాములే ఉన్నారని చెప్పడమన్న మాట. ఇందుకని ఆంజనేయుడు ముమ్మాటికీ **'రామదాసుడే'.**

# రామదాసు కీర్తనలు
## భక్తి, నీతి, వైరాగ్య ప్రవృత్తి

- పి.యస్.ఆర్.యస్. కల్యాణి

దక్షిణాపథంలో ప్రసిద్ధికెక్కిన గొప్ప వాగ్గేయకారుడు భక్తరామదాసు. ఇతడు భజన సంప్రదాయానికి చక్కని రాజమార్గం ఏర్పరచిన సంకీర్తనాకారుడు. ఈయన తన కీర్తనలతో ఇటు పండిత పామర లోకాన్ని అటు భగవంతుడైన శ్రీరామచంద్రుని సమానంగా పరవశింపచేసిన పరమభక్తాగ్రేసరుడు. ఇతని భక్తి, నీతి, వైరాగ్య ప్రవృత్తి అటు జీవితంలోను, రచనల్లోను సమానంగా ప్రతిబింబించటం గొప్ప విశేషం.

రామదాసు కీర్తనల్లో భక్తిని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

అ) అతని జీవితం ద్వారా వ్యక్తమయ్యే భక్తి

ఆ) అతని రచనల ద్వారా వ్యక్తమయ్యే భక్తి

**అ)** ఇతని జీవితం ద్వారా వ్యక్తమయ్యే భక్తిని మళ్ళీ రెండు విధాలుగా పరిశీలించవచ్చు.

**1) పరివ్యాప్త భక్తి :**

భక్తికి పరిపూర్ణ నిర్వచనంగా భక్తరామదాసు జీవితాన్ని చెప్పవచ్చు. బాల్యం నుండి అతనికి రామభక్తి అలవడింది. రఘునాథ భట్టాచార్యుడు వైష్ణవం ప్రసాదించటంతో అది అధికమైంది. నిరాశ్రయునిగా ఉన్న శ్రీరాముణ్ణి దర్శించటంతో ఆ భక్తి ప్రవాహం కట్టలు తెంచుకుంది. భద్రాచల రామునికి ఆలయం కట్టించటం, ఉత్సవాలు నిర్వహించటం మొదలైన కార్యక్రమాలు చేపట్టడంతో అతని భక్తి పరాకాష్ఠను అందుకుంది. గోల్కొండ నవాబు తానీషాకు బాకీ చెల్లించలేక కారాగారంలో ఉన్నప్పుడు తదేక ధ్యానంతో శ్రీరామచంద్రుని స్మరించటంతో అతని భక్తి పరిపక్వం చెందింది. ఇదంతా శ్రీరామచంద్రుని సాక్షాత్కారానికి దోహదం చేసింది. భక్త రామదాసు అనే పేరు తెచ్చిపెట్టింది.

**2) కైంకర్య భక్తి :**

భగవంతుని సేవించడమే కైంకర్య భక్తిలో ప్రధానం. భగవంతుని కోసం ఆలయాలు, మండపాలు, విగ్రహాలు, ఆభరణాలు, వాహనాలు ఏర్పాటు చేయడం, ఉత్సవాలు జరిపించడం కైంకర్యభక్తి. రామదాసు శ్రీరాముని ఆలయం కట్టించాడు. విగ్రహాలను, ఆభరణాలను తయారు చేయించాడు. ఈ అంశాలను వెల్లడి చేసే కీర్తన రామదాసు కీర్తనల్లో మనకు కనిపిస్తుంది.

**ఇక్ష్వాకు కులతిలక ఇకనైన పలుకవె రామచంద్రా**
**నను రక్షింపకున్నను రక్షకులెవరింక రామచంద్ర**

**ఆ)** రచనల ద్వారా వ్యక్తమయ్యే భక్తి :

ఇతని రచనల్లో భక్తి మూడు విధాలుగా కనిపిస్తుంది.

**1) రామ భక్తి :**

భక్త రామదాసుకు సర్వకాల సర్వావస్థల్లోను శ్రీరాముడే ఆరాధ్యదైవం. శ్రీరాముడు లేనిదే రామదాసు లేడు. శ్రీరామచంద్రుని ఔన్నత్యం ఇతర దేవతల్లో పోల్చి చూపడంలో ఇతనికి ఇతనే సాటి 'ఆనందమానందమాయే'-అన్న కీర్తనలో 'ఇతర చింతనలు చేయము ఇతర దైవమును గొనియాడము భద్రాచల రామసేవ మానము" అని రామదాసు శ్రీరామచంద్రుని స్తుతించాడు.



# రక్షించు శ్రీనివాస!

సీ. ఆముక్తమాలను అమల కంఠముఁ దాల్చి
ముక్తిమార్గముఁ జూపు మోక్షదాత!
శంఖచక్రములను శౌరిగా ధరియించి
అఘముల కడదేర్చు అనఘ చరిత!
నిఖిల జగమ్ముల నిజదేహమున నిల్పి
తిరముగ పాలించు దివ్యనామ!
భక్తితో గొల్చెడి భక్త సంఘమునకు
అభయ హస్తమునిచ్చు ఆర్త వరద!

తె.గీ. లోకమందున్న ఆర్తుల లోన నీవె
నిలిచియున్నావు సర్వేశ! నిజము దెలియ!
బీదసాదల సేవయే నీదు కరుణ
సిరుల కురిపించి రక్షించు శ్రీనివాస!

– డా॥ అద్దంకి శ్రీనివాస్

**2) భక్తివైవిధ్యం లేదా నవవిధ భక్తులు :**

భక్త రామదాసు మహాభక్తుడు. అందుకే ఆయనకు సమస్తం శ్రీరామమయంగానే కనిపిస్తుంది. రామదాసు అనేక సంకీర్తనల్లో నవవిధ భక్తి మార్గాలను తెలియచేశాడు.

**స్మరణం :**

**"శ్రీరామ నీనామ మేమి రుచిరా......"**

**కీర్తనం :**

**"అంతా రామమయం ఈ జగమంతా రామమయం.."**

**వందనం :**

**"వందనం రఘునాయకా ఆనందము శ్రీరఘునాయికా**

**పాదసేవనం :**

**రామ నీదయ రాదుగ పతిత పావన నామమే నీ బిరుదుగా**
**...... శ్రీపాద సేవ మాకు పదివేలుగా**

**3) వాత్సల్య భక్తి :**

రామదాసు తానే యశోద అయి బాలకృష్ణుని ఊరడించిన ప్రయత్నంలో వాత్సల్యభక్తి వ్యక్తమౌతుంది.

**బూచి వాని పిలువ బోదునా ఓ గోపాలకృష్ణా**
**బూచి వాని పిలువబోతే వద్దు వద్దు వద్ద నీవు**
**ఆచిచ్చి జోలపాడి అయి ఊచిన నిదురపోవు**

**నీతి :**

భక్తరామదాసు ఆదర్శవంతమైన జీవితంద్వారా, మంచి నడవడిక ద్వారా ఇతరులకు నీతని బోధించాడు. ఇతని కీర్తనల్లో నీతులు బాగా కనిపిస్తాయి.

**1. నరహరిని నమ్మక నరులను నమ్మిన నరజన్మ మీడేరునా ?**
**చెరకుండగ వెట్టి చెరకును నమిలిన జిహ్వాకు రుచి పుట్టునా మనసా**

**2. పరుల హింస చేయకున్న పరమ ధర్మమంతే చాలు**
**పరులను రక్షింతునని పల్కనేటికే మనసా**

రామదాసు సంకీర్తనల్లోని ఈ భావం సమస్త కాలాల్లోని సర్వజీవులు ఒప్పుకుని తీరాల్సిందే!

**వైరాగ్యం :**

భక్తరామదాసు తన జీవితంలో ఇహలోక సుఖాలకు ప్రాధాన్యం ఇవ్వలేదు. శ్రీరామునికి, రామభక్తికి ఎంతో ప్రాధాన్యత నిచ్చి వైరాగ్యం పాటించాడు.

**భళి వైరాగ్యమెంతో బాగై యున్నది**
**చంచలమైన నామనసు నిశ్చలమై ఉన్నది**
**.............................................**
**ముక్తినే నొల్లనీదు భక్తి మాత్రము చాలు**

– అని ముక్తిని కూడా తిరస్కరించిన రామదాసు వైరాగ్యం బహుశ్లాఘనీయం.

సామాన్యజనం చేత భజన కూటాల్లో సదాగానం చేసేవి రామదాసు కీర్తనలే. ఇతని కీర్తనలకున్న ప్రజాదరణ మరి ఏ ఇతర కీర్తనలకు లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. భక్తికి, నీతికి, వైరాగ్యానికి జీవితంలోను, రచనల్లోను స్థానం కల్పించి భక్తరామదాసు చరితార్థుడయ్యాడు.




**(అశ్వత్థామ ఉపపాండవులను సంహరించి పాండవ వంశక్షయానికి కారకుడయ్యాడు. బిడ్డలను పోగొట్టుకుని రోదించే పాంచాలి మాతృహృదయాన్ని ఈ సంచికలో చూడవచ్చు)**

### సౌప్తికపర్వం ప్రారంభం

సంజయుడు మళ్ళీ తిరిగి వచ్చి మహారాజా! అప్పటికి ప్రొద్దు గుంకింది. అభిషిక్తుడైన అశ్వత్థామ శాత్రవ సంహారం ఎలా సాగించాలా?అని ఆలోచిస్తూ, సేనా శిబిరాలకు దూరంగా ఒక చెట్టు క్రింద చేరాడు.

కృపాచార్యుడూ, కృతవర్మా నిద్రపోయారు. అశ్వత్థామకు కంటిమీద రెప్ప వాలడం లేదు. ఆ సమయంలో అక్కడి మర్రిచెట్టు మీద గుడ్లగూబ విశృంఖలంగా పక్షిసంహారం చేయడం కనిపించింది.

ఏ ఉపాయంతోనైనా శత్రువుని సంహరించడం రాజనీతి విరుద్ధం కాదు కనుక ఇప్పుడు నాకీ ఉలూక మార్గం శ్రేష్ఠం అనుకుని ప్రక్కనే పరున్న మహారథికు లిద్దరినీ మేలు కొలిపి తన ఊహ తెలిపాడు.

కృపాచార్యుడు: నాయనా! ఏ పని కయినా పురుషకారం దైవం. ఆ పని కవసరమయిన సాధన సంపత్తీ అవసరం. కర్షకుడు నడ్డి వంచి, భూమిని దున్ని, పదును చేసి, విత్తనాలు జల్లకపోతే వానలు కురిసీ లాభం లేదు. అతని శ్రమ అతను పడ్డా వాన చినుకు పడకపోతే!

అందుచేత మన కృషికి దైవం తోడు కావాలని విస్మరించకు. ధర్మం విడవకుండా చేసే పనికి దైవం ఎప్పుడూ తోడు పడతాడు. ఆవేశంలో భయ కంపిత లోభ వశీభూత హృదయుడై సాహసించేవాడు కార్యసాధకుడు కాదు. వానిని లోకం హర్షించదు. ఆప్తులూ శ్రేయోభిలాషులూ ఎంత చెప్పినా వినలేదు సుయోధనుడు, తత్ఫలం అనుభవిస్తున్నాడు; ఇక నీ ఇష్టం, అన్నాడు.

అశ్వత్థామకు ఆ పలుకులు తల కెక్కలేదు. కృతవర్మను చూస్తూ: ఆర్యా! మంచి చెడ్డలు ఎవడికి వాడు నిశ్చయించుకుని వాడి దారి వాడు తొక్కుతాడు. ప్రజాపతి సృష్టి ప్రారంభించిన నాడు విప్రులకు శాంతినీ, క్షత్రియులకు తేజస్సునూ, వైశ్యులకు దక్షతనూ అనుగ్రహించాడు. నేను విప్ర వంశంలో పుట్టినా రాజధర్మం చేపట్టాను. నా తండ్రిని చంపిన యోధుడింకా జీవించి ఉండగా ఇంతటి నేను చేతులు ముడుచుకు కూర్చో లేను. పాండవ బలం ఈ సమయంలో సుఖనిద్రలో ఉంటుంది.

ఆ దుష్ట ధృష్టద్యుమ్నుని నా వాడి కత్తితో తెగనరికి, మిగిలిన వారిని ఈ నిశిత కరవాలానికి బలి ఇస్తాను. అప్పుడు గాని నా గుండె మంట ఆరదు - అన్నాడు.

నాయనా! నువ్వు బాగా అలసి ఉన్నావు. ఇప్పటికి నిద్రపో, తెలతెల వారుతూండగా మనం ముగ్గురం వెళ్ళి కావలసిన కార్యం నెరవేరుద్దాం, అని కృపాచార్యుడు శాంతి వాక్యాలు పలుకగా, మామా! కాముకుడికి, లుబ్ధ హృదయుడికి, క్రోధవశుడికి, కంటి మీద కునుకు వస్తుందా! అదీకాక వాసుదేవుడు తోడుండగా, పార్థుడు గాండీవ ధ్వనియై నిలబడితే వారిని ఓడించడం మన తరం కాదు. ఇక నన్ను కాదనవద్దు- అని కరవాలం తీశాడు, అశ్వత్థామ.

నాయనా! ఆయుధహీనుని, వాహన శూన్యునీ, శరణాగతునీ, రణరంగ దూరునీ చంపడం నీతికాదని ఎరుగవా! పైగా

# మోసగాళ్ళు ఉన్నారు జాగ్రత్త !

**రాష్ట్రంలోను, రాష్ట్రేతరమైన కొన్ని ప్రాంతాల్లోను కొందరు వ్యక్తులు తాము తి.తి.దేవస్థానం ఏజెంట్లమని, తిరుమల నుంచి శ్రీవారి ప్రసాదాలను, క్యాలండర్లను, ఆర్జితసేవ టిక్కెట్లను తెప్పించి ఇస్తామని నమ్మించి అధిక మొత్తంలో ప్రజల నుంచి సొమ్ము వసూలు చేసి మోసం చేస్తున్నట్లు మా దృష్టికి వచ్చింది.**

**ఇది పచ్చి మోసం తప్ప మరేం కాదు.**

**భక్తులందరూ ఈ విషయాలను గమనించి మోసపోరాదని తెలియజేస్తున్నాం.**

- శ్రీవారి ప్రసాదాలు తిరుమలలో తప్ప మరెక్కడా అమ్మబడవు.
- శ్రీవారి ప్రసాదాలను పోస్టులోగానీ మరోవిధంగా గాని పంపడం జరగదు.
- శ్రీవారి ప్రసాదాలను అమ్మటానికి ఏజంట్లు ఎవ్వరూ లేరు.
- ఎవరైనా మీ వద్ద నుంచి శ్రీవారి ప్రసాదాలను తెప్పిస్తామని డబ్బు వసూలు చేసి ఉంటే వారి నుంచి డబ్బు వాపసు తీసుకోండి. లేదా పోలీసులకు ఫిర్యాదు చేయండి.
- ఈ విషయం మీ స్నేహితులకు బంధువులకు తెలియజేయండి.
- దళారీలను నమ్మకండి.
- తిరుమల తిరుపతిలలో ఉన్నప్పుడు మీకు ఏదైనా ఇబ్బంది కలిగితే సమీపంలోని తి.తి.దే. అధికారిని కలవండి.
- దూరప్రాంతాలవారు ఆ ప్రాంత సమీపంలోని తి.తి.దేవస్థానం సమాచార కేంద్రాన్నో, కల్యాణమండపాల్లోని అధికారులనో కలిసి అన్ని వివరాలు తెలుసుకోవచ్చు.

**– ప్రధాన సంపాదకుడు**

వారంతా నిద్రలో ఉంటారు. నిద్ర చావుకి మారుపేరు. అటువంటి పీనుగులను చంపడం నీ వంటి అస్త్ర విదుడికి ధర్మం కాదు, అన్నాడు కృపాచార్యులు.

మామా! ధర్మం మాట ఎత్త వద్దు. భీష్మునీ, ద్రోణులనూ, కర్ణునీ వారు ధర్మంగానే సంహరించారా? భూరిశ్రవ సుని సాత్యకి ఏం చేశాడు? ఇప్పటికిప్పుడు భీముడు చేసిన ఊరుభంగం మాట ఏమిటి? ఇంక ఈ మీమాంస చాలించి వస్తే నాతో రండి, అని లేచాడు అశ్వత్థామ. ముగ్గురూ అగ్నిరూపులై కదిలారు. రథాలు పాండవ శిబిరాల వైపు సాగుతున్నాయి.

అలాసాగేవేళ అశ్వత్థామ ఎదుట ఒక మహా భూతాకృతి గోచరించగా ఈ యోధుడు నిశ్చలంగా తన శస్త్రాస్త్రాలన్నీ సంధించి విడిచాడు. ఆ భూతం అట్టహాసం చేస్తూ నిలబడ్డది. ఇదేదో ఉపద్రవం అని గ్రహించి అశ్వత్థామ రథం దిగి పినాకపాణిని ఆరాధించడానికి వేదిక నిర్మించి అందులో ఆత్మార్పణం చేసే సంకల్పంతో రుద్ర ప్రార్థన చేశాడు. పరమశివుడు ప్రసన్నుడై తీవ్ర ధారా రోచిరుదంచిత ఖడ్గం అనుగ్రహించాడు.

పరమానందంతో అశ్వత్థామ పాండవ శిబిరాల వైపు రథం నడిపి ధృష్టద్యుమ్నుని శిబిరంలో అడుగుపెడుతూ ఒక పాద తాడనం చేశాడు.

ఆ ధ్వనికి ధృష్టద్యుమ్నుడు కనులు తెరిచాడు. అదే సమయంలో వాని జుట్టుపట్టి ఈడ్చి నేల పడగొట్టి మోకాటితో కుమ్ముతూ ముక్కుమీద ముష్టి ఘాతాలు చేస్తూ ధనుస్సునున్న అల్లెత్రాడు విప్పి, వాని కంఠము చుట్టూ తిప్పి, పశువును చంపినట్లు చంపాడు. అలానే ఉత్తమౌజునీ, యుధామన్యునీ చిత్రవధ చేసి, శిబిర సమీపంలో ఉన్న గజబలాన్ని చిత్ర హింస పెట్టి, అప్పటికి మేలుకుని తన కెదురు వచ్చే శిఖండినీ, ఉపపాండవులనూ వారికి

మీ కోసం ....

## శ్రీనివాసంలో 'సప్తగిరి'

తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతిసముదాయంలో **సప్తగిరి** చందానమోదు కేంద్రం ఉన్నది.

శ్రీవారి దర్శనార్థం వచ్చు భక్తులు ఈ కేంద్రంలో అన్ని భాషల **సప్తగిరి**కి చందాలు చెల్లించవచ్చు / చందాను పునరుద్ధరించుకోవచ్చు. వేలాది మంది భక్తులకు, స్థానికులకు ఇది సౌకర్యంగా ఉంటుంది.

**ఈ సప్తగిరి చందా నమోదు కేంద్రం**
**ఉదయం 8.00 గం॥ నుండి 11.00 గం॥ వరకు**
**సాయంత్రం 4.00 గం॥ నుండి 7.00 గం॥ వరకు**
పనిచేస్తుంది.

– ప్రధాన సంపాదకుడు

తోడువచ్చే సైనికులనూ వారి వాహనాలనూ తునాతునకలుగా నేలరాల్చి, పిశాచ హాసంతో శిబిరాలు విడిచి కృప, కృతవర్మ లున్న చోటికి వచ్చి, ఇక పాండవులూ, కృష్ణుడూ, సాత్యకి మిగిలారు అన్నాడు.

అతని రాక్షసావేశం చూసిన ఆ మహాయోధులు విషణ్ణ హృదయులై తలలు వంచుకున్నారు. ఇప్పుడీ వార్త మన ప్రభువుకి నివేదించాలి, అని అశ్వత్థామ రథం కదలించాడు. వారు కూడా అనుసరించారు. ఆఖరి శ్వాస తీసుకుంటున్న దుర్యోధనుడు అశ్వత్థామ చేసిన సాహస కార్యాన్ని విని ఆనందంతో కన్ను మూశాడు, మనం వీర స్వర్గంలోనే కలుసు కుందాం అంటూ. ఆ యోధులు ముగ్గురూ సుయోధనుని శరీరాన్ని గాఢంగా కౌగలించుకుని విలపించారు. అంతలో తెల్లవారింది. మహారాజా! వ్యాసమహర్షి నాకు అనుగ్రహించిన శక్తి అంతతో చల్లారిపోయింది. తెల్లవారేసరికి ఈ వార్త పాండ వులకు తెలిసింది. అప్పటికప్పుడే నకులుడు ఉపప్లావ్యం వెళ్ళి ద్రౌపదినీ, ఇతర స్త్రీ జనాన్నీ రథం మీద తీసుకువచ్చాడు.

ద్రౌపది పుత్ర శోకంతో నిండిన గుండెతో మూర్ఛిల్లి కొంతసేపటికి తేరుకుని : నా కొడుకులను సంహరించిన అశ్వ త్థామ పేరు మాపే పని చేయకపోతే ఆమరణ నిరాహార దీక్షతో ఈ శరీరం విడుస్తాను అంది. దాంతో పాటు అతనికి జన్మ సిద్ధమయిన శిరోమణి ఉంది. అది తెచ్చి ఇస్తే చాలు అని భీమ సేనుని దగ్గరగా వెళ్ళి: నువ్వు తప్ప ఈ పని చెయ్యగలవారు లేరు, అని రెచ్చగొట్టి రథం ఎక్కించింది.

రథం అటు కదలగానే వాసుదేవుడు – ధర్మనందనా! అశ్వత్థామ దగ్గర అగస్త్యమహర్షి అనుగ్రహించిన బ్రహ్మ శిరో నామకాస్త్రం ఉంది. దానిని మానవులపై ప్రయోగించవద్దని ద్రోణాచార్యులు చెప్పి ఉంటారు. కానీ, ఆవేశ స్వభావుడైన అశ్వ త్థామకు నిగ్రహం లేదు. అందచేత మనం భీముని రక్షించు కోవాలి– అని సహదేవునీ, సాత్యకినీ శిబిర రక్షణలో ఉంచి తన రథం మీద ధర్మరాజునీ అర్జునునీ ఎక్కించుకుని త్వరితగతిని నడిపించాడు. అప్పటికే భీమసేనుడు భాగీరథీనదీ తీరాన ఉన్న వ్యాసమహర్షికి నమస్కరించి, అశ్వత్థామ కోసం అన్వేషిస్తున్నాడు.

దేహమంతా విభూతి పూసుకుని, తపో దీక్షలో ఉన్న అశ్వత్థామ కనిపించగానే బాణం సంధించి భీముడు, ఓరి కపట చిత్తుడా! చాలించు నీ తపస్సు. రా యుద్ధానికి! అంటున్న వేళకు కృష్ణుని రథం కూడ అక్కడకు చేరింది. చూశాడు అశ్వత్థామ రోష తామ్రాక్షుడై ఒక దర్భ తీసుకుని అభిమంత్రించి బ్రహ్మ శిరో నామకం విడుస్తూ అపాండవం చేసి రా – అన్నాడు. అది చూసి అర్జునుడు కూడా గజగజ లాడుతూంటే: అర్జునా! గురు పుత్రుడు బ్రహ్మశిరో నామకం ప్రయోగించాడు. నువ్వు కూడ దాన్నే ప్రయోగించి ఉపసంహరించు – అన్నాడు కృష్ణుడు.

తక్షణం సవ్యసాచి రథం దిగి గురువులను స్మరించి అస్త్రం ప్రయోగించాడు. ఆ దివ్యాస్త్రాలు ఒకదాని నొకటి ఢీకొని జ్వాలా రోచులతో విజృంభిస్తుంటే నారదుడు వ్యాసునితో వచ్చి ఆ దివ్యాస్త్రాలు ఉపసంహరించండని కోరగా అర్జునుడు ఉప సంహరించినా అశ్వత్థామ ప్రాణ భీతితో ఉపసంహరించక పోవడంతో, నాయనా! నీ శిరోమణి భీమునికిచ్చి ప్రాణ రక్షణ చేసుకో – అన్నాడు వ్యాసుడు. అప్పుడు అశ్వత్థామ అంగీకరిస్తూ పాండవ పౌత్రులను ఇది బలిగొని ఉపశమిస్తుంది – అని శిరోమణి ఇచ్చాడు. అపరిమితానందంతో భీమసేనుడు ఆ మణి తెచ్చి ద్రౌపదికిచ్చి భామా! ఇంతటితో అశ్వత్థామ కీర్తి బుగ్గి

పాలైంది. ఇక వాడు బ్రతికినా మృత కల్పుడే అనగా ద్రుపద రాజనందన సంతోషంతో ఆ శిరోమణి ధర్మరాజుకి అర్పించింది.

ఇక్కడ కృష్ణుడు వ్యాస మహర్షితో మాట్లాడుతూ గురు పుత్రుడు పాండవ వంశీయుల గర్భ విచ్ఛిత్తి పణంగా ఉపసం హరించారు బ్రహ్మశిరోనామకాన్ని. ఇప్పుడది ఉత్తరా గర్భచ్ఛే దానికి సాగుతూంటుంది. కనక దాన్ని నా సుదర్శనంతో రక్షిస్తాను. వెనుక ఒకప్పుడు ఈ గురుపుత్రుడు వచ్చి తనకు సుదర్శనం కావాలన్నాడు. అది పొసగ లేదు. అప్పటి నుంచి ఆ ఆశతోనే ఉన్నాడు. అని నాటి విశేషాలు చెప్పి సుదర్శనాన్ని విడిచి శిశువును రక్షించాడు. అని వైశంపాయనుడు సౌప్తిక పర్వం ముగించి స్త్రీ పర్వం ప్రారంభిస్తున్నాడు.

**--- సౌప్తిక పర్వం సమాప్తం ---**

## స్త్రీ పర్వం ప్రారంభం

### గాంధారి

భారత యుద్ధం ముగిసింది: అంతా అయిపోయింది.

పదునెనిమిది రోజుల వ్యవధిలో ఉభయ పక్షాల యోధులూ నేల కూలారు. అటు పాండవు లయిదుగురూ, సాత్యకి, కృష్ణుడు, యుయుత్సుడు. ఇటు కృపాచార్య, కృతవర్మ, అశ్వత్థామలు మిగిలారు, అని సంజయుడు చెప్పడంతో ధృత రాష్ట్రుడు మొదలు విరిగిన చెట్టులా నేలకూలాడు. పరి పరి విధాల శోకించే ప్రభువును సంజయుడూ, విదురుడూ ఓదా రుస్తూ, మందలిస్తూ వేదాంత మార్గం తెలిపి: ప్రభూ! ఇదంతా నీ లోభంవల్లనూ, నీ కొడుకు దుర్బుద్ధి వల్లనూ సంభవిం చింది. చేతులారా చేసుకుని చింతించడం దేనికి! అంతే కాదు. ఇప్పుడెవరి కోసం ఈ శోకం. పితృ, పితామహ, పుత్ర, పౌత్ర భాతృవర్గమంతా పోయింది. అలనాడు భీష్మపితామహులతో పాటు, ఆచార్య ద్రోణుడూ, విదురుడూ, నేనూ కూడా కృష్ణుని సందేశం వినుమని చెప్పినా నీ చెవి కెక్కలేదు, నీ కొడుకు సరే సరి. దాని ఫలం కదా ఇది. ఇంక శోకించకు, అన్నాడు సంజయుడు.

అనంతరం విదురుడు: మహారాజా! ఈ లోకమంతా నిస్సారం అని గ్రహించిన వివేకులు దేనికీ శోకించరు. ఒక ఇల్లు మారి మరో ఇంట దిగుతున్నాం. అలానే మాసిన వస్త్రం విప్పి మరోటి కట్టుకుంటున్నాం. అంతా దేనికి!

కుమ్మరి కుండలు చెయ్యడానికి సారెమీద మట్టి ముద్ద పెడతాడు. అందులో కొంత తడియారి విరుగుతుంది. మరొకటి కుండగా తయారు కాకుండానే పాడవుతుంది. తయారయినా ఆరబెడుతూంటే ఒకటి విరుగుతుంది. వాటిని కాచడానికి ఆవలో పెట్టినపుడు కొన్ని విరుగుతాయి. ఇంకా మిగిలినవి మనం వాడుతూండగా పగులుతాయి. మన జీవితాలూ ఇంతే.

పిండం ఏర్పడే సమయంలో గర్భస్రావంవల్ల కొన్ని, ప్రసవ వేళ కొన్ని, బాలారిష్టాలతో కొన్ని, యౌవనంలో కొన్ని, వార్ధక్యంలో కొన్ని .... ఇలా జీవాలన్నీ పోయేవే కాని మిగిలేవి లేవని ఎరుగరా ప్రభూ! ఇది తెలిసిన వారెవరూ శోకాన్ని దరిజేర నివ్వరు. ఈ సంసారం ఒక కారడవి. బంధు మిత్ర పుత్రాదులు క్రూర మృగాలు. భార్య దీర్ఘ రోగం. వార్ధక్యం మత్త గజం, అని తెలియని వాడవు కావు. ఈ శరీరం రథం, సత్త్వగుణం దీని సారథి, ఇంద్రియాలు గుర్రాలు, బుద్ధి వ్యాపారం పగ్గం. అయితే ఆ గుర్రాల చిత్తానుసారం రథం వదలినవాడు సంసార సాగరంలో కొట్టుమిట్టాడుతాడు. అలా కాక గుర్రాలను తన అదుపులో ఉంచుకోగలవాడు సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీ తుడుగా జీవిస్తాడు.

అని వివరించే వేళ విజయం చేసిన వ్యాస మునీం ద్రుడు కూడా ధృతరాష్ట్రునికి మరి కొంత మనశ్శాంతి కలిగించి, అనంతర కర్తవ్యం, ఉపదేశించి వెళ్ళాడు.

అప్పుడు తేరుకున్న ధృతరాష్ట్రుడు విదురునితో: గాంధా రినీ, కుంతినీ, మిగిలిన వధూ జనాన్నీ తీసుకుని ప్రయాణం సాగించాలి. కురుక్షేత్రానికి వెళ్ళి అగ్ని కార్యం పూర్తి చేయిం చాలి, అన్నాడు. ప్రళయకాల జ్వలన జ్వాలల చిక్కిన అరణ్య మృగాక్రోశనంలా అంతఃపుర స్త్రీల ఆక్రందన ధ్వనులు రేగగా, విదురు నంతటి మహా మనీషి గొంతు తడబడగా వారందరినీ ఓదార్చి, వారి వారికి తగిన వాహనాలు సమకూర్చి కురుక్షేత్రా నికి నడిపిస్తున్నాడు. దారిలో కృపాచార్యుడూ, కృతవర్మ, అశ్వ త్థామ ఎదురై ధృతరాష్ట్రుని చూచి గద్గద కంఠంతో దుర్యోధనుని వీర మరణవార్త వినిపించారు. అనంతరం కురువంశాచార్యుడు కృపాచార్యుడు గాంధారిని సమీపించి – ***(ఇంకా ఉంది)***

# సందేహాలు? సమాధానాలు!!

-'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**భగవద్గీతను ఇంటిలో చదువవచ్చా?**

**- సి.త్రిపురసుందరి, బెంగళూరు.**

☛ నిక్షేపంగా చదువవచ్చు. భగవద్గీత నిషిద్ధ గ్రంథం కాదు. సంజయుడు యుద్ధ రంగంలో శ్రీకృష్ణుడర్జునునకు బోధించిన భగవద్గీతను, ధృతరాష్ట్రునకు ఇంటిలోనే చెప్పాడు. నేటికీ గీతా శాస్త్ర పారాయణ చేసేవారంతా ఇంట్లోనే పారాయణ చేస్తున్నారు. భగవద్గీతను పఠింపరాని ప్రదేశం లేదు.

**నిశరాత్రి సమయంలో భగవంతుణ్ణి తలచుకోవచ్చా?**

**- అనంతప్రభాకరదత్తు, విశాఖపట్నం.**

☛ ఏ వేళలోనైనా భగవంతుని స్మరించవచ్చు. దేశ కాల నిషేధా లేవీ భగవద్భక్తికి ఉండవు. మనకర్ధరాత్రిగానీ పరమాత్మకు రేయింబవళ్ళనేవి ఉండవు. అది శుద్ధచైతన్య జ్యోతీరూపం. శివ రాత్రికి లింగోద్భవవేళ ఎప్పుడు? అర్ధరాత్రే కదా! దేవాలయా లలో భగవత్కల్యాణాదులు రాత్రివేళ కూడా చేస్తారు. తెల్లవారు జాము దాకా ఆ కార్యక్రమం కొనసాగుతుంది. అర్ధరాత్రివేళ హరికథలు జరుగుతుంటాయి. శివరాత్రి జాగరణాదులు, అర్ధ రాత్రి కూడా శివనామస్మరణ చేయమనే నిర్దేశిస్తున్నాయి కదా! తపస్వులు రేయింబవళ్లు భగవద్ధ్యానంలో ఉంటారు. కనుక భగవంతుని ఏ సమయంలోనైనా తలచుకోవచ్చు. ఏ స్థితిలో ఉన్నా తలచుకోవచ్చు. భక్తి ముఖ్యం. ఏ వేళనైనా, ఏ స్థితిలో ఉన్నా దైవస్మరణ చేయవచ్చు. అలా అని సరియగు శుచిత్వం లేకుండా మహా మంత్రం జపించకూడదు.

**శ్రీ మహావిష్ణువునకు బ్రహ్మదేవుడు, శివునకు కుమార గణపతులు, శ్రీరామచంద్రునకు లవకుశులవంటి పుత్రులు న్నారు గదా! మరి శ్రీ వేంకటేశ్వరునకు వారసులెవ్వరు?**

**- పి.జగదీష్, ముత్తుకూరు.**

☛ మీ ప్రశ్నలోనే సమాధానం ఉంది. వేంకటేశ్వరుడంటే మహావిష్ణువే. ఆయనకు బ్రహ్మ, మన్మథుడు కుమారులని పురాణాలు చెబుతున్నాయి. రాముడు కూడా విష్ణుస్వరూపుడే. అసలు భగవంతునకు కూడ పిల్లలుంటారా? "ఏకంసత్ విప్రాః బహుధా వదంతి" పరమాత్మ ఒక్కటే, దానిని వేద వేత్తలు భిన్నంగా చెబుతున్నారు అని వేదం చెబుతున్నది. మానవుని అభిరుచి భేదాన్ని బట్టి ఆరాధించుకోవటానికి, ఇన్ని విధాలుగా మానవులు రూపకల్పన చేసుకున్నారు. పరమాత్మ నిరాకారుడు, నిరంజనుడు కదా! ఈ ప్రపంచమంతా ఆయన వారసులే "అర్జునా! నేను కానిదీప్రపంచంలో ఒక్క రేణువు కూడా లేదు" అన్నాడు. దాన్నే, 'ఈశా వాస్యమిదం సర్వం సర్వం విష్ణు మయం జగత్' అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. అది ఒక దివ్యజ్యోతీరూపం.

**పితృదేవతలు ఎవరు? వారికి శాస్త్ర ప్రకారం ఎంతకాలం శ్రాద్ధకర్మలాచరించాలి? -ఎం.ఎల్.యన్.రావు, హైదరాబాద్.**

☛ మన ముత్తాతలు, తాతలు మొదలైనవారు, తాము చేసిన పుణ్యకార్యాల వల్ల పితృదేవతలవుతారు. భారతంలో భీష్ముడు ధర్మరాజునకు పితృయజ్ఞ విశేషాలు చెప్పాడు.

దేవతలు కూడా, పితృదేవతాపూజను చేస్తారు. పితృదేవతా పూజ సమగ్రమైంది. మనుష్యులకు పితృ సమారాధనం సర్వ శుభకరం. దీన్నే పితృయజ్ఞం పిండ ప్రదానమని పిలుస్తారు.

జరత్కారుడనే ముని ఒకసారి ఒకచెట్టు కొమ్మకు, కాళ్ళు తగిలించి, తలలు క్రిందకు వేలాడుతున్న ఋషులను చూచాడు. అదేదో క్రొంగ్రొత్తదియగు మహా తపస్సుగా భావించి వారిని అడిగాడు. వారు అందుకు "నాయనా! మేము పితృదేవతలం, భూలోకంలో మా వంశం ఎంతకాలం కొనసాగుతుందో అంత కాలం మాకు ఊర్ధ్వలోక సౌఖ్యాలు సిద్ధిస్తాయి. మా వంశంలో జరత్కారుడనే దౌర్భాగ్యుడు పుట్టాడు. వాడు పెండ్లిపెటాకులు లేకుండా తిరుగుతున్నాడు. భూలోకంలో మా వంశం క్షయిస్తుంది గనుక మాకు, ఉన్నత లోకప్రాప్తి నశించిం"దని చెప్పారు. అది విని తానే జరత్కారుడనని చెప్పి ఆతడు వివాహం చేసుకుని పుత్రునికని వంశాన్ని విస్తరించినట్లు భారతగాథ.

ఇక పితృదేవతలకు, మూడు తరాల వరకు పిండతర్పణం చెల్లిస్తారు. ఒక వ్యక్తి తన తండ్రికి, తన తాతకు (తండ్రికి తండ్రి), తన ముత్తాతకు (తాతకు తండ్రి) పిండ ప్రదానం చేస్తాడు. ఆతడు మరణించి, ఆతని కుమారుడు పిండ ప్రదానం చేసేటప్పుడు తన తండ్రికి, తాతకు, తన ముత్తాతకు శ్రాద్ధం పెడతాడు. ఇప్పుడు తండ్రి ముత్తాత వెళ్ళిపోయాడు. ఆ తరువాత తరం వచ్చే వరకు, తన ముత్తాత వరకు మాత్రమే శ్రాద్ధం చెల్లి స్తాడు. కాబట్టి పితృదేవతలకు, మూడు తరాల దాకా, శ్రాద్ధ కర్మలు నిర్వర్తించటం శాస్త్ర సమ్మతం.

**వరలక్ష్మీవ్రతం, సత్యనారాయణ స్వామి వ్రతం మొదలైన వ్రతాల్లో కలశాలపై పెట్టుకొన్న కొబ్బరికాయలు నిమజ్జనం చేయాలా? లేక పగులగొట్టి వాడొచ్చా? -టి.వేంకటేశ్,తిరుమల.**

అలా వ్రతాలలో కలశాల మీద ఉంచిన కొబ్బరికాయలను, పూర్ణాహుతి కోసం వాడతారు. వాటిని నిమజ్జనమూ చేయవచ్చు. అలాగాక దైవానికి నైవేద్యం చేయుటకు కూడా వాడుకోవచ్చు. ఏ విధమైన దోషం లేదు.

**దధీచి వెన్నుముక కథా వృత్తాంతం తెలుపగలరు?**

**- ఎం.కృష్ణప్రసాద్, కొవ్వూరు.**

చ్యవనమహర్షి కుమారుడు దధీచి. మహాతపశ్శాలి. ఆయన భార్య లోపాముద్ర లేక సువర్చ. ఒకసారి ఇంద్రాదులు తమ ఆయుధాలనన్నింటిని దధీచి మహర్షి వద్దకు తీసికొని వచ్చి "అయ్యా! రాక్షసులు యుద్ధాలలో జయించి మా ఆయుధాలను లాగుకొనిపోతున్నారు. కావున వీటిని మీ వద్ద దాచి ఉంచండి" అని అప్పగించిపోయారు. చాలాకాలం వరకు వారు తిరిగి రాలేదు. వాటిని కాపాడటం ఆయనకు కష్టసాధ్యమైంది. కనుక దధీచి తన తపశ్శక్తితో దేవతాయుధాలనన్నింటినీ కరిగించి త్రాగే శాడు. కొంతకాలం పోయిన తర్వాత దేవతలు వచ్చి తమ ఆయుధాలనిమ్మని కోరారు. వాటిని తాను తాగేశానని, అవి తన ఎముకలను పట్టి ఉన్నాయని, వాటిని తిరిగి ఇవ్వటం సాధ్యం కాదన్నాడు. దేవతలు తప్పనిసరిగా ఇవ్వాలని బల వంతం చేశారు. తనను చంపి వాటిని గ్రహించవలసిందని దధీచి చెప్పాడు. వారు బ్రాహ్మణవధ చేయజాలమని విన్నవించు కున్నారు. అప్పుడు దధీచి యోగాగ్నిని కల్పించుకొని దేహాన్ని దగ్ధం చేసుకున్నాడు. అపుడు బ్రహ్మ ఆయన వెన్నెముకతో దేవేంద్రుని వజ్రాయుధం తయారు చేసిచ్చాడు.

**మహాశివభక్తుడైన రావణుడు సంధ్యావందనంలో కేశవ, నారాయణ, మాధవా అనే విష్ణునామాలు పఠించేవాడా? విష్ణువిరోధి విష్ణునామాలెలా పఠిస్తాడు?**

**- నూతినారాయణరావు, హైదరాబాదు.**

మీ ప్రశ్న కేవలం ఊహపై ఆధారపడి సమాధానం చెప్పవలసిన అవసరం కల్పిస్తున్నది. ఎవ్వరు సంధ్యావందనం చేసినా "శ్రీ గోవింద గోవింద మహావిష్ణోరాజ్ఞయా" అనే ప్రారం భించాలి. వివాహాది శుభకార్యాలలో అడ్డబొట్టు పెట్టరాదని, విభూతి అసలు పెట్టరాదంటారు. కానీ వీరశైవులు వివాహాలలో కూడా విభూతి,తిర్యక్పుండ్రంగానే పెట్టుకొంటారు. వారు సంధ్యా వందనంలో కూడా విష్ణునామాలువాడరు. 'కేశవాయ నమః ఓం' అనే కేశవనామాలు చేయరు. కనుక రావణుడు కూడ అలా చేశాడో, విష్ణునామాలతో చేశాడో నిర్ధారించడం కష్టం.

**వైకుంఠం నుండి కోపంతో వచ్చి కొల్హాపురిలో తపస్సు చేసుకొను లక్ష్మి, సతీదేవి కన్నులలో వెలసిన లక్ష్మి ఒక్కరేనా?**

**- కె. గోపాలకృష్ణ, తిరువూరు.**

ఎక్కడ ఉన్నా లక్ష్మీదేవి ఒక్కరే. భృగుమహర్షి వలన కలిగిన అవమానంతో వైకుంఠాన్ని విడిచి వచ్చి కొల్హాపురంలో ఉన్నట్లు సమస్త పురాణాలలో ఉన్నది. సతీదేవి కన్నుల నుండి లక్ష్మి ఉద్భవించినట్లు పురాణాలలో కన్పించదు. అనూచానంగా చెప్పుకొనే కథలలోనే ఈ విషయం ఉన్నది.

**పురుషసంతానవతి పుణ్యస్త్రీగా మరణించినపుడు ఆమెకు అంత్యక్రియలు కర్తగా భర్త నిర్వహించవచ్చునా? లేక కుమారులు మాత్రమే నిర్వహించవలెనా?**

**- యస్.వి.శేషాచార్యులు, ఏలూరు.**

ఊర్ధ్వలౌకిక క్రియాదులలో కర్తను నిర్ణయించటంలో 'ధర్మ సింధు'వనే ధర్మశాస్త్రం పరమ ప్రామాణికం. ఆధికారికం.

స్త్రీ పుత్రసంతానము కలిగి, పుణ్యస్త్రీగా మరణిస్తే ఆమె ఉత్తర క్రియలు కుమారుడే చేయాలి. ఇద్దరు ముగ్గురు కుమారులుంటే, తల్లిదండ్రులలో ఎవ్వరికైనా ఉత్తరక్రియలు నిర్వహించటానికి జ్యేష్ఠపుత్రుడే అర్హుడు. ఒకవేళ పుత్రులు లేక, శాస్త్ర విహితంగా గైకొన్న దత్తపుత్రుడు ఉంటే, కర్మకాండ చేయటానికి ఆతడే అర్హుడు. భర్తకధికారంలేదు. దౌహిత్రుడు ఉంటే (కూతురి కొడుకు) ఆతడధికారి. భర్తకధికారం లేదు. ఎవ్వరూ సంతానం లేకపోతే అప్పుడు భర్త కర్మకాండను నిర్వహించాలి. ఒకవేళ సంతానరహితంగా భర్త మరణిస్తే కర్మకాండ నిర్వహించటానికి భార్యకధికారం ఉన్నది. దహనకార్యం ఆమె స్వయంగా నిర్వ హించి, తన పేరుతో శ్రాద్ధాదులు ఇతరులతో చేయించవలసి ఉంటుంది. తల్లికి ఉత్తరక్రియలు సొంతపుత్రుడు చేయాలని చెప్పాను. సొంతపుత్రుడు లేకపోతే సవతి కొడుకు అధికారి అవుతాడు.

క్రింద పేర్కొన్న తి.తి.దే. గ్రంథాలు లభించే చిరునామా :
పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తి.తి.దేవస్థానం,
తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083.
ఇతర వివరాలకు : 0877 - 2264294

తిరుమల తిరుపతి దేవస్థానముల....

# పుస్తక పరిచయం



[13]

## తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథాలు

### 1) నారాయణీయము

వ్యాఖ్యాత – కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 517;
మూల్యం: రూ.45/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.55/-)

శ్రీమన్నారాయణుని మహిమలను, లీలలను వివరిస్తున్న అత్యద్భుతమైన భక్తిమయ కావ్యమే నారాయణీయం. ఈ సంస్కృత కావ్యాన్ని క్రీ.శ.16వ శతాబ్దంలో కేరళ ప్రాంతీయుడైన మహాకవి నారాయణ భట్టతిరి రచించాడు. మధురమంజులమైన ఈ నారాయణీయ మహాకావ్యానికి కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు తెలుగులో వ్యాఖ్యానాన్ని అందించారు. ఈ గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం స్వీయప్రచురణగా స్వీకరించి ఇప్పటికే రెండు మార్లు ప్రచురించింది. విశేషపాఠకాదరణ పొందిన ఈ గ్రంథం ప్రస్తుతం అందుబాటులో ఉంది.

### 2) పురందరదాసులు రచించిన శ్రీనివాస సంకీర్తనలు

అనువాదం – వక్కంతం సూర్యనారాయణ రావ్
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 131;
మూల్యం: రూ.10/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.40/-)

కర్ణాటక సంగీత పితామహులు శ్రీ పురందరదాసులు. వీరు ఎన్నో కీర్తనలు రచించి భక్తులకందించారు. ఈయన రచించిన కీర్తనా సముద్రంలో 63 కీర్తనలు తిరుమలేశుని స్తుతించినవి. వీటిని తెలుగు పాఠకుల సౌలభ్యంకోసం వక్కంతం సూర్యనారాయణరావ్ చక్కగా తెలుగులోకి అనువదించి పుస్తక రూపంలోకి తెచ్చారు.

ఈ గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం స్వీయప్రచురణగా స్వీకరించి ఇప్పటికే రెండుమార్లు ప్రచురించింది. విశేషపాఠకాదరణ పొందిన ఈ గ్రంథం ప్రస్తుతం అందుబాటులో ఉంది.

### 3) తరిగొండ నృసింహ శతకము

కవయిత్రి – తరిగొండ వెంగమాంబ
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 104;
మూల్యం: రూ.15/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.40/-)

తరిగొండ నృసింహుడిలో తిరుమల శ్రీనివాసుని, తిరుమల శ్రీనివాసునిలో తరిగొండ నృసింహుని ఏకకాలంలో దర్శించిన భక్త కవయిత్రి వెంగమాంబ. ఈమె రచించిన అనేక గ్రంథాల్లో ఈ తరిగొండ నృసింహ శతకము మొట్టమొదటిది. తరిగొండ వెంగమాంబ రచనలన్నింటినీ దేవస్థానం ప్రచురించి వాటికి విశేష ప్రచారాన్ని కల్పిస్తున్నది. ఆ పరంపరలో వచ్చిన గ్రంథమిది. దీనిని ఆచార్య కె.జె.కృష్ణమూర్తి పరిష్కరించారు.

**ఈ గ్రంథాలను పోస్టుద్వారా పొందదలచిన వారు 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారి పేరున డి.డి.ని తీసి పై చిరునామాకు పంపాలి.**

## యోగ వాసిష్ఠం (పంచమ ప్రకరణం)

**రచన–** డా॥ సముద్రాల లక్ష్మణయ్య; **సైజు–** 1/8 డెమ్మీ; **పుటలు–**316; **మూల్యం–**రూ.100/–; **ప్రాప్తిస్థానం:** వెలుగోటి అంజనమ్మ, 18–1–84, యశోదానగర్, కపిలతీర్థం రోడ్డు, తిరుపతి–7.

ఒకానొక దేశం తన ప్రగతి కోసమూ, వికాసం కోసమూ, ఔన్నత్యం కోసమూ విస్తృతమైన ప్రణాళికలు చేపట్టినప్పుడు, ఆర్థిక పథకాలూ, రాజకీయ ప్రణాళికలే గాక ప్రతిపౌరుని యొక్క నైతిక, మానసిక ఔన్నత్యానికి, వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడేటటువంటి సంస్కృతిని పెంపొందించే విధానాలు కూడా రూపొందించుకోవాలి. యువతను జాగృతం చేసి వారి యొక్క భౌతిక శక్తులనూ, నైతిక, మానసిక దృఢత్వాన్ని, క్రియాశీలతను పెంపొందించ గలిగినప్పుడే జాతి నిర్మాణం సాధ్యపడుతుంది.

గ్రంథసమీక్ష

యోగవాసిష్ఠం అనే ఆధ్యాత్మిక గ్రంథ రాజం ప్రతి మనిషి యొక్క వ్యక్తిత్వాన్నీ, జీవితంలో ఎదురయ్యే కఠినమైన సవాళ్ళను ధైర్యస్థైర్యాలతోను, శక్తి యుక్తులతోను ఎదుర్కొనేటట్లు చేయగల గొప్ప గ్రంథం. భారతీయ ఆధ్యాత్మిక వాఙ్మయంలో కిరీట సదృశమైనది 'యోగవాసిష్ఠం'. ఈ మహాకావ్యానికి జ్ఞానవాసిష్ఠం, వాసిష్ఠ రామాయణం, వసిష్ఠగీత – వంటి పలు పేర్లు కాలక్రమంలో ఏర్పడ్డాయి. ఈ పేర్లన్నీ ఈ తాత్త్విక గ్రంథానికి గల ప్రశస్తి, ప్రచారాలను చెప్పక చెపుతూ ఉన్నాయి. సుమారు 32 వేలశ్లోకాల పరిమితి గల ఈ బృహత్ గ్రంథం వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రుణ్ణి ఉద్దేశించి చేసిన తత్త్వోపదేశం. భగవద్గీత, నారాయణుడు నరునికి ఉపదేశం చేసినదైతే అంతకు ముందే వచ్చిన ఈ 'వసిష్ఠ గీత' నరుడు నారాయణునికి చేసిన ఉపదేశాత్మకం. అవతార స్వరూపస్వభావాల్ని బట్టి వక్త – శ్రోత రూపాలు మార్తుంటాయి. ఈ గ్రంథం గురు ముఖతః తెలియదగింది. పరమ పురుషార్థమైన మోక్షాన్ని, జీవన్ముక్తత్వాన్నీ అనుభూతికి తెస్తుంది.

ఈ ఉత్తమకృషిని మొదట శ్రీ మలయాళ యతీంద్రులు తాత్పర్యరూపంతో అందిస్తే–ఆయన శిష్యులు డా॥సముద్రాల లక్ష్మణయ్య గురుతత్త్వాన్నీ, గురుహృదయాన్నీ, గురుధ్యేయాన్నీ చక్కగా మనకు సరళ వ్యావహారిక భాషలో, పూర్తిగా వచన రూపంలో అందించారు. సముద్రాల లక్ష్మణయ్య గురించిగానీ, వారి రచనా నిపుణతను గురించిగానీ ఈనాడు ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. వీరు రచించిన 'అన్నమాచార్య సంకీర్తనామృతం' పేరుకు వ్యాఖ్యాన గ్రంథమే అయినా, మేధావుల దృష్టిలో ఓ కావ్యం. ఏడుకొండలవాడి సంస్థానం విడుదల చేసిన గ్రంథాల అమ్మకాల్లో ఇప్పటికీ ప్రథమ శ్రేణిలో ఉన్నది సముద్రాల సంకీర్తనామృతమే. తమ కవిత్వాన్ని బ్రహ్మజ్ఞాన ప్రబోధం కోసం వినియోగించిన మహాకవులవలె తమ పాండితీపాటవాన్ని బ్రహ్మతత్త్వ పరిజ్ఞాన వివరణకోసం వినియోగించే విద్వాంసులు ధన్యాత్ములు. అలాంటి ధన్యాత్ములలో అగ్రగణ్యులు సముద్రాల లక్ష్మణయ్య. వాల్మీకి విరచిత యోగవాసిష్ఠాన్ని వీరు వచనం చేసి సామాన్యులకు సైతం అందులోని రుచిని చూపించారు. ఇది వారి పాండితీ ప్రకర్షకు నికషోపలం. "రససిద్ధాః కవీశ్వరాః" అన్నట్లు సముద్రాల వారెంత తత్త్వ వేత్తలో అంత మహాకవి పుంగవులు. క్లిష్టమైన వేదాంత తత్త్వాన్ని రసవంతంగాను, పరిత్య మనోహరంగాను, సువిశదంగానూ, హృద్యమైన వచనంలో చెప్పేవారు అరుదుగా ఉంటారు. వారిలో సముద్రాల మేటి. బ్రహ్మానందరసాన్ని కావ్యానంద రసంతో మేళవించి సముద్రాలవారు జిజ్ఞాసువులకు అందించారు. ఈ గ్రంథం రాసినందుకు సముద్రాలను, చదివినందుకు పాఠకులను విశ్వనాథుడైన పరమేశ్వరుడు మోక్ష సామ్రాజ్య పదవీపట్టభద్రులను చేయడం నిస్సంశయం. సముద్రాల లక్ష్మణయ్య ఇంతకుముందే యోగవాసిష్ఠంలోని మొదటి నాల్గు ప్రకరణాలను అనువదించి ప్రకటించి ఉన్నారు. ఇప్పుడు ఐదవ ప్రకరణం ప్రకటించారు. అన్ని ప్రకరణాలూ కలిపితే 900 పుటలకు విస్తరించింది.

యోగవాసిష్ఠంలోని అన్ని అంశాలను, అన్ని కోణాలను స్పృశిస్తూ సముద్రాల విస్తృత వివేచనం చేశారు. గవేషణా పూర్ణమైన వీరి పాండిత్యప్రతిభకు ప్రాజ్ఞులు సమ్మోదభరితులు కాక తప్పదు. మొత్తానికి ఆంధ్రసరస్వతికి ఇదొక నూత్న విభూషణమనడం త్రిధా సత్యం. **–డా॥ కంపల్లె రవిచంద్రన్.**



# నమస్కారం ఎలా చేయాలి?

– ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద

**న**మస్కారం కేవలం ఒక మాట కాదు. ఒక భంగిమతో కూడింది. అందులో 'నమస్సు' మాట. 'కారం'చేష్ట– రెండు చేతులు జోడించి వక్షఃస్థలానికి ఎదురుగా నిల్పి అనే మాట 'నమః' అని. దీనికి 'తే' (నీకు) అనే మాట చేరిస్తే నమస్తే అవుతుంది (నీకు నమస్కారమని అర్థం). 'నమిత' (వినమిత) అనే మాటకు 'వంచిన' అని అర్థం. నమస్కారం చేసేటప్పుడు తలవంచుతాం. అలా వంచటమే 'నమనం'. ఇది వినయానికి గుర్తు. అంటే ఓడిపోయినవాడు తలవంచుతాడు. అలాగే భగవంతుని ముందు శరణాగతి పొందిన భక్తుడు తాను అన్ని భావాలను స్వామిపై వేసిన వారు కావటం వల్ల తాను పరతంత్రుడనని (అంటే స్వతంత్రుడు కానని) అంగీకరించ టానికి గుర్తు ఇలా తలవంచడం. అందుకే నవవిధ భక్తి మార్గాల్లో ఒకటిగా 'వందనం' చెప్పబడింది. భగవంతుణ్ణి ఎలా తలవంచి నమస్కరిస్తామో తలిదండ్రులకు, గురువుకు, ఆచార్యునికి, సన్న్యాసికి, పెద్దలకు, వచ్చిన అతిథులకు, మిత్రులకు, చివరికి సభలోని బాలురకు కూడా నమస్కరించటం సంప్రదాయమైంది. ఇప్పటికీ పెళ్ళిళ్ళలో ఇలా పెద్దలకి నమ స్కారం చేయమంటూ ఉంటారు. అంత మాత్రమైనా మన సంప్ర దాయంలో మిగిలి ఉంది. దానికి సంతోషించాలి కాని ఇతర సందర్భా ల్లోనూ నమః పూర్వకంగా సంభాషణ ప్రారంభించాలన్న సంప్ర దాయం చాలా గంభీరమైన తాత్త్విక భూమికను కల్గింది. అంతటా భగవంతుడు వ్యాపించి ఉన్నాడన్న 'ప్రజ్ఞ' కలవానికి అందరిలోనూ భగవంతుడు కనిపిస్తాడు.

'నమః మహద్భ్యో, నమో యువభ్యో, నమః శిశుభ్యో సర్వేభ్యో నమః' అని పెద్దలంటారు. 'సభకు నమస్కారం' అనే పలుకుబడి వెనుక ఇంత అర్థముంది. రుద్ర మంత్రాల్లో 'నమః కులాలేభ్యః, నమః కర్మారేభ్యః' అనటం చూస్తే కుమ్మరికి, కమ్మరికి కూడా నమస్కరించటం కాకతాళీయంగా బోధించింది.. కాదని అంతటా వ్యాపించిన పరమాత్మని చూడాలి, చూడటానికి మార్గం, చూశారనటానికి నిదర్శనం నమస్కారం పెట్టడమే. కఠోపనిషత్తులో బాలుడైన నచికేతుని గురించి యమధర్మరాజు 'నమస్తేఽస్తు బ్రహ్మన్' అంటాడు. అంటే ఆ బాలుడిలోని బ్రహ్మ జ్ఞానాభిలాషకు నమస్కారం పెట్టాడని అర్థం. ఇలా చూసినపుడు భారతీయులలో 'నమస్కారం' అన్నది ఒట్టి 'గ్రీటింగ్స్' అనే అర్థంతో మాత్రమే ఆగిపోదని దానికి ఆధ్యాత్మిక భూమిక ఒకటి ఉందని అర్థం అవుతుంది.

ఈ నమస్కార ప్రక్రియలో చాలా రకాలున్నాయి. హృదయానికి జోడించిన చేతులు తగిలేలా చేసి 'నమః' అని ఉచ్చరించడం, అప్పుడు తలవంచడం, మామూలు పద్ధతి. ఆ సనాల్లో పద్మాసనంలాగా ఇది చాలా ప్రచురమైన విధానం.

**ఈశ్వరః సర్వభూతానాం**

**హృద్దేశేఽర్జున తిష్ఠతి** **(భగవద్గీత)**

అని భగవానుడు సెలవిచ్చాడు. ఇక్కడ ఉన్న 'ఈశ్వరుడు' శివుడు (త్రిమూర్తుల్లో ఒకడు) మాత్రమే కాదు. 'ఈశు'డంటే ప్రభువని అర్థం. గజేంద్రమోక్షంలో 'ఎవ్వనిచే జనించు....' ఇత్యాదిగా గజరాజు వేడినపుడు 'పరమేశ్వరుడెవ్వడు!' అని ఎవరిని గురించి మీమాంస చేశాడో ఆ పరతత్త్వమే ఈశ్వరుడు. అతడు మానవులందరిలోనూ (మొత్తం చరాచర జీవరాశిలో) 'హృదయ' స్థానంలో ఉంటారు. అతనికి మనం నమస్కరిస్తున్నది. హృదయాన్ని తాకి చేతులు జోడించడంలో ఇంత పరమార్థమూ దాగి ఉంది. ఇది సంప్ర దాయిక నమస్కారం.

తలపైన చేతులుజోడించి నమస్కరించే భంగిమ మరొ కటి ఉంది.'ఏడుకొండలవాడా! వేంకటేశా! నమో నమః' అని భక్తులు గోవింద సంకీర్తనం చేసేటప్పుడు అప్రయత్నంగా చేతులు పైకెత్తి జోడించి నమస్కరిస్తారు. యోగమార్గంలో ప్రార్థన– ధ్యానాదులు చేస్తున్నపుడు ఒకానొక దశలో ఇలా చేతులు పైకి లేస్తాయనడంలో అనుభవంలో ఉన్నదే – సి.వి.వి. సంప్రదా



యంలో 'నమస్కారం' అనే మాటకు యోగఫలసిద్ధికి చేసే ప్రణామమనే అర్థం ఉంది.

అష్టాంగ యోగంలో యమ-నియమ-ఆసన- ప్రాణాయామ- ప్రత్యాహార-ధారణ-ధ్యాన- సమాధులు ఎనిమిది అంశాలు. వీటిలో ఆసనమంటే కూర్చునే విధానం. అలాగే నమస్కరించే విధానం కూడా సాష్టాంగ నమస్కార పద్ధతిగా ఒకటి చెప్పబడింది.

**ఉరసా శిరసా దృష్ట్వా మనసా వచసా తథా ।**
**పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం ప్రణామోఽష్టాంగ ఉచ్యతే ॥**

అని పెద్దలు ఈ ఎనిమిది అంశాలు ఏవేవో కూడా చెప్పారు. రొమ్ము, తల, కళ్ళు, మనస్సు, మాట, కాళ్ళు, చేతులు, మోకాళ్ళు - ఇవి అష్టాంగాలు. వీటితో మనస్సులో ధ్యానిస్తూ, కంటితో చూస్తూ, మాటతో ఇష్టదేవతనో, పెద్దవారినో ఆరాధిస్తూ, తక్కిన అవయవాలను నేలపై తాకించి - సాగిలపడి చేసే నమస్కారం 'సాష్టాంగ నమస్కారం'. పెద్దలకు - గురువులకు- కొన్ని చోట్ల దైవతాలకు చేసే నమస్కార పద్ధతి ఇదే. ఆచార్యులు, సన్న్యాసులు ఈ నమస్కారాన్నే సరైనదిగా గుర్తిస్తారు. ముఖ్యంగా గురువుకు చేసే నమస్కారం ఇలాగే ఉండాలని అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమార్గాలకు చెందిన వారు అనుసరిస్తారు. ఇది గురు నమస్కార పద్ధతి.

**నమస్కరించి యుద్ధం చేయటం :**

యుద్ధం జరిగేటప్పుడు కూడా శత్రుపక్షంలోని పెద్దలకు నమస్కరించి యుద్ధం చేసిన సందర్భాలున్నాయి. భీష్మ పర్వంలో భీష్మాదులను అర్జునుడు ఎదరించాల్సి వచ్చింది. అప్పుడు కూడా యోధుడు కాబట్టి తొలుత వారిపై నమస్కార బాణాలు ప్రయోగించి వారి ఆశీస్సుల్ని గ్రహించి యుద్ధం చేశాడు.

పండిత సదస్యులలో మునుపటి రోజుల్లో ఖండన మండనలు జరిగేవి. ఒక శాస్త్ర పండితుడి అభిప్రాయాన్ని మరొకరు ఖండించేవారు. వాగ్యుద్ధాలకు మునుపు ఒకరికొకరు 'అభివాదం' (నమస్కారమే- గోత్ర నామ పూరస్సరంగా చేసేది అభివాదం) చేసుకోవడం సంప్రదాయంగా ఉండేది.

నమస్కారంలో మనిషి 'నిజాయితీ' వ్యక్తమౌతుంది. తర్వాత చేసే పనికి 'శుచిత్వం' కల్గిస్తుంది. యుద్ధానికి వచ్చిన కృష్ణునికి, భీమునికి, జరాసంధుడు అర్ఘ్యపాద్యాది విధులతో సమర్చన చేసి వచ్చిన కార్యం అడిగాడు. వారు యుద్ధభిక్ష కావాలన్నారు. జరాసంధుడు యుద్ధం చేశాడని కథ.

వ్యాస భగవానుడు ఈ అతిథి మర్యాదను ఒక చోట వివరిస్తూ ఇలా రాశాడు.

**ప్రత్యుద్గమప్రశ్రయనాభివందనం**
**విధీయతే సాధు మిథః సుమధ్యమే**
**ప్రాజ్ఞైః పరస్మై పురుషాయ చేతసా**
**గుహాశయాయైవ న దేహమానినే**

అతిథి రాగానే లేచి నుంచుని, ప్రశంసాపూర్వకంగా అభినందించి, వందనం చేయడం సాధుపద్ధతి (ఉత్తమ విధి). ప్రాజ్ఞులైన వారు ఎదుటివారిలోని పరమపురుషునికి నమస్కరిస్తారు. అంతేకాని దేహానికి కాదు.

అంచేత, పరుని హృదయంలోని భగవంతుని అనుసంధించుకుని వదిలే గురి తప్పని బాణంలాంటిది నమస్కారం.

ఇది మనసా వాచా కర్మణా సరిగా చేయగల్గినపుడు పరుని హృదయాన్ని తాకి, వారిలోని మమకార, అహంకారాలను నశింపజేసి వారిలోని దివ్య జీవధర్మాన్ని మేల్కొల్పే శక్తి నమస్కారానికి ఉంది. శత్రువు కూడా నీలోని ధార్మిక చైతన్యాన్ని గుర్తించేలా చేసే అద్భుతశక్తి నమస్కారానికి ఉంది. ఇరువురిలోనూ వినయశక్తిని పెంచే లక్షణం నమస్కారంలో ఉంది. వినయం సత్త్వగుణానికి సంకేతం. దాని క్రియారూపమే నమస్కరించడం.

అలాంటప్పుడు యుద్ధభూమిలో అర్జునుడు చేసిన నమస్కారానికి అర్థం 'వినయమే' అయితే యుద్ధం మానివేయాలి కదా! యుద్ధం కౌరవపక్షంతోనే కాని – అందులోని ఏ ఒక వ్యక్తితోనూ కాదు. కాబట్టి పెద్దలకు నమస్కరించాడు. నమస్కారం నమస్కారమే. యుద్ధం యుద్ధమే. అంచేత సుకుమారమైన కర్మయోగ రహస్యం కూడా నమస్కారంలో ఇమిడి ఉంది.

**గోవిందుని రక్తి – నమస్కార భక్తి**

'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి' అని స్మార్త మంత్రాలు చెబుతున్నాయి. నదుల్లోని నీరు సముద్రంలో కలిసిపోయిన విధంగా దేవతలందరికీ చేసిన నమస్కారం గోవిందునికే చెందుతుంది. (సన్న్యాసులు నమస్కారానికి ప్రతిగా 'నారాయణ' అనే అంటారు.)

అందుకే శ్రీవారిని ఎన్నో రూపాలతో ఎన్నో విధాలుగా అర్చించే వారున్నారు. వారందరిలోనూ 'శరణాగతి' బుద్ధి స్పష్టంగా కనిపిస్తుంది. వీరశైవులు కర్ణాటక దేశంలో 'శరణు శరణార్థి' అని అంటారు. ఇది నమస్కారానికి బదులు వారు వాడే మాట. ఉత్తర దేశంలో 'రాం.. రాం...' (మరాఠీ, గుజరాతీ, బంజారా వారిలో) కనిపిస్తుంది. ఈ మధ్య దాస సాహిత్య భజన మండలుల ప్రభావం చేత 'హరే శ్రీనివాస!' అనే మాటను వాడుతున్నారు. ఇది నమస్కారానికి వైష్ణవ దాస ప్రపత్తి సూచకమైన ఒక మాటగా మారుతోంది. ఆళ్వారుల సంప్రదాయంలోని 'అడియేన్ దాసన్' (మీ పాదదాసుణ్ణి) అనే మాట కూడా ఇలాంటిదే. నీవు తప్ప నాకు మరెవరూ దిక్కులేరన్న భావనే శరణాగతిలో ఉంది.

**శ్రీ కపిలేశ్వరస్వామివారి**
**పవిత్రోత్సవాలు, తిరుపతి**

| | | | |
|---|---|---|---|
| 21-7-10 | బుధ | అంకురార్పణ (రాత్రి) | ఆషాఢ మాసమున జరుగును |
| 22-7-10 | గురు | పవిత్ర ప్రతిష్ఠ | |
| 23-7-10 | శుక్ర | పవిత్ర సమర్పణ | |
| 24-7-10 | శని | పవిత్రోత్సవ సమాప్తిః | |



**శ్రీ గోవిందరాజస్వామివారి**
**జ్యేష్ఠాభిషేక మహోత్సవాలు,**
**తిరుపతి**

| | | | |
|---|---|---|---|
| 20-7-10 | మంగళ | జ్యేష్ఠాభిషేక ప్రారంభం | ఆషాఢ మాసమున జ్యేష్ఠా నక్షత్రమున జరుగును |
| 21-7-10 | బుధ | కవచ ప్రతిష్ఠ | |
| 22-7-10 | గురు | కవచ సమర్పణ | |

**అహం దూరతస్తే పదాంభోజయుగ్మ**
**ప్రణామేచ్ఛయాఽఽగత్య సేవాం కరోమి,**
**సకృత్ సేవయా నిత్యసేవాఫలం త్వం**
**ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ!**

– అని శ్రీ వేంకటేశ్వరుని స్తోత్రంలో ఉంది. స్వామివారి పాదపద్మాలకు నమస్కారం చేయాలనే కోరికతోనే దూరం నుంచీ వచ్చాను స్వామీ! ఈ ఏడు కొండలెక్కి మాటిమాటికీ రాలేను. ఒకసారి ఎప్పుడైనా సేవించిన వారినే నిత్య సేవాఫలం, ఇస్తావు నీవు. ఆ అనుగ్రహాన్ని మా మీద చూపించు – అని భక్తుడు వేడుకొంటాడు.

ప్రణామమంటే కూడా 'నమస్కారమే'. 'ప్రణిపాతం' (పాదలమీద పడి నమస్కరించడం) అని భగవద్గీత దీన్నే ప్రస్తావించింది. గోవిందుడు ఈ ప్రణిపాతాన్ని సంతోషంగా స్వీకరిస్తాడు. వారిని అనుగ్రహిస్తాడు. అంచేత ఈ విషయాన్ని మన తర్వాతి తరాలవారికి తెలియజేద్దాం. నమస్కార సంప్రదాయాన్ని కొనసాగిద్దాం.

# భోజన యజ్ఞం

- డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

భారతీయ సనాతన వైదిక సంస్కృతి, బ్రహ్మాండం మొదలు, పరమాణువు వరకూ అన్నిటిలోను యజనక్రియను గమనించింది. సత్సంతానాభివృద్ధి కావచ్చు, భోజనం కావచ్చు, చివరకు ఉచ్ఛ్వాసనిశ్వాసాలను కూడా ఒక యజ్ఞంగా భావించారు. యజనానికి ప్రథమ స్థానం. యజమాని పదం ఆ విధంగా రూపొందిందే. పురుషసూక్తం 'ఈ బ్రహ్మాండ సృష్టి క్రియను ఒక యజ్ఞభాగంగా నిరూపించింది. విశ్వదేహం బ్రహ్మాండమైన, ప్రాణులు దేహం బ్రహ్మాండ సృష్టిరూపమైన పిండాండంగా గుర్తించారు మన పూర్వీకులు. పిండాండంలోని ఆత్మశక్తిని పెంపొందించుటకు, భోజనాన్ని యజ్ఞంగా విశ్వ సించారు. భోజన విధులను వైజ్ఞానికంగా రూపొందించారు. ఈ నేపథ్యంలో భారతీయుల భోజన క్రమం కేవలం కడుపు నింపుటకే కాక, బ్రహ్మాండం యొక్క సూక్ష్మ రూపమైన, పిండాండ మనే దేహమందలి ప్రాణశక్తిని ఉత్తేజపరచే యజ్ఞక్రియగా మారింది.

ఈ కారణంగానే భోజనాన్ని 'ప్రాణాగ్ని హోత్ర' మన్నారు.

ఈ రీతిగా భోజన క్రమమందలి ప్రతిదశలోను యజ్ఞ కార్యక్రమాలను స్పష్టంగా పరిశీలింపవచ్చు. యజ్ఞ కార్యానికి యజమాని, సంకల్పం, స్థలం, కాలం, కుండం, అగ్ని, పురోడాశ (హవిస్సు) ఆజ్యం, ఏ విధంగా అగత్యమో భోజనానికి కూడా, భోక్త, సంకల్పం, స్థలం కాలం, సమర్థమైన జఠరం, పచన శక్తి ఆహారం, గవ్యాలు మొదలైనవి అత్యావశ్యకాలు.

యజ్ఞ విధులతో భోజన విధులను కూడా పోల్చి నపుడు. "భోజనం ప్రాణాగ్నిహోత్రం, ఈ హోత్రానికి దేహమే యజ్ఞశాల, జఠరమే యజ్ఞగుండం, భోజన మందలి ఖాద్య వస్తువులే హవిస్సు. రసపూర్ణమైన ఆహారాన్ని జీర్ణించుకొనే శక్తే యజ్ఞాగ్ని, జీర్ణం కావటమే దహన క్రియ.

పురుష సూక్తం "యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వథా" అనటంతో సృష్టి క్రియలోని విభిన్న దశలను, యజ్ఞ ఉపమానంగా పేర్కొన్నది. విష్ణు సహస్రనామం కూడా సృష్టి కార్యమే యజ్ఞం, దాని సర్వస్వమే పరమాత్మ అని పేర్కొంది.

ఈ రీతిగా భారతీయులకు బ్రహ్మాండ సృష్టి యజ్ఞ గుండం వలే, భోజనం కూడా ఒక యజ్ఞమైంది.

## దేహమనే యజ్ఞగుండం :

యజ్ఞగుండంలో అగ్నిని స్థాపించాల్సి ఉంటుంది. కానీ, జీవంతమైన దేహం జఠరమనే అగ్నిగుండంలో సకాలంలో అగ్నిని స్థాపించుకుంటుంది. దీన్నే 'పాచకాగ్ని' అన్నారు. పొట్టలో సహజంగా స్రవించు హైడ్రోక్లోరిక్ ఆమ్లాలు ఆహారాన్ని దహించి, దైహిక శక్తిగా మారుస్తున్నాయి. ఈ పచన శక్తినే భారతీయులు, భోజన యజ్ఞాగ్నిగా పేర్కొన్నారు. ఆయుర్వేదం ఈ జీర్ణకార్యాన్ని, దహన శక్తి, జఠరాగ్ని అన్నారు. ఈ శక్తి ఎక్కువైనపుడు అగ్ని ప్రకోపమన్నారు. జీర్ణశక్తి తరిగినపుడు 'అగ్ని మాంద్యం' అన్నారు.

యజ్ఞంలో 'వైశ్వానరాగ్ని'కి ఉన్న స్థానమే భోజనంలో పాచకాగ్ని ఉంది.

## చతుర్విధాన్నం :

భారతీయులు తమ ఆహారపదార్థాలను, నాలుగు విధా లుగా పేర్కొన్నారు. భగవద్గీతలో కృష్ణుడు, తాను వైశ్వాన్న రాగ్నిగా, నాలుగు విధాల అన్నాన్ని జీర్ణం చేస్తాడు భాగవతంలో, కృష్ణునికి భోజనంకోసం ముత్తైదువలు, నాలుగు విధాల అన్నాన్ని సమర్పించారు. అన్నం అంటే బియ్యంతో చేసిన ఆహార పదార్థమే కాదు. అన్ని ఆహార పదార్థాలకు అన్నమనేపేరు. చతుర్విధాన్నం అంటే : 1) భక్ష్యం– వేయించిన ఆహార పదార్థాలు; 2) భోజ్యం, అంటే, ముద్దలుగా చేసి తినేవి; 3) లేహ్య– నాలుకతో చప్ప రించి తినేవి; 4) చోష్య – పదార్థంలోని రసాన్ని పీల్చుకొనేవి; 5) నీరు–పానీయం చేర్చిన అది పంచభక్ష్యం.




మహాత్ముల చర్యలు ఒక్కోసారి వెంటనే మనకు అర్థం కావు. అంతమాత్రం చేత త్వరపడి వారిని నిందిస్తే, మనం నిజంగా అపరాధులమౌతాం. మహాత్ముల చర్యలను, మిడి మిడి జ్ఞానంతో విమర్శించాలనుకోవటం చాలా పొరపాటు. దీనికి శకుంత మహారాజు జీవితమే నిదర్శనం.

ఒకసారి శ్రీరాముడు పెద్ద యజ్ఞం చేస్తుంటే, శ్రీరాముడి సాయంతో రాజైన శకుంత మహారాజు ఆ యాగానికి వచ్చాడు. యాగశాల బయటే కనిపించిన వశిష్ట మహర్షికి పాదనమస్కారం చేశాడు. ఇంతలో ఎవరో దూతలు వచ్చి అతని రాజ్యంలో ఏదో ప్రమాదం జరిగిందని చెప్పగా, అతడు వశిష్ఠ మహర్షి దగ్గర సెలవు తీసుకుని వెనక్కి వెళ్ళిపోయాడు. విశ్వామిత్ర మహర్షికి ఈ వార్త తెలిసి, కేవలం వశిష్ఠుడిని మాత్రమే గౌరవించి ఆ సమయంలో అక్కడే ఉన్న తనను గౌరవించకుండా వెళ్ళిపోయాడని శకుంత మహారాజు మీద చాలాకోపం వచ్చింది. ఆయన రాముడి దగ్గరకు వెళ్ళి, ఆ శకుంతుడి తల తన పాదాల మీద పడవేయమని ఆజ్ఞాపించాడు. శ్రీరాముడు గురువాజ్ఞకు లోబడి శకుంతుని బంధించి తీసుకురమ్మని లక్ష్మణుడిని పంపాడు.



**- పి.వైష్ణవి**
**D/o పి.వి.ఎన్.రంగారావు,**
**ఇ.నెం.5-77, పోలీస్ స్టేషన్ రోడ్డు,**
**చేబ్రోలు, పశ్చిమగోదావరి జిల్లా**

నారదమహర్షి వల్ల ఈ వార్త విన్న శకుంత మహారాజు ఆందోళన చెంది నారదుడినే శరణుజొచ్చాడు. ఆయన ఆంజనేయుడి తల్లి అంజనాదేవిని వివరాలేమి చెప్పకుండా ప్రాణ భిక్షను అర్థించమని చెప్పాడు. శకుంతరాజు అలాగే చేశాడు. అంజనాదేవి ముందు ప్రాణదానం చేస్తానని వాగ్దానం చేసింది. తర్వాత వివరాలు తెలుసుకొని కంగారు పడ్డది. చేయగలిగింది లేక ఆంజనేయుని పిలిపించి విషయం చెప్పింది. మాతృభక్తి పరాయణుడైన ఆంజనేయుడు శకుంతరాజును ఒక చోట కూర్చోబెట్టి ఆయన చుట్టూ కోటలాగా తన తోక చుట్టి దానిపైన తను కూర్చుని భక్తితో రామనామం చేయసాగాడు. లక్ష్మణుడు వచ్చి శకుంతరాజును అప్పజెప్పమన్నాడు. ఆంజనేయుడు అంగీకరించలేదు. యుద్ధం జరిగింది. లక్ష్మణుడు ఓడిపోయాడు. రాముడు ఆగ్రహించి తానే స్వయంగా యుద్ధానికి వచ్చాడు. ఆయన వచ్చేసరికి హనుమంతుడు మధురంగా రామ నామ గానం చేస్తున్నాడు. ఆ గానానికి రాముడు ద్రవించిపోయాడు. అయినా తేరుకుని ఆంజనేయుని పిలిచి శకుంత రాజును అప్పజెప్పమన్నాడు. ఆంజనేయుడు నమస్కరించి, "దేవా! ధర్మానికి నువ్వే ప్రమాణం. పితృభక్తికి నిన్ను మించిన ఉదాహరణ లేదు. సత్యానికి నువ్వొక్కడివే రక్ష. నా తల్లి సత్య నిష్ఠ నిలపడం కోసం నేను ఇక్కడ నిలబడ్డాను. నన్ను సంహరించి నీవా రాజును తీసుకువెళ్ళు"అన్నాడు. రాముడు ఉగ్రుడై శరవర్షం కురిపించాడు. హనుమంతుడు కళ్ళు మూసుకుని నమస్కరిస్తూ రామనామ గానం చేయసాగాడు. అతని మీదకి వచ్చిన రామబాణాలన్నీ వెనుదిరిగి రాముని పాదాల దగ్గర పడిపోసాగాయి. రామునికి అలసట వచ్చేసింది. ఇంతలో నారదుడు వచ్చి రామ నామ స్తుతి చేశాడు. రాముడు, రామబాణం వ్యర్థమైనందుకు చింతించాడు. "ఇది, నీకు పరాజయం కాదు, విజయం. రామబాణం కన్నా రామనామం గొప్పదని లోకానికి తెలియజెప్పటం కోసమే విశ్వామిత్ర మహర్షి ఇంత నాటకమాడాడు. ఆ మహర్షి శకుంత రాజు శిరస్సు తన పాదాలపై పడాలన్నాడేగాని, ఆ తలతెగిపోవాలనలేదు. కనుక నీవు, హనుమంతుడు కలిసి శకుంత రాజును తీసుకు వెళ్ళి ఆ మహాత్ముడికి పాదాభివందనం చేయిస్తే సరిపోయె." అన్నాడు నారదుడు

ఈ కథ మొదట్లో మనం విశ్వామిత్రుడి అల్పబుద్ధిని చూచి, చాలా నిందించుకుంటాం కానీ కథ చివరకు వచ్చేసరికి, ఆయన బుద్ధి ఎంత విశాలమైనదో, ఎంత లోకోపకారదీక్ష గలదో, ఎంత నిస్వార్థమైనదో అర్థమౌతుంది.

## డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమము - 07-05-2010
## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఇ.ఓ.'*** *కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 07-05-2010న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం.)*

**1. కల్యాణోత్సవం టిక్కెట్లను కంప్యూటర్ బుకింగ్ ద్వారా ఇస్తున్నారు. కాని కంప్యూటర్ జ్ఞానం లేనివారు వాటిని ఎలా పొందగలుగుతారు?**

**2. సుదర్శనం టిక్కెట్లు తిరుపతిలో రద్దు చేశారు.**

*- మనోహర్, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** 1. ఈ అంశాన్ని పరిగణనలోకి తీసుకుంటాం.

**కార్యనిర్వహణాధికారి :** 2. రద్దు చేయలేదు. కేవలం సుపథం టిక్కెట్లు మాత్రమే రద్దు చేయడం జరిగింది.

**శతమానం భవతి ప్రోగ్రాంలో కన్నడ భాషకు సంబంధించిన వాళ్లవి వేయరా?** *- ఉమ, మైసూరు.*

**కార్యనిర్వహణాధికారి :** శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్‌కి మీ వివరాలు సుమారు 15 రోజుల లోపు పంపితే ఏ భాష వారివైనా ప్రసారం చేస్తాం.

**ఆయుర్వేద గ్రంథాలను మీరు పునర్ముద్రణ చేయిస్తారా?**

*- చంద్రబాబు, కంచి.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**దేవుడిదగ్గర భక్తుల్ని తోసేస్తున్నారు.**

*- నిర్మల, రొంపిచెర్ల,*
*- శ్రీనివాస రాఘవన్, చెన్నై,*
*- సుబ్బారావు, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** ఇది చాలామంది భక్తులకు కలుగుతున్న ఆవేదనే. దీనిమీద ఖచ్చితంగా ఒక నిర్ణయం తీసుకుంటాం.

**గత నెల తొమ్మిదవ తేది అంగప్రదక్షిణ టిక్కెట్టు కొనుక్కుంటే ప్రసాదాలు ఇవ్వలేదు.** *- నారాయణబాబు, నెల్లూరు.*

**కార్యనిర్వహణాధికారి :** మీకు పది రూపాయలతో లడ్లు ఇచ్చే ఏర్పాటు చేస్తున్నాం.

**తిరుపతి శ్రీనివాసంలో కూడా అంగప్రదక్షిణ టిక్కెట్లు ఇస్తే బాగుంటుంది.** *- శ్రీనివాస రాఘవన్, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** అలా ఇవ్వడానికి కుదరదు.

**గుంటూరు, విజయవాడలలో ఈ-దర్శన్ కోటా పెంచాలి.**

*- గోపీకృష్ణ, గుంటూరు.*

**కార్యనిర్వహణాధికారి :** చూద్దాం.

---

### ప్రతినెల మొదటి శుక్రవారం మాత్రమే! ఇ.ఓ.తో మాట్లాడండి !



## డయల్ యువర్ ఇ.ఓ.!

**ఫోన్ నెం:**
**0877 - 2263261**

**సమయం: ఉ॥ 8-30 నుండి 9-30 గం॥ వరకు**

యాత్రికులకు అపూర్వ అవకాశం! ఏ ప్రాంతం నుంచైనా మీరు నేరుగా కార్యనిర్వహణాధికారితో మాట్లాడవచ్చు!

శ్రీవారి దర్శనం, ఆర్జితసేవలు, వసతి సౌకర్యం తదితర విషయాలపై మీ సలహాలు, సూచనలు, సమస్యలు అన్నీ నేరుగా తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో మాట్లాడండి. సలహాలు ఇవ్వండి! సూచనలు చెయ్యండి!!

**ఈ అవకాశాన్ని అందరూ ఉపయోగించుకోండి! వ్యక్తిగత విషయాలు కాకుండ పదిమందికి ఉపయోగపడే ప్రశ్నలే వేయండి.**
**తి.తి.దేవస్థానం యాత్రికులకు మరింత సమర్థవంతంగా సేవలు అందించేందుకు మీ సూచనలివ్వండి.**

**న మాధవసమో మాసో న కృతేన సమం యుగమ్ ।**
**న చ వేదసమం శాస్త్రం న తీర్థం గఙ్గయా సమమ్ ॥**
**న ధర్మేణ సమం మిత్రం న సత్యేన సమం యశః ।**
**యథా తథా భగవతః స్థానేన సదృశం నహి ॥**

**(స్కాపు.2-17-17, 20)**

– అని పురాణ ఉద్ఘోష. వైశాఖమాసంతో సమానమైన మాసం, కృతయుగంతో సమానమైన యుగం, వేదంతో సమానమైన శాస్త్రం, గంగతో సమానమైన తీర్థం, జలదానంతో సమానమైన దానం, నిజధార సుఖంతో సమానమైన సుఖం, కృషితో సమానమైన ధనం, జీవితం కంటే శ్రేష్ఠమైన లాభం, ఉపవాసాన్ని మించిన తపస్సు, ధర్మంతో సమానమైన మిత్రుడు, సత్యంతో సమానమైన యశస్సు లేనట్లే సాక్షాత్తూ భగవంతుని నివాసభూమియైన శ్రీ వేంకటాద్రితో సమానమైన స్థానం ఈ సృష్టిలో మరొకటిలేదు.

ఇంత గొప్ప క్షేత్రాన్ని పదకవితా పితామహుడైన అన్నమయ్య అతిరమ్యంగా సంకీర్తించాడు. అన్నమయ్య తొలిసారిగా తిరుమల యాత్ర చేసినప్పుడు మోకాళ్ళ పర్వతం వద్ద ఒక వెదురుపొద కింద అలసి, సొలసి వాలిపోయాడు. ఇతని దీనావస్థను చూచిన అలమేలుమంగ వైకుంఠం నుండి దిగివచ్చి "బాలకా! ఈ మహా పర్వతేంద్రము లాలిత సకల సాలగ్రామ మయం. ఘనులకు ఇది చెప్పుకాళ్ళ ఎక్కంగ చనదు, నీ చెప్పులు సడలించి వైచి కనుగొను, కన్నుల కనవచ్చు" అంటూ "ఈ పర్వతము పవిత్ర సాలగ్రామ మయమైనదని" ఉపదేశించింది. ఆ ఉపదేశాన్ని త్రికరణశుద్ధిగా అవగతం చేసుకున్న అన్నమయ్య తిరుమల కొండను కేవలం ఒక సామాన్య పర్వతం వలే గాక, పరమ పవిత్ర ప్రదేశంగా భావించాడు.

**కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ**
**తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ**

# అక్షరామృతం [23]

# కట్టెదుర వైకుంఠము

– అల్లం శ్రీనివాసులు

**వేదములే శిలలై వెలసినది కొండ**
**యేదెసఁ బుణ్యరాసులే యేరులైనది కొండ,**
**గాదిలి బ్రహ్మాదిలోకముల కొనలకొండ**
**శ్రీదేవుఁడుండేటి శేషాద్రి యీ కొండ.**

**సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ**
**నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ,**
**వుర్విఁ దపసులే తరువులై నిలిచిన కొండ**
**పూర్వపుటంజనాద్రి యీపొడవాటి కొండ.**

**వరములు కొటారుగా వక్కణించి పెంచేకొండ**
**పరగు లక్ష్మీకాంతు సోబనపుఁగొండ,**
**కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ**
**విరివైన దిదివో శ్రీ వేంకటపుఁగొండ. (3-471)**

వేంకటాచలంతో సమానమైన ప్రదేశం ఈ బ్రహ్మాండం లో లేదు! తిరుమల శిఖరాలు అత్యంత మహిమాన్వితమైనవి! ఇక్కడున్న చెట్టూపుట్టా అన్నీ మునుల రూపాలే! ఈ కొండపైని శిలలన్నీ వేదాలే! మృగజాతులన్నీ దేవతా స్వరూపాలే! పుణ్య రాసులన్నీ ఏరులైన కొండ ఇది! శ్రీ దేవుడు కొలువైన కొండ ఇదే! వరాలు కురిపించే ఈ లక్ష్మీకాంతుని సోబనపు కొండ మన ముందు నిలచిన వైకుంఠమే తిరుమల అని అన్నమయ్య పై సంకీర్తనలో తిరుమలను కీర్తించాడు.

అంతేగాదు ఈ శేషాద్రి (తిరుమల) అతిశయంబైన శిఖరాలతో కూడి ఉన్నదట. ఆ కొండ సరిలేని గోపుర ప్రభలతో ప్రకాశిస్తున్నదట. అంతేగాక శతకోటి సూర్యుల తేజస్సుతోనూ వెలుగొందుచున్నదట.

**ఇప్పడిటు కలగంటి నెల్ల లోకములకు -**
**నప్పడగు తిరు వేంకటాద్రీశుఁగంటి ॥**

**అతిశయంబైన శేషాద్రి శిఖరముగంటి**
**ప్రతిలేని గోపుర ప్రభలు గంటి**

**శతకోటి సూర్య తేజములు వెలుఁగగఁ గంటి**
**చతురాస్యు పొడగంటి చయ్యన మేలుకొంటి ॥**

**కనకరత్నకవాటకాంతు లిరుగడఁగంటి**
**ఘనమైన దీపసంఘములు గంటి,**
**అనుపమ మణిమయమగు కిరీటము గంటి**
**కనకాంబరము గంటి గక్కన మేలుకొంటి ॥**

**అరుదైన శంఖచక్రాదు లిరుగడఁ గంటి**
**సరిలేని యభయహస్తముఁ గంటి,**
**తిరు వేంకటాచలధిపునిఁ జూడఁగఁగంటి**
**హరిఁ గంటి గురుఁగంటి నంతట మేలుకొంటి ॥ (1-38)**

అన్నమయ్య తలపు తరంగాలలో, కనులలో, కలలలో కొలువైయున్నది ఆ కొండల రాయుడే! లోక జనకుడైన తిరు వేంకటప్పను, ఆ స్వామి దివ్యమంగళ విగ్రహాన్ని, తిరుగులేని ఆ దివ్య సౌందర్యాన్ని, శేషాచల శిఖరాల మణిమయ కాంతు లను స్వప్నంలో సాక్షాత్కరింప చేసుకున్న ధన్యుడు అన్నమయ్య. తిరుమల కొండను కలలో చూచిన అన్నమయ్య ఆ దివ్య ధామాన్ని దర్శించడానికే మొదటగా తిరుమలకు బయల్దేరాడు.

తిరుమల క్షేత్రం చేరగానే అన్నమయ్యలో భక్త్యావేశం పెల్లుబికింది. ఆనందనిలయాన్ని చేరిన అన్నమయ్యలో ఆనందం ఉప్పొంగింది. ఆ ఆనందంలో చిందులు వేస్తూ ఆ భక్త శిఖా మణి ఇలా గానం చేశాడు –

**అదివో అల్లదివో హరివాసము**
**పదివేలు శేషుల పడగలమయము.**

**అదె వేంకటాచల మఖిలోన్నతము**
**అదివో బ్రహ్మాదుల కపురూపము,**
**అదివో నిత్యనివాస మఖిలమునులకు**
**అదె చూడుడదె మొక్కుడానందమయము.**

**చెంగట నల్లదివో శేషాచలము**
**నింగినున్నదేవతల నిజవాసము,**
**ముంగిట నల్లదివో మూలనున్నధనము**
**బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము.**

**కైవల్యపదము వేంకటనగమదివో**
**శ్రీ వేంకటపతికి సిరులైనది,**
**భావింప సకల సంపద రూపమదివో**
**పావనములకెల్ల పావనమయము. (1-23)**



బాల అన్నమయ్య ఎనిమిదేండ్ల వయస్సులో తొలిసారిగా తిరుమల కొండను దర్శించినపుడు, ఆ బంగారు శిఖరాల సౌందర్యాన్ని పులకితుడై, పర వశుడై ఆనందతాండవం చేస్తూ పాడిన పాటే పై సంకీర్తన. కైవల్యానికి సాధన మైన కొండ, సకల సంపదలకు రూప మైన కొండ, పావనములలో పావనమైన దని తిరుమల కొండ వైభవాన్ని అన్న మయ్య ప్రస్తుతించాడు.

ఇలా తన ఆనందాన్ని ప్రకటించిన అన్నమయ్య ఆనందనిలయ వాసుణ్ణి దర్శించడం కోసం బంగారు వాకిలి దగ్గరకు వెళ్ళాడు. ఇతడు వెళ్ళేసరికి ఆనందనిలయ వాసుడైన శ్రీనివాసుడు

తన రూపసందర్శనతో భక్తులకు జ్ఞానాన్ని, ఆనందాన్ని ప్రసాదిస్తూ ఉన్నాడట! ఆతణ్ణి దర్శించగానే అన్నమయ్య పునీతు డయ్యాడట. అఖిలాండకర్తను దర్శించుకున్న అన్నమయ్య ఆ పుణ్యప్రదేశ సందర్శనతో పునీతుడే కాదు, పులకితుడూ అయ్యాడు.

**కంటి నఖిలాండ కర్తనధికుని గంటి**
**కంటి నఘములు వీడుకొంటి నిజమూర్తిఁ గంటి ॥**

**మహనీయ ఘనఫణామణుల శైలము గంటి**
**బహు విభవముల మంటపములు గంటి**
**సహజ నవరత్న కాంచనవేదికలు గంటి**
**రహివహించిన గోపురంబులవె కంటి ॥**

**పావనంబైన పాపవినాశనము గంటి**
**కైవశంబగు గగనగంగ గంటి**
**దైవికపు పుణ్య తీర్థములెల్ల పొడగంటి**
**కోవిదులు కొనియాడు కోనేరుఁగంటి ॥**

**పరమయోగీంద్రులకు భావగోచరమైన**
**సరిలేని పాదాంబుజములు గంటి**
**తిరమైన గిరిచూపు దివ్య హస్తము గంటి**
**తిరువేంకటాచలాధిపు చూడఁగంటి ॥** **(4-58)**

అఖిలాండకర్తయైన శ్రీ వేంకటేశ్వరుని దర్శిస్తే చాలు! మన పాపాలన్నీ పటాపంచలై పోతాయి! అలాంటి మహనీయ కమనీయ మూర్తిని, తిరుమల గిరుల సౌందర్యాన్ని అన్నమా చార్యులవారు దర్శించి భావావేశంలో ఆ అద్భుత సౌందర్యాన్ని సంకీర్తనం చేశాడు.

పరమపవిత్రమైన ఈ కొండను కాలితో నడిచి వచ్చి దీని పవిత్రతకు భంగం కల్గించరాదని రామానుజులు తిరు మలకు మోకాళ్ళపై వచ్చేవారట. అలాంటిది ఈ కొండ మాహాత్మ్యం. అలాంటి తిరుమల కొండను తన నెలవుగా చేసు కున్నట్టి, ఎల్లలోకాలకు నాథుడైనట్టి, కనకాంబరధారియైనట్టి తిరువేంకటాచలాధిపుని దర్శించడానికి నానాదిక్కుల నరులెల్లరూ, శతసహస్రయోజన దూరవాసులంతా "కుండపోత వానల వంటి ఎంతటి క్లిష్ట పరిస్థితులనైనా లెక్క చేయక తిరుమలకు చేరు కుంటారట".

**నానా దిక్కుల నరులెల్లా**
**వానలలోననె వత్తురు గదలి ॥**

**సతులు సుతులు పరిసరులు బాంధవులు**
**హితులు కొలువఁగా ఇందరును**
**శతసహస్రయోజనవాసులు సు -**
**వ్రతములతోడనె వత్తురు కదలి ॥**

**ముడుపులు జాళెలు మొగి తలమూఁటలు**
**కడలేని ధనము కాంతలను**
**కడు మంచిమణులు కరులు తురగములు**
**వడిగొని చెలఁగుచు వత్తురు కదలి ॥**

**మగుటవర్ధనులు మండలేశ్వరులు**
**జగదేకపతులు చతురులును**
**తగు వేంకటపతి దరిశింపఁగ బహు**
**వగల సంపదల వత్తురు గదలి ॥** **(1-346)**

నానాదిక్కుల నుండి మానవులంతా బంధుమిత్రులతో మంచి నియమాలతో వానలను కూడా లెక్క చేయకుండా పరమాత్ముని దర్శనార్థం కొండకు వస్తారట. వారు ముడుపులు చెల్లించడానికి ఏ కాలమైనా లెక్క చేయకుండా తిరుమల కొండను చేరుకుంటారట. సామాన్య మానవులే గాక, రాజులూ, చక్రవర్తులూ శ్రీస్వామిని దర్శించడానికి తిరుమలకు తరలి వస్తారట. అవును, జగత్తునకంతా చక్రవర్తి ఈ శ్రీనివాసుడు. ఇతని ముందర అందరూ సామాన్యులే.

తిరుమల కొండ పావనమైంది. బ్రహ్మమయమైంది. సచ్చిదానంద స్వరూపమైంది. పరమాత్ముడైన వేంకటపతి పాద స్పర్శతో పునీతమైన ఈ తిరుమలకొండ సాలగ్రామమయమై దివ్యధామంగా వెలుగొందుతోంది. ఈ కొండయొక్క అణు వణువూ భగవత్స్వరూపం. కలియుగ వైకుంఠం అయిన తిరుమల క్షేత్రాన్ని ప్రతి హిందువూ దర్శించి, ఆ పద్మావతీ చరణచారణ చక్రవర్తి కృపకు పాత్రులు కావాలి.

# శ్రీకృష్ణుని అష్టభార్యలు

- పాయసం సుబ్రహ్మణ్యం

శ్రీ మహావిష్ణువు అవతారాల్లో శ్రీకృష్ణావతారం విశిష్ట మైనది. శ్రీకృష్ణుడికి అష్టభార్యలు ఉన్నారనేది లోక విదితం. వారిని రేఖామాత్రంగా పరిచయం చేయడం ఈ వ్యాసం ఉద్దేశ్యం.

**రుక్మిణీదేవి :** రుక్మిణి 'రుక్మి' సోదరి. 'ఛేది' దేశపురాజైన శిశు పాలుడికి రుక్మిణినివ్వాలన్నది రుక్మి అభిమతం. అయితే రుక్మిణి శ్రీకృష్ణుణ్ణి గురించి విని అతణ్ణి ప్రేమించింది. ఆమె లక్ష్మీదేవి అంశ. తన ప్రేమ సందేశాన్ని అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణుడి చేత శ్రీకృష్ణుడికి పంపించింది. అతని ద్వారా అన్ని విషయాలు తెలుసుకున్న శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహమాడాలనుకున్నాడు.

'రుక్మిణి'ని బలవంతంగానైనా సరే తీసుకువచ్చి అను కున్నదే తడవు రథారూఢుడై బయలుదేరాడు. విషయం అన్న బలరాములు వారికి చేరింది. తమ్ముడికి ఏ అవసరం వస్తుందో నని ఆయనా బయలుదేరాడు 'హలాయుధ' ధారియై!

శ్రీకృష్ణుడు 'రుక్మిణి'ని దేవీమందిరంలో కలిసి ఆమెను రథంపై కూర్చొన జేసి అదే వేగంతో తిరుగు ముఖంపట్టారు. రుక్మి, శిశుపాలుడు సైన్యంతో శ్రీకృష్ణుణ్ణి వెన్నాడారు. సంకుల సమరం జరిగింది. సమయానికి బలరాముడు, శ్రీకృష్ణుణ్ణి కలుసుకున్నాడు. యుద్ధంలో 'రుక్మి' ఓడిపోయాడు. ఇలా జరిగింది రుక్మిణి వివాహం. రుక్మిణి తర్వాత అంతటిస్థానాన్ని పొందిన భార్య సత్యభామ.

**సత్యభామ :** ఈమె 'సత్రాజిత్తు' కుమార్తె. మహాఅందగత్తె, సంపన్నురాలు. ఆపై యుద్ధవిద్యలలో దిట్ట. ఈ కారణంగానే ఈమె 'అతిశయు'రాలైంది. పైగా శ్రీకృష్ణుడి ముద్దుల భార్య. నరకాసుర యుద్ధంలో ఈమెది కీలకపాత్ర. కృష్ణరాయల ఆస్థాన కవి, తిరుమలదేవి అరణపు కవి అయిన ముక్కుతిమ్మన 'పారి జాతాపహరణం'లో సత్యభామను గురించి ఎన్నో రసప్లావితమైన వర్ణనలు చేశాడు. ఈ విధంగా సత్యభామ శృంగారనాయిక కూడా అయింది.

**కాళింది :** ఈమె కృష్ణుడి మూడవ భార్య. ఈమె 'సూర్యదేవుని' కుమార్తె. ఈమెది కూడా ప్రేమ వివాహం. కృష్ణుణ్ణి గురించి విని ప్రేమించి వివాహం చేసుకుంది.

**జాంబవతి :** ఈమె 'జాంబవంతుని' కుమార్తె. జాంబవంతునితో జరిగిన యుద్ధంలో జాంబవంతుడు ఓడిపోగా జాంబవతితో సహా అతని వద్దనున్న శమంతకమణిని పరిగ్రహించాడు కృష్ణుడు.

**మిత్రవింద :** ఈమె శ్రీకృష్ణుని తండ్రి యొక్క సోదరి కుమార్తె. ఈమె తల్లి రాజాధిదేవి. అవంతి రాణి. ఈమె సోదరులు కౌరవుల స్నేహితులు. శ్రీకృష్ణుడు వారిని ఓడించి ఈమెను వివాహం చేసుకున్నాడు.

**భద్రాదేవి :** భద్రాదేవి కేకేయ రాజ కుమార్తె. ఈమె కూడా కృష్ణుణ్ణి ప్రేమించి స్వయంవరంలో వరించింది.

**సుదంతాదేవి :** పురాణాల ప్రకారం ఈమె త్రిభువన సౌందర్య రాశి. ఈ సుదంతాదేవినే సత్యకీర్తి దేవిగా కూడా పురాణాలు పేర్కొన్నాయి. ఈమె 'కోసల' దేశపు రాజకుమార్తె. ఈమె కూడా శ్రీకృష్ణుణ్ణి ప్రేమించి పెళ్ళాడినట్లు చెబుతారు.

**లక్ష్మణాదేవి :** ఈమెది కూడా ప్రేమవివాహమే. ఈమెది 'మద్ర'దేశం. మద్రదేశాధీశుడీమె తండ్రి. స్వయంవరంలో మత్స్య యంత్రాన్ని బేధించి కృష్ణుడు లక్ష్మణదేవిని వివాహం చేసు కున్నాడు.

శ్రీకృష్ణుడు ద్వారకాధిపతి. అటు బలవంతులైన పాండ వుల్లో అర్జునుడికి తన చెల్లెలు సుభద్రనిచ్చి, ఇటు బలవంతు లైన రాజుల కుమార్తెలను వివాహమాడి తన రాజ్యాన్ని సుస్థిరం చేసుకున్న రాజనీతిజ్ఞుడుగా శ్రీకృష్ణుని అష్టకల్యాణాల్ని చెప్పు కోవచ్చు.



# రామతత్త్వామృత కలశం - దాశరథీ శతకం

- డా॥ షేక్ మౌలాలీ

కంచర్లగోపన్న ప్రణీతమైన దాశరథీ శతకం ఒక విధంగా రామాయణానికి వ్యాఖ్యానమనవచ్చు. రామభక్తి పరవశుడైన గోపన్న రామదాసుగా వినుతికెక్కాడు. 'దాస' శబ్దం కైంకర్య ప్రధానమైంది. రామాయణమంతా తరచి చూస్తే ఆంజనేయుడు, లక్ష్మణుడు తమను రామునికి దాసులుగా చెప్పుకున్నారు. ఆంజనేయుడు 'దాసోహం కోసలేన్ద్రస్య, రామస్య అక్లిష్ట కర్మణః' అని రామునికి తన దాసత్వాన్ని ప్రకటిస్తే, లక్ష్మణుడు రాముడు తక్క తనకు మరేమీ అక్కరలేదంటాడు.

**న దేవలోకాక్రమణం నామరత్వమహం వృణే ।**
**ఐశ్వర్యం చాపి లోకానాం కామయే న త్వయా వినా ॥**

కనుకనే వారు స్వాములుగా, అనగా ఆంజనేయ స్వామి, లక్ష్మణస్వామిగా కీర్తింపబడుతున్నారు.

రామదాసు కూడా 'నీవే తప్ప యితఃపరం బెరుగ' అనే భావంతో శ్రీరాముని సేవించాడు; తన శతకంలో వివిధ రూపాలలో కీర్తించాడు; శ్రీరామ గుణగణ వైశిష్ట్యాన్ని వివరించాడు.

**అగణిత సత్యభాష, శరణాగత పోష, దయాల సజ్ఝరీ**
**విగత సమస్త దోష, పృథివీ సురతోష, త్రిలోకపూత కృ**
**ద్ధగనధునీ మరంద పదకంజ విశేష, మణిప్రభా దగ**
**ద్ధగిత విభూష భద్రగిరి దాశరథీ కరుణా పయోనిధీ!**

"రాముడు సత్యవచనుడు, శరణాగత వత్సలుడు, ఆశ్రితుల దోషాలను పారద్రోలువాడు, భూసురోత్తములను ఆనందింపజేయువాడు, త్రిలోకపావని గంగకు జన్మనిచ్చిన చరణారవిందములు కలవాడు" అని రాముని పై పద్యంలో కీర్తించాడు రామదాసు'

దాశరథీ శతక రచన వాల్మీకిననుసరించే సాగినట్లు తోస్తుంది. కావ్యారంభంలోనే వాల్మీకి రామచంద్రుని

**సత్యవాక్యో దృఢవ్రతః, సత్యే ధర్మ ఇవాపరః ।**
**స్మితపూర్వాభిభాషీ చ, సత్యవాదీ చ రాఘవః ॥**

ఇత్యాదిగా కీర్తిస్తాడు. కనుక రాముని రామదాసు 'అగణిత సత్యభాష' అన్నాడు.

ఇక శరణాగత వత్సలత విషయంలో -

**సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే ।**
**నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్ ॥**

అంటూ విభీషణుడు రాముని శరణువేడినప్పుడు, "నీవే దిక్కు నన్ను రక్షించు!" అని కోరినప్పుడు, "శత్రుపక్షం వాడయిన విభీషణుని తప్పక కాపాడుతాను, అతనిలో ఏవేని దోషాలు ఉన్నప్పటికీ రక్షిస్తాను. చివరకు రావణాసురుడు వచ్చి శరణు వేడినా సరే, దోషాలు ఎన్నక రక్షిస్తాను!" అని అభయప్రదానం చేస్తాడు రాముడు.

**మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన ।**
**దోషో యద్యపి తస్య స్యాత్ సతామేతదగర్హితమ్ ॥**

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ ॥**

**విభీషణో వా సుగ్రీవ! యది వా రావణస్స్వయమ్ ॥**

యజ్ఞసంరక్షణార్థం విశ్వామిత్రుని వెంట వెళ్ళినప్పుడు గోబ్రాహ్మణ సంరక్షణార్థం రాక్షస సంహారం చేస్తానంటాడు రాముడు - 'గోబ్రాహ్మణ హితార్థాయ!'. రామదాసు వస్తుతః భక్తుడు, కనుక రాముని ఇంకా అనేక రీతుల కీర్తించాడు.

**చక్కెర మాని వేము దినజాలిన కైవడి మానవాధముల్**
**పెక్కురు బక్క దైవముల వేమరుగొల్చెదరట్లుగాదయా**
**మ్రొక్కిన నీకు మ్రొక్కవలె మోక్షమొసంగిన నీవ యీవలెన్**
**తక్కిన మాటలేమిటికి దాశరథీ కరుణా పయోనిధీ!**

రామదాసు ఈ పద్యంలో కూడా రాముని 'మోక్షప్రదాత తత్త్వాన్ని' వివరించాడు; కైంకర్య భావనతో రాముని కీర్తిస్తాడు. రాముడు మోక్షప్రదాత సర్వలోకరక్షకుడని వాల్మీకి కథనం.

**రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా ।**
**రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా ॥**

కనుక రామదాసు "మ్రొక్కిన నీకు మ్రొక్కవలె, మోక్షమొసంగిన నీవ యీవలెన్!" అంటాడు. ఈ పద్యంలో రామతత్త్వం సంపుటీకరణ చెందింది. ఎందరో యోగులు, మహర్షులు ధ్యానమగ్నులై రామదర్శనంతో మోక్షప్రాప్తి నొందారు.

## రచయిత(త్రు)లకు విజ్ఞప్తి

**సప్తగిరి మాసపత్రికకు తమ రచనలు పంపే రచయిత(త్రు)లు ఈ కింది నియమాలు పాటించవలసిందిగా మనవి చేస్తున్నాం!!**

- రచనలు కాగితానికి ఒక వైపునే రాయాలి.
- రచన స్పష్టంగా, అర్థమయ్యేలా రాయాలి.
- రచనతో పాటు ఆ రచన తమ స్వంతమేననీ, మరే పత్రికకు పంపలేదనీ హామీ పత్రం జతచేయాలి.
- కలంపేరుతో రాసే రచయిత(త్రు)లు విధిగా తమ అసలు పేరు తెలియ పరచాలి.
- రచనలను తాము ఏ శీర్షికకు పంపుతున్నారో ఆ శీర్షిక పేరు రచన మీద, కవరు మీద రాయాలి.
- రచనల ఎంపిక, ముద్రణల విషయంలో ప్రధాన సంపాదకునిదే తుది నిర్ణయం. అందుకు సంబంధించి ఎలాంటి ఉత్తరప్రత్యుత్తరాలకు ఆస్కారం లేదు.
- మన దేవాలయాలు శీర్షికకు రచనలు పంపేవారు- **తప్పనిసరిగా ఆ దేవాలయ ఫోటోలు జత చేయవలసి ఉంటుంది.** ఈ శీర్షికలో ఫోటోలు లేని రచనలను ప్రచురించటానికి సాధ్యపడదు.
- **సంక్రాంతి, దీపావళి లాంటి పండుగలకు** సంబంధించిన రచనలు పంపేవారు కనీసం **మూడు నెలలకు ముందుగా** వారి రచనలు పంపవలసి ఉంటుంది.
- ప్రచురణార్హం కాని రచనలు తిప్పిపంపుటకు వారే తగిన స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జతచేయవలసి ఉంటుంది.
- ప్రచురించిన ప్రతి రచనకు తగిన పారితోషికం శ్రీవారి ప్రసాదంగా పంపుతాము.

మీ రచనలు పంపాల్సిన చిరునామా

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి మాసపత్రిక,**
**తి.తి.దేవస్థానములు, తిరుపతి - 517 083, చిత్తూరు జిల్లా.**

'అహమేవాహరిష్యామి సర్వాన్ లోకాన్ మహామునే!' అంటాడు రాముడు మహర్షులతో. జటాయువుకు మోక్షప్రదానం చేస్తూ "నా ఆజ్ఞగా ఉత్తమలోకాలకు వెళ్ళు!" అంటాడు.

'మదాజ్ఞా సమనుజ్ఞాతః గచ్ఛ లోకాననుత్తమాన్।' ఇంతటి మహత్తర తాత్త్వికరహస్యాలను మనకు ఒక పద్యంలో విశదపరచాడు కనుక గోపన్న రామదాసయ్యాడు.

'రామ'నామానికి చక్కని వివరణ ఇచ్చాడు రామదాసు.

**'రా' కలుషంబులెల్ల బయలం బడద్రోచిన 'మా' కవాటమై**
**దీకొని బ్రోచునిక్కమని, ధీయుతులెన్న దదీయ వర్ణముల్**
**గైకొని భక్తిచే నుడువగానరుగాక, విపత్పరంపరల్**
**దాకొనునే జగజ్జనుల దాశరథీ కరుణాపయోనిధీ!**

'రామ' అనే దివ్య నామంలోని 'ర'కారం పాపాలన్నింటిని బయటకు నెట్టగా, 'మ' అనెడి అక్షరం తలుపు వలె అడ్డుపడి, ఆ పాపములు తిరిగి మనలోకి రాకుండా చేసి ఆశ్రితులను నిజంగా రక్షిస్తుంది.

ఇక్కడ రామదాసు రామసాగరాన్ని మథించాడు. రామనామాన్ని గురించి వివిధ గ్రంథాలు బహుముఖాలుగా వ్యాఖ్యానించాయి. మానసపీయూష 'ర'కారం అగ్నిబీజంగా, 'అ'కారం సూర్యబీజంగా, 'మ'కారం చంద్రబీజంగా ఉండి 'రామనామం' త్రితాపశమనాన్ని కలిగిస్తుందని పేర్కొంది.

ఇలా దాశరథీ శతకం రామతత్త్వామృత కలశం. అట్టి కలశాన్ని మనకు ప్రసాదించాడు రామదాసు.

## శ్రీపదకేళి - 12 (మే - 2010)
## విజేతలు

1) **కె. తిరుమలాచార్యులు,**
ఇంటి నెం. 7-15-21,
లాయరుపేట,
ఒంగోలు - 523 002.
ప్రకాశం జిల్లా.

2) **ఎస్.వి. రమణశాస్త్రి,**
రిటైర్డ్ స్టేషన్ మాస్టర్,
ఇంటి నెం. 11/52 బి, మిద్దెపైన,
సుబ్బప్ప కాంపౌండు,
గుంతకల్లు.

3) **హరి రాధాకృష్ణన్,**
రిటైర్డ్ టీచర్,
ఇంటి నెం. 96, మిద్దెపైన
ప్రకాశం రోడ్డు,
తిరుపతి - 517 501.

**సరైన సమాధానాలు రాసినవారు :**

బి.రమాదేవి(ఒంగోలు); టి.శేషగిరిరావు (పీలేరు); యస్.రామ చంద్రయ్య(పీలేరు); డా॥సి.వి.కె.వై.శర్మ (గుంటూరు); కె.యస్. ఉమామహేశ్వరి(కుప్పం); జయసుధ (కుప్పం); పి.ఎన్. హరి నాథబాబు(తిరుపతి); ఏ. నారాయణదత్త (తిరుపతి); కె.శివ నాగేంద్రమ్మ (ఒంగోలు); ఏ.శ్రీహరి(కాణిపాకం); కె. గోపాలకృష్ణ పిళ్ళై(పాకాల); ఆర్.సత్యనారాయణరావు(భీమవరం); ఎం.చంద్ర శేఖర నాయుడు (మదనపల్లి); ఎస్.కృష్ణమోహన్ రావు (వెంకట గిరి); బి.విజయేంద్రవర్మ (రాజమండ్రి); పి.నరేంద్రకుమార్ (మహబూబ్‌నగర్);ఎ. శాంతకుమారి(కాకినాడ);కె.పరమేశ్వరుడు (అమరావతి);ఎస్.సుబ్రహ్మణ్యం(శ్రీశైలం);ఆర్.రామనాథంశర్మ (గుడివాడ); సి.నారాయణరావు(హైదరాబాద్);ఇ.సి.సుకుమార్ (కడప); ఎస్.సిద్ధులు(మహబూబ్ నగర్) ఎం.వెంకటసుబ్బారెడ్డి (ప్రొద్దుటూరు);ఎస్.సతీష్‌కుమార్(నగరి); బి.శశాంక్(చిత్తూరు); డి.నారాయణమ్మ(తెనాలి);టి.ఉత్తరకుమార్(రాజమండ్రి); జి.ఎ. కోదండరామయ్య(బళ్ళారి); వై.కామాక్షి(గుంటూరు); కె.జనార్ధన్ రెడ్డి (ఏర్పేడు); ఆర్.కె.సావిత్రి(శ్రీకాళహస్తి).




**నిబంధనలు :**

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్త రించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీ కరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందా దారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొన వచ్చు.

**బహుమతి వివరాలు :**

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అంద జేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపు తాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

**పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :**

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | ■ | 1 | | 2 | | | ■ | 3 |
| ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | |
| 4 | | ■ | 5 | | | ■ | 6 | |
| | ■ | 7 | ■ | | ■ | 8 | ■ | |
| 9 | | | | ■ | 10 | | | ■ |
| | ■ | | ■ | 11 | ■ | | ■ | 12 |
| 13 | | ■ | 14 | | | ■ | 15 | |
| | ■ | 16 | ■ | | ■ | 17 | ■ | |
| ■ | ■ | 18 | | | | | ■ | ■ |

# శ్రీపదకేళి - 14

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1)** పూరించిన వారి పూర్తి చిరునామా :

..................................................

..................................................

..................................................

..................................................

.................................... | | | | | | |

**2)** మీరు సప్తగిరి చందాదారులైతే?

అ) చందా నంబరు : ..................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..................................

..................................................

..................................................

..................................................

..................................................

.................................... | | | | | | |

**ఆధారాలు**

## అడ్డం

**1)** పదికంఠములు కలవాడు (5)

**4)** కొండను ఇలా కూడా అంటారు (2)

**5)** ఇదొకరాగం (3)

**6)** బ్రహ్మ (2)

**9)** ఇదొక యోగాసనం (4)

**10)** పరశురాముడి తల్లి (3)

**13)** సుగ్రీవుడి భార్య (2)

**14)** ఆలయశిఖరాన్ని ఇలా కూడా అంటారు (3)

**15)** పాము (2)

**18)** సర్వము వ్యాపించి ఉన్నవాడు (5)

## నిలువు

**1)** ఇది లేనిదే దధ్యోదనం అనే పదార్థం లేదు (2)

**2)** శంఖము చేతియందు కలవాడు (4)

**3)** దేవతల వైద్యుడు (4)

**4)** కుబేరుని కుమారుడు (6)

**7)** ఇది ఎవరికీ చేయకూడదు (3)

**8)** ద్రుపదుడి స్నేహితుడు (3)

**11)** నైపుణ్యము–'త'కారాంత శబ్దము (4)

**12)** శ్రీమన్నారాయణుడు ఈ అవతారమెత్తి అమృతాన్ని దేవతలకు పంచాడు (3)

**16)** 'ఆశ'కు వికృతి (2)

**17)** దరిద్రము (2)

**—:: *శ్రీపదకేళి–12* (మే, 2010) సమాధానాలు ::—**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | ■ | 1 భా | గ్య | 2 న | గ | 3 రం | ■ | ■ |
| ■ | ■ | ర్య | ■ | లు | ■ | భ | ■ | ■ |
| 4 ప | క్ష | ■ | 5 ఉ | డు | త | ■ | 6 క | 7 పి |
| రా | ■ | 8 సా | ■ | ■ | ■ | 9 క | ■ | ల్ల |
| 10 వి | శ్వా | మి | త్రు | డు | ■ | 11 పో | త | న |
| ద్ధ | ■ | త్రి | ■ | ■ | ■ | తం | ■ | గ్రో |
| 12 డు | టే | ■ | 13 అ | 14 భ్ర | ము | ■ | 15 ర | వి |
| ■ | ■ | 16 కా | ■ | మ | ■ | 17 పా | ■ | ■ |
| ■ | ■ | 18 న | వ | ర | త్నా | లు | ■ | ■ |



# జూలై, 2010 రాశి ఫలాలు



– జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో వృథాశ్రమ, దీర్ఘ ఆలోచనలు పలు ఇబ్బందులకు గురిచేస్తాయి. చేసే వృత్తి వ్యాపారాల్లో అధికారుల ఒత్తిడి అధికం కావటం వల్ల విద్యా, బ్యాంకు, రెవెన్యూ ఉద్యోగులకు కష్టకాలం. మొదటివారం అనారోగ్యం, రెండోవారం వృథాశ్రమ, మూడోవారం ఒత్తిడి, నాలుగోవారం ధనప్రాప్తి.



## వృషభ రాశి

ఈ రాశివారికి ఈ నెలలో రవి సంచారంలో వృథా ప్రయాణం, అతి ఆలోచనలు కల్గుతాయి. పలు దైవక్షేత్ర దర్శనాల వల్ల కొత్తమిత్రుల పరిచయం ఆనందాన్నిస్తుంది. ఆకస్మిక ధనాదాయం, శుభవార్తా శ్రవణం మానసికానందాన్నిస్తాయి. మొదటివారం స్వల్ప అనారోగ్యం, రెండోవారం ఆనందం, మూడోవారం ధనాదాయం, నాలుగోవారం శుభవార్త.



## మిథున రాశి

ఈ మాసంలో వీరికి ధనం విపరీతంగా ఖర్చు, వృథా ప్రయాణాలు ఆందోళన కల్గిస్తాయి. పిల్లల విద్యాభివృద్ధికి విపరీతంగా డబ్బు ఖర్చుచేస్తారు. మొదటివారం క్షేత్రదర్శనం, రెండోవారం అధికవ్యయం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం ఆందోళన.



## కర్కాటక రాశి

ఈ మాసంలో వీరికి అనారోగ్యం. నమ్మిన వ్యక్తుల వల్ల పలు ఇబ్బందులు కల్గుతాయి. అవివాహితులకు వివాహ ప్రయత్నాలు అనుకూలం. సాహితీ రంగ ప్రముఖులకు, హరికథ కళాకారులకు శుభవార్తా శ్రవణం. మొదటివారం ఆనందం, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ఇబ్బందులు, నాలుగోవారం సత్కారం.



## సింహ రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో ఆలోచనలు, ఆచరణలో పెట్టడం వల్ల సంతృప్తి చెందుతారు. సుదీర్ఘ ప్రయాణాల వల్ల పలు అనారోగ్య సమస్యలు ఏర్పడుతాయి. శత్రువుల నుండి అపనిందలు, ఆపదలు కలిగే అవకాశం ఉంది. మొదటివారం ఆధ్యాత్మిక చింతన, రెండోవారం కార్య జయం, మూడోవారం విజయం, నాలుగోవారం వృథాశ్రమ.



## కన్యా రాశి

ఈ రాశివారికి ముఖ్యమైన పనులు అసంపూర్తిగా పూర్తవుతాయి. అన్నదమ్ముల రాక ఆనందాన్ని, సంతోషాన్ని ఇస్తుంది. దైవదర్శనం మేలు చేస్తుంది. కొత్త మిత్రుల పరిచయం మానసిక పరిస్థితిని మార్చేస్తుంది. మొదటివారం ప్రయాణాలు, రెండోవారం భయాందోళనలు, మూడోవారం కార్య జయం, నాలుగోవారం వస్తుకొనుగోలు.



## తులా రాశి

ఈ రాశివారికి ముఖ్యమైన పనులు వివాదాలతో పూర్తవుతాయి. తల్లిదండ్రుల పట్ల చులకన భావం ఏర్పడుతుంది. విలువైన డాక్యుమెంట్లు, ఆభరణాలు దొంగతనానికి గురి అవటం వల్ల మానసికాందోళనకు గురై అనారోగ్యం కల్గుతుంది. మొదటివారం ఆందోళన, రెండోవారం ఆనందం, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం అపహరణ.



## వృశ్చిక రాశి

ఈ మాసంలో వీళ్ళకు విద్యావకాశాలు, నూతన ఉద్యోగ ప్రయత్నాలు, అనుకూలం. మిత్రుల ఆలోచనలు వీరికి మానసిక ఉత్సాహాన్ని కల్గిస్తాయి. చేసే వృత్తి వ్యాపారాల్లో ఆశించిన ఫలాలు దక్కుతాయి. నోటికి సంబంధించిన వ్యాధులు ఇబ్బంది పెడతాయి. మొదటివారం ఉత్సాహం, రెండోవారం ఆందోళన, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం కార్య విఘ్నం.

## తిరుమలలో యాత్రికులు చేయకూడనివి

- ☒ విలువైన ఆభరణాలు, ఎక్కువ డబ్బు మీ వద్ద ఉంచుకోకండి.
- ☒ ఆలయంలోకి సెల్‌ఫోన్, కెమెరా వంటి పరికరాలను తీసుకువెళ్ళకండి. ఆయుధాలను తీసుకురాకండి.
- ☒ ఏ విధమైన మత్తు పదార్థాలు సేవించకండి. పొగత్రాగకండి.
- ☒ వసతి సౌకర్యం కోసం అపరిచితులను ఆశ్రయించకండి.
- ☒ ఆలయ పరిసరాల్లో పాదరక్షలు ధరించకండి.
- ☒ శ్రీవారి సులభ దర్శనంకోసం దళారీలను ఆశ్రయించకండి.
- ☒ ఆలయంలో సాష్టాంగ దండ ప్రణామాలు చేయకండి.
- ☒ వీధి వర్తకుల నుంచి నకిలీ ప్రసాదాలు కొనకండి.
- ☒ శ్రీవారి దర్శనం కోసం కాకుండా వేరే ఇతర ఉద్దేశాలతో తిరుమలకు రాకండి.
- ☒ శ్రీవారి దర్శనం కోసం త్వరపడకండి. క్యూలో మీవంతు వచ్చే వరకు ఆగండి.
- ☒ ఆలయ ప్రాంగణంలో ఉమ్మివేయటం వంటి అసహ్యకరమైన పనులు చేయకండి.
- ☒ ఆచార వ్యవహారాల ప్రకారం ఆలయార్హత లేని సందర్భాలలో ఆలయంలోకి రాకండి.
- ☒ తిరుమలలో పువ్వులు పెట్టుకోకండి. పువ్వులన్నీ శ్రీవారి పూజకే.
- ☒ భిక్షకులను ప్రోత్సహించకండి. పరిసరాలను అపరిశుభ్రం చేయకండి.
- ☒ అపరిచితులను కాటేజీలలోనికి అనుమతించకండి, గది తాళాలు ఇవ్వకండి.
- ☒ నీరు, కరెంటు వృథా చేయకండి.
- ☒ మాంసాహారాన్ని భుజించకండి.



### ధనూ రాశి

ఈ రాశివారికి ఈ నెలలో ఆర్థికబలం, బుద్ధిబలం, బంధుమిత్రుల సహకారం వల్ల ఆర్థిక పరిస్థితి నుండి మానసిక ప్రశాంతత లభిస్తుంది. ప్రయాణాలు వాయిదాపడతాయి. మొదటివారం ధనలాభం, రెండోవారం భయాందోళనలు, మూడోవారం దైవచింతన, నాలుగోవారం ఆనందం.



### మకర రాశి

ఈ నెలలో ఈ రాశివారికి గతంలో చేసిన పొరపాట్లు గ్రహపాటుగా మానసిక వేదనకు గురిచేస్తాయి. ప్రతి పనిలో అవరోధాలు ఉంటాయి. నిదానంగా పనులు పూర్తవుతాయి. తొందరపాటు వద్దు. మహిళలు చేసే పూజలు మంచి ఫలితాన్నిస్తాయి. మొదటివారం వాహన ప్రమాదం, రెండోవారం అధిక ఒత్తిడి, మూడోవారం ఆటంకాలు, నాలుగోవారం ఆనందం.



### కుంభ రాశి

ఈ మాసంలో వీరు పలు శుభవార్తలు వింటారు. చేయు వృత్తి వ్యాపారాలయందు ధనాదాయం. వెండి, బంగారు వర్తకులకు ప్రభుత్వ ఆదేశాలు ఆందోళన కల్గిస్తాయి. విద్యార్థుల ఉన్నత చదువులకై డబ్బు విపరీతంగా ఖర్చు చేయవలసి వస్తుంది. మొదటివారం ధనాదాయం, రెండోవారం అనారోగ్యం, మూడోవారం వస్తుకొనుగోలు, నాలుగోవారం ఆనందం.



### మీన రాశి

ఈ నెలలో వీరు తొందరపాటుతో కష్టాలు కొని తెచ్చుకుంటారు. చిన్ననాటిమిత్రుల ఆర్థిక సహకారంవల్ల ఆర్థిక సమస్యలు తీరినా, అనారోగ్య సమస్యలు ఇబ్బంది పెడతాయి. విద్యార్థులు పరీక్షల్లో విజయం సాధిస్తారు. ధనాదాయం వల్ల వ్యాపారాలు అభివృద్ధి చెందుతాయి. మొదటివారం స్థిరాస్థిలాభం, రెండోవారం వస్తు కొనుగోలు, మూడోవారం రాజకీయయోగం, నాలుగోవారం ఆనందం.

# సాకార స్వప్నం

– డా॥ ధూర్జటి వేంకట బాలాజి




1986లో మా యాజమాన్యంవారు నన్ను కావలి ఎ.బి.యం. కళాశాల నుండి కర్నూలు కోల్స్ మెమోరియల్ జూనియర్ కాలేజికి బదిలీ చేశారు. కుటుంబం కావలిలో, నేను కర్నూలులో. కర్నూలు కావలి మధ్య బస్సు ప్రయాణాలు చేస్తున్నాను. 1986–87 విద్యాసంవత్సరంలో ఎక్కువ భాగం 'మెడికల్ లీవు' పెట్టాను. తిరిగి కావలికి రావడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాను. ఫలితం శూన్యం.

1987, ఆగష్టు 8వ తేదీన కూడా కొన్ని బదిలీలు జరుగుతాయనే దృఢ విశ్వాసంతో, అప్పుడైనా నాపని అవుతుందనే నమ్మకంతో కర్నూలు నుండి కావలికి వచ్చాను. అనుకున్న ప్రకారం నెల్లూరుకు ఉదయాన్నే వెళ్ళాను. బదలీ కోరుకునే వాళ్ళందరూ వచ్చారు. ఉదయం నుంచి సాయంత్రం వరకు వేచి ఉంటే ఏవో కొన్ని బదిలీలు అయ్యాయి. నాది కాలేదు. ఇక జరగదనే నమ్మకంతో కావలికి తిరిగి వచ్చేశాను. మనసంతా బాధగా ఉంది. చేసేదిలేక భారంగా నిద్రపోయాను.

నిద్రలో మంచి స్వప్నమొచ్చింది. ఆ కలలో పెద్ద వేంకటేశ్వరస్వామి విగ్రహం కన్పించింది. అంత విగ్రహాన్ని నేనెప్పుడు చూడలేదు. "చేయిపట్టు... పట్టు" అని అంటున్నాడు. చేతులు రెండూ జోడించి స్వామికి దణ్ణం పెడితే చేతినిండా స్వామి ప్రసాదం పెట్టాడు. ఆ ప్రసాదం కూడా శనివారం రోజు తిరుపతికి వెళ్ళి వచ్చిన తర్వాత మన ఇళ్ళల్లో తయారు చేసుకునే ప్రసాదం (బియ్యపు పిండి, బెల్లం, కొబ్బరి ముక్కలు కలిపి తయారు చేసింది).

స్వామి ప్రసాదం పెట్టే సమయంలో మా కాలేజి క్లర్కు కూడా ఉన్నాడు. శనివారం నాడు చేసిన బదిలీలో ఆయన బదిలీ కూడా ఉంది. అంతకు ముందు అరవై బదిలీల్లో ఆయన్ను కూడా ఒంగోలుకు బదిలీ చేశారు. అటువంటి క్లర్కును శనివారంనాడు తిరిగి కావలికి వేశారు. ఆయనొక్కడే అక్కడున్నాడు.

దీన్ని బట్టి నాకర్థమైందేందంటే, స్వామి ప్రసాదం పెట్టినప్పుడు ఆ క్లర్కు అక్కడే ఉన్నాడు కాబట్టి, ఆయన లాగే నాకూ జరుగుతుందనే విషయం అర్థమైంది. లేకపోతే ఆయన ఉండవలసిన అవసరం లేదు కదా!

ఇదే విషయం పక్కరోజు విష్ణ్వాలయంలోని పూజారిని అడిగితే, ముందురోజు శ్రావణ పూర్ణిమ కాబట్టి "నీ కోరిక తప్పక నెరవేరుతుందని" చెప్పాడు. తర్వాత ఎన్నో ఒడుదుడుకులు జరిగాయి. కానీ, 1989, జూలై 24వ తేదీ కర్నూలు నుండి కావలికి బదలీ అవడానికి బదులుగా ఒంగోలుకు బదలీ అయ్యాను.

మా కులదైవం శ్రీ వేంకటేశ్వరుడే! భగవంతుడు ఏ రూపంలో ఎలా సాక్షాత్కరిస్తాడో తెలీదు. ఆయన సర్వాంతర్యామి కదా!

చిట్టచివరకు 1990 జూలై 20వ తేదీన తిరిగి నా స్వస్థానమైన కావలికి బదలీ వచ్చింది. భక్తుల పాలిటి కల్పద్రుమం, ఆపదమొక్కులవాడు, అనాథ రక్షకుడైన ఆ వేంకటేశ్వరుడే స్వప్నం ద్వారా నా కోరికను నెరవేర్చాడు.

**ఎందుకు తలనీలాలు సమర్పించడం?**

**తీర్థోపవాసః కర్తవ్యః శిరసో ముండనం తథా ।**
**శిరోగతాని పాపాని యాన్తి ముండనతో యతః ॥**
**(పద్మపురాణం 237.45)**

తీర్థక్షేత్రంలో ఉపవాసం చెయ్యాలి. తలనీలాలు తీయించుకోవాలి. అలా తలనీలాలు తీయించుకుంటే శిరస్సులో ఉన్న పాపాలు నశించిపోతాయి. అహంకారం తగ్గిపోయి, అశాశ్వతమైన శరీరంపైన మమకారం తగ్గిపోతుంది.




**ధారావాహికం - 90**

(నాలాయిరం అంటే పన్నిద్దరాళ్వారులు రచించిన నాలుగు వేల తమిళ పాశురాలు. భగవత్సాన్నిధ్యంలో వీటిని పాడి స్వామికి సమర్పించడం అధ్యయనోత్సవం. దీన్ని శ్రీరంగంలో అతి పెద్ద ఉత్సవంగా ఇప్పుడు కూడ జరిపించడం విశేషం. తిరుమలలో రామానుజాచార్యులు ప్రవేశపెట్టిన ఉత్సవాల్లో ఇది ఒకటి.)

## అధ్యయనోత్సవం

ఇక ఆరవది- దేవాలయాలలో నిర్వహించే అధ్యయనోత్సవం స్వామివారి పూజాదికార్యక్రమంలో ఒక భాగంగా రామానుజులవారు ప్రవేశపెట్టిన నూతన కార్యక్రమం. రామానుజులవారు ఈ కార్యక్రమానికి అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చారనడంలో సందేహంలేదు. ఆళ్వారులు రచించిన భక్తి సాహిత్యం తమిళంలో **నాలాయిర దివ్య ప్రబంధం**గా సుప్రసిద్ధం. సంస్కృతవేదానికి దీటుగా తమిళులు తమ నాలాయిర దివ్యప్రబంధాన్ని ద్రావిడ వేదంగా పరిగణిస్తారు. అటువంటి మహనీయులైన ఆళ్వారుల జ్ఞాపకార్థం అధ్యయనోత్సవాన్ని నిర్వహించడం ఒక సముచితమైన మార్గంగా రామానుజులవారు భావించి ఉంటారు.

కనుకనే, రామానుజులవారు వైష్ణవదేవాలయాలలో ప్రతిదినం, మరియు అధ్యయనోత్సవం సందర్భాలలోను ఇరవై లేక ఇరవై అయిదురోజుల పర్యంతం ప్రబంధాలలోని (పాశురాల్లోని) వివిధభాగాలను గానంచేసే పద్ధతిని ప్రవేశపెట్టారు. వేద వాఙ్మయం సంస్కృతభాషలో ఉండడం వలన సాధారణ మానవులకు అర్థం కాకుండా ఉన్న కారణాన్ని గ్రహించి, అట్టివారికి కూడ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని, ఆముష్మిక చింతన జ్ఞానాన్ని లభింపజేయగోరినవాడై, దేవాలయాలలో జరుపబడుచున్న వేదపఠనానికి దీటుగా తమిళ ప్రబంధపఠనాన్ని ఏర్పాటు గావించారు. ఈ విధంగా ఆముష్మిక చింతనాజ్ఞానాన్ని కులమతభేదానికి అతీతంగా అందరికీ అందుబాటులోకి వచ్చునట్లు చేశాడు. జన సామాన్య భాష అయిన తమిళంలో ఉండడం వల్ల ప్రబంధము అందరు సులభంగా అర్థం చేసుకోగలుగుతారు. అందువల్ల సామాన్య మానవుడు కులమత భేదాలకు అతీతంగా జ్ఞాన సముపార్జన చేసుకునే హక్కు న్యాయసమ్మతమైనదే అని నిరూపించబడింది.

సంగ్రహంగా చెప్పాలంటే రామానుజులవారు జీవిత కాలంలో వారు చేసినపనులు అనంతర కాలంలో కూడా ఆలయంలో ఒక క్రమపద్ధతిలో కొనసాగాయి. ఆలయ కార్యకలాపాలు ఒక క్రమపద్ధతిలో సక్రమంగా జరిగేటట్లు చేయడానికి శాస్త్రోక్తంగా నియమావళిని సూత్రీకరించాడు. దైవానికి సమర్పించే సమర్పణల విషయాలలో అనుసరించవలసిన విధానం గురించి, షరతులతో కూడిన ఆధారద్రవ్యదానం స్వీకరించే విషయంలో అనుసరించాల్సిన పద్ధతులను సూత్రీకరించాడు. రామానుజులు తన సిద్ధాంతాల వ్యాప్తికోసం శిష్యులను, వారి సంతతిని అనేక వైష్ణవకేంద్రాలలో ఆచార్యపురుషులు అన్న పేరుతో వ్యవస్థకు లోబడి ఉండే సిబ్బందిగా నియమించాడు. అట్టివారిలో తిరుపతిలో ఆనందంపిళ్ళై కుటుంబం (శాసనం సంఖ్య 224 - తి.తి మరియు 233-తి.తి.) కందాడై (శాసనం సంఖ్య 3-టి.టి. మరియు 61-జి.టి.) తోలప్పర్ (శాసనం సంఖ్య 98-జి.టి.), ప్రతివాది భయంకర (శాసనం సంఖ్య

63-జి.టి.), పరవస్తు (శాసనం సంఖ్య 203-జి.టి.) మొదలైన కుటుంబాలవాళ్లు ఉన్నారు. చివరిగా ప్రఖ్యాత వైష్ణవ దేవాలయాలలో కొందరు ఏకాంగులను సహాయకులుగాను, సేవకులుగాను నియమించే ఏర్పాటు చేశాడు.

**9) పల్లవుల కాలంనుండి విజయనగర రాజులకాలం వరకు దేవాలయపరిస్థితి :**

విగ్రహప్రతిష్ఠానంతరం ప్రధానమైనది నిత్యదీపం. ఆరాధకునికి స్వామి ముఖం స్పష్టంగా కనిపించడానికి దీపం వెలుతురు కావాలి. స్వామి సన్నిధిలో వెలుతురుండటం సాంకేతికం కూడ. అందువల్లే నిత్యదీపం. ఆహార నైవేద్యం సమర్పించేందుకు; పూజించేందుకు పుష్పాలు అవసరం. శాసనం సంఖ్య 1. (తిరుమల తిరుపతి దేవస్థాన శాసన సంపుటి 1-219-జి.టి.)ఉలగపెరుమానార్, తిరువిళన్ కోయిల్ పెరుమానాడిగళ్ ఎదుట దీపాన్ని వెలిగించేందుకు 30 కళంజుల బంగారాన్ని చెల్లించాడు. శాసనం సంఖ్య 2 (తి.తి. దేవస్థాన శాసన సంపుటి1లో 223-జి.టి.) పల్లవ చక్రవర్తియైన విజయదంతి విక్రమవర్మ పరిపాలనాకాలంలో శియగన్ లేక శియగంగన్ అనునతడుకూడ స్వామి ఎదుట దీపాన్ని వెలిగించేందుకు ఏర్పాటు చేశాడు. పల్లవరాణి సామవై స్వయంగా తిరుమల ఆలయంలో స్వామి రజత విగ్రహాన్ని మనవాళ పెరుమాళ్ అనే పేరున ప్రతిష్ఠించి దానిఎదుట దీపాన్ని వెలిగించే ఏర్పాటు చేసింది. శాసనం సంఖ్య12(తి.తి. దేవస్థాన శాసన సంపుటి 1-232-జి.టి.)లో కొడుంగోలూరాన్ (సంఖ్య 13లో) ఏర్పాటు చేసినట్లు తెలుపుతున్న దీపం కూడా వేంకటేశ్వర స్వామికోసమేనని తెలుస్తోంది. ఈ విధంగా 14వ శతాబ్దం వరకూ, దైవసన్నిధిలో 40దాకా అఖండదీపాలను వెలిగించిన సందర్భాలు ఉన్నట్లు తెలుస్తున్నది. శాసనం సంఖ్య 19 (తి.తి. దేవస్థాన శాసన సంపుటి 1-20 టి.టి.) తెలుపుతున్న ప్రకారం తిరుముండియం గ్రామ సభైయారు (పంచాయితీ వారు) బాధ్యత మీద శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయమందు ఒక హారతి కర్పూర దీపంతో చేరి మొత్తం మీద 24 దీపాలను వెలిగించేందుకు ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నారు. కానీ ఈ ఒప్పందాన్ని ఉల్లంఘించి, హారతి కర్పూరదీపంతో చేరి రెండు

> **మంచి నడవడికతో తండ్రిని**
> **సంతసింపచేసేవాడే నిజమైన కొడుకు.**
>
> **భర్త హితము కోరేదే**
> **నిజమైన భార్య.**
>
> **ఆపత్కాలంలోనూ, సుఖ సమయంలోనూ**
> **సమానంగా ప్రేమ చూపేవాడే**
> **నిజమైన మిత్రుడు.**
>
> **ఈ ముగ్గురూ లోకంలో**
> **పుణ్యం చేసిన వాళ్ళకే లభిస్తారు.**

దీపాలను మాత్రమే వెలిగింపబడుతూ వచ్చింది. మిగిలిన 22 దీపాలు వెలిగించలేదు. కావున ఒప్పందాన్ని ఉల్లంఘించడం జరిగిందని ఫిర్యాదు చేయడం జరిగింది. ఈ ఫిర్యాదును విచారించేందుకుగాను ఈ ప్రాంతపు పరిపాలనాధికారి (గవర్నర్), రాజ్యపాలనకు ప్రధానకేంద్రాలలో ఒకటియైన తిరుచానూరులో సర్కారు నిర్మించిన భవన సముదాయంలో ముందు భాగాన న్యాయస్థానాన్ని సమావేశపరచడం జరిగింది. తిరుముండియం సభ వద్ద నిలువ ఉంచిన బంగారం వినియోగించి ఒప్పందం ప్రకారం 24 దీపాలను వెలిగించవలసిందిగా తీర్పు నిచ్చాడు. దేవాలయానికి 6 ఇత్తడి దీపస్తంభాలు దానం చేయబడినట్లు శాసనం సంఖ్య 123న ప్రస్తావించబడినది. మరియు నాలుగు అఖండ దీపాలు వెలిగించేందుకు ఏర్పాటుకు (శాసనం సంఖ్య 132) దానం చేయబడింది. ఇంతవరకు జరిగిన వైనాన్ని గమనించినట్లయితే శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయంలో వలసినంతటి పెద్దమొత్తంలో దీపాల ఏర్పాటు జరిగినట్లు తెలుస్తుంది.

ఇక ఆహారనైవేద్య సమర్పణకు ఏర్పాటు గావించినట్టు తెలిపే కొన్ని ప్రాచీన శాసనాధారాలు ఉన్నాయి. ముఖ్యంగా బాణరాజు విజయాదిత్యుడు [ శాసనం సంఖ్య 4, సంపుటి-1], గంగైగంగన్ రణసింగన్ [శాసనం సంఖ్య 5, సంపుటి-1], శాసనం రాణి సామవై [శాసనం 8,9, సంపుటి-1] తగు ఏర్పాట్లు గావించినట్లు తెలుస్తోంది. మొదటి కులోత్తుంగని

## పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు
# మహాపరాధం

**అన్యక్షేత్రే కృతం పాపం**
**పుణ్యక్షేత్రే వినశ్యతి**
**పుణ్యక్షేత్రే కృతం పాపం**
**బ్రహ్మలోకే న నశ్యతి**

**ఇతర క్షేత్రాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్రంలో నశిస్తుంది. కానీ పుణ్యక్షేత్రంలో చేసిన పాపం బ్రహ్మలోకానికి వెళ్ళినా నశించదు. కావున, పుణ్యక్షేత్రంలో ఆత్మహత్యాది పాపాలు చేయరాదు.**

**ఆత్మహత్య అనేదే మహాపాపమని మన పురాణాలు చెపుతున్నాయి. అలాంటి ఆత్మహత్యలు పుణ్య క్షేత్రాల్లో చేసుకుంటే ఆ పాపం తమకే కాకుండా తమ వంశానికంతా చుట్టుకుంటుందని ఋషులు ఘోషించారు. కాబట్టి భగవంతుని సన్నిధిలో సత్కార్యాలు చేస్తే వాటి ఫలితం శతాధికంగా ఉన్నట్లే ఆత్మహత్యల్లాంటివి చేసుకుంటే స్వర్గప్రాప్తి సిద్ధించకపోగా, ఆ పాప ఫలం తరతరాలు పట్టి పీడిస్తుంది. కాబట్టి పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు చేసుకోవద్దు. భగవద్దర్శనంతో ఆత్మానందాన్ని, మనోధైర్యాన్ని పొందండి.**

రాణి స్వామివారికి పాలు, పెరుగు సమర్పించే ఏర్పాటు [శాసనం సంఖ్య 27, సంపుటి-1] చేసింది. తరువాతి కాలంలో ధనిష్ఠ నక్షత్రయుక్త దినాన ముదల్ సంధి [శాసనం సంఖ్య 155, సంపుటి-1] మరియు సితగరగన్డన్ సంధి [శాసనం సంఖ్య 102, సంపుటి -1] రూపంలో, ఇంకా తిరుమంతిర తిరుబ్బోనకం [శాసనం సంఖ్య 82, సంపుటి-1] రూపంలో, ప్రసాద నైవేద్యాలు సమర్పించే ఏర్పాటు గావించబడినాయి. అయినప్పటికీ 13వ శతాబ్దంలో ఒక కాలంలో నైవేద్య సమర్పణకు చాలినంతగా నిధులు సమకూడని కష్టపరిస్థితి ఏర్పడి నందున కాబోలు దేవాలయ స్థానత్తార్లు దేవాలయ పరిస్థితిని వివరిస్తూ, భూదానరూపంలో తగినంత ఆదాయం లభించే ఏర్పాటు చేయమని రాజుకు మొరపెట్టుకున్నాడు. రాజు తిరుకాలత్తిదేవ యాదవరాయలు ఈ అభ్యర్థనను పరిశీలించి తన 19వ సంవత్సర పరిపాలనా కాలంలో [శాసన సంపుటి-1, క్రీ.శ.1209-10, శాసన సంఖ్య 81, సంపుటి-1] అందులకు సమ్మతించి కుడవూర్ గ్రామాన్ని పూర్తిగా దేవదాన గ్రామం గావించి దేవాలయానికి ఆ గ్రామంనుండి స్థిరంగా ఆదాయం వచ్చే విధంగా ఏర్పాటు గావించాడు. స్థానత్తారు కోరినవిధంగా శాసనం సంఖ్య43 (శాసనసంపుటి-1) క్రీ.శ.1254సం॥లో భూమిని చట్టరీత్యా దేవాలయానికి ధారాదత్తం గావించాడు. దేవాలయానికి చేసిన అనేక భూదానాల గురించి, గ్రామాలను సర్వమాన్యంగా చేసి దేవాలయానికి ధారాదత్తం గావించిన సందర్భాల గురించి కూడ అనేక శాసనాలు మనదృష్టికి వచ్చాయి. ప్రాచీన కాలాన కావేరినదికి దక్షిణప్రాంతంలో ధారాదత్తం గావించిన గ్రామాలు తిరిగి పునరుద్ధరించబడి 13వ శతాబ్దం మధ్య కాలంలో మొదటి జటావర్మ సుందరపాండ్యునిచే స్థిరీకరించబడినాయి. యాదవరాయలు తిరుపతి పట్టణం, దానికి సమీపంలోఉన్న అరడజను గ్రామాలను దేవాలయానికి ఆధారద్రవ్య దానాలుగా బహూకరించాడు. వేంకటాచల పర్వత ప్రాంత అడవులు అనేక రకాల చెట్లతో నిండి ఉన్నప్పటికీ ఇక్కడ లభించే పుష్పాలు బహుశః పూజకు ఉపయోగపడనివై ఉండడం చేతనే కాబోలు కొందరు భక్తులు స్వయంగా పూదోటలను పెంచడం ప్రారంభించి, శ్రీ వేంకటేశ్వర స్వామివారికి ప్రతి రోజు పూజకు, మరియు ప్రత్యేక సందర్భాలకునూ, ఉత్సవాల సమయం లోనూ దేవాలయ అలంకరణార్థం వలసినంత పెద్ద మొత్తంలో పుష్పాలను సమకూర్చి ఉంటారు. కొందరు యజమానులు ఈ పూదోటలలో చల్లని నీడ కోసం, విశ్రాంతి కోసం మండపాలను కట్టించి ఉంటారు. ఉత్సవ సమయాల్లో స్వామివారు ఊరేగే టప్పుడు తమ నందన వనాల్లోని మండపాల్లో స్వామిని

ఆహ్వానించి అచట వేంచేపు చేసి తిరుబ్బోనకం (బియ్యం, పెసలు చేర్చి ఉడికించి, మిరియాలు, ఉప్పు చేర్చి తయారు చేయబడిన పదార్థం) మరియు అప్పం (బియ్యపు పిండి, బెల్లం కలిపి నేతిలో ఉడికించి తయారు చేసిన తీపి రొట్టె)స్వామికి నైవేద్యం పెట్టి ఆ ప్రసాదంలో కొంతభాగం ఆ సమయంలో అక్కడకు చేరిన భక్తులకు వితరణ చేసి, మిగతాభాగం కార్యనిర్వాహకులు, దేవాలయ సేవక పరిజనం పంచుకొనేవారు. ఈ విధమైన పంపకం పద్ధతికి **తిరువోలగం వితరణ** అంటారు.

రాణిసామవై ప్రారంభించిన రెండు ఉత్సవాలలో భాద్ర పద మాసోత్సవం ఈ రోజు కూడ జరుగుతోంది. కానీ రెండవ ఉత్సవం మార్గశిర మాసోత్సవం ఈనాడు ఆచరణలో ఉన్నట్లు లేదు. 13వ శతాబ్దం మూడవ పాదంలో ప్రకటించిన శాసనం సంఖ్య 111-టి.టి.లో శ్రీ వేంకటేశ్వర స్వామికి భాద్రపదమా సోత్సవాన్ని గురించిన ప్రస్థావన ఉంది. కాగా శాసనం సంఖ్య 652-టి.టి. మరియు119-టి.టి.శాసనాలలో భాద్రపదం, చైత్రమాసాలలో జరుపుతున్న ఉత్సవాల ప్రస్తావన ఉంది. తిరు వేంకటనాథ యాదవరాయలు తన 9వ పరిపాలనా సంవత్సర కాలంలో (క్రీ.శ.1330) ఒక నూతన ఉత్సవం జరిపేందుకు తగు ఏర్పాటు గావించి, అందుకోసం పొంగలూరు గ్రామంలో అర్ధభాగం మీద విధించే సుమారు 40 రకాలపన్నుల వసూళ్లను పరిహరించి, సర్వమాన్యంగా చేసి దేవాలయానికి దానం చేశాడు. ఈ విషయం శాసనం సంఖ్య 125-జి.టి. తెలుపు తోంది. తెలిసినంత వరకు 14వ శతాబ్దం పూర్వార్ధం నాటికి శ్రీ వేంకటేశ్వర స్వామికి సంవత్సరంలో మూడు ఉత్సవాలు జరుపబడుచున్నట్లు తెలుస్తున్నది.

ఈ మూడు ప్రధాన ఉత్సవాలే గాక, ఇంకనూ ధ్వజ స్తంభంపై గరుడచిహ్నాంకల జెండా ఎగురవేస్తూ తిరుక్కొడి తిరు నాళ్ మరియు అటువంటి మరికొన్ని ఉత్సవాలు నిర్వహింప బడుతుండేవి. క్రీ.శ.1360 సంవత్సరం ప్రాంతంలో ప్రకటించిన శాసనం సంఖ్య 337-టి.టి.లో వసంతోత్సవం గురించిన ప్రస్తావన ఉంది. ఈ ఉత్సవం వసంతకాలంలో మార్చి-ఏప్రిల్ నెలలో నిర్వహింపబడుతూ ఉండి ఉంటుంది. వేసవికాలంలో

**దేవుని కడపలో సప్తగిరి చందా కేంద్రం**

**కడపజిల్లాలోని దేవుని కడపలో శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర స్వామి ఆలయంలో కూడ సప్తగిరి చందా నమోదు కేంద్రం ఉన్నది. భక్తులు ఈ సదవ కాశాన్ని ఉపయోగించు కోగలరు.**

జరుపు కొడితిరునాళ్ ఉత్సవం మే-జూన్ మాసంలో నిర్వహింప బడుతున్నట్లు శాసనంసంఖ్య 116-టి.టి. శాసనం వల్ల తెలు స్తోంది.

**కొందరు ఆళ్వారులకు విగ్రహప్రతిష్ఠ గావించడం** ఈ కాలంలో ఏర్పడినట్లు తెలుస్తోంది. క్రీ.శ.1235 సంవత్సరంలో, మూడవ రాజరాజచోళుని పరిపాలనాకాలంలో ప్రప్రథమంగా తిరుమంగై ఆళ్వారుకు విగ్రహప్రతిష్ఠ జరిగినట్లు శాసనం సంఖ్య 126- జి.టి. తెలుపుతోంది. ఈ విగ్రహాన్ని ఇంతకు మునుపు శ్రీ గోవిందరాజ స్వామి దేవాలయంలో కుడవూర్ గ్రామసముదాయమందలి గ్రామస్తులు, ప్రతిష్ఠించి ఉండినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తోంది. అంతే కాకుండా ఆ ప్రాంత వాసులు నిత్యపూజకోసం కొంతభూమిని దానం చేసినట్లు తెలుస్తోంది. తిరువేంకటనాథ యాదవరాయలు క్రీ.శ.1330-31 సంవత్సరంలో శ్రీవేంకటేశ్వరస్వామి అనుగ్రహాన్ని ఆశించి పొంగలూరు గ్రామాన్ని దానం చేశాడు. ఈ గ్రామం నుండి లభించే ఆదాయం వినియోగించి, దానకర్త అభిమతం ప్రకారం రాజు నూతనంగా ప్రవేశపెట్టిన ఆషాఢ మాసోత్సవ నిర్వహణకు, సితకర గన్ధసంధి నైవేద్యాదులు సమకూర్చిన తరువాత వీర నరసింహస్వామికి, తిరుమంగై ఆళ్వారులకు ఒక్కొక్క తిరుబ్బో నకం సమర్పింపవలసినదని సింగయదణ్ణాయకుడు తిరుమల స్థానత్తారులను కోరాడు. అందుకు స్థానత్తారులు అంగీకరిం చారు. (శాసనం సంఖ్య 195-టి.టి. మరియు సంపుటి-1లో పుట 105, 108 మరియు 109). ***(ఇంకా ఉంది)***



## శాసన వివరణ - 13

# నరసింహ తిరుమల శాసనం

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలుకా, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరపు గోడపై ఉన్న శాసనం)

**వంశం** : విజయనగర (సాళువ) **రాజు** : నరసింహ

**కాలం** : శక సంవత్సరం **1389**, సర్వజిత్, **1467** ఎ.డి.

**భాష** : తమిళం

**విషయం** : తిమ్మయ్య దేవమహారాజు పేరుతో దేవాలయాధికారులు వేయించిన ఈ శాసనంలో తిరు విదైయాట్టం గ్రామంలో తాను త్రవ్వించిన చెరువు క్రింద సాగుచేయగా వచ్చిన రాబడితో ప్రతిరోజు పానకమును నైవేద్యంగా సమర్పించవలయును.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-**II**, సంఖ్య-**27**.

## శాసన వివరణ - 14

# అచ్యుత రాయల తిరుమల శాసనం

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి తాలూకా, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరపు గోడపై ఉన్న శాసనం)

**వంశం** : విజయనగర **రాజు** : అచ్యుతరాయలు

**కాలం** : వికారి సంవత్సరం (**15**వ శతాబ్దం)

**భాష** : తమిళం

**విషయం** : పెరుంకొండై వీరప్పన్ తిరువెంకటం ఉడయాన్ స్వామికి అనేక వెండి పాత్రలను కానుకగా ఇవ్వటం జరిగింది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-**IV**, సంఖ్య-**141**

# శ్రీ అభీష్టద మృత్యుంజయేశ్వరాలయం

మన దేవాలయాలు

- దొడ్డపనేని ఉదయతేజ

1675వ సంవత్సరంలో పుంగనూరు సంస్థానాన్ని ఇమ్మడి చిక్క రాయలు పరిపాలించేవారు. వేసవిలో రాయలవారు ఆవులపల్లె అనే గ్రామంలో విడిది చేసేవారు. ఒకనాడు రాయలకు శివపార్వతులు కల్లో కన్పించి సమీపాన ఉన్న కొలనులో ఉన్నాం. వెలికి తీసి ఆలయం నిర్మించమని ఆనతినిచ్చారు.

సూర్యోదయం కాగానే రాయలు కొలనులో వెతికించగా స్వప్నంలో శివుడు సెలవిచ్చినట్లే శివపార్వతుల విగ్రహాలు లభించాయి. ఆనందభరితుడైన రాయలు ఆ విగ్రహాలను తన స్వస్థలమైన పుంగ నూరులో ప్రతిష్ఠింపదలచాడు. పరివారంతో పయనమైన రాయలు చీకటి పడటంతో మార్గమధ్యంలో ప్రస్తుతం ఆలయం ఉన్న స్థలంలో ఆ రాత్రి బసచేశారు. మునుపటిలాగే కలలో కనిపించిన శివుడు ఈ ప్రదేశం లోనే తనకు ఆలయం నిర్మించమని ఆజ్ఞాపించాడు. అది శిరసావహిం చిన రాయలు వేలాదిమంది శిల్పులను రప్పించి ఆలయనిర్మాణానికి పూనుకున్నారు.

ఆ మంజునాథుడే కోరుకున్న స్థలం కావడం వల్లనో, పరమ శివభక్తుడైన రాయలవారి దృఢసంకల్పంతోనో ఆలయ నిర్మాణం చకచకా జరగసాగింది. ఏ అపరాధమో తెలియదు కానీ అంతుపట్టని వ్యాధితో రాయలవారి ఆరోగ్యం క్షీణించింది.

రాయలవారు తన ప్రాణం కోసం కాకుండా తన ఇష్టదైవమైన శివుడి అభీష్టం నెరవేర్చలేకపోతున్నందుకు దుఃఖపూరితుడై, తనను కరుణించమని ఆ త్రినేత్రుడిని వేడుకున్నాడు. ఆనాటి రాత్రి తన భక్తుడైన రాయలకు కలలో ప్రత్యక్షమైన శివుడు "నీకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తున్నా! నీకే కాదు ఈ ఆలయంలో కొలువైన నన్ను సేవించిన వారందరికీ ఆరోగ్యాన్ని ప్రసాదించి మృత్యుంజయుడు అనే పేరుతో పూజలందు కుంటా నని" చెప్పి అంతర్థానమయ్యాడు. ఏ వైద్యం లేకుండానే రాయలు ఆరోగ్యం కుదుటపడింది. దాంతో రాయలు ఆలయనిర్మాణం యథా తథంగా పూర్తి చేయించాడు.

ఆలయంలో మూలవిరాట్టుకు ఎదురుగా పెద్ద దీప స్తంభం ఉంది. ఒకేరాతితో చెక్కబడిన ఈ ధ్వజ స్తంభం ఎత్తు 60 అడుగులు. అంతటి ఎత్తైన స్తంభం నిలపటానికి ఎంత ప్రయత్నించినా రాయలవారికి సాధ్యపడలేదు.

విఫలుడైన రాయలు శివుడే తనను అవమాన పరచాడని భావించాడు. ఇకపై ఈ ఆలయదర్శనం చేయనని విచారంతో పుంగనూరుకు పయనమయ్యాడు. దారి మధ్యలో రాయలవారికి ఒక బ్రాహ్మణుడు ఎదురై "రాజా! స్తంభం నిలపలేకపోయినందుకు బాధపడు





తున్నావా! ఒకసారి వెనుతిరిగి చూడు" అని చెప్పాడు. ఆ మాటలకు తిరిగి చూసిన రాయలు ఠీవిగా నిలబడిన ధ్వజస్తంబం కనపడగానే ఆశ్చర్యపోయాడు.

ఇంతటి శుభవార్తను చేరవేసిన బ్రాహ్మణుడికి కృతజ్ఞతలు చెప్పాలనుకున్న రాయలవారికి ఆ బ్రాహ్మణుడు కన్పించలేదు.

తనకు అసాధ్యమనుకున్న బృహత్ కార్యం అవలీలగా నెరవేరడంతో ఇది సాక్షాత్తూ శివమహిమేనని రాయలవారికి అర్థమయ్యింది. ఈ అరుదైన సంఘటన జరిగిన ఆనవాళ్ళకు ఆధారంగా ఆ స్థలంలో రాయలువారు కోనేరు, మండపం, తోట ఏర్పాటు చేయించారు. ఇప్పటికీ అది "దొరబావితోట"గా వాడుకలో ఉంది.

నిర్మాణ దశలోనే ఇన్ని అద్భుతాలు చూపిన నీలకంఠుడు ఈ ఆలయంలో "శ్రీ అభీష్టద మృత్యుంజయేశ్వరుడు" అనే పేరుతో కొలువైనాడు. ఈ ఆలయమందు శ్రీ ప్రసన్న పార్వతీదేవి, సుబ్రహ్మణ్యస్వామి, వీరభద్రస్వామి, భద్రకాళి, నవగ్రహాలు, దుర్గ, గణపతి, శ్రీ మహావిష్ణువు చతుర్ముఖ బ్రహ్మ, చండికేశ్వరులు కొలువై ఉన్నారు.

ప్రతియేటా వైశాఖపంచమి నుండి పౌర్ణమి వరకూ బ్రహ్మోత్సవాలు వైభవంగా జరుగుతాయి. ఈ బ్రహ్మోత్సవంలో జరిగే రథోత్సవం కన్నులపండుగగా ఉంటుంది. ఈ రథోత్సవంలో చుట్టుప్రక్కల గ్రామాల నుండి సైతం భక్తులు పెద్ద సంఖ్యలో పాల్గొని మొక్కులు తీర్చుకుంటారు. కార్తీకం, మాఘమాసంలోనే కాక ప్రతి సోమవారం స్వామి విశేష పూజలందుకుంటారు.

# నిర్భీతి

**- కొండముది రాజగోపాల్**

ఈ ప్రపంచంలోని ప్రతి వ్యక్తికి ఏదో ఒక సందర్భంలో అధైర్యం, భయం కలుగుతాయనడానికి సందేహం లేదు. నేటి వైద్యులు భయానికి కారణమేదైతే ఉందో అదే కార్యాన్ని చేయడం వల్ల భయాన్ని జయించవచ్చని చెబుతారు.

ఈ అధైర్యం, భయం అనేది గొప్ప శూరులకు కూడా కలుగవచ్చు. ఉదాహరణకు శస్త్రాస్త్ర కోవిదుడైన అర్జునుడు సైతం కురుక్షేత్ర యుద్ధరంగంలో వైరాగ్యంతో కలిగిన అధైర్యం, భయం వల్ల "గాండీవం చేతి నుండి జారిపోవుచున్నది. చర్మం తపించి పోవుచున్నది. మనస్సు భ్రమకు గురియైనట్లు అనిపించుచున్నది. కనుక ఇక్కడ నిలబడలేక పోవుచున్నాను" అన్నాడు. ఇక మనలాంటి వారికి అధైర్యం, భయం కలగడంలో విచిత్రమేమి ఉంది. మరి వీటిని పారద్రోలడమెట్లు? అంటే భగవద్గీతే సమాధానం చెబుతోంది.

**అనన్యాశ్చింతయంతో మాం**
**యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం**
**యోగ క్షేమం వహామ్యహమ్ ॥**

ఆ పరమాత్ముణ్ణే నిరంతరం అనన్య భక్తితో చింతన చేయుచు, నిష్కామ భావంతో సేవించువారి యోగక్షేమాలను తానే వహిస్తానని భరోసా ఇచ్చాడు. కాబట్టి చదువరులు భయం ఏర్పడితే పైవిధంగా చరించండి. నిర్భీతులుకండి.

బాలప్రబోధం



# భక్త జయదేవ

- శంకరగంటి రమాకాంత్

వంగదేశంలోని ఒక పల్లెటూరిలో నారాయణశాస్త్రి, కమలాబాయి అనే పుణ్యదంపతులు నివసించే వారు. వారికొక కుమారుడు పుట్టాడు. వారికి పూరీజగన్నాథునిపై అపారభక్తి. అందుకని ఆ పిల్లవాడికి జయదేవుడని పేరు పెట్టారు. ఆ జయదేవుని జన్మను గురించి ఇక్కడ ఒక ఆసక్తికరమైన అంశమున్నది. వినండి!

శాస్త్రి భగవంతుని అర్చించుటలోనే అహర్నిశలూ గడిపేవాడు. తన అనంతరం వంశం నిలిచేలాగా తనకు సంతానం కావాలనే ఆలోచన చేయటానికి కూడా అతనికి తీరిక దొరికేది కాదు. కానీ అతని భార్య కమల స్త్రీ కాబట్టి వంశోద్ధారకుడైన కుమారుని కోసం పరితపించేది. ఆమె అంత గాఢంగా పుత్రుని కాంక్షిస్తూ ఉండడం వల్ల పూరీ జగన్నాథ స్వామి ఆమెను కరుణించి నారాయణ శాస్త్రికి స్వప్నంలో కన్పించి "కుమారా! నీ భక్తికి నేను మెచ్చాను. అందుకు నీ భార్య మనసులోని కోరిక తీర్చటానికి వచ్చాను" అన్నాడు.

శాస్త్రి వెంటనే నిద్ర నుండి మేలుకొన్నాడు. అతని శరీర మంతా దివ్యభగవత్ సందర్శనమైనందువల్ల దేదీప్యమానంగా మెరుస్తోంది. మళ్ళా భగవంతుడు సాక్షాత్కరిస్తాడేమోనని అతడు నిద్రకుపక్రమించాడు. కానీ అతని కోరిక తీరలేదు. అసహనంతో నిద్రలేచి అతను భార్యను పిలిచి తన స్వప్న వృత్తాంతం చెప్పాడు.

"ఓ ప్రభూ! మీ మాటలు నిజమేనా! అయితే నా జన్మ ధన్యమైనట్లే. నాలాంటి భార్య ఏమి కోరుకుంటుంది? మనల్ని ఋణత్రయాన్నుండి విముక్తులను చేయటానికి ఒక కొడుకును కోరుకున్నాను. ఆ వరాన్ని ఇచ్చేందుకు దైవం ప్రసన్నుడైనాడని చెప్పింది కమల.

ఆ మాటలు విని శాస్త్రి ముఖం వాడిపోయింది. "నీ వెంత పిచ్చిదానివి కమలా! అదేనా నీవు దైవాన్ని కోరవలసింది? స్వామి పాదాల్లో ఐక్యం కావాలనే కోరికను నీవు కోరవలసిన పనిలేదా?" అన్నాడు.

కమల తన భర్తకు ఇష్టం లేని వరాన్ని భగవంతుని కోరుకున్నానని బాధపడింది. అప్పటి నుండీ ఆ భార్యాభర్తల నడుమ దూరం పెరిగింది. నారాయణశాస్త్రి భగవద్భక్తిలో నిమగ్నుడై ఉంటే, ఆమె తన తప్పిదానికి విచారిస్తూ ఉండేది. ఈ విధంగా కొంత కాలం గడిచింది.

ఒకరోజు భగవంతుడు నారాయణశాస్త్రి కలలో విప్రుని వలే కనబడి "వత్సా! కొడుకు అనవసరమనుకున్న నీ భావన తప్పు. నీవు మీ తాత ముత్తాతల ఋణం తీర్చుకోవద్దా? నీ భార్య కమలకు కొడుకును ప్రసాదించటంలో నాకు వేరే ఉద్దేశం కూడా ఉంది. అతను కృష్ణభక్తిని అపూర్వమైన రీతిలో విశ్వమంతా విస్తరింపజేస్తాడు. నీకు అర్థమైందా? ఇప్పటి నుంచీ మంచిగా మసలుకో!" అని అన్నాడు.

నారాయణశాస్త్రి తన తప్పును గ్రహించి కమలను మన్నించాడు. అలా ఆ దంపతులకు పుట్టిన వాడే జయదేవుడు. అతడే అనంతరకాలంలో గీతగోవిందకర్తగా వాసికెక్కాడు.

జయదేవునికి జగన్నాథస్వామిపై గల భక్తి, ఆ దైవాన్ని స్తుతిస్తూ రాసిన గీతగోవిందంలో కనబడుతుంది.

ఈ గీతగోవింద కావ్యరచన జరుగుతూ ఉన్న సందర్భంగా 'చారుశీలే.....' అన్న పంక్తికి అర్థం ఇలా ఉంది. "కృష్ణుడు విరహ తాపానికోర్వలేక రాధను ఆమె చల్లని పాదకమలాలను తన తలపైన పెట్టి సేదదీర్చమనికోరాడని". ఆచరణాలు పూరించిన తర్వాత అది క్షమింపరాని దైవాపచారంగా జయదేవుడు గ్రహించాడు. ఆ విధంగా ఎందుకు జరిగిందోనని చాలా బాధపడ్డాడు. అప్పటికి ఆ చరణాన్ని కొట్టేసి నదికి స్నానానికి వెళ్ళాడు. వెళ్ళిన మనిషి వెళ్ళినట్లుగానే వచ్చి



# పెద్దల మాట

– డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

మాతేవ రక్షతి, పితేవ హితే నియుంక్తే,
కాంతేవ చాభిరమయ త్యపనీయ ఖేదమ్,
కీర్తిం చ దిక్షు వితనోతి, తనోతి లక్ష్మీం
కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా. (భోజ చరిత్ర)

**భావం :** **విద్య కల్పలత వంటిది. కోరినవన్నీ ఇస్తుంది. తల్లివలే రక్షిస్తుంది. తండ్రి వలే హితాన్ని బోధిస్తుంది. భార్యవలే దుఃఖాన్ని పోగొట్టి, ఆనందాన్ని చేకూర్చుతుంది. సర్వత్రా కీర్తిని వ్యాపింపజేస్తుంది. సంపదలు సిద్ధింపజేస్తుంది. విద్య సాధించలేనిది ఏదీ లేదు.**

**వివరణ :** విద్య అంటే అక్షరాలతో కూడిన చదువే కాదు. జ్ఞానమనీ అర్థం. జ్ఞాని దేన్నైనా అలవోకగా సాధిస్తాడు. జ్ఞానం, తల్లిగా రక్షిస్తుంది. తండ్రిగా హితాన్ని బోధిస్తుంది. భార్యగా దుఃఖాన్ని పోగొట్టి సంతోషాన్ని చేకూరుస్తుంది. కీర్తిని సర్వత్ర వ్యాపింపజేస్తుంది. సకల సంపదలూ కల్గిస్తుంది. విద్య కల్పలతవంటిది. కోరినవన్నీ ఇస్తుంది. ఇంతటి ఉత్తమ గుణాలున్న విద్యను స్వార్థానికీ, సమాజ నాశనానికీ వినియోగించడం తగదు. విద్య వినయాన్ని ఇస్తుంది. వినయం వల్ల యోగ్యత లభిస్తుంది. యోగ్యతవల్ల ధనం చేకూర్తుంది. ధనం వల్ల సుఖం కల్గుతుంది. ధనం వల్ల దానధర్మ యజ్ఞాదులు చేసి ఎంతో పుణ్యాన్ని సంపాదించుకోవచ్చు. పుణ్యం వల్ల చిత్త సంస్కారం, ఇట్టి సంస్కారం వల్ల భక్తి జ్ఞాన కర్మ నిష్ఠలు హృదయంలో స్థిరపడతాయి. వీటి వల్ల మానవుడు జీవన్ముక్తుడై తరిస్తాడు. భౌతిక సుఖాలకూ, ఆధ్యాత్మిక విద్యలు పారమార్థిక సుఖాలకూ దోహదం చేస్తాయి. గీత ప్రకారం విద్య అంటే అధ్యాత్మ విద్యే! కర్మ జ్ఞానాలు రెండూ ముఖ్యమే కనుక విద్యను రెంటికీ అన్వయించి, ఇహపరానందాలు పొందడం శ్రేయస్కరం.

అతని భార్యతో "పద్మా! ఆ రాతప్రతిని తీసుకురా! నాకిప్పుడే మెరుపులాంటి తలపు వచ్చింది. దాన్ని వెంటనే రాయక పోతే మరచిపోతాను." అంటూ జయదేవుడు భార్య తెచ్చియిచ్చిన తాళపత్ర గ్రంథంలో కొన్ని పంక్తులను రాసి నదీ తీరానికి మరలి వెళ్లాడు.

ఇది జరిగిన కొంతకాలానికి జయదేవుడు ఆనాడు రచించి అర్థాంతరంగా ఆపేసిన గేయాన్ని తప్పులు సరిదిద్ది కొత్తగా రాయాలని ఆ రాత పుస్తకాన్ని భార్యనడిగాడు. అతడు ఆ గ్రంథంలోని చివరి పత్రాన్ని చూశాడు. అక్కడ అప్పటికే పూర్తిగా సరికొత్త పాట సాక్షాత్కరించింది. అతడు భార్యను పిలిచి, "పద్మా! నీవేమైనా ఈ పుస్తకంలో రాశావా?' అన్నాడు. ఆమె లేదన్నది.

"అయితే నాకు బాగా జ్ఞాపకం. దైవాపచారార్థం ధ్వనిస్తూ నా దుఃఖానికి హేతుభూతమైన చరణాన్ని కొట్టివేసి, అసంపూర్తిగా విడిచి పెట్టిన గీతాన్ని ఇప్పుడే నేను చూస్తూ ఉన్నాను. కాని, ఇప్పుడు దాని స్థానే మరో గీతముంది" అని జయదేవుడన్నాడు. ఆమె ఆ రోజు ఆయన స్నానానికి వెళ్ళిన కొద్ది క్షణాలకే మళ్ళా గీత రచన చేసిన విషయం గుర్తు చేసింది. జయదేవుడు నమ్మలేదు. తాను అప్పటి నుండి ఇప్పటి వరకూ ఈ విషయంగా వేదనపడుతూనే ఉన్నానన్నాడు.

"లేదు. స్వామీ! తైలమును పూసుకున్న శరీరంతో మీరు వచ్చి మీ స్వహస్తాలతో కొన్ని పంక్తులను ఈ పుస్తకంలో

రాసి వెళ్ళారు. చూడండి. ఈ నూనె మరక అందుకు సాక్ష్యం" అంది పద్మావతి.

జయదేవుడు ఆ పాటను చదివాడు. భావం, అభివ్యక్తి, అక్షర రమ్యత అన్నీ పరమ ఉత్కృష్టంగా ఉన్నాయి. జయదేవుడి కళ్లవెంట ఆనందభాష్పాలు రాలాయి. జగన్నాథుడే స్వయంగా తన రూపంతో వచ్చి ఈ గీతాన్ని పూరించి ఉంటాడని గ్రహించాడు.

"పద్మావతీ! నీవు నిజంగా అదృష్టశాలినివి. భగవంతుని దర్శనం నీకు కలిగింది. నేను కాదు. ఆ చరణాలను రాసినది సాక్షాత్తు నా స్వామి జగన్నాథుడే. నీలాంటి భార్య నాకు లభించినందుకు నేను ధన్యుడను" అంటూ జయదేవుడు ఆనందాతిశయంతో నాట్యం చేశాడు.

ఆ కాలంలో పూరీని పరిపాలించే రాజు కూడా జగనాథస్వామికి గొప్ప భక్తుడు. అంతేకాదు వాగ్గేయకారుడు కూడా. దేశంలోని భక్తులంతా వ్యష్టిగా, సమష్టిగా గీత గోవిందాన్ని పాడుతూ ఉంటే విని తన పాటలెవరూ పాడటం లేదని ఆగ్రహోదగ్రుడయ్యాడు.

"ఎందుకందరూ జయదేవుని పాటలనే పాడుతారు. నా పాటల నెందుకు పాడరు? నా పాటలు అతని పాటల కన్నా వాసిలో నాసిరకమా?" అని ప్రజల్ని ప్రశ్నించాడు. వారంతా జయదేవుని కావ్యానికెందుకంత ప్రాముఖ్యమో చెప్పలేక "రాజా! మీ గేయాలను, జయదేవుని గీతాలను భగవంతుడైన జగన్నాథస్వామి చరణాల దగ్గర ఉంచి తెలుసుకుందాము" అని అన్నారు. దానికి రాజుగారు అంగీకరించారు. ఇద్దరి రచనలను దేవాలయంలోని భగవంతుని పాదాల చెంత పెట్టి గర్భగుడి వాకిలి బిగించి వెళ్ళిపోయారు.

రాత్రంతా రాజు జగన్నాథుని "స్వామీ! నేను నీ భక్తుణ్ణికానా? ఎందుకు మరి ప్రజలంతా జయదేవుని పాటల పట్ల పక్షపాతం చూపిస్తున్నారు? నా మీద దయ ఉంచు" అని ప్రార్థించాడు.

ప్రాతఃకాలం జనసందోహం ముందు దేవాలయాన్ని తెరిచారు. జయదేవుని పుస్తకంపై "మేము సంతుష్టులమైనాము"

## వేంకటేశు నామం



**సంకెళల బెట్టినవేళ చంప బిలిచినవేళ**
**అంకిలిగా నప్పల వా రాగిన వేళ**
**వేంకటేశు నామమే విడిపించ గతిగాక**
**మంకుబుద్ధిఁ బొరలిన మరిలేదు తెలుగు.**

*సంకెళ్లు వేసే సమయంలో, చంపటానికి పిలిచిన వేళల్లో, అప్పులవారు ఆరడిపెట్టిన వేళల్లో వేంకటేశు నామమొక్కటే రక్షిస్తుంది.* - తాళ్లపాక అన్నమాచార్యులు

అని రాసి ఉంది. రాజుగారి పుస్తకం అలాగే నేలపై దొర్లుతూ కనిపించింది. రాజుగారు మౌనంగా తన మందిరానికి వెళ్ళారు.

రాజు ఉదాత్త హృదయుడు కాబట్టి తన అధికారంతో జయదేవునికి హాని తలపెట్టలేదు. దానికి విరుద్ధంగా రోజూ దేవుడి ముందు "ప్రభూ! భక్తి పరీక్షలో నేను ఓడిపోయాను. నీ కృపా దృష్టిని నా పై ఏనాటికైనా ప్రసరింపజెయ్యి" అని మొరపెట్టుకునేవాడు.

కొన్నాళ్ళ తర్వాత రాజుగారికి జగన్నాథుడు కలలో కనబడి "రాజా! నీ రచనలు జయదేవుని రచనలతో సమానమైనవే కాని నీకు గల అహంకారాన్ని పోగొట్టడానికి నీకొక గుణపాఠం చెప్పదలచి అలా చేశాను. నిరుత్సాహ పడకు. నీ పాటలలో మొదటి పదమూడూ నాకు బాగా నచ్చాయి" అన్నాడు. ఆనాటి నుంచీ రాజు అహంకారాన్ని దూరం చేసుకున్నాడు. ఆయనకు జ్ఞానోదయమైంది. క్రమేణ అతడు జగన్నాథస్వామి భక్తులలో ఒక్కడైనాడు.

ఇంకొక సందర్భంలో పరమశివుడు జయదేవునికి సాక్షాత్కరించి బందిపోట్లతో నరికివేయబడిన అంగాలను ప్రసాదించాడు. మరల ఒకసారి భగవంతుడు అతనికి ప్రత్యక్షమై అతనికి ప్రాణప్రదమైన అతని భార్య పద్మావతీ దేవి ప్రాణాలను తిరిగిచ్చాడు.

భగవంతుని స్వయంగా చూడటమేగాక, అతని అనుచరులకు కూడా భగవత్ సాక్షాత్కారాన్ని కలిగించిన మహనీయుడు జయదేవుడు.

# భక్తి తత్త్వము

- సిలువేరు సుదర్శన్

భక్తి అనగా భగవంతునిపై అపరిమితమైన ప్రేమ కలిగి ఉండడం. హృదయంలో ప్రేమ లేకుండా రోకటి పాటగా చేసే భజనలు, సంకీర్తనలు, నామ జపాలు, అనుష్ఠా నాలు, బాహ్యాడంబరమేగాని భక్తికాదు. శరణాగత భావన భక్తికి పరాకాష్ఠ. కామాన్ని త్యాగం చేయడం ప్రేమకు గీటురాయి. ఏ కోరికలేక, సకల జీవకోటిపై స్నేహభావాన్ని కల్గి ఇతరుల ఆనం దంలో తాను ఆనందం అనుభవించగలగడం భగవంతునిపై ప్రేమకు లక్షణాలు.

శరణాగతి అనగా భగవంతునికి తనను సంపూర్ణంగా సమర్పించుకోవడం. తనదేమి లేదు, తన మంచి చెడులన్నీ భగ వంతునివే అన్న విశ్వాసం. ఈ విశ్వాసము కలవానికి నిత్యం ఆనందమే. భక్తుడు ప్రపంచసుఖాలకు ప్రాముఖ్యమివ్వక, స్వార్థ రహితంగా జీవించినపుడు, ఆ స్థితిలో ప్రపంచం దూరమై, ప్రేమైక్య కేంద్రంగా భగవంతునిపై చిత్తం నిశ్చలంగా నిలబడి పోతుంది. మనస్సును భగవంతునిపై స్థిరంగా నిలువరించడం కష్టమే. దానికి నిరంతర అభ్యాసమే సాధనం. అభ్యాసం కూడ అంత తేలిక కాదు. ఈ అభ్యాసము త్వరగా ఫలించడానికి భగ వద్భావనతో అన్ని కర్మలు చేస్తుండాలి. భగవద్భావం అంటే సమస్తం భగవంతునిది, కర్మలు చేయడమే నాపని. కర్మఫలితం భగవంతునిది అనే భావన. అదే కర్మఫల త్యాగం.

భగవంతుని స్వరూప స్వభావాలను గురించిన సరి అయిన జ్ఞానంలేని అభ్యాసం కన్న ధ్యానం ఎక్కువ ఉపయోగం. ధ్యానానికి బాట వేసినపుడే జ్ఞానానికి సార్థకత, కనుక జ్ఞానం కన్న ధ్యానం విశిష్టం. ధ్యానంలో ఎపుడో కొద్దిసేపు మాత్రం భగవంతుని దర్శించగలం. కనుక దినమంతా చేసే కర్మఫల త్యాగం ఇంకా ఎక్కువ ప్రయోజనకరం. కర్మఫల త్యాగం వల్ల ఆందోళనలు తగ్గి మనస్సు శాంతిని పొందుతుంది. శాంత సమాహిత మనస్సు భగవంతుని స్పర్శననుభవించ కల్గుతుంది.

దేహసుఖాలపై కోరికలు లేనివాడు, బాహ్యాభ్యంతర శుచికలవాడు, సమర్థుడు, సమయస్ఫూర్తితో వ్యవహరించేవాడు భగవంతునిపై భక్తిని పటిష్ఠం చేసుకుంటాడు.

భగవంతునిపై భక్తిని దృఢపరచుకోవడానికి నవవిధ మార్గాలను ప్రహ్లాదుడు వర్ణిస్తాడు. అవి 1) శ్రవణం, 2) కీర్తనం, 3) స్మరణం, 4) పాదసేవనం, 5) అర్చనం, 6) వందనం, 7) దాస్యం, 8) సఖ్యం 9) ఆత్మనివేదనం. ఇవి దేనికవి విడిగా సహాయం చేసినా, అన్నీ పరస్పరం పుష్టినిస్తాయి. ఇవి సోపానాలు మాత్రమే. ఒక్కొక్కటి సాధన చేస్తూ భగవంతునికి ఆత్మ నివేదనం చేసుకోవాలి. భగవంతుని గుణాలను శ్రవణ, మనన, నిధి ధ్యాసన ద్వారా పదే పదే చేయటమే అభ్యాసయోగం.

స్వార్థాన్ని త్యజించి, పరమేశ్వరుని ఆశ్రయించి అతడే పరమగతి అని భావించి నిష్కామ ప్రేమభావంతో మనో వాక్కాయ కర్మలను పరమేశ్వరునిపై నిల్పి, సంపూర్ణ కర్తవ్య కర్మలను చేయడమే భగవదర్థకర్మపరాయణగా చెప్పబడుతుంది.

కేవలం భగవదర్థ కర్మలు చేసేవారిలో దైవంపై ప్రేమ, శ్రద్ధ, చింతన ఉంటాయి. అందుకే ధ్యానంకన్న కర్మఫల త్యాగం విశిష్టమని చెప్పబడింది. మనోవాక్కాయాల ద్వారా చేసే స్వాభావిక కర్మలపై కర్తృత్వాభిమానాన్ని సంపూర్ణంగా పరిత్య జించాలి. ఈశ్వర స్వరూపం నిరంతరం మననం చేయాలి. పర మేశ్వరునిపై విశ్వాసం ఉండటం శ్రద్ధ అనబడుతుంది. భగవం తుడే పరమాశ్రయంగా, పరమగతిగా, సర్వాత్మగా, విశుద్ధ ప్రేమచే ఆయన ప్రాప్తిని కోరేవారిగా ప్రతి ఒక్కరు జీవించాలి.

ప్రపంచ సుఖాలను విడవడమే వైరాగ్యం. లేని దానిని కోరక, ఉన్న దానితో తృప్తిపడుతూ నిత్యసంతుష్టుడుగా ఉండాలి. విచక్షణ జ్ఞానమంటే ఏది ప్రేయస్సు, ఏది శ్రేయస్సు అని విచా రించి తెలుసుకోవడం. వానిలో శ్రేయోమార్గాన్ని ఎంచుకోవడం వివేకం. భగవతత్త్వంతో నిరంతరం జీవించి, దానిని సాధిం చాలనే దృఢవిశ్వాసం కల్గి ఉండాలి. చతుష్పాద జంతువులు నాలుగు కాళ్ళతో నడుస్తూ ముందుకు సాగినట్లు ఈ నాలుగు గుణాలు అనగా విచక్షణ, వైరాగ్యం, వివేకం, విశ్వాసాల సహా యంతో మనం మన గమ్యాన్ని చేరుకోగలం. ఇదే భక్తి మార్గం, భక్తుని లక్ష్యం.

# వార్తాలహరి

## వైభవంగా వేదనారాయణుని బ్రహ్మోత్సవాలు

నాగలాపురం వేదవల్లీ సమేత వేదనారాయణ స్వామి వారి బ్రహ్మోత్సవాలు 2010, ఏప్రిల్ 28 ధ్వజారోహణతో వైభవంగా ప్రారంభమయ్యాయి. ఈ ఉత్సవాలలో స్వామివారు శ్రీదేవి, భూదేవి సమేతంగా తిరుమాడవీథుల్లో పెద్దశేష, చిన్నశేష, హంస, సింహ, గరుడ, హనుమద్వాహనాలపై ఊరే గుతూ భక్తులకు దర్శనమిచ్చారు. చివరగా వేదవల్లీ సమేత వేదనారాయణ స్వామివార్ల ఉత్సవమూర్తులకు స్నపన, తిరు మంజనంతో పాటు చక్రస్నానం వైభవోపేతంగా జరిగింది. మే 6 తేదీన నాగలాపురంలోని వేద నారాయణ స్వామివారి బ్రహ్మోత్సవాలు ధ్వజావరోణంతో ముగిశాయి. ఈ బ్రహ్మోత్సవాల్లో భక్తులు అసంఖ్యాకంగా పాల్గొన్నారు.

## అమెరికాలో శ్రీనివాస కళ్యాణం

2010, మే 1వ తేదీన అమెరికాలోని న్యూజెర్సీలో శనివారం శ్రీనివాస కళ్యాణం వైభవంగా జరిగింది. ఉదయం ఆరుగంటలకు సుప్రభాతసేవతో స్వామివారిని మేల్కొలిపారు. అనంతరం స్వామివారికి తోమాల, అర్చన సేవలు నిర్వహిం చారు. వందలాదిమంది మహిళలు, పురుషులు తెలుగు సంప్ర దాయ వస్త్రధారణతో స్వామివారి సేవలో పాల్గొన్నారు. 33 ఎకరాల విస్తీర్ణంలోని ఆలయంలో నిర్వహించిన శ్రీనివాస కళ్యాణానికి వేలాదిగా భక్తులు తరలివచ్చారు. భక్తుల గోవింద నామస్మరణతో ప్రాంగణం మారుమ్రోగింది. ఈ కళ్యాణాన్ని వీక్షించి అమెరికాలోని తెలుగు ప్రజలు ఆధ్యాత్మిక భావనతో పులకించిపోయారు. తి.తి.దే. కళాకారులు అన్నమయ్య కీర్తన లను ఆలపించారు.

ఈ కళ్యాణంలో న్యూజెర్సీ గవర్నర్ క్రిస్ క్రిస్ట్, మేయర్ జాన్‌కార్నిక్, డిప్యూటీ స్పీకర్ ఉపేంద్ర చివుకుల, తానా అధ్య క్షుడు శ్రీ సుబ్రమణ్యం పాల్గొన్నారు. తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యుడు యాదయ్య దంపతులు, హిందూ ధర్మ ప్రచార పరిషత్ కార్యదర్శి డా॥ రాళ్లబండి కవితాప్రసాద్, తి.తి.దే పౌరసంబంధాధికారి శ్రీ టి.రవి, శ్రీ మురళీకృష్ణ డిప్యూటీ ఈ.ఓ. (జనరల్) తదితర అధికారులు పాల్గొన్నారు.

## ముఖ్యమంత్రి అభినందనలు

శ్రీనివాస కళ్యాణాన్ని తొలిసారిగా అమెరికాలో నిర్వ హించడం అభినందనీయమని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ కె.రోశయ్య పేర్కొన్నారు. శనివారం న్యూజెర్సీలోని గురు వాయూరప్ప ఆలయంలో నిర్వహించిన కళ్యాణంలో పాల్గొన్న తెలుగువారందరికీ అభినందలు తెలియజేస్తున్నట్లు చెప్పారు.

## కాలిఫోర్నియాలో శ్రీవారి కళ్యాణం

2010, మే 9 తేదీన అమెరికా లోని కాలిఫోర్నియాలో శ్రీవారి కళ్యాణం వైభవంగా జరిగింది. కాలి ఫోర్నియాలోని సన్నివేలి ఆలయ ఆడిటో రియంలో నిర్వాహకులు కళ్యాణ వేదికను సిద్ధం చేశారు. ఆ రోజు ఉదయం 6 గం॥లకు సుప్రభాతంతో ఆలయ ప్రాంగణంలో కళ్యాణ సందడి మొదలైంది. అక్కడి ప్రజలు పెద్ద సంఖ్యలో ఈ వేడుకకు హాజరవడమేకాక సంప్రదాయ దుస్తులు ధరించి శ్రీదేవి, భూదేవి సమేత కళ్యాణవేంకటేశ్వ రునితో పాటు తాముకూడా కంకణధారులయ్యారు. భక్త జన సందోహం మధ్య శ్రీవారి కళ్యాణం వైభవోపేతంగా జరిగింది.

## బ్రిడ్జివాటర్‌లో శ్రీవారి కళ్యాణం

అమెరికా దేశం న్యూజర్సీ రాష్ట్రంలోని బ్రిడ్జివాటర్‌లో 2010, మే 15 శనివారం శ్రీవారి కళ్యాణోత్సవం వైభవంగా జరిగింది. మొదట విష్వక్సేన పూజ నిర్వహించారు. అనంతరం నవధాన్యాల అంకురార్పణ, యాగం, భక్తులచేత మహాసంక ల్పం, కంకణధారణవంటి కార్యక్రమాలు జరిగాయి. అనంతరం శ్రీవారికి, భూదేవి, శ్రీదేవిలకు కొత్త దుస్తులు తొడిగారు. మాంగల్యపూజ అనంతరం కల్యాణోత్సవంలో కీలకఘట్ట మైన మాంగల్యధారణం జరిగింది. లాజహోమం తర్వాత పూర్ణాహుతితో కళ్యాణమహోత్సవం ముగిసింది. ఈ కళ్యాణ మహోత్సవంలో వేలాదిమంది భక్తులు పాల్గొని శ్రీనివాసుని కళ్యాణాన్ని వీక్షించారు. ఈ కళ్యాణోత్సవంలో ముఖ్యఅతిథిగా పాల్గొన్న తి.తి.దేవస్థానం అధ్యక్షులు శ్రీ డి.కె.ఆదికేశవులు మాట్లాడుతూ తి.తి.దే. విదేశాల్లో నిర్వహించిన కళ్యాణాలు ధర్మప్రచారం కోసమేనని స్పష్టం చేశారు.

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

   (పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలుస్తున్నది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి ప్రసాదాలకు సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**
- మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- **మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083".**

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

చక్కని తల్లికి చాఁగుబళా తన -
చక్కెరమోవికి చాఁగుబళా

కులికెటి మురిపెపుఁ గుమ్మరింపుఁ దన -
సళుపుఁ జూపులకు చాఁగుబళా
పలుకుల సొలపులఁ బతితోఁ గసరెడి
చలముల యలుకకు చాఁగుబళా

కిన్నెరతోఁ బతి కెలన నిలుచుఁ దన -
చన్ను మెఱఁగులకు చాఁగుబళా
ఉన్నతిఁ బతిపై నొరగి నిలుచుఁదన -
సన్నపు నడిమికి చాఁగుబళా

జందెపు ముత్యపు సరులహారముల -
చందనగంధికి చాఁగుబళా
విందయి వేంకటవిభుఁ బెనఁచిన తన -
సందిదండలకు చాఁగుబళా.

(5 - 107)





భక్తుల అభీష్టాలు తీర్చే అలమేలుమంగది చక్కెరమోవి. ఆమె ఒక వాత్సల్యదీవి. పలుకుతేనెల దేవి. ఆమె నడకలు నాట్యాలు. వెంకటపతికి ఆమె చూపులు పూలతూపులు. ఆమె అలుకల కలికి. చిలుకల కొలికి. కులుకుల ములికి. ఆమె కిన్నెర మీటుతూ పాడుతుంది. ముత్యాల హారాలతో, పరువాల భారాలతో తన పతికి వేడుక చేస్తుంది. ఆ విశ్వవిభునిపై ఒరిగి కరిగి పోతుంది. అలా భక్తులకు శరణాగతి తత్త్వాన్ని నేర్పే ఆ చందన గంధి అందాలకు "చాంగుబళా" అంటూ అన్నమయ్య స్తుతించిన సంకీర్తన ఇది.

## సెప్టెంబరు నెల పండుగలు

01 - గోకులాష్టమి

10 - వరాహ జయంతి

11 - వినాయక చవితి

11 నుండి 19 వరకు -
శ్రీ వేంకటేశ్వరస్వామి వారి
వార్షిక బ్రహ్మోత్సవాలు, తిరుమల

19 - వామన జయంతి

22 - అనంతపద్మనాభవ్రతం

### చక్కటి అనుభూతి

తిరుమలకు రాకపోయినా శ్రీవారి దివ్య వైభవాన్ని ప్రతి మాసం మా ఎదుట నిలిపి చక్కటి అనుభూతిని కలిగించే సప్తగిరికి ధన్యవాదాలు.

**– జి. గంగ, చెన్నై.**

### భద్రపరచుకుంటున్నాం!

సప్తగిరి పత్రిక ముఖచిత్రాలు ప్రతినెలా ఎంతో ఆకర్షణీయంగా ఉంటున్నాయి. పత్రికకు ఆయువుపట్టు లాంటి సంపాదకీయాలు విశ్లేషణాత్మకంగా సాగుతున్నాయి. తిరుమల ఆలయం ధారావాహిక ఆకట్టుకుంటోంది. ధారావాహికంగా ప్రతినెలా వచ్చే ఉషశ్రీ భారతాన్ని పుస్తకరూపంలో భద్రపరచుకుంటున్నాం.

**– యస్. రామకృష్ణ, హైదరాబాదు.**

### బాలవాక్కు బాగుంది

జూన్ సప్తగిరి పత్రికలో ప్రచురించిన బాలవాక్కు శీర్షికలో "దురాశ" అనే కథ నాకు బాగా నచ్చింది. దురాశ దుఃఖమునకు చేటు. కాబట్టి మనము ఎక్కువ దురాశ పడకూడదు. "దొరికిన దానితో తృప్తిపడాలి" అనే నీతి ఈ కథ ద్వారా తెలుసుకున్నాను. అంతేకాక మా పాఠశాలలోని నా తోటి విద్యార్థులకు కూడా చదివి వినిపించాను.

**– ఎల్. చందన, తిరుపతి.**

### అక్షర ప్రసాదం

'సప్తగిరి' పత్రిక ముఖచిత్రంగా శ్రీనివాసుని వజ్రకవచం ప్రచురించవలసిందిగా కోరుతున్నాను. ముఖ్యంగా మధ్యపేజీలలోని ఛాయాచిత్రాలు చూపులు మరల్చనీయవు. దేవస్థానం భక్తులకు అందిస్తున్న అక్షర ప్రసాదమే ఈ 'సప్తగిరి'.

**–నవీన లక్ష్మి, హైదరాబాదు.**

☛ **లోగడ స్వామివారి వజ్రకవచం ప్రచురించడం జరిగింది. వీలునుబట్టి మళ్ళీ ముద్రిస్తాం.**

– ప్రధాన సంపాదకుడు

## మీ మాట

### మా ఇలువేల్పు

'సప్తగిరి' మాసపత్రిక ఏ కారణం చేతనో మాకు చాలా ఆలస్యంగా వస్తోంది. ఆలస్యంగా వచ్చేది సప్తగిరి మాసపత్రికకాదు, 'మా ఇంటి వేల్పు ఏడుకొండలవాడు'. ఈ సున్నితమైన భక్తుల మనోభావాలను మీరు గ్రహించగలరు. భారతం చాలాబాగుంది. ఉషశ్రీ భారతం గ్రంథాన్ని కొనకున్నా సప్తగిరి మాసపత్రిక ఆ లోటును తీరుస్తోంది.

**– యం. సుబ్రహ్మణ్యం, కుప్పం.**

### బావున్నాయి

ధారావాహిక ఉషశ్రీ భారతం ఆసక్తికరంగా సాగుతోంది. శ్రీ తులసీ మహిమ, దాశరథీ శతకవైశిష్ట్యం వ్యాసాలు చదివింపచేశాయి. అలాగే తిరుమల ఆలయం ధారావాహిక వేంకటాద్రి విశిష్టతను, శ్రీవారి లీలలను కళ్లముందు సాక్షాత్కరింపచేస్తూ ఉంది. భక్తి జ్ఞాన వైరాగ్యాలను అర్థధర్మనిష్ఠానిరతిని ప్రతిపాదించే ఎన్నో వ్యాసాలు ప్రతి సంచికలోనూ చోటుచేసుకుంటున్నాయి.

**–ఎస్. శ్రీనివాస్, ఇల్లందు.**

### కవరులో సప్తగిరి

'సప్తగిరి' మాసపత్రిక ప్రతినెలా మడవకుండా కవరులో పెట్టి భద్రంగా పంపుతున్నందుకు ధన్యవాదాలు. ముఖచిత్రాలు చాలా బాగుంటున్నాయి.

**– ఎం. సూరిబాబు, హైదరాబాదు.**

### విలువైన శీర్షిక

ప్రతినెలా సప్తగిరి మాసపత్రికలో డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య అందజేస్తోన్న 'పెద్దలమాట' చాలా విలువైన శీర్షిక. ఇది నేటి యువతరం పాటించగలిగితే క్షీణించిపోతున్న నైతిక విలువలు మరలా నిలబడుతాయి. అయితే ఇందులో ఎక్కువగా సంస్కృత శ్లోకాలే ఉదహరిస్తున్నారు. చక్కటి తెలుగు పద్యాలు కూడా అందించగలరని మనవి.

**– కె. పురుషోత్తం, పీలేరు.**

### ముఖ్య గమనిక

**పోస్టల్ పిన్‌కోడ్ పంపండి !!**

**మీకు అందిన 'సప్తగిరి' సంచికపై గల మీ చిరునామాలో పిన్‌కోడ్ లేనివారు తమ పిన్‌కోడ్‌ను విధిగా తెలుపుతూ లేఖను వ్రాయగలరు.**

**ప్రతి చిరునామాకు పోస్టల్ పిన్‌కోడ్ తప్పనిసరి!**

– ప్రధాన సంపాదకుడు

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.



ప్రయత్నంతోనే అన్ని పనులూ నెరవేరుతాయి
కోరికలతో ఏవీ నెరవేరవు

# సప్తగిరి


తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 41 ఆగస్టు, 2010 సంచిక: 03





గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.

సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ

ఉప-సంపాదకురాలు :
డా॥ అల్లాడి సంధ్య

ముద్రాపకుడు :
వి. సాంబశివరావు, డి.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి


ముఖ చిత్రం :
**శ్రీవారి పవిత్రోత్సవం, తిరుమల**

చివరి పుట :
**శ్రీ విఖనస మహర్షి**




*వివరాలకు :*
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**విదేశాలకు**
సం॥ చందా -- రూ. 850-00

సంపాదకీయం

# పుణ్యక్షేత్రాలు - పవిత్ర వాతావరణం

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుడు వెలసిన దివ్యక్షేత్రం తిరుమల. ఆ పునీత ప్రదేశంలో తిరుమలేశుని అపార కృప అక్షతలై భక్త జనుల మీద నిరంతరం వర్షిస్తూనే ఉంటుంది. ప్రపంచవ్యాప్తంగా లక్షలాదిమంది భక్తులు అనునిత్యం స్వామివారిని దర్శించుకోవడానికి వస్తూ ఉంటారు. అయితే త్రికరణశుద్ధిగా స్వామివారిని దర్శించుకుని తమ ఆర్తిని స్వామిముందు నివేదించుకున్నప్పుడు మాత్రమే ఆయన కృపకు మనం పాత్రులౌతాం. అలాగాకుండా ఒక మానసిక వికల్పస్థితిలో, ఉన్మాదపరిస్థితిలో స్వామివారి ఆలయంలో ప్రవేశించిన భక్తుడు వ్యయప్రయాసల కోర్చి తాను చేసిన ఈ క్షేత్రయాత్ర నిస్సందేహంగా వ్యర్థమైపోతుంది. కనీసం తీర్థాలు, క్షేత్రాల్లాంటి పవిత్ర ప్రదేశాల్లోనైనా ఆ ఉన్న కొన్ని గంటల పాటైనా సంయమనాన్ని పాటించని వ్యక్తులను ఏ అలౌకిక శక్తులు కరుణించవు. కాపాడవు. మనుషుల్ని దైవక్షేత్రాలు క్షణకాలమైనా దైవత్వం వైపు మళ్లిస్తాయి. కాబట్టి ఆధ్యాత్మిక యాత్రలను భక్తులు పొరపాటున కూడా విహారయాత్రలుగా భావించకూడదు.

మన ప్రాచీన ఋషులు ప్రజల ఆత్మోన్నత్యాన్ని దృష్టిలో ఉంచుకుని మనిషి వ్యసనాలకు దూరం కావాలని శాసిస్తూ ఉంటారు. 'దేహో దేవాలయ ప్రోక్త, జీవో దేవ సనాతనః' అని వేదం ఘోషించింది. ఈ దేహమే దేవాలయం. అందులోని ఆత్మే సనాతన దేవుడు. తాము ఆరగించే పదార్థాలన్నీ ఆ స్వామికి మన మందించే నిత్య నైవేద్యాలు. కాబట్టి తామసిక ద్రవ్యాల్ని హవ్యాలుగా మనం స్వీకరించడం అపరాధం.

భక్తి అంటే కేవలం భగవంతుని సందర్శన, సమర్చన మాత్రమేకాదు. మానసిక వ్యసనాలను సమూలంగా తొలగించుకోవడం. వ్యసనాలకు దూరమైన భక్తుడు అటు భగవంతుడికి ప్రీతిపాత్రుడు కావడమే గాకుండా సమాజంలో ఉత్తమ పౌరుడుగా గుర్తింపు పొందుతాడు. లక్షలాదిమంది భక్తులలో ఒకరిద్దరు తమ దురలవాట్లతో, స్వామివారికి ఉన్న కీర్తిప్రతిష్ఠలు, క్షేత్రపవిత్రతలు కళంకితం కావడానికి కారకులవుతున్నారు. ఇది మహాపాపం!

దైవసందర్శన యాత్రలు పదేపదే చేయడం వల్ల అక్కడి పవిత్రమైన భావజాలం మనుష్యులను ఇలాంటి వ్యసనాల నుండి పరిరక్షించే అవకాశం ఉంది. రక్షకభటులకు భయపడి చోరుడు కాకపోవడం కంటే మానసికంగానే నైతిక విలువలను పెంపొందించుకుని ఉత్తమ పౌరుడుగా జీవించడం ప్రతిపౌరునికి ప్రథమకర్తవ్యం. ఉత్తమపౌరుడు కాలేనివాడు అసలు భక్తుడు కావడానికి అర్హతను కోల్పోతాడు. పుణ్య క్షేత్రాల్లో భక్తులకు లభించే స్వేచ్ఛను పాపకార్యాల కోసం వినియోగిస్తే మానవదృష్టి నుండి తప్పుకోవచ్చేమోకానీ సర్వవ్యాపి అయిన ఆ దేవదేవుని దృష్టినుండి మాత్రం తప్పించుకోలేరు. ఈ విషయాన్ని సహృదయులైన భక్తులందరూ దృష్టిలో ఉంచుకుని తాము పవిత్రులై, ఆలయ ప్రదేశాలను పవిత్రంగా ఉంచినప్పుడు మాత్రమే శ్రీవారి కరుణాదృష్టి భక్తుల మీద ప్రసరిస్తుంది. అలా కానిపక్షంలో మనం స్వామిని దర్శిస్తామే గానీ ఆయన దృక్కులు మాత్రం మనపై పడవు.

# శ్రీ వరలక్ష్మీ వ్రతం

- జె. అనిల్‌కుమార్

**మాతర్నమామి కమలే కమలాయతాక్షి!**
**శ్రీ విష్ణు హృత్కమలవాసిని! విశ్వమాతః!**
**క్షీరోదజే కమల కోమల గర్భగౌరి!**
**లక్ష్మి ప్రసీద! సతతం నమతాం శరణ్యే!!**

శ్రావణమాసం అత్యంత విశిష్టమైనదిగా, పవిత్రమైనదిగా చెప్పబడుతున్న నెల. ఈ మాసంలో పున్నమినాడు శ్రవణా నక్షత్రం కూడినందువల్ల శ్రావణమాసంగా పిలువబడుతున్నది. స్త్రీలకు సంతాన సౌభాగ్యాలను ప్రసాదించే నాగుల చవితి, గరుడ పంచమి, మంగళగౌరీ వ్రతాలు, వరలక్ష్మీవ్రతం మున్నగు నోములు, వ్రతాలు ఒనగూడిన నెల శ్రావణమాసం! అందువల్లే స్త్రీలకు అత్యంత ప్రాముఖ్యం కలిగిన నెలగా శ్రావణమాసం ఆచరింపబడుతున్నది. ప్రధానంగా కొత్తగా వివాహమైన నూతన వధువులు తమ తమ సౌభాగ్య శ్రేయస్సుల కోసం శ్రావణమాసంలో ప్రతి మంగళవారం మంగళగౌరీ వ్రతాలు చేస్తారు. ఇలా ఈ నెలలో నాలుగు లేదా ఐదు వారాలుగా వచ్చే ప్రతి మంగళవారంనాడు మంగళగౌరీవ్రతాలతో పాటు అదే శ్రావణమాసంలో పున్నమినాటికి ముందు వచ్చే శుక్రవారంనాడు సకల సిరిసంపదలను కురిపించే శ్రీ వరలక్ష్మీ వ్రతాన్ని కూడ ఆచరిస్తారు. నూతన వధువులు మాత్రమే గాక ఇతర పుణ్యస్త్రీలు కూడా ఈ వరలక్ష్మీవ్రతాన్ని తమ ఇంటిలో తప్పక ఆచరిస్తారు. ఇలా ఇంటిల్లిపాదీ శుభప్రదంగా జరుపుకునే వ్రతం శ్రీ వరలక్ష్మీవ్రతం!

## వ్రత కథ :

పూర్వం నైమిశారణ్యంలో సూతమహర్షి శౌనకాది మహామునులకు ఎన్నో గాథలను, వృత్తాంతాలను చెప్తూ; వారితో సత్కథాకాలక్షేపం చేస్తూ, శ్రీ మహాలక్ష్మికి సంబంధించిన శ్రీ వరలక్ష్మీవ్రతాన్ని గూర్చిన గాథను ఇలా చెప్పాడు.

ఒకరోజు కైలాసంలో పరమశివుడు, పార్వతి సరస సంభాషణలతో ఉండగా, పరమేశ్వరి శివుణ్ణి ఇలా అడిగింది.

స్వామీ! పరమేశ్వరా! లోకంలో ఏ వ్రతాన్ని ఆచరించినట్లయితే స్త్రీలకు సకల సంపదలు, సుఖసంతోషాలు కలుగుతాయో, పుత్రపౌత్రాదులు కలిగి ఉంటారో, నాకు తెలుపండి– అంటూ పార్వతి ప్రార్థించింది. అది విని శంకరుడు ఇలా అన్నాడు.

“దేవీ! పార్వతీ! నీకు తెలియని విషయాలు ఏమైనా ఉన్నాయా! అయినా నా ద్వారా లోకానికి చెప్పించాలన్న నీ కుతూహలం, లోకక్షేమ సంకల్పం ఎంతైనా ప్రశంసనీయం! నీవు చెప్పినట్లుగా పుణ్యస్త్రీలకు జీవితాంతం సకల సౌభాగ్య సంపదలను ప్రసాదించడంతో పాటు, చివరలో పుణ్యస్త్రీలకు గౌరీలోకాలను ప్రసాదించగల శ్రావణమాసం చాలా విశిష్టమైంది. అందులోను ప్రధానంగా ఈ మాసంలో పున్నమినాటికి ముందు వచ్చే శుక్రవారంరోజు ఆచరించబడే ‘శ్రీ వరలక్ష్మీవ్రతం’ మహిమ ఇంతింత అని చెప్పడానికి వీలు లేనిది, వీలుకానిది. ఆ వ్రత గాథను, దాని విధి విధానాలను సవిస్తరంగా చెబుతాను. సావధానంగా వినుము”

పూర్వం మగధదేశంలో కుండిననగరం అనే పట్టణం అన్నివిధాలా ప్రసిద్ధికెక్కింది. పాడిపంటలకు పుట్టినిల్లు! ప్రతి ఇంటా ధాన్యపురాశులతో పాటు రత్నాలరాశులూ గలగలలాడుతూ ఉండేవి. ప్రతి లోగిలీ అష్టైశ్వర్యాలతో కళకళలాడుతూ శ్రీ మహాలక్ష్మి సన్నిధానంలా దర్శనమిచ్చేది. ప్రతి ఇల్లాలూ మంగళకరములైన ఆభరణాలు, పసుపు కుంకుమ, పూలు ధరించి నడుస్తున్న మహాలక్ష్మిగా కనపడుతూ; ప్రతి ఇల్లూ వైకుంతమా! అన్న ఆశ్చర్యం కలిగించేది.

ఆ కుండిననగరంలో చారుమతి అనే బ్రాహ్మణ స్త్రీ చుక్కల్లో చంద్రునిలాగా వర్చస్సుతో ప్రకాశిస్తూ ఉండేది. ఆ యువతి భర్తకూ, అత్తమామలకూ నిత్యమూ సపర్యలు చేస్తూ మంచి గృహిణి అన్న పేరు తెచ్చుకుంది. ప్రతిరోజు తెల్లవారుజామునే స్నానాదుల నాచరించి పుణ్యకార్యాలను నిర్వహించు





కొంటున్న గుణవతి అయిన చారుమతికి ఒకనాడు కలలో శ్రీమహాలక్ష్మి ప్రత్యక్ష్యమైంది.

"ఓ చారుమతీ! సచ్ఛీలవతీ! పవిత్రమైన నీ నడతకు, పెద్దలకు వినయ వినమ్రతతో నీవు చేస్తున్న సపర్యలకు చాల సంతోషం కలిగింది. గృహలక్ష్మివైన నీ మీద నాకు అనుగ్రహం కలుగుతున్నది. నేను సకలవరాలను ఇట్టే అనుగ్రహించగల "వర లక్ష్మీదేవి"ని. అందువల్ల నేను ఆదేశించినట్లుగా నీవు "వరలక్ష్మీ వ్రతం" అనే వ్రతాన్ని భక్తి శ్రద్ధలతో ఆచరించు. వచ్చే శ్రావణ మాసంలో పున్నమినాటికి ముందు వచ్చే శుక్రవారం నాడు ఈ వ్రతాన్ని నియమనిష్ఠలతో నిర్వహించుకో" అంటూ లక్ష్మీదేవి కలలో ఉపదేశించింది.

చారుమతి ఆ కలలోనే తనకు ప్రత్యక్షమైన మహాలక్ష్మికి ప్రదక్షిణ నమస్కారాలను భక్తిపూర్వకంగా సమర్పించింది.

**నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే,**
**శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణు వక్షః స్థలాలయే.**

**శ్రీమత్సౌభాగ్య జననీం స్తౌమి లక్ష్మీం సనాతనీమ్,**
**సర్వకామ ఫలావాప్తి సాధనైక సుఖావహామ్.**

అంటూ రెండు చేతులను జోడిస్తూ ప్రార్థించింది. నేను ఏ జన్మలోనో చేసుకున్న పుణ్యం వల్ల తల్లీ! నీ దర్శనభాగ్యం కలిగింది అంటూ అనేకవిధాలుగా చారుమతి లక్ష్మీదేవిని కీర్తించింది.

వెంటనే నిద్ర నుండి మేల్కొన్న చారుమతి భర్తకు, అత్త మామలకు తన దివ్య స్వప్నవృత్తాంతాన్ని, శ్రీ మహాలక్ష్మి ఆదేశాన్ని తెలియజేసింది. వారల అనుమతితో వరలక్ష్మీ వ్రతా చరణకు దీక్ష పూనింది. ఆ వ్రతానికి కావాల్సిన సంభారాలను, పూజాద్రవ్యాలను సమకూర్చుకొంది. ఇంతలో శ్రావణమాసం రానే వచ్చింది. పున్నమినాటికి ముందు వచ్చే శుక్రవారం నాడు చారుమతి ఆమె స్నేహితురాండ్రు ఈ రోజే గదా 'వరలక్ష్మీ వ్రతం' ఆచరించవలసిన రోజు అని అందరూ తెల్లవారుజామునే నిద్రలేచారు. అభ్యంగన స్నానాదులను పూర్తిచేసికొని రంగు రంగుల పట్టుచీరలను ధరించారు. ఇలాగా పుణ్యస్త్రీలతో కూడిన చారుమతీదేవి తమ ఇంటిలో దేవుని మూలన అనగా ఈశాన్యభాగాన ఆవుపేడతో అలికి ముగ్గులు పెట్టింది. అచ్చోట ఒక మండపాన్ని ఏర్పాటుచేసింది. ఆ మండపంలో కొత్తబియ్యం పోసి అష్టదళపద్మంగా తీర్చిదిద్ది, ఆ బియ్యంపై నిండుగా జలాన్ని సేకరించిన కలశాన్ని, అందులో పంచపల్లవాలని పేరు పొందిన మర్రి, మామిడి, మేడి, జువ్వి, రావి చిగుళ్లను ఉంచింది. ఆ కలశంపై పూర్ణఫలమైన నారికేళాన్ని, దానిపై ఎర్రటి రవిక గుడ్డను అలంకరించింది. ఆ కలశం ముందుభాగంలో లక్ష్మీదేవి ముఖ కవచాన్ని శోభాయమానంగా ఏర్పాటుచేసింది. ఆ కలశంలో విధివిధానంగా జగన్మాత అయిన శ్రీ వరలక్ష్మీదేవిని ఆవాహనం చేసింది.

**జయతు జయతు లక్ష్మీర్లక్షణాలంకృతాంగీ**
**జయతు జయతు పద్మా పద్మ సద్మాభివంద్యా,**
**జయతు జయతు విద్యా విష్ణువామాంక సంస్థా**
**జయతు జయతు సమ్యక్ సర్వసంపత్కరీ శ్రీః.**

సర్వశుభలక్షణాలతో ప్రకాశిస్తూ ఉన్న దివ్యమైన శరీర అవయవాలు కలిగిన శ్రీ మహాలక్ష్మికి జయమగుగాక! జయ

మగు గాక! పద్మసంభవుడైన బ్రహ్మదేవుని చేత ప్రణామాలందు కొనే పద్మావతికి నిత్యమూ జయమగుకాక! వైకుంఠవాసుడైన శ్రీ మహావిష్ణువునకు వామాంకంలో వెలుగొందుతూ 'విద్యా' అని పిలువబడుతున్న జగన్మాతకు జయమగుగాక! నిత్యమైన సత్యమైన సమస్తసంపదలను ప్రసాదించగల ఓ వరలక్ష్మీ! నీకు జయమగు గాక! నిత్యమూ శుభమగుగాక!!

అంటూ జయజయధ్వానాలతో శ్రీ వరలక్ష్మిని కీర్తిస్తూ చారుమతీదేవి, ఆవాహనం చేసిన వరలక్ష్మిని ధ్యాన ఆవాహ నాది షోడశోపచారాలతో, అష్టోత్తర శతనామాలతో అర్చించి అనేక విధాలైన భక్ష్యాలను, పిండివంటలను, ఫలాలను నైవే ద్యంగా సమర్పించి, తొమ్మిది దారాలతో తయారుచేయబడిన తోరాన్ని అర్చించి, దాన్ని కుడిచేతికి కట్టుకుని భక్తిగా ప్రదక్షిణ, నమస్కారాలు సమర్పించింది.

మొదటి ప్రదక్షిణం చేసి నమస్కారం చెయ్యగానే చారుమతీదేవికి, తోటి పుణ్యస్త్రీలకందరికి కాళ్లయందు ఘల్లు ఘల్లున మ్రోగే గజ్జెలు కలిగాయి. ఇది గమనించిన చారుమతి, మిగిలిన స్త్రీ లందరు, ఓహో! వరలక్ష్మీదేవి అనుగ్రహం వెను వెంటనే ప్రత్యక్షంగా గోచరించింది కదా అని ఆనందిస్తూ మిగిలిన రెండు, మూడు ప్రదక్షిణలు కూడా పూర్తి చేశారు. అంతే! చారుమతికే గాక అక్కడ వున్న స్త్రీలకందరికి శరీర మంతటా ఆపాదమస్తకం నవరత్నాలు పొదిగిన బంగారు హారాలు ఏన్నో ఎన్నెన్నో అలంకరింపబడడమేగాక ఆ స్త్రీలందరి ఇండ్లు కూడా సమస్తసంపదలతో తులతూగాయి. రథ గజ, తురగ వాహనాలతో వారి ఇండ్లు నిండిపోయాయి.

ఆ తర్వాత చారుమతి శాస్త్రోక్తంగా వరలక్ష్మీవ్రతాన్ని నిర్వహింపచేసిన పురోహితుణ్ణి చందన పుష్పాక్షతలతో అర్చించి దక్షిణతాంబూలాలను సమర్పించి సంతృప్తిపరచింది. ఆ తర్వాత అందరూ వరలక్ష్మీదేవి ప్రసాదాన్ని తృప్తిగా కడుపార భుజించి, ఆహా! చారుమతీదేవి గొప్పదనమేమిటి? ఎంతటి సౌశీల్యవతి! ఆమె దయవల్లనే కదా మనకందరికి వరలక్ష్మీదేవి అనుగ్రహం కలిగింది అనుకుంటూ చారుమతి మహాభాగ్యాన్ని కొని యాడుతూ ఆమె అనుమతిని, ఆశీస్సులను స్వీకరించి వారి వారి ఇండ్లకు ఆనందంగా వెళ్ళారు.

**కొత్తగోపురం (అలిపిరి నుండి రెండవ గోపురం)**

**ఈ గోపురాన్ని 17 వ శతాబ్దిలో మట్లకుమార అనంతరాజు నిర్మించాడు. ప్రస్తుతం అలిపిరి నుండి ఉన్న మెట్ల దారి కూడా మట్లకుమార అనంతరాజు ఏర్పరచిందే. ఈ గోపురంలో శ్రీనివాసునితోబాటు ఇతని తల్లిదండ్రుల విగ్ర హాలు కూడా చెక్కబడి ఉన్నాయి. తిరువెంగళనాథుడు, చెన్నమ్మ అని తెలుగు తమిళ భాషల్లో చెక్కబడి ఉన్నాయి. 1985 లో ఈ మెట్లమార్గాన్ని గ్రానైటు రాళ్ళతో తిరుమల తిరుపతి దేవస్థానం మెరుగుపరిచారు.**

ఇలాగ చారుమతీదేవి ద్వారా సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి లోకానికి అందించిన శ్రీ వరలక్ష్మీవ్రతాన్ని పార్వతీదేవికి పరమే శ్వరుడు తెలియజేశాడు. మహిమాన్వితమైన ఈ వ్రతాన్ని శ్రావణ మాసంలో పున్నమికి ముందువచ్చే శుక్రవారంనాడు ప్రతి సంవ త్సరం ఆచరించినట్లయితే స్త్రీలకు సకల సౌభాగ్యాలతో పాటు సకలసంపదలు, సుమంగళిగా దీర్ఘాయువు కలుగుతుందని సూతమహర్షి శౌనకాదులకు వివరించాడు.

ఒకవేళ శ్రావణమాసంలో పున్నమినాటికి ముందు వచ్చే శుక్రవారంనాడు వరలక్ష్మీవ్రతాన్ని ఆచరించడానికి వీలు కలగనివారు, అదే శ్రావణమాసంలో తర్వాత వచ్చే ఏ శుక్ర వారమైనా వరలక్ష్మీవ్రతాన్ని చేసుకోవచ్చు. అప్పుడు కూడా ఏ కారణాల వల్లో, ఏ ఇబ్బందుల వల్లో శ్రావణమాసంలో వర లక్ష్మీ వ్రతాన్ని ఆచరించలేకపోయినవారు, ఆ వెనువెంటనే వచ్చే ఆశ్వయుజమాసంలో దేవీనవరాత్రుల్లో వరలక్ష్మీవ్రతాన్ని చెయ్యవచ్చుని కొందరూ లేదా అమావాస్య దీపావళినాడైనా ఈ వ్రతాన్ని నిర్వహించవచ్చునని కొందరి పెద్దలమాట!

ఏది ఏమైనా శ్రావణమాసంలో వీలుకాని సందర్భంలో మాత్రమే మహిమాన్వితమైన వరలక్ష్మీవ్రతాన్ని వదలిపెట్టకుండా గృహిణులు ఆశ్వయుజమాసంలో నిర్వహించడం ఎంతైనా మేలు అని సారాంశం!

**నిత్యసౌభాగ్య సౌశీల్యం వరలక్ష్మీ దదాతి యా,**
**ప్రసన్నాం స్త్రైణ సులభాం ఆదిలక్ష్మీం నమామ్యహమ్.**

# శ్రీ గాయత్రీమాత విశిష్టత

– కె. సూర్యనారాయణమూర్తి

నాలుగు వేదాలకూ తల్లి గాయత్రి. గాయత్రీమంత్రం కంటే జపించదగ్గ మంత్రం మరొకటి లేదు. ఆ గాయత్రీమాత అనుగ్రహముంటే మనం చేసే ప్రతి పనీ శుభంగా ముందుకు సాగుతుంది. గాయత్రీమాతను చూడ గానే–

**శ్లో॥ ముక్తా విద్రుమ హేమనీలధవళ చ్ఛాయైర్ముఖైస్త్రీక్షణైః**
**యుక్తామిన్దు నిబద్ధరత్న మకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్,**
**గాయత్రీం వరదాభయాంకు శకశాశ్శుభ్రం కపాలం గదా**
**శంఖం చక్రమథారవిన్దయుగళం హస్తై ర్వహన్తీం భజే!**

గాయత్రీదేవి ముత్యపువర్ణము (ముక్త), పగడపు వర్ణము (విద్రుమ), బంగారుఛాయ(హేమ), నీలిరంగు (నీల), తెల్లని రంగు (ధవళ) గల ఐదు ముఖాలతో వెలుగొందుతూ, ఈ పంచవర్ణాల ధ్యానం భౌతిక, మానసిక, బుద్ధి కక్ష్యలపై ప్రభావం చూపుతూ, ముక్తిని కలిగిస్తూ పంచముఖగాయత్రిగా పేరొందింది. మనకు జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. మానసిక ప్రశాంతతను కలుగజేస్తుంది. ఆరోగ్యశక్తి నిస్తుంది. భక్తిభావాన్ని కలుగజేస్తుంది. ఏ దేవతనైనా గాయత్రీమంత్రాన్ని స్మరించి గానీ, ఓంకారాన్ని జపించిగానీ ప్రసన్నం చేసుకోవచ్చు.



గాయత్రి అనగా సర్వవేదాలకు మాతృస్వరూపిణి. "గాయ" అనగా జీవుడు; "త్రి" అనగా త్రికాలమందు జీవులను పోషించేది. ప్రాణులను రక్షించేది గాయత్రి అని కూడ అర్థం. అందుకే శ్రీకృష్ణుడు గీతలో "యజ్ఞానాం జప యజ్ఞోఽస్మి" అని చెప్పాడు. అందువల్ల గాయత్రీమంత్రం పర మోత్కృష్టం. సకలపాపాలను హరింపజేయగల శక్తి ఈ మంత్రంలో ఉంది. గాయత్రీమంత్రం సర్వవేదసారం. గాయత్రీ ఉపాసన ద్వారా సమస్త పాపాలనుండి; రోగ, శోకాలనుండి, దారిద్ర్యం నుండి విముక్తి చెందుతారు. సమస్త విఘ్నాలనుండి రక్షింపబడతారు. గాయత్రీ ఉపాసనవల్ల దీర్ఘాయువు, సమృద్ధిగా ధనం, సుపుత్రులు, సత్కీర్తి. సుప్రతిష్ఠ ప్రాప్తిస్తాయి. ధర్మార్థ కామమోక్షాలు సుసంపన్నంగా హస్తగతమౌతాయి.

ఓంకారంతో ప్రారంభమయ్యే మంత్రాలు పవిత్రమైనవి. అటువంటి మంత్రాల్లో గాయత్రీమంత్రం అత్యంత ప్రధాన మైనది. గాయత్రీ ఉపాసన హృదయసంబంధ వ్యాధి నివా రణకు రామబాణం వంటిది. దీనిని ఉపాసించేవారు భయంకర రోగాలచే బాధపడరు.

గాయత్రీదేవికి సంబంధించి భాగవతంలో నవమ స్కంధంలో ఒక చక్కని ఉపాఖ్యానం ఉంది. ప్రకృతి స్వరూపిణి అయిన ఆదిపరాశక్తి సృష్టి ప్రారంభవేళ యోగశక్తితో తనను తాను (ఆత్మ) రెండుగా విభజించుకుంది. వీటిలో కుడిభాగం పురుషునిగా, ఎడమభాగం స్త్రీగా రూపాంతరం చెందాయి. ఈ స్త్రీ రూపం మరల ఐదు స్త్రీ రూపాలుగా పరి ణామం చెందింది. అవి 1) పార్వతి 2) మహాలక్ష్మి 3) సరస్వతి 4) గాయత్రి 5) సావిత్రి. ఆదిపరాశక్తికి సృష్టిపరంగా మరెన్నో రూపాంత రాలున్నాయి.

**గాయత్రీమంత్రం :**

**ఓం భూర్భువస్వః ।**
**ఓం తత్సవితుర్వరేణ్యమ్ ॥**
**భర్గో దేవస్య ధీమహి ।**
**ధియో యో నః ప్రచోదయాత్॥**

**ఆగష్టు 25న**
**గాయత్రీ జపం**
**సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం.**

ఈ మంత్రంలో మొత్తం 24 బీజాక్షరాలు 24 దైవీ శక్తులుగా (గాయత్రీ దేవతలుగా) రూపొందాయి.

| | | |
|---|---|---|
| 1. | తత్ | గణేశుడు |
| 2. | స | నృసింహభగవానుడు |
| 3. | వి | విష్ణుదేవుడు |
| 4. | తుః | శివదేవుడు |
| 5. | వ | కృష్ణభగవానుడు |
| 6. | రే | రాధాదేవి |
| 7. | ణి | లక్ష్మీదేవి |
| 8. | యం | అగ్నిదేవుడు |
| 9. | భ | ఇంద్రదేవుడు |
| 10. | ర్గ | సరస్వతి |
| 11. | దే | దుర్గాదేవి |
| 12. | వ | హనుమంతుడు |
| 13. | స్య | పృథ్వీదేవి |
| 14. | ధీ | సూర్యదేవుడు |
| 15. | మ | శ్రీరాముడు |
| 16. | హి | సీతామాత |
| 17. | ధి | చంద్రదేవుడు |
| 18. | యో | యమదేవుడు |
| 19. | యః | బ్రహ్మదేవుడు |
| 20. | నః | వరుణదేవుడు |
| 21. | ప్ర | నారాయణుడు |
| 22. | చో | హయగ్రీవ భగవానుడు |
| 23. | ద | హంసదేవత |
| 24. | యాత్ | తులసీదేవి |

ఓంకారంతో కూడిన వ్యాహృతి పూర్వక త్రిపదా గాయత్రీమంత్రం బహుళ వ్యాప్తిలో ఉన్నది. గృహస్థులు. బ్రహ్మ చారులు దీన్ని జపించవచ్చు. మూడు సంధ్యా సమయాల్లోను జపించవచ్చు.

**ఉత్తమాతార కోపేతా । మధ్యమా లుప్త తారకా ।**

**అధమా సూర్య సహితా । ప్రాతః సంధ్యా త్రిధా మతా ॥**

**గాలిగోపురం (అలిపిరి నుండి మూడవ గోపురం)**

**17వ శతాబ్దికి చెందిన ఈ గోపురం అగ్రగోపురంగా పిలువబడుతున్నది. సూర్యవంశస్థులైన దేవచోడ కుటుంబా నికి చెందిన మట్లకుమార అనంతరాజు తనతండ్రి తిరువెంగళ నాథ, తల్లి చెన్నమాంబ స్మృత్యర్థం ఈ గోపురం నిర్మించాడు. దీనికి సంబంధించిన మట్లకుమార శాసనం అలిపిరిలోని పాదాలమండపంలో తెలుగు గ్రంథలిపులలో చెక్కబడి ఉంది.**

ఉభయసంధ్యోపాసన నక్షత్రాలతో కూడిన సమయంలో చేయబడితే ఉత్తమం. నక్షత్రాలు లోపించిన పిమ్మట చేయబడితే మధ్యమం. సూర్యునితో కూడినప్పుడు చేయబడితే అది అధమం.

**అష్టోత్తర సహస్రం వా అష్టోత్తరశతం తు వా ।**

**అష్టావింశతి రేవాఽథ గాయిత్రీం దశకం జపేత్ ॥**

గాయత్రీజపం పఠించేటప్పుడు సంఖ్యావిషయం కూడ చెప్పబడింది. 1008 సార్లు, 108 సార్లు, 28 సార్లు, కనీసం 10సార్లు అయినా గాయత్రిమంత్రాన్ని జపించాలి. ఎంత మాత్రమూ మాన కూడదు.

ఈ గాయత్రీమంత్రాన్ని పఠించేటప్పుడు నోటిని మూసు కుని, నాలుకకు దంతాలు తగులకుండ అక్షరాలను స్పష్టంగా మనస్సులో మననం చేస్తూ గోప్యంగా జపించాలి. చేతులను వస్త్రంతో కప్పుకుని శంఖమాలతో గానీ, రుద్రాక్ష పూసలతో గానీ, చేతివేళ్ళ కణుపులతో గాని జపించాలి. ఉదయకాలంలో జపిస్తే "మిత్రస్య" అనాలి. మధ్యాహ్నకాలం జపిస్తే "ఉద్ధుత్యాం" అనాలి. సాయంకాలం జపిస్తే "ఇమంమే వరుణ" అనాలి. జపం పూర్తైన తర్వాత "నమో బ్రహ్మణే" అని మూడుసార్లు పఠించి ఉదకాన్ని స్పృశించాలి.

**అగ్నిర్ముఖం, బ్రహ్మశిరః**

**విష్ణుర్ హృదయం, రుద్రశ్శిఖా**

అని గాయత్రీరూపాన్ని గురించి వేదపాఠం సృష్టి స్థితి లయ కారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులే గాయత్రీదేవి అవ యవాలు అని దేవీ భాగవతం వర్ణించింది. ఆ గాయత్రీ మాత ఆశీస్సులు జనులందరు పొందుదురు గాక!

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీవారిసేవ వాలంటీర్లకు మార్గదర్శక సూత్రాలు

**శ్రీవారి సేవలో ఒక వారంపాటు సేవలందించుటకు పది మంది సభ్యులు తక్కువ కాకుండా ఉన్న సముదాయానికి అర్హత లభిస్తుంది. నిస్వార్థ సేవ అందించుటకుగాను ఈ సభ్యులకు ఆధ్యాత్మిక పరిజ్ఞానము కల్గివుండాలి. లింగ భేదము లేదు. ఆసక్తిగల సమూహంలోని సభ్యులు వారియొక్క పేరు, చిరునామా, వయస్సు, లింగము, మొదలైన వివరాలతో క్రింది చిరునామాకు ఒక నెల ముందుగా పౌరసంబంధాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, కపిలతీర్థం రోడ్డు, తిరుపతి - 517 501 వారికి పంపాలి. మరిన్ని వివరాలకు సంప్రదించవలసిన ఫోన్ నంబర్లు : 0877 - 2263544, 0877 - 2264392.**

- శ్రీవారిసేవ వాలంటీర్లు శ్రీవారిసేవలో భక్తులకు నిస్వార్థంగా సేవలందించడానికి మాత్రమే రావలెను.
- వీరు పిల్లలు, వృద్ధులు మరియు వ్యాధిగ్రస్థులను తమ వెంట తీసుకొని రాకూడదు.
- శ్రీవారిసేవకు కేవలం హిందువులు మాత్రమే అనుమతింపబడతారు.
- శ్రీవారిసేవకులను హిందువులుగా గుర్తించడానికి అనుకూలంగా తిరునామం/ తిలకం లేక కుంకమ/ చందనం తప్పక నుదుట ధరించాల్సి ఉంటుంది.
- తిరుమలలో ఆర్.టి.సి. బస్టాండులో ఉన్న **శ్రీవారి సేవా సదన్** కార్యాలయంలో ప్రత్యేకాధికారి లేదా సూపరింటెండెంట్‌గారి వద్ద ఆర్డరు ఇచ్చిన తేదీ ప్రకారము ఉదయం పది గంటల నుండి ఐదు గంటల లోపు హాజరు కావల్సి ఉంటుంది.
- శ్రీవారిసేవా కార్యాలయంవద్ద ప్రతిరోజు సాయంత్రం నాలుగు గంటలకు డ్యూటీ కేటాయించబడుతుంది. వీరు ప్రతిరోజు కనీసం నాలుగు నుండి ఆరు గంటలు పని చేయాల్సి ఉంటుంది.
- ఈ సేవకులకు ఉచిత వసతి కల్పించబడుతుంది. వీరికి యాత్రికుల అమెనిటీస్ కాంప్లెక్సులో వసతి కల్పించినచో లాకరుకు స్వంత తాళంచెవులు తెచ్చుకోవలసి ఉంటుంది.
- సేవలో ఉన్నప్పుడు మాత్రమే శ్రీవారిసేవ స్కార్ఫ్‌లను ధరించవలెను. శ్రీవారి దర్శనానికి వెళ్లునపుడు వీటిని ధరించాల్సిన అవసరం లేదు.
- శ్రీవారి సేవకులు ప్రతి శుక్రవారం ఉదయం 7 గంటలకు ఆస్థానమండపంనందు ఏర్పాటు చేసే శిక్షణా తరగతులకు విధిగా హాజరు కావాలి.
- శ్రీవారి సేవకులు సేవలో పాల్గొనే సమయంలో పురుషులు తెలుపురంగు వస్త్రాలను, స్త్రీలు తెలుపురంగు రవికె, నీలంరంగు చీరలు తప్పనిసరిగా ధరించాలి.
- తిరుమలలో ఎల్లప్పుడు **'గోవింద'**నామాన్ని స్మరిస్తూ, భక్తులను **'గోవింద, గోవింద'** అని పలకరించండి.
- యాత్రికులకు సహాయం నిమిత్తము ఈ వాలంటరీ సేవ ఏర్పాటు చేయడమైనది. ఎవరికి గాని ధన రూపంగా, వస్తురూపంగా ఎటువంటి చెల్లింపులు చేయనవసరంలేదు. ఈ సేవ పూర్తిగా ఉచితం.
- ప్రతిరోజు వీరు భజనలు నగరసంకీర్తనలలో పాల్గొనవలసి ఉంటుంది. శ్రీవారిసేవ కార్యాలయంలో అందుబాటులో ఉన్న సంగీత వాయిద్యాలను శ్రీవారి సేవకులు ఉపయోగించుకోవచ్చు.
- శ్రీవారి సేవకులు వేంకటేశ్వరునికి చేయు పవిత్ర సేవగా భావించి శ్రీవారిసేవను అంకిత భావంతో చేయాలి.




**(కురుక్షేత్ర యుద్ధంలో విజయులైన పాండవ వీరులు ధృతరాష్ట్రుడు, గాంధారిల ఆశీర్వాదం కోసం రావడంతో పాటు, గాంధారి మాతృతప్త హృదయాన్ని కూడా ఈ సంచికలో చదువవచ్చు)**

మహారాణీ! నీ కుమారులు వీరోచితంగా పోరాడి స్వర్గం చేరారు. అక్కడ దివ్య భోగాలు పొందుతూంటారు. ఎందుకమ్మా! వారికోసం శోకిస్తావు. అసంఖ్యాకంగా దానధర్మాలు చేసినవారు పొందలేని దివ్యలోకాలు చేరిన వారికోసం విచారం అనవసరం!

పైగా, పాండవులు విజయశ్రీ సముపేతులయ్యారని అనుకుంటున్నావేమో! నిజానికి వారి విజయం ఏం విజయమమ్మా! ఉపపాండవులతో పాటు ధృష్టద్యుమ్నాదులందరినీ నిన్ననే నేలపాలు చేశాం. ఏం మిగిలింది వారికి! అని సర్వ విషయాలూ వివరించి వారు నిష్క్రమించారు.

**ధర్మరాజు**

ధృతరాష్ట్రుడు కురుక్షేత్రానికి వస్తున్నాడని విన్న ధర్మరాజు: కృష్ణా! ఇప్పుడు నేను ఆ మహారాజును చూడడం అవసరం కదా! అందరం వెళ్ళి ఆయనను పరామర్శించాలి అన్నాడు. పాండవులతో పాటు సాత్యకి కూడా వెళ్ళాడు. ద్రౌపదీ దేవి నిర్భర దుఃఖంతో నడిచింది. ఆమె వెంట పాంచాల, మత్స్య దేశ స్త్రీలందరూ వచ్చారు. అదే సమయానికి యుయుత్సుడు దుర్యోధనాదుల నారీమణులందరినీ తీసుకువచ్చాడు. ధృతరాష్ట్రుని వెంట వచ్చిన స్త్రీలందరూ ధర్మరాజును చూసి పరిపరివిధాల ఆడిపోసుకుంటూంటే పాండవాగ్రజుడు తలవంచి నిలబడ్డాడు. నెమ్మదిగా ధృతరాష్ట్రుని సమీపించాడు.

ఆయన ప్రక్కనున్నవారు, ధర్మరాజు వచ్చాడని చెప్పారు. పెత్తండ్రి పాదాలకు ధర్మరాజు నమస్కరించాడు. ధృతరాష్ట్రునికి గుండెలో మంట పుట్టినా, పైకి వాత్సల్యంతో ధర్మజుని కౌగలించుకుని, ఓదార్పు మాటలు పలికాడు. భీమార్జున నకుల సహదేవులు కూడా వచ్చినట్లు చెప్పగా, భీముడనేమాట విన బడడంతో ఆయన గుండెలో నిప్పుపుట్టింది.

అది గ్రహించాడు వాసుదేవుడు. అంతకు ముందే తయారు చేయించిన భీముని ఆకారం గల ఇనుప విగ్రహం ఆయన ముందు నిలబెట్టగా, ఆయన తీవ్ర క్రోధంతో ఆ విగ్రహాన్ని గట్టిగా కౌగలించుకోగా అది ముక్కలు ముక్కలై పొడిపొడిగా రాలిపోయింది. ఆయన గుండెలో సంతోషం పొంగుతున్నా, పైకి మాత్రం "అయ్యో నాయనా, భీమసేనా" అని శోకించడం మొదలుపెట్టాడు.

అప్పుడు నవ్వు రాజిల్లెడు మోముతో వాసుదేవుడు: మామా! ఎందుకు బాధ పడతావు. నీ బాహు బంధంలో నలిగినవాడు భీముడు కాడు. అది ఇనుపబొమ్మ. నీ మనసు నాకు తెలుసు. పైగా నీ భుజశక్తి ఉన్నదే, అది ప్రళయకాల యముని దంష్ట్రలతో సమమైనది. అందుకే నేనీ ఆలోచన చేశాను. అదీ కాక మామా! ఇప్పుడు నువ్వు ఈ పాండవు లయిదుగురునీ సంహరించినా నీ కొడుకులలో ఒకడైనా బ్రతికి వస్తాడా! ఎందుకింత ఆగ్రహం! వేదాలు చదివావు, శాస్త్రచర్చలు విన్నావు. సర్వపురాణాలూ ఎరుగుదువు. లోకం తెలిసిన వృద్ధుల గోష్ఠులు వింటున్నావు. ధర్మ పరిజ్ఞానం ఉంది.

అయినా, భీష్మ ద్రోణ విదురులు, సంజయుడు, నేను అందరం చెవినిల్లుకట్టుకు చెప్పాం. నీ చెవి కెక్కలేదు. ఆనాడు

# యాత్రికులకు సౌకర్యాలు

**తిరుమలలోని పురోహిత సంఘం :**

వివాహం, ఉపనయనం, చెవిపోగులు కుట్టడానికి భక్తులు సుదర్శన సత్రంలోని పురోహిత సంఘాన్ని సంప్రదించవచ్చు. **ఫోన్ :** 0877 – 2263460.

**అంగప్రదక్షిణ వివరాలు :**

శ్రీవారి ఆలయంలో అంగప్రదక్షిణ చేయగోరు భక్తులు వైకుంఠం క్యూ కాంప్లెక్స్–1కి ఎదురుగా ఉన్న ఆర్జితసేవా కౌంటరు ద్వారా బయోమెట్రిక్ టోకెను తీసుకోవాలి. ఇది రాత్రి 8.00 గంటలకు ఇవ్వబడుతుంది.

**తులాభారం వివరాలు :**

భక్తులకు శ్రీవారి ఆలయం లోపలే బ్యాంకు కౌంటర్ల ద్వారా చిల్లర నాణాలు లభిస్తాయి.
**ఫోన్ :** 0877 – 2263610.

**నేరుగా సేవా టిక్కెట్లు పొందే విధానం :**

తిరుమలలోని విజయా బ్యాంకు ద్వారా టిక్కెట్లు ఒక్కరోజు ముందుగా పొందవచ్చు.
**ఫోన్ :** 0877 – 2263277.

**అంబులెన్స్ :**

అనారోగ్యానికి, ప్రమాదాలకు గురయ్యే భక్తుల సౌలభ్యం కోసం శ్రీవారి ఆలయం ముందు అంబులెన్స్ సిద్ధంగా ఉంటుంది. **ఫోన్ :** 0877 – 2251062.

**ఆటోమొబైల్ క్లినిక్ :**

తిరుమలకు పోయే రోడ్డులో యాత్రికుల వాహనాలు యాంత్రికలోపంవల్ల ఆగిపోయినప్పుడు ఒక మెకానిక్‌తో ఉన్న సంచార వాహనం అందుబాటులో ఉంటుంది.

**రక్తనిధి :**

తిరుమలలోని అశ్వినీ వైద్యశాలలో భక్తులు రక్తదానం చేయవచ్చు.

జూదంలో నెగ్గిన గర్వంతో సభామధ్యానికి ద్రౌపదిని తెచ్చి వస్త్రాపహరణం చేసిన వారు కదా నీ కొడుకులు. అటువంటి దుష్టులను చంపినందుకు కదా నువ్వు ఇప్పుడు భీమసేన సంహారానికి సంకల్పించావు. ఇప్పటికైనా నీ కొడుకుల దురాగతాలు తెలుసుకుని వారి పీడ వదిలినందుకు శాంత చిత్తంతో ఉండు, అన్నాడు.

వాసుదేవా! నువ్వు చెప్పినదంతా నిజమే. కానీ పుత్ర మరణ శోకంతో మనస్సు వికలమై పాపపు కోపంతో ఏమో చెయ్యబోయాను. అందుకు నీకు కోపం రావడం సహజమే. ఇప్పుడింక నీ మాట ప్రకారం శాంతితో ఈ పాండవులతో ప్రేమగా ఉంటాను, అన్నాడు.

అనంతరం యుయుత్సుని కూడా దగ్గరగా తీసుకున్నాడు. ధృతరాష్ట్రుని కోరిక ప్రకారం పాండవులైదుగురూ గాంధారిని పరామర్శించడానికి వెళ్ళారు. అందరూ పాదాభివాదం చేశారు. ఆత్మనందనుల మరణంతో శోకభరమైన గాంధారి, ధర్మరాజును శపించడానికి ఉద్యుక్తురాలవుతున్న వేళకు వ్యాసమహర్షి విజయం చేసి: "అమ్మాయీ! ఎందుకమ్మా వీరి మీద అంత కోపం! నీ పెద్దకొడుకు యుద్ధానికి వెడుతూ నీ దగ్గరకు వచ్చి చేతులు జోడించి: అమ్మా! ఆశీర్వదించు, అని అడిగినప్పుడు "య తో ధర్మ స్తతో జయః" అన్నావు గుర్తుందా!

"నీ మాట ప్రకారం ధర్మమే జయించింది. ఇప్పుడింక అసూయాగ్రస్త హృదయంతో ధర్మం తప్పడం నీవంటి దానికి ఉచితమా! ప్రజలందరూ నిన్ను ధీరబుద్ధివని కొనియాడుతున్నారు నీవంటి శాంత చిత్త లేదని నేనెరుగుదును. అటువంటి గుణశీలవైన నువ్వు మాత్సర్యానికి లొంగకూడదు"అన్నాడు.

గాంధారి: నేను అసూయాపరురాలను అనుకోకండి. బాధతో మనసు కలత పడింది తప్ప ఈ బిడ్డలు కుంతికి ఎంత ప్రేమ పాత్రులో నాకూ అంతే. దుర్యోధనుని తులువతనంతో శకుని కర్ణ దుశ్శాసనుల దుష్టత్వంతో మా కురువంశం ఈ దశకు చేరింది. అందరు కొడుకులనూ కడతేర్చినా నా మనసు బాధపడలేదు. కానీ ఈ వసుదేవనందనుడు చూస్తూండగానే భీముడు తన గదాదండంతో దుర్యోధనుని నాభికి దిగువ

భాగంలో కొట్టడం అన్యాయం కదా! అదే నన్ను మరీ వేధి స్తున్నది.

భీముడు ఆ మాటలు వింటూనే గజగజ వణుకుతూ, వినయంతో వంగి "అమ్మా! ఒక్కమాట విను. ధర్మమో అధర్మమో ఆలోచించే అవకాశం లేదప్పుడు. నా ప్రాణ రక్షణ కోసం అలా చెయ్యక తప్పలేదు. ఇప్పుడు న్యాయాన్యాయాలు గురించి మాట్లాడుతున్నారు కనుక చెపుతున్నాను. ఇంతకాలంగా మీరు ధర్మరాజుకు చేసిన పరాభవాలన్నీ న్యాయ సమ్మతాలేనా! అన్నీ ఎందుకు! ద్రౌపది ఏకవస్త్రంతో ఉండగా నిండు సభకు రప్పించి ఎన్ని కూతలు కూశారు మీవారు. అక్కడితో ఆగారా! ఆ పుణ్య శీలకు తన తొడలు చూపించాడే నీ కొడుకు. అప్పుడు నా మనస్సు ఉడికిపోయి ఆ తొడలు నా గదా దండంతో విరగకొడ తానని ప్రతిజ్ఞ చేశాను. అప్పుడే ఆ పని చేసేవాడిని, కానీ, మా అన్నగారు అడ్డు చెప్పడంతో ఆ మాటకు కట్టుబడి ఆగి పోయాను.

అంతేకాదు, ఈ వాసుదేవుని రాయబారానికి పంపుతూ మనం అన్నదమ్ములం, మన మధ్య కలహాలు చూసి పదిమంది వేలెత్తి చూపి ఆనందించకుండా శాంతంగా ఉందాం, పెద్దల మాట విని మా రాజ్యం మా కియ్యి అని చెప్పి పంపాను. అయినా వినలేదు వాడు, ఏం చేస్తాం, ధర్మరాజు రాజు కాకనూ తప్పలేదు, నా ప్రతిజ్ఞ నెరవేర్చుకోకనూ తీరలేదు. అమ్మా! యుక్తా యుక్త వివేకం కల నువ్వు బాగా ఆలోచించు, అన్నాడు.

గాంధారి:

**ఆ చావు చావదగు న**
**న్నీ చునకున్ వాని వలన నిక్కం బరయన్**
**నీ చెప్పిన యన్నియు గల**
**వా చెయ్దియు తగవ నీకు నది యట్లుండెన్.**

అంతవరకూ బాగానే ఉంది. కానీ నాయనా, యుద్ధంలో శత్రువులను చంపి పారేస్తారు. కానీ ఆ శత్రువు శరీరం చీల్చి పచ్చి నెత్తురు త్రాగే క్రూరాత్ములుంటారా ఎక్క డైనా! అని అడిగింది.

భీముడు: అమ్మా! అలనాడు సభలోకి ద్రుపదరాజ నందనను తెచ్చి వస్త్రాపహరణానికి వాడు సాహసించినప్పుడు నేను చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవడానికి ఆ గుండెలనుండి జారే రక్తం దగ్గర పెదవి ఉంచానే కాని మనిషి రక్తం త్రాగడం మహా పాతకం అని ఎరుగనా! మరొక మాట ఏమంటే, అప్పుడలా రక్తపానం చేస్తున్నట్టు కనిపిస్తే ప్రతిపక్ష వీరులందరూ భయపడ తారని కూడా తెలుసు అంతే తప్ప తమ్ముడి రక్తం త్రాగే పాపిష్ఠి వాడినా!

గాంధారి: సరే నాయనా! వందమందినీ నేలకూల్చావు కదా! అందరూ మీకు అన్యాయాలు చేశారా బాబూ! ఈ ముసలితనంలో అంధులకు ఊత కర్రగా అయినా ఒక్క బిడ్డను మిగిల్చినా నీ ప్రతిజ్ఞ తీరదనుకున్నావా! మిగిలిన ఒక్కడూ మీ అన్నయ్యను రాజ్యం ఏలనివ్వడనుకున్నావా! ఇంతకూ ఆ మహారాజుగారెక్కడయ్యా?

ధర్మరాజు: అమ్మా! నేనిక్కడే ఉన్నాను; ధర్మరాజును. నీ పుత్రులను చంపించిన ఈ పాపాత్ముడిని శాపంతో కడతేర్చ వమ్మా! ఈ భూమండలంలోని రాజులనూ, వారి అనుచర వర్గాన్నీ నాశనం చేసిన పాపికి తగిన దండన విధించవమ్మా! నా కెందుకమ్మా ఈ రాజ్యం. స్నేహితులు, చుట్టాలు, బిడ్డలు యిందరూ మరణించారు నా వల్ల. అటువంటి ద్రోహబుద్ధికి రాజ్య భోగాలెందుకమ్మా! అని మాట రాక రెండు చేతులూ జోడించి నుదుట చేర్చాడు. అప్పుడా మహాపతివ్రత కనులకు గట్టిన బట్ట సందులనుండి కనుచూపు ధర్మరాజు పాదాల చివర పడింది. ఆ చూపులోని వేడికి ధర్మజుని పాదాంగుళులు కంది ఎర్రబడడం చూసిన అర్జునుడు వాసుదేవుని వెనుకకుచేరి నిల బడగా, మిగిలిన భీమ, నకుల సహదేవులు కళ్ళు గిర్రున తిరిగి తడబడి దూరంగా నడిచారు.

అప్పటికావిడ శాంతించి: నాయనా! వెళ్ళి మీ అమ్మను చూసి రండి, అంది. అందరూ కుంతీదేవి దగ్గరకు వెళ్ళారు. పదమూడేళ్ళైంది ఆ కన్నతల్లి తన బిడ్డలను చూసి.

ఇన్నేళ్ళుగా వారు అడవులలో, అజ్ఞాతవాసంలో పడిన క్లేశాలకు తోడు నిన్నటి యుద్ధంలో ఉపపాండవులందరూ మరణించిన శోకంలో ఉన్న బిడ్డలను చూచి కన్నీరు మున్నీరు

## మానవ నైజం

**పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః**
**న పాప ఫల మిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః**

*మానవులు ఎలాంటి పుణ్యకార్యాలను చేయడానికి ఇష్టపడరు. కానీ పుణ్య ఫలితాన్ని మాత్రం ఆశిస్తారు. అట్లాగే పాపఫలితాన్ని మాత్రం ఆశించరు, కానీ పాపకార్యాలను మాత్రం ప్రయత్న పూర్వకంగానే చేస్తారు.*

కాగా, గొంతు తడియారి మాట రాలేదు. పాండవులు కూడా అంతకు మించిన దుఃఖంతో ఆమె పాదాల మీద వ్రాలగా కుంతీదేవి ఒక్కొక్కరి మీద చేతులు వేసి వెన్నుదువ్వుతూ శరీరమంతా ఆప్యాయంగా తడుముతున్నది. యుద్ధ సమయంలో శస్త్రాస్త్ర ఘాతాలతో బొబ్బలెక్కిన చోట్ల మరొకసారి దువ్వి, వేడి నిట్టూర్పులు విడుస్తూ, దగ్గరగా తీసుకుంటూ వాత్సల్యంతో పల కరిస్తున్నది.

అప్పటికి శోకదేవత రూపం ధరించినట్లు కన్నీరే మేలి ముసుగుగా తడబడే అడుగులతో ద్రౌపదీదేవి తన అత్తగారిని సమీపించి: అత్తా! ఎన్నాళ్ళయిందో నీ మనుమలు నిన్ను చూసి. వారందరూ ఏరి? ఇంకా రారేం! అంటూ మూలం తెగిన తీగలా నేల వ్రాలింది. ఆమె దుఃఖంతో కుంతీదేవికి దుఃఖం కట్టలు త్రెంచుకు రాగా తాను కూడా కోడలి వెన్నుమీద వ్రాలి కొంతసేపు ఏడ్చి, నెమ్మదిగా తేరుకుని ఆమెను రెండుచేతులతో లేవనెత్తి ఓదార్చి దగ్గరగా తీసుకుంది; అప్పుడందరూ కలిసి గాంధారి దగ్గరకు వెళ్ళారు.

ద్రౌపదీదేవి ఆమె పాదాల మీద పడి వెక్కివెక్కి ఏడుస్తూంటే, ఆవిడ ద్రౌపదీదేవిని దగ్గరగా చేర్చుకుని: ఎందు కమ్మా ఏడుస్తావు. మీ అత్తగారిని చూశావా! ఒక్క మనుమడు కూడా దక్కకుండా పోయాడు. ఆ గుండెబాధ చల్లారుతుందా తల్లీ! నిన్ను నేను ఓదారుస్తాను. మరి నన్ను నువ్వు ఓదార్చాలి కదా! ఇద్దరం పుత్ర శోకంతో బాధపడుతున్న వాళ్ళమే.

ఇలా జరుగుతుందని ఆనాడే చెప్పాడు విదురుడు. అయినా నేను ఆపలేకపోయాను. పాపానికి ప్రాయశ్చిత్తం తప్పదు కదా! ఏమిటో అంటున్నాను. కానీ అంతా కాలవశమై సాగవలసిందే. ఇంక శోకించి ప్రయోజనం ఏమిటి! ఊరుకో తల్లీ, అని ఓదారుస్తున్నది. అనంతరం ఆ మహాపతివ్రతా శిరో మణికి వ్యాసమునీంద్రుని అనుగ్రహం వల్ల దివ్యదృష్టి లభిం చగా, రణరంగం అంతా ఆవిడ కళ్ళకు కట్టినట్లైంది.

అతిరథ మహారథుల శవాలు, మత్తేభాల, సైంధ వాశ్వాల కళేబరాలు, రక్తపుమడుగులో మాంసపు బురదలో ఉన్నాయి. కుక్కలు, నక్కలు, కాకులు, గ్రద్దలు యథేచ్ఛగా విహరిస్తూ ఆరగిస్తున్నాయి. కురుక్షేత్రం అంతా ఆవిడ మనో వీథిలో తాండవించింది. అక్కడకు వచ్చిన వ్యాసమహాముని వారందరికీ అగ్ని సంస్కారాలూ, పరలోక కర్మలూ సాగించం డని ధృతరాష్ట్రాదులకు చెప్పి వెళ్ళాడు. ఆ మాట వింటూనే అందరూ రణరంగం చేరి ఎవరి బంధువులను వారు వెదు కుతూ రోదనధ్వానాలారంభించారు.

అప్పుడు గాంధారి: దేవకీనందనా! చూస్తున్నావా! అంతః పురం విడచిరాని, ఎండ కన్నెరుగని నా కోడళ్ళందరూ కన్నీటి వాన కురుస్తూ ఎలా శోకిస్తున్నారో! అటు చూడవయ్యా! వారి మేనమామ శల్యుడు, ద్రుపదరాజు, కర్ణుడు, ద్రోణాచార్యులు, భీష్మాచార్యులు వీరందరూ నేలకూలినా, జ్వాల సన్నగిల్లినా, కాంతితగ్గని అగ్నిలా ఎలా ఉన్నారో! అదుగోనయ్యా! సుభద్ర కొడుకు గుణభద్రుడు, అభిమన్యుడు ఇందరి ప్రభలూ చల్లా ర్చినవాడు. అతిమధురంగా వీణా, వేణు గానాలతో నిత్యోత్సవం జరుపుకునే ఈ రాజ వంశీయులందరూ శునక జంబుక నాదాల మధ్య పడి ఉంటే గుండె బ్రద్దలవుతున్నదయ్యా!

కస్తూరితో, మంచి గంధంతో లేపనం చేసుకునే వీరందరి శరీరాలూ, మాంసపు బురదతో నిండి ఉన్నాయి. చూశావా? ఆ యోధులు! ప్రాణాలు పోయినా చేతిలో కత్తి విడువలేదు కాబోలు. ఆ బిగిసిన పిడికిలి చూస్తూంటే వారు మరణించారని అనుకోగలమా? ఈ నారీజనం అందరూ తండ్రినీ, భర్తనూ, బిడ్డలనూ కోలుపోయి శోకసాగరంలో పడి పోయారు. కొన్ని శరీరాల అవయవాలు నక్కలూ, రాబందులూ తినేయడంవల్ల, పాపం తమవారిని కూడా తాము గుర్తు పట్టలేక పోతున్నారు. ***(ఇంకా ఉంది)***

# సందేహాలు? సమాధానాలు!!

–'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**శ్రీ పోతన భాగవతం ద్వైతాద్వైత విశిష్టా ద్వైతాలలో దేనికి సంబంధించింది?**

**- వి.చిన్నయ్య, రాజంపేట.**

☛ సంస్కృత భాగవతానికి, శ్రీధరీయ వ్యాఖ్య అద్వైత వ్యాఖ్య. దానినాధారం చేసి కొనే పోతన భాగవతానువాదం చేశాడు. కాబట్టి పోతన భాగవతం, అద్వైతానికి సంబంధించింది.

**జన్మదినాలు తిథి వార నక్షత్రాదులనుబట్టి జరుపుకోవాలా? లేక అధునాతన రీతి క్యాలెండరులోని తేదీలనుబట్టా? ఏది సక్రమం?**

**- టేకుమళ్ళ శరత్, నెల్లూరు.**

☛ తిథి వార నక్షత్రాదులనుబట్టి జన్మదినోత్సవం జరుపుకోవటం సక్రమం. అప్పుడే తాను పుట్టిన సరియైన కాలం జరుపుకున్నట్లు.

**తిరుమలలో శ్రీనివాసుని మూలవిరాట్టు స్వయంభువా?**

**- కె. పద్మశిరీషా ప్రకాష్, చండీగఢ్.**

☛ తిరుమలలో వెలసిన శ్రీనివాసుడు స్వయంభువనేదే సత్యం. పురాణాలన్నీ కూడా ఆ విషయాన్నే నిర్ధారిస్తున్నాయి.

**తల్లిదండ్రులలో ఎవరు చనిపోయినా కర్మపెట్టే కొడుకులు తప్పనిసరిగా గుండు చేయించుకోవాలా?**

**- ఎన్.చిట్టిబాబు, విశాఖపట్నం.**

☛ ధర్మసింధు ప్రకారం, కేవలం కర్మచేసేవారేకాక పుత్రు లందరూ విధిగా ముండనం చేయించుకోవలసిందే. జ్ఞాతులు కూడ చేయించుకోవలెనని శాస్త్రం సూచిస్తున్నది. ఇప్పుడు జ్ఞాతులు అందరు, మీసాలు, గడ్డాలు మాత్రం తీయిస్తున్నారు. తల్లిదండ్రులు పోవటం దుఃఖకారకం. జుట్టు అందానికి ప్రతీక. దానిని తీసివేయటం వ్యక్తియొక్క విచారాన్ని సూచిస్తుంది.

**మహర్షులకు, మునులకు ఏమైనా తేడా ఉందా? లేక ఇద్దరూ ఒక్కటేనా? వివరించండి?**

**- టి. వెంకన్నబాబు, రాజమండ్రి.**

☛ *జ్ఞానస్యపారగమాత్ ఋషిః* – అనగా జ్ఞానముయొక్క చివర దర్శించినవాడని అర్థం. 'మనజ్ఞానే మన్యతేమునిః – జ్ఞానము గలవాడు, మౌనవ్రతం కలవాడని అర్థం. ఇద్దరూ ఒకటే – ఋషికన్న మహర్షి, మునికన్న మహాముని ఎక్కువ శక్తిగలవారు.

**బ్రహ్మమానసపుత్రులు ఎంతమంది? వారెవరు?**

**- సాయిరామానందస్వామి, పొదలకొండ.**

1) సనకుడు 2) సనందనుడు 3) సంత నుడు 4) సనత్కుమారుడు 5) సనత్సుజా తుడు 6) మరీచి 7) అత్రి 8) అంగిరసులు 9) పులస్త్యుడు 10) పులహుడు 11) క్రతువులు 12) వసిష్ఠుడు 13) కపిలుడు 14) వాసుదేవుడు 15) సంకర్షణుడు 16) నారదుడు 17) ప్రద్యు మ్నుడు 18) అనిరుద్ధుడు 19) స్వాయంభువమనువు 20) స్వారో చిషమనువు 21) ఉత్తమ మనువు 22) తామసమనువు 23) దైవ తమనువు 24) చాక్షుష మనువు 25) వైవస్వతమనువు బ్రహ్మ మానస పుత్రులు.

**సత్యహరిశ్చంద్రుడు ఏ రాజ్యానికి రాజు? ఆయన కుమారుడు లోహితాస్యుని పేరుకు అర్థం ఏమిటి?**

**- పెరుగుజాలయ్య, హైదరాబాదు.**

☛ హరిశ్చంద్రుని కథ భాగవతంలో ఒక విధంగా; మార్కండేయ పురాణంలో ఒక విధంగా; ఋగ్వేదం 16వ మండలంలో ఒక విధంగా ఉన్నాయి. హరిశ్చంద్రుడు సూర్యవంశరాజు. ఈయన తండ్రి త్రిశంకుడు. అయోధ్యానగరం రాజధానిగా పరిపాలిం చాడు. లోహితాస్యుడే రోహితాస్యుడుగా చెప్పబడినాడు. 'ర–ల యోరభేదః' అను సూత్రం ప్రకారం లోహితుడు–రోహితుడ య్యాడు. కెంపువంటి ఎర్రని ముఖంగలవాడని ఆ పేరుకి అర్థం.

**రామాయణంలో శబరి, హనుమ, లక్ష్మణ, జటాయువు, సుగ్రీవుల్లో ఎవరు ప్రప్రథమ భాగవతోత్తములో తెలుప గలరు?**

**- ఎ.పూర్ణచంద్రరావు, విశాఖపట్నం.**

☛ అందరూ భాగవతోత్తములే. ఎవరు ప్రథములనేది నిర్ణయిం చటం కష్టం. అయినా, హనుమంతుడు సాక్షాత్ శివస్వరూపుడని తులసీదాసు, భవభూతి చెప్పారు. స్వయంగా రామసేవార్థం అవతరించిన ఆయనకు భక్తి ఉండటం సహజం. ఇక లక్ష్మణుడు శేషస్వరూపుడు. నిరంతర విష్ణుభక్తుడు. తత్సేవకోసం జన్మించాడు. అన్నన్నాశ్రయించి జీవితం పండించుకోవాలన్న ఆయన భక్తి కూడ హేతుకమే.

జటాయువు రామునికోసం ఆత్మార్పణ చేసింది. దశ రథుని స్నేహితుడనని చెప్పుకొన్నది. పైగా రాముడు మానవుడు కాడని తెలుసు. మిత్రుని కుమారుని జాగరూకతతో చూసు కొన్నది. రావణుడు సీతాదేవిని తీసికొనిపోవుట అనే హరాత్పరి ణామానికి ఉగ్రత్వం పొందింది. రావణుని జయింపగలననే ధీమాతోనే వెళ్ళినా ఆత్మార్పణ చేసిన భక్తుల్లో అగ్రగామిగా నిలిచింది.

ఇక సుగ్రీవునిది పూర్తిగా హేతుకభక్తి రాముని శక్తి తెలియక ముందు ఆయనయందు అతనికి అంత భక్తిలేదు. తెలిసిన తదుపరి రాముని వల్ల తనకు రాజ్యప్రాప్తి, భార్యాలాభం కలుగు తాయనే ఆశతో, ఆకాంక్షతో భక్తుడుగా మారాడు.

శబరి బోయ వనిత. మతంగ మహర్షి శిష్యురాలు. గురువు గారితో పాటు బ్రహ్మలోకానికి పోదగింది. కానీ రామునికోసం, శరీరంలో ప్రాణాలు నిల్పుకుని పదిమాసాలెదురుచూచింది. రామాయణంలో చెప్పకపోయినా ఆళ్వారుల ప్రకారం ప్రతిదినం క్రొంగ్రొత్త ఫలాలను తెచ్చి రుచిచూచి రాముని కోసం నిల్వ చేసి ఎదురు చూడసాగింది. రామలక్ష్మణులు రాగానే ఆతిథ్యమిచ్చి వారి సాన్నిధ్యంలోనే యోగాగ్నితో శరీరాన్ని దగ్ధం చేసి ఊర్ధ్వ లోకాలకు వెళ్ళిపోయింది. భక్తులందరిలో ప్రథమగణ్యత్వం ఈమెదే కావచ్చు.

**రఘువంశం అంటారు తప్ప రామవంశం అనరు? ఎందు వల్ల? - గంధం దేవసేనాపతి రెడ్డి, ఆర్.కొత్తపల్లి, కర్నూలు.**

☛ ఒక వంశానికి ఒక మహాపురుషుని పేరు వచ్చిన తర్వాత ఆ వంశంలో అంతకన్న గొప్పవారు జన్మించినా, ఆ మహాపురుషుని పేరే నిలిచిపోతుంది. అదే మనం లోకంలో కూడా చూస్తుంటాం. రఘువు సుదక్షిణాదిలీపుల కుమారుడు. వారు ఆరుమాసాలు నందినీ ధేనువును (కామధేనువు పుత్రిక) పూజించి, తద్వరంగా రఘుమహారాజును కన్నారు. ఈయన ఇంద్రునితో యుద్ధం చేసి జయించి, ఆతడు అపహరించిన యజ్ఞాశ్వాన్ని తిరిగి తీసికొని వచ్చాడు. ఆతడు విశ్వజిద్యాగం చేసి తనకున్నదంతా పేదలకు పంచి ఇచ్చాడు. అప్పుడే వరతంతు మహర్షి శిష్యుడు కౌత్సుడు ధనం కోసం రఘువును యాచించాడు. కుబేరుడాతడు కోరిన దానికన్నా ఎక్కువ తెచ్చి అర్పించాడు. రఘువు కౌత్సుడు కాదన్నా అందొక్క పైసా కూడ తాను ముట్టక ఆతనికే సమర్పించాడు. ఆయన కొడుకజుడు. అతని కొడుకు దశరథుడు. ఆతని కుమారుడు రాముడు. కాళిదాసు "రఘూణాం అన్వయం వక్ష్యే" అని రఘువంశం రచించాడు.

**పంచముఖాంజనేయస్వామిని గూర్చి తెలుపగలరు?**

**- డి.రామస్వామి, శ్రీకాకుళం.**

☛ ఆంజనేయస్వామి ఈ రూపాన్నెచ్చట ప్రదర్శించెనో పురాణా దులు వివరింపలేదు. మైరావణ వధార్థమై పంచముఖాలు దాల్చెనని, సౌగంధికాపహరణార్థమై పోవునపుడు భీమునకా రూపాన్ని ప్రదర్శించెనని, ద్రోణాద్రిని పెకలించువేళ ఈ రూపాన్ని ధరించెనని, అనుస్యూతంగా వస్తూ ఉన్న ఐతిహ్యాలే కానీ, ఇద మిత్థంగా ఫలానవేళ ఈ రూపం ప్రదర్శించినట్లు లేదు. పంచ ముఖాల్లో ఎదుట స్వస్వరూప ముఖం. కుడివైపున గరుత్మంతుని ముఖం యజ్ఞవరాహస్వామి ముఖం ఉంటాయి. ఎడమవైపు నివృత్తమైన సింహముఖం, (నృసింహావతారం) హయగ్రీవముఖం గోచరిస్తాయి. ఇది ఆంజనేయస్వామి విరాట్స్వరూపం. "ఏకంసత్ విప్రా బహుధావదంతి" దైవం ఒక్కడే. పండితులు భిన్నరూపా లుగా చెబుతున్నారనటానికి ఇది సంకేతం.

**ప్రాణ అపానాది వాయువులు మన శరీరంలో ఎక్కడెక్కడ ఉత్పత్తి ఔతున్నాయి? ఏవేవి, ఏయే పదార్థాలను జీర్ణింప జేస్తాయి? - చింతా ఓంకారశర్మ, విశాఖపట్నం.**

☛ **ప్రాణోఽ పానస్సమానశ్చోదాన వ్యానౌచవాయవః**
**హృదిప్రాణోగుదేఽ పానః సమానో నాభిసం స్థితః**
**ఉదానః కణ్ఠదేశస్థో వ్యాన స్సర్వశరీరగః**

1) ప్రాణము 2) అపానము 3) సమానము 4) ఉదానము 5) వ్యానము అనే పంచవాయువులు శరీరంలో ఉన్నాయి.

ప్రాణం హృదయస్థానంలో, అపానం గుదస్థానంలో, సమానం నాభిస్థానంలో, ఉదానం కంఠప్రదేశంలో, వ్యానం శరీరమంతా వ్యాపించి ఉన్నాయి. ప్రాణం ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు కారణం. అపానం పదార్థాలన్నింటిని క్రిందివైపునకు లాగి మలమూత్రాలకు కారణమౌతున్నది. సమానం బ్రతుకును కొన సాగిస్తుంది. ఉదానం వలన మాటలు ఊర్ధ్వముఖంగా ప్రయా ణించటానికి వీలు కలుగుతుంది. వ్యానం శరీరమంతా రక్తాదు లను పరిశుభ్రం చేస్తుంటుంది.

**క్రింద పేర్కొన్న తి.తి.దే. గ్రంథాలు లభించే చిరునామా :**
**పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తి.తి.దేవస్థానం,**
**తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083.**
**ఇతర వివరాలకు : 0877 - 2264294**

తిరుమల తిరుపతి దేవస్థానముల....

# పుస్తక పరిచయం



[14]

## తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథాలు

### 1) శ్రీనమ్మాళ్వారుల తిరువాయ్‌మొళి

**రచయిత– మాడభూషి రామానుజాచార్యులు**
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 570;
ధర : రూ.175/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.55/-)

ఆళ్వారులలో అగ్రగణ్యులైన నమ్మాళ్వార్లు గానం చేసిన నాల్గు దివ్యప్రబంధాల్లో తిరువాయ్‌మొళి అత్యంత ప్రధానమైంది. ఇది ద్రావిడ వేదసారంగా కీర్తించబడింది. తమిళంలో ఉన్న ఈ గ్రంథానికి శ్రీమాన్ మాడభూషి రామానుజాచార్యులువారిచే వ్రాయబడిన ప్రతిపదార్థ తాత్ప ర్యాలతో తిరువాయ్‌మొళి ప్రబంధాన్ని తి.తి.దేవస్థానం వారు 1950లో ప్రచురించారు. ఈ గ్రంథప్రతులు చాలాకాలంగా మనకు లభించడం లేదు. పాఠకుల హృదయాన్ని గమనించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఈ గ్రంథాన్ని తిరిగి ఇపుడు పునర్ముద్రించారు.

---

### 2) రామాయణం

**వచనానువాదం– ఉషశ్రీ**
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 359;
మూల్యం: రూ.35/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.40/-)

రామాయణం ఆదికావ్యం. రామాయణంలా కుటుంబ విలువల్ని బోధించే ఇతిహాసం మరొకటి లేదు. ఆదికవి వాల్మీకి నుంచి నేటి మల్లెమాల దాక అనేకమంది కవులు రమణీయమైన రామకథను పలు భాషలలో పలు రీతులలో వెలయించారు. మనోహరమైన కవిత్వ ఆనందాన్నేగాక సర్వశుభాలను కలుగజేసే మహాగ్రంథం రామాయణం.

ఈ రామాయణాన్ని ఉషశ్రీ ఆకాశవాణి కేంద్రంలో ధారా వాహికగా ప్రసంగించగా ఆంధ్రదేశం నలుమూలలా శ్రోతలను ఆకట్టు కున్నది. ఈ ధారావాహికను పుస్తకంగా తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది. అనేకసార్లు పునర్ముద్రణ పొందిన వచన రామాయణమిది.

---

### 3) శ్రీమద్భాగవతం

**వచనానువాదం– ఉషశ్రీ**
సైజు: 1/8 డెమ్మీ; పుటలు: 227;
మూల్యం: రూ.20/-
(పోస్టేజి ఛార్జి అదనం రూ.40/-)

భాగవతం తెలుగునాట ఇంటింటినీ అలరించిన పురాణం. సంస్కృత భాగవతాన్ని పోతన అతిసుందరంగా తెలుగులో అనువదించి, మనకు అందించారు. భాగవతంలోని వేలపద్యాల్లో కనీసం ఒక పద్యమైనా రానివారు ఎవ్వరూ ఉండరు. పోతన పద్యశక్తి అలాంటిది. ఈ పద్యకావ్యానికి ఉషశ్రీ చక్కటి వచనాన్ని అందించారు. దీనిని తిరుమల తిరుపతి దేవస్థానం ప్రప్రథమంగా 1970లో ముద్రించింది. అప్పటి నుండి ఇప్పటివరకు ఆరు సార్లు పునర్ముద్రణ పొందిన భక్త గ్రంథమిది.

**ఈ గ్రంథాలను పోస్టుద్వారా పొందదలచిన వారు 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి' వారి పేరున డి.డి.ని తీసి పై చిరునామాకు పంపాలి.**

## గ్రంథసమీక్ష

గొల్లపూడి వారి

# తాళపత్ర నిధి

**రచయిత**–మైథిలీ వేంకటేశ్వరరావు; **పుటలు**–408; **సైజు** –1/8 డెమ్మీ; **వెల**–రూ. 210/–; **ప్రాప్తిస్థానం:** గొల్లపూడి వీరాస్వామి సన్స్, పబ్లిషర్స్ & బుక్ సెల్లర్స్, కోటగుమ్మం, రాజమండ్రి – 533 101.

మన భారతీయ మహర్షులు బోధించిన సనాతన ధర్మము మానవ శ్రేయోదాయకమైనది. ఇది విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధిస్తున్నది. ఆ ధర్మాచరణలో మనకు ఎన్నో సందేహాలు పొడసూపుతాయి. వాటిని నివృత్తి చేసుకొనుటకు ఉద్దండ పండితుల ఆధ్యాత్మిక వేత్తల సహకారం చాలా అవసరం. మనకు సందేహాలు వచ్చినపుడు పండితులనాశ్రయించి వారిద్వారా తెలుసుకొనుట అన్ని సందర్భాల్లో సాధ్యం కాదు. మనం అటువంటి సమస్యల నుండి బయటపడేందుకు గ్రంథపఠనం చాలా అవసరం. అయితే మనకు కలిగే సమస్యలకు పరిష్కారం అనేక గ్రంథాలు చదివినందువల్ల మనకు కూడా కొన్ని పర్యాయాలు తీరదు. మన వేదాంతవేత్తల ఆధ్యాత్మిక రహస్యాలు అంత సులభంగా అర్థం కావు. అటువంటి వాటికి సులభ పరిష్కారమార్గం ఒకే ఒక గ్రంథంలో దొరకుతున్నది. ఆ గ్రంథమే 'తాళపత్ర నిధి".

ఇందులో 640 సందేహాలకు సులభశైలిలో చక్కని పరిష్కారాలు వివరించబడ్డాయి. నీరు విషమా? అమృతమా?, తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి అభయ హస్తానికి అర్థం ఏమిటి?, తీర్థం సేవించిన తర్వాత చేతిని తలకు రాసుకోవచ్చా? వైతరణీనది ఎలా ఉంటుంది? కార్తీకస్నానమెందుకు? మొదలగు సందేహాలకు సవివరమైన సహేతుకమైన సమాధానాలున్నాయి. ఇంకా భృగు మహర్షిసూక్తి, శ్రీ శుకునిసూక్తి, వశిష్ఠమహర్షిసూక్తి, దాల్భ్యునిసూక్తి, జమదగ్నిసూక్తి, వరుణుడిసూక్తి, బృహస్పతి సూక్తి, ధ్రువునిసూక్తి, ఆంజనేయునిసూక్తి, హిరణ్య కశ్యపుని సూక్తి, జాబాలిసూక్తి, దధీచిసూక్తి మున్నగు సూక్తులు క్రోడీకరించబడ్డాయి.

ఈ గ్రంథాన్ని కొన్నవారికి "ప్రాచీన తాళపత్ర నిధుల్లోని సంప్రదాయక శాస్త్ర పీఠం–ఆచార ధర్మములు–ఆలోచనలు" అనే 352 పేజీల గ్రంథం ఉచితంగా ఇవ్వబడుతుంది. ఇందులో 156 ప్రశ్నలూ, సందేహాలకు సమాధానాలను బ్రహ్మశ్రీ గుత్తికొండ వేంకటేశ్వరశర్మ వివరించారు. ఈ రెండు గ్రంథాలూ ఆధ్యాత్మిక వేత్తల పాలిట కల్పవృక్షాలు. వీటిని అధ్యయనం చేసినవారు అపార పాండితి వేదాంత పరిజ్ఞానులౌతారు. ఇది ప్రతి ఒక్కరూ చదువదగింది, ప్రతి ఇంట ఉండదగింది. **– డా॥ కె.రెడ్డప్ప**

# పద్మావతీ పరిణయం

**రచయిత**–తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి; **వెల**–అమూల్యం; **సైజు**–1/8 డెమ్మీ; **ప్రాప్తిస్థానం:** శ్రీ టి.వి. ఆర్.కె.మూర్తి, ఫ్లాట్ నెం.202, ప్లాట్ నెం.32, శ్రీకర్స్ రవి రెసిడెన్సీ, నలందా హైస్కూల్ పక్కన, మోతీనగర్ క్రాస్ రోడ్స్, హైదరాబాదు–18.

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామిని త్రికరణశుద్ధిగా నమ్మిన హైదరాబాదు వాస్తవ్యులైన తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి గతంలో శ్రీవారిని వ్రతం ద్వారా అర్చించుకొనడానికి 'శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పం', నిత్యమూ పారాయణం చేసుకునేందుకు వీలుగా 'శ్రీనివాస మాహాత్మ్యం' ఇరవైనాలుగు కేశవ నామాల దర్శనాన్ని కలిగించే 'శ్రీ వేంకటేశ్వర దర్శనం', కాలినడకన తిరుమల యాత్ర చేయడంలో గల విశిష్టతను వివరించే 'అమృత సోపానం', ఇరవైఏడు నక్షత్రాల శ్రీనివాస దివ్యవైభవాన్ని తెలియజేసే 'భజే శ్రీనివాసమ్' అను పుస్తకాలను వెలువరించి శ్రీవారి భక్తులకు కానుకగా అందించారు. వారు ప్రస్తుతం పెండ్లికానివారు పారాయణం చేస్తే మంచి ఫలితాన్నిచ్చే **'పద్మావతీ పరిణయం'**, ఉగ్రనరసింహుని ప్రసన్నం చేసుకొనడానికి **'శ్రీ నరసింహ వ్రతకల్పం'**, ఇంద్రాది దేవతలు తిరుమల గిరికి వెళితే కలిగిన అనుభవాలను వివరించే **'సర్వరూప శ్రీనివాసం'** అనే పుస్తకాలను వెలువరించారు. ఈ పుస్తకాలు శ్రీవారి భక్తులను ఎంతగానో అలరిస్తాయని చెప్పవచ్చు. **– వి.ఉమారాణి**

# శ్రీ లక్ష్మీ హయగ్రీవస్వామి



\- శ్రీమతి జె. ప్రవీణ

**జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్,**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.**

సమస్త విద్యలను అనుగ్రహించే శ్రీ గురుమూర్తి హయగ్రీవస్వామి! గుర్రపుమోముతో చతుర్భుజుడై శంఖచక్రాలను ధరించి, వామాంకంలో లక్ష్మీదేవి సహితంగా ఆవిర్భవించిన సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే హయగ్రీవస్వామి!

దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థం శ్రీమహావిష్ణువు అనేకానేక అవతారాలను ఎత్తాడు. ఆయా సందర్భాల్లో లోకక్షేమం కోసం అనేక కార్యక్రమాలను చేపట్టాడు శ్రీమన్నారాయణుడు. అలా ఒకానొక శ్రావణమాసంలో పూర్ణిమనాడు అవతరించిన స్వామి శ్రీ లక్ష్మీహయగ్రీవస్వామి!

శ్రీ హయగ్రీవస్వామి అవతారానికి సంబంధించిన ఒక దివ్యగాథ దేవీభాగవతంలో ఇలా వినపడుతున్నది. పూర్వం హయగ్రీవుడనే రాక్షసుడు అనగా గుర్రం తలతో ఉన్న ఆ రాక్షసుడు విచ్చలవిడిగా సంచరిస్తూ శిష్టులను విపరీతంగా బాధించేవాడు. వాడు ఇంకా అనేకమైన వరాలను పొందాలన్న కోరికతో పరాత్పరి అయిన జగన్మాతను గూర్చి ఘోరంగా తపస్సు చేశాడు. వాడి తపస్సుకు మెచ్చిన జగదీశ్వరి వరం కోరుకోమనగా ఎవరి చేతా తనకు చావు లేకుండా చెయ్యమన్నాడు. అది అసాధ్యం. పుట్టిన ప్రతిజీవి ఎప్పుడో ఒకసారి మృత్యువాత పడవలసిందే కనుక ఇంకొక వరం అడగమన్నది అమ్మ! సరే! తన లాంటి గుర్రం తలతో ఉన్నవాడితో మాత్రమే తనకు చావురావాలని కోరుకున్నాడు. తథాస్తన్నది అమ్మ! తన లాంటి గుర్రపు మోము వాడు రావడం అసంభవం అని వాని భావన! కానీ, దైవానికి లోబడని సృష్టి ఏదైనా ఉంటుందా! దైవసంకల్పానికి కొరత ఉంటుందా! సరే ఇలా కొంతకాలం గడచింది.

**2010, ఆగష్టు 24న శ్రీ హయగ్రీవ జయంతి సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం.**




ఒకసారి శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవితో ఏకాంతంలో ఉండగా, విష్ణువు లక్ష్మీదేవిని చూస్తూ ఎందుకో నవ్వాడు. నా మొహం బాగా లేదేమో! అసహ్యంగా ఉందేమో! ఇంకొక స్త్రీ మోము అందానికి. దాసుడై నన్ను పరిహాసం చేస్తున్నాడేమోనని లక్ష్మి తనలో తానే భావించి కుమిలిపోయింది. కానీ, అంతటితో ఆగక లక్ష్మీదేవి తొందరపడి 'స్వామీ! నన్ను ఎగతాళిగా చూస్తూ నవ్వుతున్న నీ తల తెగిపడుగాక!' అని శపించింది. అనాలోచితంగా జరిగిన ఈ సన్నివేశానికి అటు విష్ణువు ఇటు లక్ష్మీదేవి ఇద్దరూ ఆశ్చర్యపడ్డారు. ఏది జరిగినా మన మంచికే. అలాగే ఇదీ లోకక్షేమం కోసం మరో అవతారానికి నాంది అనుకున్నారు ఇద్దరూ!

ఇదిలా ఉండగా ఒకప్పుడు రాక్షసులతో పోరాడి అలసిపోయిన శ్రీమహావిష్ణువు ఒక చోట విశ్రాంతిగా కూర్చుని సేదదీరుతున్నాడు. విల్లును తన గడ్డం కింద పెట్టుకొని కళ్ళు మూసుకుని దీర్ఘంగా ఆలోచిస్తూ ఆలోచిస్తూ బాగా అలసి ఉన్నందున కాస్త కునుకుతీశాడు. ఇంతలో దేవతలు ఒక యాగానికి ఆహ్వానించడానికి విష్ణువు దగ్గరికి వెళ్ళారు. యోగ నిద్రలో ఉన్న విష్ణువును లేపడానికి సాహసించలేక చివరకు ఒక చెద పురుగును సృష్టించి దానికా పని అప్పచెప్పారు. అందుకు ప్రతిఫలంగా యాగం చేస్తున్న సమయంలో హోమగుండంలో పడని హవిస్సు నీకిస్తామనగా చెదపురుగు విష్ణువు గడ్డం కింద ఉన్న వింటి నారిని కొరికింది. అంతే! ఉన్నపళంగా తెగిన నారి విష్ణువు శిరస్సును కూడా తెంచివేసింది. ఈ విపరీత పరిణామాలకు భీతి చెందిన దేవతలు పరమేశ్వరి అయిన జగన్మాత దగ్గరికి వెళ్లగా, ఇది దైవఘటనే అంటూ విష్ణువు మొండానికి గుర్రం తలతెచ్చి అతికించమని సలహా ఇచ్చింది. వెంటనే గుర్రం తలను అంటించగా హయవదనుడైన విష్ణువు రాక్షసుడైన హయగ్రీవుణ్ణి వాని కోరిక

ప్రకారమే సంహరించాడు. ఇలాగ హయగ్రీవ అవతారం ఆవిర్భ వించింది. వేదాలలో కూడ హయగ్రీవస్వామి గొప్పగా వర్ణింప బడినాడు. పురాణాలలో కూడా హయగ్రీవస్వామి సర్వవిద్యా ప్రదాతగా, జ్ఞానానంద మూర్తిగా వర్ణింపబడ్డాడు.

పూర్వం మధుకైటభులనే రాక్షసులు వేదాలను అప హరించగా, విష్ణువు హయశీర్షంతో కూడిన కొత్త అవతారాన్ని ఎత్తి మధుకైటభులను సంహరించి వాని బారినుండి వేదాలను రక్షించి బ్రహ్మదేవునికిచ్చాడు. అందువల్ల హయగ్రీవస్వామి జ్ఞానానందమూర్తిగా, వేదాదిసకలవిద్యారక్షకుడుగా, విద్యా ప్రదాతగా ప్రసిద్ధిని పొందాడు.

ఇక ఆగమాలలో కూడా హయగ్రీవస్వామి గొప్పగానే కీర్తింపబడ్డాడు. వైఖానసాగమంలోను, పాంచరాత్రాగమంలోను ప్రధాన అర్చామూర్తిగాను, అంగదేవతగాను పేర్కొనబడ్డాడు.

బ్రహ్మాండపురాణంలో హయగ్రీవస్వామికి సంబంధిం చిన దివ్యగాథ ఒకటి పేర్కొనబడి ఉంది. శ్రీ లలితా పరాభట్టా రిక యొక్క దివ్యసహస్రనామ స్తోత్రాన్ని, సాక్షాత్తు చతుర్భుజుడై



శంఖచక్రాలతో లక్ష్మీదేవితో కూడి ఉన్న శ్రీ హయగ్రీవ స్వామి అగస్త్యమహర్షికి ఉపదేశించినట్లు దివ్యకథనం.

హయగ్రీవస్వామి అగస్త్యమహర్షికి లలితాదేవి రహ స్యాన్ని, లలితామంత్రన్యాస, హోమ పూజ పునశ్చరణ విధానాన్ని లలితాదేవి సహస్రనామాలను కూలంకషంగా ఉపదేశించినాడు. ఇందులో సాక్షాత్తు హయగ్రీవస్వామి లలితాదేవి మాహాత్మ్యాన్ని తెలియజేశాడు. ఈ ఉపదేశాన్ని పొందిన అగస్త్యమహర్షి కూడా సామాన్యుడు కాడు. సర్వవిద్యా పరిపూర్ణుడు. బ్రహ్మవిద్యా గరిష్ఠుడు. ఇలాంటి మహర్షి, హయగ్రీవుని అనుగ్రహాన్ని సంపూర్తిగా పొందినవాడు. తనకు ప్రత్యక్షమైన హయగ్రీవ స్వామిని అగస్త్యుడు ఇలా ప్రార్థించినాడు.

స్వామీ! లక్ష్మీహయవదనా! జగన్మాత అయిన లలితా పరాభట్టారిక యొక్క అవతార విశేషాలను, ఆమె చేసిన భండా సురవధలను పూర్వం వివరించారు. ఇంకా శ్రీచక్రమాహాత్మ్యాన్ని పంచాక్షరీ మహిమను, విధివిధానాలను చక్కగా ఉపదేశించారు. కానీ కొంత కొదువ ఉన్నది. అదే లలితాదేవి యొక్క సహస్ర నామాలను వాటి విశిష్టతను ఉపదేశించలేదు. మీరు మరచి పోయారేమో! లేక స్ఫురించినా ఎందుకులే అని ఉపేక్షించారో నాకు తెలీదు. వాటిని వినే అర్హత నాకు లేదా! అని ఆర్తిగా ఆసక్తిగా ప్రశ్నించగా, హయగ్రీవస్వామి అగస్త్యా! నిజమే ఆ నామాలు అందరికి ఉపదేశించరానివి. అతి రహస్యమైనవి. మహిమాన్వితమైనవి. అయినా నీవు అర్థించావు కనుక ఆ పరమేశ్వరి సంకల్పంతో రహస్య నామ స్తోత్రమైన లలితా సహస్ర నామస్తోత్రాన్ని ఉపదేశిస్తున్నాను.

**శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ**
**చిదగ్నికుండ సంభూతా దేవకార్య సముద్యతా**
**ఉద్యద్భాను సహస్రాభా చతుర్బాహు సమన్వితా**
**రాగ స్వరూప పాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా**
..............................
..............................
**ఆబాల గోప విదితా సర్వానుల్లంఘ్యశాసనా**
**శ్రీచక్రరాజ నిలయా శ్రీ మత్త్రిపురసుందరీ**
**శ్రీశివా శివశక్త్యైక్య రూపిణీ లలితాంబికా**
**ఏవం శ్రీలలితాదేవ్యా నామ్నాం సాహస్రకం జగుః**

**ఇతి శ్రీబ్రహ్మాండపురాణే, ఉత్తరఖండే శ్రీహయగ్రీవాగస్త్య సంవాదే శ్రీ లలితా రహస్యనామ సహస్ర స్తోత్ర కథనం సంపూర్ణమ్.**

సాక్షాత్తు శ్రీ హయగ్రీవస్వామి అగస్త్యుల సంవాదం వల్ల మహిమాన్వితమైన లలితా సహస్రనామస్తోత్రం లోకానికి అందింది. విష్ణువు హయగ్రీవుడుగా అవతరించిన సమయంలో లక్ష్మీదేవి ఆడగుర్రంగా అవతరించింది. హయగ్రీవుని వల్ల హైహయుడనేవానిని పుత్రునిగా పొందింది లక్ష్మీదేవి.

హయగ్రీవస్వామి అవతరించిన శ్రావణమాసం పున్నమి నాడు విఖనస మహర్షి కూడా అవతరించినట్లు పురాణ కథనం. రాఖీపౌర్ణిమ అనీ, జంధ్యాలపౌర్ణిమ అనీ లోకంలో అత్యంత విశిష్టతను సంతరించుకొన్న దినం శ్రావణపౌర్ణమి.

శ్రీ హయగ్రీవస్వామిని అర్చించి, ఉపాసించిన మహనీయులెందరో మనకు దర్శనమిస్తారు. జగద్గురు శంకరులవారు, రామానుజులవారు, మధ్వాచార్యులవారు కూడ హయగ్రీవ స్వామిని ఉపాసించారు. భక్తులపాలిటి కల్పవృక్షమైన మంత్రాలయం శ్రీ రాఘవేంద్రస్వాములవారి కంటే పూర్వులు, మధ్వ సంప్రదాయ ప్రవర్ధకులైన శ్రీ వాదిరాజతీర్థులవారు హయగ్రీవ స్వామి ఉపాసకులుగా ప్రసిద్ధులు. వీరు పిలిస్తే హయగ్రీవ స్వామి పలికేవాడని, ఆయన చేతుల నుంచి గుర్రం ఆకారంతోనే దాణా (ఆహారాన్ని) స్వీకరించేవాడని ప్రశస్తి!

తిరుమల క్షేత్రంలో శ్రీవారి ఆలయానికి మహాప్రదక్షిణ మార్గంలో శ్రీస్వామిపుష్కరిణికి దగ్గరలో సరిగ్గా ఈశాన్యమూలకు శ్రీ లక్ష్మీహయగ్రీవస్వామివారి ఆలయం ఉంది. ఎప్పుడు, ఏ వేళ, శ్రీ మలయప్పస్వామి మహాప్రదక్షిణ మార్గంలో ఊరేగింపుకు వచ్చినా, శ్రీ హయగ్రీవస్వామివారి సన్నిధిలో ఆనంద కర్పూర నీరాజనాలందుకుంటాడు.

ప్రతిరోజు తెల్లవారుజామున తిరుమలలోని శ్రీనివాసుడు తానే హయగ్రీవుణ్ణిని సందేశమిస్తూ సహస్రనామార్చనలో.....

**ఓం వైకుంఠమందిరాయ నమః**

**ఓం హయగ్రీవాయ నమః**

**ఓం కైటభారయే నమః**

# వికలాంగులకు
## ప్రత్యేక ప్రవేశం

- మానసిక లేదా శారీరక లోపం గల వికలాంగులు అయిన భక్తులను మహాద్వారం వద్ద గల ప్రత్యేక ద్వారం ద్వారా శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు.
- తమ వెంట ఉన్న సహాయకులలో ఒకరిని వీరితో పాటు అనుమతిస్తారు.
- వీరికి లడ్డూ కూపను కూడా మహాద్వారం వద్దే ఇస్తారు.
- వీరి కోసం ప్రత్యేకంగా నిర్మించిన హాల్లో ఉండాలి. అక్కడ తెలిపిన దర్శనం వేళల్లోనే లోనికి అనుమతిస్తారు.
- రాంబగీచా అతిథిగృహాల నుంచి శ్రీవారిఆలయం వరకు **ఉచితంగా** వీరిని చేరవేసేందుకు తిరుమల తిరుపతి దేవస్థానం బ్యాటరీ కారు సౌకర్యం ఏర్పాటు చేసింది.

**ఓం గ్రాహఘ్నాయ నమః**

**ఓం గజరక్షకాయ నమః**

**ఓం సర్వసంశయ విచ్ఛేత్రే నమః**

అంటూ హయగ్రీవనామాలతో అర్చింపబడుతుండటం విశేషం!

శ్రావణమాసం పున్నమిని హయగ్రీవ జయంతిగా జరుపుకోవడంతోపాటు, శ్రావణమంగళవారాల్లోనూ, శ్రావణ మాసంలో నిర్వహింపబడే వరలక్ష్మీవ్రతం సందర్భంలోనూ ఆ హయగ్రీవస్వామి ఉపదేశించిన లలితాసహస్రనామ స్తోత్రాన్ని పఠించడం ఎంతైనా శ్రేయోదాయకం. సర్వసిద్ధిప్రదం కూడా.

**విశుద్ధ విజ్ఞాన ఘన స్వరూపం విజ్ఞాన విశ్రాణన బద్ధ దీక్షమ్,**
**దయానిధిం దేహభృతాం శరణ్యం దేవం హయగ్రీవ మహం ప్రపద్యే.**

## డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమము - 04-06-2010

## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో **'డయల్ యువర్ ఇ.ఓ.'** కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 04-06-2010న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం.)*

**శ్రీవారి దర్శనానికి వెళ్ళే భక్తులకు డ్రెస్‌కోడ్‌ను ఖచ్చితంగా అమలు చేయండి.** *- నమ్మాళ్వార్, రాజమండ్రి.*

**కార్యనిర్వహణాధికారి :** డ్రెస్‌కోడ్‌ను మొదలు పెడతాం. సంవత్సరంలోపు పూర్తిగా అమలయ్యే విధంగా ప్రయత్నిస్తాం.

**కరెంటు బుకింగ్ రద్దు చేశారు. ఇంటర్‌నెట్ అందరికీ అందుబాటులో ఉండదు కదా. కరెంటు బుకింగ్‌ను పునరుద్ధరించగలరు.** *- శంకర్, బెంగళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** వచ్చే పాలకమండలి సమావేశంలో చర్చిస్తాం.

**శ్రీవారి ఆలయం ఎదురుగా ఎండ తీవ్రత వలన కాళ్ళు కాలుతున్నాయి.** *- అమరనాథ్, కడప.*

**కార్యనిర్వహణాధికారి:** భక్తుల సౌకర్యార్థం ఇప్పటికే పెయింట్, కార్పెట్ వేశాం. వీటిని మరింత విస్తరించే ఏర్పాటు చేస్తాం.

**తిరుపతిలో ఆర్జిత సేవా కౌంటర్లు లేవు. ఏర్పాటు చేయండి.** *- ప్రభాకరరావు, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** త్వరలో తిరుపతిలోని మహతి వద్ద ఏర్పాటు చేస్తాం.

**ధర్మదర్శనం క్యూలో వెళితే ఎంతసేపట్లో దర్శనం అవుతుంది అనే విషయం గూర్చి కంపార్టుమెంట్ల లోపల, బయట ప్రదర్శిస్తే బాగుంటుంది.** *- శ్రీనివాసన్, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** ఈ నెలలో ఎలక్ట్రానిక్ డిస్‌ప్లే బోర్డులను ఏర్పాటు చేస్తాం.

**ఆర్జిత సేవలకు ఇచ్చే లడ్డూకౌంటర్లు ఒక్కొక్క సేవకు ఒక్కొక్క కౌంటర్లలో ఇస్తున్నారు. దీనివలన పొరపాటున లైన్లో నిలబడి వేరే కౌంటర్లోకి వెళితే మళ్ళీ తిరిగి వెనక్కి రావల్సి వస్తోంది. కాబట్టి ఏ సేవకైనా అన్ని కౌంటర్లలో లడ్డూలు ఇచ్చే ఏర్పాటు చేయండి.** *- శ్రీధర్, బెంగళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** ఏ సేవకైనా ఏ లైన్లో అయినా ఇచ్చేటట్లు చూస్తాము. వీలు కాకుంటే వాలంటీర్లను ఏర్పాటు చేస్తాం.

**అంగప్రదక్షిణం క్యూలో స్థానికులు మధ్యమధ్యలో దూరేస్తున్నారు. అలా జరక్కుండా ఇనుప వల ఎత్తు పెంచండి.** *- షణ్ముఖరావు, అనపర్తి.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**తిరుమలకు మేము సంవత్సరానికి 4 సార్లు వస్తాము. ధ్వజ స్తంభం వద్ద అన్ని లైన్లు కలిపేయడం వల్ల తోపులాట జరిగి చిన్నపిల్లలు నలిగిపోతున్నారు.** *- శైలజ, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలించి తగు చర్యలు తీసుకుంటాం.

**కాలిబాటలో అలిపిరి నుండి తిరుమల మధ్య ఉన్న బయో మెట్రిక్ కౌంటర్‌కు సరియైన సూచిక బోర్డులు లేక భక్తులు ఇబ్బంది పడుతున్నారు.** *- సాయిప్రసాద్, పూణే.*

**కార్యనిర్వహణాధికారి :** సూచిక బోర్డులు ఏర్పాటు చేస్తాం.

**శ్రీవారిమెట్టు దగ్గర బాత్రూంలు మరియు బస్‌షెల్టరు లేవు. ఏర్పాటు చేస్తే బాగుంటుంది.** *- రాజు, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలించి ఏర్పాటు చేస్తాం.

**తిరుపతి బస్టాండ్ నుండి వేకువజామున అలిపిరి వరకు స్థానిక ఆర్.టి.సి. సిబ్బంది బస్సును ఆపడం లేదు. సరిగా సమాధానం చెప్పడంలేదు.** *- సత్యభగవాన్, కడప.*

**కార్యనిర్వహణాధికారి :** ఆర్.టి.సి. వారితో మాట్లాడి అలిపిరి వద్ద బస్ స్టాప్ ఏర్పాటు చేస్తాం.

**వికలాంగులను క్యూలైన్లలో పంపేవారు ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. వీలైతే వికలత్వం నిర్ణయించే బోర్డు పెడితే బాగుంటుంది.** *- నాగేంద్రప్రసాద్, బెంగళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** ఆలోచిస్తాం.




ఉద్దాలకుడు ఒక మహర్షి, తపస్వి. భార్య పేరు విశ్వవార. వీరు ఎన్నో యజ్ఞయాగాదులు చేశారు. కానీ వీరికి సంతానం కలగలేదు. విశ్వవార చాలా బాధ పడుతుండేది. ఉద్దాలక మహర్షి దానధర్మాలు బాగా చేసేవాడు. అందరికి అన్నదానం చేయడంవల్ల అతనికి వాజశ్రవుడనే పేరు వచ్చింది. వీరిద్దరు కలసి ఒక యాగం నిర్వహించారు. ఆ యాగం చేయడం వల్ల వీరికి పుత్రుడు జన్మించాడు. అతడే "నచికేతుడు". ఇతడు కూడా గొప్ప తపస్వి. రోజూ తల్లితోపాటు గోశాలకు వెళ్ళి గోపూజ చేస్తూ ఉండేవాడు.

నచికేతుని తండ్రి "విశ్వజిద్యాగం" చేయ సంకల్పించి; ఆ యాగానికి అతని వద్ద ఉన్న సంపదంతా మరియు పాలు ఇవ్వడానికి శక్తిలేని ముసలి ఆవులను యాగం నిర్వహించిన ఋత్విక్కులకు దక్షిణలుగా ఇవ్వాలని అనుకున్నాడు. అప్పుడు నచికేతుడు ఇదంతా చూచి తండ్రితో నీవు చేస్తున్న యాగంలో నీకున్న సర్వస్వాన్ని దానం చేయాలి కదా! మరి నన్నెవరికి దానం చేస్తావు అని తండ్రిని ప్రశ్నిస్తాడు. దానికి తండ్రి సమాధానం చెప్పలేదు. పలుమార్లు ప్రశ్నించగా విసిగిపోయిన తండ్రి "నిన్ను యమునకు దానం చేస్తాను" అని అన్నాడు. ఆ మాటలకు నచికేతుడు నావల్ల యమునికి ఏం ప్రయోజనముంటుంది? ఏది ఏమైనా నేను యముని దగ్గరకు వెళ్ళి తీరాలని నిశ్చయించుకుని, వెంటనే యముని ఇంటికి వెళతాడు. కానీ, యముడు ఆ సమయంలో బ్రహ్మదర్శనం కోసం వెళ్ళి ఉన్నాడు. నచికేతుడు యముని కోసం ఎదురు చూస్తూ ఆయన ఇంట్లో మూడు రాత్రులు గడిపాడు. ఏమీ తినకుండా ఉపవాసం కూడా చేశాడు. మూడు రోజుల తర్వాత యముడు ఇంటికి వచ్చాడు. అప్పుడు యముని సేవకులు బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తున్న నచికేతుని గురించి యమునికి చెప్పారు.



– పి.గీతశిరీష, 8వ తరగతి,
D/o పి.టి.కె.జి.పరమేశ్వరి,
ఇ.నెం.5-3-214, విజయలక్ష్మీ వీధి,
తిరుపతి - 517 501.

యముడు నచికేతుని దగ్గరకు వచ్చి అతనికి నమస్కారం చేసి నీవు "బ్రాహ్మణ కుమారుడవు. పూజింపదగిన అతిథివి. నీవు భోజనం చేయకుండా మూడు రాత్రులు నా ఇంటిలో ఉపవాసం చేశావు. బ్రాహ్మణుడు అగ్నిదేవునితో సమానం. నీవు మూడు రాత్రులు ఉపవాసం చేసి నా ఇంటిలో ఉన్నందుకు నీకు "మూడు వరాలిస్తాను" కోరుకొమ్మన్నాడు.

అప్పుడు నచికేతుడు యమధర్మరాజుతో, సరే అలాగే కోరుకుంటాను అని చెప్పి – మొదటి వరం ఇలా అడుగుతాడు. నేను ఇంటికి తిరిగి వెళ్ళేటప్పటికి మా నాన్నగారికి నాపై కోపం పోయి నన్ను ప్రేమతో దగ్గరకు తీసుకోవాలి. రెండో వరం ఇలా కోరుకుంటాడు. స్వర్గలోకంలో మరణం గురించి భయం ఉండదని, ముసలితనం రాదని, ఆకలి దప్పులుండవని ఎల్లప్పుడు సుఖంగా ఉంటారని విన్నాను. అటువంటి స్వర్గప్రాప్తి పొందేమార్గం "అగ్నిజ్ఞానం" మీకు తెలుసు. దాన్ని నాకు తెలియజెప్పండి అని అడిగాడు. అలా నచికేతుడు యముని దగ్గర అగ్నివిజ్ఞానాన్ని నేర్చుకున్నాడు. యముడు అతని తెలివితేటలకు మెచ్చి అతని పేరుతో అగ్ని 'నచికేతాగ్ని' అని లోకంలో ప్రసిద్ధి చెందుగాక అని రెండవ వరాన్ని ప్రసాదిస్తాడు. నచికేతుడు మూడవవరం 'ఆత్మతత్త్వాన్ని' బోధించమని కోరాడు. పుట్టిన ప్రతి మనిషీ మరణించడం సహజం. చనిపోయిన తర్వాత ఏమౌతారు? ఆత్మ ఉంటుందని అంటారు కదా! ఇందులో సత్యమెంతో నాకు చెప్పండి అని నచికేతుడు యముణ్ణి మూడవవరం కోరాడు.

అప్పుడు యముడు ఆత్మతత్త్వాన్ని గురించి దేవతలకు కూడా సంశయం ఉంది. అది సామాన్యులకు అర్థం కాదు. ఈ వరం తప్ప ఇంకేమైనా వరం కోరుకో ఇస్తాను అని అన్నాడు.

నీకు కావలసినన్ని భోగభాగ్యాలు ప్రసాదిస్తాను కోరుకో! అని అంటాడు. ఈ మరణ సంబంధమైన ప్రశ్నమాత్రం నన్ను అడగ వద్దు అని వారిస్తాడు యముడు.

నచికేతుడు యముని మాటలు విని ఈ అల్పమైన లౌకిక భోగాలు అశాశ్వతాలు. అవన్నీ నాకక్కరలేదు అన్నాడు. వివేకమున్నవాడు ఎవ్వడూ ఈ భోగభాగ్యాలను కోరుకోడు అని పట్టుపట్టాడే కాని తన నిర్ణయాన్ని మార్చుకోలేదు.

యముని మాటలు నచికేతుని మార్చలేకపోయాయి. నచికేతుని పట్టుదలకు యముడు మెచ్చి "ఆత్మతత్త్వాన్ని" ఇలా ఉపదేశించాడు. మానవుడు అనుసరించడానికి రెండు మార్గా లున్నాయి. అందులో ఒకటి శ్రేయోమార్గం. అంటే "సత్యం" శాశ్వతమైన సుఖాన్ని కలిగించే మార్గం ఇది. ఇది విద్యవల్ల కలుగుతుంది. ఇది మొదట కష్టం అనిపించినా చివరకు సుఖాన్ని కలిగిస్తుంది. పండితులు ఈ శ్రేయోమార్గాన్నే అనుసరిస్తారు.

ఇక రెండవది ప్రేయోమార్గం అంటే తాత్కాలికంగా సుఖం కలిగించేది. దీనివల్ల మొదట సుఖం కలిగినా చివరకు కష్టపడక తప్పదు. ప్రేయోమార్గాన్ని పండితులు ఎప్పుడు అను సరించరు. అప్పుడు యముడు నచికేతునితో ఇలా అన్నాడు. లోకంలో మానవులందరు ఆశపడే ధనాన్ని, భోగాల్ని నీవు ఆశించలేదు. మానవులు ఆత్మతత్త్వాన్ని గురించి తెలుసుకోలేరు. ఆత్మను గురించి చెప్పడం అందరికీ సాధ్యం కాదు. చెప్పినా అర్థం కాదు. ఆత్మతత్త్వాన్ని గూర్చి ఉత్తమ గురువే ఉపదేశించాలి. ఇది ఎవరికీ ఊహకందని విషయం. ఆత్మ అణువుకన్నా సూక్ష్మ మైంది. నీవు ఎంతో పట్టుదల గలవాడివి. ఆత్మ అతిసూక్ష్మమైంది కావడం వల్ల మన కళ్ళకు కనపడదు. హృదయంలో ఉంటుంది. అలాంటి విశిష్టమైన గుణాలుగల ఆత్మను గురించి తెలుసు కోవాలంటే మనస్సు ఇతర విషయాలనుండి మరల్చాలి.

అప్పుడు నచికేతుడు యమధర్మరాజుతో ఇలా అన్నాడు. నేను యోగ్యుడనని నీవు అనుకుంటే ప్రపంచంలో అన్నింటికన్నా భిన్నంగా నీవు దేనిని చూస్తున్నావో దాన్ని నాకు ఉపదేశించుము. అది విని యముడు ఈ విధంగా చెప్పనారంభించాడు: దేనిని పొందడానికి కఠినమైన తపస్సు చేస్తారో, ఏది సర్వవేదసారభూత మైందో అదే ఓంకారం. ఓంకారమే పరబ్రహ్మస్వరూపం. ఓంకారం నాశనం లేనిది. ఇది తెలుసుకొన్నవారికి ఏది కోరు కుంటే అది లభిస్తుంది. దీన్ని తెలుసుకున్నవాడు బ్రహ్మలోకంలో బ్రహ్మలాగా ప్రకాశిస్తాడు. ఆత్మకు మరణం లేదు. శరీరం నశించినా ఆత్మ నశించదు.

మోక్షం లభించాలంటే మానవుడు మంచిపనులు చేయాలి. ఇంద్రియాలు జయించాలి. మనసు ప్రశాంతంగా ఉంచుకోవాలి. ఇవన్నీ ఉన్నవారికి మోక్షం తప్పకుండా లభిస్తుంది. అన్ని ప్రాణుల్లోను ఆత్మ ఉంటుందని యముడు చెప్పగా నచికే తుడు ఈ ఆత్మతత్త్వాన్ని సంపూర్ణంగా తెలిసికొని బ్రహ్మభావం పొందాడు. ఆత్మతత్త్వం గూర్చి నచికేతుడు బ్రహ్మదగ్గర ఉపదేశం పొంది భూలోకానికి తిరిగి వచ్చాడు.

ఆశ్రమంలో ఉన్న ఉద్దాలకుడు, విశ్వవార తన కుమారు డైన నచికేతుని దగ్గరకు తీసుకుని ముద్దాడారు. ఉద్దాలకుడు తన కొడుకు గొప్పతనానికి లోలోపల ఎంతో గర్వపడ్డాడు. విశ్వవార తన కుమారునితో నీకు ఇంత తేజస్సు ఎలా వచ్చింది? ఎవరు నీకీ నవరత్నాలు బహూకరించారు. అసలు నీవు ఇన్ని రోజులు ఎక్కడ ఉన్నావు? అని తల్లి అడిగింది.

నచికేతుడు తన తల్లిదండ్రులకు, ఆశ్రమవాసులకు జరిగినదంతా వివరించి చెప్పాడు. యముడు తనకిచ్చిన వరాలన్నీ చెప్పాడు. విని అందరు ఆనందించారు. నచికేతుని తల్లిదండ్రుల్ని, ఆశ్రమవాసులందరు ఇలా అభినందించారు. మీరెంత అదృష్టవంతులు, ఇంత మంచి జ్ఞానం గల పుత్రుణ్ణి కన్న మీరు ఎంతో గొప్పవాళ్లు. మీ కుమారుడి వల్లే "నచికేతాగ్ని", "ఆత్మవిద్య" భూలోకానికి వచ్చింది. నచికేతుడు వయస్సులో చిన్నవాడైనా మహర్షిత్వాన్ని పొందగలిగాడని ఉద్దాలకుని, విశ్వవారను అందరూ అభినందించారు.

ఇంత చిన్న వయసులో ఎంతో పట్టుదలతో తండ్రి అన్న మాటలకు యముని దగ్గరకు పోయి ఆయన అనుగ్రహం పొంది, వరాలను పొంది ఆయన పొగడ్తలందుకొని "నచికే తాగ్నిని" తిరిగి భూలోకానికి తీసుకొని వచ్చిన గొప్పదనం నచికేతునికే దక్కింది. పట్టుదల ఉంటే సాధించలేనిది ఏదీ లేదని నచికేతుని కథవల్ల తెలుస్తోంది.

అన్ని దానాల్లోకెల్లా అన్నదానం చాలా గొప్పది. ఆ దానాన్ని మించిన దానం లేదు. అన్నదానం చేసేవారు దేవలోక పూజలు అందుకుంటారు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. పురుషార్థాల సాధనకు అవసరమైన దేహాన్ని నిలిపేది అన్నం ఒక్కటే. ఆహారం లేకపోతే ప్రాణులు నశిస్తాయి. అందుచేత అన్నదానం చేసిన వారు ప్రాణదానం చేసినవారితో సమానం. ప్రాణాలనివ్వడమంటే సర్వస్వాన్ని ఇచ్చినట్లే. కాబట్టి వారికి సర్వవస్తువులనూ దానం చేసిన ఫలితం దక్కుతుంది. అన్నదానం మహా పుణ్యకార్యం. అన్నాన్ని తిని ఆ శక్తితో ఎవరు ఏ పుణ్య కార్యాలు చేసినా, అందులో సగం పుణ్యం అన్నదాతకు, మిగిలిన సగం ఆ కార్యం చేసినవారికి లభిస్తాయని చెప్పబడింది. అన్నదానం చేయడం వల్ల ఇలా ఎన్నెన్నో అద్భుతమైన పుణ్యఫలాలు అందుతాయి.




**'మానవసేవే మాధవసేవ'** అన్నారు. ఆకలితో ఉన్న వారికి అన్నం పెట్టడం ద్వారా సేవ చేస్తే, అది ఒక యజ్ఞం చేసిన పుణ్యంతో సమానమైన ఫలితాన్నిస్తుందంటారు. మనుషులను భోజనం ద్వారానే తృప్తిపరచగలం. ఎంత బంగారం, వస్త్రాలు ఇంకా ఏమి ఇచ్చినా ఆశ తీరదు. ఇంకా ఇంకా కావాలంటారు. కానీ ఒక్క అన్నదానంలోనే 'చాలు' అనే పదం వారి నుండి మనస్ఫూర్తిగా మనం వినగలం. అన్నదానం వల్ల మూడు లోకాల్లో కీర్తి, యశస్సు, తేజస్సు, బలం ప్రాప్తిస్తాయని చెప్పబడింది. స్వర్గమందు ప్రథమ ప్రవేశం అన్నదానం చేసిన వారికే అని కూడా చెప్పబడింది. ఈ సూక్తిని తిరుమల తిరుపతి దేవస్థానం అక్షరాల ఆచరణలో పెట్టింది. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని దర్శనార్థం వచ్చే వేలాదిమంది భక్తులకు అన్నం పెట్టడమనే పవిత్రపుణ్యకార్యానికి 06-04-1985వ సంవత్సరంలో శ్రీకారం చుట్టింది. అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ నందమూరి తారకరామారావు ఈ పథకాన్ని ప్రారంభించారు. 2,000 మంది భక్తులతో ప్రారంభమైన ఈ పథకం నేడు ప్రతిరోజు సుమారు 35,000 నుండి 45,000 వేల మందికి అన్నదానం చేస్తోంది. గతంలో శ్రీవారి ఆలయంలో స్వామివారిని దర్శించుకున్న భక్తులకు మాత్రమే ఈ అన్నదాన సౌకర్యం ఉండేది. అయితే, శ్రీ భూమన కరుణాకరరెడ్డి పాలకమండలి అధ్యక్షులైన తర్వాత ఈ నిత్యాన్నదాన పథకంలో చాలా మార్పులు చేశారు. శ్రీవారి దర్శనంతో సంబంధం లేకుండా తిరుమలకు వచ్చిన ప్రతి భక్తుడికి భోజనం కల్పించాలనే సదుద్దేశ్యంతో అందరికీ భోజన పథకం ప్రవేశపెట్టారు. ఇందులో వడ్డించే భోజన పదార్థాలలో నెయ్యి, ముద్ద పప్పుకు కూడా చోటు కల్పించారు.

**అక్షరామృతం [24]**

## పథకం వివరాలు

తిరుమల, తిరుచానూరులలో భక్తులకు ఉచిత భోజన సదుపాయాన్ని అందిస్తున్న తి.తి.దే. వారి పథకమే **శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన పథకం**. దీని ద్వారా తిరుమలలో సుమారు 60,000 మందికి పైగా భోజనం, వైకుంఠం క్యూ కాంప్లెక్స్ నందు వేచి ఉన్న భక్తులకు అల్పాహారం ఆహారపొట్లాలు, పాలు, కాఫీ, టీ ఇవన్నీ ఉచితంగా ప్రతినిత్యం అందించబడుతూ ఉన్నాయి.

తిరుచానూరులో శ్రీ పద్మావతి అమ్మవారి దర్శనార్థం వచ్చే భక్తులకు సుమారు 2,000 మందికి పైగా ప్రతినిత్యం ఉచిత భోజన సదుపాయం కల్పించబడుతూ ఉంది. ఈ పథకానికి దాతలు అందించే విరాళాల వల్ల తిరుపతిలోని రుయా హాస్పిటల్, ప్రభుత్వ ప్రసూతి వైద్యశాల, స్విమ్స్‌లాంటి వైద్యశాలల్లోని రోగులకు, విద్యాపీఠం విద్యార్థులకు ఉచిత భోజన సౌకర్యం కల్పించుట ద్వారా తి.తి.దే. వారు తమ సేవలనందిస్తున్నారు.

ఈ పథకానికి మొట్టమొదట చెన్నైకి చెందిన శ్రీ ఎల్.వి.రామయ్య రూ.10 లక్షలు విరాళంగా ఇచ్చారు. అలా ప్రారంభమైన విరాళాల పరంపర 31-03-2008 నాటికి రూ.141.83 కోట్లకు చేరింది.

**పథకం పనిచేసే విధానం**

దాతలు, భక్తుల ద్వారా వచ్చే విరాళాలతో ఈ పథకం నడుస్తోంది. ఈ పథకం నిరాటంకంగా సాగిపోవాలన్న సంకల్పంతో, వచ్చిన విరాళాలను జాతీయ బ్యాంకులలో ఫిక్సెడ్ డిపాజిట్లుగా ఉంచి దానిపైన వచ్చే వడ్డీని మాత్రమే ఈ అన్నదానానికి వినియోగించడం జరుగుతూంది.

**దాతలకు ఇచ్చేవి**

ఈ పథకానికి విరాళం ఇవ్వాలనుకునే దాతలు కనీసం రూ.1000/-లు అంతకన్నా ఎక్కువ విరాళంగా ఇవ్వాలి. ఈ విరాళానికి రశీదు, సెక్షను 80(జి) కింద ఆదాయపు పన్ను మినహాయింపు పత్రం కూడా దేవస్థానం ఇస్తుంది. అంతకన్నా తక్కువ మొత్తంలో ఇచ్చే విరాళాలను ఈ పథకానికి బదులు హుండీకి జమచేస్తారు.

**ప్రత్యేక సదుపాయాలు**

రూ.1 లక్ష, రూ.5 లక్షలు, రూ.10 లక్షలు అంత కన్నా ఎక్కువ మొత్తం విరాళం ఇచ్చే దాతలకు తి.తి.దేవ స్థానం కొన్ని ప్రత్యేకమైన సదుపాయాలు కల్పించింది. దాతలకు ఒక ప్రత్యేకమైన విరాళపు పాసుపుస్తకం ఇస్తారు. ఆ పుస్తకం ద్వారా దాతలు తమ జీవితకాలం, కంపెనీలు 20 సంవత్సరాలు, ఆ సదుపాయాలు వినియోగించుకోవచ్చు.

రూ.1 లక్ష నుంచి రూ.5 లక్షల లోపు విరాళం ఇచ్చిన దాతలకు సంవత్సరంలో ఒక రోజు ఎ.ఆర్.పి.కౌంటరు ద్వారా ఉచిత వసతి, సంవత్సరంలో ఒకసారి 5 మందికి శీఘ్రదర్శనం ద్వారా శ్రీవారి దర్శనం కల్పిస్తారు. సంవత్సరానికి ఒకసారి 6 చిన్నలడ్లు, ఒక దుప్పట, ఒక జాకెట్ ఇస్తారు.

రూ.5 లక్షల నుంచి రూ.10 లక్షల లోపు విరాళం ఇచ్చిన దాతలకు సంవత్సరంలో మూడు రోజులు ఎ.ఆర్.పి. కౌంటరు ద్వారా ఉచిత వసతి, మూడుసార్లు ఐదుమందికి శీఘ్రదర్శనం ద్వారా స్వామివారి దర్శనం కల్పిస్తారు. సంవత్స రానికొకసారి పది చిన్నలడ్లు, ఒక దుప్పట, ఒక జాకెట్, 5 మహాప్రసాదం పొట్లాలు ఇస్తారు. మొదటిసారి మాత్రం బంగారుపూతపూసిన అమ్మవారి, స్వామివార్ల వెండిజ్ఞాపిక ఇస్తారు.

రూ.10 లక్షలు, ఆపైన విరాళం ఇచ్చిన దాతలకు ప్రతి సంవత్సరం మూడు రోజులు వి.ఐ.పి.సూట్ నందు వసతి, ఐదుమందికి సంవత్సరానికి మూడుసార్లు వి.ఐ.పి బ్రేకు/ ప్రారంభ దర్శన సమయంలో స్వామివారి దర్శనం కల్పిస్తారు. సంవత్సరానికి ఒకసారి 20 చిన్నలడ్లు, ఒక దుప్పట, జాకెట్, పది మహాప్రసాదం పొట్లాలు ఇస్తారు. మొదటిసారి మాత్రం 5 గ్రాముల బంగారు డాలరు, బంగారు పూతపూసిన అమ్మవారి స్వామివార్ల వెండి జ్ఞాపిక ఇస్తారు. ఈ మూడు విరాళదాతలకు ఆదాయపు పన్ను మినహాయింపు పత్రం సెక్షన్ 80(జి) కింద ఇవ్వడం జరుగుతుంది.

**ఘనంగా జరిగిన రజతోత్సవ వేడుకలు :**

1985లో ప్రారంభించబడిన తి.తి.దే.అన్నదాన పథకానికి పాతికేళ్ళు నిండిన సందర్భంగా రజతోత్సవం 06-04-2010న ఘనంగా జరిగింది. 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అన్న స్ఫూర్తితో ప్రపంచంలో ఇంతటి స్థాయిలో అన్నదాన కార్యక్రమం ఎక్కడా జరగలేదనడంలో అతిశయోక్తిలేదు. ప్రతిరోజూ సుమారు 50 వేల మందికి నిత్యాన్నదానం నిర్వహిస్తున్నారు. ఈ సందర్భంగా విరాళాలు అందించిన దాతలను తిరుమల తిరుపతి దేవస్థానం పాలకమండలి సత్కరించి అభినందనలు తెలియజేసింది. ఈ రజతోత్సవాన్ని పురస్కరించుకొని సాంస్కృతిక కార్యక్రమాలు జరిపారు. ఈ సందర్భంగా శ్రీకృష్ణదేవరాయల 500 సంవత్స రాల పట్టాభిషేకోత్సవాల సావనీర్‌ను తి.తి.దే.అధ్యక్షులు శ్రీ డి.కె. ఆదికేశవులు, తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., ఆవిష్కరించారు. ఈ అన్నదాన కార్య క్రమం ఎంతో పవిత్రంగా, రుచిగా, శుచిగా భక్తులను సంతృప్తి పరిచే విధంగా సాగిపోతూండటం వల్ల ఈ కార్యక్రమం అత్యంత ఆదర్శవంతంగా అత్యున్నత శిఖరాన నిలిచింది. ఇతర సంస్థలకు ప్రేరణగా నిలిచింది. ప్రస్తుత అన్నదాన పథకం డిప్యూటీ ఈ.ఓ. శ్రీమతి చెంచులక్ష్మిగారు ఈ వేడుకలకు సంచాలకులుగా వ్యవ హరించారు.




రాధిక కృష్ణతత్త్వ వేదిక. ఆమె ప్రణయభావ నివేదిక. ఆమె నయన చకోరికలు వంశీమోహనుని దివ్య మంగళరూప సందర్శనం కోసం ఎడతెగని ఎదురు తెన్నులు చూస్తూనే ఉన్నాయి. వెన్నపాలతో కలిపిన విన్నపాలు చేస్తూనే ఉన్నాయి.

బాలకృష్ణుడు వ్రేపల్లెకు దీపావళి. ప్రేమానురాగాలకు ముల్లె గోపల్లె. గరుడపచ్చల దండలాంటి యమునా వనవీథికి, నాయకమణిలాంటి నీలమేఘశ్యాముడు ఈనాడు లేడు. సూత్రం తెగిన మణిగణంలాగా గోపబాలురు, తమను నడిపించే నాయకుడు లేక, చెట్టుకొకరుగా పుట్టకొకరుగా చేరిపోయారు. గో, గోప, గోపికల నయన సరోవరాల నుండి కాంతిరేఖల రాజహంసలు ఎగిరిపోయాయి. ఆ కనులు కేవలం అశ్రుతరంగాలతో తొణికిసలాడుతున్నాయిప్పుడు.

రాసక్రీడా రససాగర తీరంలో కృష్ణ విరహిణి అయిన రాధిక, ఒక అభిసారికలా పలవరిస్తూంది. కృష్ణదర్శన చంద్రోదయం కోసం, ఆమె శూన్యాకాశ వీథుల్లో తన చూపుల కపోతాలను ఎగురవేస్తూనే ఉంది.

నీలమేఘశ్యాముని దర్శన హర్ష వర్షానికి, ఆమె ఎదలోని భావాలు చాతక పక్షులై, గగన సీమలో విహరిస్తూనే ఉన్నాయి. మధుర- ఆ శబ్దమే రాధ చెవులలో ఒక విషాద భావాన్ని రేపుతోంది. అక్రూరుడు- ఆ నామమే ఆమె ఎదలో ఒక అశ్రువర్షపాతాన్ని నమోదు చేస్తోంది. తన చేదు అనుభవానికి మూలమైన ఆ నగరాన్ని మధుర అన్న ధూర్తుడెవడు?

పచ్చనిపల్లెమీద వాలిన కారుమబ్బులాంటి కన్నయ్యను, కల్లబొల్లి మాటలతో, పాలపల్లె నుండి పట్టుకుపోయిన ఆ ధూర్తునికి, అక్రూరుడని నామకరణం చేసిన క్రూరుడెవడు?

**కృష్ణుడులేని రాధిక మనసు పూర్వస్థితికి రాదిక !**

**మేఘశ్యాముని చూడని రాధికకు మనశ్శాంతి లేదిక !**

**వంశీధరుని మోవి నుండి పిల్లనగ్రోవి పలుకక శుభోదయం కాదిక !**

- అని భావించుకుంటూ వ్రేపల్లె యాదవ కామినులు వేదనపడుతూనే ఉన్నారు.

రాధ ఆ పల్లె ముఖద్వారానికి కట్టిన మావిపచ్చల తోరణమై నిరంతరం వ్రేలాడుతూనే ఉంది. ధేనువులు కూడా పర్వత సానువులనెక్కి గోపాలుని కోసం నిక్కి చూస్తున్నాయి. కోకిలమ్మలు కొనకొమ్మల మీద ఎదురుచూస్తూ మూగనోములు నోస్తున్నాయి. పంచవన్నెల రామచిలుకలు, పలుకులు మాని మౌనవ్రతాలు చేస్తున్నాయి.

మోహన మురళీ గానగంధర్వం ఆ పల్లెలోని ప్రాణి కోటికి సర్వసౌందర్య గర్వాన్ని హత్తిళించేది. బాలకృష్ణుని గమనం కారుమబ్బుకు కాళ్ళొచ్చి ప్రతి గడప ముందు నడయాడుతున్నట్లుండేది. నల్లనయ్య ఒంటిమీది ఆభరణాలు మబ్బు మాటున దాగిన మెరుపుతీగల్లా తళతళలాడుతుండేవి. చల్లలమ్మే పల్లెపడుచుల పయ్యెదల పాలికాపు, రేపోమాపో వస్తాడన్నది వాళ్ళ అడియాశా? గోపీపీన పయోధర మార్దంగికుడు లేని నర్తనశాలల్లా ఉన్నాయి వాళ్ళ హృదయ రంగస్థలాలు!

ఇక యశోద వత్సరహిత ధేనువై రూపెత్తిన దైన్యంలా మారిపోయింది. నందుడు ఆనంద నిష్యందుడై నీరసించిపోయాడు. బలరామకృష్ణులు ఆ వ్రేపల్లెకు పాడిపంటలు సమృద్ధి కారకమైన జంట! ఇదే మాట పల్లెలోని ప్రతి ఇంటా! రాధ రానురాను ఏదో మనోవ్యథకు గురవుతోంది. ఆమెకు అన్నపానీయాల ధ్యాసలేదు. గోవులకు గడ్డిగాదం మీద ఆశలేదు. గోపాలుర బలిష్ఠమైన భుజదండల కండలు కరిగాయి. ఆలమందలు వర్షించే క్షీరధారలు తరిగాయి. వేలాది గోగణం నుండి వెలువడే అంబారావాల పెనుఘోషతో "ఘోషవతి" అని పేరు తెచ్చుకున్న గొల్లపల్లె నిర్ఘోషకు ఆలవాలమైపోయింది.

వ్రేపల్లె పరిసర వనవీథుల్లో మయూర నృత్యాలు ఆగి పోయాయి. వసంత దుందుభులు అయిన కోయిలల గానకచ్చే రులు సమసిపోయాయి. బారులు తీరిన గౌరవంకలు ఇసుక డొంకలలో సంతాప సభలు చేస్తున్నాయి. వీచీ కూచీ అంటూ మధుర ధ్వనులతో కూజించే శాకుంతాలు, వేదాంతుల్లా రాతి గుండ్ల మీద కూర్చున్నాయి. పచ్చనిశాఖల మీద తియ్యని పళ్ళ ముందు, గాన యక్షులైన పక్షులు నిట్రుపవాసాలు చేస్తున్నాయి.

యమునాతీరం వెంబడి దిగుళ్ళ నెగళ్ళతో నెమళ్ళు రాల్చిన పింఛాలు, రేయెండలో భూమిమీద ఇంద్రధనుస్సులు విరిసినట్లు భ్రాంతిని కలిగిస్తున్నాయి. పక్షులు రాల్చిన ఈకలు, తాము గోపాల బాలునికి వ్రాసిన విరహలేఖల్లా భాసిస్తున్నాయి.

కృష్ణుడు పరమాత్మ. ప్రకృతి రూపెత్తిన బాహ్యాకృతి. కృష్ణస్వామి దూరమైన వెంటనే గొల్లపల్లెలోని మానవ ప్రకృతి లోను, పరిసరాలలోని ప్రాణి ప్రకృతిలోను, కళాత్మక రసాలు తరిగాయి. జనజీవన నీరసాలు పెరిగాయి. గోవిందుడు అందరి వాడు. అన్నింటివాడు. అనంతుడు. అందుకేనేమో ముగ్ధలైన ఈ గోపికలను వదలి రాచకార్యార్థమై రాచనగరుకు సాగి పోయాడు.

“రాధా! నేను నీకు ధ్యానం. నువ్వే నాకు ప్రాణం” అంటూ, చిలిపి చెలికాడు ఎన్ని మధురోక్తులు పలికాడు! కంసుని ఆహ్వానం అందగానే అందరినీ వదలుకుని వెళ్ళిపోయిన ఈ అందగాడు, మహామాంత్రి కుడు. యాంత్రికంగా జీవితాన్ని గడప గల చిద్విలాస చక్రవర్తి – అనుకుం టూన్న రాధకు వంతపాడుతు న్నట్లు ఆ గోపల్లెలోని గోపి కలు కొందరు సమీపించి విరహ విషాదగీతాలు ఆల పించారు.



కృష్ణుడు లేని యమునా తీరాన్ని, బృందా వనాన్ని, చల్లని పొన్నచెట్ల ఇసుక తిన్నెలను, రాసక్రీడా మండలం ప్రచలించిన, వనసీమ సోయగాన్ని – పచ్చిక బీళ్ళని, ఆలమందలని, గోపగోపికా బృందాలను రాధ ఊహించుకోలేకపోతోంది. రాధ జీవనగాథకు భరతవాక్యం కృష్ణ వియోగం.

మబ్బుల మాటుగా సూర్యుడు అస్తమించాడు. చీకటి తెరలు గగనతలం నుండి భూమ్మీదకు తెరలిపడుతున్నాయి. నీలి గగన కాసార కల్హారాల్లా, తారకలు విచ్చుకుంటున్నాయి. గోధూళివేళ గోకులం ఆకులం చెందుతోంది. పొన్నచెట్టును ఆను కుని ప్రతిష్ఠించిన విగ్రహంలా నిలబడిన రాధ, కృష్ణుడు వెళ్ళిన దారినే చూస్తు, చాలాసేపు నిలుచుంది. దారులు ఎడబాటుకే కాదు, కలయికలకు కూడా కలసివస్తాయన్న ఆశ, ఆమె ప్రాణకోశంలో వెలుగుతోంది!

తూరుపు శిఖరం మీద చంద్రోదయం అవుతూంది. కాళీయుని పడగమీద కాలుమోపిన కృష్ణుని అందెలోని కెంపు, సొంపుల్ని వెలువరిస్తున్నట్లు ఉదయచంద్రికలు రేపల్లె వీథుల్లోకి ప్రసరిస్తున్నాయి. యశోద–ప్రాణమున్న పైడిబొమ్మలా నిర్వి కారంగా తన ప్రాసాదంలో గడుపుతోంది. నందుడు–ఆనందా నికి ఆమడ దూరంలో మసలుతున్నాడు. కృష్ణబలరాములు ఇద్దరూ ఒక్కసారిగా గోకులానికి దూరం కావడంతో, రెండు కళ్ళూ చూపులు కోల్పోయినట్లు, కృష్ణుని సావాసకాపులు బరువుగా బ్రతుకులీడ్చుతున్నారు.

చంద్రకిరణాలు సోకి సరోవరాల లోని కలువలు విచ్చుకుంటున్నాయి. గోకుల చంద్రకిరణాలు దూరమైన గోపికల నయనాలు ముకుళించు కుంటున్నాయి. శీతల పవనాలు సోకి నీపశాఖికల ఆకులు విరబారుతున్నాయి. జ్యోత్స్నాభి సారికలైన గోపికల మేలి ముసుగులు నిరుపయోగంగా జారిపడుతున్నాయి.

రాధ బృందావన ప్రాణ బంధువు. స్వచ్ఛసుందర ముగ్ధ స్నిగ్ధ ప్రణయభావ సింధువు.

రాధ అందెల రవళికి ఆమె పాదాల్ని అనుసరిస్తూ, హంసలు కాళ్ళకు అడ్డుపడుతున్నాయి. చేతిలోని దీపప్రమిదను ఆరకుండా అరచేతులు ఉంచుకుని, రాధ నెమ్మదిగా నడచి వెళుతోంది బృందావనానికి! ఆరాధనకు పుట్టినిల్లు రాధ. ఆత్మార్పణకు పట్టుకొమ్మ రాధ. ఆమె ఒక తేనె కాలువ. వెన్నెల వెల్లువ.

ఇసుక తిన్నెల మీదుగా ఆమె కోమల పాదాలు చిరుసవ్వడి చేస్తూ సాగిపోతున్నాయి. దట్టమైన వెన్నెల నీడ పడుతున్న పొన్నచెట్టు క్రింద, దీపం వెలిగింది. ఆ వెలుగులో శుభలక్షణలాక్షితమైన కృష్ణపదముద్రలు కనిపించాయి. ఆ పాద ముద్రలు స్వచ్ఛమైన చిత్తడినేల మీద ముద్రితమై ఉన్నాయి. నాలుగు రాళ్ళతో గూడు కట్టి, ఆ పద ముద్రలను తన హృద యంలో ముద్రించుకుంది రాధ. రోజు సందెవేళకు ఆమె ఆ రాతిగూటిలో దీపం వెలిగించి, రెండు సందె మల్లికలను తుంచి, కృష్ణపాద ముద్రల మీద ఉంచుతుంది. అది ఆమె దినాంతవేళా నిత్య కృత్యం.

ఆమె దీపం వెలిగించే ఆ స్వర్ణవేళకు, ప్రతిదినం ధేను వులు కొన్ని అక్కడికి చేరుకుంటాయి. వత్ససహిత ధేనువులు, మౌనంగా తమ విశాల అశ్రునయనాంజలులు అర్పించుకుం టాయి. మిత్రురాళ్ళందరూ ఇళ్ళకు వెళ్ళిపోతారు. రాధ ఒంటరిగా ఆ విషాద నిశీథి సమయాల్లో, ఆ యమునా తీరభూమిలో, ప్రణయతప్త శోకమూర్తిలా, అలాగే ఎంతోసేపు గడుపుతుంది. రాత్రి ఏ జాముకో ఇల్లు చేరుకుంటుంది.

ఆమెకు నిద్రంటే ఎంతో ఇష్టం. ఎందుకంటే, నిద్రలో కలలు వస్తాయి. ఆ కలల్లో తప్పకుండా తన ప్రియుడైన కృష్ణుడు, దర్శనమిచ్చి తీరుతాడు. వ్రజవనితల తనూ తారుణ్య లావణ్య వైణికుడైన వంశీధరుడు, తన వెనుక నడచి వస్తున్నట్లుగానే రాధ ఉలికిపడుతుంది. తన పైటను పట్టి లాగుతున్నట్లు, తన బరువైన జడలో, ఎవరో పొగడపూలు తురిమినట్లు, పట్టుబడకుండా పరుగిడుతున్న తనను, ఎవరో తరిమినట్టు, తమాలవాటికా తమస్సులో తనను వాటేసుకున్న వెన్నదొంగ, నల్లనయ్య తన మానమానస చోరకళా క్రియతో మరులుగొన్నట్టు– రాధ నిత్యం పరవశ హృదయంతో, పరిచిత గొల్లెతలతో, తన అనుభూతిని పంచుకుంటూ ఉంటుంది.

అందానికి నిలువెత్తు నిదర్శనమైన కృష్ణుని, భక్తిభావంతో ఆరాధించే రాజవనితలు, మధురానగరిలో ఎందరో ఉన్నారు. ఆయన లీలలను వినివినీ వాడి దర్శనం కోసం నిలువెల్లా కళ్ళు చేసుకుని కాలం గడుపుతున్న కామినులూ ఉన్నారు. వారంతా మధురలోకి అడుగుపెట్టిన కన్నయ్యను, తమ మధుర హృదయా లతో ఆరాధనీయునిగా చూసి తరించి ఉంటారు.

గొల్లవాడలో గోపాలుర గృహద్వారాల ముందు, తచ్చాడే ముచ్చుల నెచ్చెలికాడు, ఈనాడు ద్వారకానగర నిర్మాత! భరతఖండాధినేత! రాజకీయ చదరంగ విజేత! దుష్టపాలకుల హంతగా, ధర్మసంస్థాపనా చాతుర్య నియంతగా, గొప్పపేరు తెచ్చుకున్న నా కన్నయ్యను ఎప్పుడు చూస్తానో?

వస్తాడట. తనను నాలాగా తలమునకలుగా ఆరాధించే, రుక్మిణీ సతితో కలసి వస్తాడట! తన తండ్రి సత్రాజితుని శ్యమంతక మణితో పాటూ, గోపాలుని భూపాలుని చేసి తన కొనకొంగున ముడివేసుకున్న, ఆ సత్యభామా సతీసమేతంగా వస్తున్నాడట!

పంచేంద్రియాలలాంటి పంచపాండవులకు, బుద్ధిలా మార్గదర్శకత్వాన్ని నెరపే ఆత్మబంధువైన కృష్ణుడు, రాజకీయ రణరంగంలో నిమగ్నుడై ఉన్నాడట! కంసుని, శిశుపాలుని, జరాసంధుని వధించి, వారిబారి నుండి రాకుమారులను, రాచ వనితలను రక్షించి, వాళ్ళ ప్రాణమాన సంరక్షకునిగా వ్యవ హరిస్తూ ఎంత కీర్తివంతుడై కొనియాడబడుతున్నాడో, నా కన్నడు! ఇది నాకెంత గర్వకారణం – మరోవైపు విరహ దారుణం!

రాధ – ఆరాధనా గురుకుల ప్రధానాధ్యాపకురాలు. ప్రణయాశ్రమ పాఠశాలలో, ఆమె ఒడిలో, ముద్దుగా అక్షరా భ్యాసం చేసుకున్న ప్రియశిష్యుడు కృష్ణుడు.

విశ్వరూపం దాల్చుతున్న కృష్ణప్రేమకు అంకురార్పణం జరిగింది రాధ ఒడిలోనే. యమునాతీరంలో పొన్నచెట్టు నీడ లోని ఇసుకతిన్నెల మీదే, కృష్ణ ప్రణయగాథకు మంగళాశాసనం పలికింది రేపల్లె గొల్లపిల్ల రాధే! రాధ ముగ్ధమోహన వక్షోజశ్రీ గళిత వెలివెన్నెలలోనే కన్నయ్య కలువ కన్నులు రేకులు విప్పు కున్నాయి. రాధ పైట ఆ గోకుల చంద్రుడికి, ఒక వరదగుడి.

ఆమె బాహుపరీరంభ పరివేషంలో, కృష్ణుడు ప్రతి నిశిరాతిరీ శశిబాలుడు. రాధ ఒక మధురాక్షర మాలిక! ఆమె మూర్తీభ వించిన ఒక ప్రణయ మంత్రబాలిక!! గోపయ్య హృదయపాలిక! కన్నయ్య చిలిపి చూపులకు ఆమె వలపుల హంసతూలిక! ఒకచో కృష్ణయ్యను శాసించగల ఏలిక!

రాధ ప్రకృతి ఆకృతిగొన్న ప్రణయకృతి. ఆమె తనువొక అష్టాదశ వర్ణనాత్మక ప్రబంధం. ఆమె చూపు కృష్ణునికి భోగ హారతి. ఆమె మాట అతనికి మంగళగీతి. ఆమె నవ్వు శయన సమయ నీరాజనం. ఆమె తలపు ఏకాంత సేవా సమయ సం పూజిత పుష్పతల్పం. రాధ కృష్ణునికి ప్రణయ విజ్ఞాన సర్వస్వం!

"తన ధర్మపత్నులతో రానున్న కన్నయ్య నన్ను ఎలా మన్నిస్తాడు! వారినెలా తనకు పరిచయం చేస్తాడు! ఆ సతీమ తల్లులు నాతో ఎలా ప్రవర్తిస్తారు?" అనుకుంటూ రాధ నిద్రా ముద్రిత రాజహంసిలా అలా, ఆ నిశిరాతిరి నిద్రలోకి నెమ్మదిగా జారిపోయింది. ఏదో మురళీరవం లీలగా, నీపతరుశాఖికల నుంచి వినవస్తున్న భ్రాంతితో, మెలకువ వచ్చింది రాధకు!

గవాక్ష వీక్షణంతో అంతా నల్లనయ్య ఒంటికాంతి వ్యాపించినట్లు చిమ్మచీకటి! కృష్ణుడు ఇప్పుడు నందగోప అర్భకుడు కాడు. రాజాధిరాజ పూజితుడు. శరణాగతి చేసిన వారందరి హృదయ సమర్చకుడు. ఆర్యావర్తంలో రాజకీయ సుస్థిరతను స్థాపించడం కోసం చతురతను ప్రదర్శిస్తూ, ధర్మ వర్తనులైన పాండవులను పరిరక్షిస్తూ, శుభపరిణామం కోసం పావులు కదుపుతున్న జగన్నాటక సూత్రధారి.

"అష్టమహిషులు – పదహారువేల మంది ప్రేయసులతో పాటు, రాజాధిరాజుల హృదయపీఠాలను అధిష్ఠించిన నా కన్నయ్య, భారతవీర చరిత్రకారుడు" రాధ హృదయవేది మీద ప్రతిఫలించిన యశోదా తనయుని, తనవానిగా భావించు కుంటూ తిరిగి నిద్రావశవర్తి అయిందామె.

రాధకు స్వప్నవీథిలో రుక్మిణీ సత్యాసమేత కృష్ణా గమనం దర్శనమిచ్చింది. కన్నయ్య పరుగు పరుగున వచ్చి రాధికను కౌగిలించుకున్నాడు. కారుమబ్బు చాతకపక్షిని కమ్ము కున్నట్లయిపోయింది రాధకు. "కన్నయ్యా! ఎంతవాడివయ్యావు– ఎంత సుందరా కారుడివయ్యావు – వీర శృంగార సౌందర్యాలు నీలో త్రివేణీ సంగమమై....." రాధ కన్నులలో ఆనందబాష్పాలు నిండిపోయాయి.

"సత్యా! ఈమే రాధ" – తమను సమీపించిన సత్యకు పరిచయం చేశాడు కృష్ణుడు. "శుభం! కల్యాణీ!" అంటూ నిడుపాటి వాలుజడను తన దక్షిణ హస్తం మీదకు వేసుకుని ఠీవిగా నిలుచుంది సత్యభామ. 'నమస్కారం సోదరీ!' అంటూ ఆప్యాయంగా సత్యభామను సమీపించడానికి ఒక అడుగు ముందుకు వేసి ఆగిపోయింది రాధ! సత్య రాచరిక సౌందర్యం ముందు తానొక పల్లెటూరి గొల్లపిల్లలా అనిపించింది రాధకు. ఆ భావాన్ని గుర్తించిన సత్య అధరాల మీద ఒక దరహాసం వెల్లి విరిసింది. వెన్నదొంగకు అన్నీ కరతలామలకాలే కదా! ఆత్మీ యంగా రాధ భుజంమీద చేయివేసుకుని రుక్మిణి దగ్గరకు తీసుకువెళ్ళాడు కృష్ణుడు. రుక్మిణి రాధను తనివితీరా కౌగి లించుకుంది. కృష్ణుని కౌగిలింతలోని వింతైన గిలిగింత రాధకు రుక్మిణీ పరిష్వంగంలో ఏర్పడింది. రుక్మిణి ముందు తులసి కోటలో పెరిగిన గడ్డిమొక్కలా రాధ, తనను తాను భావించు కుంది. అన్నీ ఎరిగిన కన్నయ్య అన్నాడు కదా–

"రుక్మిణీ! నా రాధిక పాదాల దగ్గర కూర్చునే ఈ కృష్ణుడు ప్రేమబీజాక్షరాలను దిద్దుకున్నాడు" కృష్ణుని కళ్ళలో అశ్రువులు ఆవిర్భవించాయి. "కన్నయ్యా!" అంటూ రాధ కృష్ణుని పెదవుల మీద చేయివేసింది. ఆమె చేపకళ్ళు కన్నీటి బిందువుల్ని రాల్చాయి.

"రాధా! ఈ చేతితోనే కదా ఎన్నో వెన్న ముద్దల్ని, ఆ పొన్నచెట్టు నీడలో నీ ఒడిలో..." మూగవోయిన కంఠంతో అంటూ రాధచేతిని ముద్దుపెట్టుకున్నాడు కృష్ణుడు.

రాధ ఉలికిపడి మేల్కొంది. కల చెదిరిపోయింది. రాధ నయన కమలాలు కన్నీటి ముత్యాలతో నిండిపోయాయి. భక్త మానస సరోవర రాజహంస, నెమలి పింఛంతో పాటు, రాధ నయనాలలో ప్రతిబింబించింది. ఎలతేటి– పూనీటిలో మునిగి లేచినట్లు, రాధ హృదయ బంభరం, కృష్ణకాసార పదపద్మ మాధురిలో తేలియాడింది!!

**రాధా మాధవ రతి చరితం**
**బోధావహం శ్రుతిభూషణం**

## శ్రీపదకేళి - 13 (జూన్ - 2010)
## విజేతలు

**1) పి.సి.సుబ్బరత్నం,**
యస్.బి.ఐ. వద్ద, జమ్మలమడుగు (పోస్ట్),
కడప జిల్లా.

**2) ఎ.శారద,**
W/o ఎ.గోపాలరావు,
ఇంటి నెం.25-5-15,
సుబ్రహ్మణ్యంపేట, విజయనగరం - 535 002.

**3) పూటుకూరి రామయ్య,**
ఇంటి నెం.9-131, కస్తూరిబాయి వీధి,
మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా.

**సరైన సమాధానాలు రాసినవారు :**

బి.బాలస్వామి (సికింద్రాబాద్); బి.విశ్వనాథరావు (హైదరాబాద్); కె.ఎస్.ఉమామహేశ్వరి (కుప్పం); టి.ఎన్.విశ్వనాథరావు (బెంగళూరు); టి.ఆర్.బాలకృష్ణారావు (రాజమండ్రి); ఎస్.రామచంద్రయ్య (పీలేరు); టి.శేషగిరిరావు(పీలేరు); వి.నాగముని రెడ్డి (ప్రొద్దుటూరు); ఎస్.నాగభూషణశర్మ (అనంతపూర్); కె.రామసుబ్బయ్య (ప్రొద్దుటూరు); పి.నిర్మల (గుంటూరు); సి.యజనారాయణశర్మ(గుంటూరు);కె.వి.ఎస్.కేశవ్(విశాఖపట్నం); వి.నరసింగరావు(సికింద్రాబాద్); ఎన్.వి.ఎస్.ఎస్.దివ్య(శ్రీకాకుళం); వి.వెంకటేశ్వర్లు (నల్లగొండ); టి.సిద్దేష్ (చెన్నై); ఎ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); టి.వెంకటనరసమ్మ(మార్కాపురం); టి.ఎస్.జి.రామారావు(సికింద్రాబాద్); పి.అనసూయ(చిత్తూరు); ఎన్.రామకృష్ణ(గుంటూరు); వి.సుందరరామయ్య (చెన్నూరు); కె.సౌదామిని(అనంతపురం); యం.లక్ష్మీదేవి(రైల్వేకోడూరు); యం.దుర్గా అన్నపూర్ణ (హనుమకొండ); ఎ.వి.రంగనాయకి (రాజమండ్రి); యం.హనుమంతరావు(హైదరాబాద్); సి.పద్మావతి(మచిలీపట్నం); ఎ.శ్యామసుందర్ (హైదరాబాద్); కె.ఎస్.సుబ్రహ్మణ్యం (కర్నూలు); ఎం.శ్రీలత (కర్నూలు); కె.వి.మోహన రావు(ఖైరతాబాదు); ఎం.వి.ప్రసాదరావు(ఒంగోలు); కె.ఎల్.నరసింహారావు (విజయవాడ); జి.సుబ్బలక్ష్మి (హైదరాబాద్); ఎం.భానుమతి (తిరుపతి); గోవిందమ్మ(హైదరాబాద్); జి.నాగలక్ష్మి(హైదరాబాద్); వి.లక్ష్మి(కోల్‌కొత్త); జె.సామ్రాజ్యలక్ష్మి(తిరుపతి); వి.ఎం.రామచంద్రప్రసాద్ (గొల్లపూడి); పి.రామకృష్ణ(పిఠాపురం).




**నిబంధనలు :**

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొనవచ్చు.

**బహుమతి వివరాలు :**

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

**పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :**

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | ■ | 1 | | 2 | | 3 | ■ | ■ |
| 4 | ■ | | ■ | | ■ | | ■ | ■ |
| 5 | | ■ | 6 | | | ■ | 7 | 8 |
| | ■ | 9 | ■ | | ■ | 10 | ■ | |
| 11 | | | | ■ | 12 | | | |
| | ■ | | ■ | 13 | ■ | | ■ | |
| | | ■ | 14 | | | ■ | 15 | |
| 16 | | | ■ | | ■ | 17 | ■ | ■ |
| | ■ | ■ | 18 | | | | ■ | ■ |

# శ్రీపదకేళి - 15

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

**2) మీరు సప్తగిరి చందాదారులైతే?**

అ) చందా నంబరు : ..................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..................................

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

## ఆధారాలు

### అడ్డం

**1)** కుబేరుని తోట (5)

**5)** ప్రకృతిలో కావ్యము (2)

**6)** మహర్షులకు కోపం వస్తే ఇది ఇస్తుంటారు (3)

**7)** ఇదే చేనుమేస్తే చేసేదేమిటి? (2)

**11)** శుక్రాచార్యుల కుమార్తె. ఆమె యయాతి భార్య (4)

**12)** కర్ణభూషణము (4)

**14)** అహంకారికి ఇది ఎక్కువ (3)

**15)** గులాబి పువ్వుకు ఇది ఉంటుంది (2)

**16)** దక్షిణ దిక్కుకు అధిపతి. పైగా అతడు జీవుల ప్రాణాల్ని హరిస్తాడు (3)

**18)** గరుత్మంతుడు (4)

### నిలువు

**1)** ఈ మాసంతో తెలుగు సంవత్సరాది ప్రారంభమౌతుంది (2)

**2)** మన్మథుడు (4)

**3)** ఒకానొక శృంగార నాయిక (2)

**4)** ఆంధ్రభోజుడు (8)

**8)** మన్మథుని ధనస్సు (5)

**9)** నహుషుని కుమారుడైన ఒకానొక చంద్రవంశపురాజు (3)

**10)** కవి చెప్పేది (3)

**13)** వాయుదేవుడు, అగ్నిదేవుడు, పరమాత్మ అనే అర్థాలనిచ్చే పదం (4)

**17)** దినము పర్యాయపదం (2)

### —:: *శ్రీపదకేళి-13* (జూన్, 2010) సమాధానాలు ::—

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 ర | క్తం | ■ | 2 పు | స్త | కం | ■ | 3 బా | 4 వ |
| త్న | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | రూ |
| 5 మా | త | ■ | 6 వై | 7 కుం | ఠం | ■ | 8 ర | థి |
| ల | ■ | 9 వ్యా | ■ | తి | ■ | 10 మే | ■ | ని |
| ■ | 11 వ | సు | ధ | ■ | 12 మే | న | క | ■ |
| 13 చే | ■ | డు | ■ | 14 హా | ■ | త్త | ■ | 15 సు |
| 16 ది | వి | ■ | 17 వ | సం | తం | ■ | 18 గ | ద |
| పు | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ర్శ |
| 19 రం | భ | ■ | 20 అం | బి | క | ■ | 21 స్థా | నం |



# ఆగస్టు, 2010
# రాశి ఫలాలు



- జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ మాసంలో వీరు తొందరపాటు నిర్ణయాలతో, చేసే వృత్తి వ్యాపారాల్లో కష్టనష్టాలు కొని తెచ్చుకుంటారు. అవివాహితుల వివాహప్రయత్నాలు రెండోవారం పరిపూర్ణమౌతాయి. భూమి, వెండి, బంగారు, వస్తువుల క్రయవిక్రయాలకు అనుకూలం. వరలక్ష్మీవ్రతం శ్రావణపూజలు మహిళలకు ఆనందాన్నిస్తాయి. మొదటివారం అనారోగ్యం, రెండోవారం కార్యజయం, మూడోవారం ధార్మికత, నాలుగోవారం సంతోషం.



## వృషభ రాశి

ఈ మాసంలో ఈ రాశివారికి స్థిరాస్థియోగం, కొత్త మిత్రుల పరిచయాలు ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. చేసే వృత్తివ్యాపారాల్లో లాభాలు, ప్రశంసలు పొందుతారు. ధార్మిక కార్యక్రమాల్లో అధికంగా పాల్గొంటారు. ప్రతి పనిలో విజయం వరిస్తుంది. గోపూజలు చేస్తే మంచి ఫలితాలు వస్తాయి. మొదటివారం ఆర్థికాభివృద్ధి, రెండోవారం ధార్మిక చింతన, మూడోవారం విజయం, నాలుగోవారం మానసికానందం.



## మిథున రాశి

ఈ మాసంలో వృత్తి ఉద్యోగాలు చేసేవారికి అధిక శ్రమ, ప్రభుత్వ ఆదేశాలు ఆందోళనకు గురిచేస్తాయి. దైవ చింతన కోసం ధనం బాగా ఖర్చుచేయటం ఆర్థిక సమస్యలకు దారి తీస్తుంది. ఉద్యోగులకు స్థానచలన సూచనలు ఉన్నాయి. ఇంట్లో ఒకరి పరిస్థితి ఆందోళన కల్గిస్తుంది. మొదటివారం వృథాశ్రమ, రెండోవారం ఆందోళన, మూడోవారం స్థానచనలం, నాలుగోవారం విజయం.



## కర్కాటక రాశి

ఈ మాసంలో ఈ రాశివారు సమయానికి డబ్బు సర్దుబాటుకాక అప్పులు చేయాల్సి వస్తుంది. మహిళలకు, విద్యార్థులకు ఉన్నత విద్యావకాశాలు. మొదటివారం వివాదాలు, రెండోవారం ఆందోళనలు, మూడోవారం ఉన్నత విద్యావకాశాలు, నాలుగోవారం గౌరీపూజాఫలం.



## సింహ రాశి

ఈ రాశివారు ఈ మాసంలో ధార్మిక కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటారు. ధనానికి లోటు లేకున్నా ఖర్చులు అధికమై ఆందోళన కల్గిస్తాయి. దూరప్రయాణాలు నిరాశపరుస్తాయి. భూమి కొనుగోలు, స్థిరాస్థి వివాదాలు కోర్టు ద్వారా పరిష్కారమౌతాయి. పలుపంటలు పండించే రైతన్నలు సమయానికి వర్షాలు కురవటం వల్ల సంతోషపడతారు. మొదటివారం వృథాఖర్చులు, రెండోవారం వృథాప్రయాణాలు, మూడోవారం ఆనందం, నాలుగోవారం కార్యజయం.



## కన్యా రాశి

ఈ రాశి మహిళలకు అదృష్టకాలం. దైవచింతనకు సమయం బాగా కేటాయిస్తారు. స్థిరాస్థియోగం కలిసి వస్తుంది. అందరికన్నా అన్నిట్లో పైచేయిగా ఉంటారు. నూతన వస్తువులు, ఆభరణాలు కొనుగోలు చేస్తారు. అధిక వర్షపాతం వల్ల గొంతు, ముక్కు సంబంధిత అనారోగ్యాలు కల్గుతాయి. ప్రతి విషయంలో మీ ఆధిపత్యం ప్రభావం చూపుతుంది. మొదటివారం దైవ చింతన, రెండోవారం వస్తువుల కొనుగోలు, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం శుభవార్తాశ్రవణం.



## తులా రాశి

ఈ రాశివారికి గృహంలో మార్పులు జరుగుతాయి. గతంలోని తప్పిదాలు గ్రహపాటై బాధిస్తాయి. పెద్దలపట్ల నిర్లక్ష్య వైఖరి పలు ఇబ్బందులకు దారి తీస్తుంది. క్షణ క్షణం భయంగా

ఈ మాసం గడుస్తుంది. మొదటివారం విమర్శలు, రెండోవారం అహంకారం, మూడోవారం వృథా, నాలుగోవారం కార్యజయం, భయాందోళనలు.

## వృశ్చిక రాశి

ఈ మాసంలో వీళ్ళకు తల్లిదండ్రుల ప్రోత్సాహం పుష్కలంగా ఉండటం వల్ల ఉన్నత విద్యాభ్యాసం కోసం చేసే విదేశీ ప్రయత్నాలు, వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రతి చిన్న విషయానికి దీర్ఘాలోచన చేస్తారు. అతి ఆలోచనలు, తలనొప్పికి దారితీస్తాయి. పిల్లల యోగక్షేమాలకోసం చేసే వర లక్ష్మీవ్రతాలు, పూజలు మంచిఫలితాన్ని, మానసిక ప్రశాంతతను చేకూరుస్తాయి. మొదటివారం ఉత్సాహం, రెండోవారం స్త్రీ లాభం, మూడోవారం ధార్మిక చింతన, నాలుగోవారం ఆనందం, సంతోషం.

## సంప్రదాయ దుస్తులను ధరించండి!

1. తిరుమల శ్రీవారి దర్శనానికి విచ్చేయు భక్తులు తప్పని సరిగా సరియైన వస్త్రధారణతో రావలెను.
2. సరియైన వస్త్రధారణ అనగా **పురుషులు ఫ్యాంటు, షర్టుగాని, లాల్చీ పైజామాకాని, పంచ, కండువ గాని** ధరించవలెను. **స్త్రీలు చీరలలోగాని, సల్వార్ కమీజ్ లలో** గాని రావలెను.
3. **అలాకాక ఎవరైనా నిక్కర్లతోగాని, టీ షర్టులతోగాని, బర్ముడాలతో గాని దర్శనానికై వచ్చిన యెడల అను మతించబడరు. వీరిని 'క్యూ కాంప్లెక్స్' మొదటిలోనే దుస్తులు మార్చుకొనిరావల్సిందిగా కోరడం జరుగు తుంది.**
4. **ఈ నియమం 2010, జూన్ 7వ తేదీ నుండి అమల్లోకి వచ్చింది.**
5. భక్తులు దేవస్థానం అధికారులతో సహకరించవల సిందిగా కోరుతున్నాము.

**- కార్యనిర్వహణాధికారి**

## ధనూ రాశి

ఈ రాశివారు ఈ నెలలో కుటుంబ వ్యక్తులతో మన స్పర్థల వల్ల కష్టాలు కొని తెచ్చుకొంటారు. ప్రతి విషయానికి కోపగించుకునే మీ తత్త్వం ఇతరులను మానసిక వేదనకు గురి చేస్తుంది. మహిళలకు శుభవార్తాశ్రవణం. రాజకీయనాయకులకు పదవీయోగం. వెండి, బంగారు వర్తకులకు ధనాదాయం. మొదటివారం ఆనందం, రెండోవారం సన్మానాలు, మూడోవారం ఆందోళన, నాలుగోవారం అనారోగ్యం.

## మకర రాశి

ఈ నెలలో ఈ రాశివారికి నమ్మిన వ్యక్తులవల్ల కష్టాలు మొదలౌతాయి. నిందారోపణలు మానసికంగా కృంగదీస్తాయి. లక్ష్యసాధన మరచి పట్టుదల వల్ల నష్టాలు వస్తాయని అను భవంతో గుర్తిస్తారు. పిల్లలకు తల్లిదండ్రులకు అనారోగ్య సమ స్యలు. వృథా ఖర్చులు, దూరపు ప్రయాణాలు అదుపులో ఉంచు కోవాలి. మొదటివారం వృథాప్రయాణం, రెండోవారం ఆకర్షణ, మూడోవారం ఆందోళన, నాలుగోవారం నిందారోపణలు.

## కుంభ రాశి

ఈ మాసంలో వీరికి సుదీర్ఘకాలంగా పెండింగ్‌లో ఉన్న కోర్టు వ్యవహారాలు, స్థిరాస్థి పంపకాలు కొలిక్కి వస్తాయి. మహిళలు ఆచరించే గౌరీపూజలవల్ల ఆర్థిక, మానసిక, శారీరక తృప్తి కల్గుతుంది. పిల్లలకోసం ఉన్నతవిద్యకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. మొదటివారం ధనయోగం, రెండోవారం దైవచింతన, మూడోవారం విజయప్రాప్తి, నాలుగోవారం ఆనందం.

## మీన రాశి

ఈ నెలలో ఈ రాశివారికి ఫలితాలు అనుకూలంగా ఉన్నా తొందరపాటు నిర్ణయాలతో పలు ఇబ్బందులు ఎదుర్కో వలసి వస్తుంది. నమ్మిన బంధుమిత్రుల వెన్నుపోటుకు గురై కష్టాలు తెచ్చుకుంటారు. వరలక్ష్మీవ్రతాన్ని, శ్రీ వేంకటేశ్వర స్తోత్రాన్ని పఠించి మానసికానందం పొందండి. మొదటివారం తీర్థయాత్ర, రెండోవారం గుర్తింపు, మూడోవారం ప్రయత్నఫలం, నాలుగోవారం ప్రశాంతత.

# సంకల్పబలం

- కొముందూరి కనకదుర్గ, రాంచి




శ్రీనివాసుని సంకల్పబలం ఉంటే సాధించ లేనిది ఏదీ లేదనటానికి మా పెద్దబ్బాయి ఉపనయనం ఓ అత్యంత అద్భుత సంఘటనగా మా మనస్సులో నిలిచి పోయింది.

మావారు వృత్తిరీత్యా కోల్ ఇండియాలో ఇంజనీరు. మాకు ఇద్దరబ్బాయిలు. మేము 25 సంవత్సరాల నుండి రాంచి(జార్ఖండ్)లో ఉంటున్నాం. పెద్ద అబ్బాయి ఉపనయనం స్వామివారి సన్నిధిలో చేయాలని మొక్కుకున్నాం. 2003, ఫిబ్రవరి 7వ తేది మంచిరోజని నిర్ణయించుకున్నాం. వెంటనే తిరుపతి శ్రీ త్రిదండి చిన్న జీయరు స్వామివారి మఠానికి ఫోన్ చేసి మాకు 7వ తేదీకి బస తదితర ఏర్పాట్లు కావాలని అడిగాము. వారు వెంటనే ప్రస్తుతం మఠం నిర్మాణంలో ఉంది, ఎవరికీ కేటాయించటం లేదు అని చెప్పి, మళ్ళా వారే మీరు ప్రతి సంవత్సరం వస్తారు కదా! ఎలాగో సర్ది ఇద్దాము అనుకున్నా మీ ముహూర్తం ఉదయం 11 గంటలకు కాబట్టి ఆ సమయంలో మాకు ఆ హాలులో తదీయారాధన జరుగుతుంది. అందువల్ల ఇవ్వలేము మరియు రూములు కూడ లేవు అని చెప్పేశారు.

ఇంతదూరంలో ఉన్నాము ఇక ఏర్పాట్లు ఎలా చేసుకోవాలి? ఎక్కడ ఫంక్షన్ చేయాలి? ఏమీ తోచని స్థితిలో 5వ తేది తిరుమల చేరాం. ఆ మధ్యాహ్నం స్వామిదర్శనం చేసుకుని, స్వామీ ఈ సంకల్పం చేయించిన స్వామివి నువ్వే. ఈ కార్యక్రమం ఏ విఘ్నం లేకుండా జరగాల్సిన బాధ్యత కూడ నీదే తండ్రీ అని స్వామివారికి మొక్కాం. దర్శనం పూర్తి చేసుకుని అతిథి గృహానికి చేరుకున్నాం. వెంటనే ఓ మఠం పూజారి వచ్చి, "స్వామీ మీరు హాలుకోసం వెతుకుతున్నారని తెలిసింది. ఒక్క కల్యాణమండపం 7వ తేదికి ఖాళీగా ఉంది. మీరు వెంటనే దానికి డ్రాఫ్టు కట్టి రిజర్వు చేసుకోండి. నా వెంట వస్తే మిగిలిన ఏర్పాట్లు, భజంత్రీలు, భోజనం, డెకరేషన్లు మొదలైనవి నేను చూస్తాను రండి సార్!" అంటూ పిలుచుకు వెళ్ళారు. మేము పురోహితుడి ఏర్పాట్లు స్వయంగా చేసుకొన్నాము. అన్నీ క్షణాల్లో జరిగిపోయాయి.

ఊహించిన దానికంటే చాలా ఘనంగా ఉపనయనం జరిగింది. ఆ మరునాడు 'రథసప్తమి' సందర్భంగా స్వామివారి విశేష దర్శనం చేసుకున్నాము.

తిరుగు ప్రయాణంలో 8వ తేదీన ఉదయం కాణిపాకం వెళ్లి సాయంత్రం 4 గంటలకి తిరుపతి చేరాము. అందువల్ల తిరుచానూరు వెళ్ళటానికి సమయం చాలక వెంటనే స్టేషనుకు వచ్చి; నేను, మావారు ఆఫీసు పనిమీద విశాఖపట్నం వెళ్లడానికి తిరుమల ఎక్స్‌ప్రెస్, మా అబ్బాయిలు హైదరాబాదుకు వెళ్లడానికి నారాయణాద్రి ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణించాము. మేము విశాఖపట్నంలో దిగిన తరువాత చూస్తే మా సూట్‌కేసు ఒకటి పోయింది. అమ్మవారిని దర్శించకుండానే బయలుదేరడం వల్ల ఈ శిక్ష పడిందేమో అనుకొని వెంటనే అమ్మవారిని క్షమాపణ కోరుకున్నాము. ఆశ్చర్యం! వెంటనే సూట్‌కేసు దొరికింది. చివరికి సుఖాంతంగా ఇంటికి చేరాము.

తదుపరి మరొక పర్యాయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారితో పాటు, శ్రీ పద్మావతీ అమ్మవారిని కూడా ఏ ఇబ్బందీ లేకుండా ఇంటిల్లిపాది దర్శించుకున్నాము.

**ఎందుకు తలనీలాలు సమర్పించడం?**

**తీర్థోపవాసః కర్తవ్యః శిరసో ముండనం తథా ।**
**శిరోగతాని పాపాని యాన్తి ముండనతో యతః ॥**

**(పద్మపురాణం 237.45)**

తీర్థక్షేత్రంలో ఉపవాసం చెయ్యాలి. తలనీలాలు తీయించుకోవాలి. అలా తలనీలాలు తీయించుకుంటే శిరస్సులో ఉన్న పాపాలు నశించి పోతాయి. అహంకారం తగ్గిపోయి, అశాశ్వతమైన శరీరంపైన మమకారం తగ్గిపోతుంది.



# తిరుమల ఆలయం

ఆంగ్లమూలం : డా॥ రమేశన్ తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ

**ధారావాహికం - 91**

**(13వ అధ్యాయం ఆలయ అగత్యాలను వివరించిన తర్వాత అంటె విగ్రహ ప్రతిష్ఠాపన తర్వాత విగ్రహా లంకరణ గురించి పూజాదికాల నైవేద్యాల గురించి చెపితే, 14వ అధ్యాయంలో విజయనగర కాలంలో ఆలయం పొందిన ప్రాభవ వైభవాలను వివరిస్తూ, సామ్రాట్టులు, సామంతులు, సామాన్యులు స్వామిసేవలో తమ వంతు చెల్లించిన వైనాన్ని విశదపరుస్తుంది.)**

కొండ పాదతలాన, కపిలతీర్థానికి పశ్చిమ దిక్కులో కొండ ఎక్కడానికి అనువుగా ఉన్న సోపానమార్గం ప్రారంభించే తావులో ఆండాళ్ పెంపుడు తండ్రియైన పెరియాళ్వార్ గుడి ఉంది. ఈ గుడి ఎప్పుడు నిర్మించబడిందనే విషయం గానీ, విగ్రహప్రతిష్ఠ ఎపుడు జరిగిందనే విషయంగాని తెలియడం లేదు. కానీ ఈ గుడి గోడమీద రెండు శాసనాలు చెక్కబడి ఉన్నాయి. ఈ దారిన పోవు పథికుల దాహార్తిని తీర్చు నిమిత్తం చెరువు నిర్మించినట్లు **కామవిల్లి** శాసనం సంఖ్య 274-జి.టి. తెలుపుతోంది. మరో బావి ఉత్తర మేరూరునకు చెందిన **కరవెట్టి పుళి యాళ్వారు మన్నార్ పిళ్ళై** అనునతడు కిందికి దిగుటకు వీలుగా మెట్లు కలిగిన దిగుడుబావిని కట్టించాడని మరో శాసనం సంఖ్య 274-జి.టి. తెలుపుతోంది. ఈ బావి శా.శ. 1411 సౌమ్య సంవత్సరం అంటే క్రీ.శ.1490 సంవత్సరం జనవరి 25వ తేదీనాడు కట్టించినట్లు శాసనం తెలుపుతోంది. ఈ తేదీ సాళువ నరసింహుని పరిపాలనయొక్క కడపటి సంవత్స రానికి ముందటి సంవత్సరం శ్రీ లక్ష్మీనరసింహస్వామి దేవాలయ గోపురం సాళువ నరసింహుడు నిర్మించినట్లు రెండవ శాసనం తెలుపుతోంది.

*(గోపుర నిర్మాణమంటే ఆలయ నిర్మాణంగా తీసు కోవాలి. ఈ ఆలయంలో వేసిన శాసనం ఇచ్చట లక్ష్మీనర సింహుని ప్రతిష్ఠించినట్లు తెలుపుతున్నది - అనువాదకుడు) ఇచటి బృహద్గోపురం కూడ ఇతను నిర్మించిందే! (మెట్లదారిలో అలిపిరి నుండి మొదటి గోపురం - అనువాదకుడు)*

ఈ పెద్ద గోపురం క్రీ.శ.1930 సంవత్సరంలో వర్షాలు కురిసినపుడు పడిన పిడుగుపాటుకు బీటలువారి కూలిపోయింది. (శాసనం సంఖ్య 271-జి.టి.) మొదటి చెరువు కామవల్లిచే నిర్మితమైన మొదటి బావి కాలకర్మవశాత్తు విని యోగానికి పనికిరాని విధంగా శిథిలమై ఉండడం వల్లే కాబోలు, ఈ రెండవ బావి నిర్మాణం జరిగి ఉంటుంది. అంటే మొదటి బావి కొంచెం అటు ఇటుగా ఒక శతాబ్దం తర్వాత అంటే 14వ శతాబ్దం చివరి దశకంలో నిర్మించబడి ఉంటుంది. ఆ ప్రకారంగా చూసినట్లైతే ఏ దేవాలయ గోడపైన ఈ శాస నాలు చెక్కబడియున్నవో ఆ పెరియాళ్వారు దేవాలయం 14వ శతాబ్దం ప్రథమార్ధంలో నిర్మించబడి ఉంటుంది.

(ఇక్కడి శాసనాలను చదివిన నాటికి అంటే క్రీ.శ. 1930 నాటికి ఈ ఆలయం పెరియాళ్వారు గుడిగా పిలువబడు తుండేది. సాళువ నరసింహుడు లక్ష్మీనరసింహస్వామిని ప్రతి ష్ఠించి ఈ గుడిని కట్టించాడు. చిన తిరుమలయ్యంగార్ కుమా రుడు తిరువేణాదయ్య కపిలతీర్థం సమీపాన పెద్ద చిముగు ప్రాంతంలో ఒక గుడికట్టి పెరియాళ్వారు విగ్రహాన్ని ప్రతిష్ఠ చేశాడు. ఇది జరిగింది తాళికోట యుద్ధానికి మునుపు. తాళి కోట యుద్ధానంతరం విజయనగర సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. తిరుమలరాయడు అళియ రామరాయడి తమ్ముడు సదాశివ రాయ చక్రవర్తిని పెనుగొండకు తీసుకుని వచ్చిన తర్వాత తానే రాజు అయ్యాడు. తదనంతరం బహమని సుల్తానులు దక్షిణ విజయనగర సామ్రాజ్యాన్ని సైన్యంతో లూటి చేయనారం

భించాడు. అపుడు ఈ రాయలసీమలోని దేవాలయాలంతా మట్టిలో కలిసిపోయాయి. శ్రీనివాసమంగాపురం, అలిపిరి ఆలయం, ఈ పెద్ద చీముగు పెరియాళ్వార్ ఆలయం, కపిలతీర్థంలోని నమ్మాళ్వార్ అలయం, అచ్యుతరాయపురంలోని అచ్యుత పెరుమాళ్ ఆలయం అన్నీ నేలకొరిగాయి. అలిపిరి ఆలయం పెరియాళ్వార్ ఆలయం పేరులో ఒకటైపోయి ఉండి, లక్ష్మీనరసింహాలయం పెరియాళ్వార్ ఆలయం అని అపప్రథ ఏర్పడే అవకాశం ఉంది - అనువాదకుడు).

దేవాలయంలో విగ్రహప్రతిష్ఠ జరిగిన తరువాత చేయాల్సిన ముఖ్యకార్యక్రమం దీపం, నిత్యపూజాదిక కైంకర్యం, నైవేద్య సమర్పణ మున్నగువాటిని ఏర్పాటుగావించాలి. అటు తరువాతే అలంకరణ విషయమై శ్రద్ధవహించాలి. ఆభరణాద్యలంకారాలు సౌందర్యపోషకాలు. ఆలయవసారా గదులు, నడవలు ప్రాకారపు గోడల నిర్మాణం మరియు ఉత్సవాలు, స్వామివారి ఊరేగింపులు జరిపేందుకు వాహనాలు, మున్నగువాటిని సమకూర్చడం, వాయిద్యాలను సమకూర్చడం; ఎద్దులు, గుర్రాలు, ఏనుగులు, ఒంటెలు సమకూర్చడం స్వామివారి అంగరంగ వైభవాన్ని తెల్పుతాయి. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో ఉత్సవాలు 13వ శతాబ్దం నుండే ప్రారంభమైనప్పటికీ ఆ తరువాతే అంటే విజయనగరకాలం నాటికి 15వ శతాబ్దంలో వైభవప్రాభవాలను పొందాయి.

స్వామికి అలంకరణార్థం, రాణిసామవై మణవాళ పెరుమాళ్ విగ్రహానికి మాత్రమే ఆభరణాలు సమకూర్చింది. రెండవ పరాంతక సుందరచోళుని రాణియైన పరాంతకదేవి అమ్మన్ క్రీ.శ.1001 సం॥లో ఆమె సవతి కుమారుడు మొదటి రాజరాజు యొక్క 16వ సంవత్సర పరిపాలనాకాలంలో శ్రీ వేంకటేశ్వరస్వామి మూలవిగ్రహానికి 6 కెంపులు, 4 వజ్రాలు, 28 ముత్యాలు పొదిగిన బంగారు పట్టాన్ని సమర్పించింది. (ఇది నుదుటిపైన, కిరీటానికి కింద అలంకరణ చేయబడును) మూలవిగ్రహానికి ప్రప్రథమంగా చేసిన బహూకరణ ఇదే (శాసన సంఖ్య 17-టి.టి.). దీని తర్వాత శ్రీవారి అలంకరణార్థం ఒక హస్తాభరణం దానం ఇవ్వబడింది. మూలవిరాట్టుకు వైకుంఠహస్తమనబడే (వరదహస్తం) ముందరి కుడిహస్తం అరచేతికి అలంకరణార్థం ఇచ్చింది. ఇది బంగారు తొడుగై ఉండవచ్చు. వరదహస్తం భక్తునివైపు తిరిగి కిందివైపున పాదపద్మాలను చూపుతుంది. ఈ ఆభరణం 13 లేక 14వ శతాబ్దంలో తంజై రాజైన హోబళ యాదవరాయుడు దానం చేశాడు (శాసనం సంఖ్య 56-టి.టి.మరియు 56 ఎ-టి.టి.).

తన పరిపాలన కాలంలోని 5-10 సంవత్సరాల మధ్య కాలంలో ఒకటవ జటావర్మ సుందరపాండ్యుడు ఉత్తరదేశ దిగ్విజయయాత్ర చేసే సందర్భంలో, తన దండయాత్రను కృష్ణానది వరకు సాగించియున్నాడు. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని బహుశ క్రీ.శ. 1256 సం॥ ప్రాంతాన తిరుమల శ్రీ వేంకటేశ్వర దేవాలయమందలి ఆనందనిలయ విమానం మీద బంగారు కలశాన్ని **(హేమకలశో స్థాపి)** స్థాపించాడు. (తిరుమల తిరుపతి దేవస్థాన శాసన సంపుటి 1 పుట 104-105)

14వ శతాబ్దానికి చెందిన కొన్ని శాసనాలలో సన్యాసుల వాసస్థానాలైన కొన్ని మఠాల గురించిన ప్రస్తావన ఉంది. తిరువెంకటనాథయాదవరాయలు తిరుమలలో తాను ఏర్పాటు చేసిన ఆడి (ఆషాఢం) మాసోత్సవ నిర్వహణార్థం, రేచయ దన్నాయకుని పేర ఏర్పాటు చేసిన సంధి అంటే సితకరగన్డన్ సంధి జరపడానికి తగు ఏర్పాటు గావించి, అందులకు అయ్యే ఖర్చులకుగాను, తన పరిపాలనాకాలమందలి 9వ సంవత్సరమంటే 1330-31 సంవత్సరమందు పొంగలూరు సగ గ్రామ ఆదాయాన్ని తిరుమల శ్రీనివాసునికి సమర్పణ చేశాడు. అంతే

**ప్రార్థించకుండానే సూర్యుడు**
**తామర కొలనును వికసింపజేస్తున్నాడు.**

**చంద్రుడూ అలాగే కలువలకు**
**వికాసం చేకూరుస్తున్నాడు.**

**మేఘుడు కూడా ఎవరూ**
**అడుగకపోయినా**
**నీటిని ఇస్తున్నాడు.**

**సత్పురుషులు తమంతట తామే ఎప్పుడూ**
**పరులకు మేలు చేయడానికి సిద్ధపడుతుంటారు.**

కాకుండా ఈ ఆదాయం పై పేర్కొన్న వాటికే కాకుండా తిరుపతి లోని వీరనరసింహునికి మరియు తిరుమంగై ఆళ్వారుల నైవేద్యం కోసం, సితకరగన్డన్ మఠంలో 32మంది బ్రాహ్మణులకు భోజన సదుపాయానికి ఉపయోగించాల్సింది గానూ, మిగిలిన ధనంతో ఒక పూలవనం, ఒక చలివేంద్రం నిర్వహించేందుకు మరి ఇతర ధర్మకార్యాల నిర్వహణార్థం ఖర్చు పెట్టమనీ సింగయ దన్నాయకుడు స్థానత్తారులను కోరుకున్నాడు. (శాసనం సంఖ్య 195-టి.టి.).

శ్రీరంగయాదవరాయల (క్రీ.శ.1339) పరిపాలనా కాలమందలి 3వ సంవత్సరానికి చెందిన శాసనం 354-టి.టి. తెలుపుతున్న ప్రకారం రెండు సితకరగన్డన్ మఠాలు ఉన్నాయనీ, అందులో ఒకటి తిరుమలలోను, మరొకటి తిరుపతిలోను ఉన్నట్లు తెలుస్తున్నాయి. తిరుమలలోని ఈ మఠ ఆధ్వర్యంలో అరిశనాలయన్ నందనవనం మరియువణ్ శఠగోపన్ నందన వనం అనే రెండు పూదోటలు ఉన్నాయి. సింగయదన్నాయకుడు ఈ రెండు మఠాలను తన తరపున కొందరు సన్యాసుల పరం చేశాడు. 1000 పణాలు చెల్లించగల సన్యాసులకు ఈ నందన వన బాధ్యతను అప్పగించాడు. ఆ సన్యాసి తదనంతరం ఆ ఆస్తి మరల సింగయదన్నాయకునికి చేరుతుంది. అతని సమ్మతితో ఈ ఆస్తులను 400 పణాలను దేవాలయ శ్రీ భండారానికి చెల్లించగల మరొక సన్యాసి పరం చేయాల్సి ఉన్నది. ఇతనికే శీయర్ లేక జీయర్ అని పేరు. ఆస్తి పరం అయినందుకు బాధ్యతగా ఉత్సవ దినాలలో 4వరోజు, పారువేట దినమందు ఉత్సవవిగ్రహాల ఊరేగింపు జరుగునపుడు ఈ రెండు పుష్ప వనాలలో గల మండపాలలోను నైవేద్య సమర్పణ చేయాల్సి ఉంటుంది. ఈ మఠాదాయం నుండే స్వామివారికి కొన్ని ఆభరణాలు తయారుచేయించి అలంకరింపజేసినట్లు తెలుస్తున్నది (శాసనం సంఖ్య 672-టి.టి.). ఈ మఠ సన్యాసి, జీయరు ఆలయానికి సేవచేసినట్లు కనిపిస్తోంది. తిరుమల శ్రీ వేంకటే శ్వరస్వామి ఆలయంలోను, తిరుపతి గోవిందరాజస్వామి ఆల యంలోను ప్రస్తుతమున్న జీయరు, జీయంగారుల సంస్థ చేసు కుంటున్న సేవా భాగ్యం ఆనాటి సింగయదన్నాయకుడి యొక్క సితకరగండ మఠమే మూలంగా కనిపిస్తోంది.

## 14 వ అధ్యాయం

### 1. విజయనగరకాలమందలి తిరుమల ఆలయం :

తిరుమల దేవాలయం విజయనగర కాలంలో అత్యంత వైభవోన్నతంగా వర్ధిల్లడానికి ఆనాటి పాలకులే కారణం. కృష్ణదేవరాయలు మరియు అచ్యుతరాయలు అనేకమార్లు ఈ దేవాలయానికి వచ్చి అనేక ఆస్తులను, విలువైన ఆభరణాలను సమర్పించుకున్నారు. నిజానికి అచ్యుత దేవరాయలు తిరుమల దేవాలయంలోనే దైవసన్నిధిన విజయనగర చక్రవర్తిగా పట్టాభి షేకం చేసుకున్నాడు. విజయనగర సామ్రాజ్యస్థాపన జరిగింది మొదలుకుని బలాన్ని పుంజుకొంటూ, అభివృద్ధిపథాన సాగేం దుకు కృషిచేసిన పాలకులైన నాలుగు వంశాల చక్రవర్తుల కష్టసుఖాలతో ఈ తిరుమల దేవాలయ అభ్యున్నతి ముడిపడి ఉంది.

13వ శతాబ్దం ప్రారంభం వరకు తిరుమల దేవాలయా నికి చేసిన ఆధారద్రవ్యదానాల వివరాలను పరిశీలించినట్లైతే చాలవరకూ దక్షిణదేశమందలి దక్షిణప్రాంతవాసులచేతనూ, ఏ కొద్దిమందో పశ్చిమప్రాంతీయులచేతనూ, చేసిన కైంకర్య మైనం విశదం కాగలదు. దేవాలయ సేవా కార్యనిర్వహణార్థం అత్యంత విలువైన ఆధారద్రవ్యదానాలను గావించినట్టియూ, దక్షిణ భారతదేశమందలి పశ్చిమప్రాంతానికి చెందిన మొదటి వ్యక్తి సింగయ దన్నాయక అని తెలుస్తోంది. ఇతడు క్రీ.శ.14వ శతాబ్ద ప్రారంభ దశక ప్రాంతంలో ఉండిన వీరకంపన ఉడ యార్ యొక్క సైన్యాధిపతి. తిరుమలలోని శాసనాల వలన తెలిసినదేమిటంటే ఇతడు తన ధర్మకర్తృత్వంలో ఉన్న అరి శనాలయం, నందనవనం మరియు తదితర ఆస్తుల పాలనా బాధ్యతను తిరుమల దేవాలయానికి చెందిన ఒక జియ్యంగారికి అప్పజెప్పినట్లు తెలుస్తోంది. బహుశా ఆ కాలంలో దక్షిణ భారత దేశంలో ముస్లింల దండయాత్రలవలన యుద్ధకార్యాలలో నిమ గ్నమై ఉండడంవల్ల కాబోలు (తను తిరుమల నివాసి యగుట వీలుకాక) సింగయదన్నాయకుడు ఇటువంటి ఏర్పాటు చేసి ఉంటాడు.

సైన్యాధ్యక్షుడైన సింగయదన్నాయకుడు, ఈ ప్రాంతంలో అత్యంత సన్నిహితసంబంధం కలిగి ఉండడంచేత ఈ దేవాలయ

సేవాకైంకర్యార్థమై రెండుమతాలను స్థాపించి, నందనవనాలను నెలకొల్పియుండెను. కానీ, కార్యభారంచేత వీటిపై శ్రద్ధ వహించడానికి తగినంత సమయం లభించనందువలన విధింప బడిన షరతులతో కూడిన ఈ ఆధారద్రవ్య దానాలను సక్రమ నిర్వహణ బాధ్యతను ఒక జియ్యంగారికి అప్పగించాడు.

ఈ కాలంలోనే ప్రతిదినం శ్రీవారికి ఆహార నైవేద్యానికి ఒక తిరుబ్బోనకం సమర్పించేందుకుగాను మొదటి బుక్క రాయలు తగు ఏర్పాటు గావించాడు. అందుకు కావలసిన ఆధారద్రవ్యదానాన్ని గావించినట్లు తిరుమల శాసన సంచయంలో ఒక శాసనం తెలుపుతున్నది. ఇది బుక్కరాయ సంధిగా సుపరిచితమే! ఇంకనూ ఈ చక్రవర్తి ప్రతియేటా ఒక బ్రహ్మోత్సవం నిర్వహించుటకు తగిన ఏర్పాటు గావించినట్లు కూడా విశదమౌతోంది. మహామండలేశ్వర మంగిదేవ మహారాజు కూడ తనవంతు సేవాకైంకర్యంగా తిరుమలదేవుని ఆలయశిఖరం మీది (ఆనందనిలయ) విమానానికి బంగారుపూత పూయించి పేరెన్నికగన్న కార్యాన్ని గావించాడు. ఈ విషయాన్ని వివరించిన శాసనం సంఖ్య 273-టి.టి. ప్రకారం **క్రీ.శ.1359వ సంవత్సరానికి అంటే శా.శ.1281వ సంవత్సరానికి సరియగు వికారినామ సంవత్సరం ఆషాఢ బహుళ దశమి శనివారంనాడు మహా ఘనతవహించిన మంగిదేవ మహారాజు తిరుమల శ్రీనివాసుని విమానంమీద బంగారు శిఖరాన్ని స్థాపించాడని** తెలుపుతోంది. ఈ శాసనంలో, ఆనాడు పరిపాలిస్తున్న రాజుయొక్క పరిపాలనా కాలాన్ని తెలుపలేదనడం గమనార్హం. ఆనాటి దేశ రాజకీయ పరిపాలనావ్యవస్థ అత్యంత ఒడిదుడుకులతో, అనిశ్చితస్థితిలో ఉండిన వైనాన్ని సూచిస్తోంది.

ఆధారద్రవ్యదానాల ప్రసక్తి వచ్చిన సందర్భాల్లో గుర్తింపదగిన విషయం ఏమిటంటే- హరిహరరాయల తరపున వ్యవహర్తగా వచ్చిన ముల్లై తిరువెంకటజీయరు క్రీ.శ.1387వ సం॥న నూతనంగా **మాసి తిరునాళ్** (మాఘమాస ఉత్సవం) జరిపించేందుకు తగు ఏర్పాటు గావించడం. ఈ విషయం శాసనం సంఖ్య 103-టి.టి. వల్ల తెలుస్తోంది. తిరుమల దేవాలయంలోని వరదరాజస్వామి గుడిలో *(తిరుమల ఆలయంలోకి వెండివాకిలి దాటగానే ఎడమవైపున ఉన్నది- అనువాదకుడు)* లిఖించిన శాసనం ప్రకారం శ్రీభండారానికి ప్రభవనామ సంవత్సరాన పూంగోడు గ్రామంనుండి లభించిన ఆదాయం నుండి 100 పణాలను హరిహరరాయల పేరుమీద ఆధారద్రవ్య దానం గావించి, ఈ ఉత్సవ ఏర్పాటు గావించాడు. ఈ సందర్భంలో కూడ తిరునిన్ట ఉర్ ఉడయాన్ ప్రస్తావన వచ్చి ఉండడం గమనార్హం. గమనించాల్సిన మరో విషయం- భక్తులు షరతులతో చేసేటటువంటి ఆధారద్రవ్యదానాలను దేవాలయం తరపున గ్రహించడానికీ మరియు అందలి షరతుల ప్రకారం అమలుపరచగలిగిన, దేవాలయసంస్థచే నియమించబడిన అధికారి ఎవరనే విషయం తెలియడంలేదు.

**తేషా మసౌ విరజో బ్రహ్మలోకో న యేషు జిహ్మ
మనృతం న మాయా చేతి. - ప్రశ్నోపనిషత్తు :16
ఎవరియందు కుటిల భావము, అసత్యము, కపటము, మొదలైన దోషాలు లేవో అట్టివారికే పవిత్రమగు బ్రహ్మలోకము సిద్ధిస్తుంది.**

తిరుమలదేవాలయ శాసనాలను పరిశీలించిన, విజయనగర యుగం పూర్వంనుండీ, దేవాలయానికి సంబంధించిన వ్యవహారాలు నిర్వహిస్తూవస్తున్న దేవాలయ కార్యనిర్వాహక సంఘం క్రీ.శ.1390 సంవత్సరం ప్రాంతం నాటికి క్రమేపీ తన ప్రాబల్యాన్ని, పట్టును కోల్పోయి యుండినట్లు తెలుస్తోంది. ఎందుకంటే పైన తెలుపబడిన శాసనంవంటి తదుపరి శాసనాల్లో ఈ సంఘం ప్రసక్తి లేదు. మరియు స్పష్టంగా పై శాసనాలలో తెలిపిన ప్రకారం ఈ రెండు సాక్ష్యాధారాలు ఉన్నటువంటి శాసనం (ఈ ధ్రువపత్రం) నమోదు చేసింది ఒక తిరునిన్టఉర్ ఉడయాన్ లేక ఆలయ గణంకాధికారియే కాని స్థానత్తారు కాదు. దీనిని బట్టి ఒక విషయం అవగతమౌతోంది. విజయనగర సామ్రాజ్య స్థాపన జరిగి ఇంతకాలం గడిచినప్పటికి దేవాలయంగాని, దేవాలయ కార్యనిర్వాహకులుగాని, భక్తులుగాని చక్రవర్తియొక్క ఆధిపత్యాన్ని గుర్తించినట్లు గానీ లేదా దానిచే ప్రభావితమైనట్లు గానీ కానరాదు. క్రీ.శ. 1380 సంవత్సర ప్రాంతం వరకు రాజు యొక్క అధికారం, ఆధిపత్యం వీరిపై చెల్లుచుండినట్లు తెలీడం లేదు. శాసనాలలో విజయనగర చక్రవర్తులను గురించిన ప్రస్తావన వచ్చిన సందర్భంలో ఆ రాజుయొక్క ప్రశస్తి ప్రస్తుతించబడకపోవడం చేతకూడ పై విషయం రూఢి అవుతోంది.

## సప్తగిరి మీకు సక్రమంగా అందుతోందా?

★ అయిదు భాషల సప్తగిరి మాసపత్రికకు నేడు దాదాపు 80 వేల మంది చందాదారులున్నారు. తిరుమల శ్రీవారి మీద విశ్వాసంతో సప్తగిరికి చందాలు చెల్లించిన మీ అందరికీ కృతజ్ఞతలు.

★ చందాదారులందరికీ సప్తగిరి ప్రతి నెలా క్రమం తప్పక పంపుతున్నాం.

**ఏ నెల అయినా సప్తగిరి అందకపోతే దయతో ఈ క్రింది విషయాలు పరిశీలించండి :**

**1)** చందాకాలం పూర్తి అయిందేమో పరిశీలించండి?

**2)** ముందు మీ ప్రాంతపు పోస్ట్‌మ్యాన్‌ను విచారించండి?

**3)** సప్తగిరి అందలేదన్న ఫిర్యాదు పోస్టుకార్డు మీద రాసి మాకు పంపండి?

**4)** మీరు మీ సరైన చిరునామాను, పిన్‌కోడ్, ఫోన్ నెంబరుతో సహా వివరంగా/ అర్థమయ్యేలా వ్రాయండి.

**5)** చిరునామా మారితే వెంటనే తెలియచేయండి?

**6) నూతన చందాదారులకు వారు చందా చెల్లించిన మరుసటి నెల నుంచి పత్రిక అందుతుంది.**

**7)** చందాను పునరుద్ధరించుకునేవారు తప్పనిసరిగా చందానెంబరు తెలియపరచాలి.

**8)** ఇతర వివరాలకు ఈ క్రింది ఫోన్ నెంబర్లలో సంప్రదించండి.

అ) 0877-2264359, ఆ) 0877-2264363

(లేదా)

**9)** ఈ క్రింది చిరునామాకు కార్డు రాయండి

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ప్రెస్ కాంపౌండు,**
**తిరుపతి-517 083.**

ముల్లై తిరువెంకటజీయరు ప్రకటించిన శాసనం సంఖ్య 57-టి.టి. ప్రకారం శా.శ.1312సం॥ అంటే క్రీ.శ.1390వ సం॥ ప్రాంతం నాటికే తిరుమల దేవాలయంలో ఆలయ ప్రసాదాన్ని తిరుపతి వైష్ణవులు, తిరుచానూరు సభైయారు, నంబిమార్ (ఆలయ పూజారి), కోయిల్ కేళ్కుం జీయర్లు, ఇద్దరు దేవాలయ గణాంకాధికారులు పంచుకునేవారు. ప్రసాదాన్ని 12 భాగాలుచేసి ఒక స్థిర నిష్పత్తిలో పంచుకోవడం జరిగేది. దీనిని బట్టి దేవాలయ కార్యనిర్వాహక సభ్యులు మొత్తం పది మంది స్థానత్తారులు, ఇద్దరు ఆలయ గణాంకాధికారులు ఉండేవారు. పైన పేర్కొన్న శ్రీవైష్ణవులు అనబడువారు మొట్టమొదట రామానుజునిచే దేవాలయంలో ప్రవేశపెట్టబడిన ఏకాకి శ్రీవైష్ణవులు. రామానుజుని కాలంలో వీరి సంఖ్య ఒకరికి మించలేదు. కానీ కాలక్రమంగా మూడు శతాబ్దాలు గడిచేసరికి వీరి సంఖ్య నాలుగుకు పెరిగి క్రీ.శ.1398 సంవత్సరం నాటికి 10కి పెరిగింది. వీరు మొదట మతసంబంధ కార్యకలాపాలు అంటే ఆలయంలో పూజ, అర్చన, అభిషేకం మొదలైన కార్యకలాపాలు జరిపించేవారు. అంతేకాకుండా దేవాలయ ఆస్తులను చూసుకునేవారు. రామానుజ కాలం నుండీ తిరుమల దేవాలయ కార్యక్రమాలలో పాలుపంచుకుంటూవచ్చిన ఈ శ్రీవైష్ణవుల పరంపర ఎడతెగకుండా వస్తూ, దేవాలయమందలి ఈనాటి అర్చకులకు పూర్వీకులుగా గుర్తింపు పొందారు. 1000 సం॥లుగా వీరు వెంకటేశ్వరస్వామి సేవా కైంకర్యాలలో త్రికరణశుద్ధిగా నిమగ్నులై తరిస్తున్నారు. *(ఇంకా ఉంది)*

# శ్రీ ముఖలింగేశ్వరాలయాలు

మన దేవాలయాలు

- జి. శ్రీమతి

శ్రీ ముఖలింగం అతి పవిత్రమైన స్థలం. ఈ ప్రదేశం ఆంధ్రప్రదేశ్‌లో వంశధార నది ఒడ్డున, శ్రీకాకుళం జిల్లాలో ఉంది. శ్రీకాకుళం నుంచి 40 కి.మీ. దూరంలో ఉన్న ఈ ప్రదేశానికి ప్రతిరోజు అనేక బస్సులు శ్రీకాకుళం నుంచి ప్రయాణిస్తున్నాయి. ఇక్కడ శివలింగం ముఖాకృతిని కలిగి ఉండడం విశేషాంశం.

ఈ ప్రదేశం పురాణ ప్రసిద్ధికెక్కిన ప్రాచీన స్థలం. ఇక్కడ శివునికై లింగాకారంలో మూడు గర్భగుళ్ళు వెలసి ఉన్నాయి. అవి - 1) మధుకేశ్వర లేక ముఖలింగేశ్వర 2) అనియంక భీమేశ్వర 3) సోమేశ్వర.

ముఖలింగానికి చెందిన మూడు దేవాలయాలైన సోమేశ్వర, భీమేశ్వర, మధుకేశ్వర లేక ముఖలింగేశ్వరాలయాల్లో సోమేశ్వరాలయం ప్రాచీనమైంది. బహుశా ఈ దేవాలయం తూర్పుగంగ రాజైన హస్తివర్మ కాలంలో అతడు తన రాజధానిని దంతిపురం నుండి కళింగపురానికి మార్చిన సందర్భంలో అనగా క్రీ.శ. 6 లేక 7వ శతాబ్దాల్లో కట్టిఉండొచ్చని అంచనా.

మరికొందరు, మధుకేశ్వరాలయం మరియు భీమేశ్వ రాలయాల నిర్మాణం క్రీ.శ. 10 లేక 11 శతాబ్దాల్లో జరిగి ఉండవచ్చని అభిప్రాయపడుతున్నారు. అనంతవర్మ మనవడైన వజ్రహస్త-2 ఒరిస్సాను జయించిన తర్వాత నిర్మించాడని తెలుస్తోంది. సోమేశ్వర దేవాలయం చంద్రప్రతిష్ఠ అంటారు. అనగా ఈ లింగం చంద్రుని చేత ప్రతిష్ఠ చేయబడింది. ప్రధాన దైవమైన సోమేశ్వరుడు లింగాకారంలో ఉండి మహిషాసుర మర్ధిని(దేవి), గణపతి, కుమారస్వామి, కాలభైరవ మరియు ఇతర దేవుళ్లతో కూడి ఉంటాడు.

రాజుగారి బంధువైన కొమార్నవ ఊరి పొలిమేరల్లో అనగా వగర అని పిలువబడే చోట శివునికి లింగాకారంలో ఒక ఆలయాన్ని నిర్మించాడు, అటు పిమ్మట కొమర్నవ రాజయ్యాడు. ఇది క్రీ.శ.1038కి చెందిందిగా తెలుస్తోంది. మొత్తానికి ఈ దేవాలయం కొమార్నవ చేత క్రీ.శ.941-976 మధ్యలో కట్టించబడింది. అదే విధంగా అతని తర్వాత రాజ్యానికి వచ్చిన వజ్రహస్త-2 లేక అనియంక భీమచేత క్రీ.శ.980-1015 మధ్యలో 'అనియంక భీమేశ్వరాలయం', ఆ తర్వాత మధుకేశ్వ రాలయం తదనంతరం నిర్మించబడ్డాయి. ఈ దేవాలయం కూడా గొప్పచరిత్రను కలిగి ఉంది. అచ్చట ఉన్న రెండు నందీశ్వరులు చోళరాజుల గొప్పతనానికి నిదర్శనంగా నిలిచి ఉన్నాయి.

ఈ దేవాలయం వాస్తు నిర్మాణాన్ని పరిశీలిస్తే ఈ దేవాలయం ద్రావిడ, ఇండో, ఆర్యన్ పద్ధతుల్లో నిర్మించబడినట్లు తెలుస్తోంది. విమానం, అర్ధమండపం, గర్భగృహం మరియు ఇతర గదులు ఈ రెండు రకాల పద్ధతుల్లో ఉన్నాయి. ఈ దేవాలయాన్ని భువనేశ్వరాలయం, కోణార్కులోని సూర్యదేవాలయం, శ్రీహరి జగన్నాథాలయం ఆధారంగా పరిశీలించవచ్చు. ఈ దేవాలయం ఉనికిని క్రీ.శ.6వ శతాబ్దంలో దుర్గకై నిర్మించిన అయిహోలు దేవాలయం ఆధారంగా (చాళుక్యుల కాలానికి చెందింది) పరిశీలించవచ్చు. మధుకేశ్వరాలయానికి చెందిన ప్రత్యేక అంశమేమనగా గర్భాలయం కాకుండా, సూర్యదేవుడు (ఆదిత్య), దేవి (అంబిక), విష్ణు (వాసుదేవ) గణనాథ (గణపతి)లకు చిన్న చిన్న గర్భగుళ్ళు ఒక్కొక్క మూలలో వెలసి ఉన్నాయి. ఆ రకంగా ఈ దేవాలయం 'పంచాయతన' దేవాలయాల వర్గానికి చెందింది. హిందూ దేవాలయాల్లో ఈ రకం చాలా అరుదు.

శాసనాధారంగా చూస్తే ఈ ఆలయం ప్రసిద్ధికెక్కిన గొప్ప దేవాలయమని తెలుస్తోంది. ఈ దేవాలయానికి సంబంధించిన శాసనాలు దాదాపు నూరు వరకూ ఉన్నాయి. మధ్యయుగంలోని కళింగ ప్రజలు మరియు రాజులయొక్క జీవితాన్ని,

## ఆత్మనివేదనమ్

అరవిందాసన శంకర ప్రభృతి
దేవానీక మేదేవు శ్రీ
చరణాంభోజయుగమ్ము భక్తి భరిత
స్వాంతమ్ములం గొల్చి హ
ర్షరసాంభోనిధి దొప్పదోఁగెదరొ
ఆ సప్తాచలస్వామి స
త్కరుణా దృక్ప్రసరమ్ము మామక
మనస్తాపమ్ము పోకార్చుతన్.

కొండకు జేరి కాలినడ
కొండిక కొండయ కండదండగా
నుండుమటంచు కన్నతలి
యొప్పగ నిన్నెటు వేడుకొన్నదో
కొండలరాయ! నీ గుడులు
గోపురముల్ దరిసించు భాగ్యమున్
మెండుగ నా కొసంగితివి
మెచ్చగ నీ కృప నాకు శక్యమే?

కనుమూసిన కనుదెఱచిన
ననయము నీ రూపు మెదలునట్లుగ మదిలో
కనికరము నెఱపి కావుము
నను నీ భృత్యానుభృత్యు నళినదళాక్షా!

అన్నియు నీ కిచ్చితి నే
నన్నాడవు; నాకు నిడని యట్టిది మోక్షం
బున్నది గద! పెరవేల్పుల
కెన్నండిడ తరముగాని దేమందు వయా!

అలవియెఱుగక బాలకుం డడిగినట్టు
లడుగ సాయుజ్యపదవి నా కిడుమటంచు;
చీమగా దోమగా జన్మ చేకురినను
స్మృతి పథంబున నిలువు మీ శ్రీనివాస!

- ముదివర్తి కొండమాచార్యులు

అలవాట్లను ఇవి స్పష్టంగా తెలియచేస్తున్నాయి. అంతే గాకుండా వాస్తు నిర్మాణాన్ని బట్టి చూస్తే ఇది చాళుక్యుల కాలంనాటి వాస్తు నిర్మాణాన్ని అనుసరించిన ఇండో ఆర్యన్ వాస్తు నిర్మాణ కోవకు చెందిందిగా తెలుస్తోంది. మధుకేశ్వరాలయం ఆరంభం నుంచీ చాలా అరుదైన పంచాయతన ఆలయం. ఇది ఒరిస్సా ఆలయాలను పోలినటువంటి ఆలయం.

ఒకప్పుడు ఈ దేవాలయం గొప్ప చరిత్రను కలిగి ఉండేది. ప్రస్తుతం ఇది ఒక చిన్న గ్రామం మాత్రమే. కానీ, ఇప్పటికి ఈ దేవాలయం, విశేషమైన పండుగలైన శివరాత్రి, కార్తీకమాసం మరియు శివునికి సంబంధించిన ముఖ్యమైన దినాల్లో యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తోంది. 1947లో ఎస్టేటులను రద్దు చేసిన అనంతరం ఈ దేవాలయం ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఎండోమెంట్ విభాగం చేత నిర్వహించబడు తోంది. ఈ శివాలయాల్లో ప్రసాదం బదులు విబూది, అభిషేక జలం తీర్థంగా ఇవ్వడం ఒక ప్రత్యేకత.

పురాణాల ఆధారంగా పరిశీలిస్తే శ్రీ ముఖలింగేశ్వ రాలయం అని కలియుగంలో పిలువబడే ఈ దేవాలయం కృతయుగంలో 'గోకర్ణేశ్వర' అని, త్రేతాయుగంలో 'మధుకేశ్వర' అని, ద్వాపరయుగంలో 'జయంతీశ్వర' అని పిలువబడేదని స్పష్టమౌతోంది.

స్కాందపురాణం 9వ అధ్యాయంలో కుమారస్వామి (సుబ్రహ్మణ్యస్వామి) ఈ ఆలయం యొక్క పవిత్రతను, గొప్ప తనాన్ని గూర్చి అగస్త్యమహర్షికి వివరించాడు. పురాణాలు, వేదాంతం, ఉపనిషత్తుల్లోని రహస్యాలను అతిసాధారణమైన భాషల్లో ప్రజలకు అర్థమయ్యే రీతిలో వివరిస్తున్నాయి. 18 పురాణాల్లో స్కాందపురాణం ఒకటి. ఈ పురాణం శివుని కుమారుడైన స్కందుని (సుబ్రహ్మణ్యస్వామి) గురించి వివరి స్తోంది.

ఈ పురాణం వివరించిన దాన్ని బట్టి చూస్తే శివుడు కృతయుగంలో గోకర్ణేశ్వర పేరుతో బంగారంతో చేయబడిన లింగాకారంలో ఉండేవాడు. త్రేతాయుగంలో వెండితో చేయ బడిన లింగం (మధుకేశ్వర), ద్వాపరయుగంలో కంచుతో

చేయబడిన లింగం (జయంతీశ్వర), కలియుగంలో రాతితో చేయబడిన లింగాకృతిలో (ముఖలింగేశ్వర) ఉన్నాడు. ముఖ లింగేశ్వర ఆలయానికి ఆనుకుని ఉన్న వంశధారనదిలో స్నానం చేసి, ఆ స్వామిని దర్శించుకుంటే జనులకు ముక్తి లభిస్తుందని పురాణాలు చెబుతున్నాయి.

**క్షేత్రమహిమ :**

ద్వాపరయుగంలో వాసుదేవ మహర్షి ఒక గొప్ప యజ్ఞాన్ని వంశధార నది ఒడ్డున జరుపుతున్న సమయమిది. అతడు దేవతలను, యక్షులను, కిన్నెరలను, గంధర్వులను, కింపురుషులను యజ్ఞానికి ఆహ్వానించాడు. వంశధారనదికి తూర్పువైపుగా ఒకప్పుడు దట్టమైన పెద్ద అరణ్యముండేది. ఆ అరణ్యప్రాంతం అడవిజాతివారికి, ఇప్పచెట్లకు (మధు వృక్షాలు) స్థావరంగా ఉండేది. వామదేవ మహర్షి నిర్వహించే యజ్ఞానికి గంధర్వులు హాజరయ్యారు. వారు కిరాతకస్త్రీల (అడవిజాతి) అందానికి ముగ్ధులై వారితో ప్రేమలో పడ్డారు. వామదేవమహర్షి యజ్ఞం పూర్తయిన తర్వాత కానుకలిచ్చే సమయంలో అక్కడ గంధర్వులు లేకపోవడాన్ని చూచి గంధర్వుల కార్యాన్ని పసి గట్టాడు. వెంటనే అతడు గంధర్వులను కిరాతకులవమని శపించాడు. వామదేవముని ఇచ్చిన శాపాన్ని నారదమహర్షి గంధర్వులకు తెలియజేశాడు. వారు బాధాతప్తులై ఆ ముని శ్రేష్ఠుని పాదాలమీద పడి శాపవిముక్తుల్ని గావించమని ప్రార్థిం చాడు. అతడు వారి ప్రార్థనను తొలుత అంగీకరించలేదు. అటు పిమ్మట వారిని కరుణించి ఈ విధంగా ఆనతిచ్చాడు. ద్వాపర యుగాంతంలో మధుకేశ్వర పేరుతో అవతరించిన తనను దర్శిం చిన శాపవిముక్తి అగునని సెలవిచ్చాడు. ఆ ఆలయమే ప్రస్తుతం పిలువబడే ముఖలింగేశ్వరాలయం.

ఈ క్షేత్రానికి పరిసరాల్లో అనేక తీర్థాలు నెలకొని ఉన్నాయి. అరసవల్లి, శ్రీకూర్మం, మహేంద్రగిరి మొదలైనవి. పద్దెనిమిది పురాణాల్లో ఒకటైన పద్మపురాణం, శ్రీ కూర్మంలోని కుమారస్వామి, క్షేత్రపాలకుల్లో ఒకడైన శ్రీ మధుకేశ్వరులు పంచలింగాల కోవకు చెందినవారని వివరిస్తోంది. అక్కడొక ముని 'సాలగ్రామం' అనే పేరుతో నివసించేవాడు. అతని భార్య పగటివేళలో అతనిని ఎంతగానో గౌరవించేది. కానీ రాత్రి

## ప్రార్థనాంజలి

జయలక్ష్మి ధనలక్ష్మి ఓ ధాన్యలక్ష్మి<br>
వరలక్ష్మి గజలక్ష్మి సంతానలక్ష్మి<br>
మాపూజ లందుకొని దీవించవమ్మా<br>
ముత్తైదువ తనమ్ము కరుణించవమ్మా

పాలకడలి ముద్దు గారాల పట్టి<br>
వైకుంఠవాసుని ఎదలోన మెట్టి<br>
ఏకంగ నీ విభుని ఎడబాసినావే<br>
లోకకల్యాణమై ఇలచేరినావే<br>
అలమేలుమంగవై అవతరించావే<br>
శ్రీహరిని తిరుమలకు రప్పించినావే

జనక మహారాజు తనయగా పుట్టి<br>
శ్రీరామచంద్రుణ్ణి పతిగ చేపట్టి<br>
పతి అడుగుజాడల్లో పయనించినావే<br>
పరమపావనిచౌచు పరిమళించావే

– దాసరి చంద్రయ్య

సమయంలో ఆమెకున్న శాపం వల్ల రాక్షసియై అతడిని బాధిం చేది. అతడు ఆమె దుశ్చర్యల వల్ల విసిగి వాపోయాడు. అతడు శివుని ప్రార్థించగా, మధువనంలో అతనికి అభిషేకం గావిస్తే ప్రత్యక్షమౌతానని చెప్పాడు. అదే రకంగా ఆ ముని మధుకేశ్వర స్వామికి అభిషేకం గావించగా, శివుడు ప్రత్యక్షమై ఆ ముని భార్యకు శాపవిముక్తి గావించాడు. శివపురాణం, ముఖలింగే శ్వరాన్ని గురించి ఈ రకంగా చెపుతోంది. "దేశంలోని దివ్య లింగాల్లో ముఖలింగేశ్వరం ఒక పవిత్రలింగం".

శైవమతం జీర్ణావస్థలో ఉన్నప్పుడు గంగరాజులు శైవ మతాన్ని పునరుద్ధరించి హిందూధర్మాన్ని రక్షించి, ఈ ఆల యాన్ని శివుని పేరుతో పునరుద్ధరించి, కాశీవిశ్వనాథాలయానికి ఉన్న పేరు ప్రఖ్యాతులను, పవిత్రతను ఈ ఆలయానికి కూడ చేకూర్చారు. అంతేగాక ఇది దక్షిణకాశి అని కూడ ప్రసిద్ధి చెందింది. ఈ మూడు ఆ ముఖలింగాలయాలు త్రిభుజా కారంలో, ఒక్కొక్క ఆలయానికి మధ్య 400 మీటర్ల దూరంలో నెలకొని ఉంది. శ్రీ ముఖలింగేశ్వరస్వామిని ప్రార్థించిన మనకు ముక్తి లభిస్తుందని ప్రజల విశ్వాసం.

బాలప్రబోధం



# గుణనిధి

– మల్లాది నరసింహమూర్తి

పూర్వం కాంపిల్య పురమనే పట్టణంలో యజ్ఞదత్తుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు యజ్ఞాలు చేసి సోమయాజి అయ్యాడు. అతని భార్య గొప్ప ఇల్లాలు. వారికి లేకలేక ఒక కొడుకు పుట్టాడు. అతడే గుణనిధి. ఒక్కడే కొడుకు కావడంతో వాడిని చాలా ముద్దుగా పెంచేవారు. అతడికి యుక్తవయస్సు రాగా ఉపనయనం చేశారు. తల్లి అతి గారాబం వల్ల గుణనిధి ఆకతాయితనంతో చెడుసావాసాలు పట్టాడు. వ్యసనపరుడయ్యాడు. యజ్ఞదత్తుడికి గృహకార్యాల్లో తీరిక లేకపోవటంచేత కుమారుని మంచిచెడ్డలు చూసుకునే వీలులేకపోయింది. గుణనిధి తల్లి వాని చెడుతిరుగుళ్ళన్నీ కప్పిపుచ్చి భర్తతో తమ కొడుకు గుణవంతుడని అబద్ధం చెబుతుండేది. తల్లి ఎంత బోధించినా, గుణనిధి మారలేదు. కొడుకుపై ప్రేమతో, చివరకు భర్త ఇచ్చిన నవరత్నాల ఉంగరాన్ని, తన మెడలోని హారాన్ని సైతం ఇచ్చేసింది.

ఓ రోజు విపణివీథిలో యజ్ఞదత్తుడికి ఒక జూదరి కన్పించి నమస్కారం చేశాడు. అలా నమస్కారం చేసేటప్పుడు అతడి చేతివేలి ఉంగరం తనదిగా యజ్ఞదత్తుడు గుర్తించాడు. ఆ ఉంగరాన్ని గుణనిధి జూదంలో పణంగా పెట్టి ఓడిపోయాడని తెలుసుకుని యజ్ఞదత్తుడు కృంగిపోయాడు. నేరుగా ఇంటికి వచ్చి, భార్యను ప్రశ్నించగా ఆమె ఉంగరాన్ని దాచిపెట్టానని చెప్పింది. యజ్ఞదత్తుడు అది విని భార్యను, కొడుకును నిందించాడు. కొడుకు అలా చెడిపోవడానికి తన భార్యే కారణమని ఆమెకు తిలోదకాలు వదలి, మరొక బ్రాహ్మణస్త్రీని వివాహమాడాడు.

గుణనిధి తండ్రి కోపం తెలుసుకుని, తన బుద్ధిహీనతను నిందించుకుని ఇంటికి పోలేక, తిండిలేక పస్తులతో నీరసించి ఒక దేవాలయానికి చేరుకున్నాడు. అదృష్టవశాత్తు ఆ రోజు శివరాత్రి. భక్తులు దేవునికి నైవేద్యాలు సమర్పించి జాగరణ చేసి, బడలికతో అక్కడ నిద్రించారు. ఆకలితో నకనకలాడుతున్న గుణనిధి నైవేద్యం ఉంచిన చోటికి పోయి తన వస్త్రంతో దీపం వెలిగించి, ఆ దీపకాంతిలో ఆహారాన్ని అపహరించబోతుండగా, భక్తులు మేల్కొని గుణనిధిని దొంగగా భ్రమించారు. తలారులు వాని వెంటపడి బాణాలతో కొట్టి చంపారు. గుణనిధిని శివ కింకరులు దివ్యవిమానంలో కైలాసానికి తీసుకువచ్చారు.

గుణనిధి ఎన్నిపాపాలు చేసినా శివరాత్రిరోజు జాగరణ చేసి, దీపం వెలిగించి, మహాప్రసాదాన్ని స్వీకరించడం వల్లే, శివ సాక్షాత్కారం పొందాడు. ఈశ్వరుడు అతనిని కనికరించి "కళింగ దేశాధిపతియైన అలిందమునకు దముడనే పేరుతో పుత్రుడుగా జన్మించ" మని అనుగ్రహించాడు.

గుణనిధి అలాగే జన్మించి అలిందముడి అనంతరం కళింగ రాజ్యానికి రాజయ్యాడు. అతడు దేశంలో ఉండే శివాలయాలన్నింటిలో నిత్యం దీపాలు వెలుగుతూనే ఉండాలని చాటించాడు. అలా దీపాలు వెలిగించని వారి తలలు తీయించమని భటులను ఆజ్ఞాపించాడు.

దీపదాన మహిమ వల్ల దముడు ఆ తర్వాతి జన్మలో ధనేశ్వరుడై జన్మించాడు. అతడు కాశీనగరానికి పోయి, అవిముక్త

**రిజిస్ట్రేషను ఫీజు మినహాయింపు**

**తిరుమల శ్రీవారికి భక్తులు మన రాష్ట్రంలో విరాళంగా సమర్పించే ఆస్తికి గాని / స్థలాలకు గాని రిజిస్ట్రేషన్ ఫీజు మినహాయిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. దాతలు ఈ విషయాన్ని గమనించి మినహాయింపు పొందవలసిందిగా విజ్ఞప్తి.**



# పెద్దల మాట

- డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

ద్వారం ద్వార మటన్ భిక్షుః శిక్షత్యేవం నయాచతే ।
అదత్వా మాదృశో మా భూః, దత్వా త్వం త్వాదృశో భవ ॥ (కువలయానందం)

భావం : **యాచకుడు భిక్షం కోసం ఇంటింటికీ వెళ్లి యాచిస్తున్నాడనడంకంటే- గృహస్థుల్ని హెచ్చరిస్తున్నాడనటం బాగుంటుంది. "దానధర్మాలు చేయక నా వంటి వాళ్లు కావద్దు. దానధర్మాలు చేసి మీలాంటి వాళ్లే కండి" - అని సోదాహరణంగా గృహస్థులకు బోధిస్తున్నాడు.**

వివరణ : సకలశాస్త్ర పురాణ ఇతిహాసాల సారం – పరులకు ఉపకారం చేస్తే పుణ్యం. అపకారం చేస్తే పాపం. జీవుడు గడచిన జన్మలలో దాన ధర్మాలు చేయనందున – ఈ జన్మలో యాచకుడై జన్మించాడు. 'అమ్మా! భిక్షం' – అంటూ ఇంటింటికీ తిరిగి యాచిస్తున్నాడు. అతనికి భిక్షం పెట్టడం వల్ల – గృహస్థులకు పుణ్యం లభిస్తుంది. ఇంతవరకే కాదు – ఆ యాచకుడు భిక్షం కోరుతూ–గృహస్థులకు ఒక దివ్య ప్రబోధం కూడా చేస్తున్నాడు. "గత జన్మలలో దానధర్మాలు చేసి ఈ జన్మలోనూ మీరు దాతలయ్యారు. నేను అలా చేయక ఇలా యాచకుణ్ణి అయ్యాను. కనుక మీరు ఎప్పటికీ నాలాంటవారికి దానం చేస్తూ– దాతలుగానే ఉండండి. దానం చేయక నావంటివారు కావద్దు"– అని అతని పరిస్థితిని బట్టి గృహస్థుడు గ్రహించాలి. యాచింపబడి ఇస్తే దానం అనీ, అయాచితంగా ఇస్తే ధర్మం అనీ పెద్దల మాట! ఏదైనా ఇవ్వడం అనేది సమానం కనుక పుణ్యప్రదమే! మనం కోరకుండానే భగవంతుడు ప్రకృతి స్వరూపంతో – మనకు ఎన్నో విధాల, ఎన్నో వస్తువులిచ్చి, రక్షిస్తున్నాడు కదా! ఉన్నవాడు లేనివాడికి ఇవ్వడం ప్రకృతి ధర్మం! ఈ ధర్మాన్ని విస్మరించిననాడు మానవుల్లో స్వార్థం, లోభిత్వం చోటు చేసుకుంటాయి. మానవులు దానవులై సమాజానికి కంటకులౌతారు. చేతికి భూషణం దానం!

ప్రదేశంలో విశ్వేశ్వరుని ప్రతిష్ఠించాడు. అరిషడ్వర్గాలకు అతీతంగా ధనేశ్వరుడు భావకుసుమాలతో దముడు విశ్వేశ్వరుని ఆరాధించాడు. కొంతకాలానికి పరమేశ్వరుడు ప్రత్యక్షమై ధనేశ్వరుని వరం కోరుకోమన్నాడు. కానీ, ధనేశ్వరుడు శివుడి ప్రకాశానికి తట్టుకోలేక కనులు చెదరి అంధుడయ్యాడు. పరమేశ్వరుడు ధనేశ్వరునకు దివ్యదృష్టిని అనుగ్రహించాడు.

కానీ, ధనేశ్వరుడు ఓ రోజు పరమేశ్వరుని చెంత పార్వతిని చూచి స్వగతంలో 'శివుడి కృపకు పాత్రురాలైన ఈమె ఎంత తపస్సు చేసిందో? ఈమె భాగ్యం వర్ణించవీలులేనిది' అని బాధపడ్డాడు. అసూయతో సవతిని చూచిన విధంగా పార్వతిని చూచాడు. పార్వతీదేవి ఇది గమనించి, ధనేశ్వరుడికి అంత చనువు ఇవ్వడానికి గల కారణాన్ని చెప్పుమని కోరింది.

అప్పుడు శివుడు ధనేశ్వరుడి విషయమంతా చెప్పి అతనికి తనతో పాటు ఆమెను కూడా వరాలివ్వమని కోరాడు. శివుడు ధనేశ్వరునికి త్రిలోకాధిపత్యం, తనతో చెలిమిని ప్రసాదించాడు. పార్వతి కూడా అతనిని చూచి పరమేశ్వరుడిచ్చిన వరాలన్నీ ఫలించుగాక అని వరమిచ్చింది. అయితే, నీవు ఈశ్వరుడి చెంత నన్ను చూచి అసూయ చెందావు కాబట్టి వికృతమైన కనుగుడ్లు కలవాడవై, కుబేరుడనే పేరుతో పిలువబడుతావని చెప్పింది. ధనేశ్వరుడు శివుని అలకాపురాన్ని రాజధానిగా చేసికొని చక్కగా పరిపాలించసాగాడు.

## శాసన వివరణ - 15

# శ్రీకృష్ణదేవరాయల తిరుమల శాసనం

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి మండలం, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరపు గోడపై ఉన్న శాసనం)

**వంశం** : విజయనగర (తుళువ) **రాజు** : శ్రీకృష్ణదేవరాయలు

**కాలం** : శక సంవత్సరం 1434, ఆంగీరస సంవత్సరం, 1513 ఎ.డి.

**భాష** : కన్నడం

**విషయం** : శ్రీకృష్ణదేవరాయల పట్టపురాణిగారైన తిరుమలదేవి తిరువెంగళనాథుని దర్శించుకుని, స్వామినైవేద్యాలను పెట్టుటకు బంగారు గిన్నెను కానుకగా సమర్పించెను. ఈ బంగారుగిన్నె బరువును శాసనం పేర్కొంటున్నది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-III, సంఖ్య-52.

## శాసన వివరణ -16

# శ్రీకృష్ణదేవరాయల తిరుమల శాసనం

**ప్రదేశం** : తిరుమల, చంద్రగిరి మండలం, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
(తిరుమల దేవాలయ మొదటి ప్రాకారంలోని ఉత్తరపు గోడపై ఉన్న శాసనం)

**వంశం** : విజయనగర (తుళువ) **రాజు** : శ్రీకృష్ణదేవరాయలు

**కాలం** : శక సంవత్సరం 1434, ఆంగీరస సంవత్సరం, 1513 ఎ.డి.

**భాష** : కన్నడం

**విషయం** : శ్రీకృష్ణదేవరాయల పట్టపురాణిగారైన చిన్నాజి అమ్మవారు తిరువెంగళనాథుని దర్శించుకుని, స్వామి నైవేద్యాలను పెట్టుటకై బంగారు గిన్నెను కానుకగా సమర్పించెను. బంగారు గిన్నె బరువును ఈ శాసనం తెలుపుతోంది.

**ఆధారం** : తి.తి.దే. శాసనాలు సంపుటం-III, సంఖ్య-45

## వార్తాలహరి

### వసంతోత్సవ మండపం ప్రారంభం

తిరుమల పడమర మాడవీథిలో రూ.5.16 కోట్లతో తిరుమల తిరుపతి దేవస్థానం పునర్నిర్మించిన వసంతోత్సవ మండపాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥ కె.రోశయ్య 02-06-2010న ప్రారంభించారు. 500 ఏళ్లనాటి పురాతన ఆస్థాన వేదికను అలాగే ఉంచడంతో పాటు పూర్తిగా రాతితో శిల్పకళలు ఉట్టిపడేలా తిరుచ్చికి చెందిన శిల్పి నటరాజన్ ఆధ్వర్యంలో ఈ మండపాన్ని నిర్మించారు. 10,300 చదరపు అడుగుల విస్తీర్ణ మున్న ఈ మండపంలో 1200 మంది గృహస్తులు కూర్చుని స్వామివారి వసంతోత్సవాలను వీక్షించవచ్చు. ఈ నిర్మాణంలో ఏకశిలా స్తంభాలను వాడారు. నాలుగు మూలల చిన్న గోపురాలతో పాటు సన్నిధిని సూచించే విమాన గోపురాన్ని నిర్మించారు. ఈ ప్రారంభోత్సవంలో శ్రీ పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి, శ్రీ రఘువీరారెడ్డి, శ్రీమతి గల్లాఅరుణకుమారి తదితర మంత్రులు, తి.తి. దేవస్థానం అధ్యక్షులు శ్రీ డి.కె.ఆదికేశవులు ఇతర అధికారులు పాల్గొన్నారు.

### ఘనంగా అన్నమయ్య 602వ జయంతి మహోత్సవాలు

తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమయ్య 602 జయంతిని పురస్కరించుకుని 27-05-2010 నుండి 29-05-2010 వరకు అన్నమయ్య జన్మస్థలమైన తాళ్లపాక, తిరుపతిలలో కొన్ని ప్రత్యేక కార్యక్రమాల్ని నిర్వహించడం జరిగింది. తాళ్లపాక ధ్యానమందిరంలో నాదస్వరసమేళనం, శ్రీనివాస కల్యాణోత్సవం తదితర కార్యక్రమాలు జరిగాయి. తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో పలు సాహితీగోష్ఠులు నిర్వహించబడ్డాయి. ఈ సందర్భంగా దేశం నలుమూలల నుండి వచ్చిన కళాకారులచే మహతి కళాక్షేత్రంలో ప్రదర్శించబడిన సంగీత కార్యక్రమాలు భక్తులను అలరించాయి.

### పదవీవిరమణ



సప్తగిరి ప్రధాన సంపాదక కార్యాలయంలో గిడ్డంగి విభాగంలో సహాయకుడుగా పనిచేస్తున్న శ్రీ పి.లోకనాథం 31-05-2010న పదవీవిరమణ చేశారు. ఈయన 1971లో తిరుమల తిరుపతి దేవస్థానం సహకారగోదాములో అమ్మకపుదారునిగా చేరి, అక్కడ 22 సంవత్సరాలు పనిచేశారు. ఆ తర్వాత 1993లో తి.తి.దే.కల్యాణమండపాలు, తిరుపతి రిసెప్షన్ కార్యాలయం, తిరుమల రిసెప్షన్ కార్యాలయాలలో పని చేశారు. ఆ తర్వాత వీరు తి.తి.దే. ప్రధాన సంపాదక కార్యాలయంలో సప్తగిరి గిడ్డంగిలో ఏడు సంవత్సరాలపాటు ఉద్యోగించారు. సుదీర్ఘ ఉద్యోగ అనుభవం కలిగిన వీరి విశ్రాంత జీవితం ప్రశాంతంగా గడిచిపోవాలని **'సప్తగిరి'** ఆ దేవదేవుని ప్రార్థిస్తోంది. **- ప్రధాన సంపాదకుడు.**

### డా॥ రావుల సూర్యనారాయణమూర్తి ఇకలేరు



తి.తి.దేవస్థానం మాజీ పౌరసంబంధాధికారి డా॥రావుల సూర్యనారాయణమూర్తి 19-06-2010న మరణించారు. కవిగా, రచయితగా అనువాదకుడుగా పత్రికాసంపాదకుడుగా లబ్ధప్రతిష్ఠులైన వీరు రాజమండ్రి సమీపంలోని నరేంద్రపురంలో 1935 డిసెంబరు 22న జన్మించారు.

**రాష్ట్రప్రభుత్వం నుండి డెప్యుటేషన్‌పై వచ్చిన వీరు 1978 నుంచి తి.తి.దేవస్థానంలో పదిహేనేళ్ల పాటు పౌరసంబంధాధికారిగా పనిచేశారు.** అనంతరం రెండేళ్లు శ్రీ వేంకటేశ్వర కేంద్ర గ్రంథాలయం, పరిశోధనా కేంద్రం సలహాదారుగా పనిచేశారు. అక్కడ అనేక ఇతర శాఖలతో పాటు ముద్రణాలయం ప్రచురణల విభాగం అధిపతిగా, తిరుమల తిరుపతి దేవస్థానం సవ్యాఖ్యాన **కవిత్రయ భారతం ప్రాజెక్టులో కీలక పాత్ర పోషించారు. ఇంకా పోతనభాగవతం ప్రాజెక్టు సంపాదకవర్గ సభ్యుడుగా, సమన్వయకర్తగా పేరు ప్రఖ్యాతులు సముపార్జించుకున్నారు. ఆయన రచించిన రావుల రామాయణం, పద్మావతీ శ్రీనివాసం(పద్యకావ్యాలు), శ్రీమద్భగవద్గీతభావానువాదం గ్రంథాలను తి.తిదే. ప్రచురించించింది.**

వీరి మృతి తి.తి.దేవస్థానానికి తీరనిలోటని తి.తి.దే. పాలకమండలి అధ్యక్షుడు శ్రీ డి.కె.ఆదికేశవులనాయుడు, తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి డా॥ఎన్.యువరాజ్, ఐ.ఏ.ఎస్., తమ సంతాప సందేశంలో పేర్కొన్నారు. తి.తి.దే. పౌరసంబంధాధికారి శ్రీ టి.రవి ఆధ్వర్యంలో వారి కార్యాలయ సిబ్బంది 5 ని॥ల పాటు మౌనం పాటించి నివాళులర్పించారు.

ఈ కూపను కత్తరించండి

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
(పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలుస్తున్నది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి ప్రసాదాలకు సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.

☛ **మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083".**

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **V. Sambasiva Rao,** D.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.



తిరువీధుల మెరసీ దేవదేవుఁడు
గరిమల మించిన సింగారములతోడను

తిరుదండెలపైనేఁగీ దేవుఁడిదే తొలునాఁడు
సిరుల రెండవనాఁడు శేషునిమీఁద
మురిపేన మూఁడోనాఁడు ముత్యాలపందిరి క్రింద
పొరి నాలుగోనాఁడు పువ్వుఁగోవిలలోను

గక్కన నయిదవనాఁడు గరుడునిమీఁదను
యెక్కెను ఆరవనాఁడు యేనుగమీఁద
చొక్కమై యేడవనాఁడు సూర్యప్రభలోనను
యిక్కువఁ దేరును గుఱ్ఱమెనిమిదోనాఁడు

కనకపుటందలము కదిసి తొమ్మిదోనాఁడు
పెనచి పదోనాఁడు పెండ్లిపీఁట
యెనసి శ్రీ వేంకటేశుఁడింతి యలమేల్మంగతో
వనితల నడుమను వాహనాల మీఁదను ॥

(7-192)



దేవదేవుని బ్రహ్మోత్సవాలు కనులారా భక్తులందరూ చూసి తరించాల్సిందే! ఆనాడు అన్నమాచార్యులవారు బ్రహ్మో త్సవాల పెద్దగా వ్యవహరించి ఆయనే స్వయంగా బ్రహ్మోత్స వాలు నిర్వహించేవారు! పదిరోజులూ స్వామిని సేవించి కీర్తించే వారు! పదిరోజుల సేవలను, స్వామివారి వైభవాన్నిపై సంకీర్తనలో మన కళ్లెదుట అన్నమయ్య ప్రత్యక్షం చేశాడు.



# మీ మాట

## వందనాలు

సప్తగిరి మాసపత్రికను అందమైన డిజైన్లతో భక్తిరస సందోహమైన భగవత్‌చిత్ర పటాలతో ప్రతినెలా మొదటివారంలోనే మాకు అందజేస్తున్నందుకు కృతజ్ఞతలు. పత్రికను లాభాపేక్షతో కాకుండా లోకకల్యాణంకోసం తక్కువ ధరకే అందిస్తున్నందుకు తిరుమల తిరుపతి దేవస్థానానికి మరియు సంపాదక వర్గానికి మనఃపూర్వక వందనాలు.

– *'బాలబాంధవ' గంగరాజు మోహనరాజు, తిరునిండ్రవూరు, తమిళనాడు.*

## విశ్వకల్యాణ చక్రవర్తి

విశ్వకల్యాణచక్రవర్తి ముఖచిత్రంతో వెలసిన జూలై సంచిక హృద్యంగా ఉంది. విష్ణుతత్త్వాన్ని అన్నమయ్య చక్కగా చెప్పారు. ఆంజనేయుడు ముమ్మాటికీ రామదాసుడే. నమస్కార తీరుతెన్నులు బాగా వివరించారు. విద్య అంటే అక్షరాల చదువుకాదు, ఆధ్యాత్మిక విద్య అనడం లోతైన మాట బాగుంది.

– *వాస్తు రామచంద్ర, నెల్లూరు.*

## అలౌకిక దివ్యానుభూతి

సప్తగిరి జూలై సంచికలో స్వామి కల్యాణ శోభితుడై దర్శనమిస్తూ మాకు ఆధ్యాత్మిక, భక్తి పూర్వక ఆనందాన్ని కలిగించాడు. మధ్యపేజీలో కల్యాణమూర్తుల వర్ణచిత్రాలు నయనానందకరంగా ఉన్నాయి. స్వామివారు, అమ్మవార్లు దివ్యతేజస్సులతో వెలిగిపోతూ భక్తులను రంజింపచేస్తున్నారు. సప్తగిరి మాసపత్రికను చదవడం ఓ అలౌకిక దివ్యానుభూతి.

– *కె.భారతి, ద్రాక్షారామం.*

## ముచ్చటగొల్పు మాసపత్రిక

2010, మే, జూన్, జూలై నెలల సప్తగిరి ముఖచిత్రాలు చూడముచ్చటగా ఉన్నాయి. ఉషశ్రీ 'భారతం', మొవ్వవృషాద్రిపతి 'సందేహాలు– సమాధానాలు', డా॥ కె.రామకృష్ణ 'తిరుమల ఆలయం' ధారావాహికలేకాకుండా శీర్షికలు ఎంతో బాగున్నాయి. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు, శ్రీదేవి, భూదేవి సమేతుడు, నిత్యసంపన్నుడైన ఆ శ్రీ వేంకటేశ్వరుడు సప్తగిరిలాంటి ఆధ్యాత్మిక పత్రికను నిత్యనూతనంగా అయిదురూపాయలకే భక్తులకందిస్తున్నాడు. ముసలివాళ్ళకు కళ్లద్దాలు అవసరం లేకుండా ఆణిముత్యాల్లాంటి అక్షరసుమాలతో ఆధ్యాత్మిక వ్యాసాలను, శ్రీవారి దేవాలయ విశేషాలను అందిస్తున్నందుకు ధన్యవాదాలు.

– *కర్రి రాము, అనకాపల్లి, విల్లూరి శ్రీరాములు, గవరపాలెం, మద్దాల నారాయణ, తిరుపతి, విల్లూరి ప్రశాంత్, విశాఖపట్నం, గొర్లె కృష్ణ, గాజువాక.*

### నవంబరు నెల పండుగలు

04 - నరకచతుర్దశి
05 - దీపావళి
09 - నాగులచవితి
18 - కైశిక ద్వాదశి
21 - కార్తీక పౌర్ణమి

## శ్రీవారిప్రసాదం

సప్తగిరి పుస్తకం చూస్తే శ్రీనివాసుని చూసినంత ఆనందం కలుగుతుంది. సప్తగిరిలో ప్రచురిస్తున్న కథలు, వ్యాసాలలో ఈ యుగజనులకు తెలియపరచవలసిన, తెలుసుకోవలసిన భక్తి విజ్ఞానం చాలా ఉంది. సప్తగిరి అందిన రోజు శ్రీవారి ప్రసాదం అందినంత సంబరం. ఆంజనేయుడు రామునికి దాసుడా? అనే శీర్షికలోని సారాంశం చక్కగా ఉంది. దీనిలోని మర్మం లోగడ "భక్తిదాసులకు" సంకటస్థితి కలిగినపుడు వారు ఏ విధమైన తీరును అనుసరించారో అన్నదానికి మైలవరపు శ్రీనివాసరావు మంచి ఉదాహరణ ఇచ్చారు. సప్తగిరి ప్రచురణకర్తలకు ధన్యవాదాలు. రచనలు చేస్తున్న రచయితలకు, రచయిత్రులకు కృతజ్ఞతలు.

– *బికుమళ్ళ సత్యనారాయణ, పుట్రేల, కృష్ణాజిల్లా.*

## అష్టభార్యలు

సప్తగిరి జూలై సంచికలోని గృహలక్ష్మిశీర్షికలో శ్రీకృష్ణుని అష్టభార్యల గురించి వారి తల్లి దండ్రుల గురించి వారు ఏ దేశపు రాకుమార్తెలో తెలుసుకున్నాం. రచయిత పాయసం సుబ్రహ్మణ్యంగారికి కృతజ్ఞతలు. భోజనయజ్ఞం వ్యాసం కూడా బాగుంది.

– *సి. శివకుమార్, పల్లమాల.*

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.



# సప్తగిరి




తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

నవరాత్రి బ్రహ్మోత్సవ సంచిక
అక్టోబరు, 2010

సంపుటి : 41 సంచిక : 05




**సమాజం కోసం చేసే త్యాగం వల్లే మోక్షం వస్తుంది**


గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.

సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ

ఉప-సంపాదకురాలు :
డా॥ అల్లాడి సంధ్య

ముద్రాపకుడు :
ఎం. కార్తీక్, ఎం.ఏ., ఎల్.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి


ముఖ చిత్రం :
**ఉభయదేవేరులతో శ్రీవారు**

చివరి పుట :
**శ్రీవారి పుష్కరిణి**




*వివరాలకు :*
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

| | |
|---|---|
| విడి ప్రతి | -- రూ. 5-00 |
| సం॥ చందా | -- రూ. 60-00 |
| జీవిత చందా | -- రూ. 500-00 |

**విదేశాలకు**

సం॥ చందా -- రూ. 850-00



## సంపాదకీయం

# కాలుష్యరహిత తిరుమల

పరమాత్ముడు పంచభూతాల సృష్టికర్త. ప్రకృతి పంచభూతాల సమ్మేళనం. ఇలాంటి ప్రకృతిని మానవుడు కలుషితం చేయడం మహాపాపం. మానవుడు తన సౌలభ్యంకోసం ఏర్పాటు చేసుకున్న వివిధ కృత్రిమ వనరులు ప్రకృతి విధ్వంసానికి దోహదపడుతున్నాయి. ఇలాంటి విధ్వంసక వస్తువుల్లో ప్లాస్టిక్ ప్రధానమైంది. ఈ ప్లాస్టిక్ వాడకం వల్ల ఇటు మానవుడు, అటు ప్రకృతి కోలుకోలేని విధంగా కలుషితం అవుతున్నాయి. దేనినైనా తనలోకి గర్భీకరించుకోగల సామర్థ్యాన్ని కలిగిన భూమాత ప్లాస్టిక్‌ను తనలోకి ఇముడ్చుకోలేక పోవడమే ఈ కాలుష్యం ప్రమాదకారి కావడానికి ప్రధాన కారణం.

పాలిథిన్, ప్లాస్టిక్ అనేవి పంచభూతాలలో ఇమిడిపోదగిన వస్తువులు కావు. తరతరాలకు అదే రూపంతో నిలిచిపోవడమే కాకుండా జీవన పెరుగుదలను అడ్డుకుంటుంది. ఇది నాశరహితం. జీవునికి భూమికి గల సహజలక్షణాల్ని ఆటంకపరుస్తుంది. కనుక వీటి వాడకాన్ని సర్వ మానవాళి సంపూర్ణంగా నిషేధించాలి. పాలిథిన్, ప్లాస్టిక్ వస్తువులు పరిమాణంలో చాలా చిన్నవి. అయితే వ్యాప్తిలో మాత్రం వినాశ గుణాన్ని కల్గించడంలో ఉన్న ఈ వస్తువును చూస్తే హిమాలయాన్ని కూడా కలుషితం చేయకల్గుతుంది. పర్యావరణ పరిరక్షణకు ఇది పెద్ద అవరోధంగా భావించాలి. పరిశుభ్రతకు ఆటంకాన్ని కల్గిస్తుంది.

108 దివ్యక్షేత్రాలలో తిరుమల పవిత్రక్షేత్రంగా విలసిల్లుతున్నది. సాక్షాత్తు శ్రీమహావిష్ణువే శ్రీనివాసుడిగా వెలసి ఆనందనిలయంలో విరాజిల్లుతున్న క్షేత్రమిది. నిత్యం వేలాదిమంది భక్తజనులు శ్రీవారి దర్శనానికై వచ్చేటటువంటి దివ్యక్షేత్రం. కలియుగ వైకుంఠమైన ఈ పవిత్ర పుణ్యక్షేత్రంలో ఇక్కడి పరిశుభ్రతకు ప్రతిఒక్కరు, తమవంతు కృషి చేయాలి. ఎవరైనా కొంత అశ్రద్ధ వహించినట్లయితే ఈ అపరిశుభ్రత కొండలాగా పేరుకుపోవడమే కాక అనూహ్యమైన విధంగా అసహ్య వాతావరణాన్ని ఏర్పరుస్తుంది. ఈ పరిస్థితిలో పాలిథిన్ సంచుల, పాలిథిన్ పేపర్ల నివారణ ప్రధానమౌతుంది. కావున దీనికి ప్రతి ఒక్కరు సహకరించి మరొకరికి తగిన విధంగా వివరణ ఇచ్చినట్లయితే ఈ పాలిథిన్‌వాడుకను నిషేధించడానికి ఆస్కారముంటుంది.

తిరుమలకు వచ్చేవారు పాలిథిన్ సంచులను, ప్లాస్టిక్ బాటిళ్ళను వాడి చెత్తబుట్టలో వేయడం కంటే, వాటిని పూర్తిగా వాడకుండా ఉండటమే శ్రేయస్కరం. అనివార్యమైన సందర్భాల్లో వాడిన పాలిథిన్ సంచులను, ప్లాస్టిక్ బాటిళ్ళను తెస్తే తిరిగి వాటిని వారి వెంబడే తీసుకు వెళ్ళిపోవడం అనివార్యం. లేదా తిరుమలలో వాటికై ఏర్పాటు చేసిన చెత్తబుట్టలలో ఉపయోగించిన వాటిని పడేయడం సరైన పద్ధతి.

**మనమందరం కలిసి పర్యావరణాన్ని పరిరక్షిద్దాం.**

**తిరుమలను కాలుష్య రహిత క్షేత్రంగా తీర్చిదిద్దుదాం.**




**భా**రతదేశం ఒక దివ్యక్షేత్రం! పవిత్రమైన వేదభూమి! ఇక్కడ ఆధ్యాత్మిక సంపద అక్షయం. అడుగడుగునా, అణువణువునా ఆధ్యాత్మిక చైతన్యం వెల్లివిరుస్తుంటుంది. కన్యాకుమారి నుండి కాశ్మీరం వరకు అనాదిగా వెలసి ఉన్న పరమపుణ్యధామాల్లో వేంకటాచలక్షేత్రం అత్యున్నతమైంది. అనంత మహిమలు కలది. కేవలం ఈ కలి యుగంలోని మానవుల కోసమే వెలసి ఉన్నట్టి దివ్య ప్రదేశం తిరుమల! మిగిలిన కృత, త్రేత, ద్వాపరయుగం నాటి మనుషులు దీర్ఘాయుష్కులేకాక తపస్సంపన్నులు, మంత్రసిద్ధులు. అందువల్ల ఆ యుగాల్లోని మహనీయులు తమకు ఉన్న శక్తులవల్ల దేవతలను ప్రత్యక్షం చేసుకొనేవారు లేదా ఆ యా దేవతల లోకాలకు వెళ్ళేవారు. మరి కలియుగంలోని మానవులు అల్పాయుష్కులే కాక శక్తిహీనులు. అందువల్ల కలియుగంలోని మానవులను రక్షించడంకోసమే, కోరికలు తీర్చడం కోసమే బ్రహ్మాదిదేవతల ప్రార్థనపై వెలసిన క్షేత్రం తిరుమల.

వేంకటాచలం ఎంతటి గొప్పక్షేత్రమో, అందున్న ఆనందనిలయుడు అంతకంటే మహిమాన్వితమైన దేవుడు.

తిరుమల పుణ్యక్షేత్రం యుగయుగాల్లో అనంతమైన పేర్లు కలిగివున్నా ప్రధానంగా వేంకటాద్రి, శేషాద్రి, అంజనాద్రి, గరుడాద్రి, వృషాద్రి, వృషభాద్రి, నారాయణాద్రి అనే ఏడుపేర్లను కలిగిఉన్నందువల్ల ఏడుకొండలు అనీ, సప్తగిరి అని పిలువబడుతున్నది. వేంకటాద్రిగా ప్రసిద్ధి చెందిన ఈ కొండ కట్టెదుర దర్శనమిస్తున్న శ్రీవైకుంఠం! తెట్టెలుతెట్టెలుగా మహిమలను కురిపించే దివ్యధామం! ఈ కొండపైన కనపడే రాళ్ళూ రప్పలు, కొండలు, గుట్టలు, నిజంగా రాళ్ళూరప్పలు కాదు. నవ నిధులు, రత్నాల రాసులు, చింతామణులు! ఇక ఈ కొండపై ఉన్న తీర్థాలు, పుష్కరిణిలు, సెలయేళ్లు, జల పాతాలు ఎలాంటి పాపాత్ములనయినా అమరులను చేస్తుంటాయి. ఆ పర్వతంపై వీచే గాలులు అంతుబట్టని రోగాల్ని పోగొడతాయి.

ఇంతటి మహిమాన్వితమైన క్షేత్రంలో వెలసి ఉన్న స్వామి శ్రీ వేంకటేశ్వరుడు! ఈ స్వామి ఏమాత్రం తక్కువవాడు కాదు. ఎంతమాత్రం తక్కువవాడు కానే కాదు. ఆ స్వామి భక్తులపాలిటి కొంగు బంగారం! పిలిస్తే పలికే ప్రత్యక్షదైవం! అనాథ రక్షకుడు! ఆశ్రితవత్సలుడు! వేంకటపతి చేరి కొలిచినవారి చేతిలోని కుంచం (కొలపాత్ర). కోరినుతించిన వారి పాలికొంగుపైడి. వేంకటేశుడు కోరి ఏలినట్టి కులదైవం! పెద్దలిచ్చిన నిధానం! దప్పి దీర్చు కాలమేఘం! భావింప కైవసమైన పారిజాతవృక్షం! చేవదేర కాచి రక్షించే చింతామణి! కోరికలిచ్చే కామధేనువు! చెడనీక బ్రదికించే సిద్ధ మంత్రం! రోగాలడచి రక్షించే దివ్యౌషధం! బడిబాయక తిరిగే ప్రాణబంధువు.



**పరమాత్ముడు పరమ పురుషుడు పరికింపగ కృపాలుడు**
**తిరువేంకట విభుడుకాక దేవుడు మరి కలడా**

అని అన్నమయ్య అన్నట్లుగా భూత భవిష్యత్కాలాల్లో సాటిలేని మేటిదేవుడు శ్రీనివాసుడు. ఆ స్వామిని స్మరించడం, స్తుతించడం, దర్శించడం ఎన్నో జన్మల పుణ్యం వల్ల సిద్ధిస్తుంది. తిరువేంకటనామము వెల సులభం. ఫలమధికం. ఆకటివేళల్లో, అలసిన వేళల్లో, కొరమాలివున్న వేళ, కులము చెడిన వేళ, పరులచే చిక్కి చెరలో ఉన్న వేళ వేంకటేశునామ మొక్కటే రక్షిస్తుంది. ఆపద వచ్చిన వేళ, ఆరడిబడిన వేళ, పాపపు వేళ, భయపడినవేళ ఓపినంత హరినామం చెయ్యడమే గతి! సంకెళ్ల బెట్టిన వేళ, చంపబిలిచిన వేళ, అప్పులవారు ఆరడిబెట్టిన వేళ వేంకటేశునామం ఒక్కటే విడిపించి కాపాడుతుంది.

మరి ఇలాంటి దివ్యమైన తిరుమల క్షేత్రానికి ఎలా యాత్ర చెయ్యాలి. ఎంత పవిత్రంగా యాత్ర చెయ్యాలి? ఆ స్వామివారిని ఏ నియమాలతో దర్శిం



చాలి. ఎలాగ దర్శిస్తే ఆనందనిలయుని సంపూర్ణ అనుగ్రహాన్ని పొందగలమో, వేంకటాచల మాహాత్మ్య గ్రంథాలు స్పష్టంగా తెలియజేస్తున్నాయి. పవిత్రమైన తిరుమల యాత్ర చెయ్యాలన్నా, ఆ క్షేత్రం మీది ఏడుకొండలవాణ్ణి దర్శించాలన్నా, కొన్ని విధివిధానాలున్నాయి. ఆచరించవలసిన కొన్ని నియమాలున్నాయి.

వేంకటాద్రిని మించిన దివ్యక్షేత్రంగాని, వేంకటేశునికి సాటి రాగల దేవుడు భూత భవిష్యత్కాలాల్లో లేదు, ఉండబోడు. మరి అలాంటి తిరుమల యాత్రను సంకల్పిస్తే చాలు ఒక ఆనందం! అదీ ఇదీ అని చెప్పలేని, వ్యక్తం చెయ్యలేని ఆనందం! అలాంటి అద్భుతమైన దివ్యానందాన్ని కలిగించే తిరుమల యాత్రాసమయంలో ఏ విధంగా నడుచుకోవాలి; ఏ విధంగా ఉండకూడదో కూడా తెలుసుకోవాలి.

తిరుమల యాత్రను సంకల్పించినది మొదలు మళ్ళీ ఇంటికి చేరునంతవరకు ప్రతిక్షణం తిరుమల యాత్రలోని భాగమే, స్వామివారి ఉపాసనలో భాగమే, స్వామివారి ఆరాధనలో భాగమే అని భావించాలి. అలాంటి యాత్రను స్వచ్ఛంగా, నిర్మలంగా, ప్రశాంతంగా కొనసాగించాలి. ఆ యాత్రాదీక్షలో ఇతరులను నిందించరాదు. కనీసం మనసులో అయినా ఇతరులను చెడుగా భావించరాదు. చెడుగా చెప్పరాదు,వినరాదు. ముందుగా తమ గ్రామంలోని దేవతలను పూజించి వారి అనుమతిని పొందాలి. పితృదేవతలకు తర్పణాదులు వదలాలి. ఆ తర్వాతనే తిరుమల యాత్రకు ఉత్సాహంగా, ఉల్లాసంగా ఆనందంగా బయలుదేరాలి. ఈ యాత్రలో మరో ధ్యాస, మరో ధ్యానం ఉండకూడదు. ఎప్పుడెప్పుడు కొండకు చేరుదామా, ఎప్పుడెప్పుడు స్వామిని దర్శిద్దామా అన్న ఆత్రుతతో, ఆనందంతో ఉంటూ, స్వామివారిని గూర్చే చర్చించుకోవాలి.

తిరుపతికి వెళ్ళిన తర్వాత ఎదురుగా ఎత్తుగా కనపడే వేంకటాచల పర్వత శిఖరాలకు భక్తిగా నమస్కరించాలి.

తిరుమల క్షేత్ర మూలంలో ఉన్న కపిలతీర్థాన్ని దర్శించి పవిత్రస్నానాలు చేసి, పితృతర్పణాలు సమర్పించి, శ్రీ కామాక్షీ సమేత కపిలేశ్వరస్వామి వారలను సేవించుకోవాలి. పిదప వినయంగా వినమ్రంగా సప్తగిరులకు నమస్కరిస్తూ ఏడుకొండలను ఎక్కాలి.

“ఓ బంగారు పర్వతమా! అఖిలదేవతల చేత సేవింపబడుతూ ఉన్న మహిమాన్వితమైన పర్వతరాజమా! నీమీద కొలువైవున్న భక్తవత్సలుడైన శ్రీ వేంకటభగవానుని దర్శించడానికి నీమీద నాకాళ్ళు మోపుతున్నాను. నిండుదయతో నన్ను క్షమించు. నీ పర్వత శిఖరంపై ప్రకాశిస్తున్న ఏడుకొండలవాణ్ణి దర్శింపజేసి నన్ను ధన్యుణ్ణి చేయి.” అంటూ మనసారా ఏడుకొండలకు శిరసువంచి నమస్కరించాలి.

ఆ తర్వాత ఆ కొండమెట్లపై మృదువుగా కాలు మోపుతూ నడవాలి. కొండపైన దారిలో, కొండపైన ఆ యా చోట్ల తీర్థాల్లో సంకల్పపూర్వకంగా స్నానాలు చెయ్యాలి. శ్రీ స్వామి పుష్కరిణిలో స్నానం చేసి తమ పితృదేవతలను స్మరించి తర్పణాలు ఇవ్వాలి. పిదప శ్రీ భూవరాహస్వామివారిని దర్శించిన తర్వాతనే ఆనంద నిలయుణ్ణి దర్శించాలి. దర్శనం క్యూలో కూడ శ్రీనివాసుని స్మరించడం, ధ్యానించడం చెయ్యాలి. తోటి యాత్రికుల్లో స్వామివారున్నారేమో అన్న భక్తిభావంతో తోటివారిని వినయపూర్వకంగా గౌరవించాలి. వారికి సహకరించాలి. ఎక్కడా ఇతరులతో ఘర్షణ పడరాదు, పడకూడదు. దానివల్ల మనస్సు పాడవుతుంది. ప్రశాంతత చెడుతుంది. దానివల్ల మనయాత్ర అసంతృప్తిగా సాగుతుంది. అందువల్ల మనం సంయమనం పాటిస్తూ “ఓం నమో వేంకటేశాయ” స్మరణతో క్యూలో వెళుతూ స్వామివారిని దర్శించాలి. ఆ దర్శనం క్షణమైనా చాలు. మనమీద స్వామి దృష్టిపడితే చాలు. ఆ ఒక్క క్షణం స్వామివారిని ఆపాదమస్తకం దర్శిస్తే చాలు. స్వామీ! మా అందరి మీద కరుణ చూపించు. దృష్టి సారించు స్వామీ! అంటూ స్వామివారిని చూస్తూ, చూస్తూనే బయటికి రావాలి. పిదప ఆలయంలో వకుళమాతను,

బంగారుబావిని, దర్శించాలి. ఆ తర్వాత తీర్థ శఠారులను స్వీకరించి, విమాన ప్రదక్షిణం చేస్తూ, బంగారు విమానాన్ని చూస్తూ, హుండీలో శ్రీవారికి కానుకలు సమర్పించుకొని బయటికి వచ్చి ప్రసాదాన్ని స్వీకరించి, మళ్ళీ దర్శనం ఇవ్వు స్వామీ! అంటూ ఆలయం బయటికి రావాలి. ఆ తర్వాత తిరుమలలో కొన్ని విధులను ఆచరించాలి.

తిరుమల కొండపై వేంకటేశ్వరుని స్మరిస్తూ దానాలు చెయ్యాలి. ఏడుకొండల మీద ఏ దానం చేసినా, ఏ వితరణ చేసినా చాల మంచిది. ఒక్కటిగా దానం చేస్తే వేయిరెట్లుగా సత్ఫలితం కలుగుతుంది. కొన్ని దానాలకు ఘోరపాపాలు పోతాయి. దోషాలు నశిస్తాయి. అంతుబట్టని రోగాలు నివారణమౌతాయి. అంతేకాదు ఆ కొండపై ఏ చిన్న తప్పు చేసినా, ఏ చిన్న దోషాన్ని చేసినా పాపఫలితం అధికంగా అనుభవించవలసి ఉంటుంది. తిరుమలక్షేత్రాన్నిగూర్చి గాని, ఆ స్వామి వారిని గూర్చిగాని చెడుగా మాట్లాడరాదు, ఆలోచించరాదు. ముఖ్యంగా తిరుమల క్షేత్రంలో పవిత్రమైన మనస్సుతో ఉండాలి. మంచిగా ఆలోచించాలి. ఆచరణలు పవిత్రంగా ఉండాలి. మంచి నడవడికలతో, సద్భావనలతో, మంచి ఆలోచనలతో ఈ క్షేత్రంలో మెలగాలి. తిరుమల క్షేత్రం విహారక్షేత్రం కాదు. వినోదక్షేత్రం అంతకన్నా కానేకాదు. ఇది సిద్ధిక్షేత్రం. సాధనా క్షేత్రం. అందువల్ల ఈ క్షేత్రంపై విహరించే భాగ్యం కలిగిన ప్రతి ఒక్కరూ, తిరుమలలో ఉన్న కొద్ది క్షణాలైనా పవిత్రంగా ఉండాలి. ఎందుచేతంటే తిరుమల శ్రీవారి ఆలయంలో, ఆనందనిలయంలో మాత్రమేగాక తిరుమల అంతటా దైవత్వం, దేవతాసాన్నిధ్యం అడుగడుగునా అణువణువునా ఉట్టిపడుతూ ఉంటుంది, ప్రతిఫలిస్తూ ఉంటుంది. ప్రశాంతంగా, మనశ్శుద్ధిగా, సాధనతో, భక్తిగా ఉన్నవారికి మాత్రమే తిరుమల క్షేత్రంలో సర్వత్రా ఉట్టిపడుతూవున్న దైవత్వం అనుభవంలోనికి వస్తుంది. ఇది సత్యమైన మాట! మనం మన కుటుంబం అంతా తిరుమలకు శ్రీవారిని దర్శించడానికి వచ్చామన్న



ధ్యాసను, ధ్యానాన్ని మరచిపోకూడదు. తిరుమలలో ఉన్న రోజుల్లో లౌకికమైన మన పదవులను, మన అధికారాలను, మన సంపదలను, కోపతాపాలను అన్నీ మరచిపోవాలి. మన ఆలోచనల్ని, భావనల్ని, భావాల్ని వక్రరీతిలో పోకుండా నిరంతరం శ్రీవారినే ధ్యానించాలి. ఇంటిల్లిపాదీ శ్రీవారిని గూర్చే చర్చించుకోవాలి. అప్పుడే మన తిరుమల యాత్ర సఫలీకృతమవుతుంది. సంపూర్ణమౌతుంది. తద్వారా మనం ఖర్చు చేసిన ధనం, కాలం, వృథాకాకుండ సద్వినియోగమై, శ్రీవారికే అంకితమౌతాయి. ఆనందనిలయుని అనుగ్రహం నిండుగా కల్గుతుంది.

తిరుమలక్షేత్రం సర్వలోకాలన్నింటిని రక్షించే మహిమాన్వితమైన దివ్యక్షేత్రం. దీన్ని మానవమాత్రులు ఎవ్వరూ కాపాడవలసిన అగత్యం లేదు. రక్షించవలసిన అవసరం అంతకన్నా లేదు. కాని భక్తులు, యాత్రికులు ఎవరికి వారు పవిత్రంగా ఉంటే చాలు. తిరుమల క్షేత్ర పరిసరాల్ని పరిశుభ్రంగా ఉంచితే చాలు. తోటి యాత్రికుల భక్తిభావాలను, మనోభావాలను కించపరచకూడదు. బాధపెట్టకూడదు. ఎవరికి వారు భగవన్నామం చేసికొంటూ తమవంతు వచ్చేంతవరకు ఓపికగా ఉంటూ ఏడుకొండలవాణ్ణి దర్శించాలి. అమూల్యమైన ఆ క్షేత్రంలో సంచరించే భాగ్యం కలిగిన అమూల్యమైన క్షణాలను అనవసర సంభాషణలతో వృథా చెయ్యరాదు.

వేంకటాచలక్షేత్రంలో శ్రీనివాస భగవానుని దర్శనం తర్వాత అత్యంత ప్రధానంగా కొన్ని దానాలను, ధర్మాలను చెయ్యాలి. తిరుపతి కొండపై మన దానాల్ని తీసుకొని మన పాపాల్ని పోగొట్టగల అర్హత ఎవరికుంది? ఒక వేంకటేశునికి తప్ప! అన్ని దానాలను స్వీకరించి పాపాలను పోగొట్టే వేంకటపతి ఆయన. స్వామికి బంగారాన్ని సమర్పిస్తే మోక్షం సిద్ధిస్తుంది. వస్త్రదానం చేస్తే రోగాలుపోతాయి. ఆయుస్సు పెరుగుతుంది. శ్రీనివాసునికి గోదానం చేస్తే, ముఖ్యంగా కపిలగోవులను దానం చేస్తే విష్ణులోకప్రాప్తి కలుగుతుంది.



స్వామివారి అర్చనలు, ఆరాధనలకోసం సుగంధ ద్రవ్యాలు కర్పూరం, చందనం, శంఖాలు, ఆభరణాలు సమర్పిస్తే మహాపాతకాలు నశిస్తాయి. భూములను దానం చేసినట్లయితే సంసారబంధాలు తొలగి మోక్షం కల్గుతుంది. శ్రీవారి రథాన్ని నిర్మించుటకు ఉపయోగపడే కర్ర, వెండి, బంగారం మున్నగునవి దానం చేస్తే కోటి కన్యకాదానాలు, పదివేల గోవులు దానం చేసిన ఫలితం కల్గుతుంది. శ్రీనివాసునికి ఛత్ర చామరాలు సమర్పించవచ్చు. బంగారుపుష్పాలు, ఏనుగులను, గుర్రాలను సమర్పించవచ్చు. ఆవునేతితో, జ్యోతులను, పిండి దీపాలను వెలిగిస్తే పూర్వులకు పుణ్యలోకాలు సిద్ధిస్తాయి. ఇంకా బంగారం, గోవులు, వెండి, భూమిని, దక్షిణ తాంబూలాన్ని, పెరుగు, మజ్జిగ, పానకం, మృష్టాన్నదానాలు... ఇలా అవీ ఇవీ అనకుండా దానాలు చేస్తే రోగాలు పోతాయి. సంపదలు కలుగుతాయి.

## మహిమాన్వితులు

అనురాగ పూర్ణయౌ అలమేలు మంగమ్మ
దీవనలందించ దిగులు తొలగు
పద్మావతీదేవి పాదపూజనమున
పాపసందోహమ్ము పారిపోవు
ఏడుకొండలవాని ఎంతెంత కొలిచిన
అంతంత పుణ్యము అందివచ్చు
కలియుగ వైకుంఠుఁ గనులార దర్శించఁ
గలుగదే మోక్షమ్ము గడియలోన

సప్తశిఖరాల కొలువైన స్వామిఁ జేరి
భక్తి పుష్పము నర్పించి భజనఁజేసి
ముక్తి మార్గముఁ గనుగొని ముదము తోడ
జన్మ ధన్యముఁ బొందుడీ జగతిలోన

– డా॥ మూలె రామమునిరెడ్డి,

తిరుమల కొండపై జలదానం, అన్నదానం, ఔషధదానం... ఇలా దానాలను చేస్తే మంచిది. అందువల్ల తి.తి.దేవస్థానం చేస్తున్న అన్నదానం, ఔషధ దానం, వైద్యదానం, విద్యాదానం, జలదానం మున్నగు అనేక దాన కార్యక్రమాల్లో విరాళాలు సమర్పిస్తూ పాల్గొని ఆత్మతృప్తిని, సంతృప్తిని పొందవచ్చు.

ఒకవేళ దానాలు చెయ్యలేకపోయినా, శ్రీవారి భక్తులకు సేవ చెయ్యవచ్చు. తిరుమలలో రహదారులను, ఆలయపరిసరాలను శుభ్రం చెయ్యవచ్చు. క్షేత్రసౌందర్యాన్ని పెంపొందించే శ్రమదానం చెయ్యవచ్చు. అన్నదానం క్యాంటీన్లలో, క్యూలైన్లలో, శ్రీవారి భక్తులకు సేవ చెయ్యవచ్చు. ఇలాంటి శ్రీవారి సేవాకార్యక్రమాల ద్వారా మనస్సు శుద్ధమవుతుంది. స్వచ్ఛమవుతుంది. స్వచ్ఛమైన అద్దంలో ప్రతిఫలించిన ప్రతిబింబంలాగా, శ్రీవారి భక్తులకు సేవచేసే నిర్మలమైన వారి మనస్సుల్లో, భగవంతుడు ప్రతిఫలిస్తాడు. ఆ తర్వాత తిరుచానూరులోని శ్రీ పద్మావతి అమ్మవారిని కూడా దర్శించి అర్చించాలి. స్వామివారి తర్వాత అమ్మవారిని దర్శించడం చాలముఖ్యం.

ఇంకొక్క మాట! తిరుమల తిరుపతి దేవస్థానం వారు, దాతలు, వితరణశీలురు, శ్రీవారి సేవకులు యాత్రికులకు, భక్తులకు ఎన్నో సౌకర్యాలు కల్గిస్తున్నారు, సేవలను అందిస్తూనేవున్నారు. అయినా నానాటికీ పెరుగుతున్న భక్తజనసందోహం వల్ల అవి అందరికీ అందకపోవచ్చు. భక్తులు అందరూ ఓపికగా, ఓర్పుగా దేవస్థానం వారి సిబ్బందితో సహకరిస్తూ శ్రీవారిని దర్శించాలి. తోటి యాత్రికుల మనోభావాల్ని గౌరవించాలి. తిరుమల క్షేత్ర పరిసర వాతావరణాన్ని కాపాడాలి. తోటి యాత్రికుల మనస్సులను నొప్పించకుండా శ్రీవారి దర్శనంతో దానధర్మాలతో తిరుమల యాత్రను సంపూర్ణంగా జయప్రదం చేసుకోవాలి. తద్వారా శ్రీనివాస భగవానుని అనుగ్రహాన్ని సంపూర్ణంగా జయప్రదం చేసుకోవాలి. ఇది ఎవరికి వారు ఆచరించి సఫలీకృతులు అవ్వాలి తప్ప, దీనికి మరో మార్గం లేనేలేదు.

ఓం నమో వేంకటేశాయ



# ఎన్ని పేర్లో! ఎంతటి అర్థమో!

- కె.వి.రామారావు

తిరుమల దేవునికి ఎన్నో, ఎన్నెన్నో పేర్లున్నాయి. శ్రీనివాసుడు, మంగపతి, శేషాచలపతి, వేంకటపతి, వేంకటేశ్వరుడు, తిరుమలేశుడు, సప్తగిరీశుడు, కలియుగ దేవుడు, ఏడుకొండలవాడు, వడ్డీకాసులవాడు, ఆపద మొక్కులవాడు, అడుగడుగుదండాలవాడు, గోవిందుడు, శ్రీవారు, శ్రీనిలయుడు, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు - ఇలా ఎన్నో పేర్లతో గోవిందుని భక్తులు పిలుస్తుంటారు. గిరిశిఖరాలపై కొలువున్న ఆ శ్రీ వేంకటే శ్వరుని చాలా పేర్లకు మనకు అర్థాలు తెలియవు. ఆ యా పేర్లలోని ఔచిత్యం చాలామందికి బోధ పడదు.



తిరుమల శ్రీనివా సుని పేర్లలోని కొన్నింటి ఔచిత్యాన్ని పరిశీలించి, అవగాహన చేసుకుంటే మనందరి కోసమే ఆ శ్రీవారు ఈ బిరుదు లన్నింటినీ తగిలించు కున్నాడేమో అని అని పించకపోదు.

ఆ దేవదేవుడం దరినీ నిలువుదోపిడీ చేస్తాడని అంటారు. అందరూ అనుకుంటు న్నట్లు నిలువుదోపిడీ అంటే మన శరీరం మీద గల నగలూ నట్రా తీసేసుకుంటాడని కాదు. దీని అంతరార్థం వేరే ఉంది.

మానవుడు ఆశలపుట్ట. అరిషడ్వర్గాలకు ఆశ్ర యమైనవాడు. అలాంటి మానవుడిని ఉద్ధరించడానికే ఆ శ్రీవారు నిలువుదోపిడీ చేస్తారు. ఇక్కడ దోపిడీ చేయ బడేవి నగా నట్రా కాదు. మనిషిని పట్టిపీడిస్తున్న అరి షడ్వర్గాలు, అంతులేని కోరికలు, శారీరక బాధలు, మాన సిక అశాంతి, కుటుంబ కలహాలు, ఇరుగూ పొరుగుతో విభేదాలు, పోరాటం, సంఘర్షణలను ప్రతి మనిషి తొల గించుకుంటే ప్రశాంతమైన, ఒడిదుడుకులు లేని జీవి తాన్ని అనుభవిస్తాడు. అందుకే ఆ శ్రీనివాసుడు, అడు గడుగు దండాలవాడు, సంకటాలను హరించి, మనిషి లోగల సమస్త దోషాలనూ, దుర్గుణాలనూ నిలువుదోపిడి చేసి తద్వారా మనిషిని మానసికంగా, శారీరకంగా ప్రక్షాళన చేస్తాడు. పవిత్రుడిగా మారుస్తాడు. అదే 'నిలువుదోపిడి"లోని అర్థం, పరమార్థం -

మనం తిరుపతికి వెళ్ళి తలనీలాలు సమర్పించుకుంటాం. తల నీలాలను తీసేశాక మనం అందంగా లేమనే భావన కల్గుతుంది. అంద చందాలు శాశ్వతం కావు. యవ్వనం క్షణ భంగురం. జీవితం బుద్బుదప్రాయం - ఈ జీవితసత్యాన్ని మనకు తెలియజేసే దానికే ఆ ఏడుకొండల వాడు మన తలనీలాలు తీసేసు కుంటాడు. నిలువుదోపిడిలో ఇది కూడా ఒక అంశంగా భావించాలి.

**ఆపదమొక్కులవాడు :**

ఇక ఆ తిరుమలేశుని ప్రజలంతా “ఆపద మొక్కులవాడా! గోవిందా! ” అని ప్రార్థిస్తూ ఉంటారు. కారణం - మనిషికి కన్ను తెరిచింది మొదలు కన్ను మూసేంత వరకూ అనేకానేక ప్రమాదాలు ఎప్పుడూ పొంచి ఉంటాయి. వీటి నుండి మనల్ని కాపాడేందుకు ఒక మహత్తరమైన శక్తి కావాలి. ఆ శక్తి కలియుగంలో తిరుమల గిరి శిఖరాలపై వెలసిన శ్రీ వేంకటేశ్వరుడు. ఇక్కడ ప్రమాదాలు అనేకానేక విధాలుగా ఉంటాయి.



అవి బాహ్యమైనవి, అంతర్గతమైనవి అని రెండు విధాలుగా ఉంటాయి. ప్రమాదాలు బాహ్య ప్రమాదాలుగా భావిస్తే, మన శరీరం లోపల, మనకు తెలీకుండానే జరిగే ప్రమాదాలు అనేకం ఉంటాయి. మన శరీరంలో మనకు తెలీకుండానే అనేక కారణాల వల్ల క్రిములు ఉద్భవిస్తూ ఉంటాయి. అవి "ఇంతింతై వటుడింతింతై" అన్న రీతిగా శరీరమంతా వ్యాపించి మనిషిని అనారోగ్యానికి గురి చేస్తాయి. ఈ అనారోగ్యం శారీరక అస్థిరత నుండి మానసిక అస్థిరతకు దారితీసి, మనిషికి బ్రతుకు మీద అయిష్టతను కల్గిస్తుంది. కొన్ని సందర్భాల్లో మరణానికి దగ్గరగా తీసుకుపోవడం, ఒక్కొక్కసారి మనిషి మృతి చెందటం జరుగుతుంది. ఇలాంటి ప్రమాదాల నుండి మనల్ని కాపాడగల్గినవాడు ఆ దేవదేవుడొక్కడే. అందుకే తిరుమలేశుని అనేక విధాలుగా ప్రార్థిస్తాం. మొక్కుకుంటాం. ఆపదలను పార ద్రోలమని వేడుకుంటాం. అందుకే ఆ శ్రీనివాసుని భక్తులందరూ "ఆపదమొక్కులవాడా! అడుగడుగు దండాల వాడా!" అంటూ "త్వమేవ శరణం మమ" అంటారు. పాదాక్రాంతులవుతారు.

**వడ్డికాసులవాడు :**

చాలామంది భక్తులు కష్టాలు చుట్టుముట్టినప్పుడు తమను కాపాడవలసిందిగా తిరుమలేశుని ప్రార్థించి మొక్కుకుంటారు. ఆపదలనుండి బయటపడిన వెంటనే తిరుమలకు వచ్చి మొక్కులు చెల్లిస్తామని మరీమరీ ప్రార్థిస్తారు. శ్రీనివాసుడు తన భక్తులను కరుణించి వారి వారి కష్టాలను మటుమాయం చేస్తాడు. కానీ లబ్ధిపొందిన భక్తులు సకాలంలో మొక్కులు చెల్లించకుండా తాత్సారం చేస్తూ, తిరుమల ప్రయాణాన్ని ఎప్పటికప్పుడు వాయిదా వేస్తూంటారు. అందుకు ఏవేవో కారణాలను ఏకరువుపెడుతూ ఆ దేవుడిని క్షమించమని, సాధ్యమైనంత త్వరలో తిరుమలకు వచ్చి మొక్కుబడులను వడ్డీతో సహా చెల్లించుకుంటామని మరల మరల మొక్కుకుంటూనే ఉంటారు. చిద్విలాసుడైన శేషాచలపతి భక్తులను అన్నివిధాలా గమనిస్తూ వారి నుండి మొక్కుబడులను వడ్డీతో సహా వసూలు చేసుకుంటాడు.

ఇందులోని అంతరార్థం ఏమిటంటే ఏ వ్యక్తి అయినా సకాలంలో తన పనులను తాను నెరవేర్చుకుంటే తేలికగా ఉంటుంది. తాత్సారం చేసేకొద్దీ శ్రమ పెరుగుతుంది. అసలుకు వడ్డీ అధికంగా చెల్లించాల్సి వస్తుంది. ఇది బోధించడానికే శ్రీనివాసుడు వడ్డికాసుల వాడైనాడు.

**అడుగడుగుదండాలవాడు :**

తిరుపతి నుండి తిరుమలకు ప్రయాణించేటప్పుడు ఘాట్‌రోడ్డు అనేక మలుపులతో ఉంటుంది. కొన్ని మలుపులు 'యు' ఆకారంలో కూడా ఉంటాయి. దేవస్థానం బస్సులలో ప్రయాణిస్తూ ఆ మలుపులను అధిగమిస్తున్నప్పుడు బస్సు పడిపోతుందేమో నన్న భయం ప్రతి భక్తుడినీ పట్టి పీడిస్తూ ఉంటుంది. మరోవైపు కొన్ని వేలఅడుగుల లోతు గల లోయలు. దురదృష్టవశాత్తూ మలుపుల దగ్గర బస్సు బోల్తాపడి లోయలోకి దొర్లితే... బస్సు ఆనవాళ్లు కూడా మిగలవు. అందరూ విగత జీవులుకాక తప్పదు. ఇలాంటి అవాంతరాల నుండి రక్షింపబడుటకే భక్తులు అడుగడుగునా ఆ దేవుని స్మరిస్తూ పరిసరాలు దద్దరిల్లేటట్లుగా "గోవిందా", "గోవిందా" అంటూ ప్రయాణం సాగిస్తారు. ఏ ప్రమాదమూ జరగకుండా క్షేమంగా తిరుమల చేరుకుని శ్రీనివాసుని దర్శించి జన్మను చరితార్థం చేసుకుంటారు. ఈ విధంగా తన భక్తులను అడుగడుగునా కాపాడుతూ దండాలు అందుకుంటూవుంటాడు కనుకనే శ్రీనివాసుడు అడుగడుగు దండాలవాడైనాడు.

ఇలా ఆ దేవదేవుడు వివిధ సార్థకనామాలతో భూలోక వైకుంఠమైన తిరుమలలో వెలసి భక్తుల నీరాజనాలందుకుంటూ, ప్రజలందరినీ కాపాడుతూ, కలియుగ ప్రత్యక్షదైవంగా పూజలందుకుంటున్నాడు.

**వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,**
**వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.**




**(మహాభారతంలో అతికీలకమైన జ్ఞానపర్వమైన శాంతిపర్వం ఈ సంచికలో ప్రారంభమయ్యింది)**

## శాంతిపర్వం

జనమేజయ మహారాజా!

కర్ణుడు తన అన్నగారని విన్న క్షణంనుంచీ ధర్మరాజు మనస్సు వికలమై– ఇది మొదలుగా స్త్రీలకు రహస్యం దాచే శక్తి నశించుగాక – అని శపించి, అర్జు నుని చూస్తూ: తమ్ముడూ! నాకు ఈ రాజ్యపాలన కాంక్ష కలగడం లేదు, అడివికిపోయి బ్రతకాలని ఉంది – అన్నాడు. ఆ మాటలు విన్న అర్జునుడు, నకులుడు, ద్రౌపది పరిపరివిధాల ధర్మరాజును హెచ్చరించి: సమ ర్థుడూ, ధర్మపరుడూ అయిన ప్రభువు లేకపోతే ప్రజలు నానా క్లేశాలు పడతారు. దుర్మార్గులు విజృంభించి అకార్యాలు సాగిస్తారు కనక రాజ్యం ఏలక తప్పదు అన్నారు. ఎట్లో అంగీకరించాడు ధర్మరాజు.

బంధు మరణా శౌచం కారణంగా నదివొడ్డునే కుటీరాలు వేయించి, అక్కడే నెల రోజులు గడిపారు. ఆ సమయంలో ఎందరో మునులూ, మహర్షులూ వచ్చి అనేకానేక లోక ధర్మవిషయాలు బోధించారు.

వ్యాసమహర్షి విజయం చేసి : నాయనా! ఎందుకు శోకిస్తావు. దుష్టదండన రాజధర్మం. ఆ ధర్మం ఆచరించని వాడు దేశం దుండగులమయం అవుతుంది. అందుచేత నువ్వు దుర్బుద్ధులైన వారందరినీ కడతేర్చావు. కనుక దీనికోసం విచారం దేనికయ్యా! అని ఓదార్చాడు.

అప్పుడు వాసుదేవుడు: ధర్మనందనా! ఇక నువ్వు సింహాసనం అధివసించి ప్రజారక్షణ చేపట్టాలి, అని పట్టాభిషేక ప్రయత్నం ఆరంభించాడు.

హస్తినాపురం చేరుతూనే కృపాచార్యులను రావించి ధౌమ్యులవారి సరసన ఆసీనుని చేశారు. ధృత రాష్ట్రుని దగ్గర గాంధారి కూర్చున్నది. నకుల సహదేవుల మధ్య కుంతి కూర్చున్నది. యుయుత్సుడూ, సంజ యుడూ గాంధారికి కొంచెం ఎడంగా ఉన్నారు. దేశం లోని వణిక్ప్రముఖులు, హాలికులు సంతోషంతో కానుకలు తెచ్చారు. వచ్చిన అందరికీ ఆదరపూర్వకంగా సత్కారాలు సాగుతున్నాయి. వీణా, వేణు, గానకళాకోవిదులూ, భరతకళాకోవిదులైన నార నారీ జనం వచ్చారు.

నవరత్న ఖచితమైన బంగారు సింహాసనం మీద శార్దూలచర్మం పరిపించి పవిత్ర గంగాజలం స్వర్ణకల శాలలో ఉంచి పంచ గవ్యాలతో వేద మంత్రయుతంగా సంస్కారాలు సాగింపించి ద్రౌపదీ సహితుడైన ధర్మరాజు అగ్నిహోత్రుని హోమాదులతో తృప్తుని గావించిన అనం తరం వాసుదేవుడు చక్రధారియై నిలిచి: ధర్మనందనా! ఈ భూమండలానికి అధీశ్వరుడవై సర్వ ప్రజారంజకంగా పాలించవయ్యా! అని చిరునవ్వుతో సదస్య లోకాన్ని కలయజూశాడు.

మంగళ వాద్యాలు మ్రోగుతున్నాయి. శంఖ భేరీ నాదాలు దిశాంతాలు సోకుతున్నాయి. అప్పుడు తనను ఆశీర్వదించే వేదవేద్యులకు చేతులెత్తి నమస్కరించి: అయ్యా! మీరందరూ ఈ ధృతరాష్ట్ర మహారాజు ఆజ్ఞ పాలించడమే నాకు సంతోషం అని తలదించుకున్నాడు.

అనంతరం భీముని యువరాజుగా చేసి, సంధి, విగ్రహాది సర్వరాజ్యాంగ విషయ నిర్వహణ భారం



విదురుని మీద ఉంచి, అర్థమంత్రిగా యుయుత్సుని నియోగించి, సేనల పరిచారకుల జీత, భత్యాలు నకులుని చేతులలో పెట్టి, ఇరుగు పొరుగు ప్రాంతాల ఆక్రమణలు అర్జునుని భుజస్కంధాల మీద మోపి, విప్రదేవతా పూజలూ, యజ్ఞయాగాది సర్వ కార్యనిర్వాహక భారం ధౌమ్యులవారిదని చెప్పి, అంతరంగ సచివుడుగా సహదేవుని తీసుకున్నాడు.

మహానగరాలలో, జనపదాలతో అన్నసత్రములు నిర్మించి, రాజపథాలలో దాహశాంతికి చలివేంద్రాలు నడుపుతూ, సర్వప్రజారంజకంగా పరిపాలిస్తున్నాడు ధర్మరాజు. భీమునికి దుర్యోధన మందిరం, అర్జునునికి దుశ్శాసన మందిరం, దుర్మర్షణ, దుర్ముఖుల భవనాలు నకుల సహదేవులకూ ఇచ్చి, మిగిలిన వారిని వారి వారి ఆవాసాలలో ఉండునట్లు ఆజ్ఞాపించాడు.

దేవతా పూజలూ, పితృదేవతల ఆరాధనలూ, అతిథి అభ్యాగతుల సత్కారాలూ, అనాథల దీనుల పోషణ భారాలు, దేశ దేశాలనుంచి వచ్చే విద్వాంసులకు సముచిత సమ్మానాలు జరుపుతూ, దేశంలో ఆకలి దప్పుల బాధ లేకుండా స్వయంగా చూసుకుంటున్నాడు.

ఆ రోజులలో ఒకనాడు ప్రభాతవేళ ధర్మరాజు వాసుదేవుని చేరి నమస్కరించి కుశల ప్రశ్నలు వేశాడు. మర్యాదలన్నీ ముగిసిన అనంతరం వాసుదేవుడు రుచిరస్మిత వదనంతో: ధర్మనందనా! సర్వధర్మవిదుడు, త్రికాలజ్ఞుడు అయిన భీష్మ పితామహుడు వశిష్ఠుల వారి శిష్యుడుగా సర్వ విషయాలు గ్రహించాడు. ఆయన కన్ను మూస్తే ధర్మమర్మాలు చెప్పగలవాడు లేడు. కనుక ఆయన పదసమీపంలో సావధానుడవై నీ సంశయాలన్నీ తీర్చుకో అన్నాడు.

**తెప్పోత్సవం**

**ప్రతి ఏటా తిరుమలలోని శ్రీస్వామి పుష్కరిణిలో ఫాల్గుణ మాసంలో పూర్ణిమకు పూర్తి అగునట్లుగా ఐదురోజులపాటు తిరుమల శ్రీ స్వామివారికి తెప్పోత్సవాలు జరుగుతాయి.**

హర్ష పులకిత చిత్తుడై ధర్మరాజు: దేవకీనందనా! ఆయన ఉత్తరాయణం కోసం ఎదురు చూస్తున్నాడు. ఈ మధ్యలో ఒక్కమారు నిన్ను చూడాలనే కోరిక కూడా ఉంది. అందుచేత నువ్వు కూడా రా – అన్నాడు.

ప్రక్కనే ఉన్న సాత్యకిని చూశాడు వాసుదేవుడు: ఆయన కనులలో భావం అవగతమయిన సాత్యకి సారథి దారుకుని పిలిచి రథం సిద్ధం చేయించి భీమార్జున నకుల సహదేవ సంజయ యుయుత్సులతో కృపాచార్యులకు కూడా కబురు పంపాడు.

అందరూ రాగానే ధర్మరాజు తన నిశ్చయం తెలిపి వారిని వెంటబెట్టుకొని పితామహుల దగ్గరకు వెడుతూ: తమ్ముడూ కిరీటీ! ఇకనుంచి పితామహుల దగ్గరకు సైనికులూ, అంతఃపుర స్త్రీలు చేరకుండా ఆజ్ఞాపించు. ఆయన వీరందరి గోడూ వింటూ అవస్థ పడలేదు – అన్నాడు. రథాలు పితామహుని శరతల్పానికి అల్లంత దూరంలో ఆపి అందరూ పాదచారులై వెళ్ళి ఆ వృద్ధమూర్తికి నమస్కారాలు చేశారు.

అప్పటికే అక్కడకు చేరి ఉన్న మునులకూ, ఋషులకూ అభివాదాలు చేసిన అనంతరం వాసుదేవుడు: కురువంశ శేఖరా! ఇప్పుడు నువ్వు ఈ ధర్మనందనునికి పరమధర్మాలు విశదం చెయ్యాలి, అనగా నవ్వుతూ భీష్ముడు: వాసుదేవా! పరిహాసమా ఇదీ! కాకపోతే నువ్వుండగా నేను ధర్మోపదేశం చెయ్యడమా – అన్నాడు.

పితామహా! కీర్తిని మూట గట్టుకోవాలనే కాంక్ష నాకు లేదు. సర్వధర్మాలూ నీ ముఖాన వినిపించి నీ యశోదేహం త్రిలోకాలలో విహరింపచేయాలని నా కోరిక – అన్నాడు దేవకీనందనుడు.

గురువు సమక్షంలో శిష్యుడు పాఠ ప్రవచనం చేసినట్లుంటుంది నేను నీ యెదుట మాట్లాడడం. అని మందహాసం చేశాడు మందాకినీ నందనుడు. నీ మహానుభావత్వం ఒక్కమారు నీ మనుమలూ ఇక్కడ చేరిన మిగిలిన రాజులూ తెలుసుకోవాలని నా వాంఛ అన్నాడు మురారి.

గాంగేయుడు చేయి జాపి ధర్మరాజును దగ్గరగా తీసుకొని: నాయనా! నీ సందేహాలు అడుగు, అనగా ధర్మరాజు: తాతా! మిమ్ము చూస్తుంటే ఏమి అడగాలో తెలియడం లేదు. మాకు ఏవి అవసరమో అవి మీరే చెప్పండి, అని వినయంగా తలవంచాడు.

నాయనా! రాజ్యపాలనం కత్తిమీద సాము వంటిది. నువ్వు క్షమాశీలంతో ఉంటే మావటీడు మత్తేభం మీదికెక్కి అంకుశ ప్రహారం చేసినట్లు ప్రజలు ప్రభువు మీద పెత్తనం చేస్తారు. నువ్వు మరీ క్రూరంగా ఉంటే క్రూరమృగాన్ని హింసించినట్లు హింస పెడతారు.

అందుచేత వసంతఋతువులో సూర్యునివలె చురుక్కుమనిపించి చల్లదనం ఇవ్వాలి. ఆ ఋతువులో ఎండ చురుకు తగ్గితే మళ్ళీ వానలుండవు కదా! అదీ దాని తాత్పర్యం.

గర్భవతి అయిన స్త్రీ తన లోపలి బిడ్డ ఆరోగ్యం మనసులో ఉంచి, ఆహార విహారాలు సాగించేటట్లు ప్రభువు ప్రజల కష్టసుఖాలు ఎరిగి చరించాలి. రాజ్య పాలనకూ, ధర్మ సాధనకూ అవశ్యమయిన అర్థాన్ని అతి చాకచక్యంతో ఆర్జించాలి. పులి పిల్లలను తిన్నట్లు ప్రజలను పన్నుల పేరిట ఒక్కసారి కబళించకూడదు. పశువు శరీరం మీద చేరిన జలగలా ఎప్పటి కెంత అవసరమో అంతంత గ్రహిస్తూ ఉండాలి. ఏమైనాసరే ప్రజాభిమానం కోలుపోకూడదు. సేవకగణాన్ని వంచించకూడదు. వారికి మనసు తెలియనివ్వకుండా వారి రక్షణభారం వహించాలి.

ఇంద్రియాలను నిగ్రహించాలి. పాము కుబుసం విడిచినట్లు కోరికలను విసర్జించాలి. ఆశ్రితులలో అమాత్యులలో నీ వారెవరో విద్వేషులెవరో గ్రహించాలి. నాయనా! అన్నిటినీ మించినది ఆ పరతత్త్వం. దాన్ని మనసులో ప్రతిష్ఠించుకొని మన కర్తవ్యం మనం నిర్లిప్తంగా సాగించి పరమపదం చేరడానికి ప్రయత్నించాలి - అని భీష్ముడు అనేకానేక ధర్మసూక్ష్మాలు వివరించాడు.

**శాంతిపర్వం సమాప్తం.**

**అనుశాసనికపర్వం**



ఉషోరాగాలు ఉదయాచలాన విహరించే వేళ ధర్మరాజు విధ్యుక్త కర్మలు నిర్వర్తించి వాసుదేవునితో తన సోదరులతో భీష్మ పితామహుని సమీపించి పాదాభివాదం చేసి: సర్వ ధర్మ మర్మజ్ఞా! ఎన్నెన్నో ధర్మసూక్ష్మాలు మీముఖాన విన్నాను. అయినా నా మనస్సు ఉపశాంతి పొందటం లేదు; నానా దేశాధీశులను వధించాను. ఆత్మీయులను, గురువులను, ఆప్తులను సంహరించాను. ఈ హింసాకాండ నా మనస్సును వేధిస్తున్నది. దుర్యోధనుని లోభం నాకు ఆగ్రహం

## సంప్రదాయ దుస్తులను ధరించండి!

1) తిరుమల శ్రీవారి దర్శనానికి విచ్చేయు భక్తులు తప్పనిసరిగా సరియైన వస్త్రధారణ కలిగి రావలెను.

2) సరియైన వస్త్రధారణ అనగా **పురుషులు ఫ్యాంటు, షర్టు** గాని, **లాల్చీ పైజామా** కాని, **పంచ, కండువ** గాని ధరించవలెను. **స్త్రీలు చీరలలో** గాని, **సల్వార్‌కమీజ్‌లలో** గాని రావలెను.

3) **అలాకాక ఎవరైనా నిక్కర్లతోగాని, టీ షర్టులతో గాని, బర్ముడాలతో గాని దర్శనానికై వచ్చిన యెడల అనుమతించబడరు. వీరిని 'క్యూ కాంప్లెక్స్' మొదటిలోనే దుస్తులు మార్చుకొని రావల్సిందిగా కోరడం జరుగుతుంది.**

4) **ఈ నియమం 2010, జూన్ 7వ తేదీ నుండి అమల్లోకి వచ్చింది.**

5) భక్తులు దేవస్థానం అధికారులతో సహకరించవలసిందిగా కోరుతున్నాము.

- కార్యనిర్వహణాధికారి



కలిగించింది. దానితో ఇంత ఘాతుకం సాగింది – అనగా నవ్వి ఆంబికేయుడు.

ధర్మనందనా! ఎవరి మరణానికీ ఎవడూ కర్త కాడు. వాడి కర్మ ఫలం వాణ్ణి అలా తీసుకుపోతుంది. అంతే! దాని కోసం విచారం దేనికయ్యా! దేనికైనా దైవమూ పురుషప్రయత్నమూ అని రెండు ఉంటాయి. ఇందులో దైవం – బీజం, మానవప్రయత్నం – క్షేత్రం. క్షేత్రం చవుడుదైతే బీజం ఫలించదు కదా! మరొక్కమాట, మానుషప్రయత్నమనే కర్మ జరగకుండా బీజం ఫలించదు సుమా! నేలను బాగా దున్ని పదును చేసి నీరు పెడితేనే బీజం ఫలించేది. మహామహులందరూ అనుసరించిన ధర్మపథాన నీ కర్మ నువ్వు చేస్తేనే ఫలం లభించేది.

దేన్ని మనం ఆశ్రయించుకొని ఉంటామో దాన్ని ఎప్పుడూ విడవకూడదు. వేదవేద్యుడైన పరమపురుషుని ఆరాధిస్తూ ఆయన అనుగ్రహం పొందడానికి నిరంతరం కృషి చెయ్యాలి.

**మీ కోసం ....**

## శ్రీనివాసంలో 'సప్తగిరి'

తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతిసముదాయంలో **సప్తగిరి** చందానమోదు కేంద్రం ఉన్నది.

శ్రీవారి దర్శనార్థం వచ్చు భక్తులు ఈ కేంద్రంలో అన్ని భాషల **సప్తగిరి**కి చందాలు చెల్లించవచ్చు / చందాను పునరుద్ధరించుకోవచ్చు. వేలాది మంది భక్తులకు, స్థానికులకు ఇది సౌకర్యంగా ఉంటుంది.

**ఈ సప్తగిరి చందా నమోదు కేంద్రం**
**ఉదయం 8.00 గం॥ నుండి 11.00 గం॥ వరకు**
**సాయంత్రం 4.00 గం॥ నుండి 7.00 గం॥ వరకు**
పనిచేస్తుంది.

– ప్రధాన సంపాదకుడు

ఎప్పుడూ శుచిగా ఉంటూ, నిత్యం సత్యం పలుకుతూ, సోమరి కాకుండా నిరంతర వ్యవసాయం సాగిస్తూ, విద్యాజ్ఞానం సముపార్జించి, దానధర్మాలతో అందరినీ తృప్తిపరుస్తూ, సత్కర్మలు చేసేవారి ఇంట లక్ష్మి శాశ్వతంగా ఉంటుంది.

కృతఘ్నుడూ, క్రూరుడు, నాస్తికుడూ లక్ష్మికి శత్రువులు. వీరే కాదు నిరంతరం భర్తకు ఎదురు చెపుతూ, గయ్యాళియై, ఎల్లవేళలా – ఇరుగు పొరుగు ఇళ్ళల్లో ఉంటూ, వీలు చిక్కినప్పుడల్లా చెంగు పరచి నిద్రకు వాలే ఇల్లాలున్న ఇంట్లో లక్ష్మి నిలబడదు ధర్మనందనా!

తాతా! అర్థ విషయం చెప్పారు కనుక కామ విషయం కూడా విశదం చేయండి, అని ధర్మరాజు వినయంగా ప్రశ్నించాడు.

నాయనా! కామ సేవనంలో స్త్రీకి కలిగే సుఖం పురుషుడికి ఉండదు. అయితే కామవశ చిత్తయైన స్త్రీకి యుక్తాయుక్త విచక్షణ ఉండదు. ఆ సమయంలో ఆమె చెయ్యని సాహసం ఉండదు. అందుచేతనే ఆ విషయంలో నిగ్రహం ఉన్న స్త్రీని పతివ్రతగా ఆరాధించాలి. ఇక దానం విషయం – అయినవాడూ, కానివాడూ దానానికి అర్హుడు కాడు. శ్రద్ధతో వేద విద్యనభ్యసించి, విద్యుక్త కర్మ లాచరించే ధర్మపరునికే దానం చెయ్యాలి.

వేద, పురాణ శాస్త్రపఠనం చేసినా, ఉత్తమ వంశంలో జన్మించినా ప్రయోజనం లేదు. మనిషికి అన్నిటినీ మించినది శీలం. శీలహీనుడికి ఇహపరాలలో సుఖసంతోషాలు లేవు. అలానే పతివ్రతయైన భార్యవల్ల లోకంలో పురుషుడు ఖ్యాతి పొందుతాడు.

ఇక కన్యా పాణిగ్రహణం ఉన్నదే అది అయిదు మార్గాల కనిపిస్తున్నది. అందులో కన్యయొక్క వయో రూప కులశీలాలకు తగిన విద్యాసంపన్నుని తీసుకొని వచ్చి బిడ్డను దానం చేయడం బ్రాహ్మ వివాహం.

*(ఇంకా ఉంది)*



# సందేహాలు? సమాధానాలు!!

-'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**మన్వంతరములు ఎన్ని? దాని కొలమానము ఏమిటి?**

**- కృష్ణకిశోర్, పూణే.**

☛ ఒక మనువుకు మరియొక మనువుకు ఉన్న మధ్యకాలాన్ని మన్వంతరమంటారు. మనువు కాలాన్నే 'మనుయుగ'మని కూడ అంటారు. మనువు జీవితకాలం 31,10,40,000 సంవత్సరాలు. దీన్ని 71 దివ్యయుగములుగా లెక్కించారు.

మొత్తం 14మంది మనువులు. 1)స్వాయంభువ 2)స్వారోచిష 3)ఉత్తమ 4)తామస 5)రైవత 6)చాక్షుష 7)వైవస్వత 8)సూర్యసావర్ణిక 9)దక్షసావర్ణిక 10)బ్రహ్మసావర్ణిక 11)రుద్రసావర్ణిక 12)ధర్మసావర్ణిక 13)రౌచ్య 14)భౌమ్య మనువులు.

**దేవాలయాల్లో ముందుగా ఉండే ధ్వజస్తంభం ఆవశ్యకత తెలుపండి?**

**- చిట్టూరి ఈశ్వరరావు, తిరువూరు.**

☛ ధ్వజస్తంభం ఆ స్వామి యొక్క వైభవ చిహ్నం. ప్రతి జాతికి జాతీయపతాకం ఉంటుంది. ప్రతి నృపాలకునకు ఒక చిహ్నం గల జెండా ఉంటుంది. ఇక వీరుల విషయంలో ఒక్కొక్కరికొక జెండా ఉన్నది. అర్జునుడు కపిధ్వజుడు. దుర్యోధనుడు నాగధ్వజుడు. భీష్ముడు తాళధ్వజుడు. ఆ పతాకవంటిదే ధ్వజదండం కూడా. ఆ ధ్వజస్తంభం చూడగనే అది విష్ణ్వాలయమో, శివాలయమో చెప్పగలం. విష్ణు ధ్వజస్తంభం మీద చక్రం, శివ ధ్వజస్తంభం మీద శూలం సాక్షాత్కరిస్తాయి. ఆ ధ్వజాన్ని చూచి, అందెవ్వరున్నారో నిర్ణయించవచ్చు. ఆ ధ్వజానికి నమస్కరిస్తే ఆ స్వామికి నమస్కరించినట్లే.

**'పాంచరాత్రము' అనగానేమి?**

**- యస్.నారాయణ, వెంకటాపురం.**

☛ పాంచరాత్రమనేది ఆగమం. వైష్ణవుల్లో వడగల, తెంగల సంప్రదాయజ్ఞులున్నారు. తెంగలవారు పాంచరాత్రాగమానుసారంగా స్వామివారికి బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు. మొదటి రాత్రి ధ్వజారోహణం-మృత్సంగ్రహం, రెండవనాటి రాత్రి ఎదురుకోల లేక రాయబార మహోత్సవం, మూడవనాటి రాత్రి స్వామివారి కల్యాణం, నాల్గవనాటి రాత్రి స్వామివారికి అమ్మవారికి తిరువీధీమహోత్సవం, ఐదవనాడు వసంతోత్సవం, ఆ రాత్రి ద్వాదశప్రదక్షిణలు, స్వామివారి పవళింపుసేవతో పరిసమాప్తం. దీన్ని ఒక ఆగమశాస్త్రానుసారం నిర్వహిస్తారు గనుక దానికే పాంచరాత్రాగమం, అని పేరు.

**ఆత్మ, పరమాత్మ ఒకటేనా? ఒకటైతే పరమాత్మని అంటని కర్మఫలం దేహధారియైన ఆత్మను ఏల బంధించుచున్నది? వేరువేరైనచో వాటి భేదములేమి?**

**- నాగార్జునకొండ పిచ్చయ్య, పిడుగురాళ్ళ.**

☛ పరమాత్మ పూర్ణాత్మ. ప్రతి శరీరంలోని ఆత్మలు ప్రత్యగాత్మలు. సముద్రంలో నుండి ఒక నీటి బిందువును తీసికొందాం. సముద్రానికున్న గాంభీర్యం, రంగు మొదలైనవి నీటి బిందువుకు ఉండవు కదా! ఘటాకాశ పటాకాశాదులను శంకరుదుదహరించాడు. ప్రపంచంలోని ఖాళీ ప్రదేశమంతా ఆకాశం. దానిలో గదులు కట్టాం. కుండలు పెట్టాం. కుండలోని ఖాళీ ప్రదేశాన్ని ఘటాకాశమంటాము. ఇది అనంతాకాశంలో భాగమే. అయినా అనంతాకాశానికున్న లక్షణాలన్నీ ఘటాకాశానికి రావు కదా! కుండ పగిలితే ఘటాకాశం అనంతాకాశంలో కలుస్తుంది. అనంతాకాశం పరమాత్మ, ఘటాకాశం జీవాత్మ. ఈ జీవాత్మకు కూడా కర్మఫలమంటదని వేదం చెబుతున్నది.

**ద్వాసుపర్ణా సయుజాసఖాయా-సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరేకఃపిప్పలంస్వాద్వత్తి-అనశ్నన్నన్యో అభిచాకశీతి.**

రెండు సమాన పక్షులు ఒకే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందొక పక్షి తీయని మాదీఫలాన్ని ఆస్వాదిస్తున్నది. రెండవ పక్షి ఏమీ ఫలానుభవం లేకుండా సాక్షీ



భూతమై ఉన్నది. ఇక్కడ వృక్షం మానవ శరీరం. పక్షులు పరమాత్మ, జీవాత్మ. జీవాత్మ కర్మఫల మనుభవిస్తుంటే పరమాత్మ సాక్షీభూతమై ఉన్న దని అర్థం. శ్రీకృష్ణస్వామి భగవద్గీతలో.....

**నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః**
**న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః**

శస్త్రాలు ఆత్మను ఛేదించలేవు. అగ్ని కాల్చలేదు. ఎండ ఎండించలేదు. వాయువు శోషింపచేయలేదు. అనగా ఆత్మ పదార్థానికేదీ అంటదు.

**మహావీరుడైన మారుతి శ్రీరామదర్శనంతోనే మహా భక్తుడైనాడు.పూర్వాశ్రమంలో వారికి నిజగురువు లెవరు? వారి ప్రార్థనా వివరమేంటి?**

- పసుమర్తి పద్మనాభం, నెల్లూరు.

☛ హనుమంతుని పూర్వాశ్రమగురువు సాక్షాత్తు సూర్య భగవానుడు. హనుమ ఇంద్రుని శతారఘాతంతో పడి పోయినపుడు దేవతలందరు వచ్చి అనేక వరాలిచ్చారు. హనుమంతుడు చదువు కోసం సూర్యుని కడకు వెళ్ళాడు. నా రథం వేగంగా పోతుంది. నా వేడిమిని సహించలేవు. ఎలా నేర్చుకొంటా?వని అడిగాడు సూర్యుడు. వెంటనే హనుమ తన శరీరం పెంచి, ఉదయాద్రిపై ఒక కాలు, అస్తాద్రిపై మరియొక కాలువేసి నిలుచున్నాడు. సూర్యుడు మెచ్చి విద్యాబోధనకుపక్రమించాడు. సూర్యుని ముందు నడుస్తూ సమస్త శాస్త్రాలు, వేదాలు పరిపూర్ణంగా అభ్య సించాడు. సంగీతంలో మహాపాండిత్యాన్ని సంపాదించి, ఎన్నో సంగీత గ్రంథాలు రచించాడు.

**వశిష్ఠ మహర్షి, విశ్వామిత్ర మహర్షి, గౌతమ మహర్షి, భరద్వాజ మహర్షి యిత్యాది మహర్షు లెందరో కృత త్రేత ద్వాపర యుగాల్లో కనిపిస్తున్నారు. ఆయుష్షు పరిమాణం వర్తించదా? మహర్షులు కొం దరు యుగయుగాల్లో కనిపించటానికి కారణమేమి?**

- స్వామినేని ప్రకాశరావు, ఖమ్మం.

☛ వసిష్ఠ, విశ్వామిత్ర, గౌతమ, భరద్వాజేత్యాది మహ ర్షులు నాలుగు యుగాల్లో ఉంటారు. వారు తపశ్శక్తి చేత ఆయుః ప్రమాణాన్ని పెంపొందించుకుంటారు. వాయు నిరోధం కూడా పెంచుకుని ఆయుఃప్రమాణ మెప్పటి కప్పుడు పెంచుకుంటారు. యోగం కూడా దాని కనుకూల్యం.

ఇందులో వసిష్ఠ విశ్వామిత్రాదులు వ్యక్తులు కారు. వారి పేరుల మీద ఏర్పడిన పీఠాలు. శంకరపీఠం ఎవరెప్పుడధిరోహించినా ఆయనను శంకరుడే అంటారు. అలాగే వ్యాసపీఠం. బిల్వమంగళ పీఠం. ఆ పీఠానికి అధిపతులుగా వచ్చిన వారందరు, మూలపురుషుని పేర్లతోనే పిలువబడతారు.

**హనుమంతుడే శివుడనుటలో ప్రామాణికం ఏముంది?**

- వాస్తు రమచంద్ర, నెల్లూరు.

☛ అంజనాదేవిని కామించి వాయువామె వలువలు కదిలించినట్లు ఆమె నిరాకరింపగా ఉత్తమ సంతానోత్పత్తి కలుగుతుందని ఆమెను ఒప్పించి, తనయందున్న శివతేజస్సు నామెగర్భంలో ప్రవేశింపచేసినట్లు రామా యణంలో ఉన్నది (ఉత్తరరామాయణం). కంకంటి పాపరాజు, "సాక్షాచ్ఛంభుడు కాకయున్నకలవే చర్చింప నీ స్థైర్య ధైర్యక్షాంతిప్రతిభాప్రభావములని" స్పష్టంగా చెప్పాడు.

**అంగిరస మహాముని పుత్రుడు బృహస్పతి అంటారు. నవగ్రహాల్లో ఉన్న బృహస్పతి వీరు ఒక్క రేనా? వారి పదిమంది సహోదరులు దైవదేవత గ్రహ స్వరూపులై ఉన్నారా?**

- వి.బాపిరాజు, సికింద్రాబాద్.

☛ అంగిరసుని కుమారుడు బృహస్పతి, నవగ్రహాల్లోని బృహస్పతి ఒక్కరే. అంగిరసుని భార్య శివ. ఆ దంపతు లకు 1) బృహత్కీర్తి 2) బృహజ్జ్యోతి 3) బ్రహ్మద్బ్రహ్మ 4) బృహన్మనసుడు 5) బృహస్పతి 6) సంవర్తకుడు 7) ఉతథ్యుడు 8) అంగిరసుడు 9) బృహన్మంతుడు 10) బృహద్భానుడను కుమారులు కలిగిరి.

వీరుకాక 8 మంది పుత్రికలుగా జన్మించారు. బృహస్పతి సోదరులందరు మహర్షి పదమలంకరించిన వారే.

తెలుగు సాహితీ సరస్వతికి పదకవితా పట్టాభిషేకం చేసి, సంగీత సాహిత్యాలను సమపాళ్ళలో రంగరించి ప్రతినిత్యం శ్రీహరి చరణారవిందాలకొక పదాన్ని సమర్పించి 32 వేల పదసుమాలతో అర్చన చేసి తరించిన ధన్యజీవి, తొలి తెలుగు వాగ్గేయకారుడు అన్నమయ్య.

పండిత లోకానికే పరిమితమైన పద్యకవితకు దీటుగా, పామరజనరంజకమైన పదసాహిత్యానికి శ్రీకారం చుట్టి, జానపద గేయరీతుల్ని స్వీకరించి, పరమాత్మ తత్త్వాన్ని వివరించి, మానవులు చేయవలసిన సత్కార్యాల్ని, భక్తి, ఆధ్యాత్మిక ప్రబోధాల్ని, తన సంకీర్తనల ద్వారా మానవాళికి చాటిచెప్పిన మహనీయుడు అన్నమయ్య. ఈ విధంగా పండిత పామరులను పరవశింప చేసిన పదకవిత 15 వ శతాబ్దానికొక ప్రత్యేకతను సంతరించి పెట్టింది.

అన్నమయ్య రచించిన 32 వేల సంకీర్తనలు ఆధ్యాత్మిక, శృంగార పదాలుగా ప్రశస్తి పొందినవైనప్పటికీ, ఆయన పదాలు అనంతమైన వైవిధ్యంతో కూడుకున్నవిగా చెప్పవచ్చు.

ఆయన సంకీర్తనల్లో ముఖ్యంగా తుమ్మెద పదాలు, జాజరలు, లాలిపాటలు, దంపుడు పాటలు, తందనాలు, పండుగలకు సంబంధించిన పాటలు, నలుగులు, హారతులు మొదలగునవి ఎన్నో సంకీర్తనలు ప్రసిద్ధిపొందాయి. ఇందులో కొన్ని జానపద ప్రసిద్ధాలైతే, మరికొన్ని సంప్రదాయసిద్ధమైనవి.

అన్నమయ్య సంకీర్తనల్లో సంగీత సాహిత్యాలు రెండూ భగవత్కృపాకారకాలై భక్తిలో పరవశించటమన్నది అద్భుతమైన విషయం. శ్రీ వేంకటేశ్వరస్వామికి ప్రతియేటా జరిగే ఉత్సవాలు నిత్యకల్యాణోత్సవం పండుగల సందర్భాలలో భక్తిభావ పరవశుడై రచించిన సంకీర్తనలొకవైపు మెండైన వైష్ణవభక్తిని మరోవైపు తెలుగు వారి అచ్చమైన జీవితాన్ని ప్రతిబింబించేటటు వంటి కీర్తనలుగా మనం గుర్తించచ్చు.

శృంగార, ఆధ్యాత్మ కీర్తనల్లో కూడా, స్త్రీ పురుషులకు సంబంధించిన సంవాద గీతాలు, బృందగానాలు, యుగళగీతాలతోపాటు రోకటిపాటలు, నోముల పాటలు, స్త్రీల కయ్యాలకు, వాదోపవాదాలకు సంబంధించిన పాటలు, విరహ గీతాలు, ఎరుకల పాటలు కోకొల్లలుగా కనిపిస్తాయి. అయినా వాటన్నింటిలోను అంతర్లీనంగా సాగే అంశం మాత్రం శ్రీ వేంకటేశ్వరుని లీలా విలాసమే.



ఈ విధంగా అక్షరార్చన చేసి కీర్తించిన అన్నమయ్య నవవిధ భక్తిమార్గాలలో స్వామిని సేవిస్తూ ఒక్కోసారి తానే నాయికగా, అలమేలుమంగగా, భగవంతుని అనురక్తిని సాధించాడు. ఈ శృంగార సంకీర్తనలన్నీ భక్తి భావ సమ్మిళితమైనట్టివే.




సర్వస్వాన్ని భగవదర్పణ చేసి, ఆదిత్య తత్త్వంలో లీనం కావడానికి సులభ సాధనం "భక్తి" మార్గమని, అందునా పరమోత్కృష్టమైనది సంకీర్తనమని **"చాలదా బ్రహ్మమిదె సంకీర్తనం మీకుజాలెల్ల నరసించు సంకీర్తనం"** అంటూ సంకీర్తనా మాహాత్మ్యాన్ని అన్నమయ్య చాటి చెప్పాడు.

అన్నమయ్య కేవలం శ్రీ వేంకటేశ్వరస్వామినే కాకుండా తాను దర్శించి, సేవించిన అనేక పుణ్యక్షేత్రాల్లో వెలసిన ఇతర దేవతలను కూడా స్తుతిస్తూ ఎన్నో సంకీర్తనలను రచించారు. అందులో నృసింహ సంకీర్తనలు, హనుమత్సంకీర్తనలు, విష్వక్సేన, దత్తాత్రేయ, విఠల, శ్రీరామ, శ్రీరంగనాథ, చెన్నకేశవ, శ్రీకృష్ణ సంకీర్తనలు ఎంతో ప్రసిద్ధిని పొందాయి.

శ్రీకృష్ణ సంకీర్తనలను పరిశీలిస్తే అన్నమయ్య దాదాపు 200లకు పైనే శ్రీకృష్ణునికి సంబంధించిన



సంకీర్తనలను రచించినట్టు తెలుస్తున్నది. ఇందులో శ్రీకృష్ణుని జననం మొదలుకొని రేపల్లెలో జరిగిన విశేషాలు, యశోదవాత్సల్యం, చిన్నికృష్ణుని చిలిపిచేష్టలు, లీలలు మొదలుకొని ఎన్నో అంశాలు సంకీర్తనల్లో చోటు చేసుకున్నాయి.

శ్రీకృష్ణ సంకీర్తనల రచనకు కారణాల్ని పరిశీలిస్తే, కర్ణాటక రాష్ట్రంలో ప్రాశస్త్యం వహించిన విఠల భక్తి, ఉత్తర భారతంలో రాధాకృష్ణుల ప్రేమ, కర్ణాటకాంధ్ర ప్రాంతాల్లో వెలసిన చెన్నకేశవస్వామికి సంబంధించిన భక్తి అన్నమయ్యను ప్రభావితం చేసి ఉండవచ్చు.

అలాగే దక్షిణ భారతదేశంలోని ఆళ్వారుల భక్తి, గోదాదేవి పాశురాలు, భగవద్గీత, పోతన భాగవతం కూడా వైష్ణవ మతాన్నభిమానించే అన్నమయ్య దృష్టిని ఆకర్షించి ఉండవచ్చని భావించటానికి అవకాశమున్నది.

శ్రీకృష్ణుని సంపూర్ణావతారంగా చిత్రించిన అన్నమయ్య పురాణాంశాలను ప్రధానంగా చేసుకొని, పూతన, శకటాసుర, తృణావర్త సంహారాల్ని, కాళీయమర్దనం, గోవర్ధనగిరినెత్తటం, కంసాది రాక్షసవధ మొదలగు ఘట్టాలను సంకీర్తనా రూపంలో స్తుతిపూర్వకంగా వర్ణించాడు.

అంతేకాక శ్రీకృష్ణునికి సంబంధించిన అనేకాంశాల్ని జానపద రీతిలో పొందుపరచి, సామాన్య ప్రజానీకానికి పాడుకోవటానికి అనువైన విధంగా సంకీర్తనా రచన చేశారు. ఇందులో జోలపాటలు, ఉగ్గుపాటలు, కూగూగు, సువ్వి మొదలగు వాటిని పేర్కొనవచ్చు.

వేదవాఙ్మయంలో, భారత భాగవతాల్లో, ప్రబంధాల్లో, శ్రీకృష్ణుని గురించి, ఆయన దివ్యలీలల గురించిన ప్రస్తావన ఉన్నది. కృష్ణ శబ్దాన్ని గురించి గీతాభాష్యకారుడు "భక్త జన పాపాది దోషాపకర్షణాత్ కృష్ణః"– అని పేర్కొన్నాడు. "సచ్చిదానందాత్మకుడు కృష్ణు"డని వ్యాస వచనం.

వరాహ భవిష్యోత్తరపురాణాల్లో కూడా భగవంతునికి "కృష్ణ" సంజ్ఞ ఎలా వచ్చిందో చెప్పబడింది.

"కృష్" అంటే అపరిమితమని, 'ణ' అంటే ఆనందమని, అపరిమితమైన ఆనందమే బ్రహ్మస్వరూపమని చెప్పబడింది.

అన్నమయ్య శరణాగతి, మధుర, వాత్సల్యాది ప్రపత్తి మార్గాలను సంకీర్తనల్లో ప్రతిపాదించి కలియుగంలో భగవంతుని సేవించటానికి యజ్ఞయాగాదుల వసరం లేదని, కేవలం త్రికరణశుద్ధిగా నవవిధభక్తి మార్గాలననుసరించి భగవన్నామ సంకీర్తన చేస్తే చాలని, సమాజంలోని జిజ్ఞాసువులకు, దీనులకు, అందరికీ అందుబాటులో ఉండేలా జనసామాన్యభాషలో సంకీర్తనా రచనచేసి అఖండమైన వాఙ్మయసంపదను అందించాడు.

సంస్కృతంలో తప్ప తెలుగులో రాస్తే అది కవితే కాదనుకునే రోజుల్లో ప్రజల భాషలో, మాత్రా ఛందస్సులో రచనలు చేసి పదకవితా పితామహుడయ్యాడు అన్నమయ్య. అంతేకాక సంస్కృతంలో కూడా సంకీర్తనా రచన చేసి తన పాండిత్యాన్ని, సామర్థ్యాన్ని చాటుకున్నారు.

కృష్ణావతారంలో గొప్ప వైశిష్ట్యమున్నది. అరిషడ్వర్గాలను మోక్షమార్గాలుగా చేసినవాడు కృష్ణుడు మాత్రమే. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను మార్గాలుగా చేసుకుని శ్రీకృష్ణుని చేరి మోక్షాన్ని పొందటం భాగవత కథలలో చెప్పబడింది. అరిషడ్వర్గాలకు కృష్ణుని ఆలంబనగా చేసుకుంటే తప్పక మోక్షప్రాప్తి కలుగుతుందని భాగవతం స్పష్టంగా చెబుతుంది. ఈ భావనపట్ల అపారమైన విశ్వాసాన్ని కలిగిన అన్నమయ్య శ్రీమద్భాగవత, విష్ణుపురాణాదులలోని గోపికా భక్తికి ఆకర్షితుడయ్యాడు.

గోపికలు భగవంతుడైన శ్రీకృష్ణుని ఆత్మేశ్వరునిగా భావించి మధుర భక్తితో తరించినవైనాన్ని, జగన్నాయకుడైన శ్రీకృష్ణుని తల్లిగా లాలించి పాలించిన యశోద వాత్సల్యభక్తిని, అనేక రకాల సంకీర్తనల్లో వివరించారు.

**నీలవర్ణుని కథలకు నివ్వెరనొందవలె**

**ఆలకించియందు భ్రమయగవలెను**



**తొలిమితో మహిమలు దలవోసుకొనవలె**

**వేళవేళ ధ్యానించి వెదకవలె...**

– అంటూ కృష్ణునికి సంబంధించిన కథలను గురించి వివరిస్తారు అన్నమయ్య. అలాగే

**కొలని దోపరికి గొబ్బిళ్ళో**

**యదుకుల స్వామికిని గొబ్బిళ్ళో**

**కొండగొడుగుగా గోవుల కాచిన**

**కొండొక శిశువుకు గొబ్బిళ్ళో ...**

– అంటూ శ్రీకృష్ణుని నాయకునిగా గోపికలాల పించిన కీర్తనలో శ్రీకృష్ణుని లీలలు, గోవర్ధగిరినెత్తడం మొదలుగా కంసాది రాక్షస సంహారం, శిశుపాలవధ మొదలగు విషయాలన్నీ సంస్మరింపబడింది.

శ్రీ మహావిష్ణువు దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థమై ధరించిన అనేక అవతారాలకన్నా శ్రీకృష్ణావతారానికి ప్రత్యేకత ఉన్నది. ఒకవైపు దుష్టులను శిక్షిస్తూనే రేపల్లెలో సామాన్యుడిలా అందరితో కలిసి జీవనం కొనసాగిస్తూ వారిని భవసాగరం నుండి తరింపచేశాడు.

బ్రహ్మాండాన్ని తన గర్భంలో ఇముడ్చుకున్న పరంధాముడు భూలోకంలో ఒక సామాన్య స్త్రీ గర్భంలో శిశువుగా పుట్టాడని వర్ణిస్తాడు అన్నమయ్య.

**సతులాల చూడరే శ్రావణ బహుళాష్టమి**

**కతలాయ, నడురేయి కలిగె శ్రీ కృష్ణుడు**

**పుట్టేయపుడే చతుర్భుజాలు శంఖుచక్రాలు**

**ఎట్టు ధరించెనే ఈ కృష్ణుడు**

**అట్టే కిరీటము ఆభరణాలు ధరించి**

**ఎట్టయెదుట వున్నాడు ఈ కృష్ణుడు॥**

– అంటూ వర్ణించిన అన్నమయ్య ఆ పసివాని ఎదుట బ్రహ్మాది దేవతలు కైమోడ్చి స్తుతిస్తూ ఉన్నారనటం ఆ శిశువు సామాన్యుడు కాడని తెలియజేస్తోంది.

ఆ విధంగా వర్ణించిన అన్నమయ్య శ్రీకృష్ణుడు యశోద ముంగిట ముత్యంలా మెరసిపోతున్నాడని కీర్తిస్తూ..

**ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు**

**తిద్దరాని మహిమల దేవకీ సుతుడు**

–అన్న కీర్తనలో నవరత్నాలతో సామ్యం చెబుతూ ఆ దేవదేవుని లీలలను వివరిస్తాడు. అంతేకాక –

**ఉగ్గువెట్టరే వోయమ్మాచె**

**య్యొగ్గీనిదె శిశువోయమ్మా...**

– అంటూ ఉగ్గుపాట పాడుతాడు. యశోదగా మారిన అన్నమయ్య –

**కడుపులో లోకమ్ములు కదలనీ**

**ఒడలూచకురే ఓయమ్మా**

**తొడిగెడి నరగున తొలగదీయరే**

**వుడికెడి పాలివి ఓయమ్మా॥**

– "బొజ్జనిండా పాలు తాగిన బిడ్డని ఎక్కువగా ఊపవద్దని, కడుపులోని లోకాలు కదలిపోతాయి జాగ్రత్త"... అంటూ – ఆ గోపికల్ని హెచ్చరిస్తూ, సామాన్య బాలుని గురించి జాగ్రత్తలు చెప్పినట్టు వేడి పాలున్నాయి, పక్కకు తొలగండని కంగారు పడతాడు.

అంతేకాక..... **"జో అచ్యుతానంద జోజో ముకుందా రావెపరమానంద రామగోవిందా..."** అంటూ జోలపాడి బాలుని నిద్ర పుచ్చుతాడు. అతన్ని పడుకో బెట్టిన ఉయ్యాలను వర్ణిస్తూ

**అలరచంచలమైన ఆత్మలందుండ నీ**

**యలవాటు సేసెనే ఉయ్యాల**

**పలుమారు ఉచ్ఛ్వాస**

**పవనమందుండనీ భావంబు తెలిసెనీ ఉయ్యాల**

అంటూ కీర్తిస్తాడు. పరంధాముడు పవళించిన ఉయ్యాల వైశిష్ట్యాన్ని గురించి చెబుతూ "ఉదయాస్తమా లను శైలకం బాలుగా, ఆకాశం అద్దదూలంగా, నాలుగు వేదాలు బంగారు చేరులుకాగా, ధర్మదేవత పీఠమైందని, అలాంటి ఉయ్యాలలో భగవంతుని భామినులూపుతున్నా రని వర్ణిస్తాడు. ఇదొక అద్భుతమైన వర్ణన. అలాంటి శిశువును

**చిన్నిశిశువు - చిన్ని శిశువు**

**ఎన్నడూ చూడమమ్మ ఇటువంటి శిశువు**

– అంటూ కొనియాడుతాడు.



**వెఱపించబోయి తానె వెఱచె దల్లి యశోద**
**మఱచి ఈ బాలునెట్టు మానిసంటా నుండెనో**

– అన్న కీర్తనలో వాత్సల్య, మోహపరవశయైన యశోద చిన్నికృష్ణుని లీలల్ని ఎన్నిసార్లు చూచినప్పటికీ, తనబిడ్డ ఏమీ తెలియని అమాయకుడనే భావనలోనే ఉంటుంది.

సామాన్యస్త్రీలా కృష్ణుని భయపెట్టి అన్నం తినిపించాలని బెదరిస్తూ చందమామకు బువ్వ పెట్టేస్తా నంటుంది. చిలిపికృష్ణుని కనుసైగతో చంద్రుడు వారి సమక్షంలో వాలిపోతాడు. యశోద దిగ్భ్రాంతికి లోనవు తుంది. ఈ విధంగా అమాయకురాలైన తల్లిని బాల కృష్ణుడు ఆటపట్టిస్తాడు.

శ్రీకృష్ణుని పట్ల యశోద భావాన్ని పురందర దాసు కూడా –

**జగదోద్ధారన ఆడిసిదళెశోదె**
**జగదోద్ధారన మగనెందు తిళియుత**
**సుగుణాంత రంగన ఆడిసిదళెశోద**

– అంటూ కీర్తిస్తాడు. ఇంతటి మహిమాన్వితు డైన శ్రీకృష్ణుని అన్నమయ్య ...



**అందరికాధారమైన ఆదిపురుషుడీతడు**
**విందైమున్నారగించె విదురుని కడనీతడు**
**సిరులొసగి యశోద యింట శిశువైనతడీతడు**
**ధరనావుల మందలలో తగ జరించెనీతడు**
**సరసత గొల్లెతలకుం జనవులొసగె నీతడు**
**అరసి కుచేలుని యటుకు లారగించె నీతడు**

– అంటూ వర్ణిస్తాడు. అన్నమయ్య గోపికా కృష్ణుల రాసలీలల్ని వర్ణిస్తూ "ఒక్క సతినడుమ నొక్కొక్క రూపుగైకొని యెక్కువైతి కృష్ణా నిన్నెట్లా నమ్మేదిరా" అన్న సంకీర్తనలో –

**మాటలాడే వొకతెతో - మళ్ళిచూచే వొకతెను**
**వోట లేక నవ్వునవ్వే వొకతె తోను॥**
**కన్నుగీటె వొకతెకు - కౌగిలించె వొకతెతోను**
**వెన్న దిన్న మోవిచ్చేవు - గౌగిలించే వొకతెను**
**వున్నతి రాసక్రీడ - లున్నారమిందరము**
**ఇన్నిటిలో నీవలపు - యెందని నమ్మేదిరా...**

అంటూ పదహారువేలమంది గోపికలతో ఒకే సమయంలో ఎవరినీ నిరాశపరచకుండా వారి వారి భావనలకనుకూలంగా మసలుతున్న కృష్ణుని ఎలా నమ్మేది అని గోపికలచేత అనిపిస్తాడు. కాని

**ఆడు జన్మమేమేలు అందరికిని**
**పోడిమితోనీ వంటి పురుషుడుండగను**

– అంటూ వారినమ్మకాన్ని తెలియజేస్తాడు.

భక్తమీరాబాయిలా జగత్తులోని జీవులంతా స్త్రీలని, శ్రీకృష్ణుడొక్కడే పురుషుడనే భావనని ఈ కీర్తనలో సూచిస్తూ విభిన్న రూపాల్లో ఆ అవతారమూర్తిని కీర్తిం చాడు. అన్నమయ్య ఏ మాటైనా, ఏ పదమైనా శ్రీకృష్ణభక్తి తత్త్వాన్ని చాటేవిధంగా సంకీర్తనా రచన చేసి తరించాడు.

అన్నమయ్య సంస్కృతసంకీర్తనా రచనకు ఆనాటి సమకాలికులు, పూర్వుల ప్రభావం కారణం కావచ్చు. సంస్కృతంలో ప్రథమ వాగ్గేయకారుడు, సంస్కృతగీత కావ్యాల్లో ప్రముఖుడైన గీతగోవిందకర్త జయదేవుని ప్రభావం, లీలాశుకుని ప్రభావం, అలాగే భాగవతంలోని గోపికా భ్రమర గీతాల ప్రభావం అన్న మయ్య సంస్కృత సంకీర్తనా రచనకు ప్రేరకంగా చెప్ప

వచ్చు. దాదాపుగా 100కు పైగా సంస్కృత సంకీర్తనల్ని రచించిన అన్నమయ్య ఆధ్యాత్మిక, అవతార, తాత్త్విక స్తుతి సంకీర్తనలనెన్నిటినో రచించాడు. వీటిల్లో శృంగార సంకీర్తనల్లో ప్రధానాంశం మధురభక్తి, ఆధ్యాత్మ సంకీర్తనల్లో దశావతార, నృసింహ సంకీర్తనలు ప్రసిద్ధమైనట్టివి.

1) దశవిధాచరణం తన్న భవతి
 దశవిధావస్థా తే తత్ర..... (3-440)
 అనే కీర్తనలో దశావతార వర్ణన చేశాడు.

2) జలధిబంధన జలధిశయన.... (7-152)

3) నవనీత చోర నమో నమో
 నవమహిమార్ణవ నమో నమో....(8-24)

4) ముకుంద కేశవ మురహర
 సకలాధిప పరమేశ్వర....(11-66)

అనే కీర్తనల్లో శ్రీకృష్ణుని బాల్యక్రీడల్ని వర్ణించాడు. అంతేకాక -

**దశవిధాచరణం తన్న భవతి**
**దశవిధావస్థా తే తత్ర**
**స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన**
**దీపితోऽహం మత్స్యదేహ పురా (శృ.సం.3-440)**

అనే కీర్తనలో భగవంతుని దశావతార రహస్యాన్ని 11 చరణాల్లో తెలియజేశారు. ఇక్కడ గీతగోవిందకర్తలా అన్నమయ్య వేదోద్ధరణ కథాగానం చేశాడు. అదే విధంగా

**సకలం హే సఖి జానామి తత్**
**ప్రకట విలాసం పరం దధసే**
**అలీక మృగమదమయ మషీ**
**కలనోజ్జ్వలతాం హేసఖి జానామి. (12-20)**

అన్న 3 చరణాల సంకీర్తనలో కూడా జయదేవుననుసరించి రాధను నాయికగా వర్ణించిన తీరు కనిపిస్తుంది. అంతే కాకుండా

**రాధా మాధవ రతిచరితమితి**
**బోధావహం శ్రుతి భూషణం**
**గహనే ద్వావపి గత్వా గత్వా**
**రహసి రతిం ప్రేరయతి...**



- అంటూ సాగే 8 చరణాల ఈ కీర్తన మధుర భక్తి స్ఫోరకమై రాధా మాధవుల శృంగార వర్ణన కీర్తించబడింది.

**భావయామి గోపాలబాలం మన**
**స్సేవితం తత్పదం చిన్తయేయం సదా... (5-79)**

రెండు చరణాలతో కూడిన ఈ సంకీర్తనలో శిశురూపంగా శ్రీకృష్ణుని భావించిన అన్నమయ్య కృష్ణుని బాల్యక్రీడల్ని గో సంరక్షణను అత్యద్భుతంగా చిత్రించారు. అదే విధంగా -

**నమో నారాయణాయ**
**నారాయణాయ సగుణబ్రహ్మణే సర్వ**
**పారాయణాయ శోభనమూర్తయే నమో (5-172)**

- అంటూ 5 చరణాల్లో సాగే ఈ కీర్తనలో సర్వగుణ భూషితుడైన వాసుదేవుని "నమో నారాయణ" అంటూ ప్రస్తుతించాడు.

***"నామస్మరణాదన్యోపాయం న హి, పశ్యామో భవతరణే"***- అన్న కులశేఖరాళ్వారుల రీతిగా అన్నమయ్య కూడా

**మాధవ కేశవ మధుసూదన విష్ణు**
**శ్రీధర పదనఖం చింతయామో వయమ్**
**వామన గోవింద వాసుదేవ ప్రద్యుమ్న**
**రామ రామ కృష్ణ నారాయణాచ్యుత.... (11-35)**

అంటూ భక్తులకు భగవంతుని నామకీర్తనం చాలని ప్రవచించిన అన్నమయ్య తెలుగులోనే కాక సంస్కృత సంకీర్తనల ద్వారా భక్తిరసాన్ని లోకానికందజేశారు.

ఈ విధంగా భాగవతం, నారదభక్తి సూత్రాలు వివరించిన నవవిధ భక్తి మార్గాలను, సర్వవేదాంతసార తత్త్వాన్ని రాగభరితంగా కీర్తించి, జీవాత్మ పరమాత్మల మధ్య ఉన్న ఉపనిషద్రహస్యాన్ని తెలియజేసే అపురూపమైన సాహిత్యాన్ని సంకీర్తనా సామవేదసంహితగా సంకీర్తనలనందించి ధన్యతనొందాడు అన్నమయ్య.



శ్రీ వేంకటేశ్వరుడు సత్యజ్ఞానానంత స్వరూపుడు. చిదానంద స్వరూపుడు. కనుకనే ఇతడు వేదాంత వేద్యుడయ్యాడు. ఈ పరబ్రహ్మమైన వేంకటేశుడు ఉత్పాద్య, వికార్య, ప్రాప్య, సంస్కార్య రూపాలైన నాలుగు రకాలైన కర్మాంగ ద్రవ్యాలకంటే విలక్షణుడు. కాబట్టే ఇతడు అజుడు, నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడు. వేంకటేశ్వర పరబ్రహ్మం ఆకాశం వలే సర్వగతుడవడం వల్ల ఆప్యుడు కాడు. అద్వితీయుడు, అఖండుడు, నిరవయవుడు, స్వయంప్రకాశుడు, అసంగుడు, చిన్మాత్రుడు, సర్వవికల్ప శూన్యుడు, నిర్గుణుడు, నిష్క్రియుడు, నిత్యుడు, అప్రమేయుడు అని అనంతనామాలతో పిలువబడుతున్నాడు. ఈతడొక్కడే సత్పదార్థం.

# అన్నమయ్య వర్ణించిన బ్రహ్మోత్సవాలు

- డా॥ వి.పళని

నిత్యోత్సవ శ్రీమన్తుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారికత్యన్త ప్రియమైనవి బ్రహ్మోత్సవాలు. సాక్షాత్తు సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు నిర్వహించినవే బ్రహ్మోత్సవాలు. ఈ ఉత్సవాలు శ్రీనివాసుని వైభవ విలాసాలు, దివ్యానంద దాయకాలు. బ్రహ్మోత్సవాల వైభవాన్ని, వాహన సేవల వైశిష్ట్యాన్ని తన సంకీర్తనల్లో అన్నమయ్య మధురంగా కీర్తించాడు.

శ్రీరాముని హనుమంతునిలాగా, శ్రీకృష్ణునికి అర్జునునిలాగా, శ్రీ వేంకటేశ్వరునికి అన్నమయ్య అత్యంత ప్రీతిపాత్రుడు. ఇది నరనారాయణుల సంబంధం. అకుంఠిత భక్తితో, అప్రతిహతార్తితో పెనవేసుకున్న అనుబంధం. శ్రీనివాసుణ్ణి ముప్పైరెండువేల సంకీర్తనల్లో కొలచిన అన్నమయ్య సారస్వతభక్తి అనుపమానం. ఈ మహాభక్తుడు తనకు కల్గిన ఆధ్యాత్మిక దివ్యానుభూతులను సంకీర్తనల్లో చెవులకింపుగా వర్ణించాడు.

శ్రీవారి బ్రహ్మోత్సవాల్లో వాహనసేవల సంరంభం అంతా ఇంతా కాదు. వాహనారూఢుడైన శ్రీ వేంకటనాథుడు చిద్విలాసంగా దర్శనమిస్తూ భక్తులకు కనువిందు చేస్తాడు. ఆ యా వాహనాల్లో స్వామివారి వైభవాన్ని చూసి తీరాల్సిందే.

**తిరువీథుల మెరసీ దేవదేవుడు**
**గరిమల మించిన సింగారములతోడను (7-122)**

అలమేల్మంగ, లక్ష్మీసమేత శ్రీనివాసుని తేజోవైభవాన్ని వర్ణించ శక్యంకాదు. అలాంటి స్వామివారు అన్నమయ్య కాలం బ్రహ్మోత్సవాల్లో మొదట తిరుదండెలపై తిరువీథికి వచ్చేవాడట. రెండోరోజు శేషునిపై, మూడో రోజు ముత్యాలపందిరిలో, నాల్గవరోజు పుష్పపల్లకీలోనూ, ఐదవరోజు గరుడునిపై, ఆరోరోజు గజ వాహనంపై, ఏడోరోజు సూర్యప్రభవాహనంలోనూ, ఎనిమిదవ రోజు రథ, అశ్వవాహనాలపై, తొమ్మిదోరోజు బంగారు పల్లకీపై ఆసీనుడై తిరువీథులకు విచ్చేసి అక్కడున్న భక్తకోటిని అనుగ్రహించేవాడట. ఇక పదోరోజు అత్యంత శోభాయమానంగా శ్రీవారి కల్యాణం జరిగేది. స్వామివారి కల్యాణంతో ఆనాటి ఉత్సవాలు పరిసమాప్తమయ్యేవి. అన్నమయ్య కాలంలో పై విధంగా బ్రహ్మోత్సవాలు జరుగుతూ ఉండేవి. ఈ సంకీర్తనలో ఎనిమిదోరోజు తప్ప మిగతా రోజుల్లో ప్రతిరోజూ ఒక వాహనసేవ గూర్చే వర్ణింపబడింది. ఎనిమిదవ రోజు నేటివలే ఆ రోజుల్లో కూడా "రథ, అశ్వవాహన సేవలు" జరుగుతూ ఉండేవి. ప్రస్తుతం మాత్రం రెండు సేవలు జరుగుతూ వస్తున్నాయి.

తిరువీథుల విహారానికి తొలిరోజున తిరుదండెలపై ఏతెంచిన శేషశాయి, శేషాచలనివాసి అయిన శ్రీనివాసుడు రెండోరోజు ఆదిశేషునిపై విహరిస్తాడు. మరి ఈ శేషుడెలాంటివాడు? దీనికి అన్నమయ్య సమాధానం చెప్పాడు.

**వీడుగదే శేషుఁడు శ్రీవేంకటాద్రిశేషుఁడు**
**వేడుక గరుడనితోఁ బెన్నుద్దైన శేషుఁడు**

**వేయివడిగలెతోడ వెలసిన శేషుఁడు**
**చాయమేనితళుకువ జాలశేషుఁడు**
**మాయనిశిరసులపై మాణికాల శేషుఁడు**
**యేయెడ హరికి నీడై యేఁ గేటి శేషుఁడు**

**పట్టపువాహనమైన బంగారు శేషుఁడు**
**చుట్టుచుట్టుకొనినమించులశేషుఁడు**
**నట్టుకొన్న రెండువేలునాలుకల శేషుఁడు**
**నెట్టన హరిఁబొగడ నేరుపరి శేషుఁడు**

**కదిసి పనులకెల్లఁ గాచుకున్న శేషుఁడు**
**మొదల దేవతలెల్లా మొక్కే శేషుఁడు**
**అదె శ్రీ వేంకటపతి కలమేలు మంగకును**
**పదరక యేపొద్దూ పానుపైన శేషుఁడు (3-365)**

మనోహరంగా ఊర్ధ్వపుండ్రాలను ధరించిన గజాలు, వినూత్నమైన అలంకారాలతో అలంకృతమైన అశ్వాలు, రమణీయమైన మూపురాలతో ఒప్పారే వృషభాలు మొదలైన లాంఛనాలతో తిరుమాడ వీథులు విహరించే శ్రీనివాసుడు - మూడోరోజు ముత్యాల పందిరిపై, నాలుగోరోజు పుష్పపల్లకీపై విహరించి, ఐదోరోజు గరుడవాహనంపై భక్తులను అనుగ్రహించ డానికి బయలుదేరుతాడు.

శ్రీవారి తిరువీథి విహారాల్లో గరుడోత్సవం అత్యంత విశిష్టమైనది. స్వామివారి గరుడవాహన విహారాన్ని అన్నమయ్య కన్నులపండువుగా వర్ణించాడు.

**ఇటు గరుడని నీ వెక్కినను**
**పటపట దిక్కులు బగ్గనఁ బగిలె**

**ఎగసిన గరుడని యేపున 'ధా' యని**
**జిగిదొలఁక చబుకు చేసినను**
**నిగమాంతంబులు నిగమసంఘములు**
**గగనము జగములు గడగడ వడఁకె**

**బిరుసుగ గరుడని పేరెము దోలుచు**
**బెరసి నీవు గోపించినను**
**సరుస నఖిలములు జర్జరితములై**
**తిరుపున నలుగడ దిరదిరఁ దిరిగె**

**పల్లించిన నీపసిఁడి గరుడనిని**
**కెల్లున నీ వెక్కినయపుడు**
**ఝల్లనె రాక్షస సమితి నీమహిమ**
**వెల్లి మునుఁగుదురు వేంకటరమణా ॥ (1-92)**



దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థమై శ్రీనివాసుడు గరుడ వాహనంపై అధిరోహించిన ఘట్టాన్ని ఈ పాటలో అన్నమయ్య ఇలా వర్ణించాడు. "స్వామీ! వేంకటరమణా! నీవు గరుడుణ్ణి ఎక్కగానే పటపట మంటూ వింత వింత శబ్దాలతో దిక్కులన్నీ పగిలాయి. గరుడనిపై స్వారీ చేస్తూ కోపంతో దాన్ని తోలగా అఖిల లోకాలన్నీ గిరిగిర తిరిగాయి. ప్రస్తుతం బంగారు గరు డునిపై విహరిస్తుండగా రాక్షససమూహం భీతి చెందింది. ఓ వేంకటరమణా! ఇలా భక్తులు నీ మహిమల్లో మునక లేస్తారు కదా!

గజరాజ వరదుడైన శ్రీవారు ఆరోరోజు గజవాహ నంపై విహరించి– ఏడోరోజు సూర్యభగవానుడు సేవించ డానికి రాగా సూర్యప్రభవాహనంలో విహరిస్తూ సర్వ తేజోమంతుడినైన తనను ప్రార్థించమని భక్తులకు తెలియ జేస్తారు.

ఎనిమిదోరోజు చిత్రాలంకారయుక్తమైన రథాన్నధి ష్ఠించి "రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మనవిద్యతే" అన్న స్థిరసత్యాన్ని నిజం చేస్తూ భక్తులకు తన దివ్య మంగళ విగ్రహదర్శనాన్ని అనుగ్రహిస్తూ వారిని జననమరణాది దుఃఖరూపమైన సంసారసాగరం నుండి ఉద్ధరిస్తూ తిరుమాఢవీథుల్లో విహరిస్తాడు. జగన్నాయకుడు తేరుపై విహరిస్తుండగా ఆ తేరు ముందర దేవతాస్త్రీలు ఆడుతూ పాడుతూ స్వామికి ఆనందం కలిగిస్తూ తామూ ఆనందిస్తు న్నారు. అదే విషయాన్ని అన్నమయ్య -

**అమరాంగన లదె యాడేరు**
**ప్రమదంబున నదె పాడేరు**

**గరుడ వాహనుడు కనకరథముపై**
**యిరువుగ వీథుల నేఁగీని**
**సురలును మునులును సొంపుగ మోఁకులు**
**తెరలిచి తెరలిచి తీసేరు**

**యిలధరుఁడదివో యింద్రరథముపై**
**కెలయుచు దిక్కులు గెలిచీని**
**బలు శేషాదులు బ్రహ్మ శివాదులు**
**చెలఁగి సేవలటు సేసేరు**

...................... **(4-26)** అని వర్ణించాడు.



శ్రీ వేంకటేశ్వరుడు అలమేల్మంగతో కూడి రథంపై ఆసీనుడై లోకకల్యాణ రక్షణార్థమై విచ్చేస్తుండగా అమరాంగనలు మహానందంతో నృత్యాలు, గానాలు చేస్తున్నారట. ఆ స్వామి రథాన్నధిష్ఠించి దిక్కులను గెల్చి వస్తూ ఉండగా దేవతలు, మునులు, శేషుడు, బ్రహ్మశివాదులు ఆ స్వామికి సేవలు చేస్తున్నారట. నారదాది ఋషులు శ్రీవారి కీర్తిని గానం చేస్తున్నారట. ఎంతటి వైభవం స్వామివారిది!

ఎనిమిదోరోజు రాత్రి వైకుంఠనాథుడు అశ్వవాహనారూఢుడై దుష్టశిక్షణ శిష్టరక్షణకై బయల్దేరతాడు. శ్రీస్వామి తురగాన్నెక్కి ప్రకాశిస్తూ ఉండగా ఆ స్వామి లీలా విలాసాలెన్నిటినో ప్రత్యక్షీకరించుకున్నాడు అన్నమయ్య.

**నీవు తురంగము మీఁద నేర్పుమెరయ**
**వేవేలు రూపములులైవెదచల్లితపుడు**

**పదిలముగ నిరువంక బసిఁ డి పింజల యంప**
**పొద ల తరకసము లొరపులు నెరపఁగా**
**గదయు శంఖంబు చక్రము ధనుః ఖడ్గములు**
**పదివేలు సూర్యబింబములైన వపుడు**

**సొరిది శేషుని పెద్దచుట్టు పెనుఁగేవడము**
**సిరి దొలఁక నొక చేతఁ జిత్తగించి**
**దురమునకుఁ తొడవైన ధూమకేతువు చేత**
**నిరవైన బల్లెమై ఏచెనందపుడు**

**కరకజడతో రమాకాంత జయలక్ష్మియై**
**తొరలి కౌఁగిట నిన్నుఁ దొడికి పట్టి**
**చరచెవెను వేంకటస్వామి నిను గెలువుమని**
**మెరుఁగు కుచ కుంభముల మిసిమితో నపుడు ॥ (4-210)**

స్వామీ! శ్రీ వేంకటేశ్వరా! నీవు అశ్వవాహనాన్నెక్కి తిరువీథుల్లో వివిధరూపాల్లో ప్రకాశిస్తూ ఉండగా-నీవు ధరించినట్టి గద, శంఖం, చక్రం, ధనుస్సు, ఖడ్గాలు పదివేల సూర్యబింబాలకాంతితో ప్రకాశిస్తూ ధూర్తులనే తిమిరాన్ని నశింపజేసి జగత్కళ్యాణాన్ని గావించాయి అని అశ్వవాహనారూఢుడై శ్రీ వేంకటేశ్వరుడి జగత్కళ్యాణ లీలలను సాక్షాత్కరించుకున్నాడు అన్నమయ్య.

**శ్రీవారి ఆలయంలో ఉన్నప్పుడు మౌనంగా మనస్సులో 'ఓం శ్రీవేంకటేశాయనమః' అని ధ్యానించుకోండి.**

ఇక బ్రహ్మోత్సవాల్లో పదవరోజు విశేషం "శ్రీవారి కల్యాణం". జగన్నాయకుడు శృంగారస్వరూపియై, పెండ్లికొడుకుగా అలంకరించుకుని-శ్రీభూదేవిలను చేపట్టే అపురూపమైన దృశ్యం బ్రహ్మోత్సవాల్లోనే విశిష్టమైంది. శ్రీవారిని పెండ్లికొడుకుగా అనేక సంకీర్తనల్లో అభివర్ణించిన అన్నమయ్య అలమేలుమంగ పెండ్లికూతురి వైభవాన్ని పొగిడాడు. ఈ సంకీర్తన అందరికీ చిరపరిచితమైనదే.

**పిడికిట తలంబ్రాల పెండ్లికూఁతురు కొంత**
**పెడమరలి నవ్వీనె పెండ్లికూఁతురు (5-185)**

ఇలా పెండ్లికూతురు-పెండ్లికొడుకుల వైభవాన్ని పొగిడిన అన్నమయ్య వారి వివాహానికి దేవతలను, మునులను, పేరంటాండ్లనూ ఆహ్వానిస్తాడు.

**పసిఁడి యక్షంతలివె పట్టరో వేగమే రారో**
**దెసలఁ బేరటాండ్లు దేవుని పెండ్లికిని (3-194)**

ఇలా ఆహ్వానించగా విచ్చేసిన దేవతలు, మునులు, పేరంటాండ్ల సమక్షంలో శ్రీనాథుడి వివాహం కమనీయంగా, రమణీయంగా జరగడంతో బ్రహ్మోత్సవాలు పరిసమాప్తమౌతాయి. పరమపావనుడిని సేవించడానికి బ్రహ్మాదిదేవతలెందరో విచ్చేశారు. వారందరికీ ఆ దేవదేవుడు ఇలా వీడ్కోలు పలికాడు -

**భోగీంద్రులు మీరు పోయిరండు**
**వేగన మీదటి విభవాలకు (1-368)**

అంటూ స్వామివారు బ్రహ్మోత్సవాలకు విచ్చేసిన బ్రహ్మాది దేవతలందరికీ వీడ్కోలు పల్కి- మరుసటి బ్రహ్మోత్సవాలకు ఆహ్వానం కూడా పలికాడు. ఇలా తన సంకీర్తనల్లో బ్రహ్మోత్సవానికి విచ్చేసిన దేవతలందరినీ అలౌకికంగా దర్శించుకుని, వారిని స్వామి తరపున వీడ్కోలు పలికిన అన్నమయ్య ధన్యజీవి.



**భారతదేశంనందలి సుప్రసిద్ధ దేవాలయాలలో తిరుమల శ్రీ వేంకటేశ్వరుని ఆలయం ఒక ప్రత్యేకతను, ప్రాముఖ్యతను సంతరించుకొన్నది. కలియుగంలో భక్తులను ఉద్ధరించడానికి మహావిష్ణువే శ్రీ వేంకటేశ్వరుడు స్వయం భువుగా అవతరించాడని భక్తుల నమ్మకం. ఆలయానికి అత్యంత ప్రాచీనకాలం నుండి పరంపరానుగతంగా వస్తున్న చరిత్ర ఉంది. నిత్యపూజలు అందుకొంటున్న స్వామివారికి అనేక ఉత్సవాలు జరుగుతాయి. కొండను తిరుమల అనీ, కొండ క్రింద ఉన్న ఊరిని తిరుపతి అనీ ఇక్కడ ప్రాంతీయులు పిలుస్తున్నప్పటికీ, బయట ఊళ్ళలో ఉండే భక్తులు మాత్రం తిరుమలనే తిరుపతిగా వ్యవహరించడం కద్దు. తిరుపతి క్షేత్రం అనే అర్థంతో పిలుస్తారు. తిరుమల క్షేత్రానికి పల్లవులు, చోళులు, పాండ్యులు, కాడవ రాయ రులు, తెలుగు చోళులు, తెలుగు పల్లవులు, విజయనగర రాజులు ఇతోధిక సేవ చేశారు. తిరుపతి దేవస్థాన పరిపాలనలో ఉన్న ఆలయాల కుడ్యాలపై ఉన్న శాసనాలు చారిత్రక విషయాలను తెలుపుతాయి.**

# తిరుమల ఆలయనిర్మాణం - వివిధ దశలు



- వి. రామబ్రహ్మం

"తిరుమల" కొండకు పూర్వకాలంలో "తిరు వేంగడం" అని పేరు, "శ్రీ వేంకటేశ్వరస్వామి" వారికి పూర్వకాలంలో "తిరువేంగడ ముడయాన్" అని పేరు. ఈ "తిరువేంగడం" అనే కొండ తమిళదేశానికి ఉత్తర సరిహద్దుగా ఉండేది.

## చరిత్రగతిలో శ్రీ వేంకటేశ్వరాలయం :

మొట్టమొదటగా శిలారూపంలో ఉన్న శ్రీ స్వామిని తిరుమల కొండ కీకారణ్యంలో దర్శించినవాడు వసువు అనే కిరాతుడు. బ్రహ్మాండపురాణం ప్రకారం గోపీ నాథుడు అనే వైఖానస బ్రాహ్మణుడు కృష్ణభక్తుడు. తనకు మోక్షమును ఇమ్మని శ్రీకృష్ణ భగవానుని వేడగా, నీవు శేషాద్రికి (తిరుమలకు) వెళ్ళు, అచ్చట నీకు రంగదాసు అను వ్యక్తి సహాయపడునని ఆనతిచ్చాడు. గోపీనాథుడు శేషాద్రి దగ్గర రంగదాసును కలిశాడు. వీరిరువురు తిరు మల చేరి పుట్టలో ఉన్న స్వామి విగ్రహమును బయటకు తెచ్చి మండపాన్ని నిర్మించి తాటాకు పందిరి వేశారు. ఒకరోజు రంగదాసు మాలలు అల్లుతూ గంధర్వ దంప తుల చేష్టలను చూస్తూ, దైవకార్యమును మరచాడు. గోపీ నాథుడు రంగదాసుని ఆలస్యానికి కోపించి అతనిని దూషించాడు. ఆ సమయంలో అశరీరవాణి, రంగదాసూ! "నీ మనస్సు నిర్మలంగా లేదు, కనుక నీవు పవిత్రమైన కార్యాలను చేయలేవు. నీవు మరల జన్మించి రాజువై భోగాలను అనుభవించి, నాకు ఒక గొప్ప ఆలయాన్ని నిర్మించెదవు" అని పలికింది. తరువాత రంగదాసు మర ణించి, ఆకాశరాజు తమ్ముడుగా జన్మించాడు. ఆకాశ రాజుకు తామర పువ్వులో ఆడబిడ్డ లభించగా ఆమెను చేరదీసి పద్మావతి అని పేరు పెట్టి, పెంచి పెద్దచేసి, యుక్తవయస్సు వచ్చేసరికి శ్రీనివాసున కిచ్చి వివాహం జరిపించారు. కొద్ది కాలానికే ఆకాశరాజు మరణించగా, ఇతని సోదరుడు తొండమానుడునూ, కుమారుడైన వసు దానుడూ సింహాసనం కోసమై తగవులాడుకొంటారు. అపుడు శ్రీనివాసుడు వీరివ్యవహారంలో జోక్యం కలుగ చేసుకొని రాజ్యాన్ని వారిరువురికి చెరిసగం పంచినాడు. ఆ విధంగా తొండమానుడు తన వంతుగా తొండ మండ లాన్ని పొందగా వసుదానుడికి నారాయణవనం లభిం చింది. క్రీ.పూ. 1వ శతాబ్ది లేదా క్రీ.శ. 1వ శతాబ్ది మధ్యకాలంలో తిరుమలమీద చీమలపుట్టచేత కప్ప బడిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి విగ్రహాన్ని తొండమాన్ చక్రవర్తి చూచి, శుభ్రపరచి, ఆ విగ్రహంపై చిన్నమండ పాన్ని కట్టించాడు. క్రీ.శ.3-4 శతాబ్దాల మధ్యకాలంలో సంగం సాహిత్యానికి సంబంధించిన "మాములనార్" అనే కవి "తిరువేంగడం" ప్రాంతం చాలా సుందరమైన ప్రాంతమనీ, పండుగ పబ్బాలను జరుపుకుంటారని పేర్కొ న్నాడు. **క్రీ.శ. 8వ శతాబ్దం చివరికాలం వరకు మూల విగ్రహమూర్తి ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ బహి రంగంగా ఒక మండపంలో భక్తుల పూజలందుకొంటూ ఉన్నాడని భావించవచ్చు.**



క్రీ.శ.8వ శతాబ్దిలో-ఆళ్వారులతో శ్రీనివాసుని కీర్తివైభవాల ప్రసక్తి, ప్రశస్తి ప్రారంభమయ్యాయి. క్రీ.శ. 8 వ శతాబ్దిలో తమిళదేశంలో శైవమతం విజృంభించింది. వైష్ణవులందరూ ఉత్తరదిక్కునఉన్న శ్రీనివాసునిపై తమ దృష్టిని ప్రసరించారు. "ఆళ్వారులు" తిరువేంగడనాథుని వేయినోళ్ళతో కీర్తించారు. శ్రీ వేంకటేశ్వర స్వామిని అన్నివైపుల నుండి మరియు ఎచట నుండి అయినను చూడవచ్చునని తిరుమళిశై ఆళ్వారు స్పష్టంగా తెలుపుతున్నాడు. కులశేఖరాళ్వారు ఎన్ని జన్మలు ఎత్తినా సరే స్వామివారి గడపగా లేక పీఠంగానైనా ఉండటం తన జీవితాశయంగా ఒక పాశురంలో తెలుపుకుంటాడు. విగ్రహాన్ని పరివేష్టించే ఒక గర్భగృహం తిరుమళిశై ఆళ్వారు మరియు కులశేఖర ఆళ్వారుల మధ్యకాలం నాటికి నిర్మింపబడి ఉండాలి. "తిరువేంగడం" కొండమీద ఉన్న గుడికి ప్రజలు వెళ్ళడం చాలాకష్టంగా ఉండేది. అందువల్ల వైష్ణవ భక్తులు వెండితో శ్రీ వేంకటేశ్వర స్వామివారి ప్రతిరూపాన్ని రూపొందించుకొని దానిని "తిరుచోగినూర్" (నేటి తిరుచానూరు)లో ప్రతిష్ఠించి అక్కడ ఒక గుడి కట్టారు.

### క్రీ.శ.800-1000 సంవత్సరాల మధ్య గర్భగృహం మరియు అంతరాళ నిర్మాణం :

శైవమతం తిరుచానూరుకు కూడా వ్యాపించింది. అందువల్ల వైష్ణవులు క్రీ.శ.900లో **తిరుమలలో నామమాత్రంగా ఉన్న చిన్నగుడిని పెద్ద గుడిగా నిర్మించారు. రాళ్ళను పలకలుగా పగులకొట్టి వాటితో గర్భగృహాన్ని మరియు అంతరాళం నిర్మించారు. ఈ విషయాన్ని రుజువు చేసే స్పష్టమైన శాసన ఆధారం ఉన్నది.** తిరుమలఆలయం మొదటిప్రాకారం ఉత్తరపు గోడమీద మహారాజు ఒకటవ కొప్పాత్ర మహేంద్ర పన్మార్ పరిపాలనాకాలంలోని 14వ సంవత్సరంలో శక్తివిటంకన్ అనునతని రాణియైన పెరుందేవి అని పిలువబడుతున్న సామవైచే ప్రకటింపబడినది. ఈ శాసనంలో "కోయిల్ ఆళ్వారుక్కు కోవిలుక్కు కోవిల్ శెయ్యి" అంటే కోవిల్ ఆళ్వారు యొక్క దేవాలయానికి దేవాలయ నిర్మాణం- అని అర్థం. దైవాను గ్రహాన్ని పొందగోరి సామవైరాణి ప్రతిరోజూ నాలుగు నాళికల వండిన అన్నం, స్వామివారి నివేదనకు, ఒక నిత్యదీపం లేక అఖండదీపం ఏర్పాటు చేసింది. ఉత్సవ మూర్తిని పవిత్రీకరించటాన్ని గమనించినట్లయితే దేవాలయంలో అంతరాళం కూడ ఉన్నదనే విషయం ధ్రువపడుతోంది. తిరుమల కొండమీద దేవాలయాన్ని గురించిన వివరాలను తెలిపే 8 శాసనాలు తిరుచానూరులో లభించాయి.

వీటిలో అత్యంత వెనుకటి కాలానికి చెందిన శాసనం క్రీ.శ.826 సంవత్సరానికి చెందినది. రెండవ శాసనం విజయాదిత్యుని పరిపాలనాకాలానికి చెందినది. అంటే సుమారు క్రీ.శ.870 ప్రాంతానికి చెందినది. కుతూహలాన్ని రేకెత్తించే మూడవ శాసనం చోళ రాజైన మొదటి పరాంతకుని కాలానికి చెందింది. (క్రీ.శ. 945) ప్రస్తుతం ఉన్న గర్భగృహం, దీనికి ముందు ఒక అర్ధమండపం (ఇపుడు దీనిని శయన మండపం అని పిలుస్తారు), మరియు అంతరాళం (ఇపుడు దీనిని రామర్ మేడై అని అంటారు) అనేవి లోపలి ప్రాకారంలోని మొదటి సముదాయం అవుతుంది. స్నపనమండప నిర్మాణం తరువాత చోళులు బలహీనులై స్థానికంగా యాదవుల ప్రాబల్యం పెరిగే వరకు నిర్మాణ కార్యక్రమాలలో జాప్యమేర్పడింది. అతి గహనమైన కొండమీద ఉన్న దేవాలయం చిన్నదిగా ఉన్న దేవాలయం రామానుజుల కాలంలో స్వామివారి దేవాలయానికి ఎంతో అభివృద్ధి చేకూరింది.

### గర్భగృహం ఇపుడున్న రూపాన్ని సంతరించుకోవడం తదితర నిర్మాణాలు :

ప్రాచీన శిల్ప శాస్త్ర గ్రంథాలు తెలుపుతున్న ప్రకారం గర్భగృహ వైశాల్యం యొక్క పరిమాణం అందు ప్రతిష్ఠింపబడే ధ్రువబేరం ఒడ్డుపొడవులు, ఎత్తు తీరు, స్థితి మొదలైనవి ఆయా కొలతలు నిర్ణీతంగా ఉండాలనే నిర్ణయింపబడింది. గర్భగృహంలో ఒక్క స్థానకమూర్తి ఉండే పక్షంలో గర్భగృహం చతురస్రాకారంగా ఉంటుంది. ఆ నేలను ఏకతల అని అంటారు. ఈ చతురస్రం యొక్క భుజంకొలత స్వామియొక్క ధ్రువబేరాన్ని బట్టి ఉంటుంది.

సామవైరాణి "మనవాళ పెరుమాళ్" అన్నపేరుతో, తిరుమల దేవాలయానికి వెండి ఉత్సవవిగ్రహాన్ని బహూకరించిన తర్వాత చాలాకాలానికి అంటే 10వ శతాబ్దం తర్వాతి కాలంలో ఈ దేవాలయనిర్మాణం, అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టబడిన ఈ దశలో, దేవాలయ గర్భగృహ ఆవరణ గోడకు చుట్టూ మరొక గోడ నిర్మించబడింది.

క్రీ.శ.12-13వ శతాబ్దాల మధ్యకాలంలో దేవాలయానికి మరమ్మతులు చేయవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇతర శాసనాధారాల ప్రకారం క్రీ.శ.1262 సంIIలో సుందరపాండ్యుడు **ఆనందనిలయ విమానం మీద కలశానికి బంగారుపూత పూయించినట్లు తెలుస్తోంది.** తర్వాత వీరనరసింగరాయలు బంగారంతో దేవతల సురగిరిని (మేరుపర్వతం) పోలినట్లు దేవాలయాన్ని ప్రకాశవంతం గావించాడు. పై తెలిపిన రెండు విషయాలు, రెండు శాసనాలలో విదితమౌతున్నవి. ఇవి ఒక ప్రముఖ తెలుగు పల్లవ నాయకుడైన విజయగండ గోపాలునికి సంబంధించినది. **క్రీ.శ.1262వ సంIIనికి తర్వాతకాలంలో ఒక సందర్భాన రామర్‌మేడైకి ఉన్న ద్వార మార్గం మూసివేయబడినట్లు విశదమౌతుంది.** ఈ విధంగా క్రీ.శ.13వ శతాబ్దంలో దేవాలయానికి మరమ్మతులు, పునరుద్ధరణతో పాటు నూతన నిర్మాణ కార్యక్రమాలు చేపట్టబడినవి.

తదుపరి తిరుమామణి మండపం నాలుగు వరుసల, 4 స్తంభములు (4×4), 16 స్తంభాలతో నెలకొల్పబడినది. ఈ మండపానికి పడమట వైపున మధ్యలోనే బంగారువాకిలి ఉన్నది. బంగారువాకిలికి ఇరువైపుల జయవిజయులస్థానములున్నవి. **ఈ తిరుమామణి మండపాన్ని క్రీ.శ.1417లో మల్లన (లేక)మాధవదాసు నిర్మించాడు.** ఈ మండపాన్నే ముఖమండపమని (లేక) ఆస్థాన మండపమని పిలుస్తున్నారు. ఈ మండపంలోని శిల్పాలన్ని విజయనగర శిల్పరీతులలో ఉన్నవి. తిరుమామణి మండపానికి తూర్పుగా గరుడుని సన్నిధి ఉన్నది.

**రెండవ గోపురము - విమాన ప్రదక్షిణము :**

ఆకృతిలో ఇది పెద్దగోపురం కంటె చిన్నది. ఈ గోపుర నిర్మాణకాల ప్రసక్తి ఉన్న శాసనం లభ్యం కాలేదు. ఈ గోపురం వెలుపలి ప్రాకారపు ఉత్తర



భాగానగల పునాదిరాయిపై చెక్కబడిన శాసనంలో ఒకానొక గ్రామం వీరనరసింగనయనార్ పిళ్లై దానం చేసిన విషయం పేర్కొనబడింది. క్రీ.శ.1209వ సంIIనాటికి లోపలిగోపుర నిర్మాణం జరిగినట్లుగా మనం నిశ్చయించుకోవచ్చు. ఈ ప్రాకారానికి లోపల గోపురం దాటిన అనంతరం నాలుగువైపుల ఉన్న ప్రదక్షిణాన్నే విమాన ప్రదక్షిణమని పిలుస్తారు. శ్రీవారి సన్నిధిని ఆవరించి, విమాన ప్రదక్షిణాన్ని అనుసరించి కొన్ని రాతి చెక్కడాలు, మండపాలు, చిన్న చిన్న దేవతా సన్నిధులు కలవు. రెండవ ప్రాకారాన్ని ఆనుకొని వరదరాజస్వామి సన్నిధి కలదు. ఆలయానికి దక్షిణంగా ఆగ్నేయము నుండి ప్రారంభమై వంటశాల గలదు. పడమటి దిశను గల ప్రాంతాన్ని ఒక పెద్ద మండపంగా మలచిరి. 16వ శతాబ్దాంతమున ఇది నిర్మించినట్లుగా ఊహింపవచ్చు. తిరుమల రాయమండపంలోని శిల్పాలే ఇందును చూడవచ్చు. ఈ మండపాన్నే కళ్యాణమండపం అంటారు. శ్రీవారి బ్రహ్మోత్సవాల్లోను, అధ్యయనోత్సవాల్లోను ఎక్కువ రోజులు శ్రీవారి ఉత్సవ మూర్తులైన మలయప్పస్వామివారు, దేవేరులతో ఈ మండపంలో చూడవచ్చు. పడమటి నడవ, దక్షిణ నడవ కంటె కొంత వెడల్పు తక్కువ, ఉత్తరపు నడవలో విమాన పై భాగాన సరిగా దృష్టి నిలిపినచో విమాన వేంకటేశ్వరుని దర్శనమగును. అచటనే తాళ్ళపాక అన్నమాచార్యులవారి అర ఉన్నది. దీని తర్వాత ఉన్నది శ్రీ రామానుజ సన్నిధి. క్రీ.శ.1180లో ఈ సన్నిధి ఏర్పడినది. తదుపరి శ్రీ నృసింహస్వామివారి ఆలయం చూడవచ్చు.

**మొదట మహాద్వారగోపురం-సంపంగి ప్రదక్షిణం:**

ప్రధానద్వారమందు నిర్మింపబడిన ఉన్నత గోపురాన్నే "మహాద్వారగోపురమని", "సింహద్వారమని", "పడికావలి"గోపురమందురు. తమిళంలో దీన్నే "పెరియ తిరువాశల్" అని అందురు. అనగా పెద్ద వాకిలి అని అర్థం. ఈ గోపుర నిర్మాణం క్రీ.శ.13వ శతాబ్ది నుండి అంచెలంచెలుగా పెంపొందింపబడినట్లు తెలుస్తున్నది. ఈ మహాద్వారానికి అనుసంధింపబడి ఉన్న ప్రాకారమే మహాప్రాకారం. క్రీ.శ.1472-1482 సంII మధ్య

కాలంలో సాళువనరసింగదేవుడు దుర్గసము ద్రమను గ్రామం యొక్క సాలుసరి రాబడిని దేవాలయ ప్రాకార గోపురముల అత్యవసర కట్టడాలకు వినియోగించుటకు శాసనము చేసెను.

మహాద్వారానికి ఆనుకొని లోపలవైపు 16 స్తంభాలతో ఎత్తైన మండపం నిర్మింపబడి ఉంది. ఈ మండపాన్ని కృష్ణరాయమండపమని, ప్రతిమామండప మని అందురు. ఈ మండపం విజయనగర శిల్ప సంప్ర దాయ రీతిలో నిర్మింపబడినది. ఈ మండపానికి ప్రత్యే కత ఉంది. శ్రీ స్వామివారు తిరుమల పురవీథుల్లో ఊరేగి వచ్చిన అనంతరం ఆలయ ప్రవేశం చేసిన వెంటనే ఈ ప్రతిమామండపంలో కొంతసేపు నిలుస్తారు. ప్రతిమా మండపానికి ఉత్తరం దిక్కున ఉన్న మండపాన్ని అద్దాల మండపమని, అయినామహల్ అని అంటారు. ఈ మండపంలోని ఊయలలో వేంచేసి ఊరేగుతున్న స్వామి వారి రూపం అన్నివైపులా అద్దాల్లో కనబడుతుంది. క్రీ.శ.1831 నాటికే ఈ అద్దాలమండపంలో డోలో త్సవం జరుపబడుతున్నట్లు దాఖలాలు ఉన్నాయి. అద్దాల మండపానికి ఎదురుగా, ప్రతిమామండపానికి దక్షిణాన నిర్మింపబడిన విశాలమైన మండపమే రంగనాయక మండపం. క్రీ.శ.1320-1360 సంవత్సరాల మధ్య మహ్మదీయదండయాత్రలవల్ల శ్రీరంగక్షేత్రంలోని శ్రీరంగ నాయకుల ఉత్సవమూర్తులను తిరుమలకు చేర్చి ఈ మండపంలో నిలిపి రక్షిస్తూ నిత్యపూజా నివేదనలు జరి పారు. రంగనాయక మండపాన్ని ఆనుకొని తిరుమల రాయ మండపం ఉన్నది. ధ్వజస్తంభ మండపానికి 10 అడుగుల దూరంలో ఇది ఉన్నది. విజయనగర చక్రవర్తి యైన సాళువ నరసింహరాయలు స్వామివారికి “అన్నా ఊయల తిరునాళ్ళు”అనే ఉత్సవాన్ని నిర్వహించే నిమిత్తం, క్రీ.శ.1473లో ఈ మండపంలోని ఎత్తైన వేదికను నిర్మిం చాడు. అళియ రామరాయల సోదరుడు ఆరవీటి వంశ చక్రవర్తి అయిన తిరుమలరాయలు క్రీ.శ.16వ శతాబ్దం ఉత్తరార్థంలో ఈ మండపాన్ని విస్తరింపచేశాడు.

ప్రతిమామండపానికి, అద్దాలమండపానికి, రంగనాయక మండపానికి మధ్యలో చతురస్రంగా ఉన్న ప్రాంతంలో పడమరభాగాన ఉండే మండపాన్ని ధ్వజ స్తంభమండపం అంటారు. ఇది క్రీ.శ.15వ శతాబ్దంలో నిర్మించబడినది. వెండివాకిలికి ఎదురుగా సుమారు 15 అడుగుల దూరంలో రాతిపీఠంపై ఎత్తైన దారుస్తంభమే ధ్వజస్తంభం. దీనికి బంగారుపూత రేకులు కప్పబడింది. క్రీ.శ.1417లో బంగారువాకిలికి ముందు ముఖ మండపం నిర్మింపబడటం చేత, ఆ మార్గం ఇరుకైనందు వలన, ఇక్కడకు మార్చి ఉంటారని పరిశోధకుల అభి ప్రాయం. ధ్వజస్తంభానికి తూర్పున ఆనుకొని ఉన్నదే బలిపీఠం. తిరుమలరాయ మండపానికి పడమరగా సంపంగి ప్రదక్షిణంలో ఆగ్నేయ, నైఋతి, వాయవ్య, ఈశాన్య మూలల్లో కనిపించే మండపములే సాళువ నరసింహ మండపాలు. వీటిని క్రీ.శ.1470లో విజయ నగర చక్రవర్తి సాళువ నరసింహరాయలు తన భార్య, తన ఇద్దరు కుమారులు-తన పేరిట నిర్మించారు.

సంపంగిప్రదక్షిణంలో దక్షిణంవైపుమార్గంలో కళ్యాణమండపం నిర్మించబడినది. ప్రస్తుతం ప్రతిరోజు కళ్యాణోత్సవాలు మరియు పవిత్రోత్సవం, పుష్పయాగం, జ్యేష్ఠాభిషేకం మున్నగు సంవత్సరోత్సవాలు కూడా ఈ కళ్యాణమండపంలో జరుపబడుతున్నాయి. సంపంగి ప్రదక్షిణంలో పడమర వైపు ఉన్న మండపాలు అన్నీ గిడ్డంగులుగా ఉపయోగపడుతున్నాయి. అభిషేకాలకు పంపిణీ చేసే ఉగ్రాణం ఈ సంపంగి ప్రదక్షిణంలో వాయవ్యమూలలో ఉంది. సంపంగి ప్రదక్షిణంలో ఉత్త రపు వైపునగల శాలామండపము కూడా పెక్కుగదులతో ఉన్నది. పెద్దశాలలో రామానుజ కూటమున్నది. ‘యాము నోత్తర’ పూల అరకు ఎదురుగా అద్దాలమండపానికి కొంచెం ఉత్తరం వైపున “పూలబావి” ఉండినది.

చివరగా మహాద్వారానికి ఇరుప్రక్కల ద్వార పాలకుల వలె రెండడుగుల ఎత్తున్న పంచలోహ విగ్ర హాలు కానవచ్చును. వీరు శ్రీ వేంకటేశ్వరస్వామివారి సంపదలను, నవనిధులను రక్షించే దేవతలు. దక్షిణ దిక్కున రెండు చేతుల్లోను రెండు శంఖాలు ధరించిన ‘శంఖనిధి’, ఉత్తరదిక్కున రెండు చేతుల్లోను రెండు పద్మాలు ధరించిన ‘పద్మనిధి’. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుని ఆలయం కాలక్రమేణ వివిధదశలలో నిర్మించ బడి యావత్ ప్రపంచాన్ని ఆకర్షించుచున్నది.



# జానపద కథలు - శ్రీ వేంకటేశ్వరుడు

- డా॥ పేట శ్రీనివాసులురెడ్డి

తిరుమల-తిరుపతి పరిసరాలను గూర్చి జానపదులు ఎన్నో కథలను చెప్పుకుంటారు. కొన్ని జానపద కథ నాలు ప్రఖ్యాతి చెంది, శిష్టసాహిత్యంలో కూడా చోటు చేసుకున్నాయి. అలా తరిగొండ వెంగమాంబ వేంకటా చల మాహాత్మ్యంలోను, తాళ్లపాకవారి సంకీర్తనల్లోను కొన్ని జానపద కథలకు స్థానం లభించింది. ఈ జాన పద కథలను పండితులు ఐతిహ్యాలు అంటారు. జాన పదులు గోవిందరాజస్వామిని గూర్చి, దిగువ తిరుపతిని గూర్చి అనేక కథలను అల్లుకున్నారు.

## గోవిందరాజస్వామి తలకింద సేరు :

తిరుపతిలోని గోవిందరాజస్వామి వేంకటేశ్వర స్వామికి అన్న అని అంటారు. ఒక రకంగా ఇది స్థానికుల సృష్టి అని చెప్పవచ్చు. ఎందుకంటే పురాణాల్లో, కావ్యాల్లో ఎక్కడా ఈ విషయం ప్రస్తావింపబడలేదు. గోవిందరాజ స్వామి శ్రీరంగనాథునిలాగ పడుకొని ఉంటాడు. గోవింద రాజస్వామి తలకింద గుండ్రంగా ఉన్నదానిని స్థానికులు 'కుంచము/సేరు'(ధాన్యంకొలిచే పరికరం) అని అంటారు. వేంకటేశ్వరస్వామి తన పెళ్ళికి కుబేరుని దగ్గర ధనాన్ని అప్పుగా తీసుకుంటాడు. ఆ అప్పును కలియుగంలో తీరుస్తానని వెంకన్న ఒప్పందం కుదుర్చుకుంటాడు. దానికి బ్రహ్మ, శివుడు సాక్షులుగా ఉంటారు. అప్పుగా తీసుకున్న ధనాన్ని గోవిందరాజస్వామి సేరుతో కొలిచి కొలిచి అలసిపోయి ఆ సేరునే దిండుగా చేసుకుని నిద్రపోతూ అలాగే శిలైపోయాడని ఇక్కడి ప్రజలంటారు.

## గోవిందరాజస్వామి సున్నం విగ్రహం :

తిరుపతిలో గోవిందరాజస్వామి గుడిని ఎన్నో ఏళ్ళు కష్టపడి కట్టి ఎంతో అందంగా తీర్చిదిద్దారు. గర్భ గుడిలో గోవిందరాజస్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠించ డానికి మంచి ముహూర్తాన్ని కూడా నిర్ణయించారు. గోవింద రాజస్వామి మూలవిరాట్‌ను తంజావూరులో ప్రముఖశిల్పి చేత చెక్కించారు. ముహూర్తకాలం దగ్గర పడేసరికి విగ్ర హాన్ని తంజావూరునుండి ఎద్దుల బండి మీద తిరుపతికి తీసుకొచ్చారు. అయితే రవాణాలో విగ్రహం ఒకచోట దెబ్బతింది. మొక్కవోయిన విగ్రహాలను ప్రతి ష్ఠించి పూజించకూడదు. ముహూర్త సమయం దగ్గరపడుతోంది. మళ్ళీ ఇంకో విగ్రహం చెక్కించాలంటే సమయం సరిపోదు. అందుకని గర్భ గుడిలో గోవిందరాజస్వామిని ఇటుకలు, సున్నంతో తయారుచేశారు. అందువల్ల గోవిందరాజస్వామికి నీటితో అభిషేకం చెయ్యరు. కేవలం తైలాభిషేకం చేస్తారు. అంటే స్వామివారికి నూనెను రాస్తారు. ఇలా గోవింద రాజస్వామిని సున్నంతో చేయడానికి ఇదే కారణమం టారు. తంజావూరు నుండి తెచ్చిన మొక్కవోయిన విగ్ర హాన్ని తిరుపతి మంచినీళ్ళగుంట (నరసింహతీర్థం) గట్టు మీద పెట్టారు. ఇప్పటికీ మంచినీళ్ళగుంట గట్టుమీద ఆ విగ్రహాన్ని చూడొచ్చు. ఇలా గోవిందరాజస్వామి కథలు ప్రచారంలో చాలా ఉన్నాయి.

## తిరుపతి నిర్మాణం :

కపిలతీర్థానికి ముందువైపు కొండపక్కన తిరు పతి గ్రామం ఉండేది. దీన్నే కొత్తూరు అని కూడా అంటారు. ఈ గ్రామంలో ఎక్కువగా ఆదిశేషుడు వదిలే విషగాలుల వల్ల విషజ్వరాలు వచ్చి జనం మరణించే వారు. కొన్నాళ్ళకు ఊరు పాడుబడిపోయింది. తర్వాత రామానుజాచార్యులు వచ్చి ఇప్పుడున్న తిరుపతిని గరుడా కారంలో నిర్మాణం చేయించాడట. అప్పట్నుంచి ఆది శేషుడు వదిలే విషగాలుల ప్రభావం లేకుండా తిరుపతి వర్ధిల్లుతోందని చెబుతారు.

## అలిపిరి :

తిరుపతి గురించి చెప్పినప్పుడు తిరుపతిలో మెట్లు ప్రారంభమయ్యే అలిపిరి గురించి చెప్పక తప్పదు.



తిరుపతి నుంచి తిరుమల కొండకు నడచి వెళ్ళేమార్గానికి 'అలిపిరి' అనే పేరుంది. అయితే శిష్టులు 'అడిపడి' (మొదటిమెట్టు) అలిపిరిగా రూపాంతరం చెందిందంటారు.

**మోకాళ్ళ పర్వతం :**

ఈ పర్వతం ఎక్కేటప్పుడు మోకాళ్ళు కొట్టుకునే వట. అందుకని ఈ పర్వాతానికి మోకాళ్ళపర్వతమనే పేరొచ్చిందంటారు. అలాగే రామానుజాచార్యులు ఈ పవిత్రమైన పర్వతం నుండి మోకాళ్ళ మీదే నడిచి శ్రీవారిని చేరుకునేవాడట. అందుకని ఈ పర్వతానికి మోకాళ్ళ పర్వతమనే పేరొచ్చిందని కూడా అంటారు.

**అలమేలుమంగమ్మ - కరివేపాకు కథ :**

నారాయణవనంలో వేంకటేశ్వరస్వామికి అల మేలు మంగమ్మకు పెళ్ళవుతుంది. కొన్నాళ్ళకు అలమేలు మంగమ్మ కాపురానికి కొండకు వచ్చింది; పుట్టింటి నుండి కాపురానికి కావల్సిన వస్తువులన్నింటినీ తెచ్చింది. ఆ వస్తువులన్నింటినీ చూసిన శ్రీవారు కరివేపాకు తెచ్చావా? అని ప్రశ్నించాడు. అయ్యో! మరచిపోయానని చెప్పి కరివేపాకు తేవడానికి బయలుదేరింది. అప్పుడు వెంకన్న పొద్దుపోయే లోపల కొండ చేరుకోవాలి అలా కాకపోతే పొద్దుపోయాక నువ్వెక్కడుంటే అక్కడే శిలగా మారి పూజలందుకుంటావని చెప్పాడు. అలాగేనని అల మేలుమంగమ్మ గబగబ కొండదిగి నారాయణవనం చేరు కుని కావలసినంత కరివేపాకు తీసుకుని, మరల కొండకు తిరిగి వస్తుండగా తిరుచానూరు వద్ద పొద్దు పోయింది. పాపం అలమేలుమంగమ్మ అక్కడే శిలగా మారిపోతుంది. కరివేపాకు కథను బట్టి చూస్తే తిరుమల కొండలో ఒకప్పుడు కరివేపాకు చెట్లుండేవి కావని; సహజసిద్ధంగా కొండపై కరివేపాకు చెట్లు మొలవవని మనకు తెలుస్తోంది.

**అలమేలుమంగ - సారెపెట్టెలు :**

అలమేలుమంగకు పెళ్ళయ్యాక కొత్తగా కాపు రానికొస్తూ ధన, ధాన్య, పట్టు చీనాంబరాల్ని, ఎన్నో పిండివంటల్ని, సారెల్ని పెట్టెలలో పెట్టుకొని కొండెక్కి వచ్చింది. వెంకన్న భార్యరాకను గమనించి మోకాలి పర్వతం దగ్గర ఎదురేగి ఏమేమి తెచ్చావనడిగాడు. అంతావిని కరివేపాకు మరచిపోయావనగా, అలమేలు మంగమ్మ ఇప్పుడే వెళ్ళి తెస్తానని చెప్పి ఆ సారెపెట్టెలకు ఆంజనేయస్వామిని కాపలాపెట్టి కొండ దిగి కరివేపాకు తీసుకొని తిరుచానూరు కొచ్చేసరికి అక్కడే శిలైపోతుంది. అలమేలు మంగమ్మ ఇంకా వస్తుందేమోనకొని ఆంజ నేయస్వామి ఇతరులకు రాళ్లరూపంలో కనిపించే సారె పెట్టెలకు కాపలా కాస్తున్నాడట. ఈ సారెపెట్టెల రాళ్ళు మోకాళ్ళపర్వతంపై నడకదారి పక్కనే ఉన్నాయి.

**మంగ దగ్గర్నుండి వెళ్తూ నామాలగవిలో నామా లేసుకునే వెంకన్న :**

శ్రీ వేంకటేశ్వరుడు రాత్రిపూట కొండదిగి తిరుచానూరులోని అలమేలుమంగ దగ్గరకు వెళ్ళి తెల్లవారే సమయానికి కొండ కొచ్చేటప్పుడు ఆళ్వారుతీర్థం (కపిల తీర్థం)లో స్నానం చేసి నామాలగవికి వచ్చి నామాలు వేసుకునేవాడు. నామాల గవిలోకి ప్రవేశిస్తూనే ముందు వైపు పెద్దగుండు ఉంది. ఆ గుండును ఒక్కోచోట గోకితే ఒక్కోరంగు నామం వస్తుంది. ఇలా ఆ గుండును గోకితే పన్నెండురకాల రంగులు కలిగిన నామం సుద్దలు రాల్తాయి. ఇలా వెంకన్న నామాలు వేసుకుని నామాల గవిలో ఉండే మడుగు నీళ్లల్లో తన ప్రతిబింబాన్ని చూసు కుని సుప్రభాతం సమయానికి కొండకొస్తాడని ప్రతీతి.

తిరుమల కొండ, కొండ కొమ్ములో అంటే గంటా మండపానికి సమీపంలో 'నామాలగవి' అనే గుహ ఉంది. నామం సుద్ద విరివిగా ఈ గుహలో ఉన్నందువల్ల దీనికి నామాలగవి అనే పేరొచ్చింది. నామాలగవికి వెళ్ళాలంటే దారి బాగా తెలిసిన వాళ్లని తీసుకెళ్ళాలి. లేకపోతే అక్కడ ఉండే కొన్ని మొక్కల ఆకులను, మూలికలను తొక్కితే దారి మరచిపోయి, ఎటు వెళ్ళాలో తెలియక అక్కడక్కడే తిరుగుతుంటారని అక్కడనుండి బయటపడలేరని ప్రతీతి.



**మట్టిపూలతో పూజ చేసే కుమ్మరదాసు :**

కుమ్మరదాసు కుండలను తయారుచేసి వాటిని అమ్మి జీవించేవాడు. ఆయన శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుడు. ప్రతిరోజూ పనివత్తిడివల్ల స్వామివారి దర్శనానికి వెళ్ళలేక; స్వామిని పూజించుకోవాలని స్వామి బొమ్మను తయారుచేసుకొని ఇంటిలోనే పెట్టుకొని పూజించేవాడు. ప్రతిరోజు కుండలు చేసిన తర్వాత చేతికి అంటుకుని ఉండే మట్టితో పూలను చేసి వేంకటేశ్వరస్వామికి భక్తితో సమర్పించేవాడు. ఆ మట్టిపూలు తిరుమలలోని శ్రీవారి పాదాల దగ్గర ఉండేవి. తొండమాన్ చక్రవర్తి ప్రతిరోజూ బంగారుపూలతో స్వామిని అర్చించేవాడు. కానీ ఆ పూలు పక్కకు తోయబడి మట్టిపూలు స్వామి పాదాల వద్ద ఉండడం గమనించిన అర్చకులు చాలా ఆశ్చర్యపడి; ఆ విషయం తొండమాన్ చక్రవర్తికి తెలియజేశారు. రాజుగారు ఆశ్చర్యపడి అతడి స్వామిభక్తికి మెచ్చి ఆ మహానుభావుడెవరో ఆయనను చూద్దామని అడగ్గా అతను కుమ్మరదాసని చెప్పారు. అది విని వెంటనే తొండమానుడు అతని దగ్గరకు వచ్చి శిష్యరికాన్ని పొందాడు.

**అనంతాళ్వారు :**

పూర్వం రామానుజాచార్యులు అనంతాళ్వారు అనే భక్తుడ్ని పూలకైంకర్యం నిమిత్తమై తిరుమలకు పంపాడు. అనంతాళ్వారు తన పూలతోటకి నీటి సౌకర్యం కోసం ఒక చెరువును త్రవ్వడం ప్రారంభించి అందుకు తన భార్య సహాయం తప్ప ఎవ్వరి సహాయం తీసుకోకూడదని ప్రతిజ్ఞ చేసుకున్నాడు. అనంతాళ్వారు భార్య గర్భవతిగా ఉండటంతో ఆమె చెరువుత్రవ్వడాన్ని చూడలేని శ్రీనివాసుడు బాలుడి రూపంలో వచ్చి ఆమెకు సహాయం చేస్తుండగా; అది చూచి సహించలేక అనంతాళ్వారు చేతిలో ఉన్న గడ్డపారను ఆ బాలుడిపైకి విసిరాడు. ఆ పార బాలుడి గడ్డానికి తగుల్తుంది. అదే సమయంలో గుడిలో వేంకటేశ్వరునికి గడ్డం నుండి రక్తం కారడం చూచి అనంతాళ్వారు శ్రీవారి గడ్డానికి రసకర్పూరం అంటించి ఎంతో బాధపడుతాడు. అప్పట్నుంచి శ్రీవారి గడ్డానికి కర్పూరచుక్క పెట్టడం ఆచారమైందని అంటుంటారు. అప్పుడు స్వామివారిని కొట్టడానికి ఉపయోగించిన గడ్డపార ఇప్పటికీ ఆలయ మహాద్వారం లోపల భక్తులు దర్శించవచ్చు.

**పేరూరమ్మ కన్నకొడుకు వేంకటేశ్వరుడు :**

పేరూరమ్మ, శేషాచలపతి దంపతులకు ఏడుగురు కొడుకులు. వాళ్ళు పెద్ద ఓబులన్న, చిన్న ఓబులన్న, మద్దిలేటన్న, పెంచల నరసింహ, కదిరి నరసింహ, గోవిందరాజు, వేంకటేశ్వరుడు. అన్నలు ఆరుమందికి నివాసముండడానికి తగినచోటు దొరుకుతుంది. అందరికన్నా చిన్నవాడైన వేంకటేశ్వరుడు తాను నివసించడానికి తగిన స్థలం వెతుక్కోవడానికి తన తల్లి పేరూరమ్మ దగ్గర శెలవు తీసుకుని బయలుదేరాడు. కానీ ఎంత వెతికినా ఆయనకి తగిన స్థలం దొరకలేదు. అలా వెతుక్కుంటూ తిరుపతిలోని తాతయ్యగుంట గంగమ్మ దగ్గరకొచ్చి తన నివాసానికి తగిన స్థలం ఎక్కడుందో చెప్పమని అడిగి; అలా చూపిస్తే గంగమ్మకు సంవత్సరానికొకసారి జాతర జరిపించి, దున్నపోతుల్ని, కుంభాల్ని ఆహారంగా సమర్పిస్తానని చెప్పాడు. అప్పుడు గంగమ్మ ఏడుకొండల మీద గట్టి చోటు చూపించిందని ఒక కథ.

**మన్రో గంగాళం :**

జానపదులు ఒక కథలో శ్రీవారికి మన్రో ప్రసాదాన్ని ఏ విధంగా తన పేరు మీద ఏర్పాటు చేశాడో చెప్పారు.

ఒకసారి మన్రో తిరుపతికొచ్చి; కొండమెట్లు ఎక్కుతుండగా తేనెటీగలు మన్రోని అటకాయించి తరిమి తరిమికుట్టాయి. (నేటికీ విదేశీయులు స్వామిని దర్శించాలంటే ఆలయ అధికారుల అనుమతి పొందాలి). దాంతో మన్రో తన అపరాధాన్ని మన్నించమని వేడుకున్నాడు. తిరుమలేశుని మహిమ తెలుసుకొని ప్రతినిత్యం శ్రీవారికి నైవేద్యాన్ని ఉంచడానికి ఒక గంగాళాన్ని తన పేరు మీద ఏర్పాటు చేశాడు. ఇప్పటికీ స్వామివారి నైవేద్యంలో 'మన్రోగంగాళం' 'మన్రోగంగాళం' అని చెప్పడాన్ని చూడొచ్చు.



# డయల్ యువర్ ఇ.ఓ. కార్యక్రమం - 06-08-2010

## భక్తుల సమస్యలు - సూచనలు - ఇ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఇ.ఓ.'*** *కార్యక్రమంలో భక్తులకు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 06-08-2010న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాం.)*

**ధ్వజస్తంభం నుండి దర్శనానికి వెళ్ళేదారిలో ఒత్తిడి, తోపులాట జరిగి పడిపోతున్నారు. భక్తులందర్నీ ఒకే లైనుగా పంపండి.** *- వెంకటేశ్వరరావు, ఒంగోలు.*

**కార్యనిర్వహణాధికారి :** ఈ సమస్యను పరిష్కరించాలనే ఆలోచనలో ఉన్నాం. పరిశీలించి ఒక నెలలోపు చెబుతాం.

**అంగప్రదక్షిణ టిక్కెట్లను** పెంచండి?

*- నరేష్, వెంకటగిరి.*

**కార్యనిర్వహణాధికారి :** 500 నుండి 750కి పెంచాము.

**కంపార్ట్‌మెంట్‌లలో సుమారు 10 గం॥ల సమయం కూర్చోబెడుతున్నారు. దర్శనానికి ఎంత సమయం పడుతుందో తెలియచేయండి.**

*- శ్రీనివాసరావు, హనుమాన్ జంక్షన్.*

**కార్యనిర్వహణాధికారి :** ప్రస్తుతం ఆ యా కంపార్ట్‌మెంట్ లలో దర్శనం సుమారు ఎంతసేపట్లో అవుతుందో బోర్డులలో రాస్తున్నాం. నెలలోపు ఖచ్చితమైన సమయం తెలియజేస్తూ ఎలక్ట్రానిక్ డిస్ప్లే బోర్డులు ఏర్పాటు చేస్తాం.

**నేను వికలాంగుడను. మహద్వారం వద్ద వదిలేటప్పుడు ఇబ్బందిగా ఉంది. గైడ్స్ లేరు. వెసులుబాటు కల్పించండి.** *- కృష్ణమనాయుడు, గౌరమ్మపేట.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**లడ్డు సైజు తగ్గి, క్వాలిటీ బాగా లేదు. నెయ్యి కారుతోంది.** *- రవి, విజయవాడ.*

**ప్రత్యేకాధికారి :** క్వాలిటి, క్వాంటిటీ పెంచడానికి చర్యలు తీసుకుంటున్నాం. పోటు వర్కర్లను పెంచుతున్నాం.

**ఎస్.వి.బి.సి. కార్యక్రమాలు బాగున్నాయి. శ్రీ వేంకటేశ్వరుని అవతారాలు చూపుతున్నారు. ఏఏ అవతారం చెప్పడం, స్క్రోలింగ్ వేయడం లేదు. సేవల వివరాలు కూడా తెలపండి.** *- స్వరూపరాణి, మిర్యాలగూడ.*

**కార్యనిర్వహణాధికారి :** సేవలతోపాటు మీరు అడిగిన వన్నీ స్క్రోలింగ్‌లో వేస్తాము.

**మేము ఈ మధ్య సహస్రకలశాభిషేకం చేసుకున్నాం. ప్రసాదాలు ముందులాగా ఇవ్వడం లేదు. చక్కెర పొంగలి, సీరా మొదలగు ప్రసాదాలు ఇవ్వలేదు. పులిహోర ఇచ్చారు అసలు బాగాలేదు. ఏ వసతులు లేని రోజుల్లో ప్రసాదాలు చాలా బాగుండేవి. ఇప్పుడు అన్ని వసతులు ఉండి బాగుండడం లేదు.**

*- మీనాక్షి, కడలూరు, తమిళనాడు.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**కల్యాణోత్సవానికి 90 రోజుల ముందు డి.డి. పంపి బుక్ చేసుకోవచ్చా?** *- కృష్ణ, రంగారెడ్డి.*

**కార్యనిర్వహణాధికారి :** ఆ పద్ధతి ఉంది చేసుకోండి.

**సేవలలో పాల్గొనే భక్తులను పంపినట్లు మహాలఘు దర్శనంలో కూడా వెండివాకిలి తరువాత స్త్రీ పురుషులు వేరువేరు లైన్లలో పంపితే బావుంటుంది.**

*- సుబ్రహ్మణ్యం, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** పరిశీలిస్తాం.

**ఎస్.వి.బి.సి.లో** గతంలో **అన్నమయ్య సంకీర్తనలు రాత్రి 10.30 గం॥ల వరకు ప్రసారం చేసేవారు. ఇప్పుడు చేయడం లేదు. మళ్ళీ ప్రసారం చేయగలరు.** *-అనురాధ, వైజాగ్.*

**కార్యనిర్వహణాధికారి :** అలాగే పరిశీలిస్తాం. ప్రసారం చేస్తాం.





## మేష రాశి

ఈ రాశివారికి ఆర్థికబాధలు, సోదరీసోదరుల మనస్పర్థలు, శరీర ఆరోగ్య విషయంలో జాగ్రత్తగా వ్యవహరించండి. ఈ రాశివారికి ప్రమాదాలు జరిగే సూచనలు. అవివాహితులకు వివాహ ప్రయత్నాలు నెర వేరుతాయి. దుర్గాపూజలు మేలు చేస్తాయి. మొదటి వారం సంతోషం, రెండోవారం ఆందోళన, మూడోవారం వృథాప్రయాణం, నాలుగోవారం ప్రమాదం.



## వృషభ రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో ఆటంకాలు, ఆందోళనలు అధికంగా ఉంటాయి. గర్భవతులకు, కొత్తగా పెళ్లైన దంపతులకు, శుభవార్త శ్రవణం. కళా కారులకు, పత్రికారంగం వాళ్ళకు సన్మానాలు. ఆలయ దర్శనాలు, నవరాత్రి వేడుకలు ఆనందాన్నిస్తాయి. నూతన గృహప్రవేశయోగం కల్గుతుంది. మొదటివారం ఆందో ళనలు, రెండోవారం కార్యజయం, మూడోవారం కల హం, నాలుగోవారం దైవచింతన.



## మిథున రాశి

ఈ రాశివారికి చేయు వృత్తి వ్యాపారాల్లో పలు ఆటంకాలు, మిత్రులతో భేదాభిప్రాయాలు ఏర్పడుతాయి. సుదీర్ఘ వాహనప్రయాణాలు వద్దు. వాయిదా వేసుకోండి. అధికారుల ఒత్తిడుల వల్ల కొంత అశాంతి. మహిళలకు, చిన్నపిల్లలకు పలు అనారోగ్యసమస్యలు. నమ్మినమిత్రుల వల్ల మోసపోయే అవకాశం ఏర్పడవచ్చు. మొదటివారం ఆనందం, రెండోవారం ఆందోళన, మూడోవారం అశాంతి, నాలుగోవారం విమర్శలు.



## కర్కాటక రాశి

ఈ మాసంలో వీరికి ఆశించిన ఫలితాలు ఆలస్యంగా రావటం వల్ల మానసిక వేదనకు గురి చేస్తాయి. బంధుమిత్రుల సహకారంతో తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులకు, విదేశీ ఉద్యోగ ప్రయత్నాలు, అవివాహితులకు వివాహప్రయత్నాలు అనుకూలం. పత్రికారచయితలకు ధనాదాయం. వెండి, బంగారు వర్త కులకు అధికార్ల ఒత్తిడి. నవదుర్గా, సరస్వతీ పూజలు మేలు చేస్తాయి. మొదటివారం ధనా దాయం, రెండోవారం దైవచింతన, మూడోవారం సన్మానాలు, నాలుగోవారం ఆనందం.




– జె. చంద్రశేఖరశర్మ



## సింహ రాశి

ఈ రాశివారికి దీర్ఘకాలికంగా పెండింగ్‌లో ఉన్న కోర్టు, భూమివివాదాలు పరిష్కారమవుతాయి. భూగృహవాహనాలు క్రయవిక్రయాలవల్ల లాభపడతారు. అవివాహితులకు, నిరుద్యోగులకు, పదవీవిరమణ పొం దిన వాళ్లకు వారివారి ప్రయత్నాలు నెరవేరుతాయి. దేవీ నవరాత్రుల వల్ల 'దుర్గా' అనుగ్రహంతో మానసికా నందం కల్గుతుంది. మొదటివారం ఆరోగ్యం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం ఆనందం, నాలుగోవారం ఆందోళనలు.



## కన్యా రాశి

ఈ మాసంలో స్థిమితంగా లేకపోవటం, దీర్ఘా లోచనలు అధికంగా ఉండటం వల్ల స్వల్ప అనారోగ్యంకు లోనవుతారు. దుర్గాపూజల వల్ల శత్రువులు సహితం మిత్రులు కావటం, ఆకస్మిక ధనలాభం, ఉద్యోగంలో విజయం తదితర శుభఫలాలు ఉన్నా అశాంతి కల్గు తుంది. నూతన వస్తు, భూ, కొనుగోళ్ళు ఆనందాన్ని ఇస్తాయి. మొదటివారం వివాదాలు, రెండోవారం అధ్యా త్మికత, మూడోవారం కార్యజయం, నాలుగోవారం ధనప్రాప్తి.

## తులా రాశి

ఈ మాసంలో గతంలో చేసిన పలు దోషాలు పునరావృతమై మానసికాందోళనకు గురి చేస్తాయి. పలు శుభవార్తలు వచ్చినా పరిపూర్ణ ఆనందం కలుగదు. క్షేత్ర దర్శనాలు ఎంతో మేలు చేస్తాయి. వృత్తి వ్యాపారాల్లో శ్రమ అధికంగా ఉంటుంది. మహిళలకు, చిన్నపిల్లలకు అనారోగ్య సూచనలు, రాజకీయ నాయకు లకు, మహిళలకు పదవీయోగం. మొదటివారం ధన వ్యయం, రెండోవారం శుభవార్త, మూడోవారం దైవ దర్శనం, నాలుగోవారం కార్యజయం, ఆనందం.

## వృశ్చిక రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో వ్యవహార విజయం. పుణ్యక్షేత్ర దర్శనం తదితర ఫలితాలు ఏర్పడు తాయి. రైతులకు, మహిళలకు, చిన్నపిల్లలకు అనారోగ్య సమస్యలు, చిన్ననాటి మిత్రుల సహకారం ఎంతో మేలు చేస్తుంది. నవరాత్రుల్లో దుర్గమ్మ దర్శనం వల్ల మానసికా నందం, చేయు వృత్తివ్యాపారాల్లో ఉత్సాహం కల్గుతుంది. ఇంట్లో విలువైన వస్తువులు పోయే ఆస్కారం ఉంది. మొదటివారం ఆనందం, రెండోవారం దుర్గాపూజ, మూడోవారం కార్యజయం, నాలుగోవారం ఆలయ దర్శనం.

## ధనూ రాశి

ఈ రాశివాళ్లకు అన్నివిధాల అనుకూలమైన మాసం. ప్రతి పనికి గౌరవం, చేయాలనే ఆసక్తి పెరుగు తుంది. సోదరీసోదరుల వ్యతిరేకత మానసికంగా కృంగ దీస్తుంది. నూతన వస్తువుల కొనుగోలు, బంధుమిత్రుల శుభకార్యాలు ఆనందాన్నిస్తాయి. బ్యాంకు, రెవెన్యూ ఉద్యో గులకు అదృష్టకాలం. భూవివాదాలు త్వరితగతిన పరి ష్కారం అవుతాయి. మొదటివారం ధనాదాయం, రెండో వారం ఆనందం, మూడోవారం ఆందోళన, నాలుగో వారం వ్యవహారజయం.

**వీధి వర్తకులవద్ద నకిలీప్రసాదాలు కొనకండి.**
**తిరుమలలో కరెంటు, నీరు వృధా చేయకండి.**
**తిరుమలలో వసతికై దళారీలను ఆశ్రయించకండి.**
**అపరిచితులకు మీ కాటేజీలలో ఆశ్రయం ఇవ్వకండి.**
**మీ కానుకలను శ్రీవారి 'హుండీ'లోనే సమర్పించండి.**

## మకర రాశి

ఈ మాసంలో మీరనుకున్న పనులు పూర్తవు తాయి. నూతన వ్యాపారాలు, క్రయవిక్రయాలు మధ్య వర్తుల వల్ల పరిపూర్ణమవుతాయి. దూర ప్రయాణాలు ఆనందాన్నిస్తాయి. రాజకీయ వ్యక్తులకు గుర్తింపు లభి స్తుంది. మహిళలు చేయు వృత్తి వ్యాపారాలు లాభ సాటిగా ఉంటాయి. మొదటివారం ప్రయత్న విజయం, రెండోవారం ఆనందం, మూడోవారం దైవచింతన, నాలుగోవారం ఆందోళనలు.

## కుంభ రాశి

ఈ మాసంలో ఈ రాశివారికి తొందరపాటు నిర్ణయాలు, చేయువృత్తి, వ్యాపారాల్లో కష్టనష్టాలు ఆందో ళనకు గురిచేస్తాయి. అవివాహితుల వివాహప్రయత్నాలు, దీర్ఘకాలికంగా పెండింగ్‌లో ఉన్న భూ, కోర్టు వివాదాలు పరిష్కారమౌతాయి. సంతానానికి చేయు ప్రయత్నాలు ఫలిస్తాయి. నిదానమే ప్రధానం. సరస్వతీ పూజ, నవ రాత్రి పూజలు మేలుచేస్తాయి. మొదటివారం అనా రోగ్యం, రెండోవారం ఆందోళన, మూడోవారం ధనా దాయం, నాలుగోవారం విజయం.

## మీన రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో వృథాశ్రమ, వృథాప్రయాణాలు పలు ఆందోళనలు కల్గిస్తాయి. అధిక ఖర్చులు మానసికమైన ఒత్తిడివల్ల కొంత అశాంతికిలోనై కోపంతో మిత్రులు శత్రువులుగా మారే అవకాశం ఉంది. బంధువుల వల్ల కొంతనష్టం కల్గుతుంది. ఒంటరి ప్రయాణం వద్దు. క్షేత్రదర్శనాలు, ఆధ్యాత్మిక ధార్మిక కార్యక్రమాలు తృప్తినిస్తాయి. ఎదుటివారితో జాగ్రత్తగా మాట్లాడండి. మొదటివారం వృథాశ్రమ, రెండోవారం దైవచింతన, మూడోవారం శ్రవణానందం, నాలుగో వారం అనారోగ్యం.

## శ్రీపదకేళి - 15 (ఆగష్టు - 2010)
## విజేతలు

**1) పోలంరాజు సరోజిని,**
W/o పి. శివకోటేశ్వరరావు,
13-29, ఆర్.టి.సి. క్వార్టర్స్ దగ్గర,
కొత్తపేట, వినుకొండ - 522 647.

**2) ఈమని శ్రీనివాసరావు,**
ఇంటి నెం. 21-22-2,
తోటవారివీథి-1,
రామలింగేశ్వరపేట,
తెనాలి - 522 201.

**3) నేమన కమల,**
M/o ఎన్. సుభాష్‌చంద్రబోస్,
ఇంటి నెం. 2-3-1,
ఇలిసిపురం జంక్షన్,
శ్రీకాకుళం టౌన్ - 532 001.

**సకాలంలో సరైన సమాధానాలు పంపినవారు :**

వి.కె. వసంత(హైదరాబాదు); ఆర్. నాగేశ్వరరావు (శ్రీకాకుళం); వి. వేంకటేశ్వర్లు(నల్గొండ); యం. శివకుమార్ (కుప్పం); విద్యావతి(కుప్పం); యు. శ్రీనివాసరావు(హైదరాబాదు); పి. ఆర్. నాయుడు (తిరుపతి); పి. రామకృష్ణ (పిఠాపురం); పి.వి. త్రినాథ మూర్తి(హైదరాబాదు); వి. నరసింగరావు(సికింద్రాబాదు); ఎ.పి. చంద్రరావు(విశాఖ); సావిత్రిశర్మ (అనంతపురం); ఎ.టి. శ్రీనివాసన్(అనంతపురం); కె.వి. ముకుందా చార్యులు,(పాతగాజువాక); వి. సుందరరామయ్య (చెన్నూరు); డి. సుబ్రహ్మణ్యం(బద్వేలు); ఎస్. నాగభూషణశర్మ(అనంతపురం); సి.వి.కె.వై. శర్మ(గుంటూరు); టి. ఆర్. బాలకృష్ణారావు(రాజమండ్రి); పి. నిర్మల (గుంటూరు); ఇ. శ్యామసుందర్(హైదరాబాదు); ఎ. రామకృష్ణయ్య(ప్రొద్దుటూరు); ఎ. కృష్ణమాచార్యులు (మహారాష్ట్ర); వి. రామయ్య (మార్కాపురం); వి.బి.ఎస్.వి. సుబ్బారావు(మార్కాపురం); జె. సామ్రాజ్య లక్ష్మి(తిరుపతి); ఎన్. సుభాష్‌చంద్రబోస్(శ్రీకాకుళం); ఎం. భానుమతి, ఎం. కృష్ణమూర్తి(తిరుపతి); ఎం. సుదర్శనాచార్యులు(వరంగల్); పి. ఎస్. వి. రమణబాబు(తిరుపతి); వై. జయలక్ష్మి(లక్కవరం); ఎం. మునిరత్నం(నాయుడుపేట); ఎ. సుబ్బారావు(గుంటూరు); వి.వి. పద్మావతి(ఒంగోలు); ఎన్. రామకృష్ణ(గుంటూరు).




**నిబంధనలు :**

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా పాల్గొనవచ్చు.

**బహుమతి వివరాలు :**

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాము. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాము.

**పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :**

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కపిలతీర్థం రోడ్డు,**
**తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| ■ | ■ | 1 | | 2 | | 3 | ■ | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | ■ | | ■ | | ■ | | ■ | |
| | ■ | ■ | 6 | | | ■ | ■ | |
| 7 | 8 | | ■ | | ■ | 9 | | |
| 10 | | ■ | ■ | ■ | 11 | | ■ | |
| | ■ | ■ | ■ | 12 | ■ | 13 | | |
| | ■ | ■ | 14 | | 15 | ■ | ■ | |
| | ■ | ■ | | ■ | | ■ | ■ | |
| ■ | 16 | | | | | | | |

# శ్రీపదకేళి - 17

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

**2) మీరు సప్తగిరి చందాదారులైతే?**

అ) చందా నంబరు : ..................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

**ఆధారాలు**

**అడ్డం**

1) పూర్వకాలంలో దేవాలయానికి ముందు ఇది ఎత్తుగా ఉంటుంది (5)

6) భిన్నానికి దిగువనున్నది హారమైతే పైన ఉన్నది (3)

7) మధ్వాచార్యులమతం (3)

9) ప్రతిజ్ఞ వికృతి (3)

10) ధర్మము (2)

11) భర్త (2)

13) స్వాభిమానము. 'మ'కారంతో మొదలవుతుంది (3)

14) వంద (3)

16) పాలసముద్రుని కూతురుకు భర్త అనే అర్థం వచ్చే పదం (8)

**నిలువు**

1) తింటే ఇది తినాలి. వింటే భారతం వినాలి (2)

2) ఈ నది ఒడ్డున సీతారాములు పర్ణశాల నిర్మించుకుని ఉన్నారు (4)

3) వర్ణం (2)

4) గంగాసుతుడు (9)

5) వ్యాసుడు (7)

8) తేమను వ్యవహారంలో (2)

9) బొమ్మ (3)

12) మధుమాసంలో మామిడి చెట్టు ఇది కల్గి ఆహ్లాదంగా కన్పిస్తుంది (2)

14) సముద్రం (3)

15) స్త్రీ (3)

**—:: *శ్రీపదకేళి-15* (ఆగష్టు, 2010) సమాధానాలు ::—**

| ■ | ■ | 1 చై | త్ర | 2 ర | థ | 3 ము | ■ | ■ |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 శ్రీ | ■ | త్రం | ■ | తి | ■ | గ్ధ | ■ | ■ |
| 5 కృ | తి | ■ | 6 శా | ప | ము | ■ | 7 కం | 8 చె |
| ష్ణ | ■ | 9 య | ■ | తి | ■ | 10 క | ■ | అ |
| 11 దే | వ | యా | ని | ■ | 12 చె | వి | యా | కు |
| వ | ■ | తి | ■ | 13 స | ■ | త్వం | ■ | వి |
| రా | ■ | ■ | 14 గ | ర్వ | ము | ■ | 15 ము | ల్లు |
| 16 య | ము | డు | ■ | సా | ■ | 17 రో | ■ | ■ |
| లు | ■ | ■ | 18 ప | క్షి | రా | జు | ■ | ■ |



# తిరుమల ఆలయం

ఆంగ్లమూలం : డా॥ రమేశన్ తెలుగు అనువాదం : డా॥ కోరాడ రామకృష్ణ

ధారావాహికం - 93

**(విజయనగర సామ్రాజ్య కాలంలో తిరుమల ఆలయం చరిత్ర ఊపందుకొంది. సాధారణ గతిలో ప్రవర్థమానం చెందిన ఆలయం, క్రమేపి వేగాన్ని పుంజుకొనిందనడం సబబు. విజయనగర సామ్రాజ్య ఆరంభదశలో ఆలయ అభివృద్ధిని ఇక్కడ గుర్తించడమైంది. )**

విజయనగర సామ్రాజ్యకాలంలో ఆలయాభివృద్ధికి తోడ్పడినవారిలో మొదట బుక్కరాయలు, కుమార కంపన, రెండవ దేవరాయలు, మల్లికార్జునరాయలుని పరోక్షంగా పేర్కొనవలసి ఉన్నది. దానకర్తలు చేసినటువంటి దానాలు వీరిలో ఏ ఒక్కరి పుణ్యానికొరకో చేయబడ్డ దానాలే అయి ఉండడాన్ని గమనించి ఈ మాట చెప్పడమైంది. ఇంతకు పూర్వం జరుగుతున్న విధంగానే దేవాలయ కార్యనిర్వహణ స్థానిక శ్రీవైష్ణవప్రముఖుల చేతిలోనే ఉన్నది. ఇది శ్రీరామానుజులవారు ప్రవేశపెట్టినట్లుగా చెబుతున్న వివిధ సంస్కరణలకు అనుసారంగానే ఉన్నది. ఇక్కడ జరుపుతున్న వివిధ ఉత్సవాలను గురించి తెలియజేయు ఆకరాలు పై విషయాన్ని రుజువు పరుస్తూ, ఈ ఉత్సవాలు శ్రీరామానుజులవారి కృషి ఫలితమేయని తెలుపుతున్నాయి. అటువంటి వాటిలో ఒకటి – ఉత్సవదినాల్లో దివ్యప్రబంధం చివరిదాకా పారాయణ చేయడం ఒక ఆచారంగా వస్తున్నప్పటికీ, కొన్ని ప్రత్యేకసందర్భాలలో, క్లుప్తంగా ప్రబంధమందలి **తిరుప్పావై** వంటి కొన్ని ముఖ్యఘట్టాలలోని పాశురాలను గానంచేసే విధానం రామానుజులవారిచే ప్రవేశపెట్టబడింది. దైవంముందుగాని, దేవాలయంలోగాని, ఉత్సవ సమయాలలో ఊరేగింపు జరుపు సందర్భంలోగాని వేదపారాయణం జరుపబడుచుండినట్లు తెలిపే ఆధారాలు గల దాఖలాలు మృగ్యం. అట్టి ప్రస్తావనగల ఆకరాలు ఇంతవరకు లభ్యమైనట్లులేదు. అంతేకాదు నమోదుచేసిన సాక్ష్యాధారం, **వేంకటేశ్వరస్వామికి ఒక్కవేద పారాయణ అనబడే అంశంలో మాత్రమే కొరత ఉన్నదనవచ్చునని** తెలుపుతున్నాయి. స్థానిక ప్రముఖ వైష్ణవులు ఈ విషయాన్ని దేవణ్ణ ఉడయారు దృష్టికి తీసుకొనిరావడం జరిగింది. వేదపారాయణ జరిగేందుకోసం అతడు రాజభండారానికి చెందిన సిద్దకుట్టై గ్రామంనుండి పన్నుల రూపాన వచ్చేరాబడిలో సగభాగం ఈ ప్రయోజనార్థమై వేరుచేసి, కలికన్టిదాసర్ అళగప్పిరానార్ ఇచ్చిన సలహానను సరించి, చక్రవర్తియైన రెండవ దేవరాయల (శాసనాలు ఇతనిని దేవరాయమహారాయ అని పేర్కొంటున్నాయి) గౌరవార్థం, వారిపేరుమీద తగిన ఏర్పాటు గావించాడు. ఇలాగే అనేకమంది భక్తులు దైవకైంకర్యార్థం దేవాలయానికి విరివిగా దానధర్మాలను చేయసాగారు. అట్టి వారిలో ఉన్నత ప్రభుత్వాధికారులు మరియు దేవాలయ పాలక వర్గానికి చెందినవారు, దేవాలయ పరిసర ప్రాంతంలోని ఉద్యానవనాలలో స్థాపించిన మతాధిపతులు ఉన్నారు (ఈ మఠాలలో అవివాహితులైన సన్యాసులు దేవాలయానికి సంబంధించిన వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తుంటారు). ఈ దానధర్మాలలో ఒక ప్రత్యేకత ఉన్నది. సాధారణంగా దైవకైంకర్యార్థం భక్తజనులు తమ దానధర్మాలను నేరుగా దేవాలయానికి అందజేస్తారు. మరికొందరు కొంత ధనాన్ని లేదా స్థిరాస్థిని షరతులతో కూడి ఆధారద్రవ్యంగా దేవాలయానికి సమర్పిస్తారు. విశేష దానం మరొక విధంగా



ఉన్నది. దీని ప్రకారం ముందుగా దానకర్త తగినంత పెట్టుబడిపెట్టి, ఇప్పటికే సేద్యానికి అనువుగా ఉన్న సస్యక్షేత్రాలలో కర్షకునకు అవసరమైన నీటి పారుదల వంటి అదనపు సౌకర్యాలను ఇతోధిక కల్పనకునూ మరియు బీడుభూములు సాగులోనికి తీసుకురావడానికీ తగు ఏర్పాట్లునూ గావించి, తద్వారా లభించే అధిక వార్షిక ఆదాయాన్ని షరతులతో కూడిన ఆధార ద్రవ్యదానంగా దేవాలయానికి సమర్పించి తాను తలపెట్టిన సేవాకైంకర్యం నిర్విఘ్నంగా జరుపబడుటకు ఏర్పాటు గావించారు. ఈ పద్ధతి ప్రత్యేకంగా గమనార్హం. ఈ విధమైన పద్ధతివలన రెండు ప్రయోజనాలు సిద్ధిస్తున్నాయి. దివ్యక్షేత్రంలోని దైవానికి దానం చేయడం వలన కలిగే సుకృతం మొదటి ప్రయోజనం కాగా, ఈ విధమైన దానంవలన, శ్రమజీవులైన కర్షకులకు కావలసిన సదుపాయాలు ఏర్పడడంతోబాటు మరికొంత భూమి నూతనంగా సాగులోనికి తీసుకురావడం చేత లౌకిక ప్రయోజనం కూడ సిద్ధిస్తోంది. ఇది వీరికి వెంటనే సిద్ధించే తక్షణ ప్రయోజనం. దానకర్త ఒక భక్తుడు, తన ఆధ్యాత్మిక సుకృతంకోసం ఉద్దేశించి చేసిన ఈ కార్యం దైవానికి లేక దేవాలయానికి లేక దీనిపై ఆధారపడి ఉన్న బ్రాహ్మణులకు ప్రయోజనకరమవడమే కాకుండా, సంబంధించిన ఇతర వర్గాలవారికి కూడ

> **అది కొంచెంగానీ, గొప్పగానీ,**
> **బ్రహ్మ తన నొసట వ్రాసినంత ధనం**
> **ఎడారిలో ఉన్నా లభిస్తుంది.**
>
> **మేరు పర్వతానికిపోయినా**
> **అంతకంటే ఎక్కువ దొరకదు.**
> **అందువల్ల ధీరుడవై జీవించటం నేర్చుకో!**
>
> **ధనికుల వద్ద వ్యర్థంగా**
> **దీనత్వం ప్రకటించవద్దు.**
>
> **బావిలో ముంచినా, సముద్రంలో ముంచినా**
> **కుండ తనకు పట్టినంత నీటినే గ్రహిస్తుంది.**

ప్రయోజనమౌతోంది. ఇంతవరకు, ఈ దేవాలయంపై ప్రభుత్వం తన ఆధిపత్యం నెరపినట్లుగాని లేక బాధ్యత వహించి ఈ దేవాలయానికి, రాష్ట్ర ప్రభుత్వంచే దానాలు చేసినట్లుగాని తెలియరాలేదు. రాజకుటుంబీకులుగాని ప్రభుత్వ ఉన్నతాధికారులుగాని దానాలు చేసియుండిన సందర్భాలలో వారు వ్యక్తిగతంగా తమ అభ్యున్నతిని, సుకృతాన్ని ఆశించి దైవానుగ్రహం కోసం చేసియున్నారు. అందుచేతనే వారు ఈ దానాలను చేయడం కోసం రాజభండారాన్నుంచి కాక, తమ వ్యక్తిగత నిధులనుంచి సమకూర్చుకొనియుండిరి. అందుచేతనే నేరుగా రాష్ట్రఖజానా నుండి ఈ దేవాలయానికి ఎటువంటి సహాయం అందలేదని చెప్పవచ్చు. ఈ దేవాలయానికి చెందిన చరస్థిర ఆస్తులన్నీ భక్తులచే, ఈ దేవాలయ ప్రయోజనార్థమై వ్యక్తిగతంగా చేసిన దానాలుగా ఉన్నాయి.

### 3. విజయనగర సామ్రాజ్యపాలకులైన సంగమ వంశీయుల పాలనలో తిరుమల దేవాలయం :

సాళువ నరసింగ దేవమహారాయల కాలం తిరుమలదేవాలయ చరిత్రయందు ఒక నూతన అధ్యాయానికి నాంది పలికింది. క్రీ.శ. 1359 సంవత్సరంలో తిరుమల దేవాలయ శిఖరానికీ, విమానానికీ బంగారు మలాము చేయించిన సాళువ మంగిదేవ మహారాజుకు ఈ నరసింగదేవమహారాయలు మునిమనుమడు అవుతాడు. **సాళువ** అనే పదం **డేగ**కు పర్యాయ పదం. సాళువ నరసింహుడు విజయనగర సామ్రాజ్యస్థాపనకు తన శక్తియుక్తులతో పూర్తిసహకారాన్ని అందించాడు. సహజసిద్ధంగా లభించిన కార్యనిర్వహణాచాతుర్యం రాజకీయ దూరదృష్టిగల ఈ నరసింహుడు అసూయ పరతత్త్వం గల శత్రువులకు దూరంగా ఉంటూవచ్చాడు. తిరుమల దేవాలయంతో ఇతనికి గల సంబంధంచే ఈ దేవాలయంలో అనేక మార్పులు కలగడానికి కారణ భూతుడయ్యాడు. ఇతని అదృష్టంకొద్దీ, దైవభక్తిపరుడు, విచక్షణ జ్ఞానం కలవాడు, అనుభవజ్ఞుడు, దేవాలయ వ్యవహారాలలో సముచితమైన సలహాలివ్వగల కందాడై రామానుజయ్యంగారు సహచరుడుగా లభించాడు. సాళువ నర



సింహుని ప్రాపకంలో కందాడై రామానుజయ్యంగారు ఆలయ పూజాపునస్కారాల్లోను, పరిపాలనా వ్యవహారాల్లోనూ అనేక సంస్కరణలను ప్రవేశపెట్టగలిగాడు.

ప్రథమ విజయనగర సామ్రాజ్య పరిపాలకుడు, సంగమవంశీకుడైన బుక్కరాయలగురించి ఏ శాసనంలోను సూటిగా ప్రస్తావించలేదు. కాని శాసనం సంఖ్య 487, 237, 238-టి.టి. మూడుమాత్రం ఈ చక్రవర్తి కాలానికి సంబంధించినవి. ఇంతకుముందే ప్రస్తావించబడినదియు, తేదీలేనిదియూ అయిన శాసన సంఖ్య 487-టి.టి.లో ప్రతిదినం రెండు పర్యాయాలు సంధి కాలంలో స్వామి(వేంకటేశ్వరస్వామి)కి బుక్కరాయల పేరు మీద నైవేద్యాలు సమర్పించేందుకు ఒక గ్రామాన్ని దానం చేసినట్లు తెలుస్తోంది.అప్పటినుండి ఇది **బుక్కరాయ సంధి**గా పేరుపొందింది. అంతేకాదు, శాసనం సంఖ్య 237, 238-టి.టి. శాసనాలలో కూడ ఇటువంటి దానాల గురించి నమోదు చేయబడ్డాయి.

రెండవ హరిహరరాయ పేరును ఇతర ప్రాంతాలలో లభించిన కొన్నిశాసనాలు ప్రస్తావిస్తున్నాయి. ఈ చక్రవర్తి కనకసభ (చిదంబరం), కంచి, శ్రీశైలం, సోమశిల, అహోబలం, శ్రీరంగం, కుంభకోణం మొదలైన పుణ్యక్షేత్రాలలో దానధర్మాలను గావించినట్లు తెలుపుతున్నాయి. కాని, తిరుమల దేవాలయ శాసనాలకు సంబంధించినంతవరకు శాసన సంఖ్య 103-టి.టి. ఒక్కటి మాత్రమే ఉంది.ఈ శాసనం తెలుపుతున్న ప్రకారం రెండవ హరిహరరాయల పేరుమీద, ప్రతి సంవత్సరం మాఘమాసం శ్రీ వేంకటేశ్వరస్వామికి ఉత్సవం జరిపేందుకుగాను తగు ఏర్పాటు గావించబడింది. ఈ ఉత్సవ నిర్వహణార్థం పూంగోడుగ్రామ వార్షికాదాయం 100 పణాలను ప్రతి సంవత్సరం ఒక వైష్ణవమతాధిపతి ద్వారా సమకూర్చబడుటకు ఏర్పాటు చేసినట్లు విశదమౌతోంది. బహుశ ఈ కార్యనిర్వాహకుడైన మతాధిపతికే ఈ గ్రామం స్వాధీన పరచబడి ఉంటుంది. ఈ విధంగా రాజుగారి వ్యక్తిగత కార్యాన్ని చక్కబెట్టడానికి ఒక వైష్ణవమతాధిపతి పూనుకోవడం చూస్తుంటే **వైష్ణవమతం** ప్రథమ విజయనగర రాజవంశీయులను నిదానంగా ప్రభావితం చేసిందని చెప్పవచ్చు. తత్ఫలితంగా, ఈ దేవాలయంలో గత కొంతకాలంగా కొన్ని కారణాల వల్ల సుప్తచైతన్యంలో ఉన్న వేదపారాయణ కార్యక్రమం రెండవ దేవరాయల పరిపాలనాకాలంలో ముదలియార్ తిరుక్కలికన్ఱి దాసర్ అళగప్పిరానార్‌వారి కృషి ఫలితంగా పునరుద్ధరించబడింది. అంతేకాదు, కందాడై రామానుజయ్యంగారి సలహాసహకారాలతో సాళువనరసింహుడు అనేక గోపురాలను, మండపాలను నిర్మించడం, పూదోటలను పెంచడం, ఉత్సవాలను, సేవాకార్యక్రమాలను జరిపించడం - మొదలైన పలు కార్యక్రమాలను నిర్వహించడమే కాక అందులకు ఖర్చులకుగాను అనేక గ్రామాలను కూడ దానం చేశాడు.

మరో శాసనం సాళువనరసింహుని ఇద్దరు పరిపాలనాధికారుల గురించి తెలుపుతోంది.

రెండవ దేవరాయల గురించి తెలిపే శాసనాలు అరడజను దాకా ఉన్నాయి. వీటిని గురించిన ప్రస్తావన ఇంతకు ముందే వచ్చింది. శా.శ.1351, సౌమ్యనామ సంవత్సరం (క్రీ.శ.12-12-1429)వ తేదీనాడు ఈ రెండవదేవరాయలు మూడుగ్రామాలు, మరి 1200 పణాల ధనాన్ని, కొన్ని నిత్యనైవేద్యాల నిమిత్తమై (శాసనం సంఖ్య188-టి.టి.) సమర్పించాడు. కాగా ఇంతకు పూర్వం కొంతకాలంగా దేవాలయమందు వేదపారాయణ కార్యక్రమం నిలిచిపోయింది. ఈ విషయం గమనించిన ఒడైయార్ దేవణ్ణఉడయార్ సలహాను మన్నించిన మహారాజగు రెండవ దేవరాయలు శా.శ.1355 ప్రమాదీచ నామ సంవత్సరం అంటే క్రీ.శ.22-11-1433 నాడు సుమారు 200 పణాలు వార్షికాదాయం ఇచ్చే సిద్ధకుట్టై అనే మరో పేరు ఉన్న శ్రీనివాసపురం అను గ్రామ అర్ధభాగం శ్రీభాండారానికి చెంది ఉన్నందున రాజభాండారానికి చెందియున్నట్టిదియు అంతే ఆదాయాన్నిచ్చేది అయిన రెండవ అర్ధగ్రామాన్ని, దేవాలయమందు వేదపారాయణ కార్యక్రమం పునరుద్ధరించబడుటకుగాను



(శాసనం సంఖ్య 8,9 మరియు149-టి.టి.)24 మంది బ్రాహ్మణులకు దానం చేశాడు. ఈ సిద్ధకుట్టై గ్రామం వైకుంతవళనాడులోని ఒక అంతర్భాగమైన కొట్టాలస్థలంలో ఉన్నట్లు తెలుస్తోంది.

## తిరుమలలో
### చూడవలసిన ప్రదేశాలు

**స్వామి పుష్కరిణి :** ఈ కోనేరు తిరుమల గుడికి ప్రక్కనే ఉంది. భక్తులు గుడిలో ప్రవేశించే ముందుగా పవిత్ర మైన పుష్కరిణిలో స్నానం చేస్తారు. ఇందులో స్నానం చేస్తే శరీరంతో పాటు మనస్సు కూడా పరిశుద్ధ మవుతుంది.

**ఆకాశగంగ :** ఈ జలపాతం ఆలయానికి ఉత్తర దిశగా 5 కి.మీ. దూరంలో ఉంది.

**పాపవినాశనం :** ఈ తీర్థం గుడికి ఉత్తర దిశగా 5 కి.మీ.దూరంలో ఉంది.

**వైకుంఠతీర్థం :** ఈ తీర్థం గుడికి ఉత్తర దిశగా 5 కి.మీ.దూరంలో ఉంది.

**తుంబురుతీర్థం :** ఇది గుడికి ఉత్తరంగా 16 కి.మీ. దూరంలో ఉంది.

**శిలాతోరణం :** భౌగోళిక పరిణామంతో సహజ సిద్ధంగా ఏర్పడిన శిలాతోరణం, గుడికి ఉత్తరంగా ఒక కిలో మీటరు దూరంలో ఉంది.

**తి.తి.దే ఉద్యానవనాలు :** దేవస్థానంవారు తిరుమలకు శోభాయమానమైన ఉద్యానవనాలను పెంచుతున్నారు. ఇందులో అపురూపమైన మొక్కలు, వృక్షాలు అభివృద్ధి చెందుతున్నాయి.

**ఆస్థానమండపం :** (సదస్ హాలు) హిందూ ధర్మ ప్రచార పరిషత్తువారి ఆధ్వర్యంలో నిర్వహింపబడే ధార్మిక ఉపన్యాసాలకు, హరికథ, సంగీత భజన కార్యక్రమాలకు వేదికగా ఉపయోగపడుతున్న సభా మండపం.

ఇది ఏ కొట్టంలో(జిల్లా)నిదో తెలుపబడలేదు. కాని వైకుంతవళనాడు మరియు తిరుక్కుడవూర్ నాడులు రెండుకూడ చంద్రగిరి రాజ్యంలోని తిరువేంకట కొట్టం లోని భాగంగా ఉన్నట్లు తెలిసిన విషయమే!

ఈ రాజు కొలువులో దేవణ్ణఉడయార్ మరియు మల్లన్న అను ఇద్దరు అధికారులు ఉన్న విషయం, ఈ శాసనం వలన మనకు తెలుస్తోంది. ఇంకనూ, మహా మండలేశ్వర సాల్వ పెరిమల్లయదేవమహారాజు, సైన్యాధిపతియు మరియు రాజుగారి బంధువు అయిన తెప్పద నాగయ్య నాయకర్ అనునతడును మరియు శ్రీగిరీశ్వర (బహుశా ఇతడు రాజుగారి కనిష్ఠ సోదరుడై ఉండ వచ్చును.) అను ఈ ముగ్గురు వ్యక్తులను కూడ శాసనాలు మనకు పరిచయం చేస్తున్నాయి.

మల్లికార్జున రాయలకు సంబంధించి శా.శ. 1371 లేదా క్రీ.శ.1450వ సంవత్సరంలో ప్రకటించిన శాసనం ఒకటి మాత్రమే లభించింది. ఈ శాసనం ప్రకారం తిరుపతికి చెందిన ఇద్దరు శ్రీవైష్ణవులు తమకు చెందిన ఒక గృహాన్ని, కొంత నివేశనస్థలాన్ని చంద్రగిరి కాపురస్థుడైన నియోగిబ్రాహ్మణుడు రాజమాలికం చెన్నప్ప ఉడయారునకు విక్రయించారను విషయం విశద మౌతోంది. బహుశా ఈ రాజమాలికంచెన్నప్పఉడయారు రాజునకూ మరియు ఉన్నత వంశస్థులకు పండుగపబ్బాలకు కావలసిన పుష్పమాలికలను సమ కూర్చిపెట్టేటువంటి రాజకొలువులోని ఒక ఉద్యోగస్థుడై ఉంటాడు.

తిరుపతికి నైరుతిలో 11 కి.మీ. దూరంలో చంద్రగిరి ఉన్నది. అయినా శాసనంలో తెలిపిన ప్రకారం ఇవి రెండునూ తిరువేంగడకొట్టానికి చెందియున్న వేరువేరు ఉపజిల్లాలకు చెంది ఉన్నవి. తిరుపతి తిరుక్కుడవూరునాడులో ఉండగా, చంద్రగిరి వైకుంత వల నాడులోని అంతర్భాగం.

దుర్బలుడైన మల్లికార్జునరాయలకాలంనుండి, సంగమ వంశీయులు క్రమేపీ నిర్వీర్యులై శక్తిహీనులవడం

వలన సాళువ వంశమందలి ప్రముఖనాయకులు రాజ్యం యొక్క పరిపాలనా పగ్గాలను తమ అధీనంలోనికి తెచ్చు కొని శక్తిసంపన్నులై రాణించారు.

ఈ కాలంలో సుప్రసిద్ధులై గణుతికెక్కిన ముగ్గురు సాళువ ప్రముఖులలో సాళువ నరసింహుడు ఒకడు. మలగంగయదేవ మహారాజు కుమారుడైన సాళువ సిరుమల్లయ దేవమహారాజు శా.శ.1372వ సంవత్సరంలో శ్రీ వేంకటేశ్వరస్వామికి కొన్ని సమర్పణలు చేసేందుకు కొంతధనాన్ని దేవాలయానికి దానం (శా.స. 23-టి.టి.) చేశాడు. అలాగే రెండవ దేవరాయలను గురించి చెప్పుకొన్న సందర్భాన గుర్తించబడిన సాళువ మల్లయ్యదేవ మహారాజు (సాళువ ఎఱ్ఱ కంపయదేవ మహారాజుయొక్క కుమారుడు మరియు పెరిమల్లయదేవ మహారాజు సోదరుడు) శా.శ.1385వ సం॥లో ధాన్య రూపంలోను, ధనరూపంలోవచ్చే అన్నిరకాల పన్నులతో సహా చంద్రగిరిరాజ్యంలోని ఏలంబాక్కం గ్రామాన్ని దేవాలయానికి దానం చేశాడు. అంతేకాకుండా దేవదాన గ్రామాలలో రెండు పంటకాలువలను (శాసనం సంఖ్య 157-టి.టి.) తవ్వించాడు. సాళువ మల్లయ్య చేసిన ఈ దానం విధానం చూస్తే అప్పటికే ఇతడు విజయనగర సామ్రాజ్యాధిపత్యం నుండి విడివడి స్వతంత్రుడై చంద్ర గిరి రాజ్యానికి చాలమటుకు స్వతంత్ర పాలకుడుగా ఉన్నట్లు కనబడుతున్నది. ఇతడు తన శాసనాలలో విజయనగర చక్రవర్తిని గురించిన ప్రసక్తిని తీసుకుని రాకపోవుటకు కారణం ఇదియే అయి ఉంటుంది. ఈ మల్లయ్యదేవ మహారాజు కొడుకు సాళువ రామచంద్ర రాజు మరియొక సాళువ ప్రముఖుడు. ఇతడు కూడ ఇదే శా.శ.1385వ సం॥లో వేంకటేశ్వరునకు కొన్ని సమర్పణలు (శాసనం సంఖ్య 154- టి.టి.) గావిం చాడు. ఈ మల్లయ్యదేవుని మరి ఇద్దరు కుమారులు అటు తర్వాత వచ్చినవారు. వీరిలో సాళువ గోపయ్య శా.శ.1391వ సం॥లో (శాసన సంఖ్య155-టి.టి.)ను, రెండవవాడైన సాళువ తిమ్మరాయలు శా.శ1403వ సంవత్సరాన (శాసన సంఖ్య 196-టి.టి.) శాసనాలలో



కనిపిస్తారు. ఈ చిన్నవాడైన సాళువ ప్రముఖుడు శ్రీ వేంకటేశ్వరునకు మరియు శ్రీ వరాహ స్వామికి కొన్ని నిత్యనైవేద్య సమర్పణలు నివే దించేందుకుగాను దేవాలయానికి 7800 పణముల ధనాన్ని దానం చేసి తన ఔదార్యాన్ని చాటుకున్నాడు. ఈ ఆరుమంది సుప్రసిద్ధులైన సాళువ ప్రముఖులునూ ఒకే కుటుంబంలోని వారు అయిన తండ్రి, అతని ఇద్దరు కుమారులు మరియు అతని పౌత్రులు (మనుమలు) - వీరందరునూ కూడ **మహామండలేశ్వర మహారాజులు**. ఈ కుటుంబ బంధమే, వీరికి ఇంతటి శక్తిసామర్థ్యాలు అబ్బటానికి కారణం అవడమే కాకుండా సామ్రాజ్యానికి విపత్తును తెచ్చి పెట్టడానికి కూడ ఆధారభూతంగా ఉంది.

తిరుమల శాసనాల వల్ల తెలుస్తున్న మరొక సాళువ వంశీయులశాఖలోని పేర్కొనదగిన ప్రముఖ వ్యక్తులు- సాళువ నరసింహుడు, అతని జ్యేష్ఠసోదరుడు సాళువ తిమ్మరాజ ఉడయార్ (శా.శ.1385వ సం॥నకు చెందిన శాసనం సంఖ్య 69-టి.టి.) మరియు వీరి తండ్రి సాళువగుండరాజ ఉడయార్ (వీరినే మహారాజు గుండయదేవమహారాజు అని కూడ పిలుస్తారు). ఈ మూడవ గుండయదేవ మహారాజు కాగ మరొకరి పేరు తిప్పరాజు. సాళువరాజు కుమారుడు సాళువ పర్వతరాజు (శాసనం సంఖ్య 53-టి.టి.). తిప్పరాజు(రెండవ దేవ రాయల బావమరిది) యొక్క కుమారుడు గోప. ఈ గోప కుమారుడు త్రిపురాంతక. వీరేకాక, ఇంకనూ, ఇతర ప్రాంతాలలో లభించిన శాసనాలవలన తెలిసిన సాళువ ప్రముఖులు మరికొందరున్నారు. తిమ్మ లేక గోపతిమ్మ అనే మరొక పేరు ఉన్న తిరుమలదేవ మహారాజు అను నతడు బహుశా త్రిపురాంతకుని ఒక సోదరుడై ఉంటాడు (1923 మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు, పేరా 77). ఎక్కడో దక్షిణప్రాంతంలో పరిపాలకుడిగా ఉండిన సంగమదేవమహారాజు కూడ సాళువనరసింహుని తల్లి దండ్రుల తోడబుట్టిన సంతానమై ఉంటాడు (ఆర్కియాలాజి కల్ సర్వే రిపోర్టు 1908-09, పుట167).

*(ఇంకా ఉంది)*

# వేంకటేశుని జూడ వేగరారండి

రారండి రారండి జనులార రండి
వేంకటేశుని జూడ వేగరారండి

నల్లమోము వాడు నవకళలవాడు
తెల్లనామము వాడు చల్లనీవాడు
నవరత్నహారుడు మణిమకుటధారుడు
అభయహస్తముతోడ ఓదార్చువాడు

ఏడేడు లోకాలు ఏలేడి వాడు
ఏడుకొండలపైన కొలువైన వాడు
వేదాంత ప్రియుడతడు వేదనాహరుడు
వేదపురుషుడు అతడు వేదవేద్యుండు

కష్టాలు బాపేటి కరుణాత్ముడతడు
వడ్డీకాసులవాడు వరవేల్పువతడు
వేల్పులకు వేల్పువు వేంకటాద్రీశుడు
శ్రీదేవి భూదేవి ప్రియకాంతుడతడు

కలియుగ దేవుడు కలికి పురుషుండు
ఆపదలు కాచేటి బంధువే అతడు
భక్తజనులకు అతడు కంటిరెప్పెపుడు
శరణువేడిన చాలు విడువనే విడువడు

వకుళపుత్రుడు అతడు శ్రీనివాసుండు
గోవిందరాజులకు ప్రియ అనుజుడితడు
ఆకాశరాజుకూ అల్లుడే అతడు
పద్మావతీ ప్రియుడు పరమపావనుడు

నిరుపమానుండతడు నిత్య సత్వుండు
సౌందర్యకాంతుడు సత్యసంకల్పుండు
నారదుని ప్రియుడతడు నాగశయనుండు
లక్ష్మీనాథుండతడు నారాయణుండు

తులసిమాలాప్రియుడు భక్తిభావనుడు
తొండమానునికతడు ఇష్టదేవుండు
మర్మంబుగలవాడు మహితాత్ముడతడు
మంగనాథుండతడు వేంకటాచలుడు

కౌసల్యపుత్రుడు శ్రీరాముడతడు
రాక్షసాంతకుడతడు ధర్మరక్షకుడు

మానినీచోరుడు మన్మథాకారుడు
కృష్ణభగవానుడు దేవకీసుతుడు

బావాజి ప్రియుడతడు చదరంగ ప్రియుడు
భవుని మిత్రుండతడు భవ్యచరితుండు
సామలోలుడు అతడు సాధుజనశీలుడు
కార్యకారణుడు తలనీలాల ప్రియుడు

కమలలోచనుడతడు కమలాక్షి ప్రియుడు
పద్మనిలయుండతడు వజ్రకవచుండు
బంగారు గుడివాడు గరుడ వాహనుడు
నేలవేల్పుల వేదపారాయణుండు

పతితపావనుడతడు పరమేష్ఠి అతడు
ఆపదమ్రొక్కులవాడు అవని పురుషుండు
కల్యాణ కారకుడు కుసుమకోమలుడు
కమనీయ నాముడు నేత్రానంద కరుడు

రత్నహృదయుడు అతడు నిత్యకుశలుండు
ఆనందరూపుడు అమరేంద్ర ప్రియుడు
మోహనా శకుడతడు మోక్షపురుషుండు
తిరుమలేశుడు అతడు తిరుపతీ దేవుడు

కుమ్మరీనంబికి కడు ఇష్టుడతడు
మట్టిపూలాప్రియుడు మహనీయుడతడు
బ్రహ్మదేవునకతడు పితృదేవుండు
బ్రహ్మమే అతడు పరబ్రహ్మమే అతడు

ఓంకార ప్రియుడతడు ఓజస్వరూపుడు
గుండెగుడిలో అతడు ఆత్మతేజుండు
అన్నమాచార్యుడు కొలచినా దేవుడు
కామితార్థము లియ్య వేంచేసినాడు

భక్తి మ్రొక్కగ వేగ కదలిరారండి
భగవానుడి తడని శరణువేడండి
రారండి రారండి జనులార రండి
వేంకటేశుని జూడ వేగరారండి

- బొండారత్నావతీ నూకరాజు



# శ్రీనివాసుని బ్రహ్మోత్సవాల్లో దివ్యప్రబంధాలు

– డా॥పి.టి.జి.రంగరామానుజాచార్యులు

జన్మ జరామరణ సుఖదుఃఖాద్యనంత క్లేశపీడితులైన జీవకోటిని రక్షించుటకు తన అవ్యాజకృపతో దేశకాలాదులచే శ్రీమహాలక్ష్మితో సహా పరవ్యూహవిభవాంతర్యామ్యర్చా రూపాలతో అవతరించును శ్రీమన్నారాయణుడు. వీటిలో అత్యంత సులభమైనది సకల జనులకు అందుబాటులో ఉండునది అర్చావతారం. పిళ్ళ లోకాచార్యులు తాము రచించిన శ్రీవచనభూషణమనే దివ్యగ్రంథమందు ఈ పంచవిధావతారాల్లోను అర్చావతారమే సకలమానవకోటికినీ ఉపాదేయమని తెలియజేశాడు. ఈ భూలోకంలో అర్చావతార విశేషాల్లో స్వయం వ్యక్త క్షేత్రాలు కొన్ని గలవు. అందులో తిరుమల ఎంతో మహిమాన్వితమైనది. పరమపదనాథుడగు శ్రీమన్నారాయణుడు శ్రీవైకుంఠం నుండి ఈ తిరుమల గిరులపై పాదమిడినాడు కనుకనే ఈ తిరుమల క్షేత్రం పరమ పావనమైనదని విభిన్నపురాణాలు ఘోషించుచున్నవి.

ద్రావిడదేశమందు శ్రీ మహావిష్ణువు యొక్క ఆజ్ఞతో యధార్థమగు శ్రీవైష్ణవ తత్త్వము వ్యాపింపజేయుటకు అవతరించిన మహానుభావులు ఆళ్వారులు. తమిళ భాషలో ఆళ్వార్ అనగా అగాధమగు భగవత్తత్త్వమను సముద్రం లోతును అనుభవించిన వారు అని అర్థం.

**భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ**
**శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్ ॥**
**భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్**
**శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽ స్మి నిత్యమ్ ॥**

పొయ్‌గైఆళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమజిశై ఆళ్వార్, నమ్మాళ్వార్, కులశేఖరాళ్వార్, పెరియాళ్వార్, తొండరడిప్పొడిఆళ్వార్, తిపుప్పాణిఆళ్వార్, తిరుమంగైఆళ్వార్, నమ్మాళ్వార్లకు శిష్యులగు శ్రీమధుర కవులు, ఆండాళ్‌దేవిని కలిపి మొత్తం పన్నిద్దరుగా శ్రీవైష్ణవ జగతి కీర్తించుచున్నది. ఈ ఆళ్వార్లందరు భగవంతుని యొక్క ఆయుధాలు మరియు అలంకారాల యొక్క అంశావతార విశేషులే. ఆ యా కాలాలలో ద్రావిడ దేశాన వివిధవర్ణాలలో విభిన్న రీతులలో అవతరించి శ్రీమన్నారాయణుని స్వరూపరూపగుణ విభూత్యాదులను అత్యంత భక్తిగా రాగభరితముగ తమిళభాషలో నాలుగు వేలపాశురాలు గానం చేశారు. వాటినే నాలాయిర దివ్యప్రబంధాలు అని పిలుస్తున్నారు. వీరు భగవదనుగ్రహవిశేషంచేత సకలశాస్త్ర పారంగతులై నప్పటికినీ జనన స్థానభాషయగు ద్రవిడమందే వీరు కృషిజేశారు. ఆళ్వార్లు దివ్యానుభూతితో కీర్తించిన దివ్యదేశాల్లో అత్యంత ప్రసిద్ధి పొందిన క్షేత్రాలు ప్రధానంగ మూడు. మొదటిది కోయిల్ అని జగత్ప్రసిద్ధి గావించిన శ్రీరంగము. రెండవది తిరువేంగడమలైయని ప్రసిద్ధి పొందిన తిరుమల దివ్యక్షేత్రం మరియు మూడవది పెరియకోయిల్‌గా ప్రసిద్ధి గాంచిన కాంచీపురం. ఈ మూడు క్షేత్రాల్లో తలమానికమైన పుణ్యక్షేత్రం తిరుమల. ఇక్కడ సాక్షాత్కరించిన స్వామి సాక్షాత్తుగ శ్రీ వేంకటేశ్వరునిగా కీర్తింపబడేమూర్తి శ్రీమన్నారాయణుడే. ఈ స్వామికి తమిళంలో తిరువేంగడముడైయాన్, తిరుమాల్ అని పేర్లున్నాయి. వేదేతిహాసాలు, పురాణాలు శ్రీ పాంచరాత్రవైఖానసాగమాల్లో ఈ క్షేత్రప్రశస్తి, వర్ణింపబడినది. పన్నిద్దరాళ్వార్లలో పదుగురాళ్వార్లు శ్రీనివాసుని కీర్తించారు. ఇచ్చట నిత్యనైమిత్తికోత్సవాలు, శ్రీ వైఖానసాగమ ప్రకారం జరుగుతున్నాయి. అంతేకాకుండ ఈ క్షేత్రంలో భగవద్రామానుజాచార్యులవారు (క్రీ.శ. 1017–1137) శ్రీ వైష్ణవ సంప్రదాయాలను యథావిధిగ నిర్వర్తించేటట్లు నియమం చేశారు. శ్రీ వైష్ణవ సంప్రదాయంలో దివ్యప్రబంధాధ్యయనము ముఖ్యమైన అంశంగా ప్రాచీనకాలం నుండి పలు ప్రసిద్ధ శ్రీ వైష్ణవాలయాల్లో పరిగణింపబడుతున్నది. ముఖ్యంగా ఈ తిరుమల దివ్యక్షేత్రంలో నాలాయిర దివ్యప్రబంధాధ్యయనం



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

## తిరుమల యాత్రలో.... అన్నీ ఉచితమే..!

**తిరుమల యాత్రకు వచ్చే సామాన్య భక్తులకు దాదాపు అన్ని సౌకర్యాలు ఉచితంగా లభిస్తాయి. భక్తులు కాస్త సహనంతో వ్యవహరించి ఈ సౌకర్యాలు పొందవచ్చును.**

- ✦ తిరుపతి బస్టాండు, రైల్వేస్టేషన్ల నుంచి అలిపిరికి (కాలినడక దారి వద్దకు) భక్తులు వెళ్ళేందుకు ఉచితంగా దేవస్థానం బస్సులు ఉన్నాయి.
- ✦ అలిపిరినుండి యాత్రికుల సామానులను తిరుమలకు ఉచితంగా చేరవేస్తారు.
- ✦ తిరుమలలో బసచేసేందుకు ఉచిత సత్రాలు మరియు పిలిగ్రిమ్ అమెనిటీస్ కేంద్రాలు ఉన్నాయి.
- ✦ కల్యాణకట్టలో ఉచితంగా తలనీలాలు సమర్పించవచ్చు.
- ✦ స్నానానికి ఉచితంగా వేడినీళ్లు లభిస్తాయి.
- ✦ ఉచితంగా శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు.
- ✦ దర్శనానంతరం శ్రీవారి ప్రసాదాలను ఉచితంగా ఇస్తారు.
- ✦ శ్రీవారి నిత్యాన్నదానంలో ఉచితంగా భోజనం లభిస్తుంది.
- ✦ లాకర్ల సౌకర్యం ఉచితంగా లభిస్తుంది.
- ✦ ఉచితంగా పాదరక్షలు భద్రపరచుకోవచ్చు.

ఉదయం సుప్రభాతసేవ నుంచీ రాత్రి ఏకాంతసేవ పర్యంతం విభిన్న సమయాలలో నాలాయిరదివ్య ప్రబంధాధ్యయనాన్ని శ్రీ భాష్యకారులు ప్రవర్తింపజేశారు. ఆ సంప్రదాయం ఆసేతు హిమాచలం శ్రీ విష్ణు దేవాలయాల్లో ఈనాటికినీ చక్కగా శ్రీ భాష్యకారుల దివ్యాజ్ఞగా అమలు జరుగుతున్నాయి.

ఈ దివ్యప్రబంధాధ్యయనం వల్ల శ్రీవారి ఆలయంలో జరిగే ఉత్సవాలకు నిండుతనం సమకూరుతుంది. శ్రీరామానుజులకాలానికి ముందునుండే ఆళ్వారుల పాశురాల గానానికి స్పష్టమైన ఆధారాలు ఉన్నాయి. శ్రీరామానుజులవారు అలిపిరి కాలిబాటలో ఆళ్వారులను సేవించినట్లు ఆరాయిరప్పడి గురుపరంపరా ప్రభావం స్పష్టం చేయుచున్నది. అంతేగాక శ్రీరంగం నుండి విచ్చేసిన తిరువరంగప్పెరుమాళ్ అరయర్ (దివ్య ప్రబంధ పారాయణం చేయువారు) పెరియతిరుమల నంబియను అనంతాళ్వాన్ తిరుమలలో ఆళ్వారుల పాశురాల గానాన్ని కొనసాగించాల్సిందిగా కోరినట్లు తిరుమలై ఒళుగు అనే గ్రంథంలో ప్రస్తావించబడింది.

**శ్రీవారి ఆలయంలో దివ్యప్రబంధ పారాయణం :**

తిరుమలలోని శ్రీవారి ఆలయమందు ప్రాతఃకాలంలో గర్భగుడి తలుపులు తెరువగానే ముందుగ తొండరడిప్పొడియాళ్వార్ల తిరుప్పళ్ళియొజుచ్చి ప్రబంధం గానం ఏడాది పొడుగునా జరుగుతుంది. అయితే శ్రీమణవాళ మహామునులు ధనుర్మాసంలో మాత్రం తిరుప్పళ్ళియొజిచ్చి జరపాలని మిగిలిన సంవత్సరమంతా ప్రతివాదిభయంకర అణ్ణన్‌స్వామిచే చేయబడిన శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, స్తోత్రము, ప్రపత్తి, మంగళాశాసనాలు గానం చేయాల్సిందిగా నియమించిరి. అటుపై నిత్యతోమాలసేవయందు శ్రీనివాసుని సన్నిధిలో తొండరడిప్పొడియాళ్వార్ల తిరుప్పళ్ళియొజుచ్చి మరియు ఆండాళ్ తిరుప్పావై చేసి, నైవేద్యం తర్వాత తిరుప్పావై శాత్తుమురై నిర్వహిస్తారు. అట్లే సాయంకాల తోమాలసేవలో పెరియాళ్వార్ల తిరుప్పల్లాండు, పూచ్చుడల్, కాప్పిడల్, శెన్ని



యోంగు పాశురాలు, తిరుమంగై ఆళ్వార్ల తాయేతందై, వాడమరుదిడై, ఏళైఏతలన్, ఆండాళ్‌చే రచింపబడిన విణ్ణీలమేలాప్పు, నమ్మాళ్వారుల ఒళివిల్ కాలమెల్లామ్, ఉలగముండ పెరువాయా, కంగుం పగలుం, అళియోజ పాశురాలను, తిరుప్పాణ్ ఆళ్వార్ల అమలనాది పిరాన్, మధురకవి ఆళ్వార్ల కణ్ణినుణ్‌శిరుత్తాంబు మొదలగు 15 దశకాలు గానం చేయబడును.

ఇవేగాక ప్రధానమగు వార్షికతొమ్మిదిరోజుల బ్రహ్మోత్సవాల సందర్భంలోను, అంతకంటే ప్రధానమైన అధ్యయనోత్సవాల్లో ప్రబంధాధ్యయనమే సింహభాగాన్ని పోషిస్తున్నది. వీనిలో వార్షికబ్రహ్మోత్సవాల్లో ప్రతిరోజు ఉదయం, సాయంత్రం జరిగే శ్రీ స్వామివారి వాహన సేవల్లో అనుసంధింపబడే దివ్యప్రబంధక్రమాన్ని కింద పరిశీలిద్దాం.

**బ్రహ్మోత్సవాలు** : వివరాలు

| రోజు | సమయం | వాహనసేవ | అనుసంధింపబడే ప్రబంధం |
|---|---|---|---|
| మొదటిరోజు | సాయంత్రం | పెద్దశేషవాహనం | ముదల్ తిరువన్దాది |
| రెండవరోజు | ఉదయం | చిన్నశేషవాహనం | ఇరండాం తిరువన్దాది |
| రెండవరోజు | సాయంత్రం | హంసవాహనం | ఇరండాం తిరువన్దాది |
| మూడవరోజు | ఉదయం | సింహవాహనం | మూన్ఱాం తిరువన్దాది |
| మూడవరోజు | సాయంత్రం | ముత్యపుపందిరి | మూన్ఱాం తిరువన్దాది |
| నాల్గవరోజు | ఉదయం | కల్పవృక్షవాహనం | నాన్ముగం తిరువన్దాది |
| నాల్గవరోజు | సాయంత్రం | సర్వభూపాలవాహనం | నాన్ముగం తిరువన్దాది |
| ఐదవరోజు | ఉదయం | మోహినీఅవతారం | తిరువిరుత్తము |
| ఐదవరోజు | సాయంత్రం | గరుడవాహనం | తిరువిరుత్తము |
| ఆరవరోజు | ఉదయం | హనుమంత వాహనం | పెరియ తిరువన్దాది |
| ఆరవరోజు | సాయంత్రం | గజవాహనం | పెరియ తిరువన్దాది |
| ఏడవరోజు | ఉదయం | సూర్యప్రభవాహనం | పెరియ తిరుమొళి |
| ఏడవరోజు | సాయంత్రం | చంద్రప్రభవాహనం | పెరియ తిరుమొళి |
| ఎనిమిదవరోజు | ఉదయం | రథోత్సవం | పెరియ తిరుమొళి |
| ఎనిమిదవరోజు | సాయంత్రం | అశ్వవాహనం | నాచ్చియార్ తిరుమొళి |
| తొమ్మిదవరోజు | ఉదయం | పల్లకీసేవ | పెరుమాల్ తిరుమొళి |

అంతేగాక మొదటిరోజు నుండి ఆరవరోజు వరకు పైన తెల్పిన ప్రబంధాలను పఠిస్తూ పెరియాళ్వార్ అనుగ్రహించిన ప్రబంధ పారాయణం కూడ జరుపబడును. ఎనిమిదో రోజు ఉదయం రథోత్సవంలో రథసమీపమందు శాత్తుమురైని నిర్వహించి తిరుమంగైయాళ్వార్ల ప్రబంధాన్ని కూడ అధ్యయనం చేస్తారు.

అదేవిధంగా పెరియతిరుమడల్, శిఱియతిరుమడల్ ప్రబంధాలను కూడ గానం చేస్తారు. తొమ్మిదవరోజు చూర్ణాభిషేకసందర్భంలో తిరుమొళిశై యాళ్వార్ల యొక్క తిరుచ్చందవిరుత్తం, కణ్ణినుణ్ శిరుత్తాంబు పాశురాలను కూడ పఠించెదరు.



# సర్వార్తి శమనాయాస్తు శ్రీ వేంకటేశాయ మంగళం

- సి.పద్మావతి

**స**ర్వాంతర్యామి ఇందుగలడందు లేడన్నమాటే లేదు. నేను తి.తి.దే. కాలేజీలో లెక్చరరు, మావారు ఇంజనీరు. కల్యాణిడ్యాం కడుతున్న రోజులవి. మా బస్సు పెరుమాళ్ళపల్లికి సుమారు ఫర్లాంగు దూరంలో నిలబడి పోయింది. రోడ్డుకు అడ్డంగా ఒక మహావృక్షం వానలకు తడిసి మొదలుతోసహా కూలి పోయింది. మా బస్సు వెనకాల ఏడెనిమిది బస్సులు కూడా నిలచి పోయాయి. సాయంత్రం చీకటి కమ్ముకుంది. సన్నటి వర్షం. మా బస్సులోని వారంతా దిగి చెట్టు కొమ్మలు దాటి అవతలి వైపుకు పోతున్నారు. అవతలకు ఆర్టీసీ బస్సులు పంపుతున్నారు. బస్సు దిగమని హెచ్చరిస్తు న్నారు.




నాకు చిన్నపిల్లలు, చేతిలో బియ్యం వగైరా బ్యాగులున్నాయి. వాటిని దించి ఆ వైపు వెళ్ళడానికి సామానువల్ల కష్టమనిపించి దిగి చూచాను. ఆ వైపున రోడ్డుకిరువైపులా బార్లుతీరి ప్రయాణీకులు కూర్చొని ఉన్నారు. ఎవరైనా మనిషిని పిలుద్దామని చెట్టు దాటి ఆవలకు వెళ్ళాను. అక్కడ బస్సు వచ్చిందేతడవుగా ఒకే తోపులాట. నేను బిడ్డల్ని తీసుకుని ఎక్కగలనా? అని ఒక చెట్టుకింద బండ దగ్గర నిల్చుని ఉన్నాను.

తెల్లటి పంచా, షర్టు ధరించి చామనఛాయగా ఉన్న ఒకాయన వచ్చి "ఏమ్మా తిరుపతికి పోవాలా?" అని అడిగారు. అవును, మా పిల్లలు బస్సులో ఉన్నారని చెప్పాను. ఉండండమ్మా బండితీసుకుని వస్తాను. ఈ బస్సు ఎక్కలేరు అని చెప్పి వెళ్ళిపోయి 15 నిముషాల్లో సవారి బండిని తీసుకుని వచ్చి నా పిల్లల్ని, సామానుల్ని దింపించి చెట్టు దాటించి బండి ఎక్కమన్నాడు. నాకు లోపల భయంగా ఉంది. బండి తోలుతున్నది ఒక ముస లాయన. గణగణ గంటలతో బండిపోతుండగా దారి వెంబడి కూర్చున్నవారు నిలపమన్నా నిలపక ఇది పెద్ద ఆఫీసర్లను ఎక్కించుకునే బండి ఎవర్ని ఎక్కించుకోము అని చెప్పి వేగం హెచ్చించారు.

మా ఇల్లు చేరే ముందు వచ్చే దారిలో ఆర్ట్స్ కాలేజి ముందున్న మెయిన్ రోడ్డులో ఎక్స్ప్రెస్ అనే హోటలుండేది. ఆయన అక్కడ గబగబా దిగి ఏదో పాకెట్ తెచ్చి బండిలో ఉన్న నాకు ఇచ్చి "ఇందులో ఇడ్లీలు ఉన్నాయి. మీరు ఇప్పుడేం వండుకుంటారు. పిల్లలకు కూడా పెట్టండి" అని అన్నారు. నేను వండుకుంటాను అని వారిం చినా వినలేదు.

రాత్రి పదిగంటలకు ఎద్దుల బండి పాత మెటర్నిటీ హాస్పిటల్ దాటి నేరుగా భవానీనగరులో ఉన్న మా ఇంటి ముందు నిలబడింది. చుట్టుపక్కలవారు ఇదేమి బండి అని వచ్చి చూచి విషయం తెలుసుకున్నారు. నేను ఆయనకు డబ్బు ఇవ్వబోతే నిరాకరించాడు. కానీ, అతను చేసిన సహాయం మామూలు సహాయం కాదు. దిక్కు తోచని స్థితిలో తానే దిక్కై మమ్మల్ని దరికి చేర్చిన స్థితి. అందువల్ల ఎలాగైనా అతణ్ణి మళ్లీ కలవాలని, అతనికి మనసారా కృతజ్ఞతలు చెప్పుకోవాలని విచా రించాను. అలా విచారించగా బండి ఎద్దులు అగ్రి కల్చరల్ కాలేజి వాళ్ళవని చెప్పారు. మా అల్లుడు ఆ కాలేజీ ప్రొఫెసరు గనుక ఆ బండి గురించి విచారించగా ఆ బండి తోలే ముసలాయన ఇక్కడివాడే, కానీ అతను చనిపోయాడు. బండి చక్రాలు పెద్దవి అలాగే ఉన్నాయని చెప్పాడు. అలా నన్ను నా బిడ్డలను ఆ రోజు కాపాడింది ఎవరో కాదు ఆ శ్రీహరియే. ఇది ఆ చక్రాలసాక్షిగా ఆపద్బాంధవుడైన శ్రీనివాసుని కృపావిశేషమని తరచూ తలచుకుని స్వామికి భక్తిపూర్వక కృతజ్ఞతలు అర్పించు కుంటుంటాను.



# భక్తిన్ ప్రసాదింపవే!

పిలిచిన వెంటనే పలుకు
వేలుపు, భక్తి భజించువారి కో
ర్కులు నెరవేర్చు దైవతము
కొండలరాయుడు దక్క అన్యులీ
కలియుగమందు లేరనుచు
గాఢముగా మదినమ్మి నిత్యమున్
కొలిచెడి వారలన్ ప్రభువు
కూరిమితో కడతేర్చ కుండునే ?

తనవేషంబు ధరించినట్టి నటు
నాంధ్ర క్ష్మాస్థలీ ముఖ్యమం
త్రినిజేసెన్; నిజనామ ధారులను
సల్పెన్ పెక్కురన్ భారతీ
స్తనయుగ్మ ప్రతిమాన రమ్య కవితా
సంగీత సామ్రాజ్య భూ
షణులన్ ; సప్త ధరాధరేశ్వరుని
వాత్సల్యంబు సామాన్యమే ?

నీ సేవాపరులైన వారలకు
నెంతే ప్రీతి నీ విచ్చు నా
యా సంపద్విభవమ్ములన్ పొగడ
శక్యంబౌనె ? నీ మీది వి

శ్వాసంబేకద జంతు సంతతికి
నాశ్వాసంబు చేకూర్చు; ల
క్ష్మీ సేవాస్పద తావకీన పద
రాజీవమ్ము లర్చించెదన్.

కూటికి గుడ్డకున్ కొదువ గూరగ
చెల్లని కాసు నన్ను నీ
గూటికి జేర్చి ని న్గొలుచు
కోవిద కుంజర కోటి మధ్యలో
పీటనువేసి నీవు తిను బెల్లపు
పొంగలి పెట్టి మంచి; తీ
గాటపు ప్రేమ వేరొకట
గాంతునె యెన్ని భవాలకేనియున్ ?

శ్రీవైకుంఠము వేంకటాచలము;
లక్ష్మీజాని వెంకప్పగా
ఆవిర్భూతుఁడు; భుక్తిముక్తు లిడు
దివ్యక్షేత్రమౌ తిర్మలన్
భావింపందగు తిర్థతిన్ విడిచిపో
స్వాంతంబు క్షోభింపదే?
దేవా ! శేషగిరీశ ! నీదు
పదభక్తిన్ సంప్రసాదింపవే !

– ముదివర్తి కొండమాచార్యులు



ఈ కూపను కత్తిరించండి

# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
______________________
______________________
______________________
______________________
(పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో
కొందరు వ్యక్తులు అనధికారికంగా
**సప్తగిరి మాసపత్రికకు**
చందాల రూపంలో
అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని,
తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని,
నమ్మిస్తున్నారని తెలుస్తున్నది.
అలాంటి వారి మాటలకు మోసపోకండి.
సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి
ప్రసాదాలకు సంబంధం లేదు.
చందా మీరు నేరుగా
"ప్రధాన సంపాదకుడు, సప్తగిరి,
తి.తి.దేవస్థానం, తిరుపతి"
వారికి పంపించాలి. (లేదా)
తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల
వసతి సముదాయంలో
కూడా చందా కట్టవచ్చు.
సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు
దేవస్థానం బయటి వ్యక్తులను
ఎవరినీ నియమించలేదు.
**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితంలోగాని పైన పేర్కొన్న విధంగా వివరాలు రాసి పంపచ్చు. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరాలు రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.

☛ **మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083".**

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **M. Kartik,** M.A., L.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.